

हिरण्मयेन पात्रेण सत्यस्यापिहितं मुखम् ।
तत् त्वं पूषन्नपावृणु सत्यधर्माय दृष्टये ॥

Under a golden brilliance the face of Ttuth lies hidden. Do Thou, O protector, withdraw this cover, that I, devoted to Truth alone, may realise it.

# ĀRĀDHANA

आनन्दरूपं
अमृतं
यद्विभाति

ol. I FEBRUARY, 1955 No. 1

समानो मन्त्रस्समितिस्समानी ।
समानं मनस्सह चित्तमेषाम् ॥

*Rig Veda.* X. 191-3.

*Common be your prayer,*
*Common be your end;*
*Common be your purpose,*
*Common be your deliberation.*

समानी व आकूतिस्समाना हृदयानि वः ।
समानमस्तु वो मनो यथा वस्सुसहासति ॥

*Rig Veda* X. 191-4

*Common be your desires;*
*Unified be your hearts,*
*United be your intentions;*
*Perfect be the union amongst you.*

सर्गस्थितिप्रलयहेतुमचिन्त्यशक्तिं
विश्वेश्वरं विदितविश्वमनन्तमूर्तिम् ।
निर्मुक्तबन्धनमपारसुखाम्बुराशिं
श्रीवल्लभं विमलबोधघनं नमामि ॥

I bow down to that Pure Consciousness, an ocean of Uulimited happiness, which is Vishnu, the beloved of Sri, the all-knowing Lord of the Universe, assuming manifold forms yet bereft of all bondage, possessing an inscrutable power and (hence) the Cause of the Creation, Maintanance, and Dissolution of the Universe.

# ĀRĀDHANA

*Anent* THE TEMPLES
FOR THE TEMPLES
BY THE TEMPLES
*in Andhra State*

(A RELEGIOUS MONTHLY MAGAZINE)

## INAUGURAL NUMBER

*( on the eve of Maha - Sivaratri )*

*" Go deep inside the temple and you will find me there"*—MOTHER




EDITORIAL OFFICE:

V. VENKATAKRISHNAYYA, B.A., B.L.,
Editor

P. PERAYYA SASTRI, P.O.L.,
Sub-Editor

MASULIPATAM

PUBLICATION OFFICE:

" ĀRĀDHANA "

OFFICE OF THE DEPUTY COMMISSIONER
*Hindu Religious & Charitable Endowments (Administrative) Department (Andhra)*
MASULIPATAM

ANNUAL SUBSCRIPTION (inland) Rs. 12/-
PER SINGLE COPY Re. 1/-
ANNUAL SUBSCRIPTION (Foreign) 24 Sh.

# ఆరాధన

జయ — మాసపత్రిక — మాఘము


విషయసూచిక — పుట.



# ĀRĀDHANA


**A MONTHLY RELEGIOUS MAGAZINE, FEBRUARY 1955**


## CONTENTS

"ఆనందరూపమమృతం యద్విభాతి"

# ఆరాధన

సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే ।
అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్వ్రతం మమ ॥

సంపుటము ౧ జయ - మాఘము సంచిక ౧

## గణపతి మంత్రము

ఓం గణానాం త్వా గణపతిగ్ం హవామహే
కవిం కవీనాం ఉపమశ్రవస్తమమ్ ।
జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పతే
ఆ నశ్శృణ్వన్నూతిభిస్సీద సాదనమ్ ॥

—కృష్ణయజుర్వేద సంహిత, ౨ వ కాండ,
౩ వ ప్రపాఠకము, ౧౪ వ అనువాకము.

ఈ మంత్రమునకు గృత్సమదుడు ఋషి; జగతీ ఛందస్సు. "బ్రాహ్మణస్పత్యమేకాదశ కపాలం నిర్వపేద్గ్రామకామః" అను బ్రాహ్మణవాక్యముచే గ్రామకామునకు విహితమగు బ్రాహ్మణస్పత్యేష్టి యందు 'పురోనువాక్య'గా నీ మంత్రమునకు వినియోగము చెప్పబడినది.

అర్థము :—సకలమంత్రములకును పతియగు ఓ దేవా! సకలదేవగణములకు స్వామియగు నిన్ను మేమిచటకు ఆహ్వానించుచుంటిమి. నీవు విద్వాంసులందరిలోనుత్తమవిద్వాంసుడవు. ఉపమానభూతమగు కీర్తికలవాడవు. రాజులందరిలో జ్యేష్ఠుడవు. అట్టి నిన్ను మేము ఆహ్వానించుచుంటిమి. యథోక్తగుణసంపన్నుడవైన నీవు మాయొక్క రక్షణతోకూడిన వాడవగుచు మాచే చేయబడు నీకర్మయందు సుఖాసీనుడవై మమ్ములను రక్షింపుము.

"మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతాని శాస్త్రాణి ప్రథంతే" అను వాక్యముచే మాయుద్యమము సఫలమగుటకును మంగళాదిగా నారంభింపబడుటకును, సర్వకార్యములు నిర్విఘ్నముగ సమాప్తి నొందుటకు కారణభూతుడగు గణపతిని మాయుద్యమము నిర్విఘ్నముగ కొనసాగుటకై ప్రార్థించుచున్నారము.

సర్వకార్యములయొక్క ప్రారంభములో గణపతినారాధించుట ప్రాచీనకాలమునుండియు భారతీయులగు వైదికమతావలంబులకే గాక, బౌద్ధులకును, జైనులకునుగూడ సంప్రదాయము.

---

## ముఖచిత్రము

ఆంధ్రదేశమునందలి దేవాలయము లధికముగా తూర్పు చాళుక్యులనాటి శిల్పవిశేషమును సూచించునట్టివి; కావున తద్ద్యోతకమగు స్తంభములు, పైన దేవాలయవిమానము పొందుపరపబడి యున్నది. పైభాగమున శంఖ చక్రములు వైష్ణవ చిహ్నములేగాక, శంఖము నాదస్వరూపమగుటచే జ్ఞానమును సృష్టిని ప్రబోధించుచున్నది. జ్యోతిర్మయమగు చక్రము కాలమును సూచించుచున్నది. తదుభయ మధ్యగతమై విమానమునందు విలసితమగు హంస సర్వశుక్లమయియై శుద్ధసత్త్వగుణాశ్రయమగు స్థితిని సూచించును. రెండు స్తంభములయందు రెండు లింగములును, క్రిందనొక లింగమును, అధోముఖమగు ముక్కోణము. ఈయాకృతియే మన త్రిలింగదేశచిహ్నము.

గణపతి నృత్యము :—ప్రణవ స్వరూపము, మంత్ర సిద్ధి మాయుద్యమజయోన్ముఖతకు ప్రసన్నతయు ద్యోతకములగు చున్నవి.

# స్వవిషయము

భారతదేశమునందలి రాష్ట్రములలో సర్వథా స్వనామమును, స్వభాష నామమును, స్వీయసంస్కృతిని, భగవదంకితము చేసికొన్నది మనమే. మన జాతిపేరు తెలుగు జాతి. మనభాష తెలుగు. మనదేశము త్రిలింగదేశము.

మన దేశము ముక్కోణాకారముగనున్నది. దేవీయంత్రములలో నీయాకృతి ప్రథమము. మూడు కోణములందును మూడు ప్రసిద్ధలింగములున్నవి. మొదటిది పశ్చిమమున శ్రీశైలలింగము, రెండవది ఉత్తరమున దక్షారామలింగము, మూడవది దక్షిణమున శ్రీ కాళహస్తీశ్వరలింగము, అని ప్రతీతి. ఈ కారణముననే మనదేశమునకు త్రిలింగ దేశమనియు, మనభాషకు తెలుగనియు, మన జాతికి తెలుగుజాతి యనియు పేరు వచ్చియుండును.

మతవిషయమున మనకెంత యావేశమున్నను తెలుగువారు సామరస్యసరసత నెఱింగినవారు. శాతవాహనుల కాలమున సనాతనవైదికధర్మమును బౌద్ధధర్మమును కూడ సమరసతతోచూచిరి. వీరశైవము, వీరవైష్ణవము మనదేశమున గొంతకాలము విజృంభించినను కడకు మధ్యస్థమార్గమునే తెలుగువారవలంబించిరి.

ఏదొయొక నూతనధర్మమునందైనను విజృంభణము తెగులువానిదే! బౌద్ధధర్మము, అనంతరమున పండిత త్రయమువారి వీరశైవము, తదుపరి పలనాటి బ్రహ్మనాయని వీరవైష్ణవము, ఇటీవల బ్రాహ్మధర్మము, నవీనములగు కుసుమహరనాథ సాయిబాబాల యారాధనము-అన్నిటియందును ముందంజ తెలుగువారిదే.

కాని మనకున్న యావేశమునకు తగిన యభినివేశము కొఱతయేమో ?

మన భారతీయసంప్రదాయముననుసరించి ఉపాసనకు సాధనములు మూడు. ఒకటి దేవత; రెండవది దేవతోపాసనకు వలయు వస్తువు; మూడవది దేవతాహ్వానమునకు విహితమగు మంత్రము. ఈ విధముననే వైదికమార్గమున దేవాలయోద్ధరణమునకును వలయు సాధనములు మూడు. మొదటిది దైవభక్తి యుతులగు ధర్మశీలురు. రెండవది దేవాలయములను గురించిన శాస్త్రవిధులందు పరిచయముగల ధర్మకర్తలు. ఇంక, శాస్త్రవిహిత పద్ధతి కనుగుణమున శ్రద్ధాభక్తులతోడను, పరిశుద్ధితోడను, పూజావిధుల నెరవేర్చుచు దేవాలయమందరినాకర్షింప సమకూర్చెడు అర్చకాది పరిచారకబృందము, పైవిషయములయం దీక్షణ్మాత్రమైనను ప్రవేశము కలిగి ప్రభుత్వము తరపున నియుక్తులై దేవాలయ విషయములను శ్రద్ధతో పర్యవేక్షణచేయు పాలకవర్గమును, మూడవ సాధనము. ప్రస్తుతకాలమున శ్రద్ధాభక్తులున్నను దేవాలయాగమాదివిషయపరిజ్ఞానము పైవారియందసంపూర్ణముగా కానవచ్చును. కావున నీవిషయములనన్నిటి నాలోచించి దేవాలయములకు సంబంధించిన సకల విషయ పరిజ్ఞానమునకును, క్రింది ఆశయముల సంసిద్ధికని ఈ

## "ఆరాధన"

పత్రిక వెలువడుచున్నది. ఈ పత్రికాశయములు :

1. ఆంధ్రదేశమునందలి పుణ్యక్షేత్రములు, వాటి యొక్క మహత్త్వము, చారిత్రిక ప్రశస్తి, ఆలయశిల్పకళా విన్యాస విశేషములు, మున్నగువానిని ప్రచురించుట.

2. ఆగమోక్తమగు పద్ధతిని పూజావిధానమును వ్యాప్తి జేయుట.

3. హిందూ మత ధర్మాదాయ పరిపాలనా శాఖాధికృతుల నిత్యకార్యనిర్వహణమును, ఇందుకు సంబంధించిన శాసనముల నిబంధనలను, ప్రజలకెఱుకపరచి ధర్మకర్తలు మొదలగువారిని సమర్థులగు ధర్మపరిపాలకులుగ చేయుటయును, దేశమునందంతటను ముఖ్యముగ ఆంధ్రదేశమునయున్న మతసంస్థలను గూర్చి యావశ్యకమగు పరిజ్ఞానమును వీలగునంతవరకు జనుల కందజేయుట.

4. మతవిషయక ప్రచారసాధనముగ నుండుట.

5. అర్చకులు, అధ్యాపకులు, వేదపారాయణ ప్రవక్తలు, మొదలగువారిని వారివారి విధుల నిర్వహణకు తగినట్లు శిక్షణము గరపుట.

ఈ పత్రికయందు సామాన్యముగ దేవాలయములకు సంబంధించు నీక్రింది విషయవిభాగమున వ్యాసములు ప్రచురింపబడును.

1. క్షేత్ర విషయములు.
2. శిల్ప విషయములు.
3. చారిత్రిక విషయములు.
4. ఆగమ విషయములు.
5. దేవాలయములకు సంబంధించిన లౌకిక విషయములు.
6. దార్శనిక విషయములు.
7. సంగీతాది కళా విషయములు.
8. భాగవతోత్తముల విషయములు.

ఇట్టి "ఆరాధన" పత్రికను ప్రాజ్ఞులగువారు సర్వ విధముల యథాశక్తి నారాధించి యీ యుద్యమమును సఫలముగ జేయ ప్రార్థితులు.

# ఆశీస్సులు

శ్రీ జగద్గురు శ్రీ శృంగేరీ శారదాపీఠ
స్వామి పాదానామాశీర్వాక్యాని

ఆరాధన పత్రికా సంపాదక
శ్రీ వేంకటకృష్ణార్యేషు
సాదరావిజ్ఞప్తిః

౧౧-౮-౫౪ తమదివసే విలిఖితం భవతాం విజ్ఞాపనం యథావసరం శ్రీ జగద్గురు స్వామిపాదానాం సంనిధావుపాహరమ్, "కలిమల మలిమసం స్వాంతం న పరిశుధ్యతి భక్తిమంతరేణే" తి ఆబాలగోపం భక్తిపథమవతారయితుం చిరంతనైః మహతా పరిశ్రమేణ దేవతాయతనాని నిరమాయిషత, తేషాం సంరిరక్షయా విశాలాని శాలిక్షేత్రాణి ఆరామాదీని చ ఉపాదీయంత, నిరదిశ్యంత సేవన సరణయః ఉత్సవరీతయశ్చ। సాంప్రతికాః కేచన ఐహికం సుఖమేవ పరమం పుమర్థం మన్వానాః తాన్యన్యథాయితుం కృతప్రయతనా ఇతి మహత్ ఖేదస్థానమ్। ఆంధ్రజనపదీయ- దేవాలయ-ధర్మ ప్రద్రష్టారః సమేత్య మిళిత్వా ఇదం పర్యంతప్రవృత్త - దేవాలయీయ - పూజోత్సవాదిధర్మం యథాపురం పరిపాలయితుం ఆగమప్రతిపాదితో పాసనా-ప్రణాలిక-పరిచయాయ చ "ఆరాధన" నామ్నీం కామపి మాసిక-పత్రికాం ప్రకాశయిష్యంతీతి భవత్పత్రతో విజ్ఞాయ అపిరమ్యాత్తప్రమోదాః శ్రీ జగద్గురు స్వామిపాదాః భవదుద్యమోఽయం శ్రీ శారదాయా అమందయా దయయా భవతాం సదభిప్సితం ఫలత్వితి ఆశాసతే ॥

ఇతి నివేదయితా

నరసింహయ్యా

శ్రీ జగద్గురు శ్రీ శృంగేరీ శారదా పీఠాధిపతి
స్వాములవారి
ఆశీస్సు •

౧౧-౮-౫౪ తేదీన వ్రాయబడిన మీ విజ్ఞాపనమును శ్రీ జగద్గురు స్వామి పాదముల సన్నిధియందు సరియగు సమయమున సమర్పించితిని. కలికాలమాలిన్యముచే మలినమగు మనస్సు భక్తిలేనిదే పరిశుద్ధినొందదని యుద్దేశించి ఆబాలగోపాలమగు జనులను భక్తిమార్గమున ప్రవర్తింపచేయుటకై ప్రాచీనులచే గొప్ప పరిశ్రమచేతను దేవాలయములు నిర్మింపబడినవి. వాటి రక్షణకై విశాలములగు సుక్షేత్రములగు భూములు తోటలు కూడ కల్పింపబడినవి. దేవుని సేవించెడుపద్ధతులు, ఉత్సవరీతులుకూడ నిర్దేశింపబడినవి. ఆధునాతనులగు కొంతమంది ఐహికసుఖమును మాత్రమే పరమపురుషార్థమునుగా తలంచుచున్నవారై ఆ దేవాలయములను, వాటికొరకు నిర్ణయింపబడిన క్షేత్రాములను మరియొక విధముగా మార్చుటకు ప్రయత్నించుచుండుట మిక్కిలి విచారింపతగిన విషయము. ఆంధ్రరాష్ట్రమునందలి దేవాలయ ధర్మములను పర్యవేక్షణ చేయునధికారులందరును కలసి ఇంతవరకును జరిగిన దేవాలములకు సంబంధించిన పూజలు, ఉత్సవములు మొదలగు కార్యములను పూర్వమువలెనే జరిపించుచు దేవాలయ ధర్మమును రక్షించుటకును ఆగమములందు నిరూపింపబడిన దేవతోపాసన, ప్రణాళికలను సర్వజన సుగమముగ వ్యక్తపరచుటకును "ఆరాధన" యను నొక మాసపత్రికను ప్రకటించెదరని మీ లేఖవలన తెలిసికొని శ్రీ జగద్గురుస్వామి చరణులు మిక్కిలి యానందించినవారై మీ యీ యుద్యమము శ్రీ శారద యొక్క అపారమగు కరుణచే మీయొక్క యభీప్సితమును ఫలింపచేయుగాక యని యాశించుచున్నారు.

ఇట్లు నివేదించు

నరసింహయ్యా

---

ఓం ద్యౌః శాంతిరంతరిక్షగ్ం శాంతిః పృథివీ శాంతిరాపః శాంతిః
ఓషధయః శాంతిర్వనస్పతయః శాంతిర్విశ్వేదేవాః శాంతిః
బ్రహ్మ శాంతిః సర్వగ్ం శాంతిః శాంతిరేవ శాంతిః ॥

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

శ్రీ శృంగేరీ విరూపాక్ష శ్రీ పీఠాధిపతీనాం
శ్రీ జగద్గురు శ్రీ కళ్యాణానంద భారతీ
మాంతాచార్య స్వామినాం

**ఆశిషః**

విదుషాం చర్చాభిః దైవమానుష సంబంధాన్ కృత్స్నం ప్రకట యన్తీసదుపాసనాసంజాతయా తత్త్వదృష్ట్యాముముక్షూణాం నిజరూపం అనుగృహ్ణన్తీ భక్తేభ్యః సమగ్రాణి వరివస్యావిధానాని ప్రసాదయన్తీ విరాజమానా ఏషా "ఆరాధన" పత్రికా

శ్రౌతస్మార్త సత్సంప్రదాయ గతానాం అంతర్వాణివతంసానాం వ్యాసరాజైః సాంఖ్యయోగభేదభిన్నాం వైదికధర్మనిష్ఠాం భారతె సర్వత్రాపి ప్రవర్తయన్తీ విశ్వానపి భారతీయాన్ ధర్మతత్ప రాన్విధాయ భారతస్యాస్య అనుపమాం సేవాం కర్తుం స్థిరాం సత్ప్రతిష్ఠా మాప్నోతు ; ఇతి వయం సుదృఢమాశాస్మహే.

ఇతి నారాయణస్మృతిః
(సం) జగద్గురు శ్రీ కల్యాణానంద భారతీ
మాంతాచార్యస్వామీ.

విద్వాంసుల చర్చల ద్వారా దైవమానుష సంబంధములను సమగ్రముగఁ బ్రకటించుచు యోగ్యమగు నుపాసనచేఁ గలిగిన తత్త్వదృష్టితో ముముక్షుజనులకు స్వస్వరూపము ననుగ్రహించుచు భక్తులకు సంపూర్ణమగు నర్చనా విధానమును వెల్లడించుచు వెలుఁగొందునీ

"ఆరాధన" పత్రిక

శ్రౌతస్మార్త సత్సంప్రదాయములను బాగుగా నెఱిఁగిన విద్వదవతంసుల వ్యాసరాజములచే సాంఖ్యయోగభేద భిన్నమగు నుభయవిధవైదికనిష్ఠను భారతదేశమున నెల్లెడల వ్యాపింపఁజేయుచు సకల భారతీయులను ధర్మ తత్పరులుగఁజేసి ఈ భారతావనికి సాటిలేని సేప చేయుటకై శాశ్వతమగు సత్ప్రతిష్ఠను బొందుఁగాక ; యని మేము సుదృఢముగాఁగోరుచున్నాము.

ఇతి నారాయణస్మృతిః
(సం) జగద్గురు శ్రీ కల్యాణానంద భారతీ
మాంతాచార్యస్వామి.

---

శ్రీ కాంచీ కామకోటి పీఠాధిప
శ్రీ జగద్గురు శ్రీ మచ్చంద్ర శేఖరేంద్ర
సరస్వతీస్వామిపాదానాం

**ఆశిషః**

శ్రీః॥

శ్రీ మత్పరమహంస పరివ్రాజకాచార్యవర్య శ్రీ మచ్ఛంకర భగవత్పాదప్రతిష్ఠిత శ్రీ కాంచీ కామకోటీపీఠాధిపజగద్గురు
శ్రీ మచ్చంద్రశేఖరేంద్ర సరస్వతీ శ్రీపాదైః
క్రియతే నారాయణస్మృతిః,

అద్యత్వే జనానాంమనసి తత్తద్దేవతాసు భక్త్యతిశయం సన్మార్గ ప్రవృత్తించాభివర్ధయితుం దేవాలయేషు ఆరాధకానాం పరిపాలకానాంచ శ్రద్ధాతిశయమాపాదయితుంచ 'ఆరాధన' నామ్నీ పత్రికా ఆరభ్యత ఇతి విజ్ఞాయామందమానందం భజామః. మహాశివరాత్రి పర్వణి ప్రథమ ప్రకాశమేష్యంతీయం పత్రికా సర్వతోఽపి విజయతామిత్యాశాస్మహె ॥

విజయయాత్రాస్థానమ్ నారాయణస్మృతిః
శ్రీ కాంచీ క్షేత్రమ్.

శ్రీ జగద్గురు
శ్రీమచ్చంద్రశేఖరేంద్ర
సరస్వతీ శ్రీపాదులచే
నారయణస్మరణము చేయబడి యాశించునది

ఈ కాలమున జనులమనంబున వారివారి దేవతల యెడల మిక్కిలి భక్తిని సన్మార్గ ప్రవృత్తిని అభివృద్ధి పరచుటకును దేవాలయములందలి యారాధకులకును, తత్పరిపాలకులకును విశేషమగు శ్రద్ధను సమకూర్చుటకును, "ఆరాధన" యను పత్రిక యారంభింపబడునని తెలిసికొని యమందా నందము నొందుచున్నాము. మహాశివరాత్రి పర్వదివసమున మొదటి వెలుపడుట నొందు యీ పత్రిక సర్వోత్కృష్టముగ విజయమునొందుగాక యని యాశించుచున్నారము.

బృందావన పుర(ప్రతిష్ఠాపిత శ్రీగాయత్రీపీఠాధిపైః

శ్రీ శ్రీ శ్రీ విద్యాశంకర

భారతీపూజ్యపాదైరనుగృహీతం

నారాయణస్మరణపూర్వకం

శుభాశంసనమ్

యావదాంధ్రరాష్ట్రే వర్తమానానాం సర్వేషాం దేవాలయానాం సర్వతోముఖాభివృద్ధిప్రదానార్థం తత్తద్దేవ, దేవాలయక్షేత్రస్వరూపమాహాత్మ్యాదిప్రకటనార్థం బహువిధాగమతంత్రశాస్త్ర రహస్య ప్రబోధనార్థం, తద్ద్వారా సర్వేషాం జనానాం నాస్తిక్యదూరీకరణపూర్వకమాస్తిక్యప్రతిష్ఠాపనార్థం, సన్మార్గ ప్రవృత్త్యుత్పాదనార్థం, ధర్మార్థకామమోక్షరూపచతుర్విధపురుషార్థ ఫలసిద్ధ్యర్థంచ మాసపత్రికేయం ఆరాధననామ్నీ ఆంధ్రరాష్ట్రీయ ప్రభుత్వయాజమాన్యేనాద్య ప్రారభ్యత ఇతిమహదిదమస్మాకం సర్వేషాం భారతీయానాం ప్రమోదస్థానమ్.

"మోక్షకారణసామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ" ఇతి శ్రీశంకరభగవత్పాదైరుక్తరీత్యా భక్తిం వినా పరమపురుషార్థ సిద్ధిర్నభవత్యేవేతి నిశ్చప్రచమ్। సర్వేషాం జనానాం తాదృశభక్త్యుత్పాదనార్థమేవహి దేవాలయాః ప్రతిష్ఠాపితాః। తథాపి కలిమహిమ్నా, ఆధునికనాగరకతావ్యామోహేనచ తత్తాదృశం ఫలం నానుభూయతే లోకైరితి శోచనీయమ్; తదేతత్పర్యాలోచ్యైవ ఆంధ్రరాష్ట్రీయ హిందూదేవాలయ ధర్మాదాయసంస్థాపరిపాలకైః ఉపర్యుక్త ఫలసిద్ధ్యర్థం ఏషా పత్రికా ప్రకటీక్రియమాణా నూనం లోకారాధనమేవావశ్యం కరోతీతి ప్రశంస్యోఽయముద్యమః.

సర్వేషాం విజ్ఞానానాం నిధేః విఘ్నానామధిపతేశ్చ శ్రీ మహాగణాధిపతేరనుగ్రహాతిరేకాదేషా "ఆరాధన" నామ్నీ పత్రికా నిర్విఘ్నం సఫలీకృతస్వాశయా, సర్వాసు దిక్షు వ్యాప్నువానా చిరస్థాయినీ విరాజతామిత్యేషా.

నారాయణస్మృతిః

శ్లో॥ "ఆరాధనా" పత్రికైషా భూయాదారాధితా జనైః।
దేవానురక్తా భూయాసురనయా బోధితాః ప్రజాః॥

బందరు పట్టణమునందు ప్రతిష్ఠింపచేయబడిన

శ్రీ గాయత్రీ పీఠమున కధిపతులగు

శ్రీ శ్రీ శ్రీ విద్యాశంకర భారతీ పూజ్యపాదులచే

ననుగ్రహింపబడిన నారాయణస్మరణ పూర్వకమగు

శుభాశంసనము

ఆంధ్రరాష్ట్రమునందంతట నున్నట్టి సమస్త దేవాలయముల సర్వవిధములగు యభివృద్ధి కొరకును ఆయాదేవుల, దేవాలయముల, క్షేత్రముల స్వరూపము, మహాత్మ్యము, మొదలగు వాటిని ప్రకటించుటకును, అనేక విధములైన ఆగమములయొక్కయు, తంత్ర శాస్త్రములయొక్కయు రహస్యములను తెలుపుటకును, వాటివలన సర్వజనులకు నాస్తిక్యమును పారద్రోలి ఆస్తిక్యమును కలుగజేయుటకును సన్మార్గ ప్రవృత్తిని సమకూర్చుటకును ధర్మార్థకామమోక్షములగు నాలుగు పురుషార్థములఫలము సిద్ధించుటకును, "ఆరాధన"యను పేరుగల యీ మాసపత్రిక ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వ యాజమాన్యమున ప్రారంభింపబడుట భారతీయులమగు మనకందరికిని మిక్కిలి ముదావహము.

"మోక్ష కారణ సామగ్రిలో భక్తియె గొప్పది" యను శ్రీ శంకరభగవత్పాదులు వచించినట్లు భక్తిలేనిదే పరమ పురుషార్థము సిద్ధింపదనుట నిశ్చయము. సమస్త జనులకు నట్టి భక్తిని కలుగజేయుటకే దేవాలయములు ప్రతిష్ఠింపబడినవి. అయినను కలికాలమహిమ చేతను అట్టి గొప్ప ఫలము జనులచే ననుభవింపబడక పోవుట శోచనీయము. ఈ విషయము నాలోచించియే ఆంధ్రరాష్ట్రమునందలి హిందూ దేవాదాయ ధర్మాదాయ సంస్థను పరిపాలించు వారిచే మీద నుదహరింపబడిన ఫలసిద్ధికై ప్రకటింపబడుచున్న యీ పత్రిక నిశ్చయముగ ప్రజాసేవనే తప్పక చేయుచున్నదని యీ యుద్యమము ప్రశంసింపతగినది.

సమస్తమగు విజ్ఞానములకునిధియును, విఘ్నములకు నధిపతియునగు శ్రీ మహాగణపతి యొక్క మిక్కిలి యనుగ్రహమువలన "ఆరాధన"యను పేరుగల యీ పత్రిక నిర్విఘ్నముగా తన సదాశయములను సఫలపరచుకొనుచు, అన్నిదిశలయందు వ్యాపించుచున్నదై, చిరస్థాయినియై విరజిల్లుగాక; యని

నారాయణస్మరణము

క॥ "ఆరాధన" యను పత్రిక యారాధితమగుత జనుల
కయ్యది తెల్పన్
పారగులు దేవరక్తిన్ సూరులగుత బోధగాంచి శుభమతి
సిద్ధిన్॥

## కుర్తాళం శ్రీ సిద్ధేశ్వరీ పీఠాధిపతులు

శ్రీ త్రివిక్రమ రామానందభారతీ స్వాములవారు

శ్రీ ఓరుగంటి వెంకటకృష్ణయ్యగారిని నారాయణస్మరణపూర్వకముగ ఆశీర్వదించి వ్రాయు

## సందేశము

ఆంధ్రదేశమందలి దేవాలయముల తరపున హిందూ దేవాదాయ ధర్మాదాయ నిర్వహణశాఖవారు ప్రభుత్వాను మోదముతో "ఆరాధన" అను మాసపత్రికను ప్రచురించబోవుచున్నారన్న వార్తను తమ లేఖద్వారా తెలుసుకుని ఆనందించితిని. ఈ పత్రికస్థాపనయొక్క ఆశయములు బాగా కొనియాడదగినవై యున్నవి. 'ఆరాధన' మాసపత్రికకు తమరిని సంపాదకునిగా నియమించుట నాకు చాల ముదావహముగ నున్నది.

ఆసేతుహిమాచల పర్యంతము మన హిందూదేశములో శ్రీరామభజనమందిరముకూడ లేని గ్రామము లేదు. ధర్మార్థకామమోక్షములే పరమావధిగా పెట్టుకున్న మన పూర్వులు, లోకకళ్యాణముకొరకు స్థిరస్థాయిగా యుండునట్లు పెద్దపెద్ద దేవస్థానములను నిర్మించి, ఆగమశాస్త్రము ననుసరించి మూర్తులను ప్రతిష్ఠించి, నిత్యధూప, దీప, నైవేద్యములకు గాను మడిమాన్యముల నిచ్చి వారివారి జన్మలను సార్థకము చేసుకుని తరించిరి. పాశ్చాత్యులు వచ్చి రాజ్యపరిపాలన చేసినను, దుర్మార్గులు దుష్కృతములొనర్చినను నేటికిని పెక్కు దేవస్థానములు ఉత్కృష్టమైన మాహాత్మ్యములతో విరాజిల్లుచున్నవి. ఇందుకు కారణము ఆగమశాస్త్రములయొక్క యంత్రబలమేనని చెప్పక తప్పదు.

ప్రస్తుతకాలములో ఆస్తికప్రచారమునకు మనదేశములో తావు కనుపడుటలేదు. పాశ్చాత్యనాగరికతా వ్యామోహము ఎక్కువగుచున్నది. ఇతర మతస్థులు మసీదులకు, చర్చిలకు, వెళ్లు రీతిగానైనను హిందువులు దేవాలయములకు వెళ్లుటలేదు. అమెరికా మొదలగు దేశములనుండి మిషనరీలు వచ్చి హిందూమతమును తూలనాడుట కూడ జరుగుచున్నది. మనదేశములో హిందూ మతప్రచారకులే కాన్పించుటలేదు. సమాన హక్కులకు స్త్రీ పురుషాదులు కాలు దువ్వుదురుగాని, స్వవిధులను నిర్వర్తించుటకు కాలు వేయరు. భక్తివినా జ్ఞానమునకు ప్రాధాన్యమిచ్చి ప్రజలు మెట్ట వేదాంతులగుచున్నారుగాని చక్కని కర్మాచరణపరులు కావటములేదు. మనుష్య జీవనమునకు 'నీతి', 'నియమము'లు ప్రధానము. ఇట్టి నీతి, నియమములు ఈశ్వర సేవవల్లగాని లభించవు. ప్రజా స్వాతంత్ర్య రాజ్యములో ప్రజలందరికి సుఖజీవనముండుటయే ముఖ్యోద్దేశమై యున్నది. మన హిందూమతము ప్రకారము ప్రపంచమంతయు జీవమయమై యున్నది. ఉపాధి భేదము తప్ప పశుపక్ష్యాదులును జీవులే అయి యున్నవి. కనుక ప్రతిజీవునకు తృప్తికరమైన సుఖము కావలయునన్న మనము ఏర్పర్చుకున్న 'లా' లు, కోర్టులు, పోలీసు బందోబస్తులు చాలవు. కేవలము పోలీసువారితో దేశములో శాంతి ఏర్పడదు. రాజ్యములో ప్రతి మనుజునకు "నేను జీవుడను, నిత్యుడను ధర్మాధర్మములకు కర్తను, భోక్తను పరిపాలించేటటువంటి ఈశ్వరుడున్నాడు, ఆయన కర్మఫలప్రదాత" అన్న జ్ఞానము ప్రతి మనుజునకు అలవడిన శాంతిభద్రతలకు లోపముండదు. ప్రతివ్యక్తికి తప్పుచేసిన దేవుడు శిక్షించునన్న భయముతో సదా మంచిపనియే చేయవలయునని కోరిక గలిగి, ప్రజలు దైవభక్తులై అహింసా పద్ధతిని వైసంపిని జీవనము చేయుచుందురు.

"నేను జీవుడను" అని తెలుసుకొనుటకు కూడ దేవాలయములకు వెళ్లుట, దేవతలను భక్తితో పూజించుట జరుగవలయును. భక్తితో భగవంతుని పూజించిన చిత్తశుద్ధి కలుగును. కష్టములు పోవును. కోరికలు ఫలించును. జ్ఞాన వైరాగ్యసిద్ధి కలుగును.

ఈ కాలములో సాయంత్రముగునరికి జనసామాన్యము పార్కులకు వెళ్లుట, రేడియో వార్తలు వినుట, సంతోషించుట జరుగుచున్నది. పట్టణములోని జనులందరు ఒక్క పార్కువద్దకే వెళ్లుట తటస్థించుచుగదా! జీవులు అనేకులుగనుక జీవులయొక్క కోరికలుకూడ అనంతములాయె! కనుక ప్రతిదేవాలయములోను సాయంత్రమగునరికి పురాణ కాలక్షేపములు, హరికథా కాలక్షేపములు, హిందూ మతోపన్యాసములు ఏర్పాటు చేసిన ఆస్తిక్యబుద్ధి కల వారందరు అచ్చటికివెళ్లి ఆనత్కాలక్షేపములయొక్క ఫలమును పొందుదురు.

ఈ మా ఆశయములకు కావలసిన ప్రచారము మన యీ 'ఆరాధన' మాసపత్రిక ద్వారా జరుగవలెననియు, అందుకు దోహదము ఆంధ్ర ప్రజానీకము యివ్వవలయు

ననియు మేము మా శ్రీ సిద్ధేశ్వరపీఠమునకు ఇష్టదేవత అయిన శ్రీ రాజరాజేశ్వరి అమ్మవారిని ప్రార్థించుచున్నాము. ఇంకను మా యిష్టదేవతను ప్రార్థించి యీ 'ఆరాధన' పత్రిక స్థాపనకు కారణభూతులైన కమిషనరు శ్రీ వెంకట రెడ్డిగారిని, డిప్యూటీ కమిషనరు శ్రీ వరప్రసాదరావుగారిని, యీ పత్రికా సంపాదకులను, పత్రికా నిర్వహణమునకు కావలసిన అందరి మిత్రబృందమును నారాయణ స్మరణ పూర్వకముగ ఆశీర్వదించుచున్నాము.

ఇవియే నారాయణ స్మరణములు
శ్రీ త్రివిక్రమ రామానంద భారతీ స్వామీ,
శ్రీ సిద్ధేశ్వరీ పీఠాధిపతి, కుర్తాళము,
తిరునల్వేలి జిల్లా, మద్రాసుస్టేటు, 11-1-1955.

---

యస్య ప్రసాదా దహమేవ శక్తిః మయ్యేవ సర్వం పరికల్పితం చ ।
ఇత్థం విజానామి సదాత్మరూపం తస్యాంఘ్రిపద్మం ప్రణతోఽస్మి నిత్యమ్ ॥

## ప్రణామాంజలి

విద్యామతసంస్థలయున్నతికి ఉత్తమగురూపదేశము, విద్వద్వరేణ్యులసహకారము, ప్రభుత్వప్రోత్సాహము, పాలకులసుపరిపాలన, నియుక్తులకార్యతత్పరత, ప్రజాదరము; అనునవి ప్రధానకారణములు. విద్య, మతము, రెంటికిని సంబంధించిన యీ 'ఆరాధన' యభివృద్ధికి పై విధమున బేర్కొనబడిన సాధనసామగ్రిలో నగ్రశ్రేణికిచెందిన గురూపదేశము:

గురువులు పన్నెండు విధములు కీర్తింపబడిరి. వారు :—

| | | | |
|---|---|---|---|
| 1. ధాతువాది. | 2. చందన. | 3. విచార. | 4. అనుగ్రహ. |
| 5. పారస. | 6. కచ్ఛప. | 7. చంద్ర. | 8. దర్పణ |
| 9. ఛాయానిధి. | 10. నాదనిధి. | 11. క్రౌంచపక్షి | 12. సూర్యకాంత. |

గురువులు—ఈ పన్నెండు విధములగు గురువులలో నుత్తమశ్రేణికి చెందినట్టియు, మాకు కచ్ఛప, క్రౌంచపక్షి గురుపద్ధతిగ నదుపదేశముల నొసగిన శ్రీ కాంచీకామకోటి శ్రీ శృంగేరీశారదాపీఠాధిపతులకు మా మానసప్రణామములు. మాకు ముఖాముఖిగ యుపదేశమునొసగి మాయీ యుద్యమమున మాకు దర్పణగురువులగు శ్రీ శృంగేరీవిరూపాక్ష శ్రీ పీఠాధిపతులగు శ్రీ కల్యాణానందభారతీ మహంతాచార్యస్వాములవారికిని, సర్వదామాకు నదుపదేశముల నొసగుచు ఛాయవలె మా యారాధన పత్రికను రక్షించు ఛాయానిధి గురువులగు శ్రీ గాయత్రీపీఠాధిపతులగు శ్రీ విద్యాశంకరభారతీస్వాముల వారికి త్రివిధములగు పరశ్శతప్రణామములు. ఇంక మాకు తేజస్సువలె నిశితమగు తమ యుపదేశములచే దూరమునందుండియు మాకు యీ యుద్యమమున జాగృతినొసంగుచున్న సూర్యకాంత గురువగు సిద్ధేశ్వరీపీఠాధిపతులగు శ్రీ త్రివిక్రమరామానందభారతీస్వాములవారికి మామానసిక వాచికప్రణామముల నర్పించుచు, శ్రీ పీఠాధిపతులందరు మమ్ములను శ్రీ వారినదుపదేశములచే మాయుద్యమమునందు కర్తవ్యతాజ్ఞానపరిపూర్ణులుగ నొనర్చెదరని ప్రణామాంజలి నర్పించుచున్నారము.

## కృతజ్ఞత

మా ప్రార్థనను మన్నించి యీ "ఆరాధన"కు గౌరవసంపాదకులుగానుండి మా యుద్యమమును సత్పథమున నడిపించెడు గౌరవసంపాదకుల కందరకును కృతజ్ఞతాభివాదనముల నర్పించుచున్నారము.

మాకు సర్వవిధముల ప్రోత్సాహమునొసగు ఆంధ్రప్రభుత్వమును, ప్రభుత్వాధికారులను యభినందించుచు యీ 'ఆరాధన' పత్రిక సర్వతోముఖాభివృద్ధికి తగిన ప్రోత్సాహ మింకను మా కొసగవలెనని ప్రార్థించుచున్నారము.

మాయభ్యర్థన వినినంతనే మాకు తమ యమూల్య వ్యాసరాజములను సమకూర్చిన విద్వద్వరేణ్యులకు మా సమస్కారములు.

తమ సుపరిపాలనచే మాయీ 'ఆరాధన'కు నామరూపముల నొసగి సుప్రతిష్ఠిత యగుటకు సంకల్పించిన మా పరిపాలకులకు వందనములు.

ఇంక మేము కోరినవెంటనే మాయందాదరము చూపి మాకు చేయూత నొసగుచున్న సుజనులకందరికిని మా ధన్యవాదముల నర్పించుచు ఇతోధికతరమగు యాదరమును చూపి పత్రిక యౌన్నత్యమునకు సాహాయ్యపడవలెనని కోరుచున్నారము.

# మంగళానుశాసనము

భారతీ సంప్రదాయ సార్వభౌమ జగద్గురు శ్రీ కల్యాణానంద భారతీమహంతాచార్య స్వాములవారు
శ్రీ విద్యాశంకరభవనము, గుంటూరు.

నారాయణ సమారంభాం వ్యాసశంకర మధ్యమామ్ ।
శ్రీబోధానందపర్యంతాం వందే గురుపరంపరామ్ ॥

బ్రహ్మాదిస్తంబపర్యంతముగల సమస్త ప్రాణికోటి యందును మనుజులు మధ్యమ తరగతికిఁ జెందినవారలు. దేవాదులవలె ఉన్నతస్థితినిఁ బొందకయుఁ దిర్యక్కులవలె నధమగతిని బొందకయు నుండుటచే వీరలు మధ్యమస్థితిని బొందినట్లు చెప్పఁబడియెను. కావుననే మనుజుఁడు శ్రుతిస్మృతి విహితమార్గము ననుసరించి స్వీయధర్మమును అవలంబించినచోఁ దనకుఁబైఁగల దేవాదిస్థితిని బొందఁగలఁడనియు, అట్లుగాక పూర్వోక్త మార్గమును ద్యజించి స్వీయధర్మము నవలంబింపక యుచ్ఛృంఖలవృత్తిగలవాఁడై చరించినచోఁ దనకంటె నధమమగు తిర్యగాదిభావములను బొందుననియు శాస్త్రము బోధించుచున్నది.

కావుననే మానుషౌన్నత్యమునకుఁ బ్రధానముగఁ బ్రవృత్తమగు శ్రుతిస్మృతిసదాచారసిద్ధమగు ధర్మమార్గము యథాధికారముగ భారతవర్షగతచాతుర్వర్ణ్యములవారలను వారివారిస్థితులకంటె నున్నతమగు స్థితినిబొందించుటకు జ్ఞానోపాసనకర్మభేదములచే ముత్తెఱఁగులఁ బరగుచున్నది. అందు—

జ్ఞానమార్గము — ఇద్దానియందు అధికృతులు కేవలాద్వైతజ్ఞాననిష్ఠులగు పరమహంస పరివ్రాజకులు. ఇయ్యది యుత్తమోత్తమమార్గము. ఇఁక రెండవదియగు—

ఉపాసనమార్గము—ఇది మఱలఁ దత్తదధికారి భేదముచే బహుభంగుల వెలయుచున్నది. అందుఁ దొలుత నియ్యది బాహ్యాభ్యంతరభేదమున ద్వివిధమగుచున్నది. అందాభ్యంతరోపాసనమనఁగా స్వహృదయప్రతిష్ఠితుఁడగు పరమేశ్వరుని యథావిధి గురూపసదనము గావించి యా సద్గురూక్తవిధానమున నుపాసించుట. ఇయ్యది గుహ్యాతిగుహ్యమగు విషయమగుటచే గురుముఖైకవేద్యము. ఇఁక—

బాహ్యోపాసనము—అనఁగా ఏదేని బిందు రూపమునుగాని కరచరణాదివిశిష్టమగు దేహాదికమునుగాని శాస్త్రోక్తవిధానముగ స్థూలముగఁ గల్పించుకొని అద్దానిని శాస్త్రోక్తములగు పవిత్రస్థలములందు శాస్త్రోక్తవిధానముననే ఆయతనాదులఁ గల్పించి యందుఁ బ్రతిష్ఠించి తన్మూర్తులను ధ్యానించుచు నుపాసించుట. ఇవ్వానిలోఁగూడఁ గరచరణాదివిశిష్టమూర్త్యుపాసనముకంటె బిందూపాసనమేయుత్తమమగుచున్నది.

ఇట్లు ప్రతిష్ఠితములయినవే నేఁడు 'దేవాలయముల'ను సుప్రసిద్ధిని గాంచుచున్నవి. వీనియొక్క యుత్పత్తి యనాదిసిద్ధమయినను ఇయ్యవి మనకుఁ బ్రధానముగాఁ ద్రేతాయుగమునుండి మాత్రము చారిత్రికప్రసిద్ధిని గనుచున్నవి. ఇయ్యది ఆయా ప్రతిష్ఠాకర్తల విభేదముచే— ౧ దైవములు ౨ ఆర్షములు ౩ ఆసురములు ౪ మానుషములు; అని నాల్గువిధములఁ బరగుచున్నవి. ఇందు మొదటి తరగతులకుఁ జెందినవి యుత్తమోత్తమములుగాఁ బరిగణింపఁబడుచున్నవి. ఎట్లనఁగా—

దేవతలనఁగా బ్రహ్మవిష్ణుమహేశ్వరరూపులగు త్రిమూర్తులు, ఇంద్రాదిదేవతలును. వీరిలోఁ ద్రిమూర్తులు దుష్కృతవినాశనపూర్వకముగ సాధుపరిత్రాణమును గావించి ధర్మోద్ధరణమునకుఁ బూని బహు విధములగు రూపములతో నవతరించి తమ యవతారసమయములయందుఁ బవిత్రతమ దేశములలోఁ గొన్ని దేవతామూర్తులను బ్రతిష్ఠించి యట్టి దేశములందుఁ దత్తన్మూర్తుల సన్నిధానమునఁ దమ కర్తవ్యసాధనమునకై తపం బొనరించి ధర్మప్రతిష్ఠాపనం బొనరించి కార్యసిద్ధినంది యితరులకు మార్గదర్శకులైరి. ఇట్టి దేశములు నేఁటికిని అట్టి గౌరవములనే యందుచు సుప్రసిద్ధములైనవి. బదరికాదు లట్టి తరగతిలోఁ జేరినవే.

అట్లే యింద్రాదిమహనీయులుగూడ నుత్తమోత్తమమగు నాత్మజ్ఞానోపలబ్ధికై గొన్ని దేవతారూపములఁ బ్రతిష్ఠించి యవ్వానిసన్నిధానమునఁ దపంబొనరించి స్వస్వరూపసాక్షాత్కారమునంది తరించియున్నట్లు గ్రంథములవలనఁ దెలియుచున్నది. కావునఁ బైనిఁ బేర్కొనఁబడిన యుభయవిధములగు దైవములచేఁ బ్రతిష్ఠితములైనవి మొదటి తరగతిలోఁ జేరుచు నుత్తమోత్తమములగుచున్నవి.

ఇఁక నార్షప్రతిష్ఠితము లనఁగా ఋషులచేఁ బ్రతిష్ఠింపఁబడినవి. అనఁగా సర్వకర్మసంన్యాసమును గావించి నిరేషణాత్రయులగు గురుమూర్తులు లోకానుగ్రహకాంక్షతో ధర్మసంస్థాపనమునకై గావించిన దేవతాప్రతిష్ఠలు. కామాదివిరహితులగు గురుమూర్తులచే నియ్యది ప్రతిష్ఠింపఁబడుచుండుటఁజేసి యియ్యవి మిక్కిలి మహత్త్వసంపన్నములై యాయాప్రదేశములందొప్పుచున్నవి. కావున

నియ్యవిగూడ దొలి ప్రతిష్ఠితములవలెనే యుత్తమోత్తమము లైయే యొప్పుచున్నవి.

వీనిలోఁ గొన్ని సామాన్య దేవతాస్థానములుగను మఱి కొన్ని వైదికమార్గ ప్రతిష్ఠాపనాసానములుగను బరగు చున్నవి.

ఇఁక మూఁడవ తరగతికిఁ జెందినవి యాసురప్రతి ష్ఠితములు. ఇయ్యవి మహాభక్తులగు బాణరావణాద్యసుర శ్రేష్ఠులచే మహాభక్తిపూర్వకముగఁ దమ తమ కామ్య ములు ఫలించుటకై అకుంఠిత దీక్షాపరత్వమున యథా శాస్త్రముగఁ బ్రతిష్ఠింపఁబడి ఫలసిద్ధిపర్యంతము ఉపా సనము గావింపఁబడిన మహామహిమసంపన్న స్థానములు. కాని యియ్యవి యాయా యసురపుంగవులచేఁ ద్రిలో కాధిపత్యాదిరాజనతామసఫలసంపాదనములకై ప్రతి ష్ఠింపఁబడి యుపాసింపఁబడిన ప్రదేశములగుటచేఁ దత్ త్కామనాసిద్ధికి ననురూపములగు పవిత్రస్థానములుగా నొప్పుచున్నవేకాని పరమపురుషార్థసాధనమునకై పై స్థాన ములంతటి యుత్తమస్థానములుగాఁ జెప్ప నవకాశము లేదు. అసురప్రకృతులు ఎంతటి క్రౌర్యసముపేతము లైనను వ్రతదీక్షాసమయములందు అట్టి క్రౌర్యమునకు మనసులందుఁ దావులేకపోవుటచేతను అట్టి దీక్షాసమయ ములయందే వారలచే నీ దేవతాప్రతిష్ఠలు గావింపఁబడి యుండుటచేతను ఈ దేవతామూర్తులయందు అసుర క్రౌర్యాదులు సంక్రమింప నెంతమాత్రమవకాశములేదు. కావున ఈ ప్రతిష్ఠితమూర్తు లుత్తమములై యుపాసనాదు లకుఁ బవిత్రస్థానములుగనే యొప్పుచున్నవి.

ఇఁకఁ జతుర్థములగు మానుషప్రతిష్ఠితములనుగూర్చి పరిశీలింతము. మనుజులనఁగా శ్రుతిస్మృతి సదాచారనిష్ఠు లగు గృహస్థులు, తత్పరిపాలకులగు రాజాధిరాజులును; వీరలు తాము దమబోఁటి యితరులును దరించుటకు శ్రుతిస్మృతిసదాచారాను ప్రాణితముగ నేవేని గొన్ని పవిత్ర దేశములందు దేవతాప్రతిష్ఠలను గావించి యవ్వానిని దాము శ్రద్ధాభక్తులతోఁ బ్రత్యహము నర్చించుచు నవ్వాని కైంకర్యాదులకుఁదగు ధనాదులకు శాశ్వతములగు నేర్పా టులను గావించి తాము తరించి యితరులను దరింపఁ జేసిరి. మన భారతభూమిని బరిశీలించినచో మనకిపుడుప లబ్ధములగు దేవతా ప్రతిష్ఠలలో మూఁడువంతు లీజాతికిఁ జెందినవే.

ఇట్లు మన దేశములో నాల్గు విధములగు ప్రతిష్ఠలు వైదిక మార్గప్రతిష్ఠితములై సకల జనేష్టసిద్ధికై పరగు చున్నవి. సామాన్యముగ దత్తత్ప్రతిష్ఠాతయొక్క నామము తోడనే తత్తద్దేవతామూర్తి వ్యవహరింపఁబడుటయు నొక యాచారమైయున్నది గావున నిద్దానినిబట్టిగూడ మన మాయా దేవాయతన స్వరూపమును విమర్శించి దెలిసికొన నవకాశముగలదు.

ఇంతియగాదు. మన దేశమున నిపుడు శైవ వైష్ణవ శాక్తాది బహువిధములగు భేదములతో నొప్పు నాలయములు పెక్కులు గన్పట్టుచున్నవి. వీనిలో సనాతన ప్రతిష్ఠితము లగునవిగూడఁ జాలగలవు. వీని పౌర్వాపర్యమును విమ ర్శక దృష్టితో విమర్శించినచో ద్వాదశ జ్యోతిర్లింగములను పేరఁ బ్రసిద్ధినొందిన శైవ క్షేత్రములును అష్టాదశ శక్తి స్థానములని పేరొందిన శాక్త పీఠములును అన్నిటికంటెఁ జాల ప్రాచీనములని చెప్పనొప్పును. అందు ద్వాదశ జ్యోతిర్లింగములనఁగా—

౧. సోమనాథేశ్వరుఁడు — సౌరాష్ట్ర
౨. మల్లికార్జునేశ్వరుఁడు — శ్రీశైల
౩. మహాకాలేశ్వరుఁడు — అవంతి.
౪. ఓంకారేశ్వరుఁడు — నర్మదాతీర.
౫. వైద్యనాథేశ్వరుఁడు — ప్రజ్వలికాక్షేత్ర.
౬. నాగనాథేశ్వరుఁడు — అంగనగర.
౭. కేదారేశ్వరుఁడు .... హిమాలయ.
౮. త్ర్యంబకేశ్వరుఁడు — సహ్యపర్వత.
౯. రామేశ్వరుఁడు — దక్షిణ సముద్రతీర.
౧౦. భీమేశ్వరుఁడు — దక్షవాటికా.
౧౧. విశ్వనాథేశ్వరుఁడు — ఆనందవాటి (కాశీ)
౧౨. ఘృణేశ్వరుఁడు — ఇలాపుర.

అనునవి. అట్లే పదునెనిమిది శాక్త పీఠములును—

"లంకాయాం శాంకరీ దేవీ కామాక్షీ కంచికాపురే।
ప్రద్యుమ్నే శృంఖలా దేవీ చాముండా క్రౌంచపట్టణే"

యను శ్లోకములచే నిర్వచింపఁబడియున్నవి. అందు ముఖ్యములు—

ప్రయాగ — యందు — మాధవేశ్వరీ.
వారణాశి — యందు — విశాలాక్షి.
ఉజ్జయినీ — యందు — మహాకాళీ.
శ్రీశైలము — నందు — భ్రమరాంబ.
వింధ్యాద్రి — యందు — వింధ్యవాసిని.
కంచి — యందు — కామాక్షి.

మొదలుగాఁగలవి.

ఇయ్యవి దేవర్షి ప్రతిష్ఠితములై తొలుతనుండియుఁ జాలకాలము శ్రుతిస్మృతిసంప్రదాయజ్ఞులగు ద్విజుల చేతనే యర్చింపఁబడుచుండెడివి. మానుష ప్రతిష్ఠితము లన్ననో గొంతకాలము ఆయా ప్రతిష్ఠాతలచేతను దద్వంశ జులచేతను బూజింపఁబడియుఁ గాలక్రమమున మన్వాది స్మృతులచేఁ దత్తత్పూజా నిర్వహణాధికారమునకు అభ్యనుజ్ఞ యీయఁబడిన శివార్చకులును వైఖానసు

లును శ్రుతిస్మృతి సదాచారానుప్రాణితముగనే ప్రత్యహము తత్తత్ప్రతిష్ఠాతలయొక్క నామగోత్రాదికమునర్చించుచుండిరి.

ఇవి యిట్లుండ జైనబౌద్ధాదిమతములు ప్రబలినకొలఁది యవ్వారల చైత్యవిహారములతో పాటు జైనబౌద్ధాది తంత్రానుసారమునఁ గొన్నిదేవతాయతనములు ప్రతిష్ఠితములైనవి. కాని వీనియందు జరుగు పూజాదిభేదమును మనము గమనించినచో వీనియొక్క యవైదికత్వము వైదికాపరిగ్రాహ్యత్వము సుస్పష్టమగుచునే యుండును. కావుననే మనదేశమునందలి వైదికధర్మ తత్పరులెవ్వరును నేఁటికిఁగూడ నట్టి యాలయములకు నర్చనదృష్టితోఁ బోనొల్లకపోవుట శిష్టులకు విదితమే.

ఇఁకఁ బ్రకృతకాలమున జరుగుచున్న ప్రతిష్ఠలను మనము జాగ్రత్తతో గమనించినచో నొకవిధమగు పరిణతి యీ ప్రతిష్ఠలయందుఁ గానవచ్చుచున్నది. ఈ పరిణతి మనదేశమునఁ గొన్నివందల సంవత్సరములనుండియే ప్రారంభమైనను వైదికాచారతత్పరులు దేశమునఁ బ్రాబల్యము నందినంతవఱకు విరళముగానుండి యవ్వారలు పలుచఁబడినవెనుక ఈ పరిణతి సాంద్రమైనది. శైవ వైష్ణవశాక్తాదిప్రతిష్ఠలలో మనప్రాచీనులవలంబించిన వైదికమార్గము కొంతవఱకు వెనకఁబడ నారంభించి నేఁటి కాలమున నెచటనోగాని గన్పట్టకపోవుటచే సాధారణముగ నియ్యది లుప్తప్రాయమైనదనియే చెప్పనొప్పును. సామాన్యముగ నేఁటికాలమున శైవప్రతిష్ఠలు పాశుపతమను నొక యాగమమునను సరించి కల్పింపఁబడిన యొక కల్పమునుబట్టియు, వైష్ణవప్రతిష్ఠలు పాంచరాత్రమను నొక యాగమమునను సరించి కల్పింపఁబడిన కల్పమును బట్టియు, శాక్తప్రతిష్ఠలు కాలాచారసిద్ధములగు కొన్ని తంత్రములనుండి కల్పింపఁబడిన కల్పములనుబట్టియు నాచరింపఁబడుచున్నవి. పైనిపేర్కొనఁబడిన విధమున నియ్యవి చాలకాలమునుండి ప్రారంభమైనను ఆనాఁడవి యెంతటి వైరళ్యము నొందియుండినవో యీనాఁడవి వైదికాచారవైరళ్యముచేనంత ప్రాబల్యమునందినవి. కావుననే సర్వత్ర యిట్టి ప్రతిష్ఠలే గానవచ్చుచున్నవి. తుదికి నేఁటి కాలమున దేవతాప్రతిష్ఠ యనునది వైదికమార్గమునఁగాక పాశుపతాద్యాగమమార్గముననే చేయింపవలయును; లేనిచో అయ్యది యప్రతిష్ఠయే యగునను నొక యభిప్రాయము గూడ జనులలోఁ బ్రబలిపోయినది. దీనినిబట్టియే దేవాలయప్రతిష్ఠలు నేఁడు ఎట్టి స్థితినుండి యెట్టి స్థితినిబొందినవో మన మూహింపవచ్చును. ఏది యెట్లయినను నేఁడు మాత్రము ఆయా యాలయములయందుఁ బ్రత్యహము జరుగు వ్యవహారములనుబట్టియే యయ్యది యెట్టి విధమునఁబ్రతిష్ఠితమైయుండుననునదిగాని లేదా యెట్లు సంస్కృతమైయుండు ననునదిగాని మన మూహింప శక్యమగును.

అనుశాసనము—

దేవాలయముల యారంభసమాప్తులు నిరూపింపఁబడినవి. దీనినిబట్టి దేవాలయములు యథావిధి ప్రవర్తింపఁజేయఁబడినచోఁ బవిత్రతమములగు భారతీయవిజ్ఞానములకు సంపాదకములును సర్వకామపరిపూరకములును దేశశాంతిప్రదములును దప్పక కాఁగలవని చెప్పుటలో సందేహములేదు. నేఁటి దేవాలయముల పరిస్థితులు సర్వవిధములఁ దల్క్రిందైనవి. అవ్వానిని బ్రతిష్ఠించుటలోఁ బెద్దలు తలపెట్టిన యాశయములకు నాలయములు నేఁడు సుదూరములయినవి. కావున దేశస్వాతంత్ర్యమునందిప్రాచీనభారతమున సర్వత్ర సంపూర్ణముగ నెలకొనియుండిన సత్యశాంతి ధర్మన్యాయములను మఱల నుద్ధరింపఁబూనిన "సత్యమేవజయతే" యను ముద్రాంకితమగు మన ప్రభుత్వము భారతదేశౌన్నత్యమునకుఁ బునాదియగు ధర్మమునకుఁ గోశాగారములగు నీ దేవాగారములను సర్వవిధముల శ్రుతిస్మృతిసదాచారానుప్రాణితములగు పద్ధతుల నవలంబించి తత్తదాచారకోవిదులగు ధర్మప్రవర్తకులను అవలంబనముగాఁ గైకొని దేవాలయముల నుద్ధరింపఁ బూనవలయును. ధర్మమునకు నిధానములగు వేదవేదాంగాది విద్యలనెల్లఁ బునరుద్ధరించి వానికిఁ జిరకాలమునుండి త్రుటితమైన దేవాలయసంబంధసూత్రమును మఱల దృఢతరముగ బంధింపవలయును. అట్టిదానికి వలయు ప్రయత్నములలోఁ బ్రతికాముఖమున దేవాలయవిజ్ఞాన ప్రచారము ప్రథమ కర్తవ్యము. కాని యియ్యది సశాస్త్రీయముగను అనపార్థముగను సంప్రదాయసిద్ధముగను శిష్టపరిగ్రాహ్యముగను జరుగుచుండవలయును. కానిచో నయ్యది సకలానర్థములకుఁ దావలమగును.

కావున భారతప్రభుత్వము తత్రాపి మన రాష్ట్రప్రభుత్వము సర్వవిధముల జాగ్రత్తను వహించి, మానుషశక్తికి నిధానములగు దేవాలయములను బైని మేము పేర్కొనిన విధమున నుద్ధరింతురనియు, అట్టి పూనికతోడనే తత్సాధనముగ వీరలు ప్రారంభించునట్టి దేవాయతన ధర్మప్రబోధినియగు నీ పత్రిక సర్వవిధముల సర్వతోముఖమగు నభివృద్ధినంది సనాతనవైదికధర్మమును బునరుద్ధరింపఁగలదనియు మేము సర్వవిధముల నారాయణస్మరణములను గావించుచున్నారము. ఇతి నారాయణస్మృతిః

శ్రీ విద్యాశంకరభవనము, గుంటూరు.
శ్రీ జయ భాద్రపద పూర్ణిమా భానువాసరము **12-9-54.**

# ఆగమ శాస్త్రములు - విగ్రహారాధనము

ఆకులమన్నాడు; పండిత పార్థసారథి భట్టాచార్యులు

నాల్గు వేదములు ఆరు వేదాంగములు పూర్వోత్తర మీమాంస న్యాయశాస్త్రము పురాణములు ధర్మశాస్త్రము నను నీ పదునాలుగు విద్యలను విద్యా స్థానములను పేరుతో ప్రాచీనులు వ్యవహరించిరి. విద్యలు అరువది నాలుగు విధములని మరియొక అవాంతరవిభాగము కూడ కలదు. ఇందు మొదటిదగు వేదములు తక్కిన గ్రంథములందలి సామగ్రి కంతకును మూలమై యున్నవి. వేదములందు ఇమిడియున్న బహుముఖమగు తత్త్వమును విషయ విభాగము చేసి ఒక్కొక్క ప్రత్యేక విషయమును ఆయా శాస్త్రములు విస్తరించి ప్రత్యేకముగ వ్యాఖ్యానించుటచే అవి యన్నియు వేదమునకు ఉపకారకములై వేదార్థ ప్రతిపాదకములై వెలయుచున్నవి. అట్లు వేద వ్యాఖ్యానములగు వివిధ శాస్త్రములలో 'ఆగమశాస్త్రములు' ఒక విభాగమగును. ఈ శాస్త్రము వైష్ణవాగమములనియు శైవాగమములనియు ద్వివిధముగనుండి వైష్ణవాగమము వైఖానసము పాంచరాత్రము భాగవతమునని మూడు భేదములై యొప్పినది. ఇయ్యది దక్షిణ భారతమందలి వ్యవస్థయై యున్నది.

ఆగమ శాస్త్రములు భగవానుని సాకారపూజను గురించి చెప్పుచున్నవి. సాకారపూజ యనగా జగత్కారణుడగు సర్వేశ్వరునకు కరచరణాద్య వయవములను కల్పనచేసి అట్టి దివ్యావయవ విశిష్టమగు దివ్యమంగళ విగ్రహమునకు మంత్ర పూర్వకముగ అర్ఘ్యపాద్య నైవేద్య పుష్పాంజలి ప్రణామాదులచే యారాధించుట యని చెప్పదగును. పై విధానమాగమములందు ముఖ్యవిషయముగ నుపదేశింపబడినది. ఆరాధనోపదేశము ముఖ్యోద్దేశమైనను అట్టి యారాధనమున కాలంబమగు దివ్య మంగళ విగ్రహము యొక్క యునికికి వలయు మందిరము యొక్కయు ఆ మందిరముయొక్క కమనీయతకు వలయు సంగోపాంగములుగ నుండవలసిన విమానమండపగోపుర ప్రాకారారామ తటాకాదుల యొక్కయు నిర్మాణము ఆ నిర్మాణమునకు సాధనమైన వాస్తుశిల్పజ్యోతిష వ్యాఖ్యాన విస్తరము ఆగమములందు కలదు. ఒక్కొక్క జనావాసమునకు ఆలయము అంగమనియు ఆలయములేని గ్రామము నివాస యోగ్యము కాదనియు కౌటిల్యాదాది గల అర్థశాస్త్ర నిర్మాతలు చెప్పుదురు.

మరియు ఆలయములను నిర్మించి విగ్రహములను నిర్మించిన వెనుక ఆ విగ్రహములకు చేయదగిన ప్రతిష్ఠావిధి ప్రతిష్ఠాప్రయోగము మహోత్సవము స్నపనము వీట్లవిధానము ఉత్పాతాదులందు చేయదగిన శాంతి క్రమము మంత్రకల్పములు అనుష్ఠాన కల్పము మొదలగునవి కూడ ఆగమములందు కలవు. పాంచరాత్ర శైవాగమములలో షట్కర్మవిధానముపదేశింపబడినది. పాంచరాత్రాగమమందు వైష్ణవదీక్షాప్రకారము శైవాగమమందు శైవదీక్షావిధి యను నొక విలక్షణ సంస్కారము చెప్పబడి ఆ రీతిగ దీక్షను పొందినవారలకు కొన్ని ప్రత్యేక సంస్కారములు కూడ చెప్పబడినవి.

వేదములందు పై చెప్పబడిన విగ్రహ నిర్మాణాది వివరములు కంఠోక్తముగ చెప్పబడకపోయినను విగ్రహముల యొక్క స్వరూపమును పూజావిధిని విధించెడి ప్రమాణములు విస్తారముగ కలవు. గౌతముడు మనువు ఆదిగాగల స్మృతి కర్తలు పై వేదశ్రుతులను సంగ్రహించియు నున్నారు. ఆ వివరము మరియొక వ్యాసమందు వివరింపబడును.

ఈ యాగమములు అన్నియు ఆంధ్ర ద్రవిడ కర్ణాట దేశములందు అధికముగా ప్రచారమందున్నవి. ఉత్తర హిందూస్థానమందీయాగమోక్తమగు పూజ జరుగుచున్నట్లు లేదు.

మరియు, ఆలయ నిర్మాతలు, పరిపాలకులు, అర్చకులు మొదలగు పరిజనములు, గ్రామస్థులు, భక్తులు, తటస్థులు, ఆపన్నులు, రాజులు మొదలగు వారలు నడుచుకొనదగిన విధులు చేయదగిన కైంకర్యముల వలని ఫలవిశేషము మొదలగు విశేషములును ఆగమములందు చెప్పబడినవి.

ఆలయములు వాని ఆకర్షకతచే భక్తిని పెంపొందించుటకు మాత్రమే గాక చాల ప్రదేశములందు విభవము ననుసరించి గొప్ప విద్యాసంస్థలుగ విద్యను వ్యాపింపచేసి యుండెను. అచ్చటచ్చట ఆలయపరిపాలకులు తమ యాలయములందు పాఠశాలలను స్థాపించి వానియందు సమస్త విద్యలను అధ్యయనము చేయుటకు ఏర్పాటులను గావించిరి. విద్యార్థులకు విద్యాధికులగు నుపాధ్యాయులకు ఉచిత వసతులను వేతనములను ఇచ్చి విద్యా సంస్థలను పోషించిరి. దక్షిణార్కాడు మండలములోని 'త్రిభువని' క్షేత్రమందు ప్రథమ రాజాధిరాజ రాజకేసరివర్మ క్రీస్తు శకము 1018-1050 సంవత్సరములలో కొన్నివేలమంది విద్యార్థులకు విద్యాభ్యాసమునకై ఒక సంస్కృత మహా

విద్యాశాలను స్థాపించి నడిపించిన విషయము శాసనరీతిగ తెలియవచ్చుచున్నది.

అయా గ్రామమందు నివసించెడి అన్ని వర్ణములవారికిని ఆలయముతో నిత్యసంబంధమును కల్పించుటకై వారలవారలకు జీవనమును కల్పించెడి వృత్తులు చాల చోటులందుఁ యేర్పరుపబడి నేటికిని జరుగుచు వచ్చుచున్నవి.

విశేషదినములందు ఉత్సవములను వ్యాజముతో దూరస్థులును సన్నిహితులునగు ప్రజానీకము నొక్కచోట సమావేశపడుట కవకాశము కల్పించబడినది. ఆ సమావేశము నందును అయా కళలందు వైదుష్యముగల విద్వాంసులు తమతమ కౌశలమును ప్రదర్శనము చేయుటకును కర్మకారులు శిల్పులు తమ శిల్పనైపుణిని వెల్లడించికొనుటకును దానయశస్సంపదల నార్జించికొనుటకును వర్తకులు తమతమ వాణిజ్యమును విరివిగా సాగించుకొనుటకును యెంతో నదవకాశము యేర్పడుట కవకాశము కలదు.

చారిత్రకదృష్టితో చూచినను విగ్రహారాధనము చాల పురాతనమై మానవసభ్యతతో సమకాలికముగను ఉండిన దని తెలియనగును. విగ్రహారాధనమును ఖండించిన వారలలో క్రైస్తవులు మహమ్మదీయులు ముఖ్యులగుటచే నీ విధానము ఆ మతకర్తల నాటికంటె ప్రాచీనమైనది. ఖండాన్తరములందు విగ్రహములు ఉండియుండిన నిదర్శనములు కలవు. అవి మనదేశమందలి విగ్రహములవలె నియతముగ ఆలయములందుఁ విధివిహితముగ పూజింపబడెడివో కాదో నిర్ణయించుటకు ఆధారములు లేవని కొందరనుచున్నారు. పాణినినాటి విగ్రహములకు మన దేశమందు పూజ జరిగెడిది. కేవల జ్ఞాపకచిహ్నములుగ పూజ లేకుండెడి విగ్రహములుకూడ నేటివలెనె పూర్వమందును ఉండుట కవకాశము లేకపోలేదు. అట్టి జ్ఞాపక చిహ్నములగు సాధారణ వ్యక్తుల పూజ పురుషార్థపర్యవసాయిని కాకుండుటచే వాటి పూజ జరుగకపోవచ్చును. రామకృష్ణాద్యవతారములను మన పూర్వులు అసాధారణములుగ మన్నించుటచే వాటిపూజ జరిగియే తీరును. మరియు విగ్రహములవలెనే పూజకు అవలంబముగ ఖండాంతరములందును వేరువేరు ఆకారములుగల పదార్థములను ఉపయోగించుట కలదు. విచిత్రమగు ప్రస్తారములుగల రేఖలు అందు బీజాక్షరములు చెక్కబడిన యంత్రములు ఒక విధానము. ఇట్టి యంత్రములు లోపలిభాగమందు ఇమడ్చబడిన తాయెత్తులు, పవిత్రములగు రావి వేప మొదలగు వృక్షముల చేవతో చేయబడిన శూలాకారముగల దారుఖండములు మరియొక విధానము. ఇయ్యవి మాత్రమేగాక క్రైస్తవుల శిలువ పావురము మహమ్మదీయుల కామధేనువు పీర్లు మొదలగునవి పై జాతిలో చేర్చవచ్చును

మరియు మానవసభ్యత సృష్టితో ఆరంభమై విచ్ఛిత్తి లేక అనువర్తించుచున్నదని భారతీయులును పరిణామ క్రమమున సృష్టి వివిధపరిణామములకులోనై సృష్టికి యెంతో వ్యవహితమై మానవసృష్టి జరిగి ఆ వెనుకగూడ యెంతో వ్యవహితమై మానవసభ్యత క్రమక్రమముగ వృద్ధియగుచువచ్చి ఇంకను ఉత్తరోత్తరమందు వృద్ధి కానున్నదని పాశ్చాత్యులును నేటి మన సభ్యతను విబిన్న దృక్పథముతో పరామర్శించి మానవసభ్యతను వేరువేరు విధముగ నిరూపించుచున్నారు. రెండవపక్షములో మానవులు తమ నిత్యజీవితావసరములై ప్రకృతి వికారములగు పంచభూతములను భయభక్తులతో ఆరాధించుచువచ్చుట సంభవించి అవల నాగరిక పెంపొందినకొలది సమష్టిగా సృష్టికర్త నొకనిని కల్పించికొని అతనికి సృష్టిసాధనోచితమగు దేహమును కల్పించి ఆ ప్రతిమ నారాధించుట సంగతము కావచ్చునని పాశ్చాత్యవాసనగల భారతీయులును సాధింతురు. మొదటిపక్షమువారు ముందు చెప్పిన రీతిని సమూర్తపూజనమును వేదచోదితముగజేసి సృష్ట్యాది యందుండియు ఏకరూపముగ నిది యాచరణమందున్న దని చెప్పుదురు.

మరియు వేదములు కర్మకాండమనియు బ్రహ్మకాండమనియు రెండు విభాగములుగ విభజింపబడి వేదత్రయరూపమగు కర్మకాండము భగవానుని అమూర్తరూపమగు అగ్నిహోత్రముఖముగను ఉపనిషద్రూపమగు బ్రహ్మకాండము భగవానుని సమూర్తరూపమును ప్రతిమాముఖముగను ఉపాసించుటను విధించుచున్నదని అగమశాస్త్ర ముల సారమైయున్నది. అగ్నిహోత్రసపర్యకు కావలసిన ప్రకారమంతయు వేదములందును వేదాంగమగు కల్పసూత్రములందును విస్తారముగ నుపదేశింపబడినది. ప్రతిమారాధనమునకు వలయు ప్రకారమంతయు ఆగమశాస్త్రములందు వివరించబడియున్నది.

ఇట్లుండినను అమూర్తసమూర్తపూజల ప్రయోగము నందును ఫలమందును యెంతో తరతమభావము కలదు. అమూర్తపూజవలని ఫలము ననుభవించెడివాడు ఆయజనమును చేసినట్టి యజమానుడు మాత్రమే లేక అతని కుటుంబము మాత్రమే యగును. ఆ యజమానుని కాలమునకు తరువాత ఆ యగ్ని నష్టమైపోవుటచే తరువాతి వారికి ఫలదాయికాక పరిమితకాల ఫలప్రదమైయున్నది. సమూర్తయజనమట్టిదికాదు. ఇది శాశ్వతమై ఆ పూజను ప్రతిష్ఠించిన యజమానుని జీవితానంతరముకూడ అవిచ్ఛిన్నముగ ననువర్తింపు ఆ ప్రదేశమును సేవించెడి

లెక్కకు మిక్కిలియగు భక్తులకు తారకమై వెలయు చుండును. యెంతోకాలమునుండి నేటివరకు భారతావని యందు భక్తులసమూహములచే దర్శింపబడియెడి తిరుపతి శ్రీరంగమాదిగాగల పుణ్యక్షేత్రముల నియెడ దృష్టాంతముగ చెప్పవచ్చును.

మరియు అమూర్తయజనము చేసెడి యజమానునకు ప్రతినిధి లేడు. అత డొక్కడే ఆయా నియమితకాలము లందు నియమిత కృత్యముల నాచరించి పరిచర్య చేయవలెను. సమూర్తయజనము అట్టిది కాదు. భగవానుని సేవించెడి అనేక భక్తులకు ఒకే ఒక అర్చకుడు ప్రతినిధిననుండి ఆ కైంకర్యము సకువలయు నియమనిష్ఠలను ఆచరించుచు యథావిధిగ పూజలను చేసి ఆ పూజాఫలమును రాజరాష్ట్ర గ్రామ యజమానులకు అందచేయుచున్నాడు. ఒరులకుగాను మరియొక సమర్థుడగు నాతడు త్యాగము చేసి వారలను తరింపచేయుట యనునది భారతభూమి యందే గాక ఖండాంతరములందును ప్రసిద్ధమై యున్నది. ఇంద తిశయోక్తి లేదు. యేసుక్రీస్తు పాపుల నుద్ధరించుటకై తాను త్యాగము చేసి తన రక్తమును ధారపోసి శిలువపై మరణదండన ననుభవించిన కథ కలదు. మహమ్మదును గురించియు అట్టి కథయు చెప్పుదురు. బుద్ధ భగవానుడు సర్వసంగ పరిత్యాగము చేయుటయు పర దుఃఖాసహిష్ణుతవలననే నగుటయు ప్రసిద్ధమే.

శరణాగతి శాస్త్రమును ప్రచుర ప్రచారమునకు తెచ్చిన విశిష్టా ద్వైతమత ప్రవర్తకులును తమ శిష్యులకొరకై గురువులు భరన్యాసము చేయుట యనునది కూడ పై యర్థమును అనుసరించునదే అయియున్నది. అట్లేఆశక్తులు అనర్హులు, అలసులు తటస్థులు నగు ప్రజానీకమునకు సేవ చేయుటకై వారలకు ప్రతినిధియై అర్చకుడు ఆలయములందు భగవానుని పూజించి ఆ పూజచే తుష్టుడగు భగవానుని యనుగ్రహమును వారలందు ప్రసరింప చేయుచున్నాడు. ఇదియే ఆగమ శాస్త్రముల యొక్కయు విగ్రహారాధనము యొక్కయు వైశిష్ట్యము.

ఒక విషయము మాత్ర మిచ్చట మరువరానిది. భగవానుడు సర్వశక్తుడై సర్వవ్యాపి యగుటచే యాతడు భక్తు లారాధించెడి విగ్రహమందును సాన్నిధ్యము చెందియుండుననుటలో ఎట్టి సందియముగాని లేదు. అట్లారాధించెడి భక్తు తెవ్వడుగాని భగవానుడా విగ్రహమునందే ఆదే రూపముగ మాత్రమే అనగా శిలాదారు లోహమయముగనే ఉన్నాడని యనుటలేదు. పిపీలికాది బ్రహ్మ పర్యంతముగల చరాచరమగు జగమంతయు భగవచ్ఛక్తిచే వ్యాప్తమై యున్నదని చెప్పెడి మన శాస్త్రములు సర్వవిధములచేతను విగ్రహారాధనమును సమర్థించగలవు.

యుక్తివాదము ననుసరించినను దిగువ రీతిని ఉపపత్తిని చెప్పవచ్చును. కార్యసిద్ధికొకలక్ష్యమవసరమైయుండును. ఏకలవ్యుని చరిత్ర మనమంద రెరిగినదే. అతడు తన కార్యసిద్ధికై ద్రోణుని విగ్రహమును ముందుంచుకొని దానియందు గురుభావమును బెట్టి విలువిద్యను సాధించి దిట్టయయ్యెను. విగ్రహములందలి కార్యకారిత్వమునకు ఏకలవ్యుని చరిత్రమును సాధారణ దృష్టాంతముగ దీసి కొనవచ్చును. ప్రతిమయందు భగవద్బుద్ధిని కల్పించికొని దానికి పూజాప్రణామాదుల చేసి తమ యభీష్టమును ప్రార్థించెడి భక్తులు ఇష్టార్థసిద్ధిని వడసిన ప్రకరణములను ఆయా క్షేత్రమహాత్మ్యములను పరిశీలించినప్పుడు మనకు తెలియ గలదు. కలియుగ దైవతమని ప్రసిద్ధి జెందిన తిరుపతి వేంకటేశ్వరుని దివ్యభాండాగారమాదేవుని వరప్రసాదము నొంది సంతుష్టులగు భక్తులచే సమర్పింపబడిన ధనరాసులచే చరితకందని ప్రాచీనకాలమందుండి నేటివరకు ప్రవర్ధమాన మగుచున్న విషయము పరోక్షము కాదు. భక్తిధనులగు మహనీయులకు ప్రతి ఆలయమందలి విగ్రహముకూడ ఇట్టి మహిమ విశేషము కలదిగ గోచరించుచునే యుండును. ఆంధ్ర దేశమందు భద్రాచల రామదాసువంటి మహనీయులు విగ్రహారాధనచే తరించిరి. ద్రవిడ దేశమందును ఆళ్వారులు నాయనారులు మొదలగు పరమ భక్తులు తమ తమ సమకాలములోను వ్యవహితకాలములందును వెలసియుండెడి పరశ్శతము లగు దివ్యక్షేత్రములయొక్కయు అందలి దేవతలయొక్కయు మహిమను పాడి తరించి వారి కీర్తనములచే మన బోటులను తరింప చేసిరి.

# శ్రీ మహాగణపతితత్త్వము

శ్రీ గాయత్రీ పీఠాధిపతిస్వామి

ఏ కార్యమైనను నిర్విఘ్నముగ పరిసమాప్తి చెందవలె ననిన, గణపతి మహాదేవుని సేవించుట మన భారతీయ సాంప్రదాయమై యున్నది. సర్వవిఘ్నములను నశింప జేసి రక్షింపగల దక్షత ఆయనయందున్నది. కనుకనే ప్రతికార్యమందును "ఆదౌ పూజ్యో గణాధిపః" యని వారిని ముందు పూజించుచున్నారు. ఇట్లు మహాశక్తిగల ఆ గణపతిదేవునియొక్క తత్త్వమెమై యుండును? అను విషయము గురించి యొకింత విచారింతము.

అష్టోత్తరశతోపనిషత్తులో (గణపత్యుపనిషత్) అనియొకటి కలదు. దానిలో గణపతితత్త్వమిట్లు వర్ణింపబడి యున్నది.

"సర్వంఖల్విదంబ్రహ్మ" అని శ్రుతిలోని బ్రహ్మశబ్ద వాచ్యుడు ఈ గణపతియే అనియు ఈ గణపతి సచ్చిదానందాద్వయుడనియు ఈతనినుండి ఈ జగత్తంతయు పుట్టి రక్షింపబడి ఈతనిలోనే లయమగుచున్నదనియు సృష్ట్యాదియందు ప్రకృతిపురుషసంయోగమువల్ల ఆవిర్భవించిన జగత్కారణతత్త్వమీతడే యనియును వర్ణింప బడి యున్నది. దీనిని బట్టిజూడ గణపతితత్త్వము సగుణబ్రహ్మమైన కేవలభగవత్తత్త్వమే యని స్పష్టమగు చున్నది.

ఇక వేదపూర్వభాగములు "గణానాం త్వా గణపతిగ్ం హవామహే కవిం కవీనాముపమశ్రవస్తమమ్, జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత ఆనశ్శృణ్వన్నూతిభిస్సీదసాదనమ్" అని వర్ణింపబడియున్నది. ఈ మంత్రార్థమేమనగా:— హే బ్రహ్మణాం బ్రహ్మణస్పతే, అనగా సర్వవేద మంత్రములకు అధిపతి యగు దేవా, త్వాం: నిన్ను, గణానాం గణపతిం—సర్వవిధములగు దేవగణములగు స్వామిగాను, కవిం కవీనాం, విద్వాంసులందరిలో నుత్తమ విద్వాంసునిగాను, ఉపమశ్రవస్తమం, అన్ని యుత్తమ గుణములునీయందు మూర్తీభవించి యుండుట చేత అన్ని విషయములలోను ఉపమానముగా చెప్పతగిన ఉత్తమవ్యక్తివి నీవే యని ఉత్తమమైనఖ్యాతి గలవానిని గాను జ్యేష్ఠరాజం, రాజులందరిలోను జ్యేష్ఠత్వము కల వానినిగాను తెలిసికొని హవామహే, ప్రార్థనాపూర్వకముగా ఆహ్వానించుచున్నాము. అట్టి ఉత్తమ లక్షణములు గల నీవు నః=మా యొక్క ప్రార్థనలను, శృణ్వన్= వినుచు ఊతిభిః=మా యొక్క విఘ్నములను పారదోలి మమ్ములను రక్షించుటకు కావలసిన అన్ని నిమిత్తభూతములగు పాలన సాధనలతోను సాదనం=మేము సంకల్పించిన ఈకర్మయందు ఆసీద=దయచేసి ఆసీనులుకండి."

ఈ మంత్రములో గణపతి అను దేవుడు సర్వవేద మంత్రములకు అధిపతిగా సంబోధింప బడినాడు, గాని గణపతి అని సంబోధింప బడలేదు. గణపతిత్వము ఆయనకున్న అధికారములలో నొకటిగాని అసలు స్వరూప లక్షణము లేదు; అని తెలుచున్నది. ఇంకను ఈ మంత్రములో ఆయనకు లక్షణములుగా వర్ణింపబడిన మిగిలిన విశేషము లన్నిటిని బట్టి ఆయన కేవలము భగవంతుడే అయి యుండవలె ననియు, పురుషోత్తమ శబ్దవాచ్యు డనియు స్పష్ట మగుచున్నది. భగవద్గీతలో శ్రీ కృష్ణపరమాత్ముడు "వేదైశ్చ సర్వైరహమేవ వేద్యః వేదాంతకృత్ వేదవిదేవచాహం" అనియు పురుషోత్తమునిగ తనను తెలిసికొని భజింపుమని బోధించునట్లుగనే ఈ మంత్రముగూడ 'గణపతి' అను దేవుని సర్వవేద వేద్యునిగను పురుషోత్తమునిగను వర్ణించి యున్నది. కనుక వేదములోని అంతిమ భాగమగు ఉపనిషత్తువలెనే పూర్వభాగముకూడ గణపతితత్త్వము కేవలము భగవత్తత్త్వమే యని ధ్రువపరచుచున్నది.

ఇంక పురాణములలో నెట్లు వర్ణింపబడినది పరిశీలింతము. శ్రీమదాదిగణేశ పురాణ గణేశగీతయందు గణేశుడు తనతత్త్వమును గురించి తన భక్తుడైన వరేణ్యుడను రాజు

"విఘ్నేశ్వర మహాబాహో సర్వవిద్యా విశారద।
సర్వశాస్త్రార్థ తత్త్వజ్ఞ యోగంమే వక్తు మర్హసి."

అని ప్రార్థించగా నీ క్రింది విధముగా బోధించెను.

శ్లో॥ అజోఽవ్యయోఽహం భూతాత్మాఽనాదిరీశ్వర ఏవచ।
అస్థాయ త్రిగుణాం మాయాం భవామి బహుయోనిషు॥
అహమేవ మహావిష్ణుః అహమేవ సదాశివః।
అహమేవ మహాశక్తిః అహమేవార్యమా ప్రియ॥
అహమేవ పరోబ్రహ్మ మహారుద్రోఽహమేవచ।
అహమేవ జగత్సర్వం స్థావరం జంగమంచయత్॥
అహమేవాఖిలం విశ్వం సృజామి విసృజామిచ।
ఓషధీస్తేజసా సర్వా విశ్వంచాప్యాయయామ్యహమ్॥
అహం సాక్షీ జగచ్చక్షుః అలిప్తస్సర్వకర్మభిః।
అవికారోఽప్రమేయోఽహం అవ్యక్తో విశ్వగోవ్యయః॥
అగ్నౌ సూర్యే తథా సోమే యచ్చ తారాసు సంస్థితం।
విదుషి బ్రాహ్మణే తేజో విద్ధి తన్మామకం నృప॥
శివే విష్ణౌ చ శక్తౌచ సూర్యే మయి నరాధిప।
యాఽభేదబుద్ధిర్యోగస్సః సమ్యగ్యో గోమతో మమ॥
తతశ్చ సర్వభావేన భజ త్వం మాం నరేశ్వర।
భక్త్యాచావ్యభిచారిణ్యా సర్వత్రైవచ సంస్థితమ్॥

ఈ పైశ్లోకములలోని భావమునుబట్టి చూడగా శ్రీకృష్ణపరమాత్మ భగవద్గీతలో అర్జునునికి తన స్వరూపమును గురించి ఎట్లు బోధించి యున్నాడో గణేశుడును వరేణ్యునికి అదియే విధముగ బోధించినట్లు స్పష్టమగుచున్నది.

ఇంకను ఇంకొక పురాణాంతర్గత గణేశాష్టోత్తర శతనామములలో "సమస్త జగదాధారాయనమః, సమస్తదేవతామూర్తయేనమః, విశ్వధృతేనమః, పురాణ పురుషాయనమః, సర్వస్మైనమః," అను నామములను బట్టికూడ గణేశ తత్త్వము కేవలము భగవత్తత్త్వమే యని తెలుచున్నది.

ఇట్లు గణపతిదేవుడు సాక్షాద్భగవంతుడే అయినచో ఆయనకుఁ గజముఖము, లంబోదరము, మూషకవాహనము, నాగమేఖలా యజ్ఞోపవీతములు ఉండుటలో విశేషమేమి? అను విషయము విచారణీయమగు చున్నది.

గజముఖములోని భావమును గణేశగీత ఇట్లు వర్ణించినది.

"గచ్ఛంతి ప్రాప్నువంత్యేనం ప్రలయకాలే జాయంతే చ యస్మాత్
సర్వాః ప్రజాః" ఇతికృత్స్న ప్రపంచయోనిరీశ్వరో గజ శబ్దార్థః

అనగా సర్వ ప్రపంచము సర్వప్రజలు ఎవరివల్ల పుట్టుచున్నారో ఎవరిలో లయమగుచున్నారో అట్టి జగత్కారణమే గజశబ్దముచే సూచింపబడినది. కనుక గణపతిదేవుని గజముఖునిగ వర్ణించుటలో భావము ఈయన సర్వజగత్తునకు సృష్టిస్థితిలయకర్త యని బోధించుటయే. ఇక లంబోదరత్వము సర్వజగత్తును అనగా పదునాలుగు భువనములనుగూడ కుక్షిలో నుంచుకొని రక్షించు మహావ్యక్తి అని బోధించుచున్నది. మూషక వాహనత్వ నాగధారిత్వములలో విశేషమునుకూడ పరిశీలింతము. మూషక శబ్దమునకు వ్యుత్పత్త్యర్థము దొంగిలించు స్వభావముగలది యని. అందుకనియే ఎలుక ఎవరికంటను బడకుండ బిలములలోను చూరులలోను దాగికొనుచు రాత్రులయందు చీకటిలో నాయా వస్తువులను దొంగిలించుటకై తిరుగు స్వభావముగలది యని సర్వ విదితమే! ఇక పాములన్ననో విషపూరితములై అపాయమును కలుగజేయు దుష్టస్వభావముకలవి. ఎలుకలను పాములు భక్షించు స్వభావముగలవగుటచే యీరెంటికి శత్రుత్వము కలదు. ఇట్టి శత్రుత్వముగల యెలుక వాహనముగను, పాములను మేఖలాయజ్ఞోపవీతములుగను ధరించుటవలన ఆ గణపతిదేవుని అత్యద్భుతయోగ మాహాత్మ్యము ద్యోతితమగుచున్నది. "అహింసా ప్రతిష్ఠాయాం తత్సన్నిధౌ వైరత్యాగః" అని పాతంజల యోగసూత్రము. ఋష్యశృంగుడు జన్మించి తపంబొనరించిన శృంగగిరిలో నొకానొక మండు వేసవి మధ్యాహ్నమున ఒక మండూకము ప్రసవవేదనచే బాధపడుచుండ వేడిమిబాధను సహింపలేక యున్న తరినొక త్రాచుపాము తనపడగతో నద్దానికి ఎండ బాధ లేకుండ నీడను కల్పించి కాపాడిన దృశ్యమును చూచియేగదా శ్రీ శంకర భగత్పాదులవారు శృంగగిరిలో శ్రీ శారదాదేవిని ప్రతిష్ఠించుటకు కారణము. అట్టియద్భుత యోగమాహాత్మ్యముగల దేవునిగా శ్రీ గణపతిని ధ్యానించు వారికి అట్టి యోగ సిద్ధులుకూడ లభించును. విషపూరితములగు నాగుపాములే ఆయన కట్టి యలంకారములగుటచే నట్టి గణపతి యుపాసకులకు ఎంత దుష్టులైనను వశమగుదురు. సర్వజన వశీకరణసిద్ధి కూడ లభించును. ఇదియును కాక మహత్తరమై పూజ్యమైన ఏనుగు యొక్క ముఖమును, అల్పమై క్షుద్రమైన ఎలుకను వాహనముగను, విషపూరితములగు సర్పములను మేఖలాద్యలంకారములుగను ధరించుటవలన గీతోక్త 'విద్యావినయసంపన్నే' త్యాది శ్లోకభావమువలె సర్వ సమదర్శనత్వము ప్రకటితమగుచున్నది. అట్టి పరస్పర వైలక్షణ్యము వైరుధ్యము గన్పడు భేదములన్నియు, ఆయా ఉపాధి కల్పితములుగాని వాస్తవములుగావనియు, వాటన్నిటియందనుస్యూతమైన చైతన్యము సత్యజ్ఞానానంద స్వరూపమై ఏకమై యద్వితీయమై విరాజిల్లుచున్నదనియు ద్యోతితమగుచున్నది. "అణోరణీయాన్ మహతో మహీయాన్" అనునది ఆ పరబ్రహ్మ లక్షణమేగదా! ఆ గణపతి మహాదేవుని మౌఖిక గజత్వము, ఔదర్యలంబత్వము, వాహన మూషకత్వము, మేఖలాద్యాలంకారిక సర్పత్వముల వలనకూడ ఆయన తత్త్వము సాక్షాద్భగవత్తత్త్వమేయని ధ్రువపడుచున్నది.

ఇంకను ఆ పరమేశర్వుని సాక్షాదవతార మూర్తులగు శ్రీమ దాది శంకర భగవత్పాదుల వారు తాము రచించిన మహాగణేశ పంచరత్న శ్లోకములలో గణేశుని "సదా విముక్తి సాధకం, సురేశ్వరం, నిధీశ్వరం, మహేశ్వరం, పరాత్పరం, యశస్కరం, మనస్కరం, అకించనార్తి మార్జనం, చిరంతనోక్తి భాజనం, ప్రపంచ నాశభీషణం, అచింత్యరూపం, అంతహీనం, హృదంతరే నిరంతరం వసంత మేవయోగినాం" ఇత్యాదిగా వర్ణించి ధ్యానించిరి. అపరశంకరులని ప్రసిద్ధి గాంచిన శృంగేరీ పీఠాధిష్ఠిత జగద్గురు శ్రీ సచ్చిదానంద శివాభినవనృసింహ భారతీస్వామి వారు రచించిన గణేశస్తోత్రమునందును, "సురాసురైర్నమస్కృతం జరాపమృత్యు నాశనం, గిరాగురుం శ్రియాహరిం జయంతి యత్పదార్చకాః శరీరకాంతి నిర్జితాబ్జ బంధుబాల సంతతిం, ప్రకాశితాత్మ తత్త్వకం, రమాధవాది పూజితం శమాదిషడ్గుణప్రదం" ఇత్యాదిగా వర్ణించినారు. ఈ వర్ణనద్వయము గణపతిదేవుడు ఆ పరాత్పరుడే యని స్పష్టపరచుచున్నది.

పై నుదహరించిన రీతిన గణపతి తత్త్వము కేవల భగవత్తత్త్వమేయైనచో శివుడు, విష్ణువు, శక్తి అను వారల

తత్త్వ మేమి? అను సంశయముప యించును, శైవము, వైష్ణవము, గాణాపత్యము, సౌరము, శాక్తేయము, మున్నగు ప్రత్యేక ప్రత్యేక మతావలంబులకు ఈ సందేహ ముద యించుటయే కాక నివారింప న శక్యముకూడ నగును. శైవమతావంబులకు శివుడు ఆ భగవత్తత్త్వ మనియు మిగిలిన దేవతలందరు ఆ శివునికంటె తక్కువవారును, శివునికి భక్తకోటిలోని వారును, అనియు వారు చెప్పు దురు. అటులనే వైష్ణవులు విష్ణువే భగవత్తత్త్వమనియు, శాక్తేయులు శక్తియే భగవత్తత్త్వ మనియు, సౌరమతా వలంబులు సూర్యుడే భగవత్తత్త్వ మనియు ఇట్లు వారి వారి ఉపాస్యదైవమే భగవంతుడనియు, మిగిలినవారు వారికంటె తక్కువ వారనియు బెదదృష్టితో ప్రతిపాదించు చుందురు. వ్యాసభగవానుడు అష్టాదశ పురాణములను రచించి వానిలో కొన్నిటియందు శక్తియొక్క యసామా న్యతము, ఇంక కొన్నిటిలో గణపతియొక్క నిరుపమా నత్వము,—ఈ విధముగ వర్ణించియున్నాడు. ఇట్లు వర్ణించుట తత్త్వము తెలిసికొనలేనివారికి పరస్పరద్వేష కారణము కావచ్చును. కాని సాక్షాత్ నారాయణావతార మగు శ్రీ వ్యాస భగవానుడు ఇట్టి మతద్వేషములను కలి గించుటకై పురాణములను రచించె ననుట ఎవ్వరికిని అంగీకారము కాదు గదా! అట్లయినచో ఆ పురాణములలో శివాది దేవతలను అందరిని భగవత్తత్త్వ స్వరూపులుగనే వర్ణించుటలో వ్యాసుని యాశయమేమై యుండును? భగ వంతు డొక్కడే గాని యనేకు లనుటకు వీలు గాదు. శివుడే భగవంతుడైన, విష్ణువు కాని, గణపతి కాని, శక్తి కాని, సూర్యుడు గాని భగవంతు డనుట కెన్నటికిని వీలు కానగును. అట్లే గణపతి భగవంతు డగుచో మిగిలినవారు భగవంతులు కానేరరు. కాని ఆయా పురాణములలో అటులనే వర్ణించుటలో వ్యాసుని భావమేమై యుండును? ఉపనిషన్మతావలంబులగు నద్వైతులకీ విషయమున శంక బొడమదు. ఏలనన, ఉపనిషత్తులలో "ఏకమే వాద్వితీయంబ్రహ్మ, సదేవసౌమ్యేదమగ్ర ఆసీత్, సర్వంఖ ల్విదంబ్రహ్మ। ఈ శావాస్య మిదం సర్వం। సర్వం హ్యేత ద్బ్రహ్మ." ఈ మొదలగు మంత్రములవలన పరబ్రహ్మ తత్త్వము ఒక్కటే యని ఉద్ఘాటింపబడుచున్నది. నిర్గుణ తత్త్వము మాయాశబలితమై సగుణము కాగా ఆ సగుణ బ్రహ్మము వల్ల ఈ సృష్టి కార్యమంతయు కలిగినది. అని ఉపనిషన్మతము. ఆ సగుణబ్రహ్మనే వ్యాస భగవానుడు శివపురాణములో శివునిగను, విష్ణు పురాణములో విష్ణువుగను, శక్తి పురాణములో శక్తి గను, గణపతి పురాణములో గణపతిగను వర్ణించెను. ఇట్లేందుకు వర్ణించె ననగా వివిధ జీవుల యభిరుచివై చిత్ర్యమును బట్టి అందరిని తరింప చేయవలెనను మహ దాశయముతో అట్లు వర్ణించినాడు. కాని పరస్పరద్వేషముల కలిగింప వలెనని కాదు. ఆ సగుణ బ్రహ్మతత్త్వమైన భగవంతుని కేవలము శివునిగ వర్ణించినచో కొందరికి రుచింపక పోవచ్చును. విష్ణువుగ వర్ణించుచో మఱికొంద రికి రుచింపక పోవచ్చును. ఇట్లు ఏ ఒక్క స్వరూప ముగా వర్ణించినను మిగిలిన యభిరుచులు కలవారికి రుచింపదు. కొందరికి ఈ పురుషాకారము కాక లోకమాతృ స్వరూపముగా ధ్యానించిన హృదయము త్వరలో ద్రవించును. ఇట్లు "రుచీనాం వైచిత్ర్యాత్" అనగా అభిరుచులు వైచిత్ర్యమును బట్టి ఏ జీవునకు ఏ రూపమునందు హృదయము లగ్నమగునో ఆ రూపమునే ధ్యానించిన తరించుటకవకాశము కలుగును. ఉపని షన్మత ప్రకారము భగవంతుడొక్కడే, ఆభగవంతునే కొందరు శివుడనియు, కొందరు విష్ణువనియు, కొందరు గణపతి యనియు, మరికొందరు శక్తియనియు ఈవిధ ముగ తమతమ యభిరుచుల ననుసరించి నానావిధ నామ రూపములతో భజించుచున్నారు. ఇట్లు ఆయా నామముల లోను, రూపములలోను, భేదమేలేని భగవత్తత్త్వములో ఎట్టిభేదము లేక ఏకమై అయ్యది భాసించుచున్నది. ఇట్టి బేదబుద్ధి కలుగకుండుటకై శ్రీ శంకరభగవత్పాదులవారు గాణాపత్యముతో కలిపి షణ్మతముల స్థాపించియున్నారు. ఇంకను వివిధ మూర్తులను కలిపి పంచాయతనముగా దేవతార్చనను స్మార్త సాంప్రదాయము ననుసరించువార లకు నిర్ణయించిరి. వేదమే జీవులందరిని తరింపచేయు తలంపుతో ఆయామూర్తులను అక్కడక్కడ భగవంతునిగా వర్ణించి యున్నది. దీనినిబట్టియే వ్యాసపురాణ రచనము కూడ నేర్పడినది. కనుక గణపతిని గురించి ఉపనిషత్తు లోను, వేదపూర్వ భాగములోను, పురాణములయందును, శంకరాది మహాపురుషుల రచనల యందును, పై చెప్పిన విధమున భగవత్తత్త్వముగా వర్ణించుటలో నీవిధముగ నుపపత్తికలదు. ఇంతయేల? గణేశ గీతయందు గణేశుడే

"శివే విష్ణౌ చ శక్తౌచ సూర్యే మయి నరాధిప।
యాఽభేదబుద్ధిర్యోగస్సః సమ్యగ్యోగో మతోమమ॥"

అని బోధించి యున్నాడు.

కనుక గణపతి దేవునిగురించి శివాదీతర దేవతలకంటె తక్కువ యని భేదబుద్ధి లేక ఆ గణపతి తత్త్వము వేదప్రోక్తమై, ఉపనిషత్ప్రతిపాదితమై పురాణోపబృం హితమై మహాపురుషస్తుత్యమై విరాజిల్లుచున్న కేవల భగవత్తత్త్వమే కాని అన్యముకాదను దృఢవిశ్వాసముతో నందరు ఆ మూర్తిని ధ్యానించి తరించెదరుగాత.

ఇత్యేషా నారాయణ స్మృతిః.

# మహా శివరాత్రి - శివక్షేత్రములు

ఓరుగంటి వేంకటకృష్ణయ్య (సంపాదకుడు)

శ్లో॥ చైతన్యం పరిపూర్ణ మేకమచలం జ్యోతిర్మయం వ్యాపకం
తత్పంచాక్షర మంత్రమాద్యమమలం సూక్ష్మాతి సూక్ష్మం పరం
లింగం బ్రహ్మ సనాతనం సుమనసా ధ్యాతవ్యరూపం సదా
బాహ్యాభ్యం తరసంస్థితం పరశివం ప్రాణేశ్వరం భావయేత్.

శివక్షేత్రము లన్నింటియందు బ్రహ్మోత్సవము తరువాత ప్రముఖమైన యుత్సవము శివరాత్రియే. ఈ శివరాత్రికథ యేమనగా బ్రహ్మవిష్ణువులలో నెవరధికులని వారిలో తగవు వచ్చెను. వారు తగవులాడుచుండఁగా నిద్దరి యెదుట దుస్సహకాంతితో నొకలింగాకారతేజస్సు కనవచ్చెను. దానికొనలు చూచివచ్చినవారధికులని వారు అప్రయత్నము చేసిరి. ఆ తేజస్సు కనవచ్చిన దినము కుంభమాసములో శివరాత్రి. ఆ కాలము నిశీథము, 'లింగోద్భవకాల' మని అప్పటిపూజ లధికఫలదాయకము లని భక్తుల విశ్వాసము.

ప్రాచీనకాలమునఁ బండితత్రయమని పేరుగాంచిన శివభక్తుల ప్రచారముచేత వైదిక శైవమతము (బసవేశ్వరుని లింగాయతమతము కాదు) మన త్రిలింగదేశమున నెంతో వ్యాప్తిలో నుండినది. బసవేశ్వరునికి వేదప్రామాణ్యము నందు నమ్మకము లేదు. వర్ణాశ్రమాచారములు కూడనివనియు భక్తి యొక్కటియే గణ్యమని యాయన తలంపు. పండితత్రయము వేదానుయాయులు. వర్ణము మీద వలపు కలదు. వైదిక శైవముతోఁ బాటు పెక్కు శైవక్షేత్రములు జనానురాగమును గాంచినవి. రెండు నదులు కలసినచోటున నెల్ల 'సంగమేశ్వరుఁ' డుండవలెనుగదా.

అన్ని శివక్షేత్రములందును ప్రాచీనకాలమునుండి ప్రసిద్ధికెక్కినవి ద్వాదశజ్యోతిర్లింగములు, పంచభూత లింగములు, పంచారామములు.

ద్వాదశ జ్యోతిర్లింగములను ఆదిశంకరులు స్తోత్రము చేసినారు. ఆస్తోత్రము 'ద్వాదశజ్యోతిర్లింగస్తోత్ర' మని యెంతో ప్రఖ్యాతికి వచ్చినది. ద్వాదశజ్యోతిర్లింగములలో ఆంధ్రదేశమున రెండున్నవి. ప్రథమము శ్రీశైలము:— 'శివానందలహరి' లో శంకరులు రెండుశ్లోకములలో దీనిని కీర్తించియున్నారు. 'సేవే శ్రీగిరి మల్లికార్జున మహాలింగం శివాలింగితమ్' అని ప్రతియొక్కనినోట నాడుచునేయుండునుగదా. ఈక్షేత్రము కర్నూలుజిల్లా నందికొట్కూరు తాలుకాలో నంద్యాలస్టేషను కీశాన్యమున దాదాపరువదిమైళ్ల దూరములో నల్లమలకొండలమధ్య కృష్ణ చెంతనే పర్వతపీఠికపై నున్నది. ఈక్షేత్రము లింగాయతులకుఁగూడ చాలముఖ్యము. ఇందు 'మల్లికార్జునుని' పూజారి జంగమయ్య. దేవి భ్రమరాంబిక పూజారి బ్రాహ్మణుఁడు. 'శ్రీశైలశిఖరం దృష్ట్వా పునర్జన్మ న విద్యతే' యని ప్రఖ్యాతి. మామూలుదినములలో నిక్కడ ఆటవికులైన చెంచులు పూజారు లుందురు. ఉత్సవమునకు వేలజనులు కొండలలో అడవులలో సకలకష్టముల కోర్చి వత్తురు. ఆంధ్ర కర్ణాటక ద్రావిడ మహారాష్ట్ర శైవజన సమ్మేళనము కన్నులపండువుగా నుండును. రెండవది, ద్రాక్షారామభీమేశుఁడు. ద్రాక్షారామము తూర్పుగోదావరి జిల్లా రామచంద్రపురం తాలూకాయం దున్నది.

శ్రీనాథుని 'దక్షారామపురీవిహారవర....' యాన్దలమునకు సంబంధించినదే. అతిప్రాచీనక్షేత్రము. 'గాథాసప్తశతి' కర్త హాలునికిని సింహళరాజకన్య లీలావతికిని ఇక్కడనే పెండ్లి జరిగినదట. దేవాలయనిర్మాతలు పూర్వ చాళుక్యులు. అనాటిమొద లీనాటివరకు పావనక్షేత్రమే. విద్యానాథుని ప్రతాపరుద్రీయములో త్రిలింగములని పేర్కొన్న ద్రాక్షారామేశు డీయనయే అట. దీని అసలు పేరు దక్షారామమే వాడుకలో ద్రాక్షారామమయినది. ఇక్కడ ద్రాక్షలు లేవు. నైజాముదేశములో నింకొక దక్షారామ మున్నదందురు. అక్కడ నున్న వేమో? ఈక్షేత్రము పంచారామములలో నొక్కటియట.

'ఆరామము' లన్న పేరునుబట్టి వెంటనే కొందరు ఇవి మొదట బౌద్ధారామములని వీరావేశముతో శైవులు వీనిని శివక్షేత్రములుగ జేసినారని మొదలు పెట్టుదురు. మన శాస్త్రములో తపస్సునకు సరిత్తట తీర్థ ఆశ్రమ శైలారామములు అనుకూలములందురు. పురాణ పరికీర్తితములైన యీ క్షేత్రములు బౌద్ధము లట.

పంచారామముల ప్రస్తావము స్కాంద పురాణములో కలదు. తారకాసురునిమెడలో నొకస్వయంభువు అమృతలింగ మొకటి యుండినదట. కుమారస్వామి ఆ లింగమును భేదించినదనుక తారకుఁడు చావలేదు. లింగ

శకలము లయిదు నయిదు క్షేత్రములందుఁ బడినవి. అవి యెల్ల నారామము లయినవి. అందు మొదటిది ద్వాదశ జ్యోతిర్లింగములందును కీర్తింపబడిన దాక్షారామము.

రెండవది క్షీరారామము. దీనికి లౌకికనామము పాలకొల్లు. ఇక్కడను దేవుని పేరు భీమేశ్వరుడే. పాలకొల్లు పడమటిగోదావరిజిల్లా నరసాపూరు తాలుకా యందున్నది. ప్రాచీనక్షేత్రము. చాళుక్యులప్రతిష్ఠయే. శాసనము లెన్నో ఈ దేవాలయమున దొరికినవి. రాజమహేంద్రవర నగర రాజులు కోనవంశహైహయులు దీనికి పోషకులు.

మూడవది. భీమారామము. దీనినే గుణుపూడి భీమవరము అందురు. ఇది పడమటిగోదావరిజిల్లా భీమవరము తాలుకాయం దున్నది.

నాల్గవది. సామర్లకోట దగ్గరి కుమారారామము. ఇక్కడ దేవుని సోమేశ్వరు డందురు.

అయిదవది. అమరారామము. దీనినే అమరావతి యందురు. కృష్ణాతీరమున గుంటూరు జిల్లాయందు గుంటూరునకు ముప్పదిమైళ్ళ దూరములో నున్నది. ఇది పురాతనస్థలమే. దీనికి దగ్గరనే మొదటి యాంధ్రరాజధాని యగు ధాన్యకటకము (ధరణికోట) బౌద్ధులకాలమునాటి అమరావతీస్తూపము చెంతనే యున్నది. శైవులు దీని విడియగొట్టలేదఁటగాని అమరారామమును శైవదేవాలయముగ జేసినారనుట యెంత హాస్యాస్పదమో. రెండుశతాబ్దులక్రింద వాసిరెడ్డి శ్రీవేంకటాద్రిప్రభువు ఈయమరావతిని తన రాజధానిని చేసికొన్నాడు. కోవెలను చక్కగ దీర్చినాడు. అయన నూటయెనిమిది శివాలయముల గట్టించిన గొప్పదొర. వారి యాస్థానములలోనే బులుసుపాపయారాధ్యులవారుండి అధునిక పోతనవలె వాసి కెక్కినారు.

మన దేశమే త్రిలింగము కదా. అనఁగా నిది మూడు లింగముల మధ్యనుండుచోటఁట. ఆ మూడు లింగములు నైజాము దేశములలోని వని కొందఱందురు. శ్రీ శైలము (మంథెన) కాళేశ్వరము. (వేములవాడ) భీమేశ్వరములని కొందరు. కాదు శ్రీశైలము. దాక్షారామ భీమేశ్వరలింగము శ్రీకాళహస్తీ శ్వరలింగము లని యింకొందఱు. ఇప్పటి కాలమునకు దగినట్లు మేమవి శ్రీశైల శ్రీకాళహస్తీశ్వర శ్రీముఖలింగేశ్వరులని యందుము. మొత్తము మీద త్రిలింగదేశము ముక్కోణాకృతినే తనరియున్నది.

పంచభూతలింగములలో శ్రీ కాళహస్తీశ్వరలింగము ఒక్కటియే ఆంధ్రదేశమునం దున్నది. శివుఁడు పంచ మహాభూతములరూపమున (భూమిజలతేజోవాయు అకాశములు) నొక్కొకచోట స్వయంవ్యక్త మయ్యెనట. శ్రీ కాళహస్తియం దాయనరూపము వాయులింగము; వాయువుగ గర్భగృహమునందిరువైపులనున్న రెండుదీపములను సతతమాడించుచునేయుండును. శ్రీ కాళహస్తికథ కన్నప్ప కథ తెలియనివారుండరు. ఒకపాము, ఒకసాలీడు ఒకయేనుఁగు అడవిలో వ్యక్తమైయున్న లింగమును సేవించి తమపేరుల శ్రీ (సాలీడు) - కాళ (పాము) - హస్తి అని యీశ్వరుని కిచ్చినవి. కన్నప్పనాయనా రైనాఁడు. ఆయనకథ నీమధ్య సినిమాలోగూడ వెలసినది. ధూర్జటి 'కాళహస్తిమహాత్మ్యమును' 'కాళహస్తీశ్వరశతకమును' వ్రాసినవాఁడు.

ఈ క్షేత్రము లన్నియుఁ బురాణప్రసిద్ధములే. కొన్ని క్షేత్రములకు ఇటీవల భక్తులవలననే మిక్కిలి ఖ్యాతివచ్చినది. అట్టివి 'ఆచంట' 'కోటప్పకొండ' గుంటూరుజిల్లా నరసారావుపేట తాలూకా; ఈ దేవునికిఁ ద్రికోటీశ్వరుఁ డని పేరు. బ్రహ్మవిష్ణుశివులు మూడుకొండలపై నావిర్భవించి యుండుటచే నీచోటుకు 'త్రికూటాద్రి' యనిపేరు. ఇక్కడ దేవేరి లేని దేవర 'దక్షిణామూర్తి' యున్నాడు. ఇక్కడ పేదభక్తులకథలే ముఖ్యము. లింగబలిజసాలంకయ్య ఒకాయన ఈయనపేరున స్వామిని సాలంకీశ్వరుఁ డన్నారు. గొల్లభామ పెద్దభక్తురాలు. పేరులేని పెద్ద మాను' గాలివానలో పడిపోగా దానిలోనుండి నెత్తురు కారినదఁట. ఆ చెట్టుకూడఁ ఒకభక్తునిరూప మేమో! కోటప్పకొండ ప్రభలు చాల ప్రసిద్ధము.

'ఆచంట'కథ ఇంకను ఒకచిత్రము. అజ్జరపుపేరయలింగకవి 'ఒడయనంబి విలాసము'లో యీ యుదంతము వ్రాసియున్నాఁడు ఒడయనంబి అరవశివబ్రాహ్మణుడు. అయన పడమటిగోదావరిజిల్లా భీమవరము తాలూకా నీ గ్రామమునకు వచ్చి స్థిరనివాసము నేర్పరచుకొన్నాడు. ఒకదినము—ఆనాఁడు—తన వారకాంత—పరమనాచితో క్రీడించినాఁడు. అర్ధరాత్రమున మెలకువవచ్చినది. తాను పూజించులింగము వంటియింటిలో దేవతార్చనలో నున్నది. నాచి పైట తొలఁగి వక్షోజము కనబడుచుండఁగా అది లింగాకారమే యని దానియందే శివు నావాహనము చేసి పూజ మొదలుపెట్టగా ఆమె మేలుకాంచి 'స్వామీ యిది యేమి', టన్నది. 'శివుఁ డిందు లేఁడా'యని నంబి యన్నాఁడు. ఆమెకోరికపై ఆ'చంట'నే శివుని సాక్షాత్కారముచేసికొన్నాడు. ఆనాడు మొదలు మున్పటి 'మార్తాండపురము' 'ఆచంట'యయినది.

'నారుద్రో రుద్ర మర్చయే'త్.

---

# భారతీయప్రభుత్వము - దేవాలయతత్త్వము

'తర్క వేదాంత విశారద' ముదికొండ వేంకటరామశాస్త్రి

శ్రీమద్భారతీయప్రభుత్వమునకు దేవాలయములకు ననాదికాలమునుండియుగాఢమగుసంబంధముగలిగియుండుట సర్వలోకవిదితము.

సకలలోకకళ్యాణకరములకు నాయావిశేషముల వెలువరించుటకే నేడు మన ప్రభుత్వమువారీ "ఆరాధన" యనెడి పత్రికారాజమును బ్రతిష్ఠించిరి.

భారతభూమినిపరిపాలించునట్టి స్వతంత్రప్రభువులు, సామంతప్రభువులు, సంపన్నగృహస్థులు యధావిభవముగా ప్రతిపట్టణమున ప్రతిగ్రామమున స్వస్వాభీష్ట దేవమందిరనిర్మాణములను, తత్తద్దేవతాకైంకర్యములను పెంపొందించి వాటినే తమప్రభుత్వమునకు, తమజీవితమునకు ముఖ్యకర్తవ్యములుగను, భారతీయప్రభుత్వమునకా దేవాలయములే ప్రధానాంగములుగనెంచి యట్లే చరించిరి.

అందుకు నిదర్శనములుగ నాసేతుశీతాచలభారతభూమిలో నాయామహానుభావులచే నిజమందిరసహస్రగుణాధికసౌష్టవములతో నిర్మితములైనట్టి యమూల్యాత్యద్భుత వివిధదేవమందిరములు, శ్రుతిస్మృతీతిహాసపురాణాగమ తంత్రాది వివిధప్రబంధములు, తామ్రశిలాదిశాసనములు, ఆచంద్రతారార్కముగ తత్తద్దేవతాయత్తీకృతములై వివిధ రాజోపచారపర్యాప్తములగు స్వర్గశకములవంటి జమీలు, అగ్రహారములు, ఇంద్రికలు, ఈనాములు, అనేకదివ్యాభరణములు మున్నగునవి గానుపించుచున్నవి.

కామ్యఫలార్థులగు ప్రభువులు గృహస్థులు మాత్రమేగాక గాఢవైరాగ్యభాగ్యముతో దృణీకృతబ్రహ్మపురందరులైనట్టి యంతర్ముఖులగు గౌతమభరద్వాజవసిష్ఠాగస్త్యాది మహర్షులు, సర్వకర్మసన్యాసమొనర్చినట్టి బ్రహ్మణ్యులగు శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యవర్య జగద్గురు శ్రీశంకరరామానుజాది వివిధవైదికమతసాంప్రదాయప్రవర్తకాచార్యవర్యులు, తుదకు సాక్షాద్భగవదవతార మూర్తులుగ సర్వసంప్రతిపన్నులగు శ్రీరామకృష్ణాదులు గూడ దేవాలయనిర్మాణములను దేవతాసపర్యలను భారతభూమిలో నాటినుండి నేటివరకు అవిచ్ఛిన్నముగ నడిపింప జేసిన సందర్భమును దూరదృష్టితో బాగుగపరికించినచో నాధ్యాత్మికసంపత్ప్రదానమగుటచే నిఖిలప్రపంచ ప్రశాంతి ప్రదానసమర్థమగు భారతీయప్రభుత్వమునకు దేవమందిరములు ప్రధానాంగములా? లేక తత్తద్దేవాలయ దివ్యసామ్రాజ్యమునకు భారతీయప్రభుత్వమే యంగభూతమా? యని శంకింపదగియున్నది.

అట్లు శంకింపనేల! వినుడు—దేవతాసామ్రాజ్యమునకంగమే భారతీయప్రభుత్వ మనుటనిక్కము. కారణమేమి యన్న భారతభూమిలోని వివిధప్రాంతీయప్రజలకు తత్తత్ప్రాంతీయ దేశీయప్రభువులు వేరువేరుగ నుండినను యావద్భారతీయప్రజలకు తత్తద్దేవతామూర్తులు సమాన స్వామ్యము కలిగియుండిరి. తరతరములు గడచినను, తత్తత్ప్రభువులు తదీయవైభవములు తారుమారులైనను, భారతీయదేవతాసామ్రాజ్యము మాత్రము చెక్కుచెదరదు. ఆసామ్రాజ్య మాధ్యాత్మికమగుటచే బాహ్యవైభవము లకించిత్కరములు. భారతీయప్రభువుల నెరుగని ప్రజలుందురు గాని యాసేతుశీతాచలస్థ వివిధదేవతామూర్తుల నెరుగని భారతీయులుండరు. గావున దేవతాప్రభుత్వమే భారతీయులదిగాని మానవప్రభుత్వముగాదు. ప్రజలకు ప్రభువులకుగూడ ప్రభువులు దేవతలే. దేవతానుగ్రహపాత్రులగు ప్రభువులే ప్రజాపరిపాలకులగుదురు. దేవతాసామ్రాజ్యమునకంగమే భారతీయప్రభుత్వము.

భారతభూమికి దక్షిణధ్రువముగానున్న యనంతపద్మనాభస్వామి, ఉత్తరధ్రువముగానున్న బదరీనారాయణస్వామి, తూర్పునసముద్రమునందున్న జగన్నాథుడు, పశ్చిమసముద్రముననున్న ద్వారకాపతియు సర్వభారతీయులకు సమానప్రభువులేగదా? తత్తద్దేవతాప్రాంత దేశీయప్రభువులన్ననో! తత్తద్దేవతా కింకరత్వమూనినట్టి ట్రస్టీలవలె వారి వారి జీవితములనెల్ల నాయాదేవతాసపర్యలతో తత్తత్ప్రజానీకములను తత్తద్దేశములను సురక్షితములగను సుభిక్షములుగను పరిపాలించి తాము కృతకృత్యతనొందుచుంటిమని దలంచుచుండిరేగాని యాయాదేవతలకు తామే ప్రభువులమని దలంచుటలేదు. ఇట్లే కాశిలో విశ్వనాథుడు, రామేశ్వరములో రామలింగేశ్వరుడు, శ్రీశైలములో మల్లికార్జునుడు, గోకర్ణములో మహాబలేశ్వరుడు, శేషాచలములో వేంకటనాథుడు, ఆయాదివ్యక్షేత్రములలో మహాకాళేశ్వరుడు, సోమనాథుడు, అష్టాదశశక్తి పీఠములు, పంచమహాభూత లింగములు, వేదాద్రిసింహాద్ర్యహోబిలాదులలో వివిధ నారసింహమూర్తులు, ప్రతిగ్రామమున గ్రామదేవతలు, హనుమానులు, వైష్ణవ శైవ శాక్త గాణాపత్యాది వివిధదేవతా సాన్నిధ్యములు, ప్రతిగృహమున గృహదేవ

తలు, ఇట్లెన్ని క్షేత్రములను తీర్థములను పేర్కొనగలము? అనంతరూపములుగ యావద్భారతభూమిలో నడుగడుగున వెలుగొందు వివిధదేవతామూర్తులదే భారతీయ సామ్రాజ్యమనియు, తదంగముగ తదనుగ్రహసంపాదన ద్వారా సకలలోకకల్యాణార్థమె యనాదికాలమునుండి నేటివరకు భారతీయప్రజలకు ప్రభువులకు సంబంధించినట్టి దేవతాప్రభుత్వము భారతభూమిలో సర్వానందకందముగ నడచుచున్నదనియు చెప్పదగియున్నది.

అయితే - దేవాలయములు ప్రజలకు ప్రభువులకు నొకవిధముగ విశ్రాంతిస్థానములనియో? విలాసస్థానములనియో? మూఢవిశ్వాసస్థానములనియో? అంధపరంపరాగతములగుటచే గతానుగతికములనియో? అనిన సరిపోవుచుండగా ప్రభుత్వాంగము లనుటకు కారణమెద్ది? దేవాలయములు లేనిచో భారతీయప్రభుత్వము నడువదా? బాలబాలికాపాఠశాలోపయుక్తములగునను దృష్టితోనో, గ్రంథపఠనాలయస్థానము లగునను దృష్టితోనో, పాంథావాసస్థానము లగుననుదృష్టితోనో, ప్రభుత్వకోశాభివృద్ధికి కించిదుపయుక్తము లగుననుదృష్టితోనో, మరొకదృష్టితోనో ఒకవిధముగ ప్రభుత్వమునకు దేవమందిరములు సామాన్యాంగము లనదగునేమోగాని ప్రధానాంగములెట్లగును? ప్రభుత్వాంగత్వమె సందిగ్ధమగుచుండ దేవాలయ సామ్రాజ్యమునకే ప్రభుత్వమంగమనెడి సాహసోక్తికి మూలమెద్ది? దేవతాసామ్రాజ్యమనగా—అందరుదేవతలకు కలసి యొకటేసామ్రాజ్యమనియా? అట్లైనచో శివవిష్ణ్వాది వివిధవిరుద్ధదేవతల కొక్కటేసామ్రాజ్య మెట్లు పొసగును? వివిధదేవతలకు వివిధసామ్రాజ్యములైనచో భారతీయ ప్రభుత్వమేదేవతాసామ్రాజ్యమున కంగమగును? అందరుదేవతలలో నొకేదేవతకు సామ్రాజ్యమన్నచో అందేదేవునిది సామ్రాజ్యము? అందుకు కారణమెద్ది? ఈ చిక్కులను తట్టుకొనలేక ఒకేదేవుడనెడి మతముగాని, ఏపీడలేకుండుటకు దేవుడెక్కడనెడి శూన్యవాదమునుగాని యాశ్రయించుటే యీబహునాయకత్వముగల భారతీయ వివిధదేవతా సామ్రాజ్యముకన్న సమంజసముగ నున్నదిగదా అట్లొప్పిన బాధకమేమి? ఇదిగాక అసలీదెవాలయములు దేవతలు వీటినిగురించి నవీనములగు తంత్రాగమాదిగ్రంథములే ప్రమాణములా? ప్రాచీనములగు వేదములలో వీటివార్త యేమైన కలదా? ఇత్యాది వివిధాశంకలను దొలగించుకొనుటకు మున్ముందు భారతీయప్రభుత్వమును గురించియు, దేవాలయతత్త్వమును గురించియు విచారింపవలసియుండును.

ఆవిచారములో 1 భారతప్రభుత్వమునకు అనాదికాలమునుండిగల యనన్యసామాన్యములగు విలక్షణవైజ్ఞానిక శక్తివిశేషములు, 2 భారతీయేతరప్రభుత్వములలోని ఏకదెవాశ్రయణ శూన్యవాదాశ్రయణములకన్న భారతీయుల వివిధదేవతాశ్రయణములోని మహోన్నతసమరస విజ్ఞానరహస్యము, 3 వివిధ దెవతలను, వివిధవర్ణాశ్రమాచారములను, వివిధమతసంప్రదాయములను, అనుసరించెడి భారతీయప్రజలకుగల అనన్యసామాన్యములగు పరస్పరాంగాంగిభావసంబంధము, సహజ సర్వమానవ సోదరభావము, సర్వమత సామరస్యరహస్యము. 4. భారతీయుల వేదములకు స్మృతీతిహాసపురాణాగమాదులకు గల పరస్పరసంబంధావశ్యకత్వములు, 5. భారతీయ దివ్యప్రభుత్వమునకు మాత్రమే నిఖిలప్రపంచ ప్రశాంతిభిక్షాప్రదానసామర్థ్యము, 6, ప్రభుత్వాధికారులలో నెవరికి విజ్ఞాపనమొనర్చినను "ఆరాధన"కు యని పేర్కొనుటలోగల భారతీయప్రభుత్వదేవరహస్యము వంటిన్నగు విశేషములన్నియు నీ "ఆరాధన" లో మున్ముందు విశదీకరింపబడగలవు.

---

ఓం. భద్రం కర్ణేభిః శృణుయామ దేవాః ।
భద్రం పశ్యేమాక్ష భిర్యజత్రాః ।
స్థిరై రంగైస్తుష్టు వాగ్ంస స్తనూభిః
వ్యశేమ దేవహితం యదాయుః ॥
స్వస్తిన ఇంద్రోవృద్ధశ్రవాః
స్వస్తినః పూషా విశ్వవేదాః
స్వస్తినస్తార్క్ష్యో అరిష్టనేమిః
స్వస్తినో బృహస్పతిర్దధాతు ॥
ఓం శాంతిశ్శాంతిశ్శాంతిః ।

# సుప్రభేదాగమ సంహిత

*అథ సంకల్పః.

తతః శివస్య ప్రతిష్ఠోత్సవవిధిం వ్యాఖ్యాస్యామః। ఆచార్యః నిత్యకర్మ నిర్వర్త్య శుభదినే శుభముహూర్తే అస్త్రరాజ యజమానపురస్సరేణాచార్యః భస్మచందనతాంబూలసహిరణ్యకుసుమాక్షతపాత్రం గృహీత్వా యాగమంటపం త్రిః ప్రదక్షిణీకృత్య ప్రత్యగ్ద్వారేణాంతః ప్రవిశ్య అస్త్రరాజం అంతః వేదీమధ్యప్రదేశే ఆసీనం కృత్వా తత్పూర్వే సాధకః పూర్వాసీతభస్మ చందనాదిపాత్రం సంగృహ్య,

"అస్మిన్ గ్రామే కృతవసతి బ్రాహ్మణానాం వేదవేదాంగాది సమస్తవిద్యాసమేత సంయతౌపాసనాగ్నిహోత్రయాగక్రియా సత్క్రియాయాగఫలసిద్ధ్యర్థం గావోఽపి వత్సరక్షణానంతరాపరిమితామృతప్రదానసమస్తజనసంతోషకరణార్థం తపస్విజనానాం పంచేంద్రియాభిజయార్థం శివధర్మపరాయణానాం నిర్విఘ్నశివపూజాఫలసిద్ధ్యర్థం రాజ్ఞాం కనకమణిమకుటకోటీరతారకేయూరబద్ధ దుకూలపట్టదేవ్యంగప్రధానహస్త్యశ్వరథాది వివిధైశ్వర్య దిగ్విజయలక్ష్మీనివాససిద్ధ్యర్థంలోకే పరచక్రభయనివారణార్థం సకల భూపతీనాం యథాన్యాయ పరిపాలనార్థం సకలప్రాణి కులాధారవర్షసమృద్ధ్యర్థం సకలప్రాణిహితసమయవాయుసంచరణార్థం అస్మిన్ రాష్ట్రే అస్మిన్ దేశే అస్మిన్ గ్రామే క్షేమ డాంబర మహామారీప్రవేశ అగ్నిభయ జ్వర జారచోరాది సమస్తపీడాపరిహరణార్థం నిజకులాచారానుష్ఠాన తాత్పర్య పుత్రమిత్రకళత్ర దాసదాసీ జనసహిత విమలవిజ్ఞాన నానావిధ సౌఖ్యానుభవసిద్ధ్యర్థం త్రిగుణీకృతాగ్ని ష్టోమాతిరాత్ర అప్తోర్యామవాజపేయ పౌండరీకాది శతక్రతూనాం సంపూర్ణసకలఫలావాప్త్యర్థం హరస్య సాలోక్య సామీప్య సారూప్య సాయుజ్య పదప్రాప్త్యర్థం సకలసమృద్ధ్యర్థం సకలకళ్యాణ సమృద్ధ్యర్థం నృత్తమంటపాద్యాలయశుద్ధ్యర్థం పూజాద్రవ్యోపకరణశుద్ధ్యర్థం మయా కృతేన విఘ్నేశ్వరార్చన పూర్వక పుణ్యాహవాచన ఆచార్యబ్రాహ్మణ ఋత్విగ్వరణ కంకణధారణఖండస్థాపన శాలావిహరణాస్త్ర పూజా వాస్తుపూజా వాస్తుహోమ వాస్తుబలి పర్యగ్నికరణ అంకురారోపణ కలశస్థాపన భేరీపూజా భేరీతాడన ధ్వజారోహణ అగ్ని ప్రతిష్ఠాపన నిత్యబలి ప్రదాన కళ్యాణమహోత్సవ మృగయాయాత్రావిధాన ధాన్యకుట్టన తైలాభ్యంజన తీర్థావగాహన వసంతోత్సవ సుగంధద్రవ్యానందోత్సవ చూర్ణోత్సవ చండయాగోత్స వాఖ్యైః కర్మభిః సగ్ంస్కరిష్యమాణః తదంగత్వేన తదాదౌ శుద్ధ్యర్థం వృద్ధ్యర్థం అభ్యుదయార్థం మహాజనైస్సహ స్వస్తిపుణ్యాహవాచనం కరిష్యే ॥

---

*ఈ సంకల్పముచుబట్టి దేవాలయ ప్రతిష్ఠార్చనాదులు, కేవలమొక వ్యక్తియొక్క సౌఖ్యమునకు కాదనియు, దేశము ప్రజలు చివరకు పశుసంతతికికూడ ఈతిబాధను పరిహరించి సుఖమును సమకూర్చుటకు చేయు కర్మలని స్పష్టపడుచున్నది.

---

ఓం శం నో మిత్రశ్శం వరుణః శం నో భవత్వర్యమా ।
శం న ఇంద్రో బృహస్పతిః । శం నోవిష్ణురురుక్రమః । నమో బ్రహ్మణే । నమస్తేవాయో
త్వమేవ ప్రత్యక్షంబ్రహ్మాసి । త్వామేవ ప్రత్యక్షం బ్రహ్మ వదిష్యామి । ఋతం
వదిష్యామి । సత్యం వదిష్యామి । తన్మామవతు । తద్వక్తారమవతు । అవతుమామ్ ।
అవతువక్తారమ్ ॥

ఓం శాంతిశ్శాంతిశ్శాంతిః ॥

ఓం నమోబ్రహ్మణే నమోఅస్త్వగ్నయే నమః పృథివ్యైనమ
ఓషధీభ్యః । నమోవాచే నమోవాచస్పతయే నమో విష్ణవే బృహతేకరోమి॥

ఓం శాంతిశ్శాంతిశ్శాంతిః ॥

శ్రీః

# శ్రీ మదభినవగుప్త తంత్రాలోకము

*జమ్ములమడక మాధవరామ శర్మ : గుంటూరు.*

శ్రీమదభినవగుప్తపాదులు సుప్రసిద్ధులయిన మహామహేశ్వరులు. మహాదార్శనికులు. సాహితీ మూర్ధాభిషిక్తులు. అభినవగుప్తు డాలంకారికు డనియె లోకము తెలిసికొన్నది. సాహిత్య శాస్త్రమునందలి రససిద్ధాంతమును అభినవగుప్తుడే స్పష్టము చేసినాడు. ఆ రససిద్ధాంత రీతి యంతయు నాతని దర్శనతత్త్వమునకు సంబంధించియున్నది. అభినవగుప్త దర్శన సిద్ధాంత రహస్యమంతయు నాతడు రచించిన తంత్రగ్రంథములందు గూఢముగా నున్నది. తంత్రగ్రంథ విజ్ఞానమంతయు శ్రీ తంత్రాలోక మను మహాగ్రంథమున విశదముగా నున్నది. ఆ గ్రంథభావము స్పష్టముగా దెలియుట నే డావశ్యకము. తంత్రాలోకము విజ్ఞానసర్వస్వమని చెప్పదగిన యుత్తమ గ్రంథము. అవి దాదాపారువేల శ్లోకములతో నున్నది. ముప్పదియేడాహ్నికములుగా నది విభక్తము. జయరథుడను మహాపండితుడు తంత్రాలోకముపై చక్కని వ్యాఖ్య రచించినాడు. సాహిత్య శాస్త్రమున అలంకార సర్వస్వ మను గ్రంథముపై జయరథుడు "విమర్శిని" యను వ్యాఖ్యానము రచించెను. తంత్రాలోకముపై జయరథుని టీకాచాతుర్య మెన్నదగినది. "తంత్రాలోకమునందున్న విషయమె యితర గ్రంథములందున్నది. ఇతర గ్రంథములందు లేని యంశము తంత్రాలోకమునను న్నది. ఇందు లేని యంశమెందును లేదు." అని తంత్రవిజ్ఞానులభావము. ఆ తంత్రాలోక విజ్ఞానమును క్రమముగా లోకమందుకొనవలెనని దీని నుపక్రమించుచున్నాను.

ప్రత్యభిజ్ఞావాదము, త్రికవాదము, స్పందవాదము, శైవాద్వైతవాదము అను నామములతో అభినవగుప్తాభిమతమయిన దర్శనవాదమును వ్యవహరింపవచ్చును. మానవులందరును తరించుట కిందుపాయములు సాధనములు కలవు. ఎట్టి మానవుడును దర్శనదూరుడు కాడు. సంసార జీవనమునందున్న మానవుడు దేనిని కాని పరిత్యజింపనక్కరలేదు. ఎట్టి యంగరంగ భోగములు కలవాడయినను, ఎంతగా లోకవ్యవహారములందు సంచరించువాడయినను తన తరణోపాయము నిందు గుర్తింప గలడు. అభినవగుప్తుడు తన ప్రతిభాపరాక్రమమున సర్వసమన్వయము నిరూపించినాడు. ఈ విశ్వమంతయు శివమయము. ప్రపంచము నంతను శివస్వరూపముగా భావింపవలెను. ఏ అంశము కాని శివాతిరిక్తముగా లేదు. అంతయు శివస్వరూపము. కాని పరశివుడు కేవలము విశ్వస్వరూపుడే కాడు. విశ్వస్వరూపుడైనను విశ్వోత్తీర్ణుడై శివుడున్నాడు. అందువలననే శివుని విశ్వమయునిగా విశ్వాతీతునిగా భావింపవలెను. అను ఈ తత్త్వము తంత్రాలోక రహస్యము. దీని విస్తరణమే గ్రంథమున నున్నది. ఈ సకల ప్రపంచము శివుని స్పందరూపముగా నున్నది. శివుడు బీజస్వరూపుడు. కొమ్మలు, ఆకులు, పల్లవములు, పుష్పములు, ఫలములు, సర్వము విశ్వము. మహావృక్షము నందేదియు బీజాతిరిక్తము కాదు. అట్టి ఈ విశ్వము ననుసరించి శివానుసంధాన మొనరింపవలెను. అనాసక్తితో ప్రకృతి పదార్థముల నవలంబింపవచ్చును. అనుభవింపవచ్చును. కేవలము భోగాసక్తులై తమ్ము తాము గోతిలో పడద్రోసికొనరాదు. శివాసక్తులై సర్వము సేకరింపవచ్చును. స్వీకరింపవచ్చును. లోకములోని జడపదార్థము చేతనముగా నొనర్చుట దీని తత్త్వము. తుచ్ఛ వస్తువు నతుచ్ఛముగా జేయుట దీని తాత్పర్యము. తుచ్ఛముగాని, అతుచ్ఛము గాని సర్వమ తుచ్ఛమె. శివేతరమగు భావమంతయు నశించిపోవుట దీని భావము. అందువలననే శివేతరక్షతి ప్రయోజనమని భావుకులు భావించినారు.

# KAPOTESWARALAYA OF CHEZERLA

*By*

SRI. N. RAMESAN, M.A., I.A.S.
*(Dt. Collector and Majistrate, Guntur.)*

Temples in our country were not merely places of worship but were the main nerve-centres for the cultural and aesthetic lives and activities of the people. Elaborate rules of temple architecture were laid down and each area developed its won style. Successive *'sthapatis'* added the fruits of their genius to the beauty of the temples and their decorations; and in many cases, the temples became, in a few centuries, standing as it were, testimonies, to the genius of the race that produced them. Often it has happened that a small temple, during the course of centuries acquired not only a hoary tradition and sanctity, but also was enriched by a succession of enlightened kings with *'nrithyasalas'*, *'vimanas'*, *'gopuras'*, *'mantapas'*, *'pushkararanis'* and other accoutrements and became as time went by, a standing example of the artistic evolution of the people of the locality that produced it.

2. Many kings added immense riches to the temples during auspicious moments like *'Ardhōdaya'*, *'Sūrya-Grahōparūgā'*, *'Vishuvat-Sankrūnthi'*, etc., and as a permanent record of their meritorious acts, they have engraved upon stones these gifts that they made to the presiding deity. It is fortunately for the historian, a peculiar trait of our country that our kings were very proud of their lineage and generally added a long list of names of kings, in many cases starting from the Sun and Moon, who preceded them and sang their glories in lovely verses. This *'pracasti'* as it is technically called, is of immense value to work out the geneology of Kings and if we can locate the year of any one king correctly, the chronology also can be correctly fixed. Many astronomical data are susceptible of this fixation and there are many instances where the chronology and also the geneology of kings have been accurately deremined by this method. It was generally believed by all the common visitors of the temples that these stone inscriptions were sacred gift-records and any tampering with them would bring evil; and hence these inscriptions have been carefully preserved over a course of centuries and are as fresh and pristine even now as they were when they were first inscribed. There are inscriptions of as early as the 2nd, 3rd and 4th centuries A. D. in many temples, e. g., the only existing *Vishnukundin* record of *Madhavavarma*, in the Velpuru temple of *Ramalingeswara* in Sattenapalli Taluka, of Guntur district. It is an unfortunate and regrettable factor that in recent years, the sanctity of these inscriptions have been lost sight of and in many cases, due to ignorance, temple authorities are spoiling them by white washing etc.

3. By a careful study of thc temple architecture also, one can determine the forces and the predominant styles that have influenced the evolution of any temple; and this broad general study, can in many cases be either confirmed or corrected by a careful decipherment of the temple paleography. In such a study, it sometimes happens that very valuable historical data, which would be otherwise difficult to obtain, comes out.[1] The Kapoteswara temple at Chezerla, in Narasaraopeta taluka of Guntur district is one such,

1. Photo 1. Photos Page.

and it contains the only existing stone record of the Ānanda Kings of Kandarapura, whose debut into the political history of the Andhra country in the early centuries of the Christian era, is still a matter of historical doubt.

4. Chezerla is situated 14 miles east-north east of Narasaraopeta, a divisional headquarters in Guntur district. This is said to be the spot, according to the '*Sthala-Purana*' where King Sibi (renouned in the Mahabharata) sacrificed his own flesh, which he cut off from his body, as an offering to a vulture which was pursuing a pigeon or a '*Kapotha*', and which had taken refuge under the king. The deity is therefore called '*Kapotheswara*'. This story is not only renouned in Hindu Mythology but also in the Buddhist Jataka tales, which tell the lives of Siddhartha-the Buddha in his previous lives. 'Sibi Jātaka', is as hoary and sacred to the Buddhist as an embodiment of '*Saranāgata-vatsala*', as 'Sibi Chakravarthi' is to the Hindu, as a supreme symbol of "Rāja-Dharma", which enjoins a king to protect any refugee even at the cost of his own flesh. This is probably the only temple in the whole of India dedicated to 'Kapotheswara'. The temple therefore must have come into existense round about the 3rd century A.D., where Buddhism and Hinduism flourished side by side in Andhra with mutual tolerance. There are three caves in the rock and this probably indicates the early cave-origin of the temple; which style found eloquent expression, late under the Vishnukundin kings of Andhra desa (420A.D.-620A.D), and had its consummation in the famous Undavalli cave-temples on the southern banks of the river Krishna. The origin of the cave-temples has been ascribed by some scholars to the Pallavas of Kanchi from which, it is stated, it spread to Andhra. But such a renowned scholar as Prof. Dubrevil has come to the conclusion that the Uudavalli temple is of Vishnukundin origin, (mainly relying on the proof of the lion relief in the temple which is a Vishnukundin symbol) and it is more probable that this type of temple was later adopted by the Pallavas, culminating in the famous shore temple of Mamallapuram (Mahabalipuram) by that great Pallava, Mahendravarman, the author of '*Matthha-vilasa-Prahasini.*' In this view, we can conclude that the caves of Chezerla are a still earlier production of the cave-temple style, probably going as far back as 3rd century A,D., and from out of which evolved the Vishnukundin style. The fact that probably the only shrine dedicated to "Sibi", equally famous in Buddhist Jatakas as in Hindu Mythology, exists here, would lend support to this theory that it came into existense somewhere in the 3rd century, A. D., when Hinduism and Buddhism flourished in Andhra in a spirit of tolerance. There was a very old and ancient tree in the temple which was said to have its roots in an unknown subterranean cave. The deity is in *lingakara*. Curiously in the figure of the *Linga*, there are large cavities as if portions have been scooped or cut out, and these are said to be the places of the body from which Sibi cut off his flesh. The "*Aitihya*" of the temple states that the image is that of the 'Kalebara' of Sibi with the head cut off and on top of the *linga* there are two large vertical cavities. In one of these cavities, which incidentally helps to drain off the *Abhisheka Tirtha* to an unknown place, I was informed, even today the smell of raw flesh and blood comes out.

5. The temple is of the greatest importance to us not only from the architechtural point of view as it reflects a peculiar and uncommon style, but also

## VARIOUS PHOTOS OF KAPOTESWARA - TEMPLE

Note Readers are requested to apply and see the photos where reference is made to them in the article



*Temple of Kapoteswara - Chezerla*



*The main apsidal temple is seen in the background and marked X. The structures front are votive temples for Sivalingas. Tradition has it that (Kotilingalu) are representing the crore followers of Sibi.*



*The temple with the small linga temples in foreground*



*A back view of the apsidal temple of Kapoteswara*



*A front side view of the temple.*



*A close up view of the 'Sapthama-thrikas' with a linga temple and the gopura nearby.*



*The entrance to the temple with a gopura and a dwajasthambha. These are definitely of a later origin.*



*The 'Sapthamathrikas' resembling a group at the seven Pagodas; Prof. Longhurst thinks them to be miniature votive shrines of Pallava origin. Better to ascribe it to Vishnukundins.*



*A close up view of the inscribed stone. The script is 6th century Chalukyan characters and the language is Sanskrit.*



*The famous inscribed stone of Ananda Gotra line of Kings. The author has identified this as an inscription of Kubja*



*The slab contining the famous inscription of Ananda Gotra King Satsabhamalla. It is the opinion that it is really an inscription of "Prithvi Yuvaraja" alias Kubja - Vishnu - Vardhana founder of*

from the epigraphical point of view as it contains the only extant inscription of the Ānanda Gōtra kings of Kandarapura. There are many other inscriptions ranging over many centuries in the temple including those of Kākathīyas and Vijayanagar, but most of them are private grants and do not yield any valuable historical data.

6. There are three types of temple architechture, recognised by the 'S'iipa-s'astras'; namely, the 'Nāgara', the 'Vēsara', and the 'Drāvida', and the main distinguishing feature of these is to be seen in the '*Vimana*' or the *shrine*. In the reign of the great medeival Cholas like Rājarāja the great, who were renouned temple-builders, the '*gopura*' attained greater importance than the '*Vimana*' and quite often dominated the entire motif. This was a peculiar development and belonged to that period only, e. g, in the great Brihadees'wara temple of Tanjore. But normally it is the *Vimana* that distinguishes a temple and its style, and the *Vimana* is usually square. or more or less rounded in plan, whereas a *Gopura* is more broad than it is deep. Further it is a popular misconception to think that Hindu temple decorative styles are in any way different or opposed to those of Jain or Buddhist temples. This is an error to which even such an eminent scholar as Fergusson fell a prey. Whatever may be the doctrinal differences either in liturgy or in metaphysics, a temple has always been a place of popular worship and architechturally speaking the same people, whether Buddhists or Hindus, contributed to its grandeur and decorations. The '*Sthapatis*' were actuated by a love of their professional skill and not by any sectarian differences, of their respective religions. Fergusson's separation of Indian Architechture into compartments as Buddhist, Jain and Hindu is essentially unsound as the sculptors and the style in one area were the same, whatever be the faiths of the persons. There is no reason why a Buddhist should not construct and decorate a Hindu temple any more than why a Hindu should not construct or decorate a Jain one. Architechture, which reflects professional skill, is not dependent on the religious faith of the persons. The differences between the existing Buddhist and Hindu temple architechture is thus wholly a difference due to chronology by a lapse of centuries and in any particular era, contemporaneous monuments do not reveal any architechtural differences. This point which is very important is just receiving the proper attention which it deserves, due to the researches of our Indian Archaeologists. This aspect is vividly illustrated in the architechture of Chezerla temple. The three orthodox classification of the style of temple architechture can be broadly called the Northern and the Southern and the latter can be subdivided into the Chalukyan and the Tamil styles. These different styles are distinguished mainly by the '*Vimana*' showing a predominance of the vertical motif to the horizontal one, and by the resemblance of the crown of the *Vimana* to an '*Amalaka*', which are the features of the Northern style, whereas the emphasis is on the 'horizontal' rather than in the 'vertical' in the Southern style, which includes the Chalukyan and Tamil. Among the latter two also the main difference, inter-se, is only in the method of decorative detail. The Tamil style *Vimana* is generally octagonal and has a window ornament in each face whereas in the other style it has it only on alternate faces and in later times the crown becomes square also. So far as Āndhra area goes, there is practically no evidence to show the style of architech-

ture that existed till after the Chālukyan times. The temple of Chezerla is one rare exception and the temple *being an* [1]*Apsidal one*, suggests a style, unique in itself, which has not come down to us in any other form. The temple has a long apsidal shrine, with a barrel vaulted roof and seems also to have a false roof inside supported by stone slabs. [2]The end of the temple takes the form of an apse and in its centre is the white marble Linga.[3] These apsidal temples are built on the Buddhist Chitya Hall pattern and are peculiar to the era in which they were built, The existence of this apsidal type of temple alone is enough to disprove Fergusson's theory of the separate evolution of Buddhist and Hindu temple architechture. Being probably a sole and unique protype not conforming to any type-design, it is invaluable to trace the history of the evolution of temple architecture in Andhra. Prof. Gravely, mentions several other such individual protypes though not of the apsidal type, as the '*Sahadeva*' and '*Draupadi*' '*Rathas*' of Mahabalipuram and the *Durga* temple of Aihole. In my opinion, apart from it's distinctive type, the fact that a temple after S'ibi who is sacred to both Buddhism and Hinduism is built in an unique style conforming both to the Chaitya Hall designs and the S'ilpa S'āstra rules, is proof positive that the temple must have come into existence at a period of mutual tolerance between the two great religions. On these three grounds viz., (*a*) the motif of the temple being common to Hinduism and Buddhism (*b*) the rock caves indicating a fore-runner of the Vishnukundin style of cave temples of the 4th century A.D.; and most important of all, (*c*) the style of temple architechuture not conforming to the orthodox type-designs, but showing a uniqueness, probably deliberate; I place the orign of the temple to that golden age of Andhra tolerance *viz.*, the 3rd century A.D. and prior, when the *Ikshvakus* and their successors ruled, and who showed their religious tolerance by the kings being Hindus and the Queens being devout Buddhists. It is in this that the importance of the Chezerla temple lies.

7. On paleographic grounds also, the Chezerla temple is of very great importance as it contains on a slab set up in front of the central shrine, the only extant stone inscription of the Ānanda Gōtra Kings of Khandarapura. A photo of the inscription in *situ* is published herewith. This inscription has not been fully edited as such and it is a matter of great regret that the inscribed stone which is such a valuable historical record, is exposed to the ravages of wind and sun and is not properly protected.[4] This inscription has been published in South Indian

---

1. The aspīdal plan and barrel-vaulted structure is classified as Hasthiprstha or 'elephant-back' in Vastu Sastra. It was readjusted for the purposes of Hindu worship by the introduction of internal walls so as to seclude the Garbhagriha from the rest or by a flat stone ceiling to exclude the vaulted roof in the brick temple of Kapoteswara at Chejerla (Report of the Southern circle, As I; 1917-18, P 35, PL 18).
P 142 of Hindu temple by Stella Kramreisch

2 No aspidal temple was cut into the rock for Vishnu, Siva, or any Brahmanical form of Divinity.
The aspidal plan was however adjusted to the use of Brahmanical worship in structural temple, such as Kapoteswara temple at Chejerla, and according to the 'Samaranganasutradhara must have been widely used.

3. The Kapota or roll cornice is frequently carved on the facades of rock-cut Chaitya Halls, for instance at Karle. Its outline is that of a quarter circle approximately. The cornice in structural building of stone, serves as a dripstone.

4. Temple is protected under The Ancient Monuments Act and Archaelogical Department, Government of India, is to protect th- ----

Inscriptions Vol. VI, as item 594. I give below the lines that are relevant only.

[1] 1 శ్రీ పిణ్ణీస్వరాయ
2. కాలీస్వరాపరవీర[కే]తోః స్వశక్తిశాతిత—
3. శాత్రవకరివరఘటాసంకటధాన్యకటరణ—
4. సప్తకోటేః ప్రథితాన్పృథివీయువరాజః అ—
5. నన్దకరానన్దమహహిన్ మహాగోత్రవియదమల—
6. సకలతు[హి]నకిరణస్య సమవగాఢాస్థ్రిసున్దరీ—
7. చన్దనాఙ్ఞనాలక్తకలోలమాలాపరిమోషప—
8. రిచయకృతాపరాధవైపుల్యాసితేతరబెణ్ణా—
9. నాథస్య త్రికూటపర్వతపతేర్గోలాంగూలవిజ-
10. యకేతనస్య హాల్లీసకపటుపటహార వ]స
11. మప్యద్యోగస్య కన్దరపురవరజనపదద్వితయా—
12. ధిపతేః కన్దరరాజస్య ప్రియసుతాయామవనీతలా-
13. న్తవత్యాంమ్మహాదేవ్యాం సఞ్జాతస్పద్గురోత్తస్యాస్పంద
14 to 29 ..................................................
30. ష్టుతగుణావాసస్సకలకలావిశారదస[త్స]భామల్లః

8. The inscription purports to be that of '*Satsabhamalla,*' the son of '*Avanitalantavati Mahadevi,*' the daughter of King Kandara of the Ānanda Gōtra. The purport of the grant is not known. We know of the Ānanda Gōtra Kings from two copper plate inscriptions of the dynasty. The first grant is known as the Gorantla grant of *Attıvaran* (Prakrit of *Hastivarman*) edited by Dr. J. F. Fleet in Indian Antiquary IX and the other is the Mattepad grant of King Dāmōdaravarman edited by Dr. Hultzsch in Ep. Ind. Vol. XVII. The Chezerla inscription gives the name of King Kandara and hence we have a geneology of three Kings (1) Kandara (2) Damōdaravarman and (3) Attivarman. Our knowledge of this line of Kings is to be had only from these three grants. After the great S'ātavāhanas, the region south of Krishna, was ruled by the Ikshvāku Kings, whose inscriptions are available in Nāgārjunakonda and Jaggayyapeta. The Ikshvākus were supplanted in power by the Pallavas of Kanchi in early 4th century as is evidenced by the Mayidavolu plates of S'ivaskandavarman. There must have been local resentment at this imposition of a foreign rule and local kings grew up, here and there; to throw off this foreign yoke and the Ananda Kings, as well as *Brahatpalāyana,* were in the vanguard for the struggle for freedom and political ascendancy in Andhradesa. They were succeeded by the Vishnukundins and later by the Chālukyas and in the early 7th century A.D., the lower regions of Krishna was a warring hot-bed between the Chālukyas of Bedami, Pallavas of Kanchi and the Vishnukundin Kings of Andhra. It is with this background of the political histoy of this part of Andhradesa that we must view the work of the Ānanda Kings. The two copper plate inscriptions, on paleographic grounds are anterior at least by 250 years if not more to the Chezerla stone inscription. One scholar has assigned to Dāmōdaravarma a reign from 295-315 A.D. and to Attivarman from 395 to 420 A.D. The Chezerla inscription which is in archaic Telugu script, though the language is Sanskrit, has been assigned by practically all scholars to the beginning of the 7th century A D. The intervening years are still shrouded in mystery and only further evidence can make us give a decided opinion on this subject.

9. The phrase 1 त्रिकूट पर्वत पतेर्गोलांगुल विजय has hitherto been interpreted, by splitting it into two phrases as त्रिकूट पर्वतपते: and गोलांगुलविजयकेतनस्य as referring to two separate adjectives to King Kandara, and interpreting it to read that King Kandara was the Lord of Trikūta Hill and was also having the *Golangula* (a species of monkey with the tail of a cow) as the symbol of his banner. In fact one scholar has identified the Trikuta Hill as

1. The inscription is not clear and so some letters are mispronounced.

Kotappakonda hill of Narasaraopeta. It appears to me that the above phrase is susceptible of another reading. Generally Kings are not referred to as the Lord of Mountains but only Gods. Take for example *Venkatachalapathi* which means the God on top of the Venkata Hill. Similarly *Trikuta Parvatha Pathi* must therefore refer to the presiding deity of the Hill of Trikūta. Further the phrases त्रिकूटपर्वतपते : and गोलांगूलविजयकेतनस्य are connected and the *Golangula Vijaya Kethana* must refer to the *Trikuta Parvatha Pathi* which immediately preceeds it, and the whole phrase can be interpreted as 'The victorious *Golangnla* banner of *Lord Trikuteswara.*' This view is supported by the next word which is *Hallisaka*, which according to Apte means, a kind of dance in rings. The reference is therefore to the dance in rings. The reference is therefore to the dancing (or waving) banner of Lord Trikuteswara and the King is probably making obesiance to it. From a correct and careful reading of the Sanskrit phrase, it looks to me, that it is incorrect to think of King Kandara, as the Lord of *Trikuta parvatha* or that he had *Golangula* symbol in his banner. It is more probable that the King was making obesiance to the dancing *Golangula* banner of *Trikuteswara* God. Unfortunately lines 10 and 11 are badly damaged and the inscription needs more careful scrutiny before a final opinion can be pronounced. In this view, identifying the Ānandas, with the *Golangulas* of Markandeya Purana fails.

10. Similarly the phrase *Kandara Puravara-Janapada-Dvitayadhipatheh* occuring in lines 11 and 12, has been interpreted to mean that King was overlord of two *Janapadas* and scholars have also attempted to locate the two *Janapadas*. If by *Janapada* we mean a kind of council in the accepted sense, the term *Puravara* can also mean an urban council and the word *dvitaya* (two) might refer to the two councils, *Puravara* and *Janapada* (urban and rural). Both *Puravara* and *Janapada* are accepted terms in the terminology of Hindu polity. In this view, which is based on strict grammar, the *dvitaya* does not apply to its immediately preceeding word alone viz., *Janapada* but refers to both the *Puravara* and *Janapada* and hence the phrases only mean the king is the Lord of *both Puravara* and *Janapada* of Kandara. Similarly the epithets कालेश्वर सार वीरकेतो: and स्वशक्ति शातित शात्रव करिवरघटसंकटधान्यकटरण सप्त कोटे; will in the usual course refer only to Prithvi Yuvaraja which immediately follows it and would seem to refer to him and not to King Kandara. This view is hinted at by Dr. D. N. Sirkar also at page 397 of his 'Successors of S'ātavāhanas.' In this view therefore the hero of the *Dhanya Kata Rana Saptha Koti* is Prithvi Yuvaraja and not King Kandara. This is fully suported by the word प्राथितान् which connects सप्तकोटे: and पृथिवी युवराज. This connecting word प्राथितान् which according to Apte (Page 658) means renowned, famous—— etc., clearly shows that Prithvi Yuvaraja was renowned by the exploits mentioned in lines 1 to 4. Also the inscription has been long ascribed to King *Satsabhamalla.* This occurs in line 30 as स( ) भामल्लः The word त्स is inserted in between स and भामल्लः. South Indian Inscriptions Vol. VI. There seems to be no conclusive evidence why the word त्स should be introduced and in any case even the word सत्सभामल्लः looks like an epithet (e.g. सत् सभामल्लः a good debator) rather than a personal name and the empirical addition of a missing letter makes it all the more probable.

12. In view of all the above, it would seem that this is probably an inscription of the Chālukyan Kubja Vishnuwardhana, who had another name as 'Prithvi Yuva-

raja' and was also called Vishama Siddhi. I am fortified in this belief by the following further considerations. The only two known grants of the Ānanda Kings end with 420 A.D. On paleographic grounds, this inscription is definitely of the early 7th century. It is improbable that a petty local line of Kings should continue for so long an interval of nearly 250 years without leaving any other trace In the then disturbed political situation of Andhra, it is improbable that a small dynasty could have continued so long. Further we know from other evidence that at about 611 A. D., Satyāsraya Pulikēsin II, invaded Andhra and placed his general 'Prithvi Yuvaraja' later known as Kubja Vishnuvardhana in charge. In fact in the Kopparam plates of Pulakesin II edited in Ann. Bhand. Or. Res. Inst. IV, it is stated that some lands were granted in Karmarāstra (by which name Guntur district was then known) in the presence of Pulakesin II and the grant was dated in *Pravardhamana-Vijaya-Rajya-Samvatsara* 21. Dr. Hulzsch while re-editing the plates in Ep. Ind. XVIII, has proved that it belongs to the 21st, regnal year of Pulikesin II i.e., A.D. 629, and has identified 'Prithvi Yuvaraja' with Kubja Vishnuvardhana (founder of East Chālukyan dynasty) and who is styled as 'Prithvi-Vallbha-Vishnuvardhana Yuvaraja' in the Satara grant (Ind. Ant. XIX). This clearly shows that 'Prithvi Yuvaraja,' was ruling in Karmarastra (Guntur Dt.) in the first half of 7th century and the Chezerla inscription which on grounds of paleography, is to be attributed to early 7th century only, mentions not only "Prithvi-Yuvaraja" but also says he was renowned in the *Ranasaptakoti* of *Dhanya Kata* which is the same as *Dhanyakataka* (modern Dharanikota near Amaravathi) and which we learn from the Mayidavolu plates of S'ivaskandavarma was the provincial capital of the Pallavas. It is therefore probable that a war of conquest was fought there and Prithvi Yuvaraja distinguished himself in it. Any other explanation would be untenable and (*a*) the date of grant (early 7th century) (*b*) the battle of Dhānyakataka; and (*c*) the name 'Prithvi Yuvaraja,' point only to Kubja Vishnu-Vardhana. The inference of Sri V. S. Ramachandra Murty in J.A.H.R S. Vol XI, that the occurence of the 'Prithvi Yuvaraj,' which he admits is a Chālukyan one, shows that it was in use for a long time before the Chālukyas, seems to be not quite correct, in as much as all scholars are agreed that the Chezerla inscription belongs to early 7th century on paleographic grounds. This is therefore not earlier to the Chālukyan one but is contemporaneous and it is too much to expect that a subordinate insignificant King had this title, contemporaneously with a mighty warrior, who further was in Andhra during the same period. I am therefore of the opinion that the 'Prithvi Yuvaraja' mentioned here is no other than Kubja Vishnuvardhana and that this is an eastern Chālukyan record.

13. Further in the same temple there is an undisputed grant by 'Vishama Sidhhi which is another name for Kubja Vishnuvardhana and it is published as 593 in South Indian Inscriptions Vol. VI. Further No. 595 of South Indian Inscriptions Vol. VI, which is also found in the same temple and on the back of the slab, belongs to the Pallava King Mahendra-Vikrama and the titles, *Avanibhajana* and *Vegavati-sanatha* appear on it. And this Pallava King also reigned between 600–630 A.D. and many battles were fought between the Pallavas and Chālukyas. Judging these three records together, the conclusion is irresistible that this is an authentic record of Chālukya Prithvi Yuvaraja.

# సుప్రభేదాగమ సంహిత

## (పూర్వతోఽనువృత్తమ్)

ఆదౌ నిర్విఘ్నేన పరిసమాప్త్యర్థం శ్రీ మహాగణపతిపూజాం కరిష్యే । తదంగకల శారాధనం కరిష్యే ॥ విఘ్నేశ్వరార్చన పుణ్యాహం కృత్వా ఆచార్య ఋత్విగ్వరణం కరిష్యే ఇతి సంకల్ప్య.

శ్రీ .... శ్రీమన్మహాదేవదేవస్య అస్మిన్ పంచదినభౌతికకళ్యాణమహోత్సవే సర్వయాగీయాధికారసిద్ధ్యర్థం ఆచార్యం త్వామహం వృణే, బ్రహ్మాణం త్వామహంవృణే, ఋత్విజం త్వామహంవృణే । తతో గురుః కంకణపూజాం కరిష్యే । షోడశోపచారపూజాం కరిష్యే. "విశ్వేత్తాతే"తి, "తత్పురుషాయే"తి ద్వాభ్యాం మంత్రాభ్యాం ఆచార్యస్య దక్షిణకరే కంకణం బధ్నీయాత్, నవ్యవస్త్రాణి ధృత్వా పునరాచమ్య, తదనంతరే అఖండ దీపారాధనం కరిష్యే ఇతి సంకల్ప్య, అఖండస్థాపనమ్.

శ్రీమద్దేవదేవ....శ్రీమన్మహాదేవదేవస్య భౌతికకళ్యాణ మహోత్సవమూర్తిస్థిరీకరణ సిద్ధ్యర్థం, సకల నిష్కళాత్మక తేజోభి వృద్ధ్యర్థం అఖండ దీపారాధనం కరిష్యే.

### మంటపారాధనమ్

పూర్వోక్త ఏవం గుణవిశేషణ విశిష్టాయాం శుభతిథౌ శుభేముహూర్తే శ్రీమద్దేవదేవ....శ్రీమన్మహాదేవదేవస్య అస్మిన్ పంచ దిన భౌతికకళ్యాణ మహోత్సవే సర్వదేవతాధిష్ఠాన సిద్ధ్యర్థం శాలావిహరణ మంటపపూజాం కరిష్యే.

ఓం తిర్యగ్యవోదరాణ్యష్టౌ ప్రమాణమేకం. ఊర్ధ్వగత వ్రీహిత్రయ ప్రమాణమేకం. ఏతద్ద్వయ మధ్యే దేశికః ఏకప్రమాణం గృహీత్వా, ద్వాదశాంగుళయోగం కృత్వాచేద్వితస్తిర్భవతి । తద్వితస్తియుగేన హస్తంభవతి । తద్ధస్తేన ద్వాదశైకాదశహస్తైర్మంట పత్రయం భవతి. తన్మంటపత్రయ సూత్రైకం గృహీత్వా తత్సూత్రం త్రిభాగం కృత్వా మధ్యమభాగే చతురస్రాకృతి చతుస్తంభాని స్థాప యేత్ । తన్మధ్యేముకుళాకృతి తోరణాని రచయిత్వా షోడశ స్తంభావృతరూపేణ దర్భసూత్రం బద్ధ్వా దిగష్టభాగే శ్యామ, రక్త, కృష్ణ, ముక్తాభ, పీత, నీల, స్ఫటిక, ధూమ్రవర్ణ వస్త్రాలంకృతధ్వజాష్టకం బద్ధ్వామంటపే ముక్తాస్రగ్దామైరలంకృత్వా సర్వమంటపస్థలేష్వష్టాంగు ళోన్నత వేద్యుపరి చతుస్తంభమధ్యే తాలమాత్రోన్నత వేద్యాదిసర్వస్థానేషు గోమయాలేపనం కృత్వాపిష్ట చూర్ణై రలంకృత్య సజల పూరితాలంకృతవస్త్రయుత షోడశపూర్ణకుంభాని ప్రతిస్తంభమూలే చదద్యాత్ । ఏవంవిధ సర్వాలంకారితమంటపే మూర్తిపైస్సాకం ఆచార్యః "నమ అవ్యాదిపీభ్యో వివిధ్యంతీభ్యశ్చ" ఇత్యను వాక ముచ్చరన్ గురుగణాన్న మస్కృత్య తదనుజ్ఞయా మంటప పూజాం కరిష్యే ఇతిసంకల్ప్య షడంగమంత్రైర్మంటప సంస్కారం కుర్యాత్.

హ్రాం, హ్రీం, హ్రూం, హ్రైం, హ్రౌం హ్రః, పూర్వాదితోరణ పూజావిధిరుచ్యతే పూర్వే శాంతితోరణాయనమః ఓం రశ్మిరిత్యే తదితి । దక్షిణేభూతితోరణాయనమః । భూతికామో జాతోవా ఇతి । పశ్చిమే బలతోరణాయనమః । బలంబలేనేతి. ఉత్తరే ఆరోగ్యతోరణాయనమః । "స్వస్తినో మఘవాకరోత్వితి । తతః యత్కూర్మముపదధాత్వితి మంత్రేణ షోడశ స్తంభ మూలే ధాన్యస్థండిలోపరి కూర్మయంత్రాణి లిఖిత్వా. "అకలశేష్వి"తి కలశానా వాహ్య "ఇమంమే వరుణ" ఇత్యుదక పూర్వం "ఆపోవా" ఇత్యుదకమభిమంత్ర్య, "ప్రవో యజ్ఞేష్వి"తి పంచపల్లవానిదత్వా, "తరణిర్విశ్వ దర్శిత" ఇతిమంత్ర ముచ్చార్య, ద్వాదశాదిత్య నామాన్యుచ్చరన్ సన్యజేత్ । వంవైవర్తనాయనమః, విం వివస్వతేనమః, మం మార్తాండాయ నమః, భంభాస్కరాయనమః, రం రవయే నమః, లం లోకప్రకాశాయనమః, లం లోకసాక్షిణేనమః, త్రిం త్రివిక్రమాయనమః, అం ఆదిత్యాయనమః, సుం సూర్యాయనమః, అం అంశుమాలినేనమః, దిం దివాకరాయనమః, ఇతి కలశార్చనం కుర్యాత్, చతుః స్తంభ మూలస్థితకలశేష్వీ శానాదిధర్మాయనమః, ధర్మేణపాపమపనుదతి । అధర్మాయనమః, అధర్మాయస్వాహా, అద్భ్యః స్వాహా, ఓషధి వనస్పతిభ్యః స్వాహా । జ్ఞానాయనమః, వేదాంతవిజ్ఞాన ఇతివైరాగ్యాయనమః, దభ్రం ఇతిపాపం, పూర్వాదిద్వారకుంభ పూజావిధిరుచ్యతే, పూర్వద్వార దక్షిణశాఖాదశే, ఓం నం నందినేనమః, తత్పురుషాయ విద్మహే చక్రతుండాయ ధీమహి । తన్నో నందిః ప్రచోదయాత్, పూర్వద్వారోత్తర శాఖాదశే, ఓం మంమహాకాళాయనమః, దేవా యుద్దేయాగే ఇతి, దక్షిణద్వార దక్షిణశాఖాదశే । ఓం విం వినాయకాయ నమః, ఓం భృం భృంగినేనమః, గణానాంత్వాఇతి, భృంగిశ్వరాయ విద్మహే తత్త్వపాదాయ ధీమహి । తన్నో భృంగిః ప్రచోదయాత్ । భృంగీశ్వరాయ తదుత్తర శాఖాదశే । ఓం విం వినాయకాయనమః, గణానాం త్వాఇతి । పశ్చిమద్వార దక్షిణ శాఖాదశే ఓం వుం వృషభాయ నమః, తీక్ష్ణశృంగాయ ఇతి, తదుత్తర శాఖాదశే ఓం సంస్కందాయనమః, యత్రబాణా ఇతి, ఉత్తరద్వార దక్షిణశాఖాదశే ఓం దందేవ్యై నమః, దేవీం వాచమజనయంత ఇతి । ఉత్తరద్వారోత్తర శాఖాదశే ఓం చం చండీశ్వరాయనమః, చండీశ్వరాయ ఇతి ప్రత్యగ్ద్వారోర్ధ్వ స్థానే, ఓం మం మహాలక్ష్మ్యైనమః, భవతి సాహస్రీవా ఏషా ఇతి । పూర్వే, ప్రశాంతాయనమః, శశిరాయనమః, దక్షిణే పర్జన్యాయనమః, అశోకాయనమః । పశ్చిమే భూతసంజీవనాయనమః, అమృతసంజీవనాయనమః । ఉత్తరే ధనదాయనమః, శ్రీప్రదాయనమః । పూర్వాద్యా యుధ పూజాంకుర్యాత్ కుముదాయనమః, కుముదాక్షాయనమః, పుండరీకాక్షాయనమః వామనాయనమః, శంఖకర్ణాయనమః, సర్వనేత్రాయ నమః, సుముఖాయనమః, సుప్రతిష్ఠాయనమః, ప్రదక్షిణం కృత్వా, నైరృతౌ వాస్త్వధిపతయే బ్రహ్మణేనమః । మంటపసంధిషు । పృథివీతత్త్వాయనమః, వితానే చంద్రాయనమః, దర్భమాలాయాం వాసుకియేనమః, పూర్వే శివతత్త్వకోశాయనమః, ఇతి మంట పారా ధనవిధిః. షోడశపూజాం కుర్యాత్, అనంతరే అస్త్రపూజాం కృత్వా. అస్త్రపూజా.

పూర్వోక్త ఏవంగుణ....తిథౌ, శ్రీమద్దేవదేవ మహాదేవ జగత్కుటుంబిన్యుమామహేశ్వరస్య....మహాదేవదేవస్య అస్మిన్ పంచదినభౌతిక కళ్యాణోత్సవాఖ్యే కర్మణి సమస్త యాగావలోకనార్థం సర్వదేవతామయాస్త్రరాజపూజాం కరిష్యే, తతః చూర్ణికాన్పఠేత్.

# భగవదుపచారములు - తత్ప్రయోజనము

పండిత వేదాంతం విప్రనారాయణాచార్యులు

శ్లో॥ వైఖానసమునిం వందే । యత్ప్రసాదాదమీ వయమ్ ।
స్వర్గాదిమోక్షపర్యంతాం । వైదికీం సిద్ధిమాప్నుమః ॥

విగ్రహారాధనము, వేదచోదితమై, వేదార్థ ప్రతిపాదకములైన, యాగమశాస్త్రములచే విస్తరింపచేయబడినది. ఆ యాగమశాస్త్రములు శైవ వైష్ణవ భేదములచే రెండువిధములుగా నున్నవి. వైష్ణవాగమము వైఖానసము, పాంచరాత్రమునను భేద ము ల చే రెండువిధములు. భాగవతముకూడ నొక యవాంతర భేదమని కొందరు చెప్పుదురు. ఇందు వైఖానసము తత్తత్సాహచర్యముచే ఆగమశబ్ద వ్యవహృతమగుచున్నదేకాని, తత్సంహితాకారులెచ్చటను నీపేరుతో, వ్యవహరించి యుండలేదు. సంహితాకారులైన భృగ్వాదులు, శ్రీ వైఖానస భగవచ్ఛాస్త్రమనియు, సంహితావాక్యముల సమన్వయపరచి, వినియోగమందు చూపుచూవచ్చిన శ్రీ నృసింహవాజపేయయాజి ప్రభృతులు, శ్రీ వైఖాననిగమమనియు వ్యవహరించియుండిరి. నిగమమనగా 'నిర్నిశ్చయేన, బ్రహ్మధామ, గమయతీతి' నిగమః.

శ్లో॥ నిర్గతం హరివక్త్రాచ్చ గతం విఖనసాననం ।
మోక్షమేవాన్యప్రాధాన్యం, నిగమః పరికీర్తితః ॥

సకల లోకసృష్టి స్థితి సంహారకారకుండును. నఖిలహేయ ప్రత్యనీక కల్యాణగుణాకరుండును, నవాప్తసమస్తకాముండును నగు శ్రీమన్నారాయణునిచే నుపదేశింపబడి శ్రీ విఖనోము నీంద్రులచే నధ్యయనము చేయబడినట్టిన్ని, మోక్షప్రదమైనట్టి, యాశాస్త్రమునకు నిగమశబ్దము సార్థకమైనట్టిదియే! జీవి స్వకృతపుణ్యకార్యములతో, సత్యాదిలోకములను సాధించ కలిగినను పునరావృత్తి రహిత దివ్యలోకము చేరవలెనన్న శ్రీమన్నారాయణోపాసనమవశ్యాచరణీయమనుట నిర్వివాదము.

శ్లో॥'దేవాన్ దేవయజోయాంతి,మద్భక్తా యాంతిమామపి'ఇతి భగవతైవ గీతాయాముక్తం, 'మాముపేత్యతు కౌంతేయ పునర్జన్మ నవిద్యతే.' ఇతిచ; షడ్గుణ్యైశ్వర్య

సంపన్నుండైన, శ్రీమన్నారాయణునుపాసించుమార్గములు జపహుతార్చన ధ్యానములని నాల్గువిధములుగానున్నవనియు నందర్చనము సర్వార్థ సాధకమనియు శ్రీ వైఖానస భగవచ్ఛాస్త్ర ప్రవర్తకులైన భృగ్వాదులు కంఠోక్తిగా ప్రశంసించి యుండిరి. ఎట్లనగా, భగవత్సమారాధనం జపహుతార్చన ధ్యానాది భేదేన చతుర్విధం భవతి. తేష్వర్చనం సర్వార్థసాధకం స్యాత్. సర్వార్థసాధకమనగా ధర్మము, నర్థము, కామము మోక్షమునను చతుర్విధ పురుషార్థములను సమకూర్చునట్టిదనియు, పురుషార్థ సాధకమైన నీయర్చనమందు, జపము, హోమము, ధ్యానము నను తక్కిన భగవత్ప్రాప్త్యు పాయములు మూడును సిద్ధించుచున్నవి కనుక నర్చనము సకలార్థ సాధకత్వము కలిగియున్నదనియు భావము. భగవత్ప్రాప్తికి సాధనభూతమైన యాయర్చనము నర్చావతారియై, దివ్యమంగళ విగ్రహరూపిగా వేంచేసియున్న భగవానునకు, నమర్పించదగి యున్నది. భగవదారాధనమువలన చతుర్విధ పురుషార్థ సాధకత్వము కలుగుచున్నదని చెప్పియుంటిమి. పరమపురుషార్థమైన మోక్షమీ యారాధనమువలన తప్పక సిద్ధించుచున్నదని మరీచి మహర్షి స్వకృత విమానార్చన కల్ప గ్రంథావసానమందు వ్రాసియున్నారు. ఎట్లనగా 'తదారాధనేన సంసారార్ణవని మగ్నో జీవాత్మా పరమాత్మానం నారాయణం పశ్యతి. సోఽపి భక్తవత్సలత్వాద్భక్తాను కంపయా పునరావృత్తి రహితం దివ్యలోకం ప్రాపయతి. పశ్చాత్కృత కృత్యోభవతి.' అనగా, గభీరనం సారసాగర నిమగ్నుడైన జీవి విగ్రహారాధనముజేసి పరమాత్మ శబ్ద వాచ్యుడైన శ్రీమన్నారాయణుని సందర్శింపగలుగు చున్నాడనియు, భగవత్సాక్షాత్కారము నొందిన జీవిని, భక్తవత్సలుడైన పరమాత్మ పునరావృత్తి రహితమైన శాశ్వత దివ్యలోకము చేరునట్లను గ్రహించుటచే జీవి తాజేయతగిన కార్యమునుచేసినవాడగుచున్నాడనియు భావము. భగవత్ప్రాప్తికి సాధనభూతమైన భగవదారాధనము మంత్ర పురస్సరమైన యుపచార విశేషములచే నర్చావతారియై దివ్యమంగళ విగ్రహరూపిగా వేంచేసియున్న భగవానునకు నమర్పింపబడుచున్నదిగదా, ఈ యుపచారములను సమర్పించుట యందలి భావమేమి ? ఉపచారోపయుక్తమైన మంత్రార్థమేమి ? యనునవి ప్రకృతములు. 'విగ్రహాశ్చోపచారార్చ బేరాఃపర్యాయ వాచకాః' విగ్రహములు, ఉపచారములు, బేరములు నను మూడు పదములును పర్యాయ వాచకములై యున్నవి. ఇందుపచారమనునది సార్వజనీనము. ఉప=దివ్యమంగళ విగ్రహరూపిణః పరమాత్మనో నారాయణస్యసమీపే చరతి=క్రియత ఇత్యుపచారః. ఉపచారమనగా దివ్యమంగళ విగ్రహరూపియైన భగవానుని సమీపమందు భక్తుడు దాసభావముతో, ప్రదక్షిణ నమస్కారాది రూపమైన పరిచర్యచేయుట యని

చెప్పదగి యున్నది. అట్టి పరిచర్యలలో భగవదారాధనోపక్రమణమానకాలయముజొచ్చిన పూజకుడు మున్ముందు ప్రదక్షిణోపచారమును సమర్పించుచున్నాడు. "ప్రతద్విష్ణుస్తవత ఇతి దేవాలయం ద్విఃప్రదక్షిణీకృత్య," ప్రదక్షిణ మనగా ప్రకర్షేణ స్వస్య దేవాయతనం, పక్షిణం యథాభవతి తథాక్రియమాణం పరిభ్రమణం ప్రదక్షిణమిత్యుచ్యతే. ప్రాకారాభ్యంతర ప్రవిష్టుడైన పూజకుడు బలిపీఠము వద్ద నుండి బయలుదేరి తనకుడి చేతివైపున కాలయమువచ్చు నట్లుగా నాలయమును చుట్టివచ్చుట ప్రదక్షిణమనబడు చున్నది. దీనివలన ప్రయోజనము-'యానికానిచపాపాని జన్మాంతరకృతానిచ। తానితాని ప్రణస్యన్తి ప్రదక్షిణ పదేపదే ॥ ప్రదక్షిణసమోనాస్తి ప్రత్యక్షఫలదోవిధిః ॥ పాపములు మానసికములనియు, వాచికములనియు, కాయికములనియు, మూడువిధములు. త్రివిధపాపములలో కాయికములైన పాపముల తొలగించుకొనవలెనన్న కాయక్లేశకరములైన కర్మల నాచరించియే తీరవలెను. ప్రదక్షిణోపచారము కాయక్లేశకరమైనట్టిదని సర్వులకు విదితచరమేకదా. కాయక్లేశకరమైన ప్రదక్షిణోపచారముచే కాయికములైన సమస్తపాపములు పైదొలగగా పూజకుడు భగవానుని దివ్యమంగళ విగ్రహరూపమును దర్శించుటకు, నమస్కరించుటకు ననువైన తనువుకలవాడగుచున్నాడు. ప్రదక్షిణోపచారము చతురంగ సమన్వితమైనదని పెద్దలు చెప్పుదురు. చతురంగమనగా 'పాదౌ పావాన్తరే యస్య కరౌచలనవర్జితౌ। స్తుతిర్వాచి హృదిధ్యానం చతురంగం ప్రదక్షిణం ॥ అను నాల్గవ యవములతో కూడినదని భావము. ప్రదక్షిణ పరిభ్రమణముచేయు పూజకుడు తా ముస్తుప్రసారముచేసిన కుడికాలునకు వెనుకభాగమందే తన ఎడమకాలుంచబడునట్లు నడచుచూ చేతుల సూచక అంజలి బంధముచేసి ధ్యాననిష్ఠమైన తనహృదయ కుహరమందుంచి నామసంకీర్తనము చేయుచూ పైచెప్పిన విధముగా నాలయముచుట్టునూ తిరిగిరావలయును. ఇవ్విధముగా నాలయముచుట్టును తిరిగి వచ్చుటను ప్రదక్షిణమందురు. ఇట్టి ప్రదక్షిణములు రెండు చేయవలయుననియు, అయుగ్మముగా నుండకూడదనియు శాస్త్రప్రమాణము. ' యుగ్మప్రదక్షిణం కుర్యాదయుగ్మం త్వాభిచారికమితి।' 'స్తుతిర్వాచి' అని యుండుటచే వాచిక పాపనోదనము కొరకు భగవత్స్తుతి రూపార్థమునే ప్రతిపాదించునట్టి ప్రదక్షిణ పరిభ్రమణకాలమందుచ్చరించ వలసిన మంత్రార్థమై యున్నది.

ప్రతద్విష్ణుస్తవతే, వీర్యాయ మృగోనభీమః కుచరో గిరిష్ఠాః, యస్యోరుషు త్రిషు విక్రమణేష్వధిక్షియంతి భువనానివిశ్వం॥ ఈ మంత్రము యజుర్బ్రాహ్మణము ద్వితీయాష్టకములోని చతుర్థప్రపాఠకమందలి మూడవ యనువాకములోనిది. దీనికి వినియోగము శ్రీ వైఖానస కల్పసూత్రకారులొకతీరునను, శ్రీ వైఖానసభగవచ్ఛాస్త్ర సంహితాకారులు, వేరొక తీరునను, చెప్పియుండిరి. శ్రీ వైఖానసకల్ప సూత్రకారులు, ప్రతద్విష్ణుస్తవత ఇతి కుశపుష్పాద్యన్యతమేనాసనం కల్పయిత్వా, అనియు, శ్రీ వైఖానసభగచ్ఛాస్త్ర సంహితాకారులు ప్రతద్విష్ణుస్తవత ఇతి దేవాలయం ప్రదక్షిణం కరోతి, అనియు చెప్పియుండిరి. ఈ వినియోగములందు బేదమున్నను మంత్రార్థముమాత్రమొక్క తీరుననే చెప్పదగి యున్నది. ప్ర తత్ విష్ణుః, స్తవతే, వీర్యాయ, మృగః, న భీమః, కుచరః గిరిష్ఠాః, యస్య ఉరుషు, త్రిషు విక్రమణేషు, అధిక్షియంతి, భువనాని విశ్వం. దీని సమన్వయము, యథా, కుచరః, భూమౌ వర్తమానః భీమః, భయంకరః మృగః జంతుః, సింహో, న ఉత్ప్లుత్య, గిరిష్ఠాః పర్వతస్థోభవతి, సింహస్యోత్ప్లవనం, గిరిశిఖర గమనంచ సహజమేవ సింహాదన్యస్యాల్పమృగస్యోత్ప్లవన మాశ్చర్యావహంభవతి. తథైవ పూర్వం వామనరూపత్వేనావస్థితస్య యస్య విష్ణోః, ఉరుషు విస్తీర్ణేషు, త్రిషు విక్రమణేషు, విశ్వంభువనాని సర్వలోకాః, అధిక్షియంతి త్రివిక్రమత్వం గచ్ఛతః పరమాత్మనో నారాయణస్య త్రిభిః పాదైరాక్రాంతా భవంతి; యద్వా, త్రివిక్రమ రూపిణః నారాయణస్య, మూర్ధోదరపాదేష్వపస్థితాస్సర్వే లోకా ఇతివా; యస్మాత్కారణాద్విష్ణుః పరాక్రమితః, తత్పరాక్రమితంకర్మ వీర్యాయ తదారాధకానాంతేజోవివర్ధనాయ ప్రస్తః ప్రస్తూయత ఇత్యర్థః, సింహముకన్న నల్పశరీరియై భూసంచారము చేయునొక భయంకర జంతువొక్క గెంతుతో కొండపై కెగయుటెట్లాశ్చర్యావహమో, తొలుత వామన రూపమునుండి, దానప్రతిగ్రహానంతరము, ఇంతింతై వటుడింతయైయన్నట్లు త్రివిక్రమ రూపియై, మూడడుగులతోకాని మూడు దేహభాగములతో కాని, సకలలోకాక్రమణము చేసియుండుట, యాశ్చర్యావహము. ఇట్లుగా లోకముల నాక్రమించి, బలిసర్వస్వమును హరించిన యా విష్ణుమూర్తియొక్క పరాక్రమ కర్మ తదారాధకులకు తేజోవివర్ధకముగాస్తుతించబడుచున్నదని భావము. ధ్యాననిష్ఠుడై ఈ మంత్రము నుచ్చరించుటచే యారాధకుడు మానసికవాచిక పాప వినిర్ముక్తుడై దివ్యమంగళ విగ్రహరూపియైన పరమాత్ముని, దర్శించుట కర్హుడగుచున్నాడు. అయితే (శ్లో) సదా సన్నిహితోవిష్ణుః ఛాయయోర్థామబేరయోః॥ తస్మాన్నలంఘయేత్ప్రాజ్ఞః, ధామ్నోబేరస్య సత్వరః॥ అని చెప్పియుండుటచే, ఆలయముయొక్క నీడ నతిక్రమించకూడదుకదా;

ఇదెట్లు పొసగగలదని ప్రశ్నించెదరేమో. ప్రదక్షిణవిధానే తల్లంఘనంతున దోషకృత్, అనికూడ యున్నదికనుక ప్రదక్షిణకాలమందు, ఛాయాలంఘన దోషము పాటింప నక్కరలేదు రెండు ప్రదక్షిణములు చేసినపిమ్మట, బలి పీఠమువద్ద నాలయాభిముఖుడై నిలచి 'విమానం ప్రపద్యే, విష్ణుమయంప్రపద్యే, దేవావాసంప్రపద్యే, వైకుంఠోద్భవం ప్రపద్యే' అను మంత్రములతో విమానవందన మాచరించ వలెను. విమానమనగా భగవదావాసమును తెలియజేయు నట్టి, యొక చిహ్నవిశేషము. ఇయ్యది, కట్టడభేదములతో తొంబదియారు బేధములుగానున్నదని, మరీచివిమానార్చన కల్ప గ్రంథములో చెప్పబడియున్నది. దీని విషయ మిచ్చట ప్రకృతముకాదుగనుక, శిల్పసంబంధమైన వ్యాస ములో వ్రాయదలచి విడచినాము. విశేషేణమీయతే జ్ఞాయతే, భగవతోనివాసోఽనేనేతి, విమానం, ఇయ్యది సోప పీఠాధిష్టాన పాదబంధములతోకూడి, ఏక తలమైకాని ద్వితలమైకాని, త్రితలమైకాని, ద్వాదశతలముల వరకు నుండవచ్చును. నేలమట్టమునుండి శిఖరపర్యంతముకల భాగమునకంతకును విమానమను పేరు కలిగియున్నది. విమానం ప్రపద్యే అనుటతో సోపపీఠాధిష్టానములతోగూడి శిఖరసమేతమైన భగవదావాసమునుగూర్చి నమస్కరించు చున్నానని చెప్పుచున్నాడు. (శ్లో) దేహోదేవాలయః ప్రోక్తోజీవోదేవస్సనాతనః । ఇతి ఖల్వార్యోక్తిః; భౌతికదేహ మందలి జీవాత్మను దర్శించుటకు, ఉపాసకున కాధార, స్వాధిష్ఠాన మణిపూరకానాహత విశుద్ధాజ్ఞాచక్రముల దర్శనావశ్యకతయున్నట్లు, ఆలయమనెడి దేహమందు, దివ్యమంగళ విగ్రహరూపియై వెలుగందుచున్న, సర్వే శ్వరుని దర్శించుటకు సోపపీఠాధిష్ఠాన సహితమైన విమాన మును, శిరస్సుగా భావింపబడుచున్న శిఖరపర్యంతము, తిలకించిచూచి నమస్కరించి, పిమ్మట యాత్మోపాసకు డాజ్ఞాచక్రమందుసుఖానుభూతి నందినట్లు, భగవద్భక్తుడు సుఖమనుభవించునని భావము. అర్చావతారియైన పర మాత్మకావాసమైనదికనుక విష్ణుమయమనియు, అర్చావ తారియైన పరమాత్మను దర్శించుటకు సేవించుటకు బ్రహ్మాది సకలదేవతా సన్నివేశము కలిగియున్నదిగనుక దేవావాసమనియు. అర్చావతారియైన పరమాత్మ సకలచేత నోద్ధరణముకొరకై తానావిర్భవించునపుడు, వైకుంఠ లోకమునుండి యొక దృశ్యము నిచట తనకావసముగా నుద్భవింపచేసి యుండుటచే వైకుంఠోద్భవమనియు, వ్యవ హరింపబడుచున్నది. పిమ్మట నాలయాభ్యంతర ప్రవే శమునకుముందు ప్రధానద్వార దక్షిణ భాగాపస్థితుడైన మణికునకు వందనామాచరించవలెను. దీని భావమే మనగా, ఒక పౌరుడధికారి దర్శనమునకు పోయి, యచ్చట (ద్వారావస్థితుడైన) గేటుకాచువాని నుపాయనాదులతో తృప్తిపరచిన పిమ్మట అధికారి దర్శనము సుగముగా చేసినట్లు, ప్రధానద్వార పాలకుడైన మణికునభివాదన ముతో తృప్తిపరచిన పిమ్మట భగవద్దర్శనము సుగమము. ద్వారస్య దక్షిణదిగ్భాగే మణికం ప్రపద్య ఇతి మణికం ప్రణమ్య, మణికం ప్రపద్యే మహాబలం ప్రపద్యే, విమలం ప్రపద్యే, ద్వారపాలకం ప్రపద్యే, ఈ నాల్గును మణికునకు ప్రధానమంత్రములు.

సాకారోపాసనంచైతత్కలికాలీనమానవాన్ ।
సమ్యగుద్ధృత్య సంరక్షేదితి వేదవిదాం మతమ్ ॥

---

## విజ్ఞులకు విన్నపము

"అకాల మృత్యుహరణం సర్వవ్యాధినివారణం ।
సమస్త పాపక్షయకరం శ్రీవిష్ణుపాదోదకం పావనం శుభమ్ ॥"

పై శ్లోకమును చదువుచు అర్చకులు దివ్యస్థలములలో తీర్థప్రసాదములు వైష్ణవ స్వాములకు వినియోగము చేయవచ్చునా? కూడదా?

పై విషయమున యభిప్రాయము పంపిన తరువాతి సంచికయందు ప్రకటింతుము.

[సంపాదకుడు]

# తంత్రాలోకము

(పూర్వతోఽనువృత్తము)

జమ్ములమడక మాధవరామశర్మ

అభినవగుప్తుడు తన ప్రతిభా పరాక్రమమున సర్వసమన్వయము నిరూపించినాడు. 'ఈ విశ్వమంతయు శివమయము. ప్రపంచమునంతను శివస్వరూపముగా భావింపవలెను. ఏ అంశముకాని శివాతిరిక్తముగా లేదు. అంతయు శివస్వరూపము. కాని పరశివుడు కేవలము విశ్వరూపుడే కాడు. విశ్వస్వరూపుడైనను విశ్వోత్తీర్ణుడై శివుడున్నాడు. అందువలననే శివుని విశ్వమయునిగా విశ్వాతీతునిగా భావింపవలెను.' అను ఈ తత్త్వము తంత్రాలోకరహస్యము. దీని విస్తరణమే గ్రంథముననున్నది. ఈ సకల ప్రపంచము శివుని స్పందరూపముగానున్నది. శివుడు బీజస్వరూపుడు. కొమ్మలు, ఆకులు పల్లవములు, పుష్పములు, ఫలములు సర్వము విశ్వము. మహావృక్షము సందేదియు బీజాతిరిక్తముకాదు. అట్టి ఈ విశ్వము ననుసరించి శివానుసంధాన మొనరింపవలెను. అనాసక్తితో ప్రకృతి పదార్థముల నవలంబింపవచ్చును. అనుభవింపవచ్చును. కేవలము భోగాసక్తులై తమ్ముతాము గోతిలో పడద్రోసికొనరాదు. శివాసక్తులై సర్వము సేకరింపవచ్చును. స్వీకరింపవచ్చును. లోకములోని జడపదార్థము చేతనముగా నొనర్చుట దీని తత్త్వము. తుచ్ఛవస్తువు నతుచ్ఛముగా జేయుట దీని తాత్పర్యము. తుచ్ఛముగాని, అతుచ్ఛముగాని సర్వమతుచ్ఛమె. శివేతరమగు భావమంతయు నశించిపోవుట దీని భావము. అందువలననే శివేతరక్షతి ప్రయోజనమని భావుకులు భావించినారు.

శ్లో॥ అజ్ఞానం కిల బంధహేతురుదితః శాస్త్రం మలం తత్స్మృతం
పూర్ణజ్ఞానకలోదయేతదఖిలం నిర్మూలతాంగచ్ఛతి ।
ధ్వస్తాశేషమలాత్మసంవిదుదయే మోక్షశ్చ తేనామునా
శాస్త్రేణ ప్రకటీకరోమి నిఖిలం యత్జ్ఞేయ తత్త్వం భవేత్ ॥

జీవుడుగానున్న మానవునకు శివభావము గుర్తింపక పోవుట యనెడు అజ్ఞానము సంసారబంధహేతువని యనుచున్నారు. దీనినే శాస్త్రములందు "మల" మని పరిగణించిరి. పరిపూర్ణమగు జ్ఞానకల యుదయించినచో ఆ మలమంతయు నిర్మూలమై నశించును. సర్వమలము విధ్వంసముకాగా ఆత్మసంవిత్తుదయించును. దానిచే మోక్షముకల్గును. కావున ఈ తత్త్వమును ప్రకటింతునని జ్ఞేయతత్త్వమును విశదము చేయుదునని ప్రథమమున అభినవగుప్తుడు ప్రతిజ్ఞావచనమును నిరూపించినాడు. ఈ అంశమునే గ్రంథమంతట విశదముచేసినాడు. అరంభమున వ్యాఖ్యానించు జయరథుడుగూడ ఇట్లు చెప్పినాడు. గ్రందకారపదం పొందవలెననిలేదు. వాక్కౌశలము ప్రదర్శింపవలెననికాదు. మేము నిరూపించిన ఈ అంశమును బాగుగా పరిశీలించి మానవుడు చక్కని సంస్కారముగలవాడౌగాత. ఇదియే మా వాంఛితము.

శ్లో॥ యాతాయాతాః స్థితాః కేచిత్ అజ్ఞాః మత్సరిణః పరే
సందిగ్ధాః కేపి కింబ్రూయాం శ్రోతారో యదనాగతాః ॥

మేము నిరూపించు ఈ తత్త్వమును గుర్తింపక తెలుసుకొనదలచక కొందరిటు రానేరారు. మఱికొందరిటువచ్చినను ఇట్టెవచ్చి యట్టెపోదురు. కొందఱువచ్చి కూర్చుందురు. కాని వారికేమియు తెలియదు. కొందఱు కొంత తెలుసుకొందురు. కాని ఇదియేమని మాత్సర్యము వహింతురు. కొందఱేమెమో సందేహింతురు. తగినశ్రోత లభింపనే లభింపడే! నేనేమి చెప్పుదును. అని లోకులస్వభావముల నభినవగుప్తుడు మొదటగా కొంత సూచించినాడు. చిత్రవిచిత్రములైన బద్ధతులెన్నియో కలవు. ఎందఱో పెద్దలెన్నోవిధముల వానిని నిరూపించినారు. నాశిష్యులు నన్నడిగిరి. వారి కోరికతీర్చుటకై ఈ పూర్ణార్థప్రక్రియను నిరూపించుచున్నాను. అని అభినవగుప్తుడు పూనిక పట్టినాడు.

పరమశివుడు తాను అణువైనాడు. అణుత్వము పొందిన తనకుతానే కలాదులసంబంధ మేర్పరచుకొనినాడు. అందుననే ఈ విశ్వమంతయు సకలకలమై యున్నది. జ్ఞానమనునది రెండువిధముల నుండును. మొదటిది బుద్ధికి సంబంధించిన జ్ఞానము. రెండవది పురుషునకు సంబంధించిన జ్ఞానము. వీనినే బౌద్ధజ్ఞానమని పౌరుషజ్ఞానమని యందురు. ఈ రెండు విధములైన జ్ఞానములులేకపోయినచో రెండజ్ఞానములు మానవులకున్నవని యర్థము. వీనిని బౌద్ధాజ్ఞానము పౌరుషాజ్ఞానము అని యందుము. గురుసమక్షమున దీక్ష స్వీకరించినచో పౌరుషమైన యజ్ఞానము నశించును. ఆయజ్ఞానము నశించినను ఆ శరీరముపోయినగాని జ్ఞానము వ్యక్తముకాదు.

శ్లో॥ బౌద్ధజ్ఞానేన తు యదా బౌద్ధమజ్ఞానజృంభితం ।
విలీయతే తదా జీవన్ముక్తిః కరతలే స్థితా ॥

బౌద్ధజ్ఞానము కలిగినవుడే బౌద్ధమైన యజ్ఞానవిజృంభణము నశించును. అట్లు బౌద్ధాజ్ఞానము విలీనమైనపుడు జీవన్ముక్తికరతలమునందుండగలదు. ఈ దేహముండగనే మోక్షము లభించుననని భావము. కావున పౌరుషజ్ఞానము కలుగుటయేగాక బౌద్ధజ్ఞానము కలుగవలయునని స్పష్టముగా సూచితమైనది.

గురునమక్షమున లభించు దీక్షకూడా బౌద్ధజ్ఞానపూర్వకముగనే యుండవలయును. పౌరుషాజ్ఞానము దీక్షచేపోవచ్చును. ఐననేమి; అంతమాత్రమున ధీగతమైన యజ్ఞానము నశింపదు. ధీగతమైన యజ్ఞానము నశించిననే మోక్షమున్నదని సారాంశము. ఇట్టి ఈ తత్వమున నెట్టి హేతువాదములను చేయనక్కరలేదు. ఇది హేతువాదరహితమైన తత్వము. 'యోయదాత్మకతానిష్ఠః తద్భావంస ప్రపద్యతే' ఎవడే నిష్ఠయందుండునో ఆతడు తద్భావము పొందితీరును. ఎవని నెట్లును చలింపచేయనక్కరలేదు. కావుననే ఇందు హేతువాదములొనర్పరు. ఈ భూతభౌతికమైన భువనమును చింతనముచేయువాడు భువనేశత్వమును పొందును. బ్రహ్మాదుల స్వరూపమును ధ్యానించువాడు తన్మయత్వమును పొందును. మంత్రజపహోమార్చనముల ననుసరించువాడు మంత్రసిద్ధి పొందును. జ్యోర్ధ్యానమొనరించువాడు యోగుల కధిపతి యగును. శూన్యధ్యానమొనరించిన శూన్యాత్మకుడగును. సమనాధ్యానమున సర్వజ్ఞత్వమునే పొందును. నానాకర్మల సంగములతో నుండువారలకు బుద్ధిభేదమేమాత్రము గూడదని గీతాగురువవనె యనెను.

శివదేవుడు సర్వాకృతియగును. నిరాకృతియునగును. ఆతడే సర్వము వ్యాపించియున్నాడు. ఒకానొక వస్తువున్నది. అది యద్దమున ప్రతిబింబిచినది. ప్రతిబింబించి మనకు గోచరించును. గోచరించినను అద్దముకన్ననది వేఱుగాలేదు. కాని అద్దముకన్న వేరుగానున్నట్లు కన్పడును. ఎంతగా కనపడి ప్రకాశించునదైనను దర్పణాతిరిక్తముగాదు. అందుననే విశ్వమయుడైనను విశ్వోత్తీర్ణుడని విశ్వోత్తీర్ణుడైనను విశ్వమయుడని శివుని తత్వమును గుర్తింపవలెను.

శివునికన్న వేఱొకటి శక్తికలదు. అది శివాతిరిక్తము కాదు. కాని శివాతిరిక్తముగా గోచరించును. తత్వమట్టిది కాదు. ప్రమాణముల ననుసరించి విషయములను గుర్తించు ప్రమాతలు శక్తినట్లు కల్పించుకొందురు. ఆ శక్తియన్నది శైవీముఖమని ఈ స్పందశాస్త్రమున నిర్ణయము.

శ్లో॥ శక్తిశ్చ శక్తిమాంశ్చైవ పదార్థద్వయముచ్యతే ।
శక్తయోస్య జగత్ కృత్స్నం శక్తిమాంస్తు మహేశ్వరః॥

శక్తియని శక్తికలవాడని రెండుపదార్థములను చెప్పుదురు. ఈ జగమంతయు శక్తి. మహేశ్వరుడే శక్తిమంతుడు. సంవిన్మయుడైన యా శివుని ఆంతరమైన ప్రతిభాశరీరమె ఈ శక్తి. శివునకున్న శక్తి యతిరిక్తము కాదు.

శ్లో॥ ఏకన్య సంవిన్నాథస్య హ్యాంతరీ ప్రతిభా తనుః ।

శివుడు సంవిన్నాథుడు. శక్తి సంవిన్మయీ దేవి. ఇట్టి శివశక్తులకు భేదమేమున్నది? సంవిన్నాథుడైన పరమేశ్వరుని సంవిచ్ఛక్తితరంగములవలె స్ఫురించుచుండును. ఇదియొక సంవిదూర్మిచక్రము. ఈ సంవిదూర్మిచక్రము సౌమ్యముగా రౌద్రముగా గోచరించును. రుద్రశక్తి సమావేశము రౌద్రము. అది పంచాశద్భేదభిన్నమై(50 భేదములు కలదై) గోచరించును. ఇట్టి ఈ తత్వములందుకొనుటకు నానోపాయములున్నవి. వాని నందుకొనుచు ధ్యానమొనర్చిననో సాధకునకు పుష్టికల్గును. ధ్యానమనునది యెండిపోయిన సరస్సునకు పూర్ణత్వము సంపాదించు జలము వంటిది. మానవుడును శివదృష్టిలేక సంసార మాయా చక్రమునపడి పరిభ్రమించుచు శుష్కహృదయుడగుచున్నాడు. ధ్యానమొనర్చినచో నాతని హృదయము నిండు దనముకలదగును.

మంత్రాస్సంవిదం స్ఫుటయంతి తాం ।

మంత్రము లాత్మసంవేదనమును స్ఫుటముచేయును. ధ్యానమొనరించి హృదయమును సరసము చేసుకొనినవానికి మంత్రములు స్వసంవేదనము సంపాదించునవి యగును. అట్లా సంవేదనము కలుగగనే బోధభైరవుడగు విశ్వేశ్వరుని సముపాసించినట్లగును. ఈశివునియుపాసనము నియంత్రితమని నిరర్గళమని రెండువిధములు. నానావిధములగా యమ నియమములతోఁగూడినదై శాస్త్రీయాచార వ్యవహారములు కలిగిన యుపాసనము నియంత్రితమందురు. ఇట్లుకానిది నిరర్గళమైన యుపాసనము. అందే విధి నిషేధములును లేవు.

సాధకానాం బుభుక్షూణాం విధిర్నియతియంత్రితః ।
ముముక్షూణాం తత్వవిదాం సఏవతు నిరర్గళః ॥

శివభావము తెలియదలచినవారు రెండువిధముల నుందురు. కొందరు కేవలము సాధకులు. నానావిధములగు భోగాభిలాషలు కలవారు. ఇట్టి సాధకులకు నానావిధి నియతిగలిగిన విధినిషేధములున్నవి. వారట్లు శాస్త్రీయాచార విచారముల ననుసరించి తీరవలయును; ముముక్షువులగు సాధకులు రెండవవారు. వీరు భోగానక్తులుకారు. మఱి మోక్షానక్తులు. వీరు తత్వవిదులు, ఇట్టివీరలకు విధి నిరర్గళముగా నుండును. నియతమగు నాచారము వీరికి వేఱుగా నుండదు. భోగదృష్టితో నున్నపుడున్న యుపాస

నమే మోక్షదృష్టితో నున్నపుడు నిరర్గళ మగుచున్నది. శివభావప్రాప్తికి ఇట్లుపాసనమావశ్యకమగుచున్నది.

ఉపాసనమన్నది యొక యాగము. ఒకానొకదేవత నుద్దేశించి ద్రవ్యత్యాగముచేయుట యాగమని శాస్త్రభాష. ద్రవ్యత్యాగమునకై అందు దేవత యుద్దేశింపబడును. కాగా ప్రకృతాంశమున నీయాగమెట్లుపపన్నమగును? స్వాత్మతత్త్వమె ఇందు నుపాస్యము. అది తనకన్న నతిరిక్తముగాదు. అతిరిక్తమైనకాని యాగము కుదురదు. ఇందు దీనిని గుర్తింపవలెను. సంవిదుపాసనము అహం బోధ. ఇది విధి పూర్వము కానేకాదు. ఇదివాస్తవమే. ఐనను సాధకులగువారు స్పష్టముగా దీనిని గుర్తింపలేరు. ''తం విదంతోపి నోవిదుః'' శివుని తెలుసుకొనుచున్నట్లున్నను సరిగా తెలిసికొనలేరు. అందువలననే గీతా గురువిట్లనెను. ''నతు మామభిజానంతి తత్వేనాతశ్చ్యవంతితే'' యథార్థముగా నన్ను గుర్తించుటలేదు. అట్లు సరిగా గుర్తింపకుండుటచే వారు జారిపడి సంసారగతులు పొందుచున్నారు.

శ్లో॥ యేబోధాద్వ్యతిరిక్తం హి కించి ద్యాజ్యతయా విదుః ।
తేపి వేద్యం వివించానాః బోధాబేదేన మన్వతే ॥

కొందరు జనులు స్వసంవేదనముకన్న ఉపాసనములోనుండునది యాజ్యమగునది వ్యతిరిక్తమని భావించుచున్నారో, వారును, తెలియదగిన యంశమును బాగుగా వివేచనముచేసి తెలిసికొన్నచో స్వసంవేదనము కన్న నేదియు నతిరిక్తము కాదనియే గుర్తింపఁగలరు. మొదట మొదట తాముపాసించు తత్త్వము తమకు వెరుగా గోచరింపవచ్చును. కాని బాగుగా పర్యాలోచనముచేయగా నంతయు తమ స్వరూపమేయని గోచరించును.

శ్లో॥ వేద్యో వేదకతామాప్తో వేదక స్సంవిదాత్మతాం ।
సంవిత్తదాత్మా చేత్సత్యం తదిదం త్వన్మయం జగత్॥

పరశివా! వేద్యుడవగునీవు వేదకుడై తెలిసికొను నట్టి సాధకుని స్వరూపమే పొందితివి. వేదకుడైన సాధకుడు సంవిద్రూపమే పొందెను. సంవిద్రూపుడగుటనాతడాత్మయేకదా! కాగా జగమంతయు త్వన్మయమేయైనది. ఈ భావముగల ఈ పద్యమే తెలియదగు శివతత్త్వమును తెలిసికొను సాధకునికి తత్త్వమును స్పష్టము చేసినది. ఉపాసనాత్మకమైన యాగమొనరించు యజమానసంవేదనమె యాతని యాగమున సంవేద్యముగా నున్నది. ఆసంవిదతిరిక్తముగా నచట వేఱొకటిలేదు.

శ్లో॥ సోయమాత్మానమావృత్య స్థితో జడపదం గతః ।
ఆవృతానావృతాత్మాతు దేవాది స్థావరాంతగః ॥

శివుడే తనరూపము నావరించుకొని జడముగా కన్పడును. దేవాది స్థావరాంతమైన ఈ జగమంతయు నిండి యావరింపబడియు నావరింపబడకయు గోచరించుచున్నాడు. ఈతత్త్వము సరిగతెలియని సాధకుడు దేహమున నానామలముల గూడి సంచరించుచున్నాడు. పరిజ్ఞానములేని యొకకీటకము సాలెగూడు పంజరములో చిక్కుకొని దారములన్నియు చుట్టు పొదుపుకొనగా నందే విహరించునుగదా! నానాకారములైన భావప్రభావముల గూడి ఇచ్చాకేమ బహిష్కృతుడై స్వబుద్ధిభావ రహితుడై, భ్రమించుచున్నాడు. సాధకుల చిత్తమునందు కర్మబంధములు మలబంధములు, మాయాబంధములు సంస్కారరూపముగా నెన్నియో యున్నవి. వాని నన్నిటిని పోగొట్టుకొనవలయును.

శ్లో॥ దీక్షైవ మోచయత్యూర్ధ్వంశైవం ధామ నయత్యపి ।

దీక్షయన్నది కర్మమలమాయాబంధములను విమోచింపజేయును. శివధామము పొందింపజేయును. ఈదీక్షాసిద్ధికై మూడుపాయములున్నవి. శాంభవోపాయము, శాక్తోపాయము, అణవోపాయము అని. వీనినే దీక్షలనియునందురు. ఇటుపై దీక్షార్థములను గుర్తింపవచ్చును.

(సశేషము)

---

ఓం యోబ్రహ్మాణం విదధాతి పూర్వం । యో వై వేదాంశ్చప్రహిణోతి తస్మై ।
తంహదేవమాత్మబుద్ధి ప్రకాశం । ముముక్షుర్వైశరణమహం ప్రపద్యే ॥

ఓం శాంతిః శాంతిః శాంతిః.

తా॥ ఏపరమాత్మ బ్రహ్మదేవుని సృష్టించి వేదముల నొసంగుచున్నాడో, తేజోవంతుడై మనోబుద్ధులను ప్రకాశింపజేయునట్టి, ఆ పరమాత్మను ముముక్షువునగు నేను శరణు పొందుచున్నాను.

# ఆహ్వానసంఘాధ్యక్షుని స్వాగతోపన్యాసము

**1955 జనవరి 8, 9, తేదీలయందు రాజమహేంద్రవరమునందు జరుపబడిన భక్తివిషయక మహాసభ**

మహాశయులారా!

ధర్మార్ధ కామ మోక్షములనియెడు చతుర్విధ పురుషార్ధములలో నిత్యమగుటచే మోక్షమే పరమపురుషార్ధమనియు, అట్టి మోక్షమునకు భక్తియే సులభ సాధనమనియు, భక్తికి ముఖ్యావలంబమగు భగవానుని సకల జగన్మోహన దివ్యపరిపూర్ణ మంగళమయమధుర మనోహరస్వరూపజ్ఞానమునకు దేవాలయములు ముఖ్య ప్రతీకములనియు జెప్పబడుటచేతనే తద్భక్తివిషయిక పర్యాలోచనలకై యాహ్వానింపబడిన మీకెల్లరకును స్వాగతము.

భారతదేశము భూమండలమునకు హృదయమనియు, భగవదవతారలీలలకు ప్రధానరంగమనియు, ఆధ్యాత్మిక సామ్రాజ్యమునకు రాజధానియనియు, విజ్ఞానమునకు నిలయమనియు, విద్యలకు విశ్వవిద్యాలయమనియు, కళలకాలవాలమనియు, ధర్మమునకు జగద్గురుపీఠమనియు, తరతరములనుండియు ఖండఖండాంతరవాసులచే గుర్తింపబడుట జగద్విదితము.

కాని, కాలవాహినిలోని యావర్తములచే సత్వాదిగుణయుక్తులగు దేవదానవులకు హానివృద్ధులు గల్గుట ప్రకృతిస్వభావమగుటచే ప్రకృతమున భారతదేశమున స్వసాంప్రదాయత్యాగము, అన్య సాంప్రదాయాభిలాష ఆధ్యాత్మిక భ్రంశము, నైతిక పతనము ఆర్ధిక దాస్యము, నాస్తికత్వము మున్నగు దోషములు గన్పడుట శోచనీయము.

సన్మార్గత్యాగమునను, పాపభీతిలేమిని పాపాచరణమునను అతివృష్ట్యనావృష్టులు, అగ్నిప్రమాదములు, వరదలు, భూకంపములు మున్నగు బాధలెన్నియో పొడసూపుచున్నవి. "సుజలాం, సుఫలాం, మలయజశీతలాం" అన్నమాటలు పాటలోననేగాని ప్రత్యక్షముగ గనుపించుటలేదు. స్వాతంత్ర్యము, సమృద్ధి, శాంతి, ఆనందము అని భారతీయ హృదయము నలుమూలలకును పరువులిడి ఫలితము గానరామి కృంగి కృశించుచున్నది.

లౌకికాభ్యుదయ పారలౌకిక నిశ్శ్రేయసములకు ధర్మము మూలభూతమనియు, ధర్మాచరణమున స్వర్గాపవర్గములేగాక సామ్రాజ్య, వైరాజ్య అనంత ధన ధాన్య, విజయ స్వాతంత్ర్యాదులు సైతము గల్గు ననెడి మహర్షుల నిర్వచనము లీనాటి మానవులకు రుచింపకున్నవి. నామమాత్రమగు నినాదములచే ప్రజలకు అన్న, వస్త్ర, విద్యా, వైద్య, న్యాయసౌకర్యముల జేకూర్చగలమను సంస్థలు కొన్ని శాస్త్ర దూరమగు స్వేచ్ఛాచరణ ప్రధానములై ప్రవర్తించుచున్నవి. పరిశీలించి చూచినచో లౌకిక పారలౌకిక నిశ్రేయసముల కన్నిటికి భగవాను డధిపతియనియు, ఆ భగవంతుడు భక్తి సులభుడనియు తెలియనగును. అంతియకాక భగవానుడు ధర్మస్వరూపుడనియు, భగవంతునియందు ప్రేమ, భక్తియనినచో ధర్మాచరణమందు భక్తియనియుగూడ తెలియనగును. భక్తుడగువాడెవ్వడును అధర్మాచరణమును జేయజాలడు. భక్తుని మనస్సు ధర్మపథమునుండి రవంతయైనను ప్రక్కకు తొలగజాలదు, తన అస్తిత్వమును ఖండించువానికిగూడ భద్రమును కలుగజేయువాడు భగవానుడు. అట్టి భగవానునియందు భక్తిగలవాడు మాత్రమే తన కపకారమొనరించినవానికిగూడ కల్యాణమును వాంఛించగలడు. "లోకాఃసమస్తాః సుఖినోభవన్తు" అనెడిసూక్తి భగవద్భక్తుని విషయమున మాత్రమేపరిపూర్ణసార్ధకమగుచున్నది. కనుక లోకకళ్యాణమును గోరువారందరికి భగవద్భక్తి యెంత యావశ్యకమో సువిదితమగుచున్నది. కాలము మారెననియు కాలప్రవాహమున మనము కొట్టుకొని పోవలసినదె యనియు జెప్పువారు, నియత గమ్యస్థానమునకు పూర్వాచార్యక్షుణ్ణమార్గమున పోవువారు కాలప్రవాహమునకు లోబడరనియు, ప్రవాహమున కొట్టుకొనిపోవునని నిర్జీవశవములనియు, సచేతను డెదురీదియైన గమ్యస్థానమునకు జేరుననియు, పురుషకారమే కాలమునకు కారణమనియు గ్రహింపరైరి. ప్రాచీనతను రోయు నూతనప్రియులు, నూతన సూర్య చంద్రులను, నూతన పంచభూతములను సైతము కోరుట కంగీకరింపరైరి. వీరికి పౌరాణికసత్యములందు నమ్మకము లేకపోయినను చాణక్య, విక్రమాదిత్య, భోజాదుల చారిత్రకకాలపు ప్రజల ధార్మిక ప్రవృత్తులను వర్ణించు మెగస్తనీస్, ఫాహియాన్, హుయాన్సాంగ్ మున్నగు వైదేశిక యాత్రికుల వ్రాతలలోని సత్యమైనను గోచరింపకునికి శోచనీయము. భారతీయులను కాంతా కనకవస్తు వాహన వైద్య సౌకర్యములతో లోబఱచుకొని మతభ్రష్టులజేసి ఇహపరదూరుల జేయు సంస్థల యౌద్ధత్యమును గుర్తింపరైరి.

మహాజనులారా! ఇట్టివిషాదకర పరిస్థితులలో మన మింకెంతకాలముపేక్షించుట. అజ్ఞానాంధకారముల నలమటించుచు వంచకులచే పీడింపబడుచు నిరయాగ్నిజ్వాల కాహుతియగు దీనుల రక్షింప ప్రయత్నించుట మన **విధి కాజాలదా?**

ఇట్టితరి సమాహూతులగు పీఠాధిపతులు, మఠాధిపతులు, మహంతులు, సిద్ధులు, యోగులు, పండిత ప్రకాండులు, రాజకీయ ధురంధరులు మున్నగు మహానుభావులచే నలంకరింపబడిన యీ మహాసభకు మా వినయపూర్వక విన్నపమేమన; ఇప్పట్టున బహుముఖములగు సంస్థలలోని వ్యగ్రతకు కారణమగు యజ్ఞానమును పోగొట్టి మానవుని స్వార్థరహితునిగజేయుడు. భారతదేశమునకు గల నైసర్గికోత్కృష్టతను గమనించి విశ్వోద్ధరణమునకు ప్రధాన కేంద్రమని చాటుటలో పటువులగు, వైజ్ఞానిక వటువులను తయారుజేయుడు. సర్వతోముఖవిశ్వకళ్యాణ సాధనిర్మాణమున కావశ్యకమగు కర్మ, జ్ఞాన, భక్తిమార్గముల పునః ప్రతిష్ఠితములుగా జేయుడు.

అందునను ప్రధాన ధ్వజములుగానున్న మన దేవాలయములే అధ్యాత్మిక పరిపాలనా కేంద్రము లనియెడి చైతన్యమును గలుగ జేయుడు. లౌకిక రాజ్యనిర్వహణమునకు సైతము దేవాలయనిర్మాణ, నిర్వాహనముద్ధరణము లావశ్యకములని నిరూపింపుడు. ప్రజలలో దైవభక్తియు పాపభీతియు హెచ్చినకొలదియు అన్యోన్య ద్రోహములు నేరములు తగ్గి లోకమునకార్థిక పారమార్థికాభివృద్ధులు గల్గునని చాటుడు.

సృష్ట్యాది ప్రళయావసానపర్యంత వ్యాప్తమగు యవిచ్ఛిన్న కాలాత్మక మహాకల్పమున అత్యంతిక, ప్రాకృతిక, నైమిత్తిక, నిత్యసృష్టులలోని యవాంతర కల్పములందు శ్రుతి స్మృతి సదాచారరూప ధర్మ నిర్దేతలగు బ్రహ్మాదు లీబ్రహ్మాండమునందలి యనంతకోటి సూర్యకుటుంబములలో నేకదేశమగు భూమండలాంతర్గత భరతవర్షమున తమ తమ దివ్యజ్యోతిర్మయ మూర్తులతో నభివ్యక్తమగు క్షేత్రరాజముల నాధ్యాత్మిక పరిపాలనా కేంద్రములుగ జేసికొని బ్రహ్మాండసామ్రాజ్యమును పరిపాలించుచుండిరిగదా! ఇట్టి పరిపాలనా సౌకర్యమునకు భారతవర్షము పండ్రెండు అధ్యాత్మిక రాష్ట్రములుగ విభజింపబడి (1) సౌరాష్ట్ర-సోమనాథము, (2) శ్రీశైల-మల్లిఖార్జునము, (3) ఉజ్జయినీ-మహాకాళము, (4) ఓంకార-అమలేశ్వరము, (5) హిమాలయ-కేదారము, (6) భీమారామము, (7) వారణాసీ-విశ్వేశ్వరము, (8) గౌతమీతట-త్ర్యంబకేశ్వరము, (9) పరేలీ - వైద్యనాథము, (10) దారుకా—నాగేశ్వరము, (11) సేతుబంధ-రామేశ్వరము, (12) విలారామము-ధిషణేశ్వరుడు (జ్యోతిగ). అను పండ్రెండు రాజ్యాంగ కేంద్రములు గల్గియున్నదిగదా! ప్రతిరాష్ట్రమునను రాజ, యువరాజ, సేనాధ్యక్ష, మంత్రి, పురోహిత, ధర్మాధ్యక్ష, దండపాలాది సమస్త అధికారిక మూర్తులును బాహ్యములగు అర్చామూర్తులతో నిమిత్తము లేకయే సంపూర్ణావరణ దేవతలతో యథాస్థానముల యందుండి స్వకీయోపమండలాదిపతులగు బదరీనాథ, జగన్నాథ, పండరీ, శ్రీరంగాది దివ్యస్థలాధి దేవతలతోను, కాంచీకామాక్షి, శ్రీశైల భ్రమరాంబికా, మధుర మీనాక్షి, అలంపుర జోగులాంబా, కాశ్మీరశారదాంబాది శాక్తపీఠాధి దేవతలతోను భక్తుల తపోదాన జపహోమార్చ నాభిషేకాదులకు యథాధికారముగ ఫలప్రదానము జేయుచు పరిపాలించుచున్నట్లు పెక్కుపురాణాగమ తంత్రాదులయందున్నదిగదా! ఈ దేవతా పరిపాలనా కేంద్రములకు సరిహద్దులుకూడ పురాణాది ప్రసిద్ధములుగదా! మరియు సంకల్పమాత్రముననే రోగాద్యుపద్రవశాంతికరములగు తిరుపతి, ఘుశ్మేశ్వర, అన్నవరాదులును, దర్శనసేవాదులచే గ్రహరోగాదుల పారద్రోలు ఘటికాద్రి, వేదాద్రి, రామేశ్వరము మున్నగు క్షేత్రముల మహిమలు వేరే చెప్పవలయునా? ఇంతియేగాక గంగా, గోదావరీ, కృష్ణా, కావేర్యాది పుణ్య తీర్థములును, గయా, ప్రయాగ, బ్రహ్మకపాలాది క్షేత్రరాజములును పితృదేవతారాధన యోగ్యములై వెలయుచున్నవిగదా. ఇట్టి నిసర్గసిద్ధములగు తీర్థక్షేత్రములేగాక రామాద్యవతారమూర్తుల చేతను, వశిష్ఠ పరాశరాది ఋషిసత్తములచేతను, శంకరరామానుజ మధ్వాది ధర్మోద్ధారకుల చేతను ఇతర భక్తశిఖామణులచేతను ప్రతిష్ఠితములై నేటికిని మహావైభవముగ రాగభోగముల నందుచు భక్తుల నుద్ధరించుట జగద్విదితమేగదా! ఇట్టి మహామహిమాన్వితములగు క్షేత్రరాజములచే నలంకరింపబడి హరిశ్చంద్రాది చక్రవర్తులచేతను, ధర్మరాజాది శకాధిపతుల చేతను ప్రకాశింపబడి, నేటికిని విద్యారణ్య, కృష్ణదేవరాయ, శివాజీ, ఝాన్సీ లక్ష్మీబాయి, రామదాస, త్యాగరాజ, రామకృష్ణ పరమహంస. మహాత్మా గాంధీ, సదాశివేంద్ర సరస్వతీ, చంద్రశేఖర భారతీ, చంద్రశేఖరేంద్ర సరస్వతీ, హరిహరానంద సరస్వతీ త్యాది పుణ్యమూర్తుల ప్రసవించుచున్న పుణ్యభూమియం దుద్భవించిన మనము ధర్మరక్షణకు వలయు ప్రయత్నమునైనను జేయవలయునుగదా!............

క్షేత్రముల సక్రమనిర్వహణమునకై బద్ధ కంకణులు కండు!

శైవ, వైష్ణవ, శాక్తేయాది వివిధ సిద్ధాంతములకు ననువగు ప్రత్యేకాలయములలో శిల్ప సంబంధమగు ప్రతిమా లక్షణములు, విగ్రహ ప్రమాణములు, భంగిమా విశేషములు, ధృవోత్సవాది బేర స్వరూపములు, కర చరణాది లక్షణములు, దృష్టి భేదములు, ప్రతిమాద్రవ్యములు, జల ధాన్య క్షీరాధివాసములు, గోపుర ప్రాకారాదులు, యంత్రోద్ధార పీఠస్థాపనాష్టబంధనాదులు, మాతృకాదిన్యాసభేద

ములు, కళావాహన ప్రాణప్రతిష్ఠాదులు, జపహోమార్చన మంత్రతంత్ర యంత్రాత్మక కర్షణాది ప్రతిష్ఠాంత ప్రక్రియలు పాటించుటయు, తత్తన్మర్యాదాతిక్రమణమువలన రాజ, రాష్ట్రగ్రామార్చకాచార్య బ్రాహ్మణాది సర్వులకును గలుగు క్షామ, డామర, మారీగణ, చోరాగ్నిభయ, దుర్భిక్ష రాష్ట్రభంగాదిమహోపద్రవములును తెలిసి ప్రవర్తించుటయు ఇతరులను ప్రవర్తింప జేయుటయు మన కర్తవ్యమని యెరుంగుడు.

ప్రతిక్షేత్రమునకును గల క్షేత్ర పురాణమును, దేవతా మహిమలును, ప్రత్యేకముగ తరించిన పౌరాణిక చారిత్రక మహావ్యక్తుల చరిత్రలును నేటికిని పరిదృశ్యమానములగు దృశ్యవిశేషముల చిత్రపటములతోనహా ముద్రింపించి ప్రజలలో భక్తి ప్రపత్తు లధికమగునట్లు చేయుడు.

నిత్యమును దేవాలయములలో ప్రభాత, ప్రదోష, దైనందిన, నిత్యోత్సవ, పక్షోత్సవ, మాసోత్సవ, వర్షోత్సవాదులు సక్రమముగ జరుగునట్లేర్పరచి అందు గ్రామస్థులు స్వస్తి వాచకమంత్రపుష్పాదులయందు పాల్గొని తరించునట్లేర్పరచుడు.

మంగళవాద్యములతో నిత్యసేవలు చేయించి గ్రామములలోని యమంగళవాసనల దూరముగ పారద్రోలుడు. దేవాలయములందు రామాయణ, భారత, భాగవతాది పురాణములలోని భగదవతార విశేష కళ్యాణ గుణములను బోధించు చిత్ర నిర్మాణముచే ప్రజలను భక్తిపరాయణులుగను, మోక్షాయత్తులుగను జేయుడు.

దేవాలయములే వేద వేదాంగ ఉపవేదేతిహాస, పురాణ న్యాయ మీమాంసా యోగ సమయాది భారతీయ విద్యలకును నృత్తగీతాది చతుష్షష్టి కళలకును ప్రదర్శనశాలలై, శిక్షా కేంద్రములై పరీక్షాస్థానములై ప్రవర్ధకహేతువులై, పోషకప్రభుస్థానములై వెలయుచుండునను సత్యమును సార్థకముజేయుడు.

ముముక్షుజనోపయోగముగ భగవత్ప్రణీతములైన శైవ, వైష్ణవ (వైఖానస, పాంచరాత్ర) ఆది ఆగమముల విధానభేదములను అందలి మూలసిద్ధాంత, తత్వములను బోధించు జ్ఞానభాగములను తత్త్వప్రేరకాది దేవతా విజ్ఞాన తద్వశీకరణోపాయాదుల దెల్పుక్రియాభాగములను, తత్త్వశోధన-అధ్వ మూర్త్యారాధన, జ్ఞానసాధక మనోవశ్యాదుల దెల్పు యోగ భాగములను, జ్ఞాన యోగావాప్తికి వలయునదాచారానుష్ఠానములను దెల్పు చర్యా భాగములను, సవిమర్శముగ బోధించు గురుకులములను స్థాపింపుడు.

దేవాదాయ, ధర్మాదాయముల ధర్మ కర్తృత్వములకై పెనగులాడువారలకందలి బాధ్యతలను, ప్రమాదములను పరిణామములను బోధించి అర్హులైనవారిని ప్రోత్సహింపుడు. దేవాలయములకు పంచప్రాణములు నాబరగు ప్రాకార, గోపుర, ధ్వజ, మందిర విగ్రహాదుల లక్షణములను బోధించి తత్తల్లోపములవలన గ్రామాదులకగు యరిష్టములను నిరూపించి సవరింపగల సమర్థులను నియోగింపుడు. అర్చకాచార్యాది పరివార నియమములను నిత్యోత్సవాది కార్యక్రమములను నేర్పుటకై శిక్షణాలయములను మండలమున కొక్కటియైనను నుండునట్లేర్పాటుజేయుడు.

మత ప్రచారమునకును, భక్తి ప్రచారమునకును సమర్థులగు పండిత ప్రచారకుల నొక్క పరిషత్తుగ నియమించి వారి మూలముగ ప్రచారము చేయించుటకు తగిన విధానముల నేర్పరచుడు.

దేవాలయములనియెడి విద్యా-ధర్మ పీఠములద్వారా యీ క్రింది కార్యక్రమములు జరుగునట్లేర్పరచుడు.

1. మత ప్రచారము, భక్తి ప్రచారము.
2. అగమ విద్యాలయాభివృద్ధి.
3. అర్చక అచార్య శిక్షణము.
4. దేవాలయ శిల్ప విద్యాలయ స్థాపనము.
5. అధ్యాత్మిక పత్రికా ప్రచురణము, అధ్యాత్మిక గ్రంధముల ముద్రణము తద్గ్రంథ వ్యాప్తికై కృషి.
6. దయా, సత్య, శౌచ, అధ్యాత్మిక జ్ఞాన శిక్షణాదులు.
7. నామ సంకీర్తన, గీతాపారాయణ, రామాయణ భారత భాగవతాది పురాణ ప్రవచన, జపహోమార్చనాభిషేక ప్రస్తావ హరికథా ధార్మికోపన్యాసాది సత్కాలక్షేపములు.
8. విద్యా, విజ్ఞాన, కళాపరిశ్రమారోగ్యాభివృద్ధికి వలయు సమాలోచనలు.
9. అధ్యాత్మిక విషయములనుగురించి విద్యార్థుల వ్యాస, వక్తృత్వపోటీ పరీక్షలు, బహుమతులు.
11. దేవాలయ, విద్యాలయ గ్రంధాలయ నిర్మాణ నిర్వహణ, సముద్ధరణాదులు.
11. కళ్యాణ, జయంతి, నవరాత్ర, సప్తాహాది వార్షికోత్సవాభివృద్ధి.
12. ధర్మదీక్ష, దేశభక్తి ప్రచారము.

ఈ పై యాశయముల పై సమావేశమున కాహూతులైన మహానుభావులు తమతమ యభిప్రాయములను లిఖిత రూపమున గాని, ఉపన్యాసరూపమునగాని దయజేసి కార్యరూపము నొందించి విశ్వకళ్యాణసౌధ నిర్మాణమునకు తోడ్పడ ప్రార్థితులు.

"లోకాః సమస్తాః సుఖినోభవన్తు"

రాజమహేంద్రవరము
8-1-1955

కొండూరి అచ్యుతరామయ్య,
ఆహ్వాన సంఘాధ్యక్షుడు.

EDITORIAL NOTES :—

Various effects in Temples in Guntur Dt. produced by the Hindu-Religious & Charitable Endowments (Adm.) Department.

1. Sri Bhavanarayanaswami Temple, Ponneri Village, Bapatla Taluq :— A Sanskrit College is being maintained by the Temple Funds. The recurring cost is Rs. 18,000/- every year. There are about 120 students reading in this College. The deserving students are also provided with stypends.

Besides the Sanskrit College, Agama Pathasala is maintained by the Devasthanam Funds in which students are being trained for the various duties in the Temples of Andhra.

2. Sri Chenna Malleswaraswami Temple, Bethapudy, Sattenapalli Taluq :— Two new temples were constructed, one for Sri Parvathamma and the other for Sri Veerabhadra.

3. Mukhamandapams were constructed for the following Temples :—
   1. Chennamalleswaraswami Temple, Bethapudy, Sattenapalli Taluq.
   2. Sri Govardhanaswami Temple, Nadendla.
   3. Sri Anjaneyaswami Temple, Satuluru.
   4. Sri Venugopalaswami Temple, Appapuram.
   5. Sri Malleswaraswami Temple, Doppalapudy.
   6. Sri Venkateswaraswami Temple, Appikatla.

4. Vimanagopurams were constructed for the following Temples.
   1. Sri Venugopalaswami Temple, Jagarlamudi.
   2. Sri Agastheeswaraswami Temple, Mamillapalli.
   3. Sri Ramalingeswara Temple, Salapadu.

5. Dhwajasthambhams were installed in the following Temples.
   1. Sri Malleswaraswami Temple, Gorantla.
   2. Sri Chennakesavaswami Temple, Jagarlamudi, Sattenapalli Taluq.

6. The followiug Temples were renovated :—
   1. Sri Veerabhadraswamy Temple; Jagarlamudi.
   2. Sri Ramalingeswaraswami Temple, Rajapalem.

7. A big tank at a cost of Rs. 2000/- was constructed at Sri Trikuteswaraswami Temple, of Kotappakonda, for the supply of water to the pilgrims.

8. Besides the above constructions, the following amounts were spent for the educational purposes :—

   1. An amount of Rs. 500/- was sanctioned from the surplus funds of Sri Kesavaswami Temple, Kolluru, for the Religious Library.

   2. An amount of Rs. 300/- was sanctioned for T. Venkatnarayanasastri, Research Scholar in Telugu, Andhra University, from the surplus funds of Sri Venugopalaswami Temple, Kolluru.

   3. An amount of Rs. 500/- was sanctioned from the surplus funds of Sri Salihotra Maharshi temple of Chirala for stypends to deserving students of Padmasali Community.

In the East Godavari District in the premises of Sri Pattabhiramaswsmi Temple at Avidi, Dhwajasthambham was installed by Sri Satyanandaswamy of Hrishikesh with a cost of Rs. 4000/- Four Thousand Rupees.

A separate Temple for Sri Anjaneyaswami varu was constructed in the above temple premises, by Sri Peddinti Narasimhacharyulu of Avidi with a cost of Rs. 2000/- Rupees Two Thousand.

## REPORTS

Under the auspicies of the authorities of Sri Veera Venkata Satyanarayana Swamy temple, a meeting was addressed by His Holiness Swami Ramananda Bharati (Sidheswari Pitham) of Courtalam, during his visit to Annavaram on 26th Feb. 1955.

In the course of his address His Holiness emphasized the need for the spread of spiritual knowledge in the people in general and amongst the masses in particular for the progress and stability of our Welfare State. Since development of character of every citizen is the bedrock of the special well being of the nation on which the future of the entire State depends, no spiritual teaching takes root in the minds of the masses, unless their character is moulded and built up. Mere material well-being which is only an existence and transient, is not the end and aim of human life. The people must be made to understand and realise this and that there a life after this death, and the JIVA in each physical body has no death and therefore eternal. The fear of the consequences of to day's immoral life in the inevitable next birth is a security against indiscipline, and irresponsibility of the individual citizen. The sum and total welfare of the State entirely depends on the character of the individual and his religious education and cultural life. To shape his character is the urgent need of the hour, he stressed, more urgent than the five year plan and projects.

With a vote of thanks to His Holiness by the Manager of the Devasthanam the meeting came to a close.

## శ్రీ అంతర్వేది లక్ష్మీనృసింహస్వామివారి కళ్యాణమహోత్సవములు

ఈ సంవత్సరము శ్రీస్వామివారి కళ్యాణమహోత్సవములు ది 30-1-1955 తేదీనుండి ది 8-2-1955 తేదీ వరకు మిక్కిలి వైభవముగా జరిగినవి. దేవాదాయముల డిపార్టుమెంటువారితో రెవిన్యూ, పోలీసు, పి. డబ్ల్యు. శాఖలవారు సహకరించి యాత్రీకుల సౌకర్యార్థము చక్కని ఏర్పాట్లు గావించిరి

గత సంవత్సరములోవలెగాక యీ తీర్థమునకు నీటివసతి పుష్కలముగా చేయబడినది. వచ్చిన యాత్రీకులందరూ సంతృప్తిపడి ఆనందపడిరి. పోలీసువారు మంచి బందోబస్తు ఏర్పాటుచేసిరి. శ్రీస్వామివారి రథయాత్ర ఏవిధమైన చిక్కులు కలుగక జయప్రదముగా జరిగినది. బహుకాలమునుండి జరుగుచున్న కళ్యాణములకు వేయబడని వెల్లపూతలుసయితం భక్తులవల్ల వేయబడుటచేత యాత్రీకులు నేత్రోత్సవముగా సందర్శించి ఆనందమును పొందిరి. అదిన్నీగాక కళ్యాణవేదిక రంగుపూతలచేతను ఆకర్షణీయముగా అలంకరింపబడినది.

## తీర్థయాత్ర వివరములు

అంతర్వేది తీర్థయాత్రికులు మాఘ శుద్ధసప్తమి నాటికి అంతర్వేది పుణ్యక్షేత్రము చేరిరి. దశమినాడు పవిత్ర వశిష్టగోదావరియందును సాగరసంగమమందును స్నానములను గావించిరి. ఆ రాత్రి అనేకవేల భక్తులు దేవాలయమంతయూ క్రిక్కిరిసిగా నిండి, శ్రీ రాజ్యలక్ష్మీనృసింహదేవులకు జరిగిన కళ్యాణమహోత్సవ వైభవమును భక్తి శ్రద్ధలతో కన్నులార వీక్షించి ధన్యులైరి. తరువాత పవిత్రమైన తలంబ్రాక్షతలు స్వీకరించి భక్తితో శిరమున ధరించి

జన్మసార్థకము గావించుకొనిరి. మరునాడు ప్రాతఃకాలమున వేలాది భక్తులు భీష్మఏకాదశి పర్వోదయవేళ పవిత్రమైన సాగరసంగమమునను, సముద్రమునందుననూ, సంకల్పవిధిని స్నానముగావించి శక్త్యానుసారముగా దానధర్మములు గావించిరి. భక్తురాండ్రు పుణ్యమూశవాయనములు యిచ్చిరి. అటుపైని శ్రీ లక్ష్మీనృసింహస్వామివారి దేవాలయమున ప్రవేశించి దేవదేవుని అభిషేక, సహస్రనామ, అష్టోత్తరశతనామ, పూజలతో యథాశక్తిని ఆరాధించిరి. తరువాత చుట్టూనుండు కొవెలలయందలి దేవతామూర్తులను దర్శించిరి.

ఏకాదశిమధ్యాహ్నము గ. 3-30 లకు శ్రీస్వామివారి రథయాత్ర ప్రారంభమైనది, "రథస్థం కేశవందృష్ట్వా పునర్జన్మనవిద్యతే." యను ఆర్యోక్తిననుసరించి రథస్థితుడగు శ్రీ లక్ష్మీనరశింహులగాంచి, నిర్నిరోధ రథగమనమునకు సాయపడి జన్మసార్థకము గావించుకొనిరి. రథముతోపాటు ఏగి దేవాలయమునకు ఒక మైలు దూరమందుండు "అశ్వారూఢాంబను" సేవించుకొనిరి. మరునాడు ద్వాదశిరోజున యాత్రీకులు సాగరసంగమమందు స్నానముగావించి పంచామృతములచేతను, శ్రీస్వామివారి అభిషేకొదులు గావించిరి. ద్వాదశినాడు సాయంత్రము గ. 3-0 లకు శ్రీస్వామివారు రాజాధిరాజ వాహనముపై ఊరేగిరి. ఆనాటి రాత్రి వేలాది భక్తులు శ్రీస్వామివారి పొన్నవాహనోత్సవమును దర్శించిరి. త్రయోదశిరోజున రక్తకుల్యయందు స్నానమాచరించి రాత్రి సదస్యము జూచిరి. చతుర్దశియందు వశిష్ట గోదావరియందు స్నానముగావించి రాత్రి శ్రీస్వామివారు అశ్వవాహనారూఢులై యూరేగుచూవచ్చి పదహారు స్తంభముల మంటపముపై వేంచేశియుండగా అచ్చట చోరోత్సవము జరుగగా చూచిరి. అచ్చట పేరూరు బ్రాహ్మణోత్తములు గావించిన వేదపారాయణమును స్వాములు పఠించు చోరఉత్సవపు గాథను విని ఆనందించిరి. మాఘపౌర్ణమి ఆదివారం రోజున శ్రీస్వామివారితోపాటు సముద్రమునకు వెళ్ళి చక్రమునెత్తి పైనిడుకొని సంకల్పయుక్తముగా వేలాదివేలు భక్తులు సముద్రస్నానము గావించిరి.

బహుళపాడ్యమినాడు రాత్రి శ్రీ లక్ష్మీనృశింహదేవునకు పుష్పోత్సవము జరిగినది. సుజనులగు భక్తులు శ్రీస్వామివారి తీర్థప్రసాదములను స్వీకరించి యాత్రాఫలితమును పొంది ధన్యులైరి.

## REVIEWS

శ్రీశైల మహాక్షేత్రము :— తెలుగు— రు. 0-10-0లు వెల— ప్రాప్తిస్థానము— శ్రీ లక్ష్మీగణేశ జ్యోతిషాలయము. రావిపాడు, కర్నూలు జిల్లా, రచయిత ; వాడ్రేవు వేంకట శేషగిరి రావు.

English Rs. 0-10-0.—Sri Lakshmi Ganesha Jyothishalayam; Ravıpadu; Cumbum Tq. Kurnool Dt. Author—V. V. Seshagiri Rao.

Both these books are intended to serve as guides to the important Saivaite pilgrim centre Sri Sailam so famed in *puranas* and they serve their purpose well. , They are neatly printed and profusely illustrated and one gets a fair view of the wild grandeur of the part crumbling structures connected with Srisailam. We commend these books to the intending pilgrims.

---

## ERRATUM

The Readers are requested to note that the designation of Dr. K. C. Varadachari, M. A. Ph. D. is "Professor of Philosophy & Head of the Department, Sri Venkateswara Art's Callege. Tirupati." but not as committed on page 37 of the first issue. We regret the mistake committed.

[Editor]

# PRESIDENTIAL ADDRESS DELIVERED

*By*

SRI R. VENKATAREDDI B. A., B. L.

*Commissioner, Hindu Religious & Charitable Endowmnts (Andhra)*

AT DIVINITY CONFERENCE HELD AT RAJAHMUNDRY ON 8th & 9th JANUARY '55

*Sisters and Brothers,*

With all humility, I thank the organisers of this Divinity Conference for the honour done in asking me to preside over this occasion. I have accepted the same with the hope and enthusiasm of deriving the inspiration and light from associating with the great souls that would gather in a congregation of this kind. I am sure that all the men and women that have gathered here are persons of great learning and devotion, who are moved with a genuine yearning for the divine light, which truly blesseth him that gives and him that takes.

The world is passing through a critical stage. All the great advances made in the materialistic sciences in the western world through the past few centuries, with a view to achieve greater happiness, neglecting the spiritual needs, have only culminated in the two world wars at short intervals of 20 years, which have only actuated the miseries of the people. All the world over, they are now aghast at the result, and are beset with the real doubts and fears as to the way out. If they do not change their way of life, a third and a more devastating war stares them in the face. This exactly is the situation, the Great Arjuna found himself in, which opportune moment, the all merciful Lord siezed, to drive home the divine truths for the benefit of humanity at large. If we, therefore, follow the lead of Arjuna, there can be, no doubt, whatever, of the merciful deliverance from the dilemma.

We are proud of our rich heritage. The *srutis, smrutis* and the *upanishads* are now recognised by the world at large to be the most ancient and that the truths propounded therein to be the profoundest. Our *puranas* prove that our countiy has always followed these *truths.* Our two great epics Sri Ramayana and Mahabharata show in a vivid and an inimitable way how to adopt those truths to practical life. In the Bhagavatam, the glories of the Almighty are painted in such arresting colours, as the literature of no other country can boast of. What about the epitomisation of all the *universal truths* for the practical use of every day life, compiled within the small compass of the *Bhagavatgita.* The knowledge necessary for the human society is said to be compiled in the *Shat-s'asthras.* But being uninitiated and in blissful ignorance of the contents of any of these, I shall not venture to speak more about them, but leave that task to the enlightened men that have gathered here. The world has recognised the greatness and usefulness of all these great works and have began to catch their spirit. They unfortunately lack the cultural background, necessary to make the ways preached therein, their own. For us, the unforgettable examples of the Great souls like *Ramakrishn, Vivekananda,* and *Gandhi* are still fresh in our memory. Shall we not take advantage of our culture of both the remote and the recent past and rise to the occasion to show the world once again the true way to happiness? The beginning, in my opinion, must be made with the revival of the study and knowledge of the above great works. Judging by my own standard, by far a large majority of both the literate and illiterate in our country at present, had no opportunities to acquire any knowledge in them. Barring the few

devoted men, the rest of even the enlightened men have only a second-hand knowledge of these great works The originals being written in the Sanskrit language, these are a sealed book to most of us. The immediate need is therefore to organise the schools and colleges for the study of the Sanskrit language and to devise ways and means to spread the knowledge of our great works among all classes of the people. The children who are the future hope of our country must call for the first attention in shaping this renaissance.

Before considering the practical ways and means to achieve the above, let us look at the results on our society of our continued neglect in the direction. While belonging to the Hindu religion, many do not seriously think of our religion, worship, or even of food and dress. Steeped in ignorance of the tenets and the ways of life prescribed in their own religion, they are forced to move in the present day society consisting of persons belonging to all other religious faiths and countries. The effects are often ludicrous and belittling to the great religion we profess. Whereas, all other religionists have got their organisations, which not only give practical directions to the common man about the mode of worship, rituals, food and dress, but also take active steps to spread their religion. We shall have no quarrel in their legitimate efforts but shall we not move our little finger to keep in tact our fold and safeguard their religious well-being? For this also, the only way is to remove ignorance by the spread of religious knowledge and to strengthen the faith and conviction in their own religion.

Now coming to the onerous task of suggesting measures for the present day society I have no other-go except to commend to you the all comprehensive institution of the temple, devised by our old seers in their practical wisdom for the benefit of the society. These temples are as old as our literature and culture and have successfully survived all the vicissitudes of ages, other religions and outside political domination, which in itself is a sufficient test of their potency Considering their influence and effects on the society at large in their religious, cultural, economical, historical, and political day to day life of the people, I venture to think that no other country or religion has conceived of a similar institution of usefulness of so comprehensive a nature. The kings, the rich and the issueless, all donated liberally in extensive grants of lands, gifts in jewels and money not only for the upkeep of the temple and the glorification of the deity, but also for the permanent maintenance of the various kinds of services connected with the temple. The immense wealth spent in erecting the temples with the rare architectural and sculptural works speaks volumes for their interest in the development of art and sculpture, which even today arouses the wonder and surprise of all foreigners. The vast grants of land to *Archakas*, *Vedaparayanikas* and *Adhyapakas* were intended to perpetuate the study of the *Vedas* and *Agama Sastras* and necessarily the *Sanskrit* language. Similarly the fine arts of music and dancing were encouraged and maintained. *Sanskrit* and *Veda* schools and libraries were and could be maintained in the institutions out of the endowments. Invariably choultries were built, not only for the feeding of the worshippers but also for the shelter of the thousands that gather during the special festivals. The distribution of delicious *prasadams* during the daily worships naturally attracted the young and the old, who were thus practically allured to spend some time in

# ĀRĀDHANA

(A RELEGIOUS MONTHLY MAGAZINE)

*Anent* THE TEMPLES
FOR THE TEMPLES
BY THE TEMPLES

*(in Andhra State)*

*"Go deep inside the temple and you will find me there"*—MOTHER




PUBLICATION OFFICE:

"ĀRĀDHANA"

OFFICE OF THE DEPUTY COMMISSIONER

*Hindu Religious & Charitable Endowments (Administration) Department*
*(Andhra)*

MASULIPATAM

| | |
|---|---|
| ANNUAL SUBSCRIPTION (inland) | Rs. 12/- |
| PER SINGLE COPY | Re. 1/- |
| ANNUAL SUBSCRIPTION (Foreign) | 24 Sh. |

# ఆరాధన

మన్మథ　　　　మాసపత్రిక　　　　చైత్రము

విషయసూచిక　　　　పుట



# ĀRĀDHANA

## A MONTLY RELEGIOUS MAGAZINE, APRIL 1955

## CONTENTS

"[illegible]"

# ఆరాధన

సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే।
అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్వ్రతం మమ ॥

సంపుటము ౧ మన్మథ - చైత్రము సంచిక 3

## హయగ్రీవమంత్రము

సారస్వతో వా ఏష దేవోఽయం న వా హయః పారమాత్మికః ॥
భయోఽభయో వా సర్వం సంధుషే స్వాహా ॥

పారమాత్మికోపనిషత్ - తృతీయానువాకము.

ఈ మంత్రమునకు ఋషి బ్రహ్మ, గాయత్రి ఛందస్సు, హయగ్రీవ పరమాత్మ దేవత. ఈ మంత్రము ఖిలమంత్ర భాగములోని దగుటచే దీనికి బ్రాహ్మణముగాని వినియోగముగాని మిగిలిన మంత్రములవలె కనబడదు.

అర్థము :— ఏషః లీలావిభూతౌ హయగ్రీవరూపేణ స్థితః, సారస్వతః నిఖిలవిద్యాధారరూపీ, దేవః సర్వవ్యాపకః, ప్రకాశమానశ్చ, అయం ఉపాస్యమానః హయో వా న హయరూప ఏవ న భవతి. కింతు పారమాత్మికః పరమాత్మరూపత్వమాపన్నః భవతి. అయం ఉపాస్యమానః, భయః అభక్తానాం భయంకరః; అభయో వా తదుపాసకానాం అభయప్రద ఏవ సన్ సర్వం (విశ్వం) సంధుషే కటాక్షవీక్షణేన ప్రేక్షతే. తస్మై స్వాహా నమః (అస్తు).

లీలావిభూతియందు హయగ్రీవరూపమును ధరించి యున్నట్టియు, సమస్త విద్యలకును ఆధారభూతుడగునట్టియు, సర్వవ్యాపకుడై ప్రకాశించునట్టియు, ఉపాసకులచేనుపాసింపబడుచున్నట్టి యీతడు హయరూపుడేగాడు. ఇంకేమన, పరమాత్మస్వరూపుడగు యీ మహావిష్ణువే. ఈతడు తన భక్తులుకాని వారికి భయంకరరూపుడుగను, తన్నుపాసించు వారికి అభయమునిచ్చువాడునై సమస్తప్రపంచమును తన కటాక్షవీక్షణముచే చూచుచున్నాడు. అట్టి యీతనికి నమస్కారము.

విద్యావిషయికకార్యములయందు, గణపతిని, సరస్వతిని వలె హయగ్రీవుని, దక్షిణామూర్తినికూడ యారాధించుట సంప్రదాయమగుటచే యీ హయగ్రీవమంత్రమును ప్రారంభమున నుదహరించితిమి; హయగ్రీవ త్రివర్ణ చిత్రమునుకూడ నిందు పొందుపరచితిమి. ఈ క్రిందను ధ్యానశ్లోకములను, హయగ్రీవగాయత్రినికూడ పాఠకులకు సమకూర్చితిమి.

శ్లో॥ విద్యామూర్తిమఖండ చంద్రవలయశ్వేతారవిందస్థితం
హృద్యాభం స్ఫటికాద్రినిర్మలతనుం విద్యోతమానం శ్రియా।
వామాంకస్థిత వల్లభాం ప్రతి సదా వ్యాఖ్యాంతమామ్నాయవా
గర్థానాదిమపూరుషం హయముఖం ధ్యాయామి హంసాత్మకమ్ ॥

గాయత్రి ॥ హయగ్రీవాయ విద్మహే వాగీశ్వరాయ ధీమహి।
తన్నో హంసః ప్రచోదయాత్ ॥.

# ఉపాసనము - మన్త్రయోగాదులు

నాగపట్టణ కుమారస్వామిరాయ శాస్త్రి

## 1. మన్త్రయోగము

ఉపాసనమెందుకు ?—లోకమున ప్రతి ప్రాణియును శాశ్వతమగు నానందమును కోరును. చిరకాలము బ్రతికి యుండవలయుననుకొనును. సర్వము తెలియవలె నని యభిలషించును—ఇట్లు కోరుటకు హేతువేమై యుండును ? ప్రకృతియందే యొక దృష్టాంతమును మనము చూడవచ్చును. ఒక చేపను నీటబైట పడవేసి నచో అది గిలగిలకొట్టుకొనును. తిరిగి నీటిలో వేసినచో సుఖముగ నుండును—జలములో నుండుట చేపకు స్వభావము; జలమునుండి బైటకు వచ్చినపుడు తిరిగి జలమునే పొందవలయునని కోరును; అటులే సత్త్వము, చిత్త్వము, ఆనందము ననునవి మన సహజస్వరూపము. ఏదేనొక కారణమువలన నాస్వరూపమునకు భంగము కలిగినది. వానిని తిరిగి పొందుటకు ప్రతిజీవియు యత్నించును.

ఇపుడొక ప్రశ్న కలుగవచ్చును—శాశ్వతముగ బ్రతుకుట యను విషయమును వదలుచో, జ్ఞానముకొఱకును ఆనందముకొఱకును యత్నించు మనుజుడు, ఏదియో విధమగు జ్ఞానమును నానందమును పొందుచున్నాడు గదా! ఇట్లు లోకముననే యానందమును పొందుట కవకాశముండగా, మన యానందస్వరూపమునకు భంగము కలిగినదనుట యెట్లు ?—మన మజ్ఞానులమనుటలో సామంజస్యమేమియున్నది ?

సత్యమే! ప్రపంచములో మనమానందము ననుభవించుచున్నాము. కాని యది శాశ్వతముగాదు. దుఃఖాసమ్మిశ్రితమును గాదు—లోకమున మనకు గలుగు నానందము లౌకికవిషయములపై నాధారపడియున్నది. లోకములోని విషయములన్నియును అశాశ్వతములు; విషయములు నశించుటతోడనే ఆ విషయసుఖముగూడ నశించును; తుదకు దుఃఖమే గలుగును. తిరిగి మఱి యొక విషయమునాశ్రయించి కొంతకాలము మనము సుఖము ననుభవింతుము; అదియును నాశనమగును. కావున లోకములోని సుఖములన్నియును దుఃఖాన్తములే దుఃఖమూలములే. ఇటులే మనకు గలుగు జ్ఞానముగూడ పరిమితమే; సర్వజ్ఞత్వము మనకు లేదు. అందుచే, ప్రతి ప్రాణియు, తనకు తెలియకయైనను, తెలిసియైనను సచ్చిదానందములం బొందుటకై యత్నించుచునేయుండును. దానందములను పొందుటకు యత్నింపడు. సచ్చిదానందాత్మకమగుపరమాత్మనాశ్రయించి, తానే పరమాత్మ యగుటకు యత్నించును.

"యే హి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవతే।
అద్యన్తవన్తః కౌన్తేయ న తేషు రమతే బుధః ॥"

పరబ్రహ్మ యొక్కటియే సచ్చిదానందాత్మకమగుచో, మనము ప్రపంచములో ననుభవించు నానందమెచ్చటిది ? ఈ విషయానంద మెచ్చటిది ? ఈ విషయానందముకూడ బ్రహ్మానందముయొక్క యంశయే—

1. "ఏతస్యైవానందస్యాన్యాని భూతాని మాత్రాముపజీవన్తి "—
2. "అథాత్ర విషయానందో బ్రహ్మానందాంశ రూపభాక్।
   నిరూప్యతే ద్వారభూత స్తదంశత్వం శ్రుతిర్జగౌ ॥"
3. "విషయ సుఖమపి స్వరూప సుఖాన్నాతిరిచ్యతే,
   విషయప్రాప్తౌ సత్యామన్తర్ముఖే మనసి స్వరూపసుఖస్యైవ ప్రతిబింబనాత్ స్వాభిముఖే దర్పణే ముఖప్రతిబింబవత్ "—

బ్రహ్మానందాంశభూతమగు నానందమే మనకింత ప్రియానక్తిని గల్గింపగా, నిజమగు బ్రహ్మానందమెంత యానందము నీయవలెను ? ఇటులే జ్ఞానాదులవిషయమున నూహసేయవలయును. కావున నిజమగు సచ్చిదానందములనొందవలయునన్నచో సచ్చిదానందాత్మకమగు పరమాత్మనే మన మాశ్రయింపవలయును. ఆ తత్త్వమునే మనము తెలిసికొనవలయును. మనమే యదియని తెలియవలయును. అట్లు తెలియనివారికి శాశ్వతసుఖము లేదు—ఆ తత్త్వ మెచ్చటనైన విడిగనున్నదా, మనము దానిని పొందుటకును తెలియుటకును ?—లేదు; మన నైజస్వరూపమే యది. అది యట్లని అనుభవమున తెలిసిన చాలును.

"తమాత్మస్థం యేనుపశ్యన్తి ధీరాస్తేషాం సుఖం శాశ్వతం నేతరేషాం"

ఆత్మస్థమగునీపరమాత్మానుసంధానమున కుపయోగించు మార్గమే "యుపాసనము."—"తమాత్మేత్యేవోపాసీత, తదాత్మానమేవావేత్, తమేవ విదిత్వాఽతిమృత్యుమేతి, నాన్యఃపన్థా విద్యతేఽయనాయ"

ఉపాసనమననేమి ? : "ఉప"యన సమీపమనియు, "ఆసనమ్" అన, ఉండుటయనియు, శబ్దమున

ముగ శబ్దమునకర్థమగును—తైలధార నిలవచ్చిన్నముగ నుండును. అటులే మనమొక దైవతమునుపాసించు నపుడు మన చిత్తవృత్తి యాదైవతాకారమునొందవలయును; —ఈ చిత్తవృత్తికి తుల్యములగు నితరచిత్తవృత్తులు గాని, భిన్నములగునితరభావములుగాని, ఈ దైవతాకార రూపమునొందిన చిత్తవృత్తికి ప్రతిబంధకములు కారాదు. ఇట్లునజాతీయవిజాతీయభావనలచేనతిరస్కృతమై, ధ్యేయ విషయాకారాక్రాంతమై, తైలధారవలెననవచ్చిన్నమగు చిత్త వృత్తి ప్రవాహమునకు కలిగినపుడే యుపాసనమునందు మనకు ప్రవేశము లభించినట్లగును. ఇట్టి చిత్తవృత్తిని సాధించుటయే సామాన్యముగ నుపాసనమగునని చెప్ప వచ్చును.

ఉపాసనమానందభావాలంబనము :— పరబ్రహ్మము సచ్చిదానందాత్మకము; అందు సద్భావమునాశ్రయించినది కర్మకాండము, చిద్భావము నాశ్రయించినదిజ్ఞానకాండము, ఆనందభావము నాశ్రయించినది ఉపాసనాకాండము, అనియును పెద్దలు చెప్పుచున్నారు.

పరమాత్మస్వరూపము :—శ్రుత్యాదులయందు పర బ్రహ్మము సామాన్యముగ మూడువిధముల నిరూపిత మైనది. బ్రహ్మ, ఈశ్వరుడు, విరాట్.

"సోయమాత్మా చతుష్పాత్, పాదోఽస్య విశ్వాభూతాని ।
త్రిపాదస్యామృతం దివి."

పరమాత్మకు నాలుగుపాదములు—సృష్టియే ఒకపాదము —సృష్టికి బాహ్యమై మూడుపాదములున్నవి.

(1) ఏభావముతోనున్నపుడు పరమాత్మకు మాయా సంబంధములేదో, ఏ పరమాత్మ మాయకతీతమో, అవాఙ్మా నసగోచరమో ఆపరమాత్మను నిర్గుణబ్రహ్మమని పిలు తుము—ఈ పరమాత్మస్వరూపమునే ఉపనిషత్తులిట్లు వర్ణించుచున్నవి.

"న తత్ర చక్షుర్గచ్ఛతి, న వాగ్గచ్ఛతి, న మనో, న విద్మో
న జానీమః ॥

నేత్రముగాని, వాక్కుగాని, మనస్సుగాని ఆ బ్రహ్మను పొంద లేవు"—ఈయర్థమే భాగవతమునందతిరమణీయముగ వర్ణితమైనది;

"శబ్దో న యత్ర పురుకారకవాన్ క్రియార్థో
మాయా పరైత్యభిముఖేచ విలజ్జమానా ।
తద్వై పదం భగవతః పరమస్య పుంసః
బ్రహ్మేతి యద్విదురజస్రసుఖం విశోకమ్ ॥"

లోకమున సర్వ వ్యవహారసాధకమగు శబ్దము దేనిని తెలు పుట యందునిష్క్రియమగునో, దేని యెదుటనుండుటకు లజ్జించి మాయతొలగించనగునో, అభగవత్పదమునే బ్రహ్మ యని పిలుతుము. అదియే విశోకము, అజస్రసుఖము.

(2) మాయాసంబంధముచేత లోకమును సృష్టించు నప్పుడా పరమాత్మను ఈశ్వరుడని యందురు. ఇతనే సగుణ బ్రహ్మమనియు నందురు.

(3) విరాడ్రూపము మూడవది. అనంతకోటి బ్రహ్మాం డములే విరాట్పురుష శరీరము. ఇందే కటిభాగమునకు పైనేడు లోకములును, క్రిందనేడు లోకములును నున్నవని శ్రుతులు స్మృతులును వర్ణించుచున్నవి.

## 2 ఈశ్వరుడు

"మాయాస్తు ప్రకృతిం విద్యాన్మాయినంతు మహేశ్వరమ్ ।
తస్యావయవభూతైస్తు వ్యాప్తం సర్వమిదంజగత్ ॥"
"కవిర్మనీషీ పరిభూస్స్వయంభూర్యాథా
తథ్యతోఽర్థాన్ వ్యదధాత్ శాశ్వతీభ్యస్సమాభ్యః ॥"

## 3 విరాట్

"సర్వతః పాణిపాదం తత్ సర్వతోక్షిశిరోముఖమ్"
"విశ్వతశ్చక్షురుత విశ్వతోముఖో విశ్వతో బాహురుత
విశ్వతస్పాత్"

ఇట్లుమూడుగ భావితమైనబ్రహ్మమునే, అధ్యాత్మము, అధిదైవము, అధిభూతము ననిగూడ వర్ణించుచున్నారు.

1. "యత్తద్బ్రహ్మ మనోవాచామగోచరమితీరితమ్ ।
తత్సర్వకారణం విద్ధి సర్వాధ్యాత్మిక మిత్యపి ॥
అనాద్యన్తమజం దివ్యమజరం ధ్రువమవ్యయమ్ ।
అప్రతర్క్యమవిజ్ఞేయం బ్రహ్మాగ్రేసంప్రవర్తతే ॥
2. "స్వేచ్ఛామాయాఖ్యయా యత్తజ్జగజ్జన్మాదికారణం ।
ఈశ్వరాఖ్యంతు తత్తత్త్వం అధిదైవమితిస్మృతమ్ ॥
సర్వజ్ఞస్సర్వకర్తాత్యాహ్యన్తర్యామి కృపానిధిః ।
సర్వసద్గుణసారాత్మా దోషశూన్యః పరఃపుమాన్ ॥
3. యత్కార్యబ్రహ్మ విశ్వస్య విధానం ప్రాకృతాత్మకమ్ ।
విరాడాఖ్యం స్థూలతరమధిభూతం తదుచ్యతే ॥
యస్యేహావయవైర్లోకాన్ కల్పయన్తి మనీషిణః ।
కట్యాదిభిరధస్సప్త సప్తోర్ధ్వం జఘనాదిభిః ॥

ఇట్లు మూడువిధములుగనున్న బ్రహ్మనుపాసించుట కయియే శాస్త్రములయందు కొన్ని మార్గము లుపదిష్టము లైనవి —1. మన్త్రయోగము 2. హఠయోగము 3. లయ యోగము 4. రాజయోగము:—ఇందుమన్త్రయోగములో స్థూలమూర్తిధ్యానము అభ్యసింపబడును. హఠయోగ ములో జ్యోతిర్ధ్యానాదులవలన సాధకునిమనస్సు సూక్ష్మ వస్తువునందు కేంద్రీకృతమగును. లయయోగమునందు బిందుధ్యానాదులవలనచిత్తమునకింకను సూక్ష్మతరవస్తువు నందేకాగ్రత పరిశుద్ధమగును. ఆటుతరువాత సాధకుడు క్రమముగ రాజయోగమునందు నిర్గుణబ్రహ్మోపాసనను చేయుట కధికారము కల్గినవాడగును. నిర్గుణ బ్రహ్మోపా

ననచే సాధకుడు నిర్వికల్పసమాధినొంది స్వస్వరూపాను సంధానముఁ జేసికొనఁగలుగును.

అవతారాద్యుపాసనలు:—వేదములయందు ప్రతిపాదిత మైన పహరోపాసనాదిద్వాత్రింశదుపాసనలును, పైనిపేర్కొనిన మన్త్రయోగాదులునుగాక, మన్త్రయోగాదులకు సంబంధించినవియే అవతార, ఋషి, దేవతా, పితృపాసనాదులుగూడఁగలవు — ఇవి యన్నియు సకామముతో చేసినచో లౌకికకామములనిచ్చును — నిష్కామముతోఁ జేసినచో సాక్షాత్తుగనో క్రమముగనో మోక్షమునిచ్చును.

ఇప్పటికి ఉపాసనయొక్క యావశ్యకతయు, అందలి సాధారణభేదములను తెలిసికొంటిమి. ఇపుడొక విషయమును మనము తప్పక గుర్తుంచుకొనవలయును. ఏ యుపాసనకైనను, భక్తియనునది ప్రాణము. యోగమనునది శరీరము. భక్తిలేనిదే యేయుపాసనయును సిద్ధింపదను విషయమును ప్రతిసాధకుడును తెలిసికొనవలయును.

## 1 మన్త్రయోగము

మన్త్రయోగనిర్వచనము:—యోగమనచిత్తవృత్తినిరోధమునకును, ఆత్మసాక్షాత్కారమునకును, భగవత్సాన్నిధ్యము నొందుటకును నుపకరించు సాధనములనేకము లున్నవి. అవియన్నియు ప్రధానముగ నాల్గువిధములలో జేరును. మన్త్రయోగము, లయయోగము, హఠయోగము, రాజయోగము.

"యోగో హి బహుధా బ్రహ్మన్ భిద్యతే వ్యవహారతః।
మన్త్రయోగో లయశ్చైవ హఠోసౌ రాజయోగకః"॥

మన్త్రయోగమునుగుఱించి మన్త్రయోగసంహితయందిట్లున్నది.

"నామరూపాత్మికా సృష్టి ర్యస్మాత్తదవలంబనాత్।
బంధనాన్ముచ్యమానోయం ముక్తిమాప్నోతి సాధకః॥
తామేవ భూమిమాలంబ్య స్ఖలనం యత్రజాయతే।
ఉత్తిష్ఠతి జనస్సర్వో ధ్యక్షైస్తై తత్సమీక్ష్యతే॥
నామరూపాత్మకై ర్భావైర్బధ్యన్తే నిఖిలా జనాః।
అవిద్యాగ్రసితాశ్చైవ తాదృక్ ప్రకృతివైభవాత్॥
ఆత్మనస్సూక్ష్మ ప్రకృతిం ప్రవృత్తిం చానుసృత్యవై।
నామరూపాత్మనో శ్శబ్దభావయో రవలంబనాత్॥
యో యోగస్సాధ్యతే సోఽయం మన్త్రయోగః
ప్రకీర్తితః"॥

పరమాత్మకు "ఏకోహం బహు స్యాం ప్రజాయేయ" అని సంకల్పము కలిగినది. ఈ భావముయొక్క పరిణామమే యీ నామరూపాత్మకమగు ప్రపంచము. "నామరూపే వ్యాకరవాణి" "సర్వాణి రూపాణి విచిత్య ధీరా నామాని కృత్వాభివదన్ యదాస్తే" ఆకాశోహవైనామ రూపయోర్నిర్వహితా" అస్తి భాతి ప్రియం రూపం నామ చేత్యంశ పంచకం। ఆద్యత్రయం బ్రహ్మరూపం జగద్రూపం తతో ద్వయం॥" అను వాక్యముల ననుసరించి సృష్టియంతయు నామరూపాత్మకమె యనియు, నీ నామరూపము లీశ్వరసంకల్పవికాసములు, లేక, పరిణామములే యనియుఁ దెలియుచున్నది. ఈ నామరూపములే మనకు బంధములు—వీనిని దాటినచో అస్తిభాతిప్రియముల నొందఁగలము. ఇక భూమిమీదఁ బడిన మనుజుఁడు పైకి లేవవలయునన్న, సాక్షాత్తుగనో పరంపరితముగనో భూమినే యాలంబనముచేసికొని లేవవలయును. అటులే నామరూపాత్మకమగు సృష్టిలో బద్ధులైన వారా నామరూపములనే యాధారముగఁ జేసికొని, అనగా; నామరూపములకు మూలములగు శబ్దమును, భావమును, ఆధారముగఁ జేసికొని పరమేశ్వర ప్రాప్తిని సాధించు యోగమే మన్త్రయోగము—కావున మన్త్రయోగమునందు శబ్దమునకును రూపమునకును ప్రాధాన్యమున్నదని తేలుచున్నది.

ప్రతిమలు:—ఇచట నామము లేక శబ్దమనగా మన్త్రమనియు, రూపమనగా ప్రతిమాదులనియును గ్రహింపవలయును. ప్రతిమలు ఎనిమిది విధములుగ నుండవచ్చునని శ్రీమద్భాగవతమున నున్నది.

శైలీ దారుమయీ లౌహీ లేప్యా లేఖ్యా చ సైకతీ।
మనోమయీ మణిమయీ ప్రతిమాష్టవిధా స్మృతా॥

రాతిప్రతిమలు, కొయ్యతోఁ జేయఁబడిన ప్రతిమలు, లోహమయ ప్రతిమలు నుండవచ్చును. లేపనము (పూత) వలనను, రేఖలవలనను (గీతలతో) ప్రతిమను తయారు చేయవచ్చును. ఇసుకతోగాని మణులతోగాని నిర్మింపవచ్చును. లేదా మనసుననే యొక రూపమును భావన సేయవచ్చును—ప్రతిమలనుటతోడనే యనేక ప్రశ్నలు వచ్చుచున్నవి — నిర్గుణబ్రహ్మకు ప్రతిమయనునదెట్లు పొసగును? సగుణబ్రహ్మారాధనము శాస్త్రనిషిద్ధముగాదా? ప్రాచీనకాలమున విగ్రహారాధనమున్నదా?—అసలు విగ్రహారాధన మావశ్యకమా? ఒకవేళ విగ్రహారాధనము మంచిదేయైనను, శాస్త్రములయందుండు విగ్రహములనే యర్చింపవలయునా? మనమేల కల్పింపఁగూడదు? ఈ విగ్రహములను సాధకు డెట్లు భావన సేయవలయును?— ఈ ప్రశ్నలకు కొంతవఱకైనను సమాధానము తెలియుట మనకు ధర్మమగును.

విగ్రహారాధనావశ్యకత:—ఏ సాధనమైనను మనసున కేకాగ్రత కుదురవలయును. మనస్సతిచంచలమైనది. ఏదియో యొక స్థూలలక్ష్యము లేనిదే మనసు నిలుచుట కష్టము. స్థూలలక్ష్యముమీదనైనను మనసెక్కువకాల ముండనేయుండ దనుట సర్వజనానుభవసిద్ధము—అందు

వలన నొక రూపముపై మనసును నిల్పి, క్రమముగ నేకాగ్రతను సాధింపవలయును.

"అభ్యాసవైరాగ్యాభ్యాం తన్నిరోధః-" మహాయోగులకు మాత్రమే నిర్గుణబ్రహ్మోపాసనము సాధ్యమగును; సామాన్యులకు సాధ్యముకాదు. అల్పమతులగు సామాన్యుల నుద్దేశించియే ప్రతిమారాధనము విహితమైనది.

1. "శివమాత్మని పశ్యన్తి ప్రతిమాసు న యోగినః।
అజ్ఞానాం భావనార్థాయ ప్రతిమాః పరికల్పితాః॥"
2. యే మన్దాస్తేనుకంప్యన్తే సగుణబ్రహ్మ రూపకైః॥
3. ఉపాసకానాం చిన్తార్థం బ్రహ్మణో రూపకల్పనా॥"
4. క్లేశోధికతరస్తేషామవ్యక్తాసక్తచేతసామ్,॥
అవ్యక్తా హి గతిర్దుఃఖం దేహవద్భిరవాప్యతే"

ఈ వచనములన్నియు నీ పైయర్థమునే నిరూపించును.

మతములు-విగ్రహారాధనములు:—శ్రీశంకరు లెచటను సాధకులకు విగ్రహారాధనము పనికిరాదని తెలుపలేదు. శ్రీశంకరులే సగుణరూపములపై నెన్నియో స్తోత్రములను రచించినారు. శ్రీరామానుజ మతముననుసరించి—పరా, వ్యూహ, విభవాన్తర్యామ్యర్చావతారములు భగవంతునకుఁ గలవు. అందులో నీ యర్చావతారారాధనముననె విగ్రహారాధనమన్తర్భావము నొందును—శ్రీశంకరులమతము ననుసరించి విగ్రహము భగవంతున కొక ప్రతీకము—అ యారాధనము ప్రతీకోపాసనమగును—ప్రతిమయే విష్ణువుకాదు, ప్రతిమయందు విష్ణుబుద్ధి నుంచవలయును. శ్రీరామానుజులమతమున, "అర్చ" లేక ప్రతిమయనునది భగవంతుడే. భగవదవతారమే; ప్రతిమ భగవంతుడు—లేక ప్రతిమయందు భగవద్బుద్ధి నుంచ వలయుననియేకాని, ప్రతిమేతరమున భగవంతుడు లేడని నిషేధించుట శ్రీశంకరులకుగాని తదితరులకుగాని యభిమతముగాదు—సర్వవ్యాపియగు భగవంతుడు ప్రతిమాదులయందు విశేషముగఁ జూడనగును. ప్రతిమామూలమున భగవంతుని మనము సులభముగ నుపాసింప గలము. అంతటనున్న విద్యుత్తు, ఆయా పరికరము లున్నచోట ప్రకటముగ భాసించును. ఆవుపాలు పొదుగునుండి గ్రహింప వీలగును. అట్లే భగవత్త్వము నుపాసింపవీలగు తావులలో ప్రతిమయొకటి అని మనము గ్రహింపవలయును.

మానవుని మనస్తత్త్వముననుసరించి ప్రతిమారాధనము మంచిదగుటచేతనే ప్రపంచమున నన్ని మతములయందును, యేదియోవిధమగు ప్రతిమ (Symbol) ఉండనేయున్నది. అది క్రాస్ కావచ్చును. "కాబా" (Kaba stone) అను రాయి కావచ్చును. అవి ప్రతిమలు కాకపోలేదు.

విగ్రహారాధన మద్వైతమునకు భంగకారకముగాదా?:—సామాన్యముగ నేను (సాధకుడు) అపకృష్టుడను; నీవు (సాధ్యముగు దైవము) ఉత్కృష్టుడవు; అను భేదబుద్ధియు నుత్కృష్టాపకృష్ట బుద్ధియు ప్రధానముగ గలది యుపాసన యగును—ఇట్టి భేదబుద్ధి ద్వైతులకు చెల్లినచెల్ల వచ్చునుగాని, అద్వైతుల కెట్లు కుదురునను ప్రశ్న యుదయింపవచ్చును. ఆయా మతస్థులు వారి వారి మతముల ననుసరించి మతములకు విరోధము లేకుండునట్లుగనే వారి వారి సాధనప్రణాళికల నేర్పాటుచేసికొనినారు.

ఉపనిషత్తులయం దీ వాక్యమును చూడుడు—"యోఽన్యాం దేవతాముపాస్తే సోఽన్యోఽహమస్మీతి, యథా పశురేవ స దేవానాం" ఉపాస్యమైన దేవత తన కంటె భిన్నమని భావించు సాధకుని, దేవతలందఱును పశువుగ భావింతురట—ఈ వాక్యార్థమువలన సాధకుడగు నతడుపాస్యోపాసకులకభేదమును గుర్తింపలయునని తెలుచున్నది. "నారుద్రో రుద్రమర్చయేత్" అను విధియు, అంగన్యాసకరన్యాస, మాతృకాన్యాసాదులను విగ్రహప్రాణప్రతిష్ఠయందు సాధకుడు చేయు విన్యాసాదికములును, ఈ యుపాస్యోపాసకాభేదభావనమునే దృఢపఱచును. ఈ భావనవలన దేవతాత్మైక్యసిద్ధి సులభమగుట, శ్రీ రామకృష్ణ పరమహంస జీవితమునుగాని, శ్రీ భాస్కరాచార్యజీవితమునుగాని చదివినవారికి విశదమగును. ఇట్లు విచారించినచో విగ్రహారాధనము నిర్గుణోపాసనమునకును, అద్వైతభావసాధనకును, సాధనమే యగునుగాని ప్రతిబంధకము గాదని తెలియఁగలదు.

రాతియందు చైతన్యముండునా?—రాయిని తీసికొని వచ్చి దీనియందు దేవుడున్నాడనిన యుక్తిసహముగ నుండునా? కొద్దిశక్తులుగలిగినబైరాగి రాయిని నడిపించును. మనశ్శక్తిని సాధించిన "మెస్మరిస్టు" ఒకరి రోగమునొకరికి సంక్రమింపఁజేయును. సామాన్యులకే యింతటి శక్తులుండ, మహర్షులకెంతటిశక్తు లుండవలయును? మహర్షి ప్రతిష్ఠితములైన విగ్రహములకును, మహర్షి దృష్టములైన మన్త్రములకును నెంతటి మహిమ యుండవలయును!—పాశ్చాత్త్యదేశములయందు భూత ప్రేతములనాహ్వానము సేయగల వారనేకులున్నారు (Occults). వారు తమ మనశ్శక్తివలన చనిపోయినవారి భూతములను ఒకరిమీదికాహ్వానించి వారివలననేక విషయములను తెలిసికొనుచున్నారు.—ఈనన్నివేశముల ననుసరించి పరిశీలించినచో, ప్రతిమయందు భగవచ్చైతన్యమును ప్రతిష్ఠసేయుట దుర్లభముకాదు. ప్రతిష్ఠావిధానమంతయు మానసిక శక్తి సహకృతమైనదనియు, చైతన్యమును, యన్త్రమన్త్ర సహాయములవలన ప్రతిమ

యందుంచుటకు చేయు ప్రయత్నమే యనియు నావిధానమును పరిశీలించినవారికి తెలియును ఇంతయేల; శ్రీ రామకృష్ణపరమహంస, శ్రీ కాళీ ప్రతిమయందుచ్ఛ్వాస నిశ్వాసములను చూపించినారని చరిత్ర ప్రసిద్ధము, ఆధునికమును; అందుచే సమర్థులగువారు ప్రతిష్ఠించినచో నా ప్రతిమ జీవమయమగుననుటలో సందేహములేదు. ప్రతిదినమర్చనలు సేయు పూజానీరాజనాదులవలనఁగూడ నాతేజస్సుస్థిరమగుచుండును. కావున దేవాలయమనునది యొక తేజఃకేంద్రము. పవర్‌హౌసెవంటిది. కొన్నినియమములను పాటించినంతకాలమే విద్యుదాగారమున నా విద్యుత్తుండును. లేనిచో విద్యుత్తు నశించును. అటులే దేవాలయములయందుఁగూడ శాస్త్రోక్త నియమములు పాటింపఁబడుచున్నంతకాలమే యాచైతన్య మా ప్రతిమ యందుండును. ఆనియమభంగము కల్గిననాఁడా తేజస్సునకు చ్యుతి కలుగును. అప్పుడవి వట్టి రాళ్లయగును. శిల్ప సౌందర్యమును మాత్రమే మనము చూడవలసి యుండును. విగ్రహారాధనమును నమ్ముదునుగాని, శాస్త్ర నియమోల్లంఘనమువలన నందలి చైతన్యము నశించునని నమ్మననుట 'వెఱ్ఱిపాయినది తలకు రోకలిచుట్టు' మన్నట్లగును—ఇంకనుపదపముగఁజెప్పవలయుచో "అర్ధజరతీయ" మగును.—

ఇక విగ్రహారాధనము ప్రాచీనకాలమునందున్నదా? యనుప్రశ్నకు సమాధానమును పరిశీలింతము.—ఇతరదేశములలో 6000 B.C. నాటికే విగ్రహారాధనమున్నది. ఈజిప్టు ద్వితీయరాజకాలములోనే ఈజిప్టువారు వారి దేవతలకు మానవరూపమునొసగినారట. మఱి కొంత కాలమునకే "రా" యను సూర్యదేవునారాధన వారి దేశమున ప్రసిద్ధిగాంచినది.

బాబిలోనియన్ మతమునందును నిది ప్రసిద్ధమే. సుమేరియనులు 4000 B.C. నాడు బాబిలోనియాకు వచ్చినపుడే వారి దేవతావిగ్రహములను వారితో తీసికొని వచ్చినారట.

అస్సీరియనులు 1500 B.C. నాడు "ఇష్టార్" అను తమ యిష్టదైవతప్రతిమను మెసపటోమియానుండి ఈజిప్టునకు తీసికొనిపోయిరి.

6000 B.C. నాటి శాసనములు కొన్ని ప్రాచీన దేవాలయములలో దొఱకినవి. ఆ శాసనములయిందే దేవతలకీయబడిన కానుకలు వర్ణితమైనవి:—

మోహింజోదారోయందు (3000 B.C.) పశుపతి విగ్రహమును, మఱికొన్ని దేవతావిగ్రహములు నున్నవి.

ఇక మన ప్రాచీనవాఙ్మయమునందు విగ్రహారాధనమును సూచించు ప్రమాణము లనేకములున్నవి.

1 "య ఇమం దశభిః క్రీణాతి మమేన్ద్రం ధేనుభిః(ఋగ్)
"నా యింద్రుని పదియావులిచ్చి యెవడు కొనునో"
ఇచట ఇంద్రరూపము—ఇంద్రప్రతిమయేయై యుండవలయును.

2. "మహే చ న త్వామద్రివః పరాశుల్కాయదేయామ్
న సహస్రాయ నాయుతాయ శతాయ శతామఘ"
ఇచట గూడ "ఎన్నివేలశుల్కమిచ్చినను, ఓ ఇంద్రా! నిన్నితరులకీయను" అను వాక్యార్థము ననుసరించి, ఇంద్రప్రతిమయే నిర్దిష్టమైనది.

3. (1) అశ్రీరమ్ చిత్కృణుత సుప్రతీకమ్.
(2) ఇన్ద్రస్య కర్తాస్వప స్తమోఽభూత్
(3) ఇన్ద్రకారిణమ్ వృషన్తః—ఈ ఋక్కులన్నియును విగ్రహములను పాతపోయుట, లేక నిర్మించుటను సూచించుచున్నవి.

4. (1) "సూర్మ్యం సుషిరమివ"—(అంగముగు రంధ్రములు గల ప్రతిమవలె)
(2) "అయస్మయమ్ విశృత బన్ధమేతమ్" (ఈ లోహ బన్ధమునందు ప్రవేశింపుము).
ఇవి లోహమయప్రతిమల యునికిని సూచించును.

5. "దేవతాయతనాని కమ్పన్తే, దైవతప్రతిమా హసన్తి రుదన్తి నృత్యన్తి"—దేవాలయములు కమ్పించుచున్నవి దైవత ప్రతిమలు నవ్వుచున్నవి—ఏడ్చుచున్నవి—నర్తనము సేయుచున్నవి. ఈ వాక్యములు దేవాలయము లున్నవని తెలుపును.

6. "హిరణ్మయేనమణినా శుంభమానః"—బంగారున పొదిగిన మణులతో ప్రకాశించుచు—అను వాక్యము విగ్రహముల నలంకరించుటను తెల్పుచున్నది.

ఇటులే విగ్రహముల నూరేగించుట మొదలగు విషయములనుగూడ సూచించు వేదవాక్యములుపలబ్ధములగుచున్నవి.

7. "ఏ హ్యశ్మానమాతిష్ఠా శ్మాభవతు తే తనుః" రమ్ము, రాతి నధిష్ఠింపుము—ఈ రాయియే నీ శరీరమగుగాక—ఈ యథర్వవాక్యము శిలావిగ్రహప్రతిష్ఠను సూచించును.

8. "కాసీత్ప్రమా, ప్రతిమా, కింనిదానమాజ్యం"—
"నతస్య ప్రతిమాస్తి యస్య నామ మహత్ యశః"
ఈ ఋగ్వచనములలో గూడ ప్రతిమార్థము నిరూపితమగుచున్నది.

9. "జీవికార్థేచాపణ్యే" యనుపాణిని సూత్రము ప్రాచీన కాలమున మూర్తిపూజయున్నట్లు ప్రమాణీకరించుచున్నది.

సంక్షిప్తముగనుదాహృతములగు నీప్రమాణములవలన మూర్తి పూజయనునది ప్రాచీనకాల సిద్ధమనియు, వైదిక మతవిరుద్ధము కాదనియును తెలియుచున్నది.

విగ్రహములు ఊహాకల్పితములా? ఈ విగ్రహమిట్లుండ వలయునని నిర్ణయము చేయవలసినదెవరు?—ఎవరికి వారొక యాకృతిని సృష్టించుకొనవచ్చునా?—మనమేయే రూపమున భగవంతుని భావించి యుపాసించినను, ఆ రూపమున మనకు భగవంతుడు సాక్షాత్కరించును. సత్యమే—అయినను శాస్త్రమునందున్న రూప ధ్యానము వలన సులభశీఘ్రసిద్ధి కలుగును. మహర్షులు యోగ సమాధియందున్నప్పుడు భగవంతుని దివ్యలీలలను చూచినారు. ఆ లీలకొక రూపమునిచ్చినారు. ఆ రూపముతో నవినాభావముగనుండు నలౌకికమగు శబ్దమునుగూడ విని మంత్రరూపమున సేకరించినారు. ఆ దివ్యరూపమునకును నాదమునకును సంబంధముండును. ఆ మంత్రోచ్చారణ సమయమున నట్టి యలౌకికమగు దివ్యరూప మావిర్భవించి తీరును. శబ్దార్థములు నిత్యసంబద్ధములై యుండుటయే యిందుకు కారణము. ఒక రాగము పాడునపుడు, రాగాధిష్ఠాన దైవతరూపము వాయుపథమున చూడవచ్చునని నేటి భౌతికశాస్త్రజ్ఞులంగీకరించు చున్నారు. మంత్రములకుగూడ సూక్ష్మతమములగు నధిష్ఠాతృదేవతలయొక్క రూపములట్లే యేర్పడుటకవకాశముగలదని లెడ్‌బీటరు మొదలగువా రనుభవపూర్వకముగ చెప్పినారు—ఇట్లు శబ్దార్థములకు గల సంబంధముననుసరించియు, మహర్షులసమాధి దర్శనముననుసరించియు మంత్ర, రూపము లేర్పడినవని తెలిసికొనవలయును—అందుచే "యే యథా మాం ప్రపద్యన్తే తాం స్తథైవ భజామ్యహం" అను వచనమున్నను, కేవలము సామాన్యమానవకల్పితమైన నామరూపములు శీఘ్రసిద్ధిదములు కావనియు నందుచే మన యూహలతో నిర్మితములగు ప్రతిమలంతగా నుపకరింపవనియు, నందుచేతనే, రాతికి జవసత్వముల నీయగలిగిన మహాశిల్పులుగూడ శాస్త్రీయములగు రూపములనే చెక్కినారు కాని స్వకపోల కల్పితమగు ప్రతిమను చెక్కలేదనియు అందువలననే భారతీయ శిల్పులకు స్వతన్త్రశక్తి లేదని యనుట యవిచార మూలమనియు, దైవతేతరశిల్పములయందు శిల్పుల నైపుణ్యము చూడదగుననియు, మనము గుర్తించుకొనవలయును. ముందు వివరింపనున్న రూపభావనయందింక కొంతవిశేషమును మనము తెలిసికొనగలము.

రూపభావనము:—పాశ్చాత్య విమర్శకులు మన శిల్పముల నధిక్షేపించినారు. మన శిల్పములయందు వాస్తవికత లేదు; పదితలలు ఇరువదిచేతులూ ఏవియో ఆయుధములు—నివియన్నియు నవాస్తవములేగాని, లోకసహజములు గావు; గ్రీసుదేశపు శిల్పములందన్నియో వాస్తవికత యుట్టిపడుచుండును; కండరములు, నరములు, నాళములు, మొదలగునవన్నియు ప్రతిమయందు కనబడుచుండును—ఆ ప్రతిమలను చూచిన వ్యక్తి వానిని ప్రతిమలని భావింపడు. సత్యస్వరూపములనియే భ్రమించును. అట్టి శిల్పము భారతీయులకు లేదని పాశ్చాత్యుల యాక్షేపము—సత్యమే—భారతీయుల శిల్పములు లోకవస్తువుల ప్రతిబింబములుగా నుద్దిష్టము కాలేదు. అట్లుద్దిష్టమైన భారతీయ శిల్పము వాస్తవమునకు సరిపోవుచునే యున్నది. ఉపాసనకై నిర్మితములగు శిల్పములు దివ్యలీలా విభూతికి సూచకములగుటచే లోకదూరములగుటలో దోషములేదు. నటరాజశిల్పము ప్రపంచమునందున్న యుత్తమోత్తమ శిల్పము. ప్రతిక్షణానుభూయమాన సర్వప్రపంచ స్పందనమునకిది ప్రతిబింబము. సృష్టిస్థితి సంహార తిరోధానానుగ్రహ కృత్యములకిది సూచకము. పరమేశ్వర విలాసము సంతయు నీ శిల్పము పుణికిపుచ్చుకొనినది—ఈభావనతో నటరాజ శిల్పమును భావన చేయుంగల భావుకుడు ధన్యుడు.

శ్రీలలితారూపము:—శ్రీలలితారూపమును భావనచేయు విధానము శ్రీలలితాసహస్ర నామములలోనే క్లుప్తముగ సూచితమైనది.—ఆమె ఆయుధముల భావమీ విధముగ నున్నది.

"రాగస్వరూపపాశాఢ్యా, క్రోధాకారాంకుశోజ్జ్వలా।
మనోరూపేక్షుకోదండా పంచతన్మాత్రసాయకా,
నిజారుణప్రభాపూర మజ్జద్బ్రహ్మాండ మండలా।"

శ్రీలలితధరించు "పాశ"మనునాయుధము "రాగము"—అంకుశము—క్రోధము. చెఱకుగడ—మనస్సు, బాణములు—పంచతన్మాత్రలు. సంప్రదాయరహస్యములను గుర్తెఱిగినవారికి "రాగస్వరూప పాశాఢ్యా"—మొదలగునీవాక్యములు, మన్త్రశాస్త్రప్రసిద్ధములగు కొన్ని యక్షరములను తెలుపును. అందుచే సాధకులగువారు వానిని గూడ భావనచేతురు. ఇట్లు సాధకులగువారు తమయధికారముననుసరించి స్థూలరూపమునో, భావరూపమునో, మన్త్రరూపమునో ధ్యానింతురు - ధ్యానింపవలయును.

శ్రీ దుర్గారూపము:—మహిషాసురుడు - పైనసింహము - సింహముపైన శ్రీ దుర్గ పదిచేతులు - ఆయుధములు - ఈ రూపమున శ్రీ దుర్గను ధ్యానింపవలయును. ఇందు మహిషాసురుడు—తమోగుణము; సింహము - రజోగుణము, శుద్ధసత్త్వ రూపిణి, బ్రహ్మమయి శ్రీదుర్గాదేవి—ఆమె దశదిగ్రూపిణి — సర్వశక్తులుగలది, పది హస్తములును, ఆయుధములును, ఈభావమునే తెల్పును.

శ్రీ కాళీరూపము:

"మేఘాంగీం శశిశేఖరాం త్రిణయనాం రక్తాంబరం
బిభ్రతీమ్
పాణిభ్యామభయం వరంచ వికసద్రక్తారవిన్దస్థితామ్।

నృత్యన్తం పురతో నిపీయ మధురం మాధ్వీకమద్యం మహా
కాలం వీక్ష్య వికాసితాననవరామాద్యాం భజే కాళికామ్॥"

శ్రీకాళికాదేవి శరీరము మేఘమువలె నల్లనిది. చంద్రుడు శిరోభూషణము - మూడు నేత్రములున్నవి - ఎఱ్ఱనివస్త్రము ధరించును. ఒకచేతితో నభయముద్రను, మఱియొకచేతితో "వరద" ముద్రను ధరించినది, — వికసించిన యెఱ్ఱనిపద్మమునకూర్చున్నది. ఇప్పపూవుల మద్యము ద్రాగి, మహాకాలుని (ఈశ్వరుని) యెదుట నృత్యము సేయుచున్నది.—శ్రీ కాళికాదేవియొక్క స్థూలరూపమిందు వర్ణితమైనది. సాధకు డీరూపమునిట్లు భావనసేయవలయును.

"శ్వేతపీతాదికో వర్ణో యథా కృష్ణే విలీయతే।
ప్రవిశన్తి తథా కాల్యాం సర్వభూతాని శైలజే।
అతస్తస్యాః కాలశక్తేర్నిర్గుణాయాః నిరాకృతేః।
హితాయ ప్రాప్తయోగానాం వర్ణః కృష్ణో నిరూపితః।
నిత్యాయాః కాలరూపాయాః అవ్యయాయాః శివాత్మనః।
అమృతత్వాల్లలాటేఽస్యాః శశిచిహ్నం నిరూపితమ్।
శశిసూర్యాగ్నిభిర్నిత్యైరఖిలం కాలికా జగత్।
సమ్పశ్యతి యతస్తస్మాత్ కల్పితం నయనత్రయమ్।
గ్రసనాత్సర్వసత్త్వానాం కాలదన్తేన చర్వణాత్।
తద్రక్తసంఘా రూపేణ వాసితం సకలం జగత్।
సమయే సమయే జీవరక్షణం విపదః శివే।
ప్రేరణం సర్వకార్యేషు వరంచాభయ మీరితమ్।
రజోజనితవిశ్వాని విష్టభ్య పరితిష్ఠతి।
అతో హి కథితం భద్రే రక్తపద్మాసనస్థితా।
క్రీడన్తం కాలికం కాలం పీత్వామోహమయీంసురాం।
పశ్యన్తీ చిన్మయే దేవీ సర్వసాక్షిస్వరూపిణీ।
ఏవం గుణానుసారేణ రూపాణి వివిధానిచ।
కల్పితాని హితార్థాయ భక్తానామల్పమేధసాం॥"

"తెలుపు, పసుపురంగులన్నియును నలుపులో కలిసిపోవును.—అటులే, భూతము లన్నియును, కాళికాదేవియందు ప్రవేశించును —ఈ భావమును తెలియచేయుటకయియే, రూపము గుణములులేని కాళికాదేవికి, సాధకుల హితమునుగోరి మహర్షులు నలుపురంగును కల్పించినారు. విచారింపగా నిత్యయు, కాలరూపయు, శివాత్మకయునగు కాళిక, యమృతస్వరూపమేయగును. అందుచే నామె లలాటమునందు చంద్రచిహ్నము వర్ణితమైనది—కాళిక యెల్లప్పుడును, శశిసూర్యాగ్నులతొ లోకమును చూచుచుండును. అందుచే మూడు నేత్రములున్నవి—సర్వలోకములను, సర్వభూతములను సంహరించును. ఆ భూతములయొక్క రక్తమే, ఎఱ్ఱని వస్త్రము. ఆపదలనుండి రక్షించును. మంచి కార్యములకు ప్రేరణముచేయును. వరదాభయ హస్తములీ భావము నభివ్యక్తముచేయును రజోగుణోత్పన్నములైన ప్రపంచములనామె యావరించియుండును. అందుచే నీమె రక్తపద్మాసనస్థయని వర్ణితయైనది. "మోహ"మను మద్యమును త్రాగి క్రీడించు మహాకాలుని, చిద్రూపిణియగు కాళికాదేవి చూచి నవ్వుచుండును. అదియే మందహాసమునకు హేతువు. ఇట్టి భావములను మననముచేయుసాధకునకు కాళి భయమునుగొలుపదు. భక్తిమాత్రమే రగుల్కొల్పును—

ఇట్లే, మన్త్రశాస్త్రమునందును, శిల్పశాస్త్రమునందును వర్ణితములగు రూపముల కొక్కొక యాధ్యాత్మికభావమో, ఆదిదైవికభావమో యుండుననియు నుపాసకుడాభావనను చేయవలయుననియు శాస్త్రములు బోధించుచున్నవి.

ఈశ్వరుడు:—

"ధ్యాయేన్నిత్యం మహేశం రజతగిరినిభం చారు
చంద్రావతంసమ్।
రత్నాకల్పోజ్జ్వలాంగం పరశుమృగవరాభీతిహస్తం
ప్రసన్నమ్।
పద్మాసీనం సమన్తాత్ స్తుతమమరగణైః వ్యాఘ్రకృత్తిం
వసానమ్।
విశ్వాద్యం విశ్వబీజం నిఖిలభయహరం పంచవక్త్రం
త్రినేత్రమ్॥"

మహేశ్వరుడు:—వెండికొండవలె తెల్లనిమూర్తి గలవాడు. చంద్రుడే యలంకారముగ గలవాడు—రత్నముల యొక్క ఉజ్జ్వలమైన కాంతిగలవాడు —నాలుగు చేతులున్నవి—వానిలో, పరశువు, మృగము (లేడి), వరదముద్ర, అభయముద్రయు నుండును. పద్మాసనాసీనుడు—వ్యాఘ్రచర్మధారి. అమరులచే స్తుతింపబడుచుండును. సంసారమునకాదికారణుడు – నిఖిలభయహరుడు – అయిదుముఖములు, మూడు నేత్రములును కలవాడు.

సృష్టి సంహారముల ననుసరించి యీశ్వరమూర్తి స్వరూపము మారుచుండును. ఇందు సృష్టి సంబద్ధమైన స్వరూపము వర్ణితమైనది. తెల్లనిరంగుమీదనే, మిగిలిన రంగులతో చిత్రములను వేయుదుము. ప్రపంచమున కధిష్ఠానము ఈశ్వరుడు—ప్రకృతివిలాసమే ప్రపంచము— తెల్లని రంగుగల యీశ్వరుడను నధిష్ఠానముపైని ప్రకృతి తన లీలలను చిత్రించుచున్నది. ఈశ్వరుని పంచముఖములు ప్రకృతియందు కన్పడు పంచతత్త్వములయొక్క రూపములే. ఈశ్వరుని హాసమే బ్రహ్మాండ వికాసమునకు మూలమయిన దివ్యహాసము—దివ్యేక్షణము—సూర్య చంద్రాగ్నులే త్రినేత్రములు. అమృతస్వరూపుడు, మృత్యుంజయుడునగు నీశ్వరు డమృతమూర్తియగు చంద్రుని భూషణముగ ధరించుటయే యుచితము. మృగము

కామము —పశువు— అర్థము —వరదముద్ర—పద్మము; అభయము— మోక్షము. చతుర్విధ పురుషార్థముల నిచ్చువా ఁడాతఁడు. వ్యాఘ్రచర్మము—ప్రపంచము—అది శివునకు బాహ్యమే—సహజరూపము గాదు. దిగంబరతయే సహజము. ఆరావృతత్వము సహజము. తమోగుణాదిసూచకము వ్యాఘ్రచర్మము కల్పితావరణమే—

ఒకచో శివుడు సర్పములు, కపాలములు, భస్మము మొదలగువానితో నలంకృతుడగును. అది సంహారరూపము గు రుద్రవర్ణనమని గ్రహింపవలయును. క్రూరతమము లగు సర్పాదులుగూడ ప్రళయకాలమున శివునకు కైవసముకావలసినదే. భస్మావశేషము కావలసినదే— ఇట్లు సాధకుడాయామూర్తులనుచితరీతిని బావనచేసి ధన్యుడగుచున్నాడు.

పంచవిధోపాసనము :— ఇట్లు బావనావిశేషములచే సాధింపవలసిన యుపాసనము ప్రధానముగ నైదువిధములుగ నున్నది—

వేదమునందు :—''విష్ణోర్నుకం వీర్యాణి ప్రవోచమ్'', సూర్య ఆత్మా జగతస్తస్థుషశ్చ॥ తామగ్నివర్ణాం....దుర్గాం దేవీం శరణమహంప్రపద్యే॥ గణానాం త్వా గణపతిం హవామహే॥'' త్ర్యంబకం యజామహే॥''—మొదలగు వాక్యములు సగుణోపాసనను సూచించుచు, సగుణ బ్రహ్మోపాసనకు మార్గదర్శకము లగుచున్నవి—అందువలననే ''ఉపాసనాని సగుణబ్రహ్మవిషయ మానస వ్యాపారాణి'' అను వాక్యము ప్రసిద్ధమైయున్నది. ఈ అయిదుపాసనలును బ్రహ్మోపాసనమనియే చెప్పవలెను—

''ఉపాసనం పంచవిధం బ్రహ్మోపాసన మేవ తత్.''

భూతము లయిదు. ఒక్కొక్క భూతమునకొక యధిదైవము కలదు. ఈ సంబంధమునననుసరించి, పంచాయతన పూజకు ప్రారంభముకల్గినది. ఆకాశమున కధిపుడు విష్ణువు. అగ్నికి మహేశ్వరి. వాయువునకు సూర్యుడు. పృధివి కీశ్వరుడు. జలమునకు గణాధిపతి మానవులలో గూడ నొక్కొకనియం దొక్కొక భూతతత్వ మధికముగ నుండును. ఎవరిలో నేభూతతత్వ మధికముగనుండునో, వారా భూతమునకధిదైవతమగు దేవత నుపాసించుచో, వారికి శీఘ్రసిద్ధికలుగును. ఋతంభర ప్రజ్ఞగల గురువు శిష్యునియొక్క ప్రధానతత్వమును కనుగొనగలడు— ఇట్లయిదు మూర్తులుగ నున్నను, యథార్థమున నివి యన్నియు నేకదైవమే యను విషయమునుమఱువరాదు

''దేవ పంచక మిత్యాహురేకం దేవం సుధీవరాః।
ఏకమేవ, పరంబ్రహ్మ పరమాత్మాపరాభిధమ్॥''
''ఆకాశస్యాధిపో విష్ణురగ్నేశ్చైవ మహేశ్వరీ।
వాయోస్సూర్యః క్షితేరీశః జీవనస్య గణాధిపః॥
గురవె యోగనిష్ఠాత్మా ప్రకృతిం పంచభూతగామ్।
పరీక్ష్య కుర్యాః శిష్యాణామ్ అధికారవినిర్ణయమ్॥'

ఇట్లు ఋతంభరాప్రజ్ఞగల గురువు, తన శక్తిచేతను, తదితరులు అర్చావక్రాది సాహాయ్యముచేతను, ఎవరికేదైవతోపాసనము శీఘ్రసిద్ధిదమో చెప్పగలిగియుందురు. అట్టి దైవతము నుపాసించినవారికి సగుణోపాసనాసిద్ధియు తదనంతరము తద్దేవతాలోక ప్రాప్తియు, క్రమముగ ముక్తియును కలుగును.

ఇప్పటికి ప్రతిమారాధనమును గుఱించి క్లుప్తముగఁ దెలిసికొంటిమి. మన్త్రతత్త్వమునుగూడ కొంతగాఁ దెలిసికొందము.

మన్త్రతత్వము :—ప్రకృతియందు కననగు దివ్యలీలల నాధారముగఁ జేసికొని యుపవిష్టములగుటచే నర్చారూపములను, లేక శాస్త్రప్రతిపాదితమైన యుపాస్యరూపములను దివ్యరూపములని యనుచున్నాము. అటులే దైవీరాజ్యమునందుఁ గల్గిన దివ్య స్పందనమునుండి యుద్భవించిన శబ్దములను దివ్యనామము లనియు, మన్త్రములనియు, ననుచున్నాము—మన్త్రతత్వ మిట్లు మన్త్రయోగసంహితయందు ప్రతిపాదితమైనది, ఒక స్పందము (Vibration) లేనిదే యే క్రియయును జరుగదు. స్పందమున్న చోట శబ్దము తప్పక కల్గును. సృష్టిసమయమునఁగూడ నొక స్పందము, దానివలన నొకశబ్దమును కలుగును. ప్రథమ సృష్టి సమయమునఁ గల్గిన యా శబ్దమే ఓంకారము— లేక ప్రణవము—సామ్యావస్థయందున్న ప్రకృతియందు వైషమ్యము కల్గినది—త్రిగుణములు వైషమ్యమునొందినపుడు మొదటఁ గల్గిన శబ్దము—బ్రహ్మవిష్ణుశివాత్మకమగు ఓంకారము—తరువాత నొక్కొకస్పందమువలన నొక్కొక శబ్దము పుట్టినది. అవియే బీజమన్త్రములు—ఆ స్పందమువలన పుట్టిన శబ్దమా స్పందనసమయమున పుట్టిన యర్థమునకు వాచకమై, యా యర్థముయొక్క శక్తిని తనలో నిముడ్చుకొని యుండును. ఆ రెంటికిని వాచ్యవాచకభావ ముండును. ఆ యర్థమునకుఁగల రూపమునకును శబ్దమునకుఁగూడ సంబంధమీ విధముగనే యేర్పడుచున్నది.

''కార్యం యత్ర విభావ్యతే కిమపి తత్ స్పన్దేన న వ్యాపకమ్।
స్పన్దశ్చాపి తథా జగత్సువిదితః శబ్దాన్వయీ సర్వదా।
సృష్టిశ్చాపి తథాదిమా కృతివిశేషత్వాదభూత్ స్పన్దినీ।
శబ్దశ్చోదభవత్ తదా ప్రణవ ఇత్యోంకారరూపశ్శివః॥
సామ్యస్థప్రకృతేర్యదైవ విదితః శబ్దో మహానోమితి।
బ్రహ్మాదిత్రితయాత్మకస్య పరమం రూపం శివం బ్రహ్మణః॥

ప్రణమ్య ప్రకృత్యేత్యేవ ఉపాదా ఖ్యాతా ప్రోక్తా కాలః
... ... మహానిర్వాణమయమయ్ నిరా నాదస్య
యథా ॥"

వ్యష్టిగా ప్రపంచమయమగు త్రిమూర్త్యాత్మకమగు ప్రణవము వ్యష్టిగాని చెప్పబడెను. ఇది బ్రహ్మకు వాచకమనియు, ప్రణవానుసంధానమువలన విఘ్నవినాశనము ఈశ్వర శ్రేష్ఠము కలుగుననియు, పతంజలిమహర్షి పల్కియున్నారు.

"తస్య వాచకః ప్రణవః"—తజ్జపస్తదర్థభావనమ్"—"తతః ప్రత్యక్చేతనాధిగమోఽప్యన్తరాయాభావశ్చ"—ప్రియనామగ్రహణమువలన లోకులు సంతసించునట్లు మనిరె, ప్రణవానుసంధానమువలన ఈశ్వరుడు ప్రసన్నుడగునని శంకరులుగూడ జెప్పియున్నారు.

"యస్మాద్ హ ప్రయుజ్యమానే న ప్రసీదతి ప్రియనామ
గ్రహణేనేవలోకః"

ప్రకృతియొక్క ద్వితీయ స్వరూపమగుచు ఎనిమిది బీజమన్త్రము లుద్భవించినవి. పరమేశ్వరుడష్టప్రకృతియైన విధముగనె, శబ్దబ్రహ్మకుగూడ నెనిమిది బీజమన్త్రములున్నవి. అష్టప్రకృతులవికాసమే ప్రపంచము - అష్టబీజాక్షరముల వికాసమే మన్త్రరాశి.—

"బీజమన్త్రాస్త్రయః పూర్వం తతోఽష్టౌ పరికీర్తితాః।
గురుబీజం శక్తిబీజం, రమాబీజం తతో భవేత్।
కామబీజం యోగబీజం తేజోబీజమ థాపరమ్।
శాన్తిబీజం చ రక్షాచ ప్రోక్తాచైషాం ప్రధానతా॥"
అష్టౌ ప్రకృతయః ప్రోక్తాః కారణబ్రహ్మణోయథా।
యాభిరావిర్భవదిదం కార్యబ్రహ్మ సనాతనమ్।
తథా ప్రధానభూతాని బీజాన్యష్టౌ మనీషిభిః॥
అష్టౌ ప్రకృతయః ప్రోక్తాః కార్యరూపస్య బ్రహ్మణః॥"—

ఇంకొక విషయము గూడ గుర్తుంచుకొన వలయును. శరీరమునందే సర్వదైవతములకును, శక్తులకును, కేన్ద్రములు గలవు. ఆకేన్ద్రములలో మనసును నిల్పినపుడా యా దైవతములకు సంబంధించిన మన్త్రములు వినబడును. ఇది ఇప్పటికిని యోగులయనుభవములోనున్న రహస్యము—మాతృకాచక్ర వివేకము, షట్చక్ర వివరణము మొదలగు గ్రంథములీ విషయములను వర్ణించును—ఈ రహస్యమును తెలిసికొని, మన్త్రము, దైవము, ఆత్మ, గురువులనెకరూపముగ భావనచేయఁ గలిగిన వ్యక్తికి సిద్ధియు, మహిమలును గలుగును,

మన్త్రములవలన సిద్ధికలుగుననువిషయమును పతంజలి మహర్షి "జన్మౌషధిమన్త్రతపస్సమాధిజాస్సిద్ధయః—"అను సూత్రమునఁ జెప్పినారు. యోగశాస్త్రమునందుగూడనీ విషయమే యిట్లునిరూపితమైనది.

"మన్త్రయోగి, మన్త్రసిద్ధ్యా, తపస్సిద్ధ్యా హరాన్వితః।
జరాం విజిత్యమాప్నోతి లయయోగిచ సంయమైః॥
మన్త్రసాధనతో దేవా దేవ్యః సంయాన్తి వశ్యతామ్।
విభవాశ్చైవ జగతో యాన్తి తస్యైవ భోగ్యతామ్.॥"

కాని యీ మన్త్రయోగరూపమగునుపాసన పలింపవలయునన్నచొ, సాధకుడు శాస్త్రనియమములను పాటింపవలెను. ఈ సాధనగూడ విజ్ఞాన శాస్త్రపరిశోధనమువలె, నొకపరిశోధనమే యనియు, నియమశీలవంతులకే యిందును సిద్ధి లభించుననియు, సూరక మన్త్రావృత్తివలన నఖిలషిత ఫలము సిద్ధింపదనియు తెలియవలయును.

షోడశాంగములు:—మన్త్రయోగసిద్ధికి 16 అంగములు కలవు.

"భవన్తి మన్త్రయోగస్య షోడశాంగాని నిశ్చితమ్।
యథా సుధాంశోర్జాయన్తే కలాః షోడశ శోభనాః॥"
భక్తిశ్శుద్ధిశ్చాసనం చ పంచాంగస్యాపి సేవనమ్।
ఆచారధారణే దివ్యదేశసేవన మిత్యపి॥
ప్రాణక్రియా తథా ముద్రా తర్పణం హవనం బలిః।
యోగో జపస్తథా ధ్యానం సమాధిశ్చేతి షోడశ॥"

(1) భక్తి (2) శుద్ధి:—దిక్శుద్ధి, కాయశుద్ధి, స్థానశుద్ధి, అన్తశ్శుద్ధి, (3) ఆసనము, (4) పంచాంగసేవనము—గీత, సహస్రనామము, స్తవము, కవచము, హృదయము నను వానిని పఠించుట. (5) ఆచారము దివ్య, దక్షిణ, వామాచారములు. (6) ధారణము, అభ్యన్తరబాహ్యధారణములు. (7) దివ్యదేశసేవనము; తన్త్రములయందు 16 దివ్యదేశములు చెప్పబడినవి. వహ్ని, జలము, లింగము, స్థండిలము, కుడ్యము, పటము, మండలము, విశిఖము, నిత్యయన్త్రము, భావయన్త్రము, పీఠము, విగ్రహము, విభూతి, నాభి, హృదయము, శిరస్సు—వీనియందాయా దేవతోపాసనముజేయవలయును. (8) ప్రాణక్రియ, (9) ముద్రలు. (10) తర్పణము. (11) హవనము. (12) బలి. (13) యాగము. (14) జపము. (15) ధ్యానము. (16) సమాధి.

ఇట్లు షోడశాంగయుతమగు మన్త్రయోగసాధనము వలనను, ప్రతిమాద్యారాధనము వలనను, లోకశాన్తియు, నాత్మానుభూతియు కలుగునని పూర్వాచార సిద్ధాన్తము.

1. జపాత్సిద్ధిః జపాత్సిద్ధిః జపాత్సిద్ధిర్నసంశయః।
2. అభిరూప్యాచ్చ బింబస్య పూజాయాశ్చ విశేషతః।
సాధకస్య చ విశ్వాసాత్ దేవతాసన్నిధిర్భవేత్॥

# నందిమండలము

జనపనేని వెంకట్రావు

పరమశివుని పరివారంలో ప్రధానం ప్రమథగణాలు ప్రమథగణముఖ్యుడు నందీశ్వరుడు. ఈశ్వర సాహాయ్య సిద్ధుడు. శివాలయ ప్రవేశానికి ముందు మనం దర్శించేది నందీశ్వరునే. నందిని ప్రార్థించికొని నంది శృంగమధ్యం నుంచి మన దృష్టులు సారిస్తేనే మనకు శివదర్శనప్రాప్తి. శివుడు శివంకరుడు. సిరిసంపదలకు శ్రేయస్సుకు నిధానమైన శివప్రీతికి ముందుమెట్టు నందిదేవుడు. శివునివాహనం పాడిపంటలకు మూలమైన వృషరూపధారి. ఈ కల్యాణ మూర్తి హిందువుల యిష్టదైవం గావడం శోచనీయమా ?

నవనందులు గల భూమి నందిమండలం. ఇది ప్రస్తుతం కర్నూలు జిల్లా నంద్యాల తాలూకాలోనిది. నంద్యాల అనే పేరు 'నంది అలయం' శబ్దానికి భిన్నరూపమేనట. సత్యమే కావచ్చు; మహానందిక్షేత్రం నంద్యాల తాలూకా లోనిదే. మహానందిచుట్టూ సుమారు 10 మైళ్లలోపున గల భూవలయంలోనే నవనందు లున్నాయి. 1. ప్రథమనంది, 2. నాగనంది, 3. వినాయకనంది, 4. గరుడనంది, 5. బ్రహ్మనంది, 6. సూర్యనంది, 7. విష్ణునంది, 8. సోమ నంది, 9. శివనంది అని నవనందుల పేర్లు.

నంద్యాల పట్టణ మధ్యంలోనిది బ్రహ్మనంది. సంవత్సర మంతా మహానంది విగ్రహాలకు మహదుత్సవాలు జరిగేది యిక్కడ. మహాశివరాత్రిరోజుల్లోమాత్రం మహానందితీసుకు పోతా రూరేగిస్తూ. శ్రీశైలనాథుని దర్శించి వచ్చే యాత్రికు లంతా యిక్కడికి వస్తారు. అందుచేతనే శివరాత్రి దాటిన రెండవనాటినుండి అయిదవనాటివరకు నంద్యాల పట్టణం పరమ యాత్రాస్థల మౌతుంది. ఊరేగింపుతో ఉత్సవాలతో శోభాయమానంగా ఉంటుంది.

నంద్యాలకూ మహానందికీ మధ్యలో ఒక చిన్నగ్రామం. ఆ గ్రామం దగ్గర సూర్యనంది క్షేత్రం. ఈ దేవాలయంలో ఒక లింగం మరొక రావిచెట్టు. రావిచెట్టు సూర్యచిహ్నం. దీని మహిమ కొలతలేనిదట. ఈనాటికీ యిది మహర్షుల నివాసస్థలమట. యోగ్యతగల భక్తులకే యీ మహర్షుల దర్శనభాగ్యం లభిస్తుందట. ఈయశ్వత్థప్రదర్శన మాత్రం చేత భక్తుల పాపపంకిలాలు భస్మీభూతమైపోతాయట.

విష్ణునంది లేక కృష్ణనంది అనే పుణ్యస్థలం నంద్యాల కవతల రెండుమైళ్ల దూరంలోని అడవిలో ఉన్నది. ఇక్కడ ఒక చెరువు దగ్గర బుగ్గలోనుంచి వస్తుందట యీ చెరువు లోనికి నీరు. ఎక్కడో మూడుచెట్ల అడుగుభాగంలో మూడు వృక్షాలు. స్ఫటికంవలె స్వచ్ఛమై పవిత్రమైన నీరు. మహానంది చెరువు నీటిని మించిపోతుంది.

నంద్యాల నగరంలోనే మరిమూడు నందిక్షేత్రా లున్నాయి. రైలుస్టేషనుకు దగ్గరగా ఉన్నదొక గుడి. దాని చుట్టూ నెలయేరు.

ఈ గుడినే ప్రథమ నందిగుడి అంటారు. ప్రతిరోజూ రాత్రి పెద్ద తాచుపామొకటి ఆలయగర్భంలోకి ప్రవేశించే దనీ శివలింగానికి పడగతో నీడపట్టేదనీ తాము ప్రతిరాత్రీ చూచేవారమని యీనాటి నంద్యాలలో వయోవృద్ధులు చెబుతారు. ఈ దేవస్థానం యీనాటికి పెద్ద పెద్ద నెఱలు విచ్చిపోయింది. ధనాభావంచేత మరమ్మతులు చేయించడం జరుగలేదు.

బ్రహ్మ నందికి ఫర్లాంగుదూరంలో సోమనంద్యాలయం. దీనిలోని లింగం పసుపు తెలుపులు గలిసిన పవిత్ర వర్ణంతో చూడ సొంపుగా ఉంటుంది.

నంద్యాలకు పడమరగా ఆంజనేయస్వామివారి ఆలయం ఉన్నది. దీనిలోని నంది నాగనంది. ఈ లింగం వేరొక ఆలయంలోనిదనీ మ్లేచ్ఛుల దురహంకారాని కత్తె పోయిన తదాలయంనుండి యీ లింగాన్ని తెచ్చి యీ ఆలయంలో ప్రతిష్ఠించినారనీ చెప్పుకొంటా రిక్కడి పౌరులు.

కనుమాల కాలువగట్టున నంద్యాల కీశాన్యంగా వెలి సింది శివనందిక్షేత్రం. ఈ స్థలం పరమపవిత్రమైనది. దేవతలిక్కడ దివ్వెల్లా తిరుగుతుంటారని ప్రతీతి.

మహానందికి పడమరగా మైలుదూరంలో గరుడనందీశ్వ రాలయం. దీనినే నాగనంది అంటారుకూడా. ఇక్కడే ఉన్నది మహానందీశ్వరుని రథశాల ప్రస్తుతం.

నంద్యాలకు దక్షిణదిక్కుగా పూర్వం కోట ఉండేది. ఈనాడు కోటదిబ్బలుమాత్రం గానవస్తాయి ఈ దిబ్బలు క్రింద భువనేశ్వరంలో మరొక ముఖ్యాలయం ఉన్నది. దీనిలోని లింగంకూడా మల్లికార్జునస్వామివారే. దీని యిరువైపుల తలుపులు మూసి కనబడతాయి. ఒకతలుపు తెరిస్తే అక్కడశక్త్యాలయం ఉన్నదనీ యీరెండాలయాల్లో దైవాలు పూర్వపురాజుల యిష్టదైవాలై పూజింపబడ్డారనీ యీ చుట్టుప్రక్కల ప్రతీతి.

నవనందియాత్రలకు ముఖ్యకాలం కార్తికమాఘమాస ములు. ఆకాలం యీ క్షేత్రాల్లో భక్తయాత్రికులు వేలాది

వారిని పూజించడం. అక్కడ నెలవుతీసికొనడం. రెండు మైళ్ళలో గరుడనందిని చేరడం. అక్కడికి దగ్గరగా మైలులో నాగనందిని దర్శించడం. అప్పుడు నగర మధ్యంలో బ్రహ్మనందిని సేవించడం. అక్కడికి తూర్పుగా పర్లాంగుదూరంలో సోమనందికి మ్రొక్కడం. తరువాత ఈశాన్యంగా శివనందికి పోవడం. పైన రెండుమైళ్ళలో విష్ణునంది నారాధించడం. ఆపైన వినాయకనంది. ఆవెనుక మహానంది. తుట్టతుదకు సూర్యనందిని చూడడం. యాత్ర పూర్తిచెయ్యడం భక్తుల మామూలు.

నందిమంటపాలన్నిగూర్చి పూర్వగాథలున్నాయి. ఒక కథ చెబుతుంది. కృతయుగారంభంలో పర్వతుడనేవానికి యిద్దరు కొడుకు లుండేవారు. వారి పేర్లు శిలాదుడు, నంది. అన్నాహారాలు విసర్జించి శిలాభక్షణ మాత్రం చేస్తూ శివదేవుని గూర్చి తీవ్రతపస్సు చేయడం చేత పెద్ద వానికి శిలాదుడనే పేరు సార్థక మయింది. శివుడు మెచ్చి శిలాదునికి పర్వతాకారం ప్రసాదించి తానా పర్వతంమీదనే నివసింప మొదలు పెట్టినాడు. ఈపర్వతమే నేటి శ్రీశైలం నంది కూడ యీ విధంగానే పరమశివునిగూర్చి పరమ తపస్సు చేశాడు. శివుడు మెచ్చి నందినితన ప్రసిద్ధ వాహ నంగా చేసికొన్నాడు. నంది తపస్సుచేసిన చోటే యీనాటి నవనందులున్నచోటు నందులనే భారతదేశరాజు లీ ప్రదే శాన్ని క్రీస్తుశకం 11 వ శతాబ్దంలో పరిపాలించినప్పుడు వా రనేక దేవాలయాలను కట్టించి వానిలో తమ యిష్ట దైవమైన నందులను ప్రతిష్టించారనీ నవనందులు వారి ప్రతిష్ఠయనీ యీ నవనందులున్నచోటు నంది మండల మనీ చరిత్ర ప్రసిద్ధి.

మన పూర్వయుగాల్లో మహర్షులు తపస్సుచేసిన లలితా శ్రమాలీనాటికీలేకపోలేదు. అజంతా గుహల్లోను నాగార్జున కొండల్లోనూ మన పూర్వశిల్పులు ప్రదర్శించిన పరిపూర్ణ కళాపాటవ మింకా నశించిపోలేదు. ఆంధ్రదేశములో ముఖ్యమైన దేవాలయాల కొకసారి పోయి చూడండి. దుర్గమారణ్యాల మధ్యనున్నాయి. మాటుపడి ప్రవహించే నీటి బుగ్గలతో రమ్యమైన చెఱువులతొ మనోహరమైన సెల యేళ్లతో అరుదైన కళాశిల్పాలతో నిండిన కొండల మధ్య నున్నాయి, అటు ఉత్తరాదిని సింహాచలం, యిటు దక్షి ణాదిని మహానంది; పోయి చూడండి. కానల్లో ఖాళీస్థలా లన్నీ తపోవనాలైపోయిన వానాడు. వెలసిన దేవస్థానాలన్నీ దేవస్థానాలే గాక శిల్పస్థానాలై కళానిలయా లయినవానాడు. కళలూరి జయ చిహ్నాంకితమైన మన పెద్దలనాటి కాలాన్ని స్ఫురణకు తెస్తాయి మనకి దృశ్యాలు సింహాచలంలోని శిల్పం మన పూర్వులది. ప్రకృతి రమణిలోని ప్రతిరూపం ప్రతిసౌందర్యం యిక్కడ ప్రత్యక్షంగా చూసాం. మహా నందిలో కళాచాతుర్యం సజీవశిల్పియొక్క పని. పలు రకాల మానవరూపభంగిమ లిక్కడ భావపరిపక్వంగా ప్రకృతిని మేళవించి పరికల్పింపబడ్డాయన్నమాట కళో పాసకులంతా గమనించగలరు. మహానందీశ్వరాలయం లోని ప్రతిభాగం మనకీ సత్యాన్ని చాటగలదు. మననం చేసిచూడండి.

మహానంది కర్నూలు జిల్లా నంద్యాలకు 10 మైళ్ల దూరం మాత్రం. నంద్యాలనుండి యిక్కడికి మోటారు మీద సుఖ ప్రయాణం చెయ్యదగ్గ మార్గం గలదు మహానంది అడవిమధ్య ఉన్నది. పలుదిశలా పచ్చని చెట్లూ, కదళీవనాలు, నారింజతోపులు, కొబ్బరితోటలు చుట్టూ ఉన్నాయి. ఫలభాసమైన పర్వతాలగుట్టకర్నూలు జిల్లా, చలిదేశం, ఇందులో మహానంది నందన వనం ఎంత తారతమ్యం!

మహానంది దేవాలయం అపురూపం, అద్వితీయం, గర్భాలయంమీది విమానం స్వచ్ఛమైన ఉత్తరభారత నాగర సాంప్రదాయం; జైనదేవాలయాలవలే వక్రరేఖా వృతమైన శిఖరం, ఎంతో క్రమపడి చేసిన చక్కని అలం కారం ఆకాశానికంటుతుంది తిన్నగా, చదునైన ప్రక్కలతో చతురాకారమైన గర్భగృహంమీద నిలిచింది. సమరేఖలు కలిగి పోనుపోను సన్నబడి అనేకాంతస్థులతో తిన్నెపై తిన్నెవలె మిన్నుతుండే ద్రవిడ విమానం గాదిది. ఈ విమా నాన్ని గూర్చిన పూర్వకథ విని ఉంటారు.

పూర్వకాలంలో ఉత్తరాదినుంచి వచ్చిన రససిద్ధుడొక డీ విమానాన్ని కట్టినాడట. కూలి యివ్వవలసి వచ్చిన దట. కూలివాళ్లందరిచేతనూ కుప్పలు పెట్టించాడట యిసుక. ఒక్క మంత్రం చదివినాడట. కూలీలవనికి చాలినంత ధనం సృష్టించాడట. ఈకథ కనుగుణంగా యీ విమానసింహద్వారం పశ్చిమముఖంగా ఉన్నది. పశ్చిమద్వారాలు గల ఆలయాలు భగవన్నిర్మితాలనీ ఋషుల కట్టడాలనీ ప్రతీతి.

గర్భాలయంలో లింగం అద్వితీయమైనది. భారత దేశంలో యిటువంటిదింకొకటిలేదు. ఇది రెండు గుంటలుగల చక్కని మోటుశిల. కాని దీనిలో సాల గ్రామాలు విష్ణుచిహ్నాలుగా గణిస్తారు వైష్ణవులు. అందు చేత యీ లింగం చాలా మహిమ గలదట.

స్వామివారి భార్య కామేశ్వరీదేవి. ఈమె కొక ప్రత్యే కాలయం ఉన్నది. విగ్రహం మిక్కిలి గంభీరమైనది. నాలుగు భుజాలు, పైరెండు చేతుల్లోనూ లక్ష్మీదేవికివలె తామరపువ్వులుంటాయి. దేవి యెదుట శ్రీచక్రం మహా పురుషుడు కేవలం శంకరాచార్యులవారి ప్రతిష్ఠ. అమ్మ వారికనుల మీదను యీ చక్రం మీదనూ దృష్టి కేంద్రీ

కరించి కన్నులు మూసికొన్నవారికి తమతమ సంస్కారాలకు తగ్గ దర్శనం లభిస్తుందట. దేవాలయముఖ మంటపం యిటీవల కట్టినది. భైరవజోస్యుల మహానందయ్యగారి ప్రేరేపణవల్ల యీ ముఖమంటపనిర్మాణ మయింది. ఇందలి కళ శ్రేష్ఠమైనది. కళాప్రపంచంలో మన పూర్వపుహక్కు లింకా పోలేవని గర్వపడడానికి మనకిది తార్కాణం. లలిత సుకుమారరేఖలు. అతి సూక్ష్మ వివరవిన్యాసాలు - తూచిపంచిన వైఖరులు-ఎన్ని సౌందర్యాలో యేకభవించి కనబడతా యిక్కడ. ఒక దివ్యకళ- ఒక దివ్యఫలం యేర్పరుస్తాయి. సులభంగా మరిచిపోలేము.

శ్రీశైలంలోవలే మహనందిలో లింగం గూడా భూమికి కొంచెం యెత్తుగా ఉంటుంది. తల లొగ్గి ముట్టుకొని తమిదీర సేవింప వచ్చు భక్తులందరూ. ఈ లింగాన్ని గూర్చి ఒక చిత్రగాథ. కపిలగోవు ఒక పుట్టమీద పాలు వర్షిస్తుండేది. పుట్టక్రింద బాల కృష్ణుడు నోరు తెరిచి నిలిచి పాలు త్రాగేవాడు. గొల్లడొక డిది చూచాడు. ఊరిపెద్ద నందుని చెవున వేశాడు. చూదామని నందుడు పరువున వచ్చాడు.

ఒక మాటున నిలచి చూడబోయాడు. కాని యీ అద్భుత దర్శనంతో తబ్బిబ్బులు పడ్డాడు. వెలుపలికి తూలేడు. ఇది చూచి గోవు భయపడింది. పుట్టను త్రొక్కేసింది. గోవుగిట్ట పుట్టమీద ముద్రిత మయింది శాశ్వతంగా. తన అపరాధానికి నందుడు చాలా విచారించాడు. ఇష్టదైవమైన నందిని పూజించాడు. నంది ప్రత్యక్షమయింది. గోవు త్రొక్కిన పుట్ట శిలాలింగ మయ్యేటట్టు ప్రసాదించింది. ఊరిపెద్ద దగ్గరచెలమలో స్నానం చేశాడు. మహానంది తీర్థం యిలాగయిందుత్పత్తి; ఏమైతేనేమి? నిరాడంబరమైన కథ. భక్తివిశ్వాసపూరితం! "యే యథామాం ప్రపద్యంతే తాన్ తదైవ భజామ్యహం" అనే గీతా సూత్రాన్ని ఋజువు చేస్తుంది.

గర్భాలయం యెదుట పెద్దనంది. ఈ నందివల్లనూ దీని యెదుట చెరువువల్లనూ యీ క్షేత్రానికీ మహానంది తీర్థం అనే పేరు వచ్చింది. దేవాలయ ప్రాకారాని కవ్వల విష్ణుకుండం బ్రహ్మకుండం అనే మరోరెండు చెఱువులున్నాయి. హిందూదైవత శ్రేణీలో త్రిమూర్తిత్వానికి గుడిలోని స్వామివారతీతుడని యీ చెరువులే నిరూపిస్తాయి, ఇదే విధంగా లింగ మేర్పడిన వంకలు ప్రకృతి పురుష తత్వాలను తెలుపు తుంటాయి. ఈ రెండు వంకలూ కలిస్తే వృత్త మేర్పడుతుంది. 'పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవా వశిష్యతే' అనే ఉపనిషచ్చూక్తి యిదే. ప్రకృతి రేఖలో రంధ్ర మొకటున్నది. తరిచి చూస్తే బాహ్య ప్రపంచం వట్టి శూన్యమేనని సూచిస్తుందీరంధ్రం. ఈ విధంగా భగవంతుడు త్రిగుణ త్రిలోకాతీతుడైన యేకైక మూర్తి అని బోధిస్తుంది యీ ఆలయం.

ప్రధానమైన చెఱువు రుద్రకుండం. దూరదూరదేశ యాత్రికులు వస్తుంటారు చెఱువులో స్నానమాడడానికి స్ఫటిక స్వచ్ఛ సమృద్ధతీర్థం. ఎక్కడిదో పాటుపడ్డ మంచి మంచి బుగ్గలలోనుంచి ప్రవహించి వస్తుంది. మహానంది సమస్త హిందూదేశ జనసమ్మతం గావడానికి చెఱువే కారణమేమో! శరీరానికి జలస్పర్శ విద్యుత్స్పర్శ అంటారు, ఏకాగ్రత కలవాటు పడ్డవారు. ఉదారమూర్తి పరమేశ్వరుడు భక్తుల పాపపంకిల పరిహారార్థం యీ పవిత్రజల ప్రవాహాన్ని పంపిస్తున్నాడంటారు వాడుకగా. ఈ చెఱువులోనికి 5 ధారలు వస్తుంటాయి ఒక్కొకటి 4 అంగుళాల చతురం గలది. అన్నీ గర్భాలయం ప్రక్కనుంచి బయలు దేరినవి. శ్రీశైలధార, నరసింహధార, వైవోనిధిధార, నంది తీర్థం, కాశీతీర్థం, అంటారు వీటిని. నందినోట వచ్చేతీర్థం ప్రశస్తమైనది. దీనిలోనుంచి వచ్చేనీరు సామాన్యం గాదు. అతిమధురమే కాదు, ఆరోగ్యప్రదం, చుట్టుప్రక్కల యిరువదివేలు యెకరాల భూమి సాగవుతుందీ నీటితో. ఇది జీవధార ఎన్నడూ ఎండిపోదు. స్ఫటికంవలె స్వచ్ఛమైన నీరు. పైనుంచి అడుగుభాగం గనబడుతుందద్దంలాగు. ఈ చెఱువు 60 అడుగుల చతురం కలది. నలువైపులా గుమ్మాలూ లోనికి మెట్లూ ఉన్నాయి. చెఱువు లోనికీ బైటకీ మహాచాతుర్యంగా మార్గాలేర్పరుప బడ్డాయి.

ఎప్పుడు చూచినా చెఱువులో నాలుగున్నర అడుగుల నీరుంటుంది. మునిగిపోతామనే భయంలేదు. అందరూ యధేచ్ఛగా స్నానాలు చేయవచ్చు. ఈ చెఱువులో ఒక్కసారి మునిగితే చాలు. ఐహికబాధలన్నీ అంతరించిపోతాయి. గంటలకొలది దీనిలోనే ఉండా లనిపిస్తుంది. ఈవలికి రావడం యిష్టంకాదు. చెఱువుమధ్యలో ఓరాతి మంటపం. దీనిలో 5 శివలింగాలు ప్రతిష్ఠింపబడ్డాయి, ఇది శ్రీశైలంలోని మంగళగౌరి మాదిరి. ప్రతి యాత్రికుడూ యధేచ్ఛగా అభిషేకం చేసికోవచ్చు. చెఱువు గోడలు చక్కగాచెక్కిన రాతి కట్టడాలు. గణేశ్వరుడు నటరాజు వరాహావతారం రాసక్రీడ మున్నగు శిల్పచిత్రా లీ గోడల మీద చూడగలం.

ఈ చెఱువు కొకప్రక్కన శిలాశాసన మొకటున్నది. దురదృష్టవశాత్తూ సరిగా కనుపించడంలేదు దీనిమీదక్షరాలు. మహానంద్యాలయాన్ని గూర్చిగాని మహానందిని గూర్చిగాని తగినన్ని వివరాలు దొరుకవు. శివనందివద్ద క్రీస్తుశకం 1046 నాటి శిలాశాసనం మహానంది తీర్థాన్ని గూర్చి కొంచెం చెబుతుంది. విజయనగర సామ్రాట్టు

# భగవదుపచారములు - తత్ప్రయోజనము ౨

పండిత వేదాంతం ప్రపన్నారాయణాచార్యులు

క్రిందటి వ్యాసములో ప్రధానద్వారపాలకుడైన మణికునకు నమస్కరించుటవరకు వ్రాసియుంటిని. మణికాభివాదనమునకు పిమ్మట పూజకుడు మణికునొద్దనుండి యంత్రికాదానము చేయతగియున్నది; యంత్రిక యనగా (కవాటోద్ఘాటనమునకు ఉపయుక్తమైన ఆయనసాధనము) దీనినే కుంచిక యనియు కుంచెకోల యనియు చెప్పుదురు. దీనిసహాయముతో తలుపులకు లోపలిభాగమందు వేయబడియున్న గడియ తీయబడుచున్నది. అధునాతన నాగరికప్రపంచమందు ప్రస్తుతమున ఇట్టి సాధనములు విరళమై తాళములు తాళపుచెవులు విరివిగా నుపయోగింపబడుచున్నవి. ఈ యంత్రిక ద్వార రక్షణార్థమై వేచియున్న మణికునకు ఆయుధవిశేషముగా నుపయోగపడుచున్నది.

'మణికో యంత్రికాయుధ' ఇతిమరీచిః; యంత్రికాం 'నిరస్తంరక్ష' ఇత్యాదాయ; ఆదాయ, అనగా తీసికొని అని యర్థము. దీనిపై ఎవరివద్దనుండి? యను ప్రశ్ననిష్పన్నమగునుకదా, అప్పుడు 'యంత్రికాయుధుడైన మణికునొద్దనుండి' యని చెప్పదగియున్నది. శ్రీవైఖానసభగవచ్ఛాస్త్రానుసారమర్చింపబడుచున్న తిరుమల వగైరా క్షేత్రములందీసాంప్రదాయము చూడదగియున్నది. పూజకుడు మణికాభివందనము జేసినపిమ్మట తనవద్దనున్న కుంచికను మణికునొద్దనుంచి 'నిరస్తం రక్షః' అను మంత్రము నుచ్చరించుచు తిరిగి తీసికొనును.

(మం) నిరస్తగ్ంరక్షో నిరస్తోఽఘశగ్ంసో నిరస్తా అరాతయః। ససోమా దేవా రక్షధ్వం। నిరస్తం, రక్షః, నిరస్తః, అఘశంసః, నిరస్తాః, అరాతయః, ససోమాః, దేవాః, రక్షధ్వం, హేమణిక ఇత్యధ్యాహార్యః; రక్షఃకర్మవిఘ్నకరం, యాతునిరస్తంఖలు; అఘాని పాపాని శంసతీత్యఘశంసః భగవదారాధనరూపయజనకర్మణోవిఘ్నకర్తా పాపసమాచారః నిరస్తఃఖలు; అరాతయః, ఈశ్వరోపాసకస్య మమ శత్రవః నిరస్తాః భవంతు, మయా క్రియమాణే సగుణారాధనే కర్మణి ససోమాః దేవాః రక్షధ్వం; మాం రక్షంత్విత్యర్థః.

(తా) ఓ మణికా, వైదికకర్మలను ద్వేషించునట్టి రక్షస్సులను పారద్రోలితివిగదా! భగవద్యజనమును ప్రశాంతముగా కొనసాగనీయక పాపసమాచారములను చెప్పువారిని ప్రాంతములకు చేరనీయలేదుకదా! మోక్షైకసాధనమైన ఈశ్వరోపాసనము చేయు నాయొక్క శత్రువులు నిరస్తులగుదురుగాక: నే చేయుచున్న భగవద్యజనమును సోముడు మొదలుగాగల సర్వదేవతలు నాకు రక్షకులయ్యెదరు గాక; 'యంత్రికాయాం మార్తాండమావాహయామి' యంత్రికకధిదేవత మార్తాండుడు. అధిదేవత యనగా ఆయా వస్తువును ధరించి పూజకునకు సహాయభూతుడుగా నుండువాడని భావము.

(శ్లో) తత్తద్ద్రవ్యధరాన్ దేవాన్ తత్తద్ద్రవ్యాధిదేవతాః। తత్తద్ద్రవ్యధరాన్ స్మృత్వా పూజయేత్తు యథావిధి॥ ఇతి భృగుః. మార్తాండుని యంత్రికయందావాహించి 'హిరణ్యపాణి' మితికవాటే సంయోజ్య (మం) హిరణ్యపాణిమూతయే సవితారముపహ్వయే। సచేత్తా దేవతాపదమ్॥ ఈ మంత్రముచ్చరించుచు యంత్రికను కవాటఛిద్రమందుంచవలెను.

మంత్రార్థము: హిరణ్యపాణిం, ఊతయే, సవితారం ఉపహ్వయే, సః, చేత్తా, దేవతా పదమ్, హిరణ్యం పాణౌ యస్యసః హిరణ్యపాణిః తం సవితారం, ఊతయే = అస్మాకంరక్షణాయ, ఉపహ్వయే = సమాహ్వయే; కిమర్థం సవితార మాహ్వయసి? సః = సవితా దేవతా పదమస్మదాదీనాం భగవదారాధకానాం యోగ్యంస్థానం, చేత్తా = జ్ఞాతా; తస్మాత్కారణాత్కర్మసాక్షిణం సవితారమాహూయ పునరావృత్తిరహితం శాశ్వతదివ్యలోకప్రాపకం భగవదారాధనం కర్మ కర్తుం కవాటోద్ఘాటనం కరోమీతి భావః. సవితయనగా కర్మప్రేరకుడని యర్థము. భగవదారాధనరూపమైన సత్కర్మకరణమునకు మమ్ముల ప్రేరించి తదారాధకులమైన మాకు యోగ్యస్థానము, నిర్ణయము చేయుసమర్థుడైనట్టిన్ని హిరణ్మయములైన కరణములుగల — అనగా బంగారమువలె ప్రకాశవంతములైన చేతుల్గల సూర్యభగవానుని మాకు రక్షకునిగా కోరి యాహ్వానముచేయుచున్నాము.

'దివంవిమృణోత్వితి' కవాటావుద్ఘాటయతి; (మం) దివం విమృణోతు దివి స్వర్గం పిహితద్వారం విమృణోతు। దివ్యంతరిక్షే దేవతానాం సాప్సరోగణమభిదర్శయతామ్॥' ఈ మంత్ర ముచ్చరించుచు తలుపులు తెరచుచున్నాడు.

దివం, విమృణోతు, దివి, స్వర్గం, పిహితద్వారం, విమృణోతు దివి, అంతరిక్షే, దేవతానాం, సాప్సరోగణం, అభిదర్శయతామ్, దివమాకాశం విమృణోతు-విగతావరణం కరోతు, దివి అంతరిక్షే స్వర్గం-స్వర్గసంబంధి పిహితద్వారం పాపిప్రవేశ నిరసనాయావృతద్వారం, విమృణోతు దివి = స్వర్గే

[illegible] = ఆకాశాని వితిమిరాం [illegible] మిత్ప్ర [illegible] దివ్యయతామ్॥ తలు [illegible] మంత్రమునుచ్చరించుచులో బావ [illegible] నాయకమై మూయబడిన గర్భా లయద్వారము తెరువబడి నాకాశతత్త్వమైన గర్భాల యాంతర్భాగము [illegible] తమోమయమైన చీకటితో వ్యాపిం పబడి ద్వారోద్ఘాటనానంతర మట్టి చీకటి తొలగి దివ్య మంగళవిగ్రహరూపియైన పరమాత్మను సందర్శించుట కవకాశము కల్పించుచున్నది. 'దివం దివ్యేనోతు' అనగా ఆకాశము వితిమిరమైనదగుగాక; యని అర్థము. ఆకాశమనగా గర్భాలయావకాశము, వితిమిరమనగా చీకటిని కోల్పోయినదగుగాక, యని బావము. గర్భాలయ ద్వారము తెరచినపిమ్మట స్వర్ణసదృశమైన గర్భాలయావ కాశమందు దివ్యమంగళవిగ్రహరూపియైన దేవదేవుని దర్శింపగలుగుచున్నారము. దేవదేవుని సందర్శనము సమస్త పాపవినిర్మోచకమైనది.

(శ్లో) ఆహరేకం హరెర్బింబమాపాదమవలోకయేత్। పాత కాన్యాశు నశ్యంతి కింపునస్తూపపాతక, మితి ఖల్వార్యోక్తిః; రోజుకొకమారైనను దివ్యమంగళవిగ్రహరూపియైన సర్వేశ్వరు నాపాదమస్తకము తిలకించినచో బ్రహ్మహత్యాది మహాపాతకములు సైతము తొలగిపోవును. పాపవినిర్ముక్తు డైన జీవి దివ్యలోకప్రాప్తి కర్హుడగుచున్నాడు. దివ్యలోక ప్రాప్తికర్తములైన శరీరములుగలమాకు అంతరిక్ష మందలి దేవయోనిసంజాతులైన నాట్యకళావిశారదులగు నప్సరస్త్రీగణంబులను గానకళావిశారదులైన కిన్నరగంధ ర్వాదిగణంబులను మేము చూడగలుగునట్లు భగవాను డనుగ్రహించుగాక; యని భావము

ప్రబోధనవాద్యాదిభిః ప్రయోధ్యమానే భగవతి, ద్వారదేవై రనుజ్ఞాతో దక్షిణేన పదాస్తః ప్రవిశ్య అతోదేవాదినా దేవస్య ముఖం సమవీక్ష్యప్రణమ్య; మేల్కొలుపులతోను మృదంగమురజపణవానకగోముఖాది వాద్య విశేష ములతోను, దేవదేవుని మేల్కొలిపినపిమ్మట ద్వారదే వాఖ్యనుజ్ఞతో పూజకుడు గర్భాలయప్రవేశము చేయవలెను. గర్భాలయ ప్రవేశకాలమందు ముందుగా, కుడికాలు పెట్టవలెననుట సత్సంప్రదాయము. ద్వారదేవతలనగా,

(శ్లో) భువంగశ్చ పతంగశ్చ పతిరో వరణస్తథా। ఏతే ద్వారాధిపాస్స్యుః తాననుజ్ఞాప్య సువ్రజేత్॥ భువంగుడు, పతంగుడు, పతిరుడు, వరణుడునను నల్వురు ద్వార శాఖలకధిదేవతలు; ఇందు ద్వారస్య దక్షిణే భాగే భువంగం బోధయేద్బుధః। భువంగశ్చాప్యకాలేతు పాదాభ్యాంసం ప్రసారితః॥ కుంచితస్త్వర్చనాకాలే దేవేశస్య విశేషతః। అర్చాకాలావసానేతు ఆసీనస్స్వపితి ప్రభుః॥ ద్వారబంధ ముసకధిదేవతయైన భువంగుడు ద్వారదక్షిణభాగమందు శిరస్సునుంచి కాలు చాచిద్వారబంధమునకడ్డముగా అర్చ నాకాలవ్యతిరిక్తకాలమందు పరుండియుండును కనుక అతనిని మేల్కొలిపి ఆతనియనుజ్ఞతో లోన ప్రవేశించ పలెననియర్థము; ద్వారదేవాఖ్యనుజ్ఞతోనభ్యంతరప్రవిష్టు డైనపూజకుడు అతోదేవాది, షణ్మంత్రములబఠించుచు దివ్యచిన్మయశరీరియైన పరాత్పరుని పాదములనుండి శిరః పర్యంతము భక్తి భావముతోచూచి నమస్కరించవలెను; ప్రణమ్య-అనగా ప్రకర్షేణ నమనము (మిక్కిలి లొంగుబాటు చెందియని బావము.

(శ్లో) భగవాన్మేపరో నిత్యమహం ప్రత్యవరస్సదా। ఇతి బావో నమః ప్రోక్తః నమనః కారణం హినః॥ షడ్గుణైశ్వర్య సంపన్నుండైన సర్వేశ్వరుడు నాకన్న గొప్పవాడను బావ ముతో జీవి తత్పాదపంకేరుహములందు మ్రోలుట ప్రణామమనబడుచున్నది. ఈ నమనము వాఙ్మనఃకాయ కృతమైనచో పరిపూర్ణమైనదగుచున్నది. పరిపూర్ణనమ స్కృతితో శరణాగతుడైన జీవిని భక్తవత్సలుడైన భగ వానుడు భక్తానుకంపాజనితవాత్సల్యాతిరేకముతో గబీర సంసారసాగరమునుండి దరిచేర్చి శాశ్వత దివ్యలోక మును ప్రసాదించుచున్నాడు. ప్రకృతిరూపిణియైన శ్రీ మహాలక్ష్మి యాతనావిశేషంబులనుభవించుచున్నజీవులం జూచి, జాలినొంది ఏకాంతమందు శ్రీ మహావిష్ణువు నిట్లడి గెను. ''స్వామి! ఈ యాతనావిశేషంబులననుభవించు చున్న జీవులెట్లుతరింతురు; వీరలకెనాటకైన శాశ్వతదివ్య లోకము లభించునా? ''యనిప్రశ్నించగా భగవానుడిట్లు సమాధానము చెప్పెను.

(శ్లో) మత్పదద్వం ద్వమేవైకం ప్రపద్యంతే పరాయణం। ఉద్ధరిష్యామ్యహం దేవి సంసారాత్స్వయమేవతాన్॥ నాపద పంకేరుహములనేనెరనమ్మికొల్చినవారలను సంసరణ మంది యాతనావిశేషంబులను అనుభవింపకుండునట్లను గ్రహించి రక్షించెదను.

మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే॥ ఏజీవులు నన్నుగూర్చి నమస్కరింతురో వారే వైష్ణవమాయ నతితరించగల రని స్వపదభక్తుడైన పాండవమధ్యమునకు భగవానుడు చెప్పియుండెనుగదా!

(మం) అతో దేవా అవంతు నో యతో విష్ణుర్విచక్రమే। పృథివ్యాస్సప్తధామభిః॥ అతః, దేవాః, అవంతు, నః, యతః, విష్ణుః, విచక్రమే, పృథివ్యాః, సప్తధామభిః, విష్ణుః-విశ్వ వ్యాపనశీలః పరమేశ్వరః, సప్తధామభిః - గాయత్ర్యుష్ణిగ నుష్టుబ్బృహతీ పంక్తిత్రిష్టుబ్జగతీభిస్సప్తభిశ్ఛందోభిస్సాధన భూతైః, యతః 'పృథివ్యాః = యస్మాద్భూప్రదేశాత్, విచ క్రమే - త్రివిధపాదక్రమణం కృతవాన్, అతః = అస్మాద్భూ

ప్రదేశాత్, నః = అస్మాన్, దేవాః, అవంతు-రక్షంతు; త్రివిక్రమావతారియైన శ్రీ మహావిష్ణువు మూడడుగులతో ఏలోకత్రయము నాక్రమించుటకు పరాక్రమించెనో అభూభాగమందున్న మమ్ములను దేవతలు రక్షించెదరుగాక.

(మం) ఇదం విష్ణుర్విచక్రమే త్రేధా నిదధే పదమ్। సమూఢమస్యపాగ్ంసురే॥ ఇదం, విష్ణుః, విచక్రమే, త్రేధా, నిదధే, పదమ్, సమూఢమ్, అస్య, పాంసురే; విష్ణుస్త్రివిక్రమావతారీ, ఇదం = ప్రతీయమానం జగదుద్దిశ్య, విచక్రమే = విశేషేణ క్రమణం కృతవాన్, తదా త్రిభిః ప్రకారైః పదమ్ = స్వకీయం పాదం నిదధే = ప్రక్షిప్తవాన్; అస్య విష్ణోః పాంసురే - ధూళియుక్తే పాదస్థానే, జగత్సర్వమ్ సమూఢమ్ = సమ్యగంతర్భూతమభూత్.

త్రివిక్రమావతారియైన శ్రీమహావిష్ణువు పరిదృశ్యమానమగుచున్న జగత్తునుమూడడుగులతోనాక్రమించు సమయమందు చెలరేగిన ధూళిచే కప్పబడిన ఈ జగత్తునుండి దేవతలు మమ్ము రక్షించెదరుగాక.

(మం) త్రీణి పదా విచక్రమే విష్ణుర్గోపా అదాభ్యః। తతో ధర్మాణి ధారయన్॥ త్రీణి, పదా, విచక్రమే, విష్ణుః, గోపాః, అదాభ్యః, తతః, ధర్మాణి, ధారయన్; గోపాః = సర్వస్యజగతో రక్షకః, అదాభ్యః = కేనాప్యతిరస్కార్యో విష్ణుః, తతః = తస్మాత్పాదత్రయాత్, ధర్మాణి = ధారయితవ్యాని సర్వాణి వస్తూని ధారయన్ = సంరక్షయన్, కృత్స్నేఽపిజగతి త్రీణి పదా విచక్రమే = పదత్రయం నిహితవానిత్యర్థః.

విశ్వవ్యాపనశీలుడై సకల జగద్రక్షకత్వము వహించిన శ్రీ మహావిష్ణువు తానుంచదలచిన పాదత్రయ స్థానములనుండి రక్షణీయమైన సకలవస్తునిచయమును స్వయముగా రక్షించుచు పాదప్రక్షేపణము చేసినవాడాయెను. ఇట్టి కరుణాసింధువైన సమ్మహనీయునకు నమస్కారమని భావము.

(మం) విష్ణోః కర్మాణి పశ్యత యతో వ్రతాని పస్పశే। ఇంద్రస్య యుజ్యస్సఖా॥ విష్ణోః, కర్మాణి, పశ్యత, యతః, వ్రతాని, పస్పశే, ఇంద్రస్య, యుజ్యః, సఖా; హేజనాః విష్ణోః కర్మాణి = సృష్టిస్థితిసంహారచరితాని; పశ్యత, యతః = యైః కర్మభిః వ్రతాని = భవదీయ లౌకిక వైదిక కర్మాణి పస్పశే = స్పృష్టవాన్; సవిష్ణుః ఇంద్రస్య యుజ్యో యోగ్యస్సఖా; అత ఏవబలిమాచ్ఛిద్య లోకత్రయైశ్వర్యమింద్రాయదత్తవాన్; తాదృక్పరాక్రమవంతం స్వపదభక్తత్రాణ తత్పరం విష్ణుం నమస్కుర్మహే॥ ఓజనులారా! ఏమహావిష్ణువు సృష్టిస్థితిలయములకైకనాయకుడై తన ప్రభావములచే మనబోంట్ల లౌకిక వైదిక వ్యాపారములను నడుపుచున్నాడో యట్టి విష్ణుదేవుడు స్వపదభక్తుడైన దేవేంద్రునకు త్రైలోక్యాధిపత్యమును తన పరాక్రమముచే నమకూర్చెను. భక్తత్రాణ తత్పరుండైన శ్రీమహావిష్ణువునకు ప్రణమిల్లినచో నీప్సితార్థముల నొందెదరుగాన ప్రణమిల్లుడని భావము.

(మం) తద్విష్ణోఃపరమం పదగ్ం సదా పశ్యంతి సూరయః। దివీవ చక్షురాతతమ్॥ తత్, విష్ణోః, పరమం, పదమ్, సదా, పశ్యంతి, సూరయః, దివి, ఇవ చక్షుః, ఆతతమ్, సూరయః జ్ఞానినః, విష్ణోస్తత్పరమం పదమ్, దివి నిరావరణే అంతరిక్షే, ఆతతమ్ చక్షురివ, సదా పశ్యంతి; వేదాంతమోక్షైకచింతనులైన జ్ఞానులు, విష్ణుమూర్తియొక్క పరత్వరూపమునుగాని విష్ణుదేవునకావాసస్థానమైన వైకుంఠలోకమునుగాని ప్రావరణరహితమైన యాకసమందలి దృశ్యములను మాంసచక్షువుచూడగలిగినట్లుచూడగలుగుచున్నారు. అట్లు జ్ఞానులు మాత్రమే చూడగలిగిన పరస్వరూపియగు నాపరమాత్మ భక్తవాత్సల్యముచేనర్చావతారియై దివ్యమంగళవిగ్రహరూపిగా మాంసచక్షుర్గోచరుడగుచున్నాడు; గానమీరందరు చూచితరించెదరుగాకయని భావము.

(మం) తద్విప్రాసోవిపన్యవో జాగృవాంసస్సమింధతే విష్ణోర్యత్పరమంపదమ్॥ తత్, విప్రాసః, విపన్యవః, జాగృవాంసః, సమింధతే, విష్ణోః, యత్, పరమం, పదమ్; విష్ణోర్యత్పరమంపదమస్తి తత్పదం, విపన్యవః = స్తోతారః, జాగృవాంసః జాగరూకాః-విప్రాసః, మేధావినః-సమింధతే, సమ్యగ్దీపయంతి జ్ఞానచక్షుషా స్వేషాం జ్ఞానచక్షువుచే ప్రకాశింపజేయుచున్నారు. అనగాతమ జ్ఞాననేత్రముతో చూడగలుగుచున్నారని భావము; జ్ఞానమనుతేమహనీయుని సందర్శనార్థము యోగనిష్ఠులగుచుందురోనమ్మహనీయమూర్తి భక్తానుకంపచే నర్చావతారియై సకలచేతనోద్ధరణము కొరకు వేచియుండ నాదివ్యచిన్మయసుందరాకారుని సందర్శింపకుందురే! యను భావముకూడ ద్యోతకమగుచున్నది.

(సశేషము)

# హేమచూడోపాఖ్యానము

మునుపు మన్మథాధికసుందరుఁడైన రాజకుమారుఁ డొకఁడుండెను. సర్వమనోహరసురూపిణియగు నొక యువతిని జిని యా రాజకుమారు డామెయందత్యంతమనురక్తుఁడై యుండెను. రాజకుమారా! ఆమెకు వేఱొకనియందు అనగా—తన భృత్యునియందు మనస్సు మిక్కిలి యాసక్తి యుండినది. ఆభృత్యుఁడా రాజకుమారుని యుక్తిచే వంచించెను; అతనికి గైకొనుటకు ఆభృత్యుఁడు మద్యమును అతిమాత్రముగా నతనికిచ్చి యంత మదాంధుఁడైన యతనికడకుఁ గురూపిణియగు నొకచేటిని బంపి తానాతని పత్నిని సర్వలోకైకసుందరిని ఒక్కఁడే చాలసేపు యనుభవించుచుండెను. అట్టి మదాంధుఁడా రాజకుమారుఁడు నిత్యము చేటిని గూడుచు తన్నుగూర్చి "నేను ధన్యుఁడను! ఇట్టి లోకసుందరిని ప్రాణప్రేయసిని నిత్యము నేననుభవింతును! ఎవ్వను నాకు సాటిలేఁడు!" అని యనుకొనుచుండెను.

ఇట్లు చిరకాలము జరుగఁగా నొకప్పుడు దైవయోగమున నా భృత్యుఁడు పానకార్యమునందుఁ దక వేఱొక ముఖ్యకార్యమున మఱియొకచోటికి జనెను. అంత రాజకుమారుఁడు ఆ పానమును చాలమిక్కిలిగాఁ ద్రాగలేఁడు. రతియందు ఉత్సుక మానసముతో నా కారణమున శీఘ్రముగా సర్వభోగసంయుతము, మనఃకాంతమునగు శయనీయమునకు నందనోద్యాన సంస్థితమగు శచీగృహమునకు దేవపతి వలె చనెను. అంత మహార్హపర్యంకగతయై యున్న యా చేటి దగ్గరజేరి కామవేగమున నొడలుదెలియక వివశుఁడై అత్యంత హర్షముతో దానితో భోగించి రత్యంతమున జూడగా నది వికృతాకృతిగల చేటియని దెలిసినది. సందేహపడి యమర్షముతో 'ఏమిది!' యని యాలోచించుచు "ఎక్కడ యది, నాప్రియతమ? యని యిట్లా చేటినే యడిగెను. అతఁడిట్లడుగగా నాచేటి యతనికి మత్తులేకుండుట గని భయపడి వణకుచు నప్పుడతనికి కొంచెమైనను బదులు చెప్పకపోయెను. అంత నీవిషయమతను తనకైన వంచనమునుగాజూచి క్రోధముచే నెఱ్ఱచూపులు కలవాఁడై ఆరాజనందనుఁడు ఎడమచేత నాచేటి జుట్టుపట్టుకొని కుడిచేత కృపాణమును గైకొని దానిని బెదరించుచు దానితో నిట్లనెను, "ఉన్నదున్నట్లు చెప్పుము! చెప్పవా! లేదా! నీవు క్షణమాత్రమును జీవితధారణమును ధరించలేవు!" ఇట్లాతని యామాటలను విని యామె భయపడి ప్రాణమందలి తీపి యానచేత యథావత్తుగా ఆ సత్యమును చిరకాలము జరుగుచున్న యతనిప్రియురాలి యుప్వృత్తమును చెప్పెను; భృత్యునితో బాగుగగూడియున్న యాతని భార్యను ఆతనికా చేటి చూపించినది. దగ్గఱనే ఒకచోట భూమియందు భృత్యుఁడు—నల్లనివాఁడు, పింగళనేత్రముల వాఁడు, పొడుగువాఁడు, అన్ని యంగములు మలినములుగ నున్నవాఁడు, ఎలుగు మూతివాఁడు, అసహ్యుఁడు; అట్టివానిని ప్రేమభావముచే సర్వాంగములతోఁగౌగలించుకొని తన మృదుబాహులతలాతని కంఠమును జుట్టుకొని యుండఁగా వాని ముఖమునందు తనవక్త్రకమలమునుంచి రతశ్రాంతయై గాఢముగ తన కాళ్లను వాని యూరుయుగ్మమును చెనవైచి వాఁడు తన నిండు వలుదగుబ్బలను గట్టిగా బట్టకొనియుండగా కుసుమకోరకములావరించిన వాసంతి కాలతవలె రాహువుతో గూడియున్న రోహిణినివలె నిద్రచే స్మృతిపోయిన యిట్టివానినిజూచి ఆ రాజకుమారుఁడు క్షణము అత్యంతము భ్రమసిపోయి వెనుక ధైర్యమును దెచ్చుకొనెను ఆతఁడేమనినది నేను చెప్పెదను; వినుము.

"ఛీ! ఛీ! నేననార్యుఁడను. మిక్కిలి మూఢుఁడను. మదవిమోహితుఁడను. స్త్రీలయందవిసంప్రీతులు వారెల్ల ఛీ! ఛీ! కామినులేయొక్కని సొత్తునుగారు. శారికలు మంచి వృక్షమునకెట్లో యట్లే! దున్నపోతు గున్నవంటి మొద్దును; నన్నుగుఱించి నేనే మనుకొందును! సుచిరకాలమునుండి ఇది నా ప్రాణములకన్న ప్రియతమ యనుకొంటినే? స్త్రీ వరివారునుగారు. విటునికి వేశ్యలవంటివారు. ఎవనిమనస్సు స్త్రీలను విశ్వసించియుండునో వాఁడు అడవిగాడిదయే. శరత్కాలాభ్రమునకు స్థితి క్షణికము, ఒకచోటను నిలుకడ లేదు. అంతకంటెను స్త్రీలస్థితి యత్యంతచంచలము, పేలవము అహో! నేనింతవరకు స్త్రీస్వభావమిట్టిదని యెఱుగనైతినిగదా! నేను సర్వాత్మనా నిండు మనస్సుతో దీనియందాసక్తి వహించియుంటిని; ఇది నన్నువదలి భృత్యుననువర్తించినది. అన్యాసక్తయై గూఢభావముతో నాయందనురాగమున్నట్లు వేషమువేసి విటమండలమున నటివలె తన భక్తిని ప్రదర్శించుచుండిన దీనిని లేశమైనను మద్యపాన మత్తుఁడనై నేనెఱుంగక పోయితిని. ఛాయవలె నాతోనే యున్నదని నమ్మియుంటిని. చూడఁదగని చేటి యయ్యెను! దానిని చిరకాలము వంచితుఁడనై కూడుచుంటిని. నిజము! నిజము! నాకంటె మూఢుఁడీజగతీతలమున నెవఁడుండును? ఇట్టి నమ్మకము నిండుగ గల్గి యిట్లు దీనిచే చిరకాలము వంచితుఁడనైతిని, ఆహా! ఈ

భృత్యహతకుడు సర్వాంగవికారాకృతి. వీనియందు సర్వతోఽధిక సౌందర్యము నిది యేమి చూచినది? నేను అన్నివిధముల అనురక్తుడను. నా సౌందర్యమున లోకుల చూపుల నపహరించినవాడను. నన్ను వదలి వీనిని వగుల్కొన్నది."

అపుడిట్లనేక విధములఁ బ్రలపించి యతి నిర్విణ్ణుడై సర్వసంగ వివర్జనము చేసి రాజపుత్రుడు వనమునకు బోయెను. కావున రాజకుమారా! ఈ సౌందర్యము మనస్సున బుట్టినది. నీవెట్లు మహోత్సవపూర్వకముగా నత్యంత సుందరినైన నాయందు బ్రీతి పొందుచున్నావో అట్లే అంత కంటె నెక్కువనో వికృతాకృతులైనస్త్రీలయందు జనులుఁ బ్రీతిఁబొందుచున్నారు. ఇందు నీకు నమ్మకముసకై గుర్తుచెప్పెదను; వినుము. "ప్రియుడా, ఏకాగ్ర చిత్తముతో ఏస్త్రీచూడబడుచున్నదో అది బయట చక్కగానున్నది. దాని ప్రతిబింబాకారము రూపముగానొకతె సంకల్పరూపిణి చిత్తము నాశ్రయించియున్నది. ఆమె సౌష్ఠవమును మనస్సుచే మాటిమాటికినుల్లేఖించుచు దానియందు వాంఛను బొందుచున్నారు. ఇంద్రియముకలఁగినవాడు సర్వతః దానియందు బ్రీతిని బొందుచున్నాడు. ఇంద్రియము క్షోభపడవేని సుందరియందును బ్రీతియుండదు. ఆ సౌష్ఠవమునకు మూలము మాటి మాటికుల్లేఖనము; కావుననే బాలురయందు యోగులయందును క్షోభము కనబడుటలేదు. ఎవడెవడు దేనిదేనియందు బ్రీతి బొందునో, సుందరిగానీ, యితరయేగానీ అక్కడ మానవుడు సౌందర్యమును ఉల్లేఖించును. అత్యంతబీభత్సాకార విగ్రహులైన స్త్రీలు కనవచ్చుచున్నారు. ప్రీతివిరూపఅనుల్లేఖనమో సౌష్ఠవోల్లేఖనమో అగునేని నరులకు వారియందును ఎట్లు ప్రీతి జనించుచున్నది? చెప్పవలసినదేమున్నది? అహో! మనస్సు ఎగురగొట్టబడిన నరులకు కాముకులకు జఘన్యాంగమునందును సౌందర్యము ప్రకాశించుచున్నది. మలమూత్రములు దడియునంగమున సౌందర్యమును గాంచుమేని మనకు సౌందర్యమెక్కడ గానరాదో నాకుఁ జెప్పుము. కావున నీ సౌందర్యము — రాజపుత్రా! చూడుము. అభిమానము లేకున్ననెటను ఈషత్సుఖహేతువును గాజాలదు. తేనేయందు తీపివలె సౌందర్యము సహజమగునేని అది బాలురలో బిడ్డలలో మనకు బ్రకాశింపదేకారణమునసో? చెప్పుము; వివిధదేశములందు వివిధాకారులు నరులు కానవచ్చుచున్నారు. ఒక్క పాదము, ఒక్కకన్నువారు, వ్రేలాడు చెవులవారు, గుజ్జుపుమూతివారు, దొప్పచెవులవారు, మొకమునసోరు - అందుండి వెలికి వచ్చుకోఱలవారు, ముక్కిడులు, పెద్దముక్కులవారు, దేహమును రోమములు గప్పినవారు, రోమములేలేనివారు, పింగకేశులు, తెల్లజుట్టువారు, బట్టతలవారు బిరుసు వెంద్రుకలవారు, బొల్లిదేహమువారు, కాకిరంగువారు, పింగళాంగులు, లోహితాంగులు; ఇట్లు బహువిధముల జనులును వారిసజాతిస్త్రీలయందు వారు ప్రతిని పొందుచున్నారు. నీవలెనే - రాజపుత్ర!—చూడుము. సుఖసాధనభూతవస్తువులలో పురుషులకు స్త్రీలతనువు ముఖ్యము, సర్వప్రియము, అత్యంతసుందరము. యథాస్థితముగాఁ జక్కని బుద్ధితో - రాజపుత్ర!—ఆలోచింపుము. మాంసలిప్తము, రక్తక్లిన్నము, సిరాబద్ధము, త్వగాతతమును, అస్థి పంజరము దానిని రోమములు కప్పియున్నవి. పిత్తకఫాహితమును, మలమూత్ర కుహూలము. అదియు శుక్రశోణితసంభవము మూత్రద్వారమునుండి బయటకు వచ్చునది. ఇక్కడ నయ్యో! ప్రియమని యిష్టపడుచున్నారు. ఇట్లతిబీభత్సమైన దీనియందేనరులు రతిని పెట్టుకొనుచున్నారో వారికిని విష్ఠక్రిమునకును అంతరమేమి? నాకు చెప్పుము; రాజపుత్ర! ఈతనువు నీకు మిక్కిలి ప్రియముగదా! ధాతువులు వేఱువేఱుగానున్నట్లు భావింపుము. అట్లే అన్యత్ర ఉపయుక్తమగు మధురాహ్లాది పదార్థముల పరిణామస్వభావమును సూక్ష్మదృష్టితోనాలోచింపుము. భక్షితమైన సర్వమునకును బరిణామమున విడ్భావమే; సర్వథా యిందు సందేహములేదు. అందఱకిని దెలిసియేయున్నది. చెప్పుము; లోకమిట్లుండగా, ఏది ప్రియము? ఏది యప్రియము?" ఇట్లుచెప్పగా హేమచూడుడు ఆ యపూర్వవాక్యజాలములనువిని విస్మితుడై విషయములందు రసములేదని తెలిసికొనెను - హేమలేఖ చెప్పిన ఆయుపదేశమునే మరల మరల బాగుగ విచారించి వైరాగ్యమును పొందెను.

విషయములు రసహీనములని యెరింగి వానియందు నిర్వేదముకలుగుటచే విమనస్కుడై వానిననుభవింపను లేదు; చిరకాలమునుండియున్న విషయవాసనకువశంవదుడై విడువనులేదు. అత్యంతము లజ్జాన్వితుడై యీ తనస్థితిని ప్రియురాలికి చెప్పనులేదు. విషయభోగములు ప్రాప్తించునపుడెల్ల ప్రియురాలు చెప్పినదానినే స్మరించుచునే తన్ను గర్హించుకొనుచు నీవాసనావేగముననను భవించుచుండెను. అతని హృదయము శోకసంవిగ్నమై అతనిచిత్తము డోలాయమానమై అతనికి భోజ్యమూ, వస్త్రము, భూషణము, స్త్రీ, వాహనము, మిత్రులు, సుహృదులు, ఎవ్వరును, యేదియుకూడ అతనికి సుఖమును కలుగజేయలేక పోయెను. అన్నియు ఒక్కపెట్టున మునిగి పోయినట్లుండెను. త్యజింపనుగాని, అనుభవింపనుగాని శక్తుడుగాక అతడు సర్వథా శోకించుటచేత అతని ముఖము కన్నులు వన్నెతప్పినవి (సశేషము)

# విష్ణుతిలకము

## (పాంచరాత్రాగమము)

వేదాల తిరువేంగళాచార్యులు

భగవానుడగు శ్రీమన్నారాయణునర్చించుటకుపాయము శ్రీపాంచరాత్రాగమము. వేదవేద్యుడగు భగవాను నర్చించుటకు వైదికములగు నాగమములే ప్రశస్తములుకదా! ఇతరవిధములగు విధానములకన్న శ్రీపాంచరాత్రాగమ విధానము సామ్ప్రదాయికమైనది; భగవదర్చనము పరమవైదికులగు శ్రీ విశిష్టాద్వైతులకు నిత్యానుష్ఠేయము. శ్రీ విశిష్టాద్వైతప్రవర్తకపరమాచార్యులగు భగవద్యామునమునులు ఆగమప్రామాణ్యమునందును భగవద్రామానుజులు బ్రహ్మసూత్రభాష్యమునందును శ్రీ రామానుజసిద్ధాన్తవిజయధ్వజమగు శ్రీ వేదాన్తదేశికులు పాంచరాత్రరక్షయందును ప్రబలములగు సకలవిపక్షపూర్వపక్షములను నిరసించి నిష్కంపముగా పాంచరాత్రాగమమును ప్రమాణమని సిద్ధాంతీకరించిరి. ఆ పాంచరాత్రాగమము సార్ధకోటిప్రమాణము. అందనేక సంహితలున్నవి: వానిలో "ఖగేశ్వరసంహిత" యొకటి. దీనిలోని యీ "శ్రీవిష్ణుతిలకము"ను ప్రమాణమూర్ధన్యముగా వైదికశిష్టులు తలంతురు. ఇందు భగవదర్చనా విధానము తెల్పబడినది. దేవాలయములలోని అర్చనావిధానమును సంస్కరింప ప్రయత్నించు నీ యవసరమున నీ గ్రంథప్రచురణావశ్యకత అపరిహార్యము. ఇది సరళముగా మనవారందరికిని తెలిసినచో పరిశుద్ధమగు భగదర్చనమేర్పడును. అది సకలవిధములగు నిహపరశ్రేయస్సులకును పరమోపాయముకదా! అది కారణముగా మొదట శ్రీ విష్ణుతిలకము తెలుగున జెప్పబడినది.

బృహస్పతి, ఇంద్రుడు, వ్యాసుడు, గౌతముడు, విశ్వామిత్రుడు, వసిష్ఠుడు, కణ్వుడు, చ్యవనుడు, శాండిల్యుడు, పరశురాముడు, భారద్వాజుడు, అత్రి, జాబాలి, భరతుడు, అగస్త్యుడు, శౌనకుడు, ఇంకను ఇతర ఋషులు అందరును దేవతలందరితోగూడ లోకకర్తయగు బ్రహ్మనుకద లడుగ నారంభించిరి.

"ఎల్ల దేవతలకును ప్రభువగునో బ్రహ్మదేవుడా! దేహధారులనందరిని నీవే సృజించితివి. నీకు గనబడనిదికాని, అట్లుండవగినదికాని లేదు. నీవు చదువనివేదియు లేదు. ఆ పరబ్రహ్మముకూడ నీవారాధింపనిదికాదు. నీవన్నియు నెరుంగుదువు. శ్రీమన్నారాయణునినాభిజాతుడవైన నీవే మాసంశయముల నన్నింటిని చెట్లను నరికినట్లు నరుకగలవు. మరెవ్వరును చేయలేరు కనుక బృహస్పతి మొదలుకొని మేమందరమును నీవేదిక్కని చేరితిమి,"

ఈ తీరున దేవేంద్రుని మున్నిడుకొని విప్రులందరును ఇట్లు ప్రార్థింపుచుండగా జాలికల్గి చిరునగవుతోడి మొగము గమలముననుకరింపగా బ్రహ్మదేవు డిట్లనెను.

"మీరందరును వేదముల నన్నింటి నెరింగి భగవంతుని ధ్యానముననాసక్తి గలిగియుందురు. దేవతలందరనుకూడమీరుతపసుచే ననకృత్తుగా నారాధించితిరి. లోకముల నన్నింటిని మీరు జయించితిరి. ఇందు నందియమేమియులేదు. ఇట్టి చరిత్రముగల తాపసులందరునిటకేల జనుదెంచితిరి."

బ్రహ్మదేవు డిట్లడుగుచుండగా దేవరాజగు నింద్రుడు ప్రేరేపింపగా బృహస్పతి దోసిలొగ్గి సందియము లడుగుటకు మొదలిడెను.

"స్వామీ! వేదములను సాంగముగా నధ్యయన మొనర్చితిమి; సందేహములేదు. కాని వానియందు నిష్ఠ కుదురక నీవేశరణని వచ్చితిమి. ఈ జగమును నిర్మించుట కెవని నెవరు నియమించిరి? ఈ జగమెచటనుండి వచ్చినది? ఇది యిట రాకమున్నెట నుండెను? ఇది యిట నుండి ఎటకు బోవును? ఇదియెవ్వని యధీనమున నున్నది? ఎల్లపుడును అతడొక్కని యధీనముననే యుండునా? అని మాకు చాల గొప్పసంశయము."

ఇట్లన్న బృహస్పతి మాటలను విని భగవానుడగు బ్రహ్మదేవుడు తన ప్రక్కనున్న రుద్రునిజూచి ప్రసన్నుడగుచు నీమాటనెను.

"నిరంతరము తపసు నొనరించుచున్న మీరందరును ధర్మ్యమైన నిశ్రేయసమునందాసగలిగి అన్నింటికన్నను గొప్ప రహస్యమును సభయందు వినదలచి యున్నారా?" బ్రహ్మమాటను విని సకల లోకములకును సుఖమొనర్చు భగవానుడగు రుద్రుడు బృహస్పతి తెలిపినదానినే తానును అనువదించెను.

కరుణా వరుణాలయుడగు బ్రహ్మభగవానుడు ఆమాట నామోదించి తత్త్వమును ఋషులకు దెల్పుటకు చక్కగా మొదలిడెను.

మీరంపరిష్వడిగినవానిని శ్రద్ధతో వినుడు. "పరబ్రహ్మమునందు ఈ జగమంతయు నుండెను. దీనిని నతడు సృజించెను; అతడే విశ్వమునంతను కాపాడుచున్నాడు. తిరిగి అతనియందే ఈజగము లీనమగును. కావున నతని యందాధారపడియున్న యీ చరాచరాత్మకమగు జగము అంతయు అరాజకముగాలేదు. అతడు లేనిచో నీజగము నడువనేజాలదు. కావున మనకంవరకును ఆ పరబ్రహ్మమే గొప్పరక్షకము." బ్రహ్మచెప్పిన యీమాట నువిని దేవతలు బ్రహ్మదేవుని బృచ్ఛసేయుమని గౌతముని బ్రేరేపించిరి, అతనికి మనసులో నడుగవలెనను కోరిక బ్రేరేచెను. అప్పుడిట్లనెను.

"అయ్యా! బ్రహ్మమననేమి? దాని సత్వవిడియేమి? అది యెటనున్నది? దేనివలన నదికలిగినది? అది ప్రపంచమునేలమోయును? అది యెట లయ మొందును."

ఈ గౌతముని మాటను చతురాననుడు రుద్రునితోకూడ విని గౌతముడు మొదలగు ఋషిపుంగవులతో మాటాడుట కుపక్రమించెను.

"ఈ సమస్తమును ఏమియు మిగులకుండ వ్యాపించి యుండునదేదియో అదియే బ్రహ్మమని తెలియుడు. దాని నతిక్రమంచి యేదియు నుండదు. ఆ బ్రహ్మమునకు పుట్టుకగాని చావుగాని ఎన్నడును లేదు. అదియొకయెడ నుండుటగాని, మరియొకయెడ లేకపోవుటగాని యెన్నడును సంభవింపదు. అతడు లేనిదే చరాచరములతోడి యీ జగమంతయు నొకపుడుగూడ నడువదు. ఆ పరబ్రహ్మమే జగమునెల్లప్పుడును భరించును. ఈ జగమంతయు నా పరబ్రహ్మమునందే యుండి అతని యిష్టము చొప్పున అతనినుండ బయల్వెడలి బాగుగా వికసించి తిరిగి ముడుచుకొనిపోవును. అతనియందే విశ్వమంతయు లయమొందును. తిరిగి అతనినుండియే దీని రాక. సంకోచము వికాసములుమాత్రమే కాని ఈ జగమునకుగూడ నాశము లేదు."

ఈ మాటను విని మహాముని భారద్వాజుడు అంజలి సంధించి కమలాసను నిట్లడిగెను: "మనకు జీవిపుట్టుట ప్రత్యక్షముగానున్నది. కొంతకాలము వెలయుటయు నగుపడుచునేయుండును. తరువాత మరణమొంది యీ లోకమున నది కనబడకపోవుటయును మన కనులారా గాంచుచున్నాము. ఈ లోకమున జంతువులు మాకీ తీరుననే యగుపడుచున్నవి. అంతేకాక తపస్వులగు మహానుభావులును ఇదే యథార్థమని తెల్పుచున్నారు. పుట్టిన, గిట్టుట తప్పనిసరి. ఇందులో సంశయమే లేదు. కావుననే క్షణభంగురమగు నీశరీరమును నమ్ముకొని యుండక ధర్మమును ఆరించుటకు తపఃక ప్రయతింపవలెను. ఈజగమంతయు అనిత్యమే ప్రళయకాలమున నాశనమొందును. కనుక ముక్తి నభిలషింపవలెను. అందుకై వివేకరూపుడైన పరమేశ్వరుని ధ్యానింపవలెను ఆ పరబ్రహ్మయొక్క ఆనందమును అభ్యసించి బ్రహ్మత్వమునొందవలెను. ఇది యేనా, విషయము?"

అది విని లోకపితామహుడగు విధాత యిట్లనెను. "జగమునకు నాశములేదు; నిజము. జీవునితోడి సంబంధము వలన నది నశింపదు. ఈ పంచభూతములును కలిసి యొక విచిత్రమగు పాకమొందుటవలననే దేహము ప్రాణికి ఏర్పడును. కాలక్రమమున నది వృద్ధినొందును. జీవుడు విడిచినతోడనే యీదేహము ప్రాణములేక పడిపోవును. అప్పుడు అగ్నిలో అగ్నియు, జలములో జలమును, వాయువులో వాయువును, భూమియందు భూమియు, నాకాశమం దాకాశమును గలసిపోవును. చనిపోయిన కట్టె మట్టి కాబోవును జనులకంబడును, జీవుడింకొక దేహముచేరి వెనుకటివలె ప్రాణియగును."

"ఓ మునీశ్వరులారా! లోకపుసృష్టికి తోవయిదే. పిపీలిక మొదలుకొని జంగమములు స్థావరములునగు సకలప్రాణులకును శరీరము మారునేకాని ఆత్మకు మార్పులేదు. భూతములుకూడ నశింపవు; నిజమిది. నేను మీకు నిజమే చెప్పుచున్నాను."

ఈ బ్రహ్మమాట విని కుతూహలముగల్గి మహేంద్రుడిట్లడుగ దొడగెను.

"భగవానుడా! లోకములన్నింటికి ప్రభువా! ప్రాణులందరికిని మూలము నీవు - మాకీసంశయముల దొలగించుటకు నీవుదప్ప వేరెవ్వరును కనుపడరు. ప్రాణి పుట్టునపుడు కొద్దిదేహముతో పుట్టును. తరువాత పెద్ద శరీరముతో నుండును. కారణమేమీ తెలియదు. మాకీసంశయము దొలగింపుము. పంచభూతములు కలియునపుడు జీవునకు కూడ వానితో కలయికయున్నచో శరీరమునకు ప్రాణముండి అనేక చేష్టలుండవలెను, ఇట్లు చేష్టలుదయించిన శరీరమునందు ఈ యైదుభూతములకు సంబంధించిన అగ్ని పార్థివశరీరమును దహించును. అదియేకదా ఆకలి యందురు? ఆకలితో నవసినప్రాణి అన్నముతో నాకలిని అడచుకొనును. ప్రాణి సంపాదించునన్నము పంచభూతమయమే, పంచభూతమయమైన యీశరీరము పృథివ్యాది శరీరము నొంది తమయందలి ఆయా రసభాగములచే దానిని వృద్ధిచేయును. ఇంకొక తోవలేదు. అన్నపానములు లేనిచో ప్రాణి పెరుగకపోవుటయేకాక అతని శరీరముకూడ కృశించి నశించి పోవును. ఇందులో సంశయము లేదుకదా!"

ఇంతలో నత్రి తొందరగాలేచి బ్రహ్మనడుగదలచి దోసిలి పటి మాటాడసాగెను.

"పంచభూతములకును పాకమెట్లు కల్గును? ఆలోపల జీవుడెట్లు కలియును? దాని నెవ్వడైన యొసగించునా? లేక వానంతట నవియే కల్గునా?"

ఈ ప్రశ్నలను నాదరముతోవిని చతురాననుడు పరమ దుర్లభమైన రహస్యమును దానికి జవాబు చెప్పెను.

"పరవాసుదేవుని మాయ యొకటి యున్నది. అది యీ భూతముల నైదింటిని కలుపును. వానిని పక్వమొనర్చును. జీవుని అందుకూర్చును. అంతేకాక ఆయా ప్రాణులను ఆయా జాతులనుబట్టి విభజించి ఆయా శరీరములతో గూర్చును అంత జీవునకు చేష్ట లేర్పడును."

అత్రి సాంజలి బంధుడై నమస్కరించి "ఇదేమి స్వామి! లోకములను సృజించినది తామేకదా! 'మాయ దేహమును కూర్చును. దీనివలన జీవుని దేహవంతునిగా నొనర్చును. అన్నముచే శరీరము పెరుగును.' అని తాము చెప్పుచున్నారే! ఇక తమరు సృష్టికి కర్త లెట్లగుదురు? తాము ఏమి సృజించితిరి? యాజ్ఞవల్క్యుడు మొదలగు పెద్దలందరును తమను సృష్టికర్తయని తెల్పుచున్నారు. ముఖ్యమగు నీవిషయమును చెప్పి నాసంశయమును పారద్రోలుడు."

అత్రి యడిగిన యీమాటకు బ్రహ్మ అత్రిమొదలగు వారు వినుచుండగా నిట్లు సమాధానమిచ్చెను.

"సనాతనుడగు పరవాసుదేవుడు మమ్ముల నిద్దరను సృజించెను. మేమొనర్పవలసిన సృష్టి సంహారములకు ముఖ్యముగా సాధనమైన మాయనుగూడ నిర్మించి జగత్తును సృజింపమని చెప్పెను. అపుడు పరమ ప్రభువగు శ్రీ వాసుదేవుని నేను అడిగితిని. "మేము ఈపనిచేయుటకు సాధనమేది? దీని నెవడు నెరవేర్చును? నాకు స్పష్టముగా చెప్పుము. తెలుసుకొనవలెనను గోరికయున్నది', నేనిట్లడుగగా జగన్నాథు డిట్లనెను—నీవు జగమును సృజింపుము. ఆయాపనుల కూర్పులో నామాయ యిది నీ కుపకరణమగును. పంచభూతాత్మకమగు నీవిశ్వమంతయు ఎప్పుడును నాయందే యాధారపడియున్నది. నీ శరీరము—పృథివ్యప్తేజోవాయ్వాకాశములని పేరొందిన పంచభూతములును నొకటిగా రూపొంది నీశరీర మేర్పడినది ఇది యంతయు నాయందు విశ్రమించి యున్నది. నానుండి విస్తరించును. మనసు, బుద్ధి, ఇంద్రియములు మొదలగు సాధనములుగూడ నన్నియు మాయ యధీనములు నీయందున్నవి. నీవు సృష్టికి ప్రయత్నమొనర్చుచుండునపుడు ఈమాయ నీకు అన్ని విధములను సేవచేయుచుండును. నీవెట్లు తలంచిన నట్లొనర్పగలదు. సంశయపడవలదు."

దేవదేవుడిట్లు బోధించిన పిమ్మట నేను సనకాదులను సృజించితిని. వారు సృష్టి యొనర్చ దలంపు గొనరైరి. అందువలన పిమ్మట శివుని సృజించితిని. ఇతడు సగము శరీరము నా కనుబొమలనుండి బయల్వెడలి శక్తిమంతుడై స్త్రీపురుషులను సృజించెను.

తరువాత నేను ప్రజాపతులను సృజించి కృతకృత్యుడనైతిని. ప్రజాపతులు నాయానతితో ప్రజలను సృజించిరి. ఆ ప్రజలకు పసనట్లు లోకములో ఆహారములును సృజింప బడినవి. విశేషించి పదునాలుగు లోకములను నేను సృజించితిని. పృథివ్యాది పంచభూతములును ప్రజల కాహారమునకై విస్తరించినవి. ఈపై జెప్పిన తీరున నీ ప్రపంచమునంతను వ్యాపించిన ఆ పరబ్రహ్మ ఈ సృష్టి కంతకును గారణమైనది. నేను కర్తను. మాయ నాకుపకరణము. అంతయు మీకు తెలిపితిని."

ఇట్లు పద్మజుడు తెలుపగావిని అత్రి యిట్లనెను. శాస్త్రములు మహాతపస్వులగు ఋషులందరునుగూడ మహానుభావుడగు నీ రుద్రుని జగములు సంహరించుటకు గారణమని తెల్పుచున్నారు. (సశేషము)

---

దుర్జనః సజ్జనో భూయాత్ సజ్జనః శాంతిమాప్నుయాత్ ।
శాంతోముచ్యేత బంధేభ్యో ముక్తశ్చాన్యాన్ విమోచయేత్ ॥

ప్రీయతాం పుండరీకాక్షః సర్వయజ్ఞేశ్వరో హరిః ।
తస్మింస్తుష్టే జగత్తుష్టం ప్రీణితే ప్రీణితం జగత్ ॥

సర్వే భవంతు సుఖినః సర్వే సంతు నిరామయాః ।
సర్వే భద్రాణి పశ్యంతు మా కశ్చిత్ దుఃఖభాగ్భవేత్ ॥

# శ్రీరామతీర్థం

బులుసు వేంకటరమణయ్య

ఆంధ్రదేశంలో ప్రసిద్ధమైన పుణ్యక్షేత్రాలు చాలా ఉన్నవి. వాటిలో రామతీర్థం ఒకటి. ఇది విశాఖపట్నం జిల్లా విజయనగరం తాలూకాలో ఉన్నది. విజయనగరానికి ఎనిమిది మైళ్లదూరంలో ఈశాన్యదిశను ఉన్నది. నెల్లిమర్లదగ్గర ప్రవహిస్తూ వున్న చంపావతీనదికి ఇది రెండున్నరమైళ్లలో ఉన్నది.

ఈ వూరికి ప్రక్కనే బోడికొండ, గురుభక్తుని కొండ, దుర్గికొండ మొదలైన పర్వతాల వరుస ఉన్నది. పూర్వం యిది గొప్ప బౌద్ధక్షేత్రంగాను, జైనక్షేత్రంగానూ కూడా వుండేదనీ, ఆకాలంలో ఇది ఆరామక్షేత్రం (బౌద్ధారామాలు ఉన్నందువల్ల) అని చెప్పబడేదనీ చెప్పుదురు.

ఇక్కడి గురుభక్తుడి కొండమీద జైన తీర్థంకరుల విగ్రహా లున్నవి. కొండశిఖరంవద్ద చెడిపోయిన జైన విగ్రహం ఉన్నది. గుర్తు పట్టడానికి వీలుకాని కొన్ని శాసనాలున్నవి. చిన్నచిన్న బౌద్ధస్తూపాలూ, ఆరామాలూ కొన్ని కనబడుతున్నవి. ఇక్కడి బౌద్ధస్తూపాల కళాసాంప్రదాయాన్ని బట్టి చూచినట్లయితే బౌద్ధమతంయొక్క కడపటి రోజుల్లో యివి వెలసినట్లు ఊహించవచ్చును. ఆ కాలంలో యిది బౌద్ధ, జైనమతాలకు కేంద్రంగా వుండేది. ఈ యిరవయ్యోశతాబ్ది ప్రారంభంలోనే యిక్కడి శిధిలాలను త్రవ్వి ఆర్కియాలజీ శాఖవారు ఇక్కడి అనేక కళాఖండాలను మద్రాసు వస్తుప్రదర్శనశాలలో చేర్చారు.

పూర్వకాలంలో కళింగదేశం నాస్తికమతాలైన బౌద్ధ, జైనమతాలకు ఆశ్రయం యిచ్చి, వాటి ప్రచారానికి అన్నివిధాలా సహకరించిన సంగతీ, ఆ మతాలకు పవిత్రక్షేత్రంగా వున్నందున ఆస్తికమతాల బహిష్కరణను పొందిన సంగతీ చరిత్రకారులకూ, మత సంప్రదాయవేత్తలకూ క్రొత్త కాదు. తర్వాత బౌద్ధ, జైనాలు పతనావస్థపొంది, ఆస్తికమతాలు విజృంభించడంతో, కళింగప్రాంతంలో కూడా అవి ప్రచారము పొందినవి; కాని అంకమాత్రం చాలాకాలంవరకూ తొలగినట్లు కానరాదు. కాని బౌద్ధ, జైనమతాల పతనంతో కళింగదేశంమీద వుండే హేయభావం కొంతవరకూ తగ్గినది. ఆ మతాలకు సంబంధించిన శిధిలాలు మాత్రం మనకు దక్కినవి!

వీటితో పాటు విమలాదిత్య చాళుక్యునినాటి శాసనం ఒకటి యిక్కడ లభించినదట!

పూర్వకాలంలో బౌద్ధక్షేత్రంగానూ, జైనక్షేత్రంగానూ వుండిన యీ వూరు యిప్పుడు విరువేవడగు శ్రీరామచంద్రునికి నివాసమై శ్రీరామతీర్థమైనది. దీనికి 'రామతీర్థాలు' అనే పేరు ప్రసిద్ధమైనది. శ్రీకాకుళం, విశాఖ జిల్లాలలోనున్న కొందరు గ్రామీణులు 'రామగుళ్లు' అని వ్యవహరించడం కూడా కద్దు.

17–వ శతాబ్ది అపరార్ధంలో విజయనగరప్రభువుల పూర్వులు యీ వూరికి అయిదారు మైళ్లు దక్షిణంగా ఉన్న 'కుమిలి' లో వుండి రాజ్యం చేస్తూ వుండేవారు. అప్పుడీప్రాంతం అరణ్యంగా వుండినది. ఇక్కడికి కట్టెలు కొట్టుకొనే నిమిత్తం కుమిలినుంచి జనం వస్తూ వుండేవారు. ఒకనాడు వాళ్లతో పుల్లలు ఏరుకోవడానికి ఒక మూగది వచ్చినదట! అప్పుడు బ్రహ్మాండంగా పెద్ద గాలివాన వచ్చినది. వచ్చినవాళ్లంతా చెల్లాచెదరై పారిపోయినారు! మూగదిమాత్రం అక్కడ చిక్కుకొని దిక్కూదిశా తెలియక యేడుస్తూ వుండినదట! ఆ రాత్రి సీతారామలక్ష్మణులు ఆ అడవిలో తిరుగుతూ, దీని యేడ్పు విని, దగ్గిరకు వచ్చి యేడ్పుకు కారణం అడిగారట! మూగది 'తనకు మాటలు రా'వంటూ సైగచేసి చెప్పగా శ్రీరామచంద్రుడు దాన్ని నాలుక చాచుమని కోరి, ఏవేవో బీజాక్షరాలు వ్రాయగా, దానికి ఉన్నపాటున మాటలు వచ్చి తన వృత్తాంతం యావత్తూ చెప్పినదట! అంతట శ్రీరాముడు 'నరే! నీవు మీ వూరు వెళ్లి మేము యిక్కడవున్న సంగతి మీ మహారాజుగారికి తెలియచెయ్యి. మాకోసం యిక్కడ నివాసం కల్పించాలని కోరినట్లుకూడా చెప్పుము' అని చెప్పి వంపివేయగా ఆమె భగవంతుడు తనవంటి దరిద్రురాలికి ప్రత్యక్షమైనందుకు మిక్కిలీ సంతోషించి ఎక్కడ లేని ధైర్యము కలుగగా, వెంటనే తన వూరికి పోయి, తన వృత్తాంతాన్ని చెప్పి, అక్కడివారి కందరికీ ఆశ్చర్యం కలిగించింది. వెంటనే కోటలోకి పోయి మహారాజుగారికి యీ నమాచారం తెలియజేసింది. ఆయన వెంటనే అత్యుత్సాహంతో దివిటీలవారినీ, కొందరు నౌకర్లనూ, మంత్రి, పురోహిత, సామంతులనూ వెంటబెట్టుకొని ఆ అరణ్యానికి వచ్చి ఎంత వెతికినా సీతారామలక్ష్మణులు, కానరాలేదు. వెతగ్గా, వెతగ్గా చివరకు ఒకచోట జటావల్కలధారిన్నీ, ధనుర్బాణములు ధరించినవాడున్నూ అయిన వనవాస రాముని విగ్రహమున్నూ, సీతాలక్ష్మణుల విగ్రహాలున్నూ కనిపించాయి. కుమిలిలోని జనులు యిదివరలో ఎన్నివేల సార్లయినా ఆ ప్రదేశాలు చూచి వుంటారు. కాని యెవ్వరికీ కూడా, అవి కనబడలేదు. అందువల్ల ఆ విగ్రహాలు నాడు

వెలసినది అని మహారాజుగారు నిర్ణయించి, పరిసర ప్రాంతాలనుంచి గొప్ప శిల్పులను రప్పించి అద్భుతమైన గొప్ప దేవాలయం కట్టించి, ఆ విగ్రహాలకు అందు ప్రతిష్ఠ చేశారు. దానికి రామతీర్థమనే పేరు ఏర్పడినది. ఇది స్థల పురాణంలోని కథాసారం.

ఇందలి సత్యాసత్యాల పరిశీలనసంగతి అటుంచి చూస్తే ఈ క్షేత్రం 17-వ శతాబ్ది చివర ఏర్పడినదనీ, విజయనగరం పుట్టుకకంటె ప్రాచీనమని చెప్పటకు వీలు ఉన్నది.

దేవాలయం అంత పెద్దది కాకపోయినా చూచుటకు ఆకర్షణీయంగా వుంటుంది. గోపురాది నిర్మాణంలో దక్షిణాది సంప్రదాయం ఎక్కువ కానరాదు. శిల్పకళ కూడా అంత విశిష్టమైనది కాదు. దీని నిర్మాణంలో ఒరియా శిల్పకారులు పనిచేసినట్లుగా అనుకొంటారు.

గ్రామంమాత్రం దక్షిణదేశ సంప్రదాయాన్ని అనుసరించి ఉన్నది. దేవాలయానికి ఎదురుగా పెద్దవీధి ఉన్నది. కృష్ణదేవరాయలు ఆముక్త మాల్యదలో వర్ణించినట్లుగా వీధి రెండువైపులా ఆకర్షణీయమైన ఇండ్లూ, వానియందు కొబ్బరిచెట్లూ చూడడానికి ఎంతో ముచ్చటగా ఉంటుంది. గ్రామవాసు లంతా జీవికకోసం నగరాలు చేరడంమూలాన గ్రామం చాలావరకూ క్షీణావస్థకు వచ్చినా, వెనుకటి ఔన్నత్యాన్ని స్పష్టం చేస్తూనే ఉంటుంది. ఇక్కడి బ్రాహ్మణ్యంలో ఎక్కువమంది తెంగల్ (దక్షిణాది) వైష్ణవులు: ఈ క్షేత్రం నిర్మింపబడినతర్వాత దాని సక్రమనిర్వహణకోసం దక్షిణదేశంనుంచి కొన్ని కుటుంబాలు రప్పింపబడినవి అందువల్ల ఆ కుటుంబములే చుట్టుపట్ల సింహాచలం, పద్మనాభం, శ్రీకూర్మం క్షేత్రాల్లో వ్యాపించి సంబంధ బాంధవ్యములచే తామరతంపర అయినవి.

దేవాలయానికి దక్షిణంగా, ప్రక్కనే తామరకొలను ఒకటి ఉన్నది. అది అందంగా వుంటుంది దానికి మూడు వైపుల గట్టుమీద మర్రి, పనస, రావి మొదలైన చెట్లు ఒక అందాన్ని చేకూరుస్తూ ఉంటవి. ఉత్తరపు దిక్కున గట్టు కాకుండా పెద్ద బండలు గట్టుగా ఏర్పడినవి కావున చెరువులోనికి దిగునప్పుడు ఎక్కువ జాగ్రతగా ఉండవలసి వుంటుంది.

ఊరికి ప్రక్కనె బోడికొండ అనే కొండ ఉన్నది. అది ఒకేఒక పెద్ద రాయిగా కనబడుతుంది. దానిపైని కోదండ రామస్వామి దేవాలయం ఉన్నది. ప్రతిదినమూ అర్చకులు మొదలైనవారు అక్కడికి వెళ్లి దేవతారాధన చేసి వస్తూ వుందురు.

ఈక్షేత్రంలోని ముఖ్యమైన ఉత్సవాలు శ్రీరాముని కల్యాణమూ,శివరాత్రియున్నూ. కల్యాణం మాఘశుద్ధఏకాదశినాడు జరుగుతుంది. రథోత్సవంకూడా కల్యాణసందర్భంలోనిదే!

ఇక్కడ ఒక విశేషం గమనించదగినది. శివరాత్రి శైవ క్షేత్రాల్లో జరిగేది. కాని విష్ణుక్షేత్రమైన యిక్కడ శివరాత్రి ఎక్కువ వైభవంగా జరుపుకుంటారు పల్లెజనం! ఈ ఉత్సవానికి వేల సంఖ్యలలో లెక్కింపదగిన జనం వస్తారు. అందరూ శ్రీరామునే దర్శించి ధన్యులమైనట్లు తలుస్తారు. ప్రక్కనున్న శివాలయానికి నూటికి ఒక్కరూ కూడా వెళ్లరా? అనేది సందేహమే! చాలమంది జనం తమ మ్రొక్కుబడులను చెల్లిస్తారు. దేవస్థానానికి ఈ ఉత్సవసందర్భంలో వచ్చిన ఆదాయమే అత్యధికం! తర్వాత వైశాఖమాసం కూడా యాత్రాసమయమే! సింహాచలంలో అక్షయతృతీయకు—చందనోత్సవానికి వెళ్లె జనమూ, అక్కడి కల్యాణానికి వెళ్లే జనమూ తప్పకుండా ఇక్కడికి కూడా వచ్చి తమ మ్రొక్కుబళ్లు చెల్లించుకొని వెళ్లుదురు.

ఈ విధంగా క్షేత్రం కావడంబట్టే కాకుండా రామతీర్థానికి మరొక ప్రాముఖ్యం ఉన్నది. అది ప్రకృతిశోభ! అది కొండలమీద ఎక్కువగా కనబడుతుంది. కోదండరామస్వామి దేవాలయం వున్న బోడికొండ ఎక్కితే చాలా ఆనందంగా ఉంటుంది. అక్కడ దేవాలయానికి ప్రక్కనే సీత గుండం అనే పేరు గల గుండం ఉన్నది. నీరు చాలా పరిశుద్ధంగా వుంటుంది. ఎంత వేసవిలో అయినా ఎండిపోదు. అలాంటిదే రామగుండం అనే పేరు గల మరొక గుండం కొంత దిగే దారిలో ఉన్నది. అందులోనూ, మరికొన్ని చిన్న గుండాలలోనూ—సామాన్యంగా ఎక్కడా లభించని నల్ల కలువపూవులు (Blue water lillies) ఉంటాయి. అవి కమ్మని సువాసన కలిగి, ఎంతో మనోహరంగా ఉంటాయి! రామగుండంప్రక్క బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు ముగ్గురూ వున్న ఒక ఆలయం చాలా శిధిలావస్థలో వున్నది. అందలి విగ్రహాలూ కొంత శిధిలమై ఉన్నవి. త్రిమూర్తులకూ ఒక్క గుడిలో ఆరాధన జరుగడం విశిష్టమే!

కోదండరామాలయం నుంచి కొంచెం మీదికి వెళ్లి ప్రక్కగా వెళ్లగా ఒక ఇరుకుదారి రాళ్లమధ్య కనబడుతుంది. దాన్నే 'ఇరుకురాయి' అంటారు. అది సొరంగం మార్గం. అందులో దూరి నాలుగైదు అడుగులు నడిచేసరికి వందమందికి పైగా విశాలంగా కూర్చోడానికి వీలయిన ప్రదేశం వస్తుంది. అది విశాలంగా వుంటుందేగాని, నిలుచోడానికి వీలుకాదు. పైకప్పు చాలా కిందికి వుండడంవల్ల వంగి నడవాలి. స్వేచ్ఛగా కూర్చోవచ్చును ఆ స్థలం కొండకు పార్శ్వభాగం కావడంవల్ల కావలసినంత వెలుతురూ గాలీ, వుంటాయి. పూర్వం మరాఠీల దండు వూళ్లమీద పడి దోచుకుంటూ, జనాన్ని హింసించేటప్పుడు ఆ వూరి జనులు యిక్కడ దాగుకునేవారని చెప్తూ వుంటారు. 'ఇరుకురాయి' వంటిదే—'మరాఠీకొండ' అనేది దీనికి

దగ్గరగానే ఉన్నది. సామాన్యంగా ఎవ్వరూ అక్కడికి వెళ్లలేరు!

త్రిమూర్తుల దేవాలయానికి ఎదురుగా పది గజాల దూరం కొంత అంచుదగ్గిరికి వెళ్లి నిలిచి కేక వేస్తే, తర్వాత ముమ్మారు ప్రతిధ్వని వస్తుంది. స్థలసన్నివేశం, ఎదురుగా వుండే కొండలూ, వాతావరణం దానికి కారణాలు

అక్కడినుంచి కొంత క్రిందికి దిగితే 'పాండవుల పంచలు' కనబడతాయి. ఒక చిన్న గుహ కొంత పొడుగుగా వుండగా, ఎప్పుడో దానిని నడుమ గోడలు పెట్టి పంచలుగా మార్చి వుంటారు. 'పాండవుల పంచలు' అనే పేరు ఉన్నా, మహాభారతములోని పాండవులకూ దీనికి సంబంధము ఎలా ఉన్నదీ బోధపడడం లేదు.

మిగిలిన కొండలమీది బౌద్ధ, జైనవిహారాలూ, అవీ చూచి తీరవలసినదే! వాటిని వివరంగా తెల్పాలంటే ఒక గ్రంథం తయారవుతుంది. విహారాలున్నచోట నీటి సౌకర్యం కూడా ఉండడం విశేషం!

మరొక సంగతి! రామతీర్థంలో శ్రీరాముని దేవాలయమే కాకుండా శ్రీరంగనాథస్వామి, గోదాదేవి వేంచేసి ఉన్న దేవాలయం ఒకటి ఉన్నది. అది విజయనగర ప్రభువుల గురువులు శ్రీ అయ్యావార్లంగారివల్ల యిరవయ్యో శతాబ్ది ప్రారంభంలో నిర్మింపబడినది! అక్కడకూడా నక్రమంగా రాగ, భోగాలూ, ఉత్సవాలూ జరుగుతూ ఉన్నవి.

భాషా, వాఙ్మయాల విషయంలో కూడా ఈక్షేత్రం పేరు పెంపులు సంపాదించినది. విద్యానాథుని ప్రతాపరుద్రీయానికి 'రత్నశాణ' మనే వ్యాఖ్య రచించిన శ్రీచిలకమర్రి తిరుమలాచార్యులుగా రిక్కడివారే! సుప్రసిద్ధ విద్వత్కవీ శతకకర్తలలో అందెవేసిన చేయి అయిన శ్రీ గోగులపాటి కూర్మనాథకవి యీవూరివాడే! ఈక్షేత్రం వెలసిన క్రొత్తలో అప్పటి కవులు చాలామంది తమ గ్రంథాలను శ్రీరామతీర్థ శ్రీరామునికే కృతి యివ్వడం కద్దు. అడిదము సూరకవి తండ్రి బాలభాస్కరకవి రచించిన ఛందోలక్షణగ్రంథం ఈ దేవునకే అంకితమివ్వబడినది! నాటినుండి నేటివరకూ సంస్కృతాంధ్ర ద్రావిడభాషల్లో ఆరితేరిన విద్వాంసులూ, సంస్కృతాంధ్రాల్లో కవిత్వం చెప్పగలవారూ అనుస్యూతంగా వుంటూనే వున్నారు.

విజయనగరసంస్థానమును పరిపాలించెడు పూసపాటి వారు ఈ రామతీర్థక్షేత్రమును ప్రతిష్ఠించినందున ఆ వంశమువారే ఈ ఆలయమునకు ధర్మకర్తలుగా నుండి ఆలయమును మూర్తులను సరియగు పద్ధతిలోనుంచి ఇచటి దేవతారాధనకు యేలోపము లేకుండా యిప్పటికిని నడిపించుచున్నారు. ప్రస్తుతము ఈ రామతీర్థదేవాలయమునకు శ్రీ పూసపాటి విజయరామగజపతిరాజు, యమ్. యల్. ఏ. గారు ధర్మకర్తలుగా నుండి దేవాలయ నిర్వహణమునందు తమతరపున అధికారులను నియమించి సక్రమముగా నిర్వహించుచున్నారు. విజయనగరసంస్థానాధిపతులగు పూసపాటివారి ధర్మకర్తృత్వమున నిర్వహింపబడు ప్రాచీనములగు ప్రసిద్ధ దేవాలయములు, సింహాచలం, పద్మనాభం, శ్రీకూర్మం, మొదలగు వైష్ణవ క్షేత్రములు, కోటిఫలి (గోదావరి జిల్లా) మొదలగు శైవక్షేత్రములు యనేకములు గలవు. వీటినిగురించిన చారిత్రికాంశములు మొదలగు విషయములు తెలియదగినవి.

ఇంక ఈ రామతీర్థక్షేత్రమునందు దేవస్థానముతరపున సంస్కృత పాఠశాలకూడ గలదు. ఇందు చదువొకొవును విద్యార్థుల కుచితముగ భోజనవసతి సదుపాయములు జరుపబడుచుండెడివి. ఇప్పటికిని ఇచటి పాఠశాలయందు శాస్త్రపాఠములు, ఆగమము భగద్విషయము శ్రీభాష్యము మొదలగు విశిష్టాద్వైత మతగ్రంథములను అధ్యాపన మొనర్చు సమర్థులగు పండితులు గలరు. గాని అధ్యయనముచేయు విద్యార్థులు అరుదుగా నున్నారనుట శోచనీయము.

ప్రస్తుతము, దేవాలయములందు నియుక్తులగు అధ్యాపకులు, పారాయణపరులు, అర్చకులు మొదలగువారు తమ విధిని సక్రమముగ నిర్వహింపవలెనన్న అందుకు కావలసిన పరికరమును సంపాదించుకొని యర్హులైయుండవలెను. లేనిచో ప్రభుత్వముచే నియోగింపబడిన దేవాలయ ధర్మాదాయ పరిపాలనా శాఖవారు ఒత్తిడి కలిగించెదరు — గాన శ్రీరామతీర్థక్షేత్రమునందు అర్చనాదులకు నియోగింపబడువారు తగిన యర్హతను సంపాదించుకొనుటకైనను పాఠశాలయందు విద్యనభ్యసించుచు విద్యార్థులు లేరను యపవాదును రానీయరని విశ్వసించెదను.

# తంత్రాలోకము

(పూర్వతోఽనువృత్తమ్)

— [illegible] మాధవరామశర్మ

శ్లో॥ అకించిచ్చింతకస్యైవ గురుణా ప్రతిబోధతః
ఉత్పద్యతే య ఆవేశః శాంభవః పరికీర్తితః ॥

సాధకుడేమియు చింతన మొనరింప నక్కరలేదు. నిస్తరంగాంతరంగమున నుండుట చాలును. విద్యాజన్మ పొందుట కర్హుడయిన యాతని గురువు సమీక్షించి ప్రతిబోధించును. అట్టి యా ప్రబోధము ప్రతిబోధము. శిష్యోన్ముఖతల్లీనమై నూతనముగనున్న సంవేదనమంతట నుల్లాసము పొందును. అప్పుడు సాధకుడయిన శిష్యునందొక సమావేశ ముత్పన్నమయినది. ఆ యావేశము శాంభవావేశము. శం=సుఖము సుఖమన్న నది సంవిత్సుఖము. తదావిష్కృతియుండుట నిది "శంభు" పదమున వ్యపదేశార్హమయినది.

శ్లో॥ ఉచ్చారరహితం వస్తు చేతసైవ విచింతయన్ ।
యం సమావేశమాప్నోతి శాక్తః స పరికీర్తితః ॥

సాధకుడొకప్పుడంతరంగస్పందభావము ననుసరించి వర్ణోచ్చారణ సంబంధములేని సంవిద్వస్తువును చేతమున చింతించును. అతని యా చిత్తచింతనము చిదంశమును సంభావించునదియై యుండును. అప్పటి యా చిచ్చింతనమున చితిశక్తిసమావిర్భావ ముదయించును. సాధకుడు చిత్సమావేశము పొందును. అది శాక్తావేశము. ప్రస్పందమానశక్తి స్ఫురణముండునుగావున దీని నిట్లనుట సముచితము.

శ్లో॥ ఉచ్చారకరణ ధ్యానవర్ణస్థానప్రకల్పనైః ।
యో భవేత్స సమావేశ ఆణవః పరికీర్త్యతే ॥

సాధకుని దేహమున నుచ్చారణసాధనములున్నవి. అతడు బుద్ధివ్యవసాయమున ధ్యాన మొనర్పగలడు. కంఠతాలుమూర్ధాదులుచ్చారణసాధనములు. ఆయావర్ణములకు నియతములగు స్థానములును ప్రసిద్ధములు కదా! ఈయీ సాధనధ్యానస్థానప్రకల్పనములను సాధకుడు మనోనిశ్చయమున సంభావింపగా గలుగు సంవిత్సమావేశమాణవమందురు. సాధకజీవుడణువు. అతని సాధనోపాయమాణవోపాయము. ఈ యుపాయత్రయము విపుల వ్యాఖ్యేయము.

## శాంభవోపాయము

శాంభవోపాయమున వికల్పములేవియు నుపయోగింపవు. తెలియవగిన జ్ఞేయముమాత్రము ముఖ్యము. వెంటనే జ్ఞేయసమాపత్తి కలుగును. సాధకుని బోధ నిత్యము జ్ఞేయాభిముఖమై యుండును. ఆ బోధ జ్ఞేయము విశదమగును. ఈ సమావేశమునందు సాధకుడప్రధానుడగును. తన యాత్మను గుణీకరించుకొనును. పరబోధలో పరవశత్వమొందును. తాదాత్మ్యమనుభవించును. అప్పటి సంవిత్ప్రభావమె యట్టిది. అందే వికల్పము నుండదు. అవికల్పసంవేదనములో సాధకుడు సాగరబిందువగును.

శ్లో॥ అవికల్పపథారూఢో యేన యేన పథా విశేత్ ।
ధరాసదాశివాంతేన తేన తేన శివీ భవేత్ ॥

సాధకుడు సంకల్పపథములన్నిటి దాటవలెను. అవికల్పపదము ప్రవేశింపవలెను. అట్టి నిర్వికల్పకమయిన స్వసంవిత్పదము చేరుట శాంభవస్థితి. ఏయే విధమున ఏయే పదమున వికల్పరాహిత్యము పొందునో ఆయా విధమున నాతడచలుడగును. ధరాదిసదాశివాంతములయిన తత్త్వప్రక్రియలన్నియు నాతని శివీకరించును. నిరంతరము శివసంవేదనమున శాంభవావేశఫలమనుభవించును. సర్వాభేదసంవేదనము శాంభవము. భేదాభేదములు గోచరించుట శాక్తము. స్ఫుటభేదమాణవోపాయము అణువు స్ఫుటభేదము కాగా ఆణవము తదుపాయమని తెలియును. వికల్పములు పోగా పోగా నిశ్చయప్రథ కల్గును. నిశ్చయ ప్రత్యయమే పర్యంతమున నిర్వికల్పకమగును. ఇంతకు నభేదోపాయము శాంభవమని, భేదాభేదోపాయము శాక్తమని, భేదోపాయమాణవమని సారాంశకలనము.

పరశివదీక్షయున్ననే ముక్తియున్నది. శాంకరయోగమున దీక్షలేకున్న అధికారము లేదు. అదీక్షితున కిది యగమ్యము. శాంకరయోగమునకు శాంభవదీక్ష యావశ్యకము. దీక్షయనునది మలహంత్రిక్రియ. సర్వమలములు దీక్షచే నశించును. అనుత్తర స్థితి లభించును. ఆనంద శక్తి విశ్రాంతి కలుగును. ఇది సర్వముపాయాది వివర్జితము. గురు ప్రతిబోధమున గలుగుననుటచే గురువక్త్రము శక్తిచక్రమని భావము. అవయవప్రవిభాగ మేమాత్రము లేని సంవిత్ప్రకాశ మాత్మావబోధము. సాధకుని శక్తులన్నియు నేకప్రవణములు సక్తములు శక్తములగుట సంవిత్ప్రకాశము. శక్తిచక్రమొకటియై సంవిద్ద్వార చేరవల

...ను: స్వప్రకాశమహస్సు సంభావితము కాగా సాధ కాత్మ బంధసంబంధమున వికసింపదు. ఆత్మజ్యోతిః స్వభావప్రకటనవిధానమున సాధకునకు మోక్షము లభిం చును. ఇదియంతయు చిత్రాకారమయిన చిత్రము. ఇట్టి విచిత్రావభాసమంతయు శాంభవ ముదయింపగా ప్రతిభా సింపదు.

శ్లో॥ మిథ్యాజ్ఞానం తిమిరమసమాన్ దృష్టి దోషాన్ప్రసూతే
తత్సద్భావా ద్విమలమపి తత్ భాతిమాలిన్యధామ ।
యత్తుప్రేక్ష్యం దృగ్ పరిగతం తైమిరీం దోషముద్రాం
దూరం రుంధేత్ప్రవహతు కథం తత్రమాలిన్యశంకా ?॥

శాంకరమయిన జ్ఞానము లేక మిథ్యాజ్ఞానమున్న నది యొక తిమిరము. చిమ్మచీకటి. అది దృష్టిదోషముల సృజించును. ఆ యసమదోషమున విమలధామమును మాలిన్యధామమై యవభాసింపును. శాంభవావేశము కలు గగా సర్వదృశ్యమము దృగనుగతమగును. ప్రేక్ష్యము గోచ రించును. జ్ఞేయము జ్ఞాతమగును అప్పుడు తిమిరదోష ముద్రయుండదు. పూర్వతిమిరమెచటనో దూరమున గిర వాటు పొందును. ఇక నదియేమియు ప్రసరింపదు. ఇక మాలిన్య శంకావేశకలంకము నుండదు. అప్పుడు సాధకు డాత్మప్రత్యయమున నుండును. "నాహంప్రాణః, నైవ శరీరం మనోహం, నాహంబుద్ధిః, నాహమహంకారధి యోచ", నేను ప్రాణముకాను, శరీరముకాను, మనసుకాను, బుద్ధికాను, అహంకారధీయాపుడసుకాను అని తలచును. ఇంకను "యోఽత్ర జ్ఞాంశః సోస్మ్యహమేవ" యని యాత్మా హం ప్రత్యయమున నుండును. అనాత్మయందాత్మాభి మానము దోషముద్రా ప్రభావము. అది మిథ్యాజ్ఞానమున జనించును. అట్టి దోషముద్రను దూరమున విడువ వలయును. కాననె యభియుక్తు లిట్లనిరి.

శ్లో॥ సంసారోఽస్తి న తత్వతః తనుభృతాం బంధస్య వార్తైవ కా?
బంధోయస్య న జాతుతస్య వితథా ముక్తస్య ముక్తిక్రియా।
మిథ్యామోహకృదేష రజ్జుభుజగచ్ఛాయాపిశాచ భ్రమః
మాకించిత్ త్యజ! మాగృహాణ! విరమ! స్వస్థో
యథావస్థితః ॥

సాధకులగు దేహధారులేరికిని వాస్తవముగ సంసార మనునది లేనేలేదు. బంధవార్తయెట్లు? బంధమనునదే లేదుకదా! ముక్తునకు ముక్తిక్రియ యంతయు వితథమె. రజ్జుభుజగభ్రమ, ఛాయాపిశాచ భ్రమ; ఈ భ్రమజాల మంతయు మిథ్యామోహము కలిగించును. కావున నేవియు విడువవలదు ఏదియు గ్రహింపవలదు. ఏదియు విర మింపవలదు. నీవెట్లుంటివో యట్లే యుండుము. మాత్యజ! మాగృహాణ! మావిరమ! శాంభవోపాయమున పరిస్థితి యిట్లున్నది. కొందరుత్తాలెన్నులు పల్కుదురు. అందు కుదురేది? అది యంతయు పరిహాస్యము.

శ్లో॥ భావవ్రాత! హఠాజ్జనస్య హృదయా న్యాక్రమ్య
యన్నర్తయన్
భంగీభిర్వివిధాభిరాత్మ హృదయం ప్రచ్ఛాద్య సంక్రీడసే।
యస్త్వామాహ జడం జడః సహృదయంమన్యత్వదుశ్శిక్షితః
మన్యేఽముష్య జడాత్మతాస్తుతిపదం త్వత్సామ్య
సంభావనాత్ ॥

భావవ్రాతమా! జనుల హృదయముల హఠాదాక్రమించి తివి. అందర నర్తింప చేయుచుంటివి. వివిధభంగిమల నీయాత్మహృదయ మాచ్ఛాదించి క్రీడింతువు. నటింతువు. నిన్నెవడో జడుడు జడమనినాడు. వాడు సహృదయుం మన్యుడు. తానంతట తానే యట్లు భావించు దుశ్శిక్షితుడు. ఉత్తజడుడు. నిన్ను జడమని తలచి తలచి నీసామ్య సంభావనమున జడాత్మకుడయినాడని నేను తలంతును. భావతత్త్వ మెవడు గుర్తించును? భావము జడమనువారి కేమియు తెలియదు. వాడు తత్త్వము తెలియడు. తెలియక పోనీ! అట్లూరుకొనడుకదా! ప్రత్యుత ఏదియో యన్యథా వదించును! వాడు జడుడు? వాని దోష మేమున్నదిలే! వాడట్లనక ఎట్లనును? మేము చెప్పినది చెప్పనది తత్త్వము. దీని జడుడెట్లు గుర్తించును? జడులు గుర్తింపలేకున్న నేమాయె! దీని గుర్తింపుడని జడులు కానివారల మేమేల అర్థింపవలెను? లోకమున మానవులు రెండు విధముల నుందురు. కొందరు శక్తిపాతము పొందలేదు. కొందరు శక్తిపాత మనుభవించిరి. ప్రథముల నాయాతశక్తిపాతులు మేము చెప్పు తత్త్వమున మనమును ప్రసరింపజేయుటకు సమర్థులు కారు. మేమభ్యర్థించినను వారు గుర్తించుటకు మనఃప్రసారమునకు సామర్థ్యమేది? ద్వితీయులద్వితీ యులు. ఆయత శక్తిపాతులు. మేము వారి నభ్యర్థింప నక్కరలేదు. వారు స్వయమీ తత్త్వమున ప్రవర్తింతురు. అసమర్థులని కొందర నభ్యర్థింపము. వ్యర్థమని మరికొందర నభ్యర్థింపము. మా తత్త్వము తత్త్వము.

శ్లో॥ ఇహ గలితమలాః పరావరజ్ఞాః శివసద్భావమయా
అధిక్రియంతే।
గురవః ప్రవిచారణే యతస్తత్ విఫలా దోషకలంకహాని
యాచ్ఞా॥

మాయా శివతత్త్వ సంరంభమున మలరహితులు పరా వరముల గుర్తించినవారు శివసద్భావ అధికారులు. వారు గురువులు. తత్త్వవిచార మొనరింపగలరు. దోష కలంక ముల పోగొట్టుడని మేము వారి యాచించుట విఫలము. గుర్తింపగలవారు గురువులు. (సశేషము)

# ఈశ్వర శతకము

రచన: "కౌండిన్య"

<table><tr><td>

## అహ్వానము

శ్రీ సోమేశ్వర, యూర్పుగాలి మలసెన్, చిత్తంబు వెన్నొంచె, పే*
ర్వా సారాభినిసేచనంబుల చవిన్ నిత్యంబు సేవించు నీ
పీ నాపస్య హిమప్రపంతి కలయంటీ ఘర్మవేగన్ సుఖ
ప్రీ సంపాదనకుద్యమింపఁదగవొఁ గ్రీడింపరావే ప్రభూ ॥ ౧ ॥

సోమఁలాతలిన్ బొదము సోనలఁ గోనల గాలిపాటలన్
ప్రేమరహస్యముల్ పలుకు పెన్నమృదూక్తులఁగూర్చి యుండు నీ
నీమము పొల్చి వాక్కులవనిన్ నిను లాగిన తప్పు సైపవో
యీ : మది గుప్తరీతి ధరియింపఁగనేరికి సాధ్యమీశ్వరా ॥ ౨ ॥

కౌండిన్యాంకుఁడు కృష్ణభిక్షువునకే కామ్యమ్ము నీవిచ్చినన్
పాండిత్యాదర బుద్ధిఁగాదు ; రససంభావ్యైక నిష్ఠన్ గృపా
సౌందర్యంబులఁ జాఁ బాద వినుచున్ జాలిన్ ననున్ గాచు బ్ర
హ్మాండాధీశుని యీవి నాకణువె బ్రహ్మాండంబు సోమేశ్వరా ॥ ౩ ॥

## గ్రంథము

శ్రీ సోమాద్రిపతీ, శ్రుతిన్ బడునె గౌరీనర్మమైరేయ లీ
లా సౌరభ్యవహానిలవ్యవహృతిన్ బ్రాణార్తు నులోర్కృశిగా
ఢ సంతానము నాడు తాపమునఁ ద్వద్వాసంబైన ప్రాలేయశై
లాసాహార్యము నీరుగాక వినుటేలా గల్గ సోమేశ్వరా ॥ ౧ ॥

యోషారత్నముఁ బాసి యావనటనీయోజన్ బలాపింపనేఁ
బాషాణ ప్రతిమానమీ భవము సర్వంబంచుఁ దెల్లంబు, రేఁ
బాషాణప్రతిమానమైన హృదయంబైనన్ బ్రసాదింపు మే
భాషన్ నే వివరింపనేర నెదలోఁ బాకంబు సోమేశ్వరా ॥ ౨ ॥

వెలకున్ మారని జీవితంబొసగి, తీవేకొన్మ దుర్గానికేన్
గలదో మూల్యము, లేదొ తంత్రి "యిపుడా కష్టం"బనన్ బోకు, నీ
వలనన్ దీరితి నిట్లు గాన బరువౌ ప్రారబ్ధముల్ గల్గె గం
దులు పేలాలును వేఁగ నీ మొగమునన్ దోసంబు సోమేశ్వరా ॥ ౩ ॥

అమృతానందతరంగసంచలని మీపై సర్వ పాషండ సం
క్రమితానంత దురంత సంక్షుభిత నైరాశ్యాకులంబైన చి
త్తమునన్ గ్రుంగెడువాడనై యునికి విద్వాంసుల్ సదా చాటినన్
భ్రమగాఁ నెంచెదఁ దత్త్వమేకమను నవ్వాదంబు సోమేశ్వరా ॥ ౪ ॥

నిరతాసార పరంపరావ్యధితమౌ నీరేజషండంబు సొం
పరి మన్మానసభూమి పోలెడిన సిద్ధాత్మంబు నిశ్శ్రీకమై

</td><td>

చరణాంభోజసమాశ్రితాద్రి తనయా సస్మేర ధీరేక్షతన్
చరణ ద్వంద్వరసాప్తి నేనొసగుమా నల్దీరు సర్వేశ్వరా ॥ ౫ ॥

అనువౌ రీతని కింగళంబు నిగళంబై దారపుత్రాదికం
బను సంసారములేమిఁ ధన్యుఁడని, యీ యాలాపముల్ గల్గ; త్రెం
పను గష్టాధికమౌ మృణాళసరముల్ బాహాలతా బంధముల్
తగు తత్సంస్మృతి జాల మీ క్రమమునన్ ధన్యత్వమె ట్లీశ్వరా ॥ ౬ ॥

పిడికెడు కూడు చాలు పదివేలుగ నెంచెద నీ యశస్స్ఫూర్తిన్
మడులుగఁ దీర్చి తెల్గుపొలమారఁ గనింపెద ముక్తకంఠతన్
నడిపెద శ్రావ్యసుందర మనోహర గీతుల నాఁటి నాఁటికా
పిడికెడు నాకు నీయ వరి పేదయొనర్చునదేమి యీశ్వరా ॥ ౭ ॥

చెవులన్ బెట్టవు సత్యవాణులు బుధుల్ చెప్పంగ నవ్వేదముల్
కవిరాజోక్తమహేతి హాసముల, భక్తైకాంతగీతంబులన్
చవియై యీ మొఱ నీ కృపల్ గలుగు నాసంగాదు నాచేత: తా
నవియన్ గూడియ యంగలార్పులు పద్యాలయ్యె సోమేశ్వరా ॥ ౮ ॥

అమరన్ గాంగ విగాహనంబలరు దే యస్మత్కృతాసేచనన్
ఉమకై దండవసించి యాచకునికయ్యున్ దండనర్పింతువే
ప్రమథాళీకృత సామవిశ్రుతివి, నా పాఠంబు పాటింతె సా
పమహీయఃఫల మీ దృశంబుగద మా పాలింట సోమేశ్వరా ॥ ౯ ॥

వితథంబయ్యెఁ గులాయమున్ విడువ నన్వేషించు నా యత్నముల్
వెతలన్ గూలితి, తెక్కదార్ఢ్యమురకేళీలన్ నభోయానముల్
బతనౌ నీ చిరునందజంబులకునున్ సామర్థ్యమిప్పింతువో
పతితున్ జేసెదొ భారమంచితిని నీపై నెవ్వ సోమేశ్వరా ॥ ౧౦ ॥

ఒనరున్ నిష్క్రియమాత్మయిందురగుచో నూహాపిశాచంబులో
ఘనవాత్యాప్రళయోగ్ర సంకుల మహాగంభీరవారాశి వీ
చిని కాయంబులఁబోలు సంస్మృతిజవైచిత్ర్యంబులున్ సాదునే
చుని కారంబులు ? కల్గుటే నిజమునన్ శోధింప సోమేశ్వరా ॥ ౧౧ ॥

అంతా కల్పన, గాలిమేడ యగునా, యట్లైన నీ పల్కువా
కంతా, పల్కుల తేనెతక్కులు రసవ్యాపారముల్ వంతకే ?
సుంతైనన్ స్థిరమై రహింపవలె ? కటా ? శోకానికా యత్నమీ
యంతా, వేదము శాశ్వతమ్మనుదురెట్లే పల్కవే యీశ్వరా ॥ ౧౨ ॥

</td></tr></table>

# TEMPLE

BY

" యథార్థవాది "

It is generally believed and propagated unwillingly that temples are intended to impart spiritual education for the undeveloped minds. The way in which the temple developed as a combination of religion, architecture art and social education, shows that it was meant to educate mainly the lower strata of people and inculcate devotion to God in their minds. The average Hindu knows that God resides in the hearts of all beings. But one cannot propitiate the God in the Heart and express one's thankfulness to Him whenever the need for it arises. It is human nature to be dissatisfied unless one gets an oppurtunity to express one's gratitude to the helper. The common man or woman believes that God saves one from danger whenever His help is called for. When one is actually saved, one's faith in God increases. The saved individual wants to propitiate God to his heart's content. The propitiation is mostly in the form of a sacrifice. It will carry with the offerring of one's hairs on the head to God upto breaking a cocoanut before God. For all this, an incarnation of God is necessary with a temple for him to reside and be available for prayer and propitiation, at all time. In olden days, the *pujari* used to be an adept in the occult sciences, mantras, tantras, medicine, astrology and yoga and generally the most respected man of the village on account of his selflessness. He is supposed to be high pure due to his frequent contact with divinity. People even believed that the *pujari* would be able to converse with God in private, express the needs of the devotee and obtain God's assurance for helping the devotee. It was also beleived that the pujari by installing particular Yantram could make the God very powerful and attract large crouds of devotees. Equally well he could reduce the power of God by tampering with the yantra or the idol. The pujari always took care to see that the God in his temple was feared most by the public. It was the fear element that was more important for the uneducated women and children to make them come to the temple as often as possible with more austere bows everytime. He used to play some tricks if necessary to make the people believe the actual existence of the personal God who does everything like a Lord except talking.

The story goes that in one of the South Indian Temples, every day eight big '*mashapupams*' were offered to God. After the *nivedhanam* is over, there used to be only six left. The Paricharaka places 8 vadais, put on the screen for a few moments & removes the screen & finds to see in amazement only 6. What has happened to the other two. There is no other possibility of their disappearance except the Archaka or the God

to have eaten them. How could the Archaka eat them in a twice. The Archaka and Paricharaka were together all the time except for a twice when the Archaka offered the vadais to God inside the screen. So the only possibility is that God alone could have eaten them. The Archaka told the public how powerful the God is, and how he was actually eating away two of eight vadais every day. This spread like wild fire and the God became more popular. Devotees rushed in greater numbers every day to see the God. The Archaka was also able to get more Kannikas and became rich in course of time.

The story further goes that nobody was able to decipher the mystery of the disappearance of the vadais till one Tahasildar kept close watch over the Archaka without his knowledge at the time of nivedana and found that the Archaka lifted the idol and secreted the two vadais under the peetham of God and took home after everybody had gone home.

Thus the sanctity of the temple and the power of God was enhanced or decreased according as the pujari played his part tactfully and played on the faith of the innocent and ignorant public. If the temple is intended for this kind of education we would better not have it at all in these days of advancement of science and general education. The temple was intended for something far better than all this. What is it—we shall see in the next.

---

# DRAKSHARAMA TEMPLE

*By*

SRI N. RAMESAN, M. A., I. A. S.,

*( Deputy Secretary, Home Dept., Kurnool )*

" ओं नम उग्राय च भीमाय च नमः "

Draksharama, situated, four miles south by east of Ramachandrapuram, a taluk Headquartes of East Godavari District is an ancient and sacred place. It houses the temple of Bhimeswara, which is famous not only for its beauty but also for its sanctity and holiness, and which attracts pilgrims in large numbers from all over India. The temple depicts in its architechture, a perfect and harmonious blend of the Chalukyan and Chola styles of temple architechture, and in its wealth of inscriptions, on its walls, stands unrivalled by any other place. The epigraphy of the temple is perhaps the richest amongst all the temples of Andhra and there are in its walls as many as 381 Inscriptions ranging from Saka 1002 (1080 A. D.) to Saka 1356 (1434 A. D.) There are inscriptions of the chalukyan, chola, Kalinga, and western chalukyan kings and queens, in addition to the innumerable votive offerings of their ministers, generals etc. This wealth of inscriptions help us to solve many a knotty problem, about the political history of this place, during the 11th and 12th centuries A. D.

The name 'Draksharama' is said to be a latter corrupted form of 'Daksha-Arama' or the garden of Daksha Prajapathi. According to the well-known story of the Siva purana, Daksha Prajapathi, had given his daughter, Dakshayani, in marriage to lord Siva. Thinking that he had not been properly treated by that deity, he performed a yagna without inviting Siva. Dakshayani, though uninvited, still on account of filial love, attended it, but found that she was not received and respected properly. In high dudgeon and seething with emotion, she plunged into the fire and put an end to herself. Siva, while he heard it, began to sweat in fury, and out of that sweat, was born Virabhadra, who killed Daksha and thus avenged the insult to Lord Siva. Draksharama, is said to be the seat of that yagna of Daksha. In memory of it, even today, orthodox Brahmins, do not perform any yagna or such ceremonies within Draksharama.

There is yet another story about the origin of the temple. Curiously, there are five temples in Andhra, where the deity is Siva in Lingakara, and the linga is a long vertical, cylindrical pillar, some 20 or 25" high. This peculiar similarity in the 'Akrithi' of the "Moola-Virat", had led some scholars to think that these five temples were originally the seats of Buddhist chaityas, later converted into Hindu shrines, and that in all these cases, the 'Āyaka-Sthambha' of the chaitya, has been used to represent the Linga. There is much force in this argument, when we consider the 'Garbha-griha', of the Amareswara temple in Amaravathi of Guntur District. To this day, Buddhist bricks are seen in the foundations, and inside the Garbha-griha, one sees a lotus-onedallion, in white marble, embedded with plaster and other materials. This clearly proves that the site must have originally been a chaitya, and parts of its ornamentations must have been used in constructing the temple later. A close scrutiny of the "moola-virat" also shows, that it is made of the characteristic white marble stone, from out of which the 'Āyaka-Sthambhas,' are generally made. This is equally true

ములుగను తత్తత్ఖ్యాపకంబులుగను నిట్లు నాలుగువిధం బుల వెలువడెను. ఈ నాలుగువిధంబులగు గ్రంథముల కంటె విస్తృతములగు వ్యాఖ్యానగ్రంథములుగూడఁ బెక్కులు రచియింపఁబడి యున్నవి. ఇట్టి పురుషప్రోక్త గ్రంథముల కన్నను ఈశ్వరప్రోక్తములగు నష్టోత్తరశత తంత్రముల కంటె వేఱగు తరగతిలోఁ దత్త్వభావమునుబట్టి చేర్చ బడియుండును.

ఇట్లు శ్రుతికంటె విలక్షణమగు తాంత్రిక గ్రంథ సముదాయము ఈశ్వరప్రోక్త తంత్రములు, పౌరుష తంత్రములు, వ్యాఖ్యానములు నను విభాగముచే నేడెఁటకు నభివృద్ధిఁ జెందుచున్నవి. ఈగ్రంథములన్నియు సంప్రదాయవిశేషముచే విభాగము నొందింపఁబడినచో శైవ శాక్త వైష్ణవములనెడి మూఁడు తరగతులుగ విభాగము నొందుచున్నవి.

## మతముల పరిస్థితులు

ఇట్లు శైవ శాక్త వైష్ణవ భేదములతో నొప్పు గ్రంథములు పలువిధములుగఁ దెలియవచ్చుచున్నను అట్టి గ్రంథముల నాధారముగఁ జేకొని సంప్రదాయములను ప్రవర్తింపఁ జేయు స్థానములను ఇదమిత్థమ్మని నిర్వచించుటకుఁ దగు నవకాశ మించుకేనియును లేక సంప్రదాయములన్నియును నించుమించుగ విశీర్ణములై ప్రకృతమున భ్రష్టములైనవని చెప్పనొప్పును. ఏది యెట్టులయ్యును శైవ వైష్ణవ సంప్రదాయములను సూచించెడి ప్రజావిశేషములును వ్యవహార విశేషములును సుస్పష్టముగఁ దెలుపు సంప్రదాయములు నిలిచియున్నవి. అందుఁ బాంచరాత్రతంత్రము ప్రధానముగాఁగల్గి ప్రారబ్ధమైన వైష్ణవసంప్రదాయము తెంగలి వడగలి యను భేదముచే ద్వివిధముగా నున్నది. మాధ్వ సంప్రదాయమునకుఁ జెందిన ఉత్తరాదిమఠము, రామ చంద్రమఠము, వ్యాసరాయమఠము మొదలుగాఁగల మఠ సంప్రదాయములును వైష్ణవమునకుఁ దెలియవచ్చుచున్నవి. రామానుజ సంప్రదాయములు శ్రీవైష్ణవమనియు మధ్వసంప్రదాయము వైష్ణవమనియు వాదవిభేదముంబట్టి వ్యవహరింపఁబడుచున్నవి. రామానుజానువర్తులు విశిష్టాద్వైతులనియు మాధ్వులు ద్వైతులనియును వ్యవహరింపఁబడుటయు నెల్లరకును దెలిసినవిషయమే కదా. వైష్ణవులందుఁ దెలియవచ్చు విభేదములవలెనే శైవమందుఁగూడ ద్వైతవిశిష్టాద్వైతభేదము గానవచ్చుచున్నది. ద్వైతవిశిష్టాద్వైత భేదముకంటె భిన్నముగఁ బరమశివాద్వైతమను వాదవిశేషము గూడ శైవులందుఁ గలదు. కాని ప్రకృతమున శైవమునందు సిద్ధాంతవిభేదములను దెలిసికొనఁ దగు నవకాశము లేనందున శైవసంప్రదాయములు సీకాకు నొందియున్నవని చెప్పితీరవలయును. వైష్ణవులకుఁ బాంచరాత్రమట్లు శైవులకుఁ బాశుపతతంత్రము పరమప్రమాణముగా గల్గి ప్రవర్తించిన శైవ సంప్రదాయములన్నిటికినిఁ బ్రధానలింగముగ లింగధారణము పరమ ప్రమాణముగఁ గల్గిన ప్రజలే ముఖ్యలింగములు. పాంచరాత్రోక్త వైష్ణవములకుఁ దప్తశంఖచక్రాదికమెట్లు ఐకాన్తికనియమమో యటులనే పాశుపత తంత్రానుయాయులగు శైవులకు లింగధారణము ఐకాన్తిక నియమ మగుచున్నది. తప్త శంఖచక్రాదిసంస్కారము హేయమని తలంచు వైష్ణవ సంప్రదాయములు గూడఁ గొన్ని గలవు. అట్టి సంప్రదాయములు ప్రకృతమున వైఖానసులనియుఁ గొందరు వల్లభులనియుఁ గొందరుఁ జైతన్యులనియు సుప్రసిద్ధముగఁ దెలియవచ్చుచున్నారు.

ఇఁక శాక్తేయమును గూర్చి యోజించుద మనినచో శైవులట్లుగాని వైష్ణవులట్లుగాని ప్రత్యక్షముగా శాక్తేయులమని వ్యవహరింపు విశేషము దేశమునఁ దెలియవచ్చుటకు నవకాశమించు కేనియు లేదు. శాక్తేయమన్న వామాచారనిష్ఠతో నొప్పారు స్త్రీదేవతారాధకుల సంప్రదాయములు. అట్టి యారాధనము శాక్తప్రమోదమను గ్రంథమున వివరింపఁబడిన దేవతలలో నెద్దానినేని యుపాసించుటయే ముఖ్యముగాఁ గలది. అట్టి యుపాసనము లుపాసకులచే సాధారణముగ మహావిద్యలనుపేర వ్యవహారమును గనుచున్నవి. అయ్యవి ౧. కాళీ. ౨. తారా, 3. షోడశీత్రిపురసుందరీ, ౪. భువనేశ్వరీ, ౫. ఛిన్నమస్తా, ౬. త్రిపురభైరవీ, ౭. ధూమావతీ, ౮. బగళాముఖీ, ౧౦. కమలాత్మికా, ౧౧. కుమారీ, ౧౨. దుర్గా యను దేవతలలో దేనినైనను ప్రధానముగాఁ గల్గియున్నవి. అందులోఁ గాళిని ప్రధానముగాఁ జేసికొని యుత్తరదేశీయులును త్రిపురసుందరిని ప్రధానముగాఁ జేసికొని దాక్షిణాత్యులును దుర్గను ప్రధానముగాఁ జేసికొని సామాన్యముగ నందరు నుపాసించుచున్నారలు. ఇట్టి దేవతోపాసనమును వామాచారవిధానమున నుపాసించువార లెల్లకాలములందును వైదికనిష్ఠాగరిష్ఠులగు శ్రీవిద్యోపాసకులచే ననఁగా భారతీ సంప్రదాయమువారిచే నెల్లకాలములందును వైదికవిదూరులుగఁ బరిగణింపఁబడుచునే యున్నారు. అట్టి నిందనుండి తమ్ముఁ గాచికొనుటకై తమకు వైదికత్వభావమును సంపాదించుకొనఁ గొందరు పండితులు ప్రయత్నములును జేయుచుండుట యొకవింతగాదు. అట్టి యుద్యమము కాశ్మీరమునందు సోమానందునిచేఁ బ్రారంభము సేయఁబడ క్రీస్తుతరువాత పదునెనిమిదవశతాబ్దియందు లలితాసహస్రనామవ్యాఖ్యానమునుగావించిన భాస్కరునితోఁ బూర్తి యయ్యెనని చెప్పవచ్చును. ఈ భాస్కరుఁడనువాఁడు శ్రుతిస్మృతిసదాచారవిరుద్ధములగు దురాచారముల విశే

పములను జొప్పించి యత్యంతము గలుషీకృతమైన యసద్వ్యాఖ్యానము నొకదాని సౌభాగ్యభాస్కరమను పేర లలితాసహస్రనామవ్యాఖ్యానముగఁ జిత్రించియున్నాఁడు. అట్టి యసద్వ్యాఖ్యానమును శ్రుతిస్మృతిసదాచారానుప్రాణితంబగు శ్రీవిద్యోపాసకులు సర్వవిధముల హేయమని త్రోసిపుచ్చి మాచే రచింపఁబడిన "కల్యాణశ్రీకల" యను భాష్యమును" శ్రీగుణనికాదీధితిని" పరమప్రమాణంబులుగ నభ్యసింపుచు నైహికాముష్మికనిశ్శ్రేయసములఁ బడయుదురుగాక ! ఇతి నారాయణస్మృతిః.

## మార్గవ్యవస్థ

శ్రీవిద్యకంటె బిన్నములగు నితరవిద్యలు ప్రాయశః రజోగుణప్రధానములును దమోగుణప్రధానములును. శ్రీవిద్యయన్ననో శుద్ధసత్త్వప్రధానమేయైయున్నను ననుష్ఠాతల యొక్క యంతఃకరణప్రవృత్తిచే సాత్త్వికము రాజసము తామసము అను మూడువిధములుగ భేదము నొంది యున్నది. అయ్యది మఱల వామమని దక్షిణమనియును రెండువిధములు. అందు వామము శూద్రులకును శూద్రసములకును ననుసరణయోగ్యము. దక్షిణమన్ననో ద్విజులకు ననుసరణీయమని హయగ్రీవశిష్యాగ్రణియగు నగస్త్యమహామునిచే శక్తిజిజ్ఞాసయను గ్రన్థమున నాలుగవ అధ్యాయమున నిట్లు నిర్వచింపఁబడియున్నది—

"ఏష దక్షిణః పన్థా బ్రాహ్మణాదీనాం త్రయాణాం తారతమ్యేణోచితః" "శూద్రపాషణ్డప్రభృతీనాం వామః పన్థాః॥" అని ॥ ౬౪ । ౬౫ ॥ ఇట్టి విభాగము శ్రుతిస్మృతిసదాచారప్రమాణానుప్రాణితమగు వర్ణాశ్రమాదిధర్మమునకు సేతుబన్ధము గావున సర్వవిధముల ద్విజులకు నభ్యర్హితము. వామ మన్ననో సర్వవిధముల హేయము.

## వామ దక్షిణ వ్యవస్థాపకవచనవిశేషములు

వామదక్షిణమార్గవ్యవస్థాపకవచనములు జిజ్ఞాసువులకు నత్యంతోపకారములుగా నొప్పును గావున నయ్యది యొకింత ప్రదర్శింపఁబడుసు. అందుఁ బ్రప్రథమమునఁ దంత్రములో మేరుత్వము నొందియున్న మేరుతంత్రమునందలి వచనములు ప్రదర్శింపఁబడుచున్నవి. అవెట్లన—

"వామమార్గ స్తత శ్చాద్యవర్జం హిత్వా ప్రశస్యతే।
ఏషా పద్యా తు సంప్రోక్తా వామదక్షిణయోః పరా॥౧-౧౦౮
గోపితా సర్వత స్త్రేషు కిమన్యచ్ఛ్రోతు మిచ్ఛసి॥౧-౧౦౬
వామదక్షిణభేదేన తేషాం కర్తవ్యతాం శృణు ।
ఆజ్యస్థానే సురాం, వామే హేరామాద్యర్థం ప్రకల్పయేత్।
పాకాదిషు చ మాంసం స్యా చ్ఛిలాదౌ నియమాః
స్మృతాః ॥

మైథునం బ్రహ్మచర్యం న ముద్రా స్తత్కర్మికా
స్తథా ॥ ౨౬-౯
వామమార్గే వేదమన్త్రో వజ్రపాతసమః స్మృతః ।
బ్రాహ్మణానాం వామమార్గో నరకాయైవ జాయతే॥౩-౭౨
యావ న్న మద్యమాంసాగ్ని జన స్తావ దలోలుపః ।
యజ్ఞే తస్మిం స్తన్మనః స్యా, త్క్వ జపః క్వ చ దేవతాః
॥ ౩-౧౦౪
బ్రాహ్మణ్యహానికృ త్తేషాం మద్యం మాంసం చ
మైథునమ్ ।
అబ్రాహ్మణానాం వామమార్గే ప్రవృత్తా స్తైస్తు సేవితమ్।
కాలేన వాథ వామేన సిద్ధ్యత్యేవ న సంశయః॥ ౫-౪౧౪
కల్యంశసంభవై ర్విప్రై ర్వైయ ర్నామ్నా కీర్తితాని తు ।
కలినా ప్రేరితా విప్రా స్తత్తన్త్రపదగామినః ॥ ౫।-౯౧౯
కామలోభాదిభి ర్గ్రస్తా బ్రాహ్మణ్యరహితా నరాః ।
మ్లేచ్ఛా స్తే తు భవిష్యన్తి క్షీణపుణ్యాశ్చ రౌరవే॥౫-౯౨౦
యే నరాః కులసంశుద్ధాః కల్పోక్తేనైవ సంస్కృతాః ।
తే చే న్నిపతితా వామే పాతకం కి మతః పరమ్॥ ౭-౨౦-౯
పఞ్చలక్షణసంయుక్తో బ్రాహ్మణః కాల ఏవ సః ।
అహం బ్రహ్మా తథా విష్ణుః తస్యాజ్ఞా వశవర్తినః॥ ౧౦-౪౭
స చే ద్వామపథం ప్రాప్తః పునః శ్వా చాపి జాయతి ।
శూద్రాది యవనాన్తానాం సిద్ధి ర్వామపథే స్థితా ॥ ౧౦-౫౩
మద్యమాంసం సురాపానం మత్స్యస్త్రీబాన్ధవాః స్థితా ।
అనేకే యత్ర జాయన్తే తత్ర వామోగతిప్రదః ॥ ౧౦-౫౯
స్థిత్వా తు దక్షిణే మార్గే గుప్తభుక్తం పలాదికమ్ ।
స యాతి నరకం ఘోరం విష్ఠాయాం జాయతే కృమిః ॥
సర్వకర్మవిహీనా యే వర్ణాశ్రమవివర్జితాః ।
కౌలే వా వామమార్గేతే భుక్తిముక్త్యోశ్చ భాజనమ్ ॥
గురూపదేశరహితా మహాన్త ఇతి కేచన ।
మోహయన్తి జనా న్కేచి త్స్వయం పూర్వవిమోహితాః॥
పేయం మద్యం, పలం ఖాద్యం, సమాలోక్యం
ప్రియాసుఖమ్ ।
ఇత్యేవాచరణం ప్రోక్తం పామరాః ప్రవదన్తిచ॥ ౧౦-౭౨
మద్యపానేన మునయో యది సిద్ధిం లభన్తి చేత్ ।
మద్యపానరతా స్సర్వే కిం సిద్ధా న భవన్తి వై॥౧౦-౭౩
మాంసభక్షణమాత్రేణ యది పుణ్యా గతి ర్భవేత్ ।
క్రవ్యాదానాం తదా మోక్షో మాంసా దన్య న్న భుంజతే ॥
స్త్రీసంభోగేన భో దేవాః యది ముక్తిః ప్రజాయతే ।
తథాపి సర్వేపి ముక్తాః స్యుః, కస్య జన్మ భవిష్యతి ॥
తస్మాద్విప్రో హి రాజన్యో వైశ్యశ్చ న సురాంపిబేత్ ॥
సురాదర్శన మాత్రేణ కుర్యా త్సూర్యావలోకనమ్ ॥
౧౦-౬౦

# వి ష్ణు తి ల క ము

(పూర్వతో ఉనువృత్తము)

శ్రీ వేదాల తిరువేంగళాచార్యులుగారు

పూర్వమును అట్టి రుద్రుడు ప్రపంచమును నిర్మించెనని నీవు తెల్పితివి. అందువలన నది యెట్లో తెలియవలెనను కౌతుక గల్గినది. మాయందు అనుగ్రహ మున్నయెడల తెల్పుము.''

### ప్రజలు దీర్ఘాయుష్మంతులు

అత్రిమాటను విని బ్రహ్మ నవ్వుచు నిట్లనియెను ''ఓ ఋషీ ! ఈ రుద్రుఁడు పూర్వకాలమున నగ మూడు రూపుతో నుండెను. సృష్టించుటలోని కుతూహలముతో నపుడు ప్రపంచమును సృజించెను. ప్రజ లందరును దీర్ఘాయుష్యులు. లోకము లన్నియు వారితో నిండిపోయినవి. సముద్రములతోను, అడవులతోను అనలే బరువుగానున్న యీ భూమి, యీ ప్రాణుల బరువును మోయఁజాలక పోయెను. అపుడు దేవతలు నన్ను వేడుకొనిరి. ''ఈ భూమి బరువు మోయలేకున్నది. నీటిలో మునిగిపోవును. ఓ దేవతా ప్రభూ! కాపాడుము. ఆకాశము కూడ ప్రాణులతో నిండి యిరుకై పోయినది.''

అని దేవతలు ప్రార్థింపఁగా, వారిని ''భయముపడ వలదు'' అని చెప్పి నేను, మేరుగిరిశిఖరముచివర భగవంతుని ధ్యానించుచు కూర్చొనియుంటిని.

### రుద్రుడు ప్రాణులను తినుట

అపు డొకగొప్ప తేజము నా కనులు మూతపడునట్లు మెరయుచు,చూచుచుండగా నేనాకుపచార మొనర్చుచున్న శివునియొద్ద కరుదెంచెను. అది అతని బ్రహ్మరంధ్రము గుండా అతనికుక్షిలోనికి జొరబడి అటనున్న పార్థివమగు భాగమును, అంతను గాల్చివైచుట కుపక్రమించెను. అపు డీరుద్రుడు, ఆకలి తనను మిక్కిలి బాధించుచుండగా ''నేనేమి చేయుదును ? ఈ యాకలి నెట్లు చల్లార్చుకొందును? ఏమిగతి?'' అని యార్తుడై యేడ్చుచు దీనుడై మేరువుకొండమీది చెట్లను గూడ పెరికి తిన నారంభించెను. అట్లుపట్టి చెట్ల నన్నిటిని దినినను లోని మంట అణగిపోవక పోగా, పసుజాతులను భక్షించెను. అందువలన భూదేవి బరువు తీరి శరీరము తేలికపడి సుఖముగా నుండెను. రుద్రుడు, ఈ భూమిమీద ప్రాణు లేమియు నగుపడకపోగా నాకనమువంక జూచెను. అట దేవత లగుపడిరి. ఆ యాకసమునం దున్న వారిని దిన మొదలిడెను. వారిలో అమృతమును దిన్నవారు రుద్రుని కడుపులోనికి పోయి జీర్ణముగాక కాలాగ్నులవలె వెలుగుచు నతనిపాయువు గుండా బయటకు వెడలి వచ్చిరి. అమృతము దిననివారు మాత్రము రుద్రుని కడుపులోనికి పోయి జీర్ణమైపోయిరి.

ఓ మునీశ్వరులారా! దేవలోకమునకు గల్గిన యీ కష్టము నంతను యముడు చూచెను. పాతాళాదిలోకములం దంతటను పశుజాతులన్నియు దిని వేయబడినవి. ఇవియన్నియుఁ జూచి యతనికి మిక్కిలిభయము కల్గినది. జగముల నెందును అడ్డులేక యిట్లతితీవ్రముగానున్న శివుని జూచి,దక్షిణదిక్కునేలు నాపరేతరాజు నాయొద్దకుపరువెత్తి వచ్చెను. నన్నే శరణుఁజొచ్చెను. మాటిమాటికి నన్నే స్తుతించెను.

### యముడు బ్రహ్మను ప్రార్థించుట

''ఓ పరంధామా! నీవు భక్తుల బాధలను హరించువాఁడవు కదా ! అంతయును సృజించిన తండ్రివి కదా నీవు ! ఓ ప్రభువా ! నిన్నే శర ణొందితిని. నాకు నీకన్న వేరే గతి లేదు. ప్రాణు లనేకములు నశించిపోయినవి. యమునింటికి చేరినవి కూడా ! అన్ని లోకములందు నుండెడి వారు అందరును నన్ను ఇరుకు పెట్టుచున్నారు. వా రందరూ అచట నుండుటకు చోటు చాలలేదు. అంతేకాక ఊపిరి పీల్చుటకు గూడా అవకాశములేదు. ఇక నితర కార్యముల విషయ మేమని చెప్పవలయును? ఓ జగన్నాథా! నా లోకములో రాకపోక లాగిపోయినవి. అచట వారందరు నొకచోట చేరుటవలన నొకరితో నొకరు సంఘర్షణ పడుచున్నారు. వారిని శాసించుటకు నాకు శక్తి చాలదు. నిన్నే శరణు జొచ్చితిని.''

యమధర్మరా జిట్లు దైన్యముతో వేడగా, ఆతని ననేకవిధముల నాశ్వాసించి నేను నామానసయాగముతోనే (ఏకాగ్రమగు ధ్యానముతోనే) శ్రీ వాసుదేవుని సంతసింపఁజేసితిని. శివుని బ్రహ్మరంధ్రమునుండి (అవెనుకప్రవేశించిన) తేజస్సు బయటికి వెడలి వచ్చెను. శివునియెదుట బొటనవ్రేలంతటి పురుషుడుగా నయ్యెను, అపుడు ఆకలినుండి విడువబడి ఆ శివుడు తనయెదుటనున్న పురుషుని జూచి నమస్కరించి యడిగెను.

### శివునకును పురుషునకును సంవాదము

''ఓ పురుషోత్తమా ! నీ వెవరవు ? ఈ లోకమునంతను నిట్లు తల్లక్రిందు లొనర్చిన యీ యాకలి నా కేల కలిగెను?

నే నేమి యపరాధ మొనర్చితి నని యీయాకలి నన్ను ఇంత యెక్కువగా బాధించినది?'' ఇట్లడుగగా నాపురుషుడు శంకరునితో నిట్లని పలికెను. ''నీ యపరాధ మే మున్నది? భూమి ప్రజలబరువు మోయలేక బాధపడినది. ఆ బరువు తొలగించుటకై యా ప్రజాపతి యాలోచించుచున్నాడు. అతనిసంకల్పము నెరవేరుటకై నీ కాకలి నుద్భోధించునట్టి తేజస్సు నైతిని. నీ యాకలివలన ప్రజలు నశించిరి. భూమికి బరువు తొలగినది.

(శివుడు రుద్రుం డగుటయు మృత్యువు బ్రహ్మలిపియు సంహార సాధనములు)

నీవు ప్రజలవిషయమున నిట్లు క్రూరమైన పనిని (సంహారమును) జేసితివి కనుక దేవతలు నిన్ను రుద్రుడని యిక ముందు పిలుతురు. ఇకమీద నీవు సంహారము నొనర్పుము. ప్రాణులకు కాలము దీరినపుడు వారిని సంహరింపుము. ప్రలయాదికాలములందుకూడ ప్రాణులను సంహరింపుము. బ్రహ్మవ్రాసిన వ్రాతకారణముగా నీవు ఈ ప్రాణులను సంహరించుటలో మృత్యుదేవత నీకు సాధనముగా నుపయోగింపగలదు. ఆసమయములలో నీ హృదయమునందును కుక్షిలోను ఆకలి నుద్భోధించుచునే నుందును.''

అని చెప్పి యా పురుషుడు బడబమొగమున బ్రవేశించెను. అదివరలో శంభు వనబడుచున్న యీతడు, అది మొదలుకొని 'రుద్రుడు' అను పేరున బెద్దలచే బిలువబడును. అన్నిజంతువులను, వానిమునలితనమున మృత్యువుతో గూడి యితడు సంహరించును. నేను ప్రాణుల మొగమున వ్రాసిన వ్రాతలక్రమమునుబట్టి మృత్యువుతో గూడి యీతడు తాను సంహరించును.''

ఈ బ్రహ్మమాటను విని అత్రిమనసునకు సంతృప్తి కలిగెను. మాటలాడుటలో నేర్పు కలవాడు కనుక అతడు తిరిగి మరొకమాట నడిగెను.

''ఓ ప్రజాపతీ! పరబ్రహ్మ నిత్యమనియు, ఈ జగత్తు నిత్యమనియు నీవు తెల్పితివి. ఉత్పత్తి లయము అనునవి ఈ జగముయొక్క రూపములు. అవి దీని సంకోచము, వికాసము నంటివి. పంచభూతములు నైకవిధముగా బరిపాక మొందుటచే బ్రాణులకు దేహ మేర్పడు నంటివి. పురుషు డందు ప్రవేశించుటవలన దేహమునకు బ్రాణ మేర్పడు నంటివి కదా! ఈ పురుషు డెవరు? దేనినుండి కల్గినాడు? ఇతని నడవడి యెట్టిది? దేనివలన నితడు లయ మొందును? ఈతనిరూప మెట్టిది? దీని వాస్తవ మేమో స్పష్టముగా తెల్పుము.''

ఇ ట్లడిగిన యత్రికి బ్రహ్మదేవు డిట్లు జబాబు చెప్పెను.

### జీవుడు

''జీవుడే "పురుషుడు" అని చెప్పబడును. అతనిస్వరూపము చిత్తు అనగా జ్ఞానము. అతడు స్వయముగానే వెలుగొందును. కాని మరొకరి సహాయమున వెలయ జనిలేదు. అతడు పరిశుద్ధమైన స్ఫటికమువలె వెలుగొందును. అతడు లయ మొందడు పరబ్రహ్మ యెట్లు నశింపదో, నిత్యమో, ఈ జీవుడును, అట్లే నశింపడు. నిత్యుడు. ఒకదీపమునుండి మరొకదీపము పుట్టి వెనుకటిదానికన్న గూడ బాగా పెద్దగా వెల్గునుకదా! చెట్టునుండి యొక కొమ్మను నరకి చక్కగా నేలను బాతినచో నది చాల చిలవలు పలవలు వేసి, చివురులు, పూవులు, పండ్లు, వీనితో విలసిల్లును కదా! అట్లే యీ జీవనస్థానమంతయు దేహము ననుసరించి వెలయును. (శరీరము నశించునపుడు) ఈ పురుషుడు లయ మొందక దేహము నాశ్రయించి అతనికి శేషముగా నగును. ఈ జీవుడు మాయవలన దిరోధానమొంది దేహములందు దిరుగుచుండును. కొంతకాల మిట్లు గడువగా దేవు నారాధించి యెక్కువగా తప మొనరించుటవలన పరవాసుదేవుని కృప కలిగి యీమాయను దాటగల్గుటకూడ సంభవించును. ఆ పరబ్రహ్మ నారాధించి దానినే శరణుంజొచ్చినచో ఈ శరీరము నశించిన తరువాత పరబ్రహ్మయందు లీన మగును. ఆ పరబ్రహ్మను సాక్షాత్కరించుకొనుటయే చేయవలసిన పని. అతనికన్న ఇంకొక గతి లేదు. సుఖమును దుఃఖమును సమముగా జేసికొని శీతోష్ణముల నోర్చుకొనుచు పరమమగు నాబ్రహ్మమును ధ్యాన మొనర్పవలెను. దానివలన శరీరావసాన మొందునపుడు పరమాకాశమైన పరబ్రహ్మయందు తనంతటనే లీన మగును. ఈ జగ మంతయు పరబ్రహ్మయం దెట్లుండునో అట్లే యీ జీవుడుగూడా అచ్చట నుల్లాసముతో నుండగల్గును. కనుక నతనికి లయములేదు.''

ఇట్లు చెప్పిన బ్రహ్మ పలుకులు విని చ్యవనుడను ఋషిశ్రేష్ఠుడు శరీరము వణకుచుండగా బ్రహ్మ నిట్లడుగ మొదలిడెను.

''దేవదేవా! ఓ జగన్నాథా! దక్షిణదిశ కధిపతియైన యముడు నిన్నే శరణు జొచ్చెను కదా! విపద్గతిమీద యింటి కేగెను?'' ఆమాట విని భగవానుడగు బ్రహ్మ యిట్లు జవా బిచ్చెను. ''లోకములందంతటను ప్రాణులు నశించి యమధర్మరాజు నగరి కేగిరి. అటనుండి వేరు దేహముల ధరించి అక్కడక్కడ తిరిగిరి. [అందువలన నట సంకటము దీరగా] యముడు (తనంత తానే) తిరిగి తనలోకమును బాలించుట కేగెను.''

ఆమాట విని కౌశికు డిట్లడుగుట కారంభించెను. ''శివుడు ఇదివరలో ప్రాణులదేహములను దినెనుకదా! అతడు వానిని తనకడుపులో నెట్లుంచుకొనగల్గెను? అవి

మాంసము, ఎముకలు, తోళ్ళు, ఇవి గుట్టలు కదా! ప్రాణి పుట్టి, అటునుంచి పెరుగును, పిమ్మట మరణ మొందును. పుట్టినప్పుడు ప్రాణి చిన్నదిగా నున్నను క్రమముగా నతని దేహము పెరుగును. చచ్చినపుడు ఇంకను శరీర మబ్బగా లావై యుండును కదా! ఇవేతీరున నీ భూమిలో చాల జంతువులు మరణించుచుండును. ఆ శరీరములు కన్పడవు. భూమియు పెరిగినట్లు కన్పడదు. ఇదియంతయు నెక్కడ అణగి యున్నది? ఓ చతురాననుడా! నా కావిషయమంతయు స్పష్టపరుపుము."

బ్రహ్మ, యామాటను విని సమాధానము నుడువ నారంభించెను. "ప్రాణిశరీరములోని తేజస్సు పోవగానే పృథివీ భాగము పృథివితోను, నీటిభాగము నీటితోను, వాయువు వాయువుతోను, ఆకాశము ఆకాశముతోను అక్కడక్కడ లయ మొంది దేహము ఏమియు లేకుండ పోవును. పుట్టుటకు పూర్వ మెట్లుండెనో, చనిపోయినతరువాతగూడా అంతే. అయిదు భూతములును [పృథివ్యాపస్తేజోవాయురాకాశములు] వీడిపోగానే శరీరము శూన్య మగును. కనుక, పరమేశుడగు శివుని కుక్షిలోని ఆప్రాణుల శరీరము పరమపురుషాగ్నిచేత నపుడు దహింపబడెను. జీర్ణమయ్యెను. ఏమియు మిగులలేదు."

## మోక్షోపాయము

ఈమాటను విని మునిశ్రేష్ఠుడగు శౌనకుడు విశేషముగా తెలిసినవాడు గనుక అందరికిని రుచించునట్లుగా పరమేశ్వరుడగు బ్రహ్మ నిట్లడిగెను :—"ప్రాణులు మోక్ష మొందుట కేయుపాయ మెక్కుడు కష్టములేకుండ సాధింపనగును? ఏది జగములను అనుగ్రహించునది? నీవే దాని నుపనుపదేశించుటకు తగుదువు." సభామధ్యమున శౌనకయోగి ఇట్లడుగగా విశ్వస్రష్ట యగు బ్రహ్మదేవుడు వశిష్ఠుని క్రేగంటజూచి నవ్వుచు నిట్లనెను. "ఓ శౌనకయోగీ! నీవు తపోధనులగు ఋషులలో శ్రేష్ఠుడవు. నీ వడిగిన దత్యంతగోప్యమయిన విషయము. అయినను నీ కుపదేశింతును.

## ప్రపత్తి

పరమేశ్వరుని గూర్చిన ప్రపత్తియే శ్రేష్ఠమయినది. అదియే మోక్షోపాయము సులభముగా దొరకుటకు గతి. ఆపరమపితనే శరణొందుడు. మరొకరిని మనసునందు పెట్టుకొనకుడు. పంచరాత్రమున చెప్పిన మార్గమున నా పురుషు నర్చించుము. ప్రపన్నుడగువానిని భగవంతుడు రక్షించును. ఈవిషయములో విచారణ యక్కరలేదు. ఈవిషయమున ఆ పురుషోత్తముడు తప్ప మరియొక ఉపాయము ఏదియు లేదు. కనుక సనాతనుడగు నా పరబ్రహ్మను శరణొందుము. పరమాత్మను గూర్చి చక్కగా ప్రపత్తి యొనర్చి శేముడగువాని పాపములన్నియు తొలగి పోవును. ఆజీవుడు శరీరము తొలగగానే పరబ్రహ్మను పొందితీరును."

బ్రహ్మ యీమాట చెప్పగానే మునిపుంగవుడగు శాండిల్యుడు తానే దోసిలి పట్టి బ్రహ్మను అడుగ నారంభించెను.

## పంచరాత్రము

"పంచరాత్రమునందలి సంహితలు అనేకభేదములుగా నున్నవి. అవి ఒకదానితో నొకటి విరుద్ధముగా నుండును. అందువలన నొకనిష్ఠ (నిశ్చయ) మేర్పడు నవకాశము లేదు. అట్టియెడ దానిని బట్టి దేవు నర్చించుట కవకాశమేది? వేదముల నన్నింటిని అధ్యయన మొనరించితిని. వేదాంగములను నేర్చుకొంటిని. ఉపనిషత్తుల నేర్చితిని. నాకు నిష్ఠ కుదురలేదు. పంచరాత్రమును అధ్యయన మొనరించితిని. నా మనసునకు తృప్తి గలిగించగల యంతటి నిష్ఠ యీపంచరాత్రమున గూడ లేదు. కనుక నింతకన్న గొప్పగా విలసిల్లు మరొకదానిని ఉపదేశించుమని నిన్ను ప్రార్థించుచున్నాను. పంచరాత్రములోని వాక్యములు కోటిన్నరలెక్క నున్నవి. కాని యవి యన్నియు నొకదానితో నొకటి విరోధించును. ఇచట నిష్ఠ కుదరదు. కనుక నీలోకు లందరు ఈవిషయము నెట్లు జక్కగా తెలిసికొనగల్గుదురో, వారికి ముక్తి కరతలామలక మెట్లగునో అట్లుపదేశ మొనర్చుము.

అని యిట్లు మహానుభావుడగు శాండిల్యుడు అడుగగా బ్రహ్మదేవుడు పంచరాత్రమును సమగ్రముగా నుపదేశించుటకు ఆరంభించెను.

"యోగులలో మేటివగు నోశాండిల్యుడా! నీవు పంచరాత్రమున నెక్కుడు పరిశ్రమ మొనరించితివి. నీ వడుగునది దానియందే యున్నది. కనుక పంచరాత్రమును నీకు స్పష్టముగా బోధపరతును. నీవు న న్నడుగునది పంచరాత్రమే. కనుకనే దానిని నీ కుపదేశింతును.

## పంచరాత్రము కోటిన్నర లెక్క గలది

కోటిన్నర లెక్క గల్గియున్న పంచరాత్రపుమాటలను గూడ అధ్యయన మొనర్చి భగవంతుని తన్మయతతో నర్చించుచు నే నానందమును ననుభవించితిని. ఋషుల కుపదేశించితిని. వ్రతములను జక్కగా నడిపిన మునులు నాయొద్దనుండి పంచరాత్రమును సరిగా తెలసికొనిరి. శ్రీమహావిష్ణువునే పూజించుచు వారందరు తమ శిష్యుల కుపదేశించిరి. (సశేషము)

# తంత్రాలోకము

(పూర్వాత ఉనువృత్తము)

ఏమ్మ-యశక మాధవరామశర్మ

శ్లో॥ గురో ర్లక్షణ మేతావ దాదిమాంత్యం చ వేదయేత్।
పూజ్యః సోఽహ మివ జ్ఞానీ భైరవో దేవతాత్మకః॥

మొదలు తుది గుర్తించువాడె గురువు. గురులక్షణ మిదియె. ఆతడు పూజ్యుడు. నావలె నాతడు పూజ్యుడు. జ్ఞాని, పరశివభట్టారకుడు. "అహం"లోని యాదిమ మ కారమును అంత్య హకారమును గుర్తించిననే మంత్రచేత నత సమావిర్భావము పొందును. శ్రీమదభినవగుప్త డహంప్రత్యయుడు. ఆదిమాంతవేది. సోహంజ్ఞాని, దేవ తాత్మకుడు.

ఇది యిప్పటికి ప్రథమాహ్నిక తత్వసారము. ఇం దిది నిర్గలితార్థము. పరమశివుడు మాయాశక్తి పేరిట స్వస్వాతంత్ర్యమున స్వాత్మను సంకుచితముగ నవభాసింపఁజేయును. మలావరణమున భిన్నముగ, లీలచే నటుడువలె నగును అజ్ఞానమె బంధహేతువు. అణువగు సాధకునకు జ్ఞానావాప్తి నిరుపాయము సోపాయమని రెండు విధములు. సోపాయప్రాప్తి శాంభవము–శాక్తము–ఆణవమని మూడు విధములు. వీని సమావేశమున స్వస్వరూపసమావేశ మార్గ ప్రవేశము లభించును.

అజ్ఞానవిరోధకమగు సజ్జ్ఞానము మోక్షకారణము. అజ్ఞానము బుద్ధిగతమని పౌరుషమని రెండు విధములు. అదియే సంసార మూలకారణము. దీక్షచే నజ్ఞానము నివర్తించును. బుద్ధినిష్ఠమయిన జ్ఞానమె ప్రధానము. పరమేశ్వరభాషిత శాస్త్రపూర్వకజ్ఞాన ముపాదేయము. పరమేశ్వరశాస్త్రము సర్వవిమోచకము. సోపాయసమావేశము త్రివిధము, అదియె శాంభవాది విధానము. అనుపాయ సమావేశము శివరసము. ఇదిగో శివరసము!

శ్లో॥ ఆత్మా ప్రకాశవపు, రేష శివః స్వతంత్రః
స్వాతంత్ర్యనర్మరభసేన నిజం స్వరూపం
సంఛాద్య య త్పునరపి ప్రథయేత పూర్ణం
తచ్చ క్రమాక్రమవశా దథవా త్రిభేదాత్॥

ఇది ప్రథమాహ్నికము

---

## అనుపాయస్థితి

ఒకానొకనికి స్వయంసిద్ధముగా శక్తిపాత ముండును. ఆతని దది దృఢశక్తిపాతము. అట్టివాడు స్వయముగ సువివేచన మొనర్చును. గురువచన మొక్క పరిమాత్ర మవధరించును. ఇక నాతని కుపాయ మపేక్షితము కాదు. గురువచనమె సర్వస్వ మిచ్చినది. అది సంప్రదాయ విజ్ఞాన సర్వస్వము. వా డుల్లసిత నిత్యప్రతిభుడు. వాని సమావేశము నిత్యోదితము. తర్కమె యోగాంగమని యాత డెట్లు వివేచన మొనరించు నని మన మను కొందుము.? పరమేశ్వరుడు స్వప్రకాశరూపుడు, స్వాత్మ. స్వాత్మ కుపాయము లేల? వానిచే నగునది యేమి? స్వరూపలాభము నిత్యము. సర్వదా యున్నది. నిత్యమున కుపాయ మక్కఱ లేదు. జ్ఞప్తి స్వయంప్రకాశమానము. అదియు నుపాయముల కా నవసరము లేదు. ఆవరణ భంగమందురా? ఆవరణ మెక్కడిది? అది యెవరికి గలదు? స్వప్రకాశ పరమేశ్వరున కావరణము సంభవించునా? అనుప్రవేశము సంవిద్గర్భప్రవేశ ముపాయ సిద్ధ మగునని కొంద రనుకొందురు. అనుప్రవేష్ట కతిరిక్తముగ ప్రవేశింప దగినది యేదియు లేదు గదా! కావున స్వరూపసిద్ధికై యుపాయము లక్కఱ లేదని సారము. స్వరూపలాభము, జ్ఞప్తి, ఆవరణవిగమము, అనుప్రవేశము అనునివి యేవియు నుపాయముల గలుగునవి కావు. ఉపాయ మనునదియు వ్యతిరిక్త మేని యుపపన్నము కాదు. ఈ సమస్త మొక్కటి చిన్మాత్రతత్త్వము. ఇందు కాలకలనము లేదు. దేశపరిచ్ఛేదము లేదు. ఏ యుపాధియు దీని మ్లానపెట్టదు. ఏ యాకృతియు దీని నియంత్రితము చేయ జాలదు. ఏ శబ్దము కాని దీని సందేశింప లేదు. ప్రమాణము లేవి కాని, యెన్ని కాని దీని ప్రపంచింప జాలవు. కాల దేశోపాధ్యాకృతి శబ్ద ప్రయాణము లన్నియు దీననే స్వరూపలాభము కల వయినవి. ఇది యిది. ఇది స్వతంత్రము. అనందఘనమగు తత్త్వము. అదియె "అహం" పదవాచ్యము. "నా యం దీ విశ్వ మంతయు ప్రతిబింబితము." అని దృఢముగ వివేచనము చేయు వానికి ఈ పారమేశ్వర సమావేశము నిత్యము కలుగును. ఇట్టి యిది నిరుపాయము. ఇందు మంత్రము లేదు. పూజ

యున్నది లేదు. ద్వైత మవసరము కాదు. ఆచరణ మపేక్షితము కాదు. "ఇది యగును. ఇది కాదను" నియంత్రణ పెట్టుటయు నిందు లేదు. ఇందున్న దేదియు లేదు. లేనిదియు లేదు.

శ్లో॥ ఉపాయజాలం న శివం ప్రకాశయేత్
ఘటేన కిం భాతి సహస్రదీధితిః ?
వివేచయ న్నిత్థ ముదారదర్శనః
స్వయంప్రకాశం శివ మావిశేత్ క్షణాత్ ॥

ఏ యుపాయమును శివుని ప్రకాశింపజేయ నేరదు. కుండవెచ్చె భాస్కరుని భాసింప జేయునా? ఇట్లు వివేచన మొనరించు నుదారదర్శనుడు స్వయంప్రకాశమాను డగు శివుని క్షణమున ప్రవేశించును. ఎచ్చటెచ్చట నేది స్ఫురించునో యది సకలము విమలామల పరమేశ్వరుడే. పరమార్థముగా నది యంతయు నాత్మ. ఇట్లనవరత మనగతము చేసికొనినచో నిక వలయునది లేదు. ఇంతకన్న చేయదగినది లేదు. ఇది యనుపాయస్థితి. "గురువచన ముపాయము కదా?" అను సంశయము తలయెత్త నక్కఱలేదు. అది యేమంతటి యుపాయము ? ఈ యనుపాయస్థితి యనుదరకన్య. కన్య కుదర మున్నది. కాని లేదు. ఈషదర్థమున నున్నది. గురు ప్రతిబోధన మీషత్కరము. అందుచే నది యుపాయము కాదందుము ; ఉపాయము కా కున్నను అది యావశ్యకము. అదియే సంప్రదాయరక్ష.

ఆణవాద్యుపాయములం దుత్తరోత్తర ముత్కర్ష యున్నది. అనుపాయస్థితి సర్వోత్కృష్టము. ఉపదేశాదిక మిం దపేక్షితము కాదు. అంతియే కాదు. సిద్ధదర్శనాదులును ఇం దక్కరలేదు.

శ్లో॥ సిద్ధానాం యోగినీనాం చ దర్శనం చరుభోజనం
కథనం సంక్రమః శాస్త్రే సాధనం గురుసేవనం ॥

సిద్ధపురుషుల దర్శనము కొందర కుపాయము. ఒకానొక మహనీయుని దర్శనము సాధకునకు సమావేశగతి నిచ్చును. అంతమాత్రమున నాతడు సాధనపథ విహారి కాగలడు. మరికొందఱకు యోగినీదర్శనము సిద్ధిప్రదము. దేవీయాగపాత్ర యందలి యమృతప్రాశనము కొందర కిష్టప్రదము. ఒకప్పుడు వాగ్దేవతావతారు డేమేని చెప్పును. అది చాలును. ఇక నన్య మక్కర లేదు. ఒకానొక విశిష్టుడు నిశితప్రజ్ఞుడై శాస్త్రమున బుద్ధిసంక్రమము పొందగలడు. అప్పు డట్టె యాతడు సాధకు డగును. ఒక డొకడు శనైశ్శనైః సాధన ముపక్రమించి లక్ష్యగామి యగును. ఒక్క సంప్రదాయశీలి గురుసేవనము చేయును. చర్యారహస్యము గుర్తించును. సాధన మవలంబించును. ఇవి యన్నియు నుపేయప్రాప్తి కుపాయములు, అనుపాయస్థితికున్ని యుపాయములు నపేక్షితములు కావు. గురుప్రతిబోధ మొక్కపర్యాయము చాలును. అంతియు చాలును. పునఃపున్యమున నుపాయానుభవము కూడ వలదు. ఆణవాద్యుపాయములలో గురుదేశనాదులను మాటిమాటికి భావింపవలసిన యావశ్యకత యున్నది. అట్టి భావనమె యుపేయప్రాప్తి గూర్చును. ఇందట్లు కాదు. ప్రాప్తవ్యము ప్రాప్తము కాగా నిరర్థకము లాయాసకారులు భావనాదులేల ?

" ఉపాయై ర్న శివో భాతి, భాంతి తే తత్ప్రసాదతః "

ఉపాయములచే శివు డవభాసింపడు. శివప్రసాదమున నుపాయములు భాసించును. ఇట్టి యిది యనుపాయతత్త్వము. లోకమతులు కొందరంతఃప్రుపాయములు కావలె నందురు. అనుపాయప్రకాశు లయిన మహానుభావుల కుపాయము లేల ? శాస్త్రములు వారిని శాసింపవు. వారి నుద్దేశించి శాస్త్రములు ప్రవర్తించుటయు లేదు. " తత్త్వజ్ఞస్య తృణం శాస్త్రం " ఇక శాస్త్రాధికారి యెవ డందురు కాబోలు !

శ్లో॥ సంసారాంబునిధిం యః స్యాత్ తితీర్షుః కశ్చి దుత్తమః
నాత్యంత తజ్ఞో నో మూర్ఖః సోఽస్మిన్ శాస్త్రేఽధికారవాన్॥

సంసారసాగరము తరింపవలెనని తలచువాడు శాస్త్రమునం దధికారి. అత్యంతము తత్త్వము తెలిసిన వా డధికారి కాడు మూర్ఖుడు నధికారి కాడు. ఆరురుక్షువులు శాస్త్రైక దివ్యచక్షువులు సంప్రాప్తశక్తిపాతుల కేమేని యుపాయము చెప్పుట యుక్తము. వారల కుపాయము లేక ఉపేయము లభింపదు. భారము మోయలేని దుర్బలమనస్కులగు కొందరు సుకుమారమతులు "మేము మాయా సపడలేము. అల్ప ముపాయాంశ మేదేని యుపదేశింపుడు. సుఖ ముపాయమున నుపేయము పొందుదుము" అన జూతురు. వారల కిది యౌషధి. ఆ విజ్ఞానవిభురూపము అనుపాయాదిభేదమున చతుర్విధము కదా ? అది యంతయు పరమేశ్వరుని స్వాతంత్ర్యము. దానిచే నాత డుపదేశ్యరూపమున స్ఫురించును. తదనుసారమున నుపాయవైచిత్ర్య మేర్పడినది. విభు వాతడు నిత్యోదితుడు. అప్రచ్యుతప్రాచ్యస్వరూపుడు. నిర్మలాత్మకులు తీవ్రతీవ్రశక్తిపాతానువిద్ధులై వికల్పకలంక విముక్తులై యనుపాయాత్మసంవిదావేశము పొందుదురు. ఇందు క్రియాయోగ మన్నదేదియు లేదు. ఆ యనుపాయసంవిత్తత్త్వమున గలుగు సాధనమును లేదు. సంవిత్తత్త్వము స్వప్రకాశము. అదియే లేకున్న విశ్వవిశ్వ మప్రకాశమగును. బాహ్యాభ్యంతరము లేయుపాయము లయినను దానినె యనుసరించును. సంవిద ధీనసిద్ధికము లయిన యివి అం దుపాయములు కాజాలవు.

శ్లో॥ త్వ్యబాపదానాని పను కస్య నామ ధత్సే ఉపధానం
విచిను! స్వయం తత్
పూర్ణే ఉవధానే స హి నామ యుక్తం నాపూర్ణ మప్యేతి
చ సత్యభావం ॥

పే ముపదేశించు దీని స్వయము చక్కగ పరామర్శించు టయె యుక్తము. అవధాన మని యేకాగ్రత యని యిం దేదియు లేదు. పరిపూర్ణమునం దవధానమున్న దే మున్నది? అపూర్ణావధానము సత్యభావ మిచ్చునా? చిత్త మొకచో చిక్కబట్టుట యవధానము కదా! అంతయు సంవిదాత్మకము కాగా నియతావధాన మేమియు నుండదు. ఈ స్థితి కన్న నితరములగు నవి యన్నియు నవధాన ప్రాణము లయిన భావనలు. ఈ పూర్ణము నం దవి కుదు రవు. కొందరేమో యనుసరించి యది యొక యుపాయ మని భావింతురు. అది వారలకు సూర్యుని జూపు మెఱుగు వురుగు.

శ్లో॥ అపరోక్షే భవత్తత్త్వే సర్వతః ప్రకటే స్థితే
యై రుపాయాః ప్రతన్యంతే నూనం త్వాం న విదంతి తే ॥

శివా! నీ తత్త్వమంతట ప్రకటము నిత్యసాక్షాద్భూతము ప్రత్యక్షమై యుండగా, ఉపాయములని కొన్నిటి విస్తరించు వారు నిన్ను నిశ్చయముగ తెలియలేరయ్యా! ఈ బాహ్యాంతర మంతయు శివవపువె. నీలపీతము లేవియయినను శివ ప్రకాశమె. పరమాద్వైత మయిన యీ ప్రకాశాత్మలో నితర మెమున్నది. ఉపాయ మది, ఉపేయము నది. ఇది ద్వైత మని యిది భేదమని యిది యద్వైతమని యందురు గాని సర్వము ప్రకాశవపు వయిన యా పరశివుడే.

శ్లో॥ అస్యాం భూమౌ సుఖం దుఃఖం బంధో మోక్ష శ్చితి ర్జడః
ఘటకుంభవ దేకార్థాః శబ్దా స్తే ప్యేక మేవ చ ॥

ఈ పరమాద్వయ దశలో సుఖము దుఃఖము బంధము మోక్షము చితి జడము అనునివి యన్నియు కుండ, కడవ, ఘటము అనినట్లుగా పర్యాయపదములు. ఈ పరసం విద్భూమి యెట్టి దందుము? ఇది శక్తియా? శక్తమా? ధ్యేయమా? ధ్యాతయా? పూజ్యమా? పూజకమా? స్వభా వమా? ఏదియు కాదు. అన్నియు నగును. ఇం దావాహ నము లేదు. విసర్జనము లేదు. ఇది యొక దుర్విజ్ఞేయా వస్థ. ఇది యనుత్తరస్థితి. "విశ్వస్య జీవితం సత్యం" ఇది యనుపాయస్థితి. భేదవికారకాలుష్య మంతయు పోగా పరమాద్వయపాత్రులై యాత్మవృత్తిమార్గమున సాధకులు విశ్రమింతురు. ఆనందశక్తి విశ్రాంతుడై యోగి సమరసు డగును. స్వసత్తావగమనముకన్న నుపాయ మేదియు లేదు. అందుననె యిది యుపదేశము.

శ్లో॥ యదా స్థితః తదైవాస్య మా గా బాహ్య మథాంతరం
కేవలం చిద్వికాసేన వికారనికరాన్ జహి! ॥

నీ వెట్లుంటివో యట్లే యుండుము. బాహ్య మంతర మేదియు నీకు లేదు. చిద్వికాసముచే నుండుము. వికారనికరముల నొగొట్టుకొనుము. ఇది యనుపాయ సమావేశ శీలుర స్థితి. వారలకు గోచరించు నీ భావమండల మంతయు వారి యాత్మసంవిదగ్నివిలాసము పొందును. అంతయు వార లకు పూర్ణసంవిన్మయముగ గోచరించును.

శ్లో॥ ఏషాం న మంత్రో న ధ్యానం న పూజా నాపి కల్పనా
న సమయ్యాదికాచార్య పర్యంతః కోపి విభ్రమః ॥

వీరలకు మంత్రము ధ్యానము పూజ కల్పనము ఏమియు లేదు. ఆచారములు లేవు. ఆచరణము లేదు. శాస్త్రమును లేదు. శాస్త్రము లారురుక్షువులకె గాని యిట్టి యారూఢులకు గాదు. లోకానుగ్రహము మాత్రమె వీరి యపరిమ్లాన కృత్యము. పరానుగ్రహమొనర్చుట రెండు విధముల నుండును. నిర్మలసంవిదులు కొందరు. కొంద రనిర్మల సంవిదులు. నిర్మలసంవిదు లెవరిని చూచిన వారందరు నిరుపాయసమావేశము పొందుదురు. దీపమున దీపమువలె వారంద రాత్మసంవేదనము పొందుదురు. అందుననె కొందరు సిద్ధుల దర్శనము యోగినీదర్శన మపేక్షింతురు. ఈ యనుపాయసమావేశ తత్త్వపరిజ్ఞానమునకె యాగ హోమాదులు దీక్ష వలయు నని శ్రీసిద్ధయోగీశ్వరీమతము. అనిర్మలసంవిదుల ననుగ్రహింపవలని యున్నపుడు శాస్త్రీయ యంత్రణ మావశ్యకము. అనుగ్రాహ్యు లనేకరీతుల నుందురు. వారి యనుసారమున శాస్త్రీయవిధి యనేక రూపము లగును. అందు పరోపాయము శాంభవము. అప రోపాయ మాణవము. పరాపరము శాక్తోపాయము. ఆరు రుక్షువులకు శాస్త్ర ముపాదేయము.

శ్లో॥ శంకాకలంకోపి తత్త్వజ్ఞో ముముక్షుప్రక్రియాం ప్రతి
న త్యజేత్ శాస్త్రమర్యాదాం ఇత్యాజ్ఞా పారమేశ్వరీ ॥

తత్త్వజ్ఞునకు ముముక్షుప్రక్రియలో శంకాకలంక మేమియు నుండదు. అయినను శాస్త్రమర్యాద నాతడు వీడరాదని పరమేశ్వరి యాజ్ఞ. స్వతంత్రసంవిదుడు శాస్త్రమర్యాద పాటిం చును. ఆతడు దేనిగూడ ఖండింపడు. అనిర్మల చిత్తుల కీయుపాయము లావశ్యకము లని యాతడు భావించును. కాదనడు. కాగా నిక నిది నిగమనము. (సశేషము)

# హేమచూడోపాఖ్యానము

"కృష్ణభిక్షు"

(పూర్వతో ఒనువృత్తము)

దీనినిచూచి హేమలేఖ ఒకప్పుడేకాంతమున తనితోయిట్లనెను. "నాథా! నీవు పూర్వమునందు వలె హర్షించుచున్నట్లు లేవు; నిన్నుచూడగా దుఃఖించుచున్న వానివలె నున్నావు. ఏల? నీ విట్లు లైతివి? ఆదివ్యాధులచే నీమనస్సుకుగాని దేహమునకుగాని గాసి లేదుగదా! బుద్ధిమంతులు "భోగే రోగభయం" అందురు, దేహము త్రిదోషయుతముగానే యున్నది. ధాతువైషమ్యమున రోగములు అన్ని దేహములయందును వ్యాపించియే యున్నవి. ఏవిధమునను వానికి ప్రతీకారము చేయలేము. ఆహారముచేత, వస్త్రములచేత, వాక్కులచేత, చూపులచేత, స్పర్శచేత, క్రియచేత, దేశముచేత త్రిదోషవైషమ్యము కలుగునుగాని, పుట్టినపుడు ఈవైషమ్యము యెవ్వరికిని అప్రత్యక్షముగానే యున్నది. వైషమ్యము కలిగినపుడెల్ల చికిత్స చేయవలెనని చెప్పబడియున్నది. వైషమ్యమే లేనపుడు ఎవడును చికిత్సను చెప్పడు. ఇట్లే అప్రియమునందును చూడతగును. మఱి నీకు శోకము కల్గనేల?"

అనగా ఆరాజపుత్రుడు హేమలేఖతో ఇట్లనెను. "నా శోకకారణమును చెప్పెదను. మునుపు నా కేదేది సుఖదముగా నుండునో అది యెల్ల నాశనమైనది. ఇంక సుఖము నిచ్చునదేదియో నాకు కనబడకున్నది. భోగార్థము రాజు నాకు అన్నివిషయములను ఇచ్చియున్నాడు. అందరికిని సుఖదము లయినవే నాకు త్యజింపవలసినదిగా నున్నవి. కనుక పూర్వమునందువలె వానితో నేనిక సుఖపడలేను. ప్రియా! చెప్పుము. ఏమి చేసి నేను సుఖపడుదును."

హేమలేఖ తనలో నిట్లనుకొనుచున్నది. "నామాట విని ఇతడు నిజముగా నంపూర్ణమగు నిర్వేదమును పొందినాడు. ఇట్టివాడు కావున తప్పక ఇతనియందు శ్రేయోబీజము కలదని నిశ్చయింప దగియున్నది. ఎవరు శ్రేయస్సును పొందగలరు అని యోచించుటకు సాధ్యముకాదో అట్టివారికి మాటలమాత్రము చేత ఇట్టి పూర్ణనిర్వేదము కలుగుట పొసగదు. మాటలచేత అట్టివారు మార్పుచెందరు. త్రిపురాదేవి చిరకాలము స్వాత్మ దేవతగా మనసున చక్కగా కొలువబడి ఆమె యెవరికి ప్రసన్నురాలగునో వారియందే ఇట్టి నిర్వేదస్థితి చూడనగును" అని యాలోచించి ఆ విదుషీమణి తన ప్రియునికి జ్ఞానబోధ మీయఁగోరి తన వైదుష్యమునే దాచి అన్యాపదేశపద్ధతిలో నిట్లు చెప్పెను.

"రాజకుమారా! నా పూర్వకథను వినుము: మా తల్లి నాకు క్రీడార్థము ఒక సఖిని ఒసగెను. దానికి మంచి స్వభావమే గాని అది యొక దుష్టురాలితో చేరికొన్నది. ఆ దుష్టురాలు ఎన్నివిధముల యాశ్చర్యసృష్టులనో చేయ కలిగినది. ఈ చెలిమి నాజననికి తెలిసినది గాదు. కనుక నా చెలికత్తెయు ఆదుష్టురాలు దాదాపు ఒక్కటియైపోయిరి. ఆ చెలియో నాకు ప్రాణప్రియ. నిర్మలస్వభావ. ఆ సఖి లేక నాకు క్షణార్ధమైనను గడవదు. నేను కేవలము దాని వశమునం దుంటిని. కనుక త్వరలోనే నా స్వభావము మారిపోయినది.

నా చెలితో కలసిన దుర్మార్గురాలికి ఒక కొడుకు కలడు. వాడు అతి మూఢాత్ముడు. మద్యపానముచేత వానికన్ను లెప్పుడును తిరుగుడు పడుచుండును. ఆ దుర్మార్గురాలు నాచెలిని రహస్యముగా ఈ మూఢాత్మునితో కూర్చినది. కొంతకాలమునకు ఆ మూఢాత్ముడు ధైర్యముగా నాయెదుటనే నాచెలిని ఉపభోగింప నారంభించెను. అట్లయ్యు నాచెలి నన్ను విడువదు. అతని యుపభోగమును కూడ విడువ నశక్తురాలయ్యెను కనుక నేనును వారితోనే యుంటిని.

ఆ మూఢాత్మునకు నా చెలికత్తెయం దట్టివాడే యొక కుమారుడు కలిగెను అతిచంచలుడు. ఒకచోటను నిలువనేరడు త్వరలోనే పెద్దవాడైనాడు. తండ్రిమౌఢ్యము, అవ్వదౌష్ట్యము—చిత్రనిర్మాణసామర్థ్యమును, అతని కబ్బినవి. అవ్వ, తండ్రి పెంపకములో ఆనేర్పరి బిడ్డడు శక్తుడై తన కడ్డులేనివాడాయెను.

ఈ లోపల జన్మచేత శుద్ధస్వచ్ఛస్వభావయైన నా చెలికి ఆదుష్టురాలితోటి స్నేహమున మాలిన్యము సంప్రాప్తించి నను ఆ ప్రియునియందు పుత్రునియందు దృఢానురక్తయై నాయందు అనురాగమునుకూడ కోల్పోయెను. సహజముగా నాది సరళబుద్ధి కనుక నాచెలికత్తెను వీడలేకపోతిని. ఆమూఢుడు సదా నాచెలి ననుభవించుటయే గాక నన్నుకూడ బలాత్కరించుట కుద్యుక్తు డయ్యెను. స్వభావ శుద్ధురాలినిగాన వస్తుతః నేను వాని వశము కాలేదు. కాని లోకములో నాకు గొప్ప యపవాదము కలిగినది. అందరును ఆ మూఢుడు నన్నుకూడ అనుభవించుచున్నాడని యనసాగిరి. నాచెలి, తనబిడ్డను, అనగా అచంచలుని నాకప్పగించి ప్రియుని కౌగిలిని వీడకయే యుండెను.

ఈ చంచలుని లాలనపాలనలు నావి. వాడును త్వరలో పెరిగి ఒక ప్రౌఢస్త్రీతో తగులాట పడెను. అది వాని యిచ్ఛకు సమ్మతమే.

ఈ చంచలుని ప్రేయసిపేరు చపల. క్షణక్షణము అది ప్రియునకు నింపగునట్లు మనోహరమైన ఆశ్చర్యజనకమైన క్రొంగ్రొత్త రూపులను దాల్చును. తన నేర్పుచేత ప్రియుని కైవశము చేసుకొని క్షణములో యోజనశతములు పోవును. వానితో యెక్కడనో రమించును. ఇట్లు అతనితో సంగాతమున అయిదుగురు బిడ్డలను అన్నివిధముల తమ్ము పోలినవారినే కన్నది. వారు అయిదుగురు అయిదు విధములగువారు—వారినిసైతము నాచెలి పెంచుటకు నాకే ఒప్పగించినది. నేనును వారిని పెంచి పెద్దచేసి బలవత్తరులను జేసితిని.

ఆ అయిదుగురును ఎప్పుడును వేరువేరుగనే యుండెడివారు. వేరువేరుగా చిత్రములైన విస్తృతములైన గృహములను కట్టుకొనిరి. వారలను తల్లి చాల గారవించును. కనుక తండ్రినిగూడ తమవశము గావించుకొనిరి. అతండ్రి క్షణక్షణము ఒక్కొక్కరి యింటి కేగుచుండును.

ఈ చంచలుడు పెద్దకుమారు నింటికి పోయి వివిధశబ్దములను వినును—కొన్ని సుశబ్దములు, కొన్ని ఘోరశబ్దములు, మధురసంగీతమొకనాడు, మంగళవాద్యము లొకనాడు, ఒక్కనాడు ఋగ్యజురాదిమాత్రములు, ఒకనాడు శాస్త్రాగమేతిహాసములు, భూషాశింజిత మొకప్పుడు, భృంగసంఘ సంగీత మొకప్పుడు, పికపంచమ సుస్వరాద్యనేకమనోహరశబ్దములను పుత్రునిపంపున వినుచు ప్రీతుడై పుత్రునికి వశు డయ్యెను. అంత అ కుమారుడు ఇంకొకవిధముగ నాజ్ఞ నీయగా నీచంచలుడు విరుద్ధములు, కర్ణకంటకములు, భైరవములు అగు రావములను, సింహాదుల గర్జనములను, మేఘనిర్ఘోషములను అశని ప్రమోతలను అతిభయంకర బ్రహ్మాండనిర్భేదక గర్భస్రావకఘోషలను వినవలసి వచ్చెను. భయపడి యింకొకచోటికి పోయినను అక్కడను రోదనములు, విలాపములు; చిత్రవిచిత్రములను శోకరావాదులను వినెను. ఇంతలో రెండవకొడుకు తన యింటికి చంచలుని గొంపోయెను.

అందు మృదుస్పర్శముగల శుభాసనములు కానవచ్చినవి. అట్టివే యగు శయనములును, వస్త్రములును, కానవచ్చినవి. కొంతకాలమునకు కఠినస్పర్శములు, శీతస్పర్శములు, వివిధమగు స్పర్శము లేనివి, అట్టివస్తువులను చూచెను. హితములను చూచిన చంచలుడు సంతోషించును. అహితములను చూచిన దుఃఖించును.

అంత మూడవకొడుకింట కేగి యా యస్థిరుడు అందు రుచిరాకారములు, వివిధవర్ణములు, ఎఱ్ఱనివి, తెల్లనివి, పీతనీలములు, హరితపాటలములు, ధూమ్రములు, కడారములు, కపిశములు, మేచకములు, కర్బురాదికములగు వస్తువులను జూచెను. స్థూలములు కొన్ని, కృశములు కొన్ని అణువులుకొన్ని, దీర్ఘములుకొన్ని, ఆయతములుకొన్ని, వర్తులము లింకకొన్ని, అర్ధవృత్తములు, దీర్ఘవృత్తములు, సుందరములు కొన్ని, భీషణములుకొన్ని, బీభత్సములు, భాస్వరములు, రౌద్రములు, కంటిని మూతపెట్టు నానాలోకములను జూచెను. ఒకచోట హిత మింకొకచోట తదితరము చూచుచున్న తండ్రిని ఆయన నాల్గవకొడుకు తనభవనమునకు దీసికొనిపోయెను.

అది విచిత్రము. అందు క్రమముగా ఫలములు, అన్యములు కానవచ్చినవి. పేయములు, లేహ్యములు, చోష్యములు, భక్ష్యములు, సరసములు, సుదామధురములు, మధురములు కొన్ని, అమ్లములు కొన్ని, కటువులు కొన్ని, తిక్తములు కొన్ని కషాయములు మఱికొన్ని క్షారములు, వేఱొకకొన్ని మధురామ్లకట్వామ్లలవణములును, కటుచిత్రాత్మరసములు వివిధములను తనయు డాస్వాదింపజేయగా రుచిచూచెను.

అంత కడపటిబిడ్డ అత్యంతవిచిత్రమగు తనచోటికి తీసికొని పోయెను. అం దనేకపుష్పములు విచ్చినవియు లభించెను. అందు తృణములు, అన్నములు, ఓషధులు, అన్నివస్తువులు అన్నియెడల నున్నవి. సుగంధులు, హేయగంధములు, వెగటువాసనలవి, ఉగ్రసౌరభములవి, కైపువాసనలు కొన్నిటికి, తేటవాసనలు కొన్నింటికి, కొన్నింటిచే మూర్ఛ వచ్చును. కొన్ని చిత్రములు.

ఇట్లు పుత్రాగారములు ప్రవేశించుచు నిర్గమించుచు ఒకచోట హితమైన సుఖించును. ఒకచోట నహితమైన విషాదపడును. వచ్చుచుపోవుచు బిడ్డలిండ్లలో నుండెను. అందఱికిని పితృవాత్సల్యము గావున నొకప్పుడును తండ్రిని వీడరు. ఎప్పుడో ఒకప్పుడు అల్పముగా నైనను విషయములనుఁ దాకుదురు. అస్థిరుడు పుత్రగృహమున నావిషయముల నెక్కింటి ననుభవించును. అన్యవిషయములఁ గికురించి రహస్యముగా తనపదమునకు గొంపోవును. పుత్రులులేనిచో ఏకాంతమున భార్య చపలతో తాను ఎక్కువగా ననుభవించును. (సశేషము)

ఓం.

శ్రీ రామలాల్ సద్గురు పరబ్రహ్మణేనమః

# యోగసాధన

## శ్రీ ఓరుగంటి నరసింహయోగి

ధర్మార్థకామమోక్షములనే చతుర్విధపురుషార్థములే మానవజీవితమునకు ముఖ్యములు. ధర్మార్థకామములు శాస్త్రోక్తప్రవృత్తిమార్గసాధనాసాధ్యములు. మోక్షపురుషార్థముమాత్రము శాస్త్రోక్తనివృత్తిమార్గసాధనాసాధ్యము. నివృత్తిమార్గసాధనయం దనేకవిధములైన యాధ్యాత్మికసాధనావిధానములు అధికారిభేదము ననుసరించి చెప్పబడినవి. "త మేవం విదిత్వా ఽతిమృత్యుమేతి । నాఽన్యః పంథా విద్యతే ఽయనాయ ॥" ఇత్యాది శ్రుతిప్రమాణములచేత అఖండపరబ్రహ్మానుభవరూప జ్ఞానముద్వారా మాత్రమే మోక్షము సాధ్య మగునని చెప్పబడినది. అట్టి దివ్యానుభవ జ్ఞానము సాధనచతుష్టయ సంపన్నులగు నుత్తమాధికారులకు శ్రవణమనననిదిధ్యాసాత్మకమగు సాంఖ్యమార్గసాధనవల్ల లభ్య మగుననియు రజస్తమోవాసనావాసితాంతఃకరణులగు మధ్యమాధికారులకు యోగసాధనవల్ల లభ్యమగుననియు వేదాంతపంచదశియందు పరమపూజ్యులగు శ్రీ విద్యారణ్యస్వామివా రుపదేశించియున్నారు. సాంఖ్యమార్గసాధనము ద్వారా మాత్రమేకాక బ్రహ్మసాక్షాత్కారమెట్లు యోగమార్గసాధనద్వారాకూడ సాధ్యమని భగవద్గీత షష్ఠాధ్యాయమందును శ్వేతాశ్వతరాద్యుపనిషత్తులందును "అపిచసంరాధనే ప్రత్యక్షానుమానాభ్యాం" ఇత్యాది సూత్రములకు శ్రీ పరమపూజ్యులగు శంకరభగవత్పాదులవారు చేసిన బ్రహ్మసూత్రభాష్యమందును స్పష్టముగా నిరూపింపబడినది.

యోగసాధన సహాయము లేనిదే సాంఖ్యమార్గసాధనకు పూర్వాంగమైన సాధన చతుష్టయ సంపత్తి సిద్ధించుట దుర్లభము. ఉపాసనమార్గము లన్నింటియందును యోగమార్గమునకు చెందిన ప్రాణాయామము, ధ్యానము ముఖ్యాంగములై యున్నవి. యోగసహాయములేనిదే వివిధ భగవత్ప్రాప్తి మార్గములయందు శీఘ్రసిద్ధి కలుగుట దుర్లభము. అట్టి యోగ మార్గములందు కుండలినీ జాగరణము షట్చక్రభేదనము మరల ప్రధానములై యున్నవి. ఈ కుండలినీశక్తి ప్రాధాన్యము యోగమార్గమునందే కాక వివిధమైన భగవత్ప్రాప్తి మార్గములయందునుగలదు. ఇతరమార్గములకంటె యోగమార్గమునందు మంత్రమార్గమునందు కుండలినీశక్తి ప్రాధాన్యముకలదు. యోగమార్గమునందువలె మంత్రమార్గమునందుకూడ కుండలినీ జాగరణమునకు షట్చక్రభేదమునకు ఎంతో ప్రాధాన్యముకలదు. కుండలినీ జాగరణము లేకుండ మంత్రపురశ్చరణ లెన్నిచేసినను మంత్రమార్గమందు పూర్ణసిద్ధిదుర్లభము. యోగమార్గమందు స్పష్టముగ కుండలినీజాగరణము తెలియుచున్నది అనియు అదియే అవిజ్ఞాతముగ భక్తిజ్ఞానమార్గములందుకూడ జరుగునని కొందరు మహాపురుషుల యభిప్రాయము. ఇతరమార్గములం దెట్లున్నను మంత్రజ్ఞానమార్గములందు కుండలినీజాగరణప్రాధాన్యము స్పష్టముగ కనవచ్చుచున్నది. కుండలినీలక్షణము — ఈ జగత్తునందు అధిభౌతిక అధిదైవిక, అధ్యాత్మిక, సమస్త శక్తులకు కారణభూతమైన పరాశక్తియే కుండలినీశక్తి. సుషుమ్నామార్గాంతర్వర్తియైన కుండలినీశక్తియే వివిధోపాసనలయందు ఉపాస్య దేవతారూపముల ధరించి సాధకుని కిష్టకామ్యఫలసిద్ధి ననుగ్రహించుచున్నది. యోగమార్గమునందుకూడ వివిధములైన దివ్యదర్శనములు ఈ కుండలినీ శక్తి మార్గముననే కలుగుచున్నవి, అట్టి కుండలినీశక్తి మేరుదండము (అనగా వెన్నెముక) యొక్క చివరభాగమునందున్న మూలాధార చక్రమునందు స్వయంభూలింగమును ఆచ్ఛాదించి సార్ధత్రి వలయాకారముగ (మూడున్నర చుట్లుగా) తన యూర్ధ్వముఖముతో సుషుమ్నానాడీమార్గద్వారమును పట్టుకొనియున్నది. అనగా నాడియే యనుటకాదు. నాడ్యంతర్వ్యాపినిగనున్న పరాశక్తియే కుండలినీశక్తి. ఆశక్తి యెపుడును నిద్రావస్థలోనుండుననియు దానిని వివిధసాధనల ద్వారా మేల్కొల్పి సుషుమ్నా మార్గముద్వారా షట్చక్రముల నారోహింపచేసి సహస్రారకమలమునందు తీసికొని వెడలి అక్కడ

స్థిరముగా నుంచిననాడు పరబ్రహ్మానందానుభవము కలుగును. యోగసాధనలయొక్క పరమలక్ష్యము షడ్విధమగు కుండలినీ జాగరణమేకాని కొందరు తలచినట్లు నౌళీత్యాది షట్కర్మలుగాని ఆసనబంధ ముద్రాప్రాణాయామాది కేవల శారీర సాధనలుమాత్రమేగావు. కుండలినీ జాగరణ సాధన చేయవలసినవారికి పాంచభౌతికమైన దేహశుద్ధికూడ పరమావశ్యకమై యున్నది. అట్టిదేహశుద్ధికి హఠయోగ ప్రోక్తమైన ఆసనబంధ ముద్రాషట్కర్మ సాధనలు శీఘ్రసిద్ధిప్రదములు. గాన హఠయోగ సాధనలకు కొంత సముచితమైన స్థాన మున్నను యోగసాధనా పరమలక్ష్యము కుండలినీ జాగరణముద్వారా పరిపూర్ణప్రాప్తియే.

మంత్రమార్గమునందు మంత్రపురశ్చరణ ముఖ్యమైయున్నను యంత్రతంత్ర ముద్రాన్యాససాధనలు సాధనాంగ ములైయున్నవి. అర్చనాక్రమము ప్రథమసంభావ్యము. అందు-అనగా-అర్చనాక్రమమునందు వామాచారము దక్షిణాచారము రెండువిధముల కనబడుచున్నది. అందు దక్షిణాచారము మాత్రమే వైదికులకు పరిగ్రాహ్యము. కాని ఈనాడు దేశము నందు వామాచారుల సంఖ్యయే యెక్కువగ కన్పించుచున్నది. కొందరు ప్రత్యక్షముగ వామాచారము నాచరించు చున్నారు. మరికొందరుపైకి దక్షిణాచారులవలె కన్పించుచు ప్రచ్ఛన్నముగ వామాచారమునే ఆచరించుచున్నారు. ఇట్టి పరిస్థితులందు బ్రహ్మీభూతులగు శ్రీ శృంగేరీ విరూపాక్ష శ్రీ పీఠాధిపులగు శ్రీ జగద్గురు శ్రీ బోధానంద భారతీ మహాంతాచార్య మహాస్వాములవారు (పూర్వాశ్రమమునందు బ్రహ్మశ్రీ రాణీనృసింహశయనులుగారు) శుద్ధమైన దక్షిణా చారమును ఆంధ్రదేశమునందు ప్రచారముచేయ నారంభించిరి. శ్రీవారి యనంతరమునందు వారి యనంతర పీఠాధిపతులు వ్యాఖ్యానసింహాసనా ధీశ్వర శ్రీ జగద్గురు శ్రీ కళ్యాణానందభారతీ మహాంతాచార్యస్వాములవారు వామాచారముయొక్క అవైదికత్వమును దక్షిణాచారముయొక్క వైదికత్వమును నిరూపించుచు లలితాసహస్రనామములకు భాస్కరరాయలు చేసిన భాష్యమునందు వామాచార సమర్థకాంశములున్న కారణముచేత దానిని ఖండించి దక్షిణాచారానుగుణమైన అపూర్వమైన వ్యాఖ్యానమును స్వయముగా రచించి పంచమకారసేవన భయముచే శ్రీ విద్యాసంప్రదాయమునందు ప్రవే శించుటకుకూడ భయపడుచున్నట్టి వైదికలోకమునకు నూతనోత్సాహమును ఆశాజ్యోతిని ప్రసాదించి మహోపకార మొనర్చిరి. ఈ విషయమహత్త్వము నవరాత్రులలో గుంటూరు అరండేలుపేట శ్రీసదనమునకు వెడలి అక్కడజరుగు అర్చనాపద్ధతిని చూచినవారికే బోధపడగలదు. కాన వైదిక మార్గమందు ప్రామాణ్యము కలవారికి దక్షిణాచారమందు శ్రీవారి విద్యాకుటుంబమే శరణ్యమైయున్నది.

ఇట్టి మంత్రమార్గమునందు యోగగ్రంథములందు చెప్పబడిన బంధత్రయ సాధనకూడ చేయుచు పురశ్చరణ తీవ్రముగా జపానుష్ఠానము చేయువారికి మేరుదండమునందు విద్యుచ్ఛక్తి స్పర్శవంటి అనుభూతులు ప్రారంభమై క్రమముగ కుండలినీ జాగరణము కలుగును.

---

# SREEKURMAM

*By*

N. RAMESAN M.A., I.A.S.
*(Deputy Secretary, Home Dept. Kurnool)*

Sreekurmam is a famous temple situated at a distance of 8 miles east of Srikakulam at the extreme south of the taluk, and very near the coast. The village itself derives its name from the temple, which is dedicated to Lord Vishnu, in the avatara of Sri Kurma i.e, the tortoise and hence the deity is called Sri Kurmanatha. In some of the inscriptions, the Deity is referred to as Srikurmeswara also. There is a good motorable road to the temple. The temple has beautiful pillared mantapas, and some of the pieces of sculpture done in granite are masterpieces of workmanship. The vimana of the temple is built in the orthodox and the characteristic chola type of architecture, though the outer gates beyond the prakara, are definitely of a later date, probably as late as the 15th and 16th centuries.

There is a sthalapurana of the temple, which is said to be of very great antiquity, but it is a purely mythological collection of no great historical or even literary value. The temple is of very great sanctity, being probably the only important temple to Vishnu in Kurmāvatāra in the whole of India. The temple pillars contain many hundreds of inscriptions, mostly of the later line of the Ganga kings of Kalinga. These inscriptions, along with those of Simhachalam, are perhaps the only pieces of evidence we have to reconstruct the history of this later line of the Gangas, starting with that most illustrious monarch of that line, Anantavarma Ganga Chola, who ruled for over eighty years from 1076 A.D. to 1147 A.D. The last of this line of kings was Bhanudeva IV who ruled from 1424 A.D.—1434 A.D., and the inscriptions of Sri Kurmam span the entire ambit of this line of kings. It is perhaps a measure of the littleness of our lives and the lines of emperors and empires, that the columns of a single temple, help to span a whole dynasty completely. It will not be an exaggeration to say, that but for these inscriptions of Sri Kurmam, the entire history of the later Gangas, would be a closed book to us. In addition to the political history of the period, these inscriptions serve to give us a very detailed idea of the methods of political divisions of the kingdom, the different public officers, their functions, the fiscal policy, the literary and religious movements of the times etc. In short, Sri Kurmam is the only beaconlight for us to understand the life and history of Kalinga from the 11th to the 15th centuries A.D.

The temple is said to have been originally a Saivite one, and to have been changed into a Vaishnavite shrine by Sri Ramanujacharya. Reference to this incident is also said to be available in the Sanskrit work Prapannāmrita (Adhyaya 36). Many interesting stories are also told of a great debate between Ramanuja and the advaitin thinkers, in which the latter were worsted. But it must be noted that there is no authentic historical evidence to prove this. However Sri Kurmam was in the limelight, during the lifetime of that great saint Sri Narahari Tirtha, a follower of Madhvacharya, who is said to have reigned as a regent in Kalinga during the 13th century, and who installed the deities of Rama, Lakshmana,

and Sita in Sri Kurmam during a precipitate flight from the country.

Kalinga, comprising the territory from Vaitarani to Varāhanadī, comprising the modern Vizag and Srikakulam Districts and parts of Orissa, was ruled by the Eastern Ganga dynasty, in an unbroken line for over 1000 years from the 5th to the 15th centuries A. D. This line of kings is broadly divisible into the earlier Ganga line, which ended with Gunamahārnava A. D. 894; and the later Ganga line starts from this and continues in an unbroken line upto Bhanudeva IV 1424 A. D.--1434 A. D.. The earlier kings were devout Saivites and were worshippers of Lord Gokarna of Mahendragiri. The pracasti of this earlier line, in all their copper plate grants starts with

स्वस्तिश्री सर्वर्त्तु सुरव रमणीयद्विजयकलिंगनगरात्
सकल भुवन निर्माणैकसूत्रधारस्य भगवतो
गोगर्णस्वामिन. चरण कमल युगल प्रणामात्
अपगत कलिकलांक: etc...

The temples to Bhimeswara and Someswara came to be built during their time at their capital Mukhalingam. There was not much of Vaishnavism during their reigns. It was only during the time of the later Gangas that Vaishnavism came to have any sway in Kalinga. The most valorous and noteworthy king of this later Ganga line was Anantavarma Chodaganga (A. D. 1076—A. D. 1147), and he expressly states in many copper plate inscriptions that he belongs to the Ātreya Gotra and the lunar Vamsa. An inscription of this emperor in the temple of Sri Kurmam, expressly states that having subdued the Eastern, Northern, and Southern countries, he satisfied by means of rich oblations, the Rishis, Devas, Pitrus, and Brahmanas. He conquered Utkala in 1132 A. D. and came into contact with the prevailing cult of Vaishnavism there, and being a great catholic monarch, he adopted it and at the same time continued his patronage of Saivite temples also. It was after this, viz. his conquest of Utkala that he must have built Sri Kurmam temple dedicated to Lord Vishnu and he showed his religious tolerance, by continuing his benefactions to the Mukhalingam and Draksharama Saivite temples also. It was after this admixture of Utkala culture that this monarch came to build Vaishnava temples at Sri Kurmam and Simhachalam. In 1135 A. D. he shifted his capital also to Cuttack, where also he built lofty temples.

The absence of the epigraph of any earlier monarch on the walls of the temple, in an age and place, where stone inscriptions were the order of the day, lends full support to this theory. The architechture of the temple also leads one to the same opinion. The main Vimana over the Garbha-Griha, is decidedly of the Chola type, and of that peculiar pyramidal tapering design that characterised the temples of Raja Rajachola, as for e.g. the Gopuras of the Brihadeeswara temple of Tanjore. As is well known, there were close and intimate matrimonial and other alliances, between the Cholas, the Chalukyas and the Gangas and there was much cultural intercourse also. The Gangas themselves have been suspected to be Tamil monarchs, on account of their very close relationship with the Cholas; Chola titles, like Raja Raja came to be adopted widely (in fact Anantavarma Chodaganga's father was known as Raja Raja Kalinga) and Chola type of temple architechture also came to be much in vogue. In view of this, and in view of the fact that the design of the Vimānā, over the Garbha-Griha, is of that peculiar tapering variety, which prevailed only during the days of

the medieval Cholas, we can conclude that the temple came to be constructed in the early part of the 12th century. The absence of any inscription of any previous King, especially that of Vajrahasta (A. D. 1038-A. D. 1069), who has left us such illumining pieces on the temples of Mukhalingam etc., show that Srikurmam did not exist then. We can therefore safely conclude that the temple is the result of the religious catholicity of Anantavarma Chodaganga, and that the temple came to be constructed sometime after 1132 A.D., the conquest of Utkala. If one can let one's imagination get away with one, one can also conclude that the temple must have been built in 1133 and 1134 A.D., before the shifting of the capital to Cuttack in 1135 A.D., as with the shift of the capital, the incentive to construct temples in remote parts of the kingdom would have been less

There is nothing very important about the architechture of the temple Except the 'Garbha-Griha Vimana, the gopuras are definitely of a later origin and even show signs of Muslim style of architecture. The front is drab and colourless. The temple has pillared mantapas. The pillars are made of exquisite granite and the finish and polish are still a wonder. Very delicate and beautiful carvings of stone are found on these. But one sees only the richness and detail of a sophisticated artist, rather than the elegance and grace of a free and untrammelled artist. In literature, one hears of the Nārikela-Paka of Naishadha, and the Drāksha-Paka of a Kalidasa. The former follows strictly all the prescribed rules of Grammar. The prosody is faultless and the richness of learning and scholarship leaves one replete; but in the latter, occasional lapses from rule may occur here & there, but one feels the throb of a free and pulsating artist. The former is full, stately, and correct; the latter, more human, thrilling, and exciting. The former is a cultivated genius; the latter is a born one though slightly erratic. One sees this difference in the field of sculpture also, in the heavy, and ornate sculptures of Srikurmam, with their studied beauty and devotion to detail, and in the free & easy sculptures of the Pallavas and Vishnukundins. This is also symptomatic of the age, viz. The 12th of 13th centuries. when in all fields of art, people were beginning to have set ideals and notions. It was an age of set critics and not of free poets.

The epigraphy of the temple is of very great historical value. As stated already, this temple palaeography, with fragments from Simhachalam temple is the only source of the history of the kings and peoples of Kalinga from the 12th to 15th centuries. The Sri Kurmam inscriptions also throw a flood of light on that great Madhwa Teacher Sri Narahari Tirtha, whose debut into the political and religious history of Kalinga is not settled fully as yet. We can trace on the walls of Sri Kurmam, the lives and careers of each of the later Ganga kings, from Anantavarma Chodaganga to Bhanudeva IV 1424—1434 A. D., and it is in this that the importance of the temple lies.

One important inscription of Sri Kurmam has led to a controversy over the authenticity of the authorship of Telugu Bharatam, which is attributed to that great poet Nannayya Bhatta, who was the court-poet of the Chalukyan king Raja Raja Narendra. A prince of the Eastern Chalurkyan line, by name Vijayaditya, belonging to another collateral branch of the royal line, has left an enigmatic inscription in Sri Kurmam in 1273 A. D. as follows :—

చున్నవి. వీటిని ప్రభుత్వము సహింపదు. ఇట్టి అవినీతికి పాల్పడు దేవాలయోద్యోగులు, ధర్మకర్తలు కఠినముగ శిక్షింపబడుదురని హెచ్చరించుచున్నాను. ఆయాపదవులనుండి అవినీతిపరులను పదభ్రష్టులజేయుటకు ప్రభుత్వము వెనుకంజవేయదు.

ధర్మకర్తలు, ఉద్యోగులు తమపదవుల సార్థక మొనర్చుకొనవలెను. దేవాలయముల మరమ్మత్తులకు, ఉత్సవములకు ధనమును సక్రమముగ వినియోగింపవలెను. ప్రతి గ్రామమునకు మతప్రబోధమును గావించి నీతిని, ధర్మమును వర్ధిల్లజేయు కృషికి గడంగవలెను. భక్తిని-ప్రేమను ప్రబలింపజేయవలెను. పండుగలు - ఉత్సవములు మున్నగువాని యథార్థతత్త్వమును ప్రబోధించు సాధన సంపత్తితో సదాచారములను, శీలమును గాపాడవలెను. వామాచారముల నశింపజేయవలెను. ఆట, పాటలతో గ్రామములను ఆనందనిలయములుగఁ గావింపవలెను.

ఒక్క ప్రధాన విషయమును ఉదాహరణముగ తమ యెదుట నుంచదలంచుచున్నాను. శ్రీరామకృష్ణపరమహంస మనకాలమున జన్మించిన మహాత్ముడు. తన అధ్యాత్మిక తేజోవికాసమును ప్రపంచమునం దంతటను ప్రసరింపజేసి, ప్రాక్పశ్చిమముల కన్నులు విప్పిన అవతారమూర్తి. ఈ పురుషోత్తముని ప్రియశిష్యుడు వివేకానందస్వామి అస్ఖలిత బ్రహ్మచారి. యోగి. ఉగ్రతపస్వి. సన్యాసి. తన గురువర్యుని దివ్యశక్తిప్రసాదఫలితముగ భగవంతుని ప్రత్యక్షముగ గాంచజాలెను. కాషాయవస్త్రధారియగు నీ సన్యాసి తన అధ్యాత్మికవిజ్ఞాన ప్రతిభతో పాశ్చాత్యుల దిగ్భ్రమ నొందించి ముగ్ధుల గావించెను. విజ్ఞానవేత్తల మని విర్రవీగు భౌతికశాస్త్రపండితులు బెక్కురీ మహాత్ముని బోధనములనాలించి, వశులైరి. సనాతనధర్మము - వైదికమతము ఈ మహాత్ముని నోట మృదుమధురగంభీరభావముల బ్రకటింపజేసి, విశ్వవిఖ్యాతి నందుకొన్నది. తన గురువగు శ్రీరామకృష్ణ పరమహంస (పేర) నామమున స్వదేశమునను—ఖండఖండాంతరములందునను మఠములను - ఆశ్రమములను స్థాపించెను. అందు బెక్కురు సన్యాసాశ్రమమును స్వీకరించిన స్వాములు సేవాత్యాగముల జీర్ణింపజేసికొని, మానవసేవయే మాధవసేవ యను న్యాయానుసారము దరిద్రనారాయణులసేవ లొనర్చుచున్నారు. అధ్యాత్మిక సత్యముల నెల్లర కందించుచున్నారు. ఈ మఠములు - ఆశ్రమములు తమ అకుంఠిత సేవాదీక్షతో అధ్యాత్మిక శక్తిప్రసరణమును వ్యాప్త మొనరించుచు, నిష్కామ్యకర్మకు నిలయములుగ వెలుగొందుచుండుట గమనార్హము. పవిత్రత కాలవాలములుగ అధ్యాత్మిక శక్తిభాండారములుగ ప్రదీపించుచుండుట- మన భాగ్యము. మన దేవాలయపాలకులు-ధర్మకర్తలు, మఠాధిపతులు - పూజారులు - పండితులు - వీనిని దృష్టి నిడుకొని తమ విధ్యుక్తధర్మమును ప్రశంసనీయముగ నిర్వహించు సత్యసంకల్పమును-అనుష్ఠానబలమును బడయుదురుగాక!

పాశ్చాత్యపద్ధతులపై నడుపబడు విద్యాలయములు భౌతికశాస్త్రములను ప్రబోధించుచు భోగలాలసల జీవితముల ప్రబలించుచున్నవి. ఇట మతప్రబోధముల కాస్కారము లేదు. నీతిశీలముల బ్రబలించు శిక్షణమును లేదు. గుణ - శీలములమధ్య నొక పెద్ద అగాధమేర్పడి 'యెవరికి వారే యమునాతీరే' యను విధముగ సంచరించుచున్నారు. సృజనశక్తిని, స్వావలంబనమును గోల్పోయి అంధానుకరణమునకు గుఱియై ఉద్యోగములకు ప్రాకులాడుచున్నారు. ఈ విద్యావిధానము పూర్తిగ మార్పును జెందవలెను. భౌతికశాస్త్రవిజ్ఞానమునను అధ్యాత్మిక శక్తి ప్రసారములేనిచో అణ్వస్త్రములు — మారణాస్త్రములు మానవవాసముల శ్మశానములుగావించు దుఃస్థితియేర్పడును! కావున భౌతికశాస్త్రవిజ్ఞానమును, నీతిశీలముల, ప్రేమత్యాగముల నందించు మతమునకు జోడింపవలెను.

ఈసమావేశమునకు కొందరు ప్రముఖపండితు లాహ్వానింపబడిరి.

సంస్కృత వాఙ్మయమునందు వారిపాండిత్యమపారము. వారి పాండిత్యము, అంజలి అమూల్య విజ్ఞానప్రబోధ ప్రచారములు, అర్చకులకు ఉద్యోగులకు వలయు శిక్షణా ప్రణాళికలు, భగవదారాధనలు, అధ్యాత్మిక విషయముల ప్రచారము మున్నగు పెక్కు విషయములందు వారి సహకారము, మన కెంతయు నావశ్యకము. మన మత సత్యముల ప్రజలయందు విరివిగ ప్రబోధ మొనర్చుటకు, వారు దోడ్పడుదురని విశ్వసించుచున్నాను. ముఖ్యముగ దేవాదాయముల ఉద్యోగులు—అర్చకులు—ధర్మకర్తలు పరస్పరసహన సఖ్యములతో తమ విధ్యుక్తధర్మముల నిర్వహించు విధానముల నమలుజరుపుటకు వీరు తల.

మా ఆహ్వానముల నాదరించి, శ్రమ యనుకొనక యీ సభ నలంకరించిన పండితసత్తములకు నమస్కారములు. దేవాలయ సంబంధవిధుల నిర్వహించువారియందు నీతి శీలములు, భక్తిత్యాగములు ప్రసరించి దేవాలయముల పవిత్రతను పోషించి—ప్రదీపింపజేయు బెక్కువిషయములగూర్చి వీరు ముచ్చటింపనున్నారు. శిక్షణాప్రణాళికల సంస్తవనీయముగ నిర్ణయించి, వాని నమలుజఱుపు విధానములకు చేయూత నొసగుదురని ఆశించుచున్నాను. ఇంతియేగాదు ప్రజలలో భక్తిజ్ఞానముల ప్రబోధించి—ప్రసరింపజేయు ప్రచారమునకు తమ సహకారము నందింపుడని కోరుచున్నాను. వారి సహకారము మనకు—

మననహకారము వారికి నే డెంతయు వాంఛనీయము. అంతియేగాదు, మన ఉభయుల సహనసహకారములతో ప్రజలకు శుభమును జేకూర్చు సేవల నందింతుముగాక! మన ప్రభుత్వము మతములందు జోక్యము గలిగించు కొనని ప్రజాస్వామ్య ప్రభుత్వము. అన్ని మతములయెడ సహనమునుగలిగియుండుట దీనిలక్ష్యము. ఇక మన విశ్వ విద్యాలయములు వాని అధీనమునందలి కళాశాలలు ఆంగ్లవిద్యాలయముల కనుకరణములుగ స్థాపింపబడుటచే నట సంస్కృతభాషకు గాని, మతమునకు, మన సంస్కృతికి స్థానములేదు. ఆదరణము అరుదు.

ఇది విచారకరము. విశాల మతసత్యములను. నీతి శీలములను-భక్తిసహనములను ప్రబోధింపనివిద్య భౌతిక సంపదల జేకూర్చుకొనుటకు దోడ్పడవచ్చు నేమోగాని, మానవులను పశుతుల్యులుగ గావించును.

భగవత్సేవకు సమర్పించని లలితకళలు, పరమసత్యముల నందింపని సారస్వతము, శీలమును వర్ధిల్లజేయజాలని విద్య, నైతికపునాదులులేని రాచకీయము, ఆధ్యాత్మికశక్తి వికాసము నందింపజాలని మత సాంప్రదాయ ధర్మము. అనుష్ఠింపజాలని ప్రభుత్వము, మానవసంక్షోభమును అశాంతిని జేకూర్చును. పాశ్చాత్యదేశముల దుస్థితి యిదియే. ఇట్టి వినాశకర, విధ్వంసకస్థితికి భారతి గురికాకుండుగాక యనునదియే మన తారకమంత్రము.

ఓమ్ ద్యౌః శాంతి, రంతరిక్షగ్ం శాంతిః
పృథివీ శాంతి రాపః శాంతిః
ఓషధయః శాంతి ర్వనస్పతయః శాంతి
ర్విశ్వేదేవాః శాంతిః
బ్రహ్మ శాంతిః సర్వగ్ం శాంతిః శాంతి రేవ శాంతిః
ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

---

# శ్రీ మంత్రశాస్త్ర మీమాంస 2

న భజే ద్వామమార్గం తు యతో నిష్ఠా దురత్యయః ।
తన్మార్గిణాం మహాపాపం పాపాత్మానోఽత్ర యే స్థితాః ॥ ఇతి మేరుతన్త్రే ॥
గోక్షీరం బ్రాహ్మణో దద్యా ద్గవ్య మాజ్యం చ బాహుదః ।
వైశ్యస్య మాక్షికం దేయం శూద్రః పౌష్ట్యాదికం చరేత్ ॥ ఇతి శ్రీక్రమే—
"క్షీరై ర్విప్రాః । ఘృతేన క్షత్రాః మధునా విశః ।
మద్యేన తదస్యే" ॥ ఇతి శక్తిజిజ్ఞాసాయాం మగస్త్యః ॥
"బ్రాహ్మణేన సదా దేయం కూష్మాణ్డం బలికర్మణి ।
శ్రీఫలం వా సురాధీశ భేదం నైవ తు కారయేత్ ॥ ఇతి రుద్రయామళే ॥

*శ్రీవిద్యాశంకరపదమావేశప్రకాశిత జగద్గురు శ్రీకల్యాణానందభారతీమాంతాచార్యస్వాములవారు*

## ఏతద్విషయమునందు నిర్ణయము

కులార్ణవము మొదలుగాఁ గల తంత్రములును కల్పసూత్రమును మపంచకస్వీకారము కౌలమార్గావలంబనము అను రెండిటి యొక్క యావశ్యకతను సర్వవర్ణముల వారలకు నాశ్రమములవారలకును సమముగా విధింపుచున్నవి. మేరుతంత్రము మొదలుగాఁ గల తంత్రములును అగస్త్యాదులయొక్క సూత్రములును శ్రీయాగసూత్రమును మపంచకస్వీకారకౌలమార్గావలంబనములు రెండును శూద్రులు మొదలుగాఁ గల్గి యవనులంతముగాఁ గల జనులకే యాచరణయోగ్యములనియు వైదికధర్మము ననుసరించు ద్విజులకు నెంతమాత్రము నుపాదేయములు గావనియు నిర్వచింపుచున్నవి. ద్విజులలోఁ గూడ నవకాశమున్నదా యనినచో నయ్యది క్షత్రియవైశ్యులకు మాత్రమే కాని బ్రాహ్మణులకు సర్వవిధముల హేయమును

గర్హ్యము నని సర్వవిధములచేఁ దెలియ వచ్చుచున్నది. గావున బ్రాహ్మణులకు కౌలాచారమును మపంచకస్వీకార మును సర్వవిదముల నింద్యమే యని రాద్ధాంతము. కావున శ్రేయస్కాములెవ్వరు నవ్వాని గ్రహింపఁ గూడదు.

## గురులక్షణము

మేరుతంత్రమునందు సద్గురు లక్షణ మిట్లు నిర్వచింపఁ బడియున్నది—

"వింశద్విశ్వోపకగుణై ర్యుక్తో యః స గురు ర్భవేత్
యోత్యుత్కృష్టో యదోక్తాజ్ఞః శుద్ధవేషో మనోహరః
సర్వాగమాంగతత్త్వజ్ఞః సర్వమంత్రవిధానవిత్
ఇంగితాకారచేష్టావిదూరతః కృతదుజఞనః
అన్తర్ముఖో బహి ర్దృష్టిః సర్వజ్ఞో దేశకాలవిత్
ఆజ్ఞాసిద్ధో దయాయుక్తః శాన్తో వేదాఙ్గవేదవిత్
నిత్యే నైమిత్తికే కామ్యే రతః కర్మ ణ్యనిందితే
అలోలుపో ఽహింసకశ్చ పక్షపాతీ గురు ర్మతః

శ్రీ విద్యాదర్శనమునందు—"గురుః శ్రోత్రియో బ్రహ్మ నిష్ఠ శ్శాస్త్రే దాన్తః కులినః శుద్ధాచారః సుప్రసిద్ధ మన్త్ర తంత్రవిచక్షణః ఆశ్రమీ ధ్యాననిష్ఠోవా॥

నూతనసంహిత యందు నిట్లు నిర్వచింపఁ బడియున్నది—

"ఉత్తమః పంచధా ప్రోక్తో గురు ర్బ్రహ్మాత్మవేదిభిః।
బ్రహ్మచారీ గృహస్థశ్చ వానప్రస్థశ్చ బికుకః।
అతివర్ణాశ్రమీ క్రమాచ్ఛ్రేష్ఠ విచక్షణః॥—

## శిష్యలక్షణము

మేరుతంత్రమునందు సాధక లక్షణ మిట్లు నిర్వచింపఁ బడియున్నది—

"గురువాక్యప్రమాణజ్ఞం గురుశుశ్రూషణే రతమ్
లబ్ధాభిమానగర్వాదివజితం కులనాయకమ్
నిరపేక్షం గురుద్రవ్యే తత్ప్రసాదాభికాంక్షిణమ్
జపధ్యానాభినిరతం మోక్షమార్గాభిమానినమ్
సమాధిసాధనోపేతం శుద్ధదేహం చ ధార్మికమ్
దృఢవ్రతం సదాచారం శ్రద్ధాభక్తిసమన్వితమ్
దీన సత్య మిత స్నిగ్ధ భాషిణమ్ సాధుసమ్మతమ్
అనుకూలప్రియాయుక్తం ధీరం సర్వోపకారకమ్.
సదైవ సుముఖం కుర్యా చ్ఛిష్యం దైవతతుష్టయే

పై తొమ్మిది చరణములందు నిర్వచింపఁ బడిన సుగుణ సంపత్తిగలవానికి సద్గురువు దేవతాతుష్టికొఱకును దేవతానుగ్రహముకొఱకును సదుపదేశమును చేయవలయు నని శిష్యుని యొక్క పరీక్షకొఱకు శిష్యలక్షణ ముప దేశింపఁబడి యున్నది.

శ్రీ విద్యాదర్శనమునందు సూత్రప్రాయముగ శిష్యలక్షణ మిట్లు స్మరింపఁ బడియున్నది—

"శాన్తో దాన్తో వినీతః శుద్ధాత్మా శ్రద్ధావాన్కులీనః సచ్చరితో దనీ" యని—

## గురుశుశ్రూషా

ప్రకృతమున నుపదేశింపఁబడిన గుణములతో నొప్పు సాధకుఁడు పూర్వము నిర్వచింపఁబడిన లక్షణములతో నొప్పు గురువును దన మనోభీష్టసిద్ధికొఱకు నాశ్రయించవల యును ఏతద్విషయమును "తద్విద్ధి ప్రణిపాతేన పరి ప్రశ్నేన సేవయా" యను భగవద్గీత ముద్ఘోషింపుచున్నది.

విద్యాసంపాదనమునకు సాధనవిశేషము లిట్లు నిర్వ చింపఁబడియున్నవి—

"గురుశుశ్రూషయా విద్యా పుష్కలేన ధనేన వా
అధవా విద్యయా విద్యా చతుర్థం నోపలభ్యతే॥"

యని గురుశుశ్రూష, పుష్కలమగు ధనమునిచ్చుట, వేఱొక విద్య నుపదేశించుటయును మూడు సాధనములు యుపదే శింపఁబడుచున్నను భగవంతునిచే శుశ్రూష యొక్కటియే సాధనముగా నుపదేశింపఁబడుటకుఁ గారణమేమన, శ్రీవిద్యతోఁ దుల్యమగు విద్య వేఱొకటి లేకపోవుటచే నెట్టి విద్యచేఁ గూడఁ దెచ్చికొనుటకు నవకాశ మించుకేనియు లేదను విశేషము "నిత్యాషోడశికార్ణము" నందు నిర్వచిం పఁబడి యున్నది. అది యెట్లన—

"వాగురామూలవలయే సూత్రాద్యాః కబలీకృతాః
తథా మన్త్రాః సమస్తాశ్చ విద్యాయా మత్ర సంస్థితాః
అత్ర సర్వే మహామన్త్రా బీజాస్తర్వృక్షగాత్రవత్
సంస్థితాస్తు మహేశాని తస్మా చ్ఛ్రేష్ఠతమా భవేత్." అని

బ్రహ్మాణ్డపురాణమునం దిట్లు స్మరింపఁబడి యున్నది—

"యస్యా న్యదేవతానామకీర్తనం జన్మకోటిషు
తస్యైవ భవతి శ్రద్ధా శ్రీదేవీనామకీర్తనే
చరమే జన్మని యథా శ్రీవిద్యోపాసకో భవేత్." అని

శ్రీదేవీనామమన "శ్రీగుణనిక" యను సామవేదాంతర్గత శ్రీదేవీరహస్యనామస్తోత్ర మని గ్రహించునది.

బ్రహ్మలోకావాప్తినిఁ గాని బ్రహ్మభావమును గాని బడయుటకుఁ దగు యోగ్యతతో నొప్పు జన్మము చరమ జన్మ మనఁబడును. అట్టి చరమ జన్మమునందే శ్రీవిద్యో పదేశమునకును తదనుష్ఠానమునకును దగు యోగ్యత గల్గు నని యభిప్రాయము.

ఇఁక పుష్కల ధన ప్రదానముఁ గూడ శ్రీవిద్యావిషయ మున నెంతమాత్రమును ఘటింప నేరదు. ఏలనన— ఈశ్వరులతోడను లోకములతోడను నొప్పుచుండు పదు న్నాలుగు భువనములు గూడ శ్రీవిద్యయందలి యొక

వర్ణములయొక్క పదునారవభాగముతోఁ గూడఁ దులఁ దూగ నేరవని శిష్టోక్తి యిట్లుఁ బరగుచున్నది—

"సేశ్వరాణి సలోకాని భువనాని చతుర్దశ
శ్రీవిద్యార్ణస్య చైకస్య కలాం నార్హన్తి షోడశీమ్"

కావున శ్రద్ధాభక్తి పురస్సరమగు శుశ్రూషయే గుర్వనుగ్రహమునకు ముఖ్యకారణము గాని వేరొండు కానేరదని శ్రీ కృష్ణభగవానులు శుశ్రూషను మాత్రమే యుపదేశించి యున్నారలు.

ఏతద్విషయమున సాధకుఁ డవశ్యము గ్రహింపవలసిన విశేష మొండుఁ గలదు. విద్యాసంగ్రహోపాయమాత్రమే కాదు శుశ్రూష; మఱి యేమన, విద్యాఫలప్రాప్తికిఁ గూడ గుర్వనుగ్రహమే సర్వవిధములఁ గారణ మగుచున్నది. ఇందులకు శిష్టోక్తు లిట్లుఁ బరగుచున్నవి.

"యస్య దేవే పరా భక్తిర్యథా దేవే తథా గురౌ
తస్యైతే కథితా హ్యర్థాః ప్రకాశన్తే మహాత్మనః
గురుభక్తివిహీనస్య తపో విద్యా కులం వ్రతమ్
సర్వం నశ్యతి తత్త్సైవ భూషణం లోకరంజనమ్
గురౌ మనుష్యబుద్ధిం చ మన్త్రే చాక్షర బుద్ధికమ్
ప్రతిమాసు శిలాబుద్ధిం కుర్వాణో నరకం వ్రజేత్" అని.

## గు ర్వ న్వే ష ణ ము

విద్యాసంగ్రహమునందు సాధకుఁడు సర్వవిధముల ప్రయత్నపూర్వకముగ సద్గురువు నన్వేషణముఁ జేయ వలయును. లేనిచోఁ బ్రమాదవశమున నసద్గురునికడఁ జేరినచో ననర్థముల పాల్పడును. ఏల నన స్వార్థాభిలాషులు తరచుగా దాంభికులు ఆచార్యవేషములతో బాహుల్యముగఁ జరింపుచుందురు. ఏతద్విషయమున శిష్టోక్తు లిట్లు బరగుచున్నవి.

"గురవో బహవ స్సన్తి దీపవచ్చ గృహే గృహే
దుర్లభోయం గురు ర్దేవి సూర్యవ త్సర్వదీపకః
గురవో బహవ స్సన్తి వేదశాస్త్రాదిపారగాః
దుర్లభోయం గురు ర్దేవి పరతత్త్వార్థపారగః
గురవో బహవ స్సన్తి కుమన్త్రౌషధివేదినః
నిగమాగమశాస్త్రోక్తమన్త్రజ్ఞో దుర్లభో భువి
గురవో బహవ స్సన్తి శిష్యవిత్తాపహారకాః
దుర్లభోయం గురు ర్దేవి శిష్యదుఃఖాపహారకః
శివాదిగురుపర్యన్తం పారంపర్యక్రమేణ యః
అవాప్తతత్త్వసంభారః స గురు ర్నాపరః ప్రియే
శూద్రాణాం చ తథా స్త్రీణాం గురుత్వం న కదాచన
వైశ్యస్యాపి తథా రాజ్ఞో విద్యోత్కర్షబలేన చ
గురుత్వం కేచి దిచ్ఛన్తి స్వోత్తమం ప్రతి కేశవ
త్తమః పంచధా ప్రోక్తో గురు ర్బ్రహ్మాత్మవేదిభిః
బ్రహ్మచారీ గృహస్థశ్చ వానప్రస్థశ్చ భిక్షుకః
అతివర్ణాశ్రమీ చేతి క్రమా చ్ఛ్రేష్ఠా విచక్షణ
విద్యోత్కర్ష బలేనైవ గురు ర్భవతి నాన్యథా
అతివర్ణాశ్రమి ప్రోక్తో గురు స్సర్వాధికారిణామ్." అని

గురూపదేశరహితమగు విద్య నిరర్థకమును నిష్ప్రయోజనమును అగుట యటుండ సర్వవిధముల ననర్థదాయకమని వివరింపఁ బడుచున్నది—

"విద్యాభిలాషీ రాగాదినా గుర్వన్వేషణా దుపరమం కృత్వా యేన కేనాపి మార్గేణ విద్యారంభం న కుర్యాత్ తతో మహా ననర్థః స్మర్యతే స్వాయత్తాదివ్యాపారేషు— తథాహి—

"యదృచ్ఛయా శ్రుతం మన్త్రం ఛద్మేనాపి ఛలేన చ
పత్రే స్థితం చ వాధ్యాప్య తజ్జపః స్యా దనర్థకృత్
పుస్తకే లిఖితా న్మన్త్రా న్విలోక్య ప్రజపన్తి యే
బ్రహ్మహత్యాసమం తేషాం పాతకం వ్యాధిదుఃఖదమితి

అనాద్య విచ్ఛిన్న పారంపర్య ప్రాప్తమగు సద్గురూపదిష్ట మన్త్రానుష్ఠానము వలన మహాఫల మలవడునని వినవచ్చుచున్నది.

"ఉపదేశస్య సామర్థ్యా చ్ఛ్రీగురోశ్చ ప్రసాదతః
మన్త్రప్రభావా చ్ఛక్త్యా చ మన్త్రసిద్ధిః ప్రజాయతే
సిద్ధమన్త్రా ద్గురో ర్లబ్ధా మన్త్రో య స్సిద్ధిభా గ్భవేత్
పూర్వజన్మకృతాభ్యాసా న్మన్త్రో వా శీఘ్రసిద్ధిదః
దీక్షాపూర్వం కులేశాని పారంపర్య క్రమాగతమ్
న్యాయలబ్ధశ్చైవ మన్త్రః స చ సిద్ధో న సంశయ
దేవి దీక్షావిహీనస్య న సిద్ధి ర్నచ సద్గతిః
తస్మా త్సర్వప్రయత్నేన గురుణా దీక్షితో భవే" దితి."

సద్గురువువలన దీక్షను బొందిన విద్యాభిలాషికి విద్యాఫలప్రాప్తి గల్గును, తద్విపరీతునకు ననర్థఫలప్రాప్తియు గల్గునని శ్రుతిస్మృతులు ఘోషింపుచున్నవి కావున విద్యాభిలాషిచే సద్గురువు అన్వేషణము సేయఁబడి యట్టి గురువువలన దీక్షను బడయవలయును—

## —దీ క్ష—

దీక్ష యనునది విద్యానుష్ఠానమునకుఁ దగు యోగ్యతను గలుగఁజేయు సంస్కారవిశేషము. అట్టి దీక్ష సద్గురువువలన నవశ్యము సంగ్రహింపఁబడవలసిన విశేషమే. అయ్యది విద్యార్థియొక్క యంతఃకరణపరిపాకవశముచేమందమధ్యమోత్తమభేదముచే మూడు విధముల నలరారుచున్నది. గ్రహింపఁబడిన మంత్రానుష్ఠాన యోగ్యతను గలుగజేయునది మందమనఁబడును. పంచామ్నాయ మంత్రానుష్ఠాన యోగ్యతా స్థితికిఁ గారణమగు దీక్ష మధ్యమ మనంబడును ప్రణవము వినాగా సకల మంత్రానుష్ఠాన యోగ్యతా హేతు వుత్తమ మనంబడును.

ఇయ్యది యుపదేశాధికారయోగ్యతకుఁగూడ హేతువగును. ఇట్టి యుత్తమ దీక్షయే పూర్ణాదీక్షయని శిష్యులచేఁ బేర్కొనఁ బడుచున్నది. ఇట్టి దీక్షయందు సాధకునకుఁ బూర్ణాభిషేకము లభించును. అట్టి పూర్ణాభిషేకమును బొందని వానికిఁ బూర్ణాధికారము లభించదు. ఏతద్విషయ మిట్లు నిర్వచింపఁబడి యున్నది.

"ఏవం దత్వా గురుర్దీక్షాం కుర్యాత్పూర్ణాభిషేచనమ్ ।
వినా యేనా భిషేకేణ సాధకః పూర్ణ భోధతామ్ ॥
ఆచార్యత్వం చ నాప్నోతి సద్గతిం చ సమీహితామ్"

అని. దీక్షయందలి త్రైవిధ్యము దెలియవచ్చుచున్నది—

ఇట్టి దీక్షచే ద్విజునకు మూడవ జన్మ లభించుచున్నది.

## జన్మచతుష్టయము

ద్విజులని స్మరింపఁబడు బ్రాహ్మణక్షత్రియవైశ్యులకు యోగ్యతను బట్టి జన్మచతుష్టయము గ్గలుచున్నదను శిష్టోక్తి యిట్లు బరగుచున్నది—

"మాతు రగ్రేఽధిజననమ్ ద్వితీయం మౌంజిబన్ధనే ।
తృతీయం యజ్ఞదీక్షాయాం చతుర్థం న్యాసకర్మణి ॥

యజ్ఞదీక్షయందు మూడవ జన్మయనునది యజ్ఞభేదముచే రెండు విధములుగ నొప్పుచున్నది. యజ్ఞము కర్మయజ్ఞము జపయజ్ఞమని ద్వివిధము. అందు దీక్షా ప్రకరణమున నిచట జపయజ్ఞ మని గ్రహింపఁ బడవలయును. ఇట్టి జపయజ్ఞము భగవత్స్వరూపవిశేషమే యని "యజ్ఞానాం జపయజ్ఞోస్మి" యను భగవత్ప్రతిజ్ఞ సువిదితమే కదా. ఇఁక నాలవ జన్మ మన్ననో సన్యాస దీక్షచే లభించుచున్నది. ఇట్టి దీక్షావిభాగప్రక్రియ అనాద్యవిచ్ఛిన్న గురుపరంపరా ప్రాప్త భారతీ సంప్రదాయ మర్యాద యని రేణుకాతంత్రమున స్మరింపఁబడి యున్నది—

"భారతీయతయ స్సర్వే యతీనాం గురవః స్మృతాః
ద్విమాసంవా త్రిమాసం వా గ్రామే గ్రామే స్థితిః స్మృతా
గీతాదిపాఠం సర్వేషాం సమ ఏవోదితః సదా
భారతీనాం విశేషస్తు సర్వమన్త్రజపః సదా
ఆదిత్యాదిషు భక్తిశ్చ తత్పూజా తన్నివేదనమ్
ఏవంవిధాని కర్మాణి యతీనాం విహితాని హి
బాలాదిపాదుకాన్తానాం మన్త్రాణా ముత్తమం జపమ్
భారతీయతిభిః కార్యం నిత్యమేవ న సంశయః
ఓంకారజపమాత్రం త్వన్యేషాం తు విధీయతే
ప్రణవా దన్యమన్త్రాణా మనుష్ఠానంతు నాచరేత్
ఆచరే ద్యది మూఢాత్మా రౌరవం నరకం వ్రజేత్
భారతీనాం యతీశానాం ధర్మ ఉక్తః సనాతనః అని.

## విద్యాధికారయోగ్యత

దీక్షకు పరమప్రయోజనము విద్యాధికారయోగ్యతాసిద్ధి యని చెప్పఁబడెను. విద్యాధికార యోగ్యత యన నేమి? అయ్యది యెట్లు లభించు నను విశేష మొకింత చెప్పఁబడుచున్నది. "దేవో భూత్వా దేవా న్యజేత్" "నారుద్రో రుద్ర మర్చయేత్" అను విధినిషేధములచే నాయాయి దేవతాభావము నొందినవాడే ఆయాయి దేవతోపాసనమున కధికారి యనియు నట్టివాఁడే ఆ యాయి దేవతోపాసనమును జేయుటకు యోగ్యుఁడనియు నట్టివాఁడే యట్టి యుపాసనా ఫలమును బొందుననియు శ్రుతి స్మృతిశాసనము.

అదెట్లనిన—"అగ్నిర్వై దీక్షితః" అను శ్రుతిచే జ్యోతిష్టోమదీక్షచే నధ్వర్యునిచే దీక్ష నీయఁబడిన యజమానుఁడు అగ్నియే యని చెప్పఁబడుచు జ్యోతిష్టోమమునం దధి కృతుఁ డగుచున్నాడు. అట్టి న్యాయము ననుసరించియే జప యజ్ఞ దీక్ష యందుఁ గూడ సద్గురువువలన దీక్ష నొందిన సాధకుఁ డట్టి దేవతాభావము నొందునని శ్రుతి స్మృతి న్యాయ సమ్మతము. అయితే దీక్షవలన దేవతాభావ మెట్లు లభించు నన్నచోఁ జెప్పఁబడుచున్నది. జప యజ్ఞమునందు సాధనములు మనోవాక్కాయములని మూడు విధములుగఁ బరగుచున్నవి. అయ్యవి స్వభావముచే మానుషములని చెప్పఁబడుచున్నవి. అవ్వానికి దేవతాభావము నాపాదింపఁ బడనప్పుడు జపకర్తకుఁగూడ దేవతాభావము సంభవించును. దీక్షాప్రకరణములందలి విధానములు నానావిధములుగ నలరారుచున్నను, అన్నిటి యందును శక్తిపాతమగు సంస్కారము హస్తమస్తకసంయోగముచే ననన్యముగఁ దెలియవచ్చుచున్నది. అట్టి శక్తిపాతముచే గురువువలన శిష్యునియొక్క మనోవాక్కాయములు సంస్కరింపఁబడును. అద్దానిచే శిష్యుఁడు దేవతాభావమును బొందును. అను విషయమునందు శ్రుతి స్మృతి సదాచారములు పరమప్రమాణము. ఏతద్విషయ మిట్లు నిర్వచింపఁబడి యున్నది.—

"పరిపక్వమలా యే తా నుత్సాదనహేతుశక్తిపాతేన పరే తత్త్వే యోజయతి స దీక్షయా ఆచార్యమూర్తిస్థ" యని॥ ఇంకను—శాక్తీ శాంభవీ మాన్త్రీ యని దీక్షలు మూడు విధములు. అందు శక్తిప్రవేశనదీక్ష శాక్తీ యనఁబడును. చరణవిన్యాసము శాంభవీ దీక్ష యనంబడును. మంత్రోపదేశము మాన్త్రీ యనంబడును. అభిషేకాదికముచేఁ గాయము కళాగ్రహణముచే నంతఃకరణము గురూచ్చారణపూర్వక మన్త్రోచ్చారణముచే వాక్కును పవిత్రములుగాఁ జేయఁబడును. అంతియకాదు. దీక్షావిధి యందు గురువుచే శిష్యునియందు దేవతాప్రతిష్ఠ చేయఁబడునని తంత్రరాజమున నిట్లు నిర్వచింపఁబడియున్నది.

"చక్రే దేవ్యాం తథా శిష్యే ప్రతిష్ఠా త్రివిధోచ్యతే ।
సా తు తత్త్వవిదా కార్యా సంప్రదాయానురోధినా ॥"

యని దేవత గుర్వధీనము గావున దేవతాప్రతిష్ఠాధికారి గురువే. ఏతద్విషయము శ్రీరామచంద్రమూర్తిచే నిట్లు దాహరింపబడియున్నది.

"దైవాధీనం జగత్సర్వం మన్త్రాధీనం తు దైవతమ్ ।
తన్మన్త్రం బ్రాహ్మణాధీనం బ్రాహ్మణో మమ దేవతా ॥ యని ॥

## జపకర్తృలక్షణము

కాఠకశ్రుతి రథరూపకకల్పనచేఁ గర్తృలక్షణము నిట్లు నిర్వచింపఁబడి యున్నది.—

"ఆత్మానం రథినం విద్ధి శరీరం రథ మేవ తు ।
బుద్ధిన్తు సారథిం విద్ధి మనః ప్రగ్రహ మేవచ ।
ఇన్ద్రియాణి హయా నాహుర్విషయాం స్తేషు గోచరాన్
ఆత్మేన్ద్రియమనోయుక్తం భోక్తే త్యాహుర్మనీషిణః ॥"

అని—"దేహము ఇంద్రియములు మనస్సు అగు మూడిం టితోఁ గూడి వ్యవహరించు నాత్మయన దేహి. భోక్త యనఁ బడు. భోక్త యన ఫలముల నభిలషింపుచు నట్టి ఫలములకు నియతకారణములగుఁ గర్మములను యథోచితవిధి నాచరింప సమకట్టినవాఁడని యభిప్రాయము. అనుపేతు లగు ననగా నుపనయనసంస్కారరహితులగు ద్విజులకు స్వోచితములగుఁ గర్మలయందును అధ్యయనాదు లందును నధికార మెట్లుఁ గలుగదో యాతీరుననే యదీక్షితులకు మంత్రానుష్ఠానము దేవార్చనము మొదలుగాఁగల విశేషములందు నించుకేనియు నధికారము గలుగనేరదు. గావున నుపాసకుఁడు మంత్రసంస్కారమును బడయ వలయును. దీక్షా శబ్దార్థ మిట్లు నిర్వచింపఁబడి యున్నది.

"దీయతే జ్ఞానవిజ్ఞానం క్షీయన్తే పాపరాశయః ।
తేన దీక్షా ఇతి ప్రోక్తా ప్రాప్తా చే త్సద్గురో ర్ముఖాత్ ॥
అసద్గురుః స్వయం నష్టః కథం తారయతే పరమ్ ।
విం శ ద్విశ్వోపక గుణై ర్యుక్తో య స్స గురు ర్భవేత్ ॥-
గుర్వనుజ్ఞామృతే మోహా ల్లోభాద్వా కురుతే యది ।
సపుత్రదారో నిధనం ప్రాప్నువ న్నిరయం వ్రజేత్ ।
తస్మా త్పూర్ణాభిషేకేణ ప్రాప్తానుజ్ఞః సమాచరేత్॥అని

దీక్షావిశేషము వ్యతిరేకముఖమున స్తవముసేయఁబడు చున్నది.

## దీక్షాధికారమునకు యోగ్యత

ద్విజులకు దీక్షాధికారయోగ్యతకు హేతు వుపనయనమును తీవ్రవేదనయును, ద్విజస్త్రీలకు వివాహము తీవ్రవేదనయును, శూద్రులకు నాచార్యానుగ్రహమే యోగ్యతకుఁ గారణమని సర్వతంత్రములయొక్కయు పుష్కలమగు నిర్ణయము.

## ఆచార్యునకు హితోపదేశము

విద్యాభిలాషియు, దీక్షాభిలాషియు నగు శిష్యుని లెస్సగఁ బరీక్షించి యాచార్యుఁడు దీక్ష నొసంగవలయును. లేనిచో గొప్ప యనర్థమునకుఁ గారణము గల్గునని స్మరింపఁ బడుచున్నది. మేరుతంత్రమునందు—

"ధనార్థినః గురవః శిష్యాః సిద్ధ్యర్థినః కలౌ ।
తస్మా న్న చోభయో స్సిద్ధి ర్దేవతానాం విడంబనమ్ ॥
దత్వా దీక్షాం తు లోభాద్యై ర్దేవతాశాప మాప్నుయాత్ ।
పరశిష్యే చేష్టవంశే ధూర్తే పణ్డితమానిని ॥
స్త్రీద్విష్టే సామయే త్రస్తే వ్యంగే దీక్షా తు నిష్ఫలా ॥"

యని—ఇటులనే వామకేశ్వరతంత్రమునందు—

"శృణు దేవి మహాగుహ్యం యోగినీహృదయం పరమ్ ।
త్వత్ప్రీత్యా కథయా మ్యద్య గోపితవ్యం విశేషతః ॥
ఏవం త్వయాహ మాజ్ఞప్తో మదిచ్ఛారూపయా ప్రభో ।
కర్ణాత్కర్ణోపదేశేన సంప్రాప్త మవనీతలమ్ ॥
న దేయం పరశిష్యేభ్యో నాస్తికానాం న చేశ్వరి ।
న శుశ్రూషాలసానాం చ నైవా నర్థప్రదాయినామ్ ॥
పరీక్షితాయ దాతవ్యం వత్సరోర్ధ్వోషితాయ చ ।
ఏతత్ జ్ఞాత్వా వరారోహే సద్యః ఖేచరతాం వ్రజేత్॥"

అని.

యాస్క నిరుక్తమున నిట్లు స్మరింపఁబడి యున్నది—

"ఏతేన విద్యా హవై బ్రాహ్మణ మాజగామ ।
గోపాయ మా శేవధిష్టేహ మస్మి । అసూయకాయా
నృజవే యతాయ న మా బ్రూయా వీర్యవతీ తథా
స్యామ్ ॥" అని.

## ఆత్మపురాణమునందు

"బ్రహ్మవిద్యాతిసంఖిన్నే బ్రహ్మిష్ఠం బ్రాహ్మణం యయౌ ।
వరాంగనా సమాం మా హి మాకృథాః సర్వసేవినామ్ ॥
శేవధి స్త్వక్షయ స్తేహ మిహ లోకే పరత్రచ ॥" యని

ప్రారంభించి—

"నిన్దా గుణవతాం తద్య త్సర్వథా ర్జవశూన్యతా ।
ఇన్ద్రియాధీనతా నిత్యం స్త్రీసంగ శ్చావినీతతా ॥
కర్మణా మనసా వాచా గురౌ భక్తివివర్జనమ్ ।
ఏవమాద్యా యేషు దోషా స్తేభ్యో వర్జయ మాం సదా ॥
ఏవంహి కుర్వతో నిత్యం కామధేను రివాస్మితే ।
వంధ్యాన్యథా భవిష్యామి లతేవ ఫలవర్జితా ॥" యని
తస్మా దేవంవిధం శిష్యం న గృహ్ణీయా త్కథంచన ।
యది గృహ్ణాతి మోహేన తత్పాపై ర్వ్యాప్యతే గురుః ॥"

యని—

## గుర్వనుగ్రహ సంపాదమునకు గురుదక్షిణ

విద్యాభిలాషి శాస్త్రముచే నుపదేశింపఁబడినట్టి సద్గురువును వెదకికొని యాతనిచెంతఁ జేరి యథావిధిగ నాతనిచేఁ

బరీక్షితుఁడై దీక్షను బడసి యథాశక్తి గురువునకు దక్షిణ నొసంగవలయును. లేనిచో నాతని శక్తి శిష్యునకు సంక్రమింపదని తంత్రరాజమున నిట్లు నిర్వచింపఁబడి యున్నది

"ఏవం దేవి ప్రతిష్ఠాయాం క్రమః సాన్నిధ్యకారకః।
గురవే దక్షిణాం దద్యాత్ప్రత్యక్షాయ శివాత్మనే॥
సర్వస్వం వా తదర్థం వా తదర్థం వా తదాజ్ఞయా।
న చేత్తచ్ఛక్తిసంక్రాన్తిః కథ మస్య భవిష్యతి।
గజాశ్వమహిష మేషపశుదాసమహీమయమ్।
సువర్ణం భూషణం వాసో భవనం వాన్యదీప్సితమ్।
దద్యాత్స్వశక్తితో భక్త్యా త్వశక్తో యది సర్వదా।
సర్వదాసౌ సదాయత్తః తేన సిద్ధి ర్భవిష్యతి॥" యని.

ఇట్లు వర్తించు గురుశిష్యులు ఇహలోకమునందును బరలోకమునందును మహదైశ్వర్యమును బొందుదురను టకు నించుకేనియు సందియము లేదని మేరుతంత్రము నందు స్మరింపఁబడియున్నది—

"భక్తిశ్రద్ధాన్వితౌ శిష్యగురూ సంపూర్ణలక్షణౌ।
సర్వోఽపి మార్గ స్తత్కాలం భుక్తిముక్తిప్రదాయకః॥"

మేరుతంత్రమునందు—

స్త్రీశూద్రాదులకుఁ గూడ నధికార విశేషము ఇట్లు నిర్వచింపఁబడుచున్నది-

"స్వాగమోక్తేన మార్గేణ స్త్రీశూద్రైరపి పూజనమ్।
కర్తవ్యం సంస్కృతై స్తైశ్చ స్వాగమోక్తేన వర్త్మనా।
విధవాయా స్సుతాదేశా త్కన్యాయాః పితు రాజ్ఞయా।
భర్త్రైవ దీక్ష్యతే భార్యా యతోసౌ సర్వదా గురుః।
తయాపి పూజ్యో దేవస్య బుద్ధ్యాసౌ సర్వసాధనైః॥"

తన్త్రస్వరూపము

విద్యాభిలాషి సద్గురువుచే లెస్సగ దీక్షను బడసి అభీష్టదేవతానుగ్రహముకొఱకు దేవతోపాసనాతంత్రమును యథావిధి నారంభించి నిత్యము యథోచితముగను యథాశక్తిగను నాచరింపుచుండవలయును.

తంత్రమన్నది నిత్యము నైమిత్తికము కామ్యము అని ముత్తెఱంగులు. అందు నిత్యము మఱల ప్రధానము అంగము అని రెండు విధములు. అందు ప్రధానతంత్రమునకు దేవత గాయత్రి యని చెప్పఁబడుచున్నది. అయ్యది ప్రకట యనియు గుప్త యనియు రెండు విధములు. అందు ప్రకట యనునది యిరువదినాలు గక్షరములతో నొప్పారుచు నుపనయనదీక్షచే ద్విజులకు సంప్రాప్తమగుచున్నది. అయ్యది ద్విజత్వాధికారహేతువగుచు శ్రౌతము స్మార్తము మొదలుగాఁ గల సకల విద్యలకును అధికారహేతు వగుచున్నది. అయ్యది యథోచితకాలమున నుపదేశము సేయఁబడవలయును. లేనిచో ద్విజత్వము లభింపకపోవుట యటుండ శ్రౌతస్మార్తాదికర్మలయం దెట్టి యధికారమును లేకపోవుట యటుండ వ్రాత్యత యను ప్రత్యవాయము గూడఁ గల్గుచుండుటచే నట్టివాడు గేవలము పశుతుల్యుఁడై యగుచు సర్వకర్మ బహిష్కృతుఁడగుచున్నాఁడని శ్రుతిస్మృతిసదాచారప్రమాణము లుద్ఘోషింపుచున్నవి. అట్టివారలతో ద్విజు లెంతమాత్రమును యౌనధర్మములనుగాని బ్రహ్మధర్మములనుగాని నాచరింపకఁబోవుట యటుండ వారలు సంఘమునందు సర్వవిధముల నికృష్టులుగఁ ద్రోసివేయఁ బడుచుందురు ఇఁక గుప్త యన్నది యుపనీతునిచే వేదనాపూర్వకముగ నభ్యుదయనిశ్శ్రేయససాధనముగ యథోచితవిధిచే నన్వేషణముఁ జేసి గుర్వనుగ్రహముచేఁ బడయవలసిన విశేషము. అంతవఱకు నయ్యది గోప్యమె యగుటచే గుప్త మని జెప్పఁబడుచున్నది. అయ్యది మందమధ్యమోత్తమ భేదములచె మూడువిధములుగ నలరారుచున్నది. అందలి యుత్తమదీక్ష పూర్ణదీక్ష యని పండితపామరసామాన్యముగఁ జెప్పఁబడుచున్నది. అయ్యది సకలవిద్యాధికారహేతువును పరోపదేశాధికారహేతువునుగూడ నగుచున్నది.

ఇఁక నంగమన్నది గాణాపత్యము, శైవము, వైష్ణవ, సౌరము అని నాల్గువిధములు; ప్రధానమంగసహితమగుచు పంచాయతనోపాసనమని కొనియాడఁబడుచున్నది. ఇట్టి పంచాయతనవిద్యయే శ్రీవిద్యయని బుధులచేఁ గొనియాడఁబడుచున్నది. పంచాయతనోపాసనాఫలము పద్మపురాణమున పుష్కరఖండమున నాహ్నికప్రకరణము నందు నిట్లు నిర్వచింపఁబడుచున్నది.

"అతః పరంచ దేవానా ముద్భవం కారయే ద్బుధః।
గణేశం పూజయే ద్యస్తు విఘ్న స్తస్య న బాధతే॥
ఆరోగ్యార్థేఽర్చయే త్సూర్యం ధర్మమోక్షాయ మాధవమ్।
శివం ధర్మార్థమోక్షాయ చతుర్వర్గాయ చణ్డికామ్॥" యని.

అన్యచ్చ :—

ఆరోగ్యం భాస్కరా దిచ్ఛే ద్ధన మిచ్ఛే త్పరామ్బయా।
ఐశ్వర్య మీశ్వరా దిచ్ఛే న్మోక్ష మిచ్ఛే జ్జనార్దనాత్॥
నిర్విఘ్నేనార్థసిద్ధిః స్యా ద్గణనాథస్య చాజ్ఞయా॥ యని

పర్వములు మొదలుగాఁగల కాలభేదములచే విధింపఁబడునది నైమిత్తికమని చెప్పఁబడుచున్నది. కామ్యమన్నది యైచ్ఛికము. అయ్యది అభ్యుదయము, శాన్తికము పౌష్టికము అను బలుతెఱంగుల బరగుచున్నది.

నిత్యవిశేషము—నిత్యము సాధారణము అసాధారణము అని రెండువిధములు. సాధారణము మన్వాదులచే స్మృతులచే నుపదేశింపఁబడినది. అసాధారణమన్నది దీక్షచే గురువువలనఁ బొందబడినది యని విశేషము.

అందు మొట్టమొదట సాధారణమును బిమ్మట సాధారణా సాధారణరూపమును సామాన్యముగ నిర్వచింపఁబడు చున్నది—

ఉపాసనాతంత్రమన్ననో బ్రాహ్మముహూర్తమున సుషుప్తి నుండి మేల్కొనినది మొదలు మఱల రాత్రి రెండవ యామమున నిద్రించువఱకును వ్యాపించియున్నటులఁ దెలియవచ్చెడిని. దీక్షితునిచే మనస్సుచేతను వాక్కుచేతను కర్మచేతను నెయ్యది స్మరింపఁబడునో యెయ్యది పలుకఁబడునో యెయ్యది చేయఁబడునో యయ్యది యంతయుఁ దంత్రమని సంప్రదాయవిదులచేఁ జెప్పఁబడు చున్నది. అందులకు నిదర్శనము—"ప్రాణబుద్ధిదేహధర్మాధికారజాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థాసు మనసా వాచా కర్మణా యచ్చ స్మృతం యదుక్తం యత్కృతంతత్సర్వం బ్రహ్మార్పణం భవేత్" అను నాశీస్సు—ఉపాసకులకు సువిదితమేకదా!

తంత్రము:—సద్గురువువలన దీక్షను బడసిన సాధకుఁడు దంత్రమును లెస్సగఁ దెలిసికొని యాచరింపవలయును. అయ్యది సూత్రరూపమున నిట్లు నిర్వచింపఁబడు చున్నది.

"బ్రాహ్మే ముహూర్తే చోత్థాయేష్టదేవతాం స్మృత్వా హస్తౌ పాదౌ చ ప్రక్షాల్యాన్యవస్త్రం పరిధీయాచమ్య బ్రహ్మరన్ధ్రే నిజగురుం ధ్యాత్వా మానసోపచారైః సంపూజ్య "ప్రాతఃప్రభృతి సాయాన్తం సాయాదిప్రాతరన్తతః యత్కరోమి జగన్నాథ తదస్తు తవ పూజనమ్" ఇతి గురవే సర్వం నివేద్య త్రిపురసున్దరీం ధ్యాత్వా గురుమన్త్రదేవతాత్మనామైక్యం విభావ్య జపాం కుర్యాత్॥ తతః—"త్రైలోక్యచైతన్యమయి త్రిశక్తే విశ్వస్య మాత ర్భవదాజ్ఞయైవ। ప్రాతః సముత్థాయ తవ ప్రియార్థం సంసారయాత్రా మనువర్తయామీ"తి దేవీం సంప్రార్థ్య। "సముద్రమేఖలే దేవి పర్వతస్తనమండలే। విష్ణుపత్ని నమ స్తుభ్యం పాదస్పర్శం క్షమస్వమే" ఇతి భూమిం సంప్రార్థ్య శ్వాసయుక్తం పాదం నిధాయ గృహా ద్బహి ర్యామ్యాం నైరృతీం వా దిశం వ్రజేత్। అథ మౌనీ దక్షిణకర్ణోపవీతవాన్ నివీతం పృష్ఠతః కృత్వా సంవృతమస్తకో మూర్ధాన మస్పృశన్ రహస్యే మలం విసృజ్య మృత్తికయా జలేనచ యథావిధి శౌచం కృత్వా పశ్చా ద్దేశాన్తరం గత్వోపవీతవా నాచామేత్। అథావ్యగ్రః ప్రాఙ్ముఖో నిషణ్ణో దంతధావనం కుర్యాత్। పున రాచమ్యారుణోదయే తీర్థస్నానం కుర్యాత్। తీర్థస్నానాశక్తౌ గృహస్నానం కుర్యా ద్యథావిధి। అథ నవశమఖణ్డం శ్వేతం ధౌతవస్త్రద్వయం ధృత్వా స్నానవస్త్రం పరిపీడ్యాచమ్య తిలకం ధృత్వా స్థిరమనాః ప్రాఙ్ముఖ ఉపవిశ్య పవిత్రపాణిస్సన్నాచమ్య ప్రాణానాయమ్య స్వశాఖోక్తవిధినా సన్ధ్యా ముపాసీత। అథ సూర్యాయార్ఘ్యం దత్వా తీర్థతోయం సమాదాయాత్మనో మన్దిరం గత్వా స్వశాఖోక్తవిధినా సత్యహోమం కృత్వా బ్రహ్మయజ్ఞం నిర్వర్త్య తర్పణ మాచరేత్। తతః పూజాసంభారవాన్యాగమన్దిరం గత్వోపవిశ్యాసనే శుద్ధే గురూపదిష్టవిధినా పఞ్చాయతనమర్చయే ద్యథాధికారమ్। తతో మాధ్యాహ్నికవిధిం కృత్వా భుఞ్జీత। భుక్త్వా చాచమ్య తాంబూలం భక్షయేత్। దివాస్వాపం మైథునంచ న కుర్వీత। అథా సాయం సిద్ధాన్తచిన్తనం కుర్యాత్। కాలే సమనుప్రాప్తే సాయన్తనీం సంధ్యాం హోమం చ విదధ్యాత్। తతో దేవార్చన మాచరే ద్గురూపదిష్టేన విధినాథ భోజనం కుర్యాత్। తతః పుష్పానులేపనం కృత్వా శుద్ధశయ్యాయాం శయీత। ప్రాప్తే నిమిత్తే సపర్యావిధినా భార్యయా సహ శయీత యావద్రేతఃపాతః। తదపి నిషిద్ధదివసేషు వర్జయేత్। ఏవ మహరహః సమాచారత స్సిద్ధి ర్భవతి సిద్ధిర్భవతి॥"

ఆహారనిద్రాభయమైథునాదికర్మలు పశ్వాదులకు వలెనే మనుష్యులకుఁగూడ నైసర్గికముగ సమానములే యైనను అధికారవంతులగు పురుషులచే సకలక్రియలును శాస్త్రచోదితవిధిచే యథాకాలము మంత్రములచే సంస్కరింపఁబడి నిర్వర్తింపఁబడినచో పురుషులు పశుభావమువలనఁ దొలగి దేవతాభావమును బడయుదు రనుటకు శ్రుతిస్మృతి సదాచారములు పరమప్రమాణము.

## తంత్రసూత్రవ్యాఖ్యానము

పై తంత్రసూత్రముచే నుపదేశింపఁబడిన కర్మలయొక్క విశేషము జిజ్ఞాసువులయొక్క పరమప్రయోజనమునకై సంక్షేపముగా వ్యాఖ్యానము సేయఁబడుచున్నది.—

గురుశబ్దార్థ మిట్లు నిర్వచింపఁబడుచున్నది—

"గుశబ్ద స్త్వన్ధకారః స్యాత్ రుశబ్ద స్తన్నిరోధకః।
అన్ధకారనిరోధత్వా ద్గురు రిత్యభిధీయతే॥
గకార స్సిద్ధిదః ప్రోక్తో రేఫః పాపస్య దాహకః।
ఉకారో విష్ణు రిత్యుక్త స్త్రితయాత్మా గురుః పరః॥
గకారో జ్ఞానసంపత్తి రేఫ స్తత్ర ప్రకాశకః।
ఉకారః శివతాదాత్మ్యం గురు రిత్యభిధీయతే॥
గుహ్యాగమాత్మతత్త్వానన్ధానాం బోధనాదపి।
రుద్రాదిదేవరూపత్వా ద్గురు రిత్యభిధీయతే॥—
"వింశద్విశ్వోపకగుణై ర్యుక్తో య స్స గురు ర్భవేత్॥

అను శ్లోకముచేఁ జెప్పఁబడిన విశేషములుగూడ నిచట ననుసన్ధానమును జేసి సద్గురులక్షణమును దెలిసికొనునది.

దీక్ష—దీక్షాశబ్దార్థ మిట్లుఁ జెప్పఁబడుచున్నది.

దివ్యభావప్రదానాచ్చ క్షాలనా త్కల్మషస్య చ।
దీక్షేతి కథితా సద్భి ర్భవబన్ధవిమోచనాత్"॥ అని॥

దీక్ష ఉపనయనదీక్ష, వివాహదీక్ష, యజ్ఞదీక్ష, సంన్యాస దీక్ష యని దీక్షలు పలువిధములఁ దెలియవచ్చుచున్నవి. ఉపనయనదీక్షచే నధికారికి ద్విజత్వము లభించి జన్మసిద్ధి యగును. ఉపనయనదీక్షనొందనిచో ద్విజునకు రెండవజన్మ సిద్ధింపకపోవుట యటుండ నెట్టికర్మమునకు నించుకేనియు నధికారములేక వ్రాత్యతఁ జెందును. దానంజేసి పశు తుల్యుఁడగును. పశువులకంటె వైలక్షణ్యము ద్విపాత్త్వము మాత్రమే. అట్టివాఁడు పితరులకుఁ బుత్రుఁడనికూడ యనిపించుకొన జాలఁడు. దానంజేసి యట్టిసుతుని వేరొకనికి దానమిచ్చుటకుఁగాని, విక్రయించుటకుఁగాని లేదా యసూయతోఁ బరిత్యజించుటకుగాని యర్హులు గానేరరు. ఉపనయనముచే ద్విజత్వము లభింప మాతా పితరులచే నొకరికి దానమిచ్చుటకును విక్రయించుటకును లేదా త్రోసిపుచ్చుటకును యోగ్యతగల పుత్రత్వము నొందు చున్నాడు. దీక్షితుఁడగు వటువునకు విద్యాగ్రహణాధి కారము గలుగుచున్నది. వివాహదీక్షయందు దీక్షితయగు కన్యకకు పుత్రికాత్వము కర్మాధికారమును గల్గును. వివాహదీక్షచే నాడుపిల్లకు ద్విజత్వము లభించుటచేఁ బుత్రికవలన మాతాపితరులు బొందవలసిన కార్యములకు నధికృతు లగుదురు. యజ్ఞదీక్షచే యాగాధికారము గలు గును. సంన్యాసదీక్షచే జ్ఞాననిష్ఠకుఁ దగు నధికారము గలుగును. దీక్షావిధులు సుగోప్యములును గురుముఖైక వేద్యములును. దానం జేసియే "పూర్ణదీక్షాక్రమం దేవి యస్య కస్యాపి నోచ్చరేత్। ద్వాదశాబ్దం గురుశ్శిష్యం శోధ్యానంతర ముచ్చరే"త్త నువిధి బరగుచున్నది.

సాధకుఁడు :—సాధకశబ్దార్థ మిట్లు స్మరింపఁబడు చున్నది—

"సారసంగ్రహణాచ్చైవ ధర్మమార్గప్రవర్తనాత్।
కరణగ్రామనియమా త్సాధక స్సోభిధీయతే ॥" యని.

తంత్రము :—తంత్రమనఁ గర్తయొక్క కామనాసిద్ధికి హేతుభూతమగు దేవతానుగ్రహమును సంపాదించుటకు ననుకూలమగు పురుషవ్యాపారమని లక్షణము. అయ్యది సద్గురువువలనఁ బొందఁబడవలసిన విశేషములలో నగ్రగణ్యము.

బ్రాహ్మీముహూర్తము :—ఉషఃకాలము. "పంచపంచ ఉషఃకాలః సప్తపఞ్చారుణోదయః। అష్టపఞ్చ భవే త్ప్రాతః శేషః సూర్యోదయః స్మృతః" అనుచు నుషః కాలము నిరూపింపఁబడెను. అట్టికాలము రాత్రియందు పశ్చిమయామమని కూడ చెప్పఁబడును. అయ్యదియే పిపీలికాదిబ్రహ్మపర్యంతముఁగల సకలప్రాణులకును నైసర్గికముగ సుషుప్తినుండి మేల్కొను కాలముగా నల రారుచున్నది.

ఇష్టదేవత :—దేవతాశబ్దార్థ మిట్లు నిర్వచింపఁబడు చున్నది.

"దేహ మాస్థాయ భక్తానాం వరదానాచ్చ పార్వతి।
తాపత్రయాదిశమనా ద్దేవతా పరికీర్తితా ॥" యని—

ఏ దేవతయందుఁ దనకుఁ బరమప్రీతి యుండునో యయ్యది యభీష్టదేవత యని చెప్పఁబడును. నిద్రలేచిన వానికి ప్రాతఃస్మరణము అధికారమునుబట్టి దేవతాభేద ముచే భేదించుచుండును.

ఆచమనము :—"అన్తర్జాను శ్శుచౌ దేశే ఉదఙ్ముఖో పవిష్టో బ్రాహ్మేణ తీర్థేన శనైశ్శనై స్తోయం త్రిః పిబేత్। తతోఽఙ్గుష్ఠమూలే నాస్యం ద్వి రున్మృజ్య సకృ దుప స్పృశే దాస్యమ్। అథ దక్షిణేన తోయం గృహీత్వా సవ్య హస్తే పాదయోః శిరసి సంప్రోక్ష్య ఖానిచోపస్పృశేత్। చక్షుషీ నాసికే శ్రోత్రే హృదయ మాలభతే।" ఇట్లు ఆచ మనవిధాయక స్థలములన్నిటియందు నాచమనము సేయఁ బడవలయును.

బ్రహ్మరంధ్రము :—మూర్ధ్నిప్రదేశము సహస్రారచక్ర మని యుపాసకులచేఁ జెప్పఁబడుచున్నది. అయ్యది శ్రీగురువుల స్థానముగా విధింపఁబడుచున్నది.

నిజగురువు :—తనకు మన్త్రోపదేశమును గావించిన గురువే నిజగురువని చెప్పఁబడును. అట్టి గురుధ్యానమ నిన నాతని పాదుకాధ్యానము; పాదుక యన్ననే గురువుచే నుపదేశింపఁబడిన మంత్రస్వరూపము. పాదుక యనః

"పాలనా ద్దురితచ్ఛేదా త్కామితార్థస్య వర్ధనాత్।
పాదుకేతి సమాఖ్యాతా మమ తత్త్వం తవప్రియే ॥'

మానసోపచారములు :—విధినాచరణం ప్రోక్త ముప చార మితి స్మృతమ్। ఇచ్చట—లమిత్యాది బీజములచే మానసికముగఁ జేయఁబడు గంధ పుష్ప ధూప దీప నైవేద్యములే మానసికోపచారము లనఁబడును.

త్రిపురసున్దరీధ్యానము:—త్రిపురసున్దరీధ్యానము యథా ధికారము గురూపదిష్టమార్గమున నాచరింపఁబడ వలయును.

గురుమన్త్ర దేవతాత్మలకు నైక్యము :—గుర్వాదులకు భావనచే నేకత్వమును సంపాదింపవలయును. అద్దానిచే నంతరాత్మవేదనము గల్గును ఆత్మకును దేవతకును నుపా ధినిరాసముచే నేకత్వ మలవడును. దేవతకును మంత్ర మునకు వాచ్యవాచకభావముచే నైక్యము సహజము. అటులనే గురువునకుఁగూడ ఒకానొకవేళ నిట్టి భావన యుపాసనాకాలమునందుఁ గల్గుటకు నవకాశము చాలక పోయినను నియ్యది క్షణమాత్రమైనను నుపాసనాంగముగ సంపాదించినచో నయ్యది పురుషసంస్కారహేతువుగా నలరారును. మహాఫలప్రదమగును. కావున సాధకుఁడు

ప్రాజ్ఞత మీఱ నిట్టి యైక్యజ్ఞానమును సంపాదింప వలయును.

అజపావిధానము :—జపము ననది పురుషప్రవృత్త్యధీనమైనట్టి మానసికముగాని వాచికముగాని లేకాయుభయ రూపమైనట్టి కాని మన్త్రావృత్తి. అజప యన్ననేతద్భిన్నమును సహజసిద్ధమును సకలప్రాణిజీవనాధారభూతమును సకలకరణవృత్తి హేతుభూతమును 'హంసస్సోహ' మను స్వరూపమగు నుచ్ఛ్వాసనిశ్వాసాత్మకమగు ముఖ్యప్రాణవృత్తిరూపమగు గాయత్రి యని విఖ్యాతమగు చున్నది. అయ్యది యిట్లు నిర్వచింపఁబడియున్నది.

"శ్వాసోచ్ఛ్వాసతయా దేవి షట్ఛతాన్యేకవింశతిః।
సహస్రాణి దివారాత్రౌ హంసః శబ్దజపో భవేత్ ॥
స్పందనత్వేన సకలం వ్యాప్య తిష్ఠతి సర్వతః।
ఆత్మత్వే నాజపా జ్ఞేయా సూర్యసోమస్వరూపిణీ ॥
నిరంజనస్వరూపా చ నిరాభాసస్వరూపిణీ।
అతనుత్వతనుత్వాభ్యాం సూక్ష్మత్వేన వరాననే ॥
ప్రబోధాపాదనేనాపి మణ్డితా వహ్నిజాయయా।
షడఙ్గైః శోభితాం దేవీం హంసేనైవ ప్రపూజ్యతామ్ ॥
అవ్యక్తరూపగాయత్రీం ఛందోవక్త్రాం వరాననే।
సాక్షాత్పరమహంసాభాం దేవతాం పరమేశ్వరీమ్॥" అని-

అట్టి యజపాగాయత్రిని కేవల ముచ్ఛ్వాసనిశ్వాసాత్మకమైన వాయువృత్తిమాత్రమే యని యజ్ఞులు దలంచు చుందురు. అట్టి యజపాగాయత్రి నాశ్రయించియే సకల మంత్రములు, సకలక్రియలు లౌకికవైదికములన్నియును ప్రవర్తింపుచున్నవి. "గాయన్తం త్రాయతే" యను వ్యుత్పత్తిచే నీయజపాగాయత్రి యని గూడఁ జెప్పఁబడు చున్నది. ఎంతకాల మీయజపాగాయత్రి ప్రవర్తించి యుండునో యంతకాలమును ప్రాణులకు వ్యవహార క్షమత్వము. లేనిచో వ్యవహారలోపమును సకలజనవిదితమే. అజపావిధానమన్ననో గురుముఖైకవేద్యము.

భూప్రార్థనము :—సర్వకార్యములందును దనకు నాధారభూతమగు భూదేవతయొక్క యనుజ్ఞ యనుల్లంఘనీయము. అట్టి యవజ్ఞతచే భూదేవతకుఁ గోపము గల్గెనేని హద్దులేని యనర్థము గల్గుటకు సందియము లేదు. కావున నట్టి యవజ్ఞతనుండి తన్ను క్షమించి తనకు శ్రేయస్సు నొనర్చుటకుగాను భూదేవతాప్రార్థన మవశ్య కరణీయము.

శ్వాసయుక్తపాదము :—తాను నిదురలేచిన వెంటనే మొట్టమొదట భూమియందు పాదనిక్షేపణసమయమునఁ దన నాసాపుటమున నెద్దానినుండి శ్వాసము చలించు చుండునో యాపాదమే మొట్టమొదటనుంచి నడువవల యును. అద్దానిచే స్వరప్రచారమన శ్వాసప్రచార మాదిన మంతయును సక్రమముగ నడుచుచుండును. దానంజేసి త్రికరణములగు మనోవాక్కాయముల ప్రవృత్తి సక్రమముగ నుండి నియతవ్యాపారమునకుఁ గారణము గలుగును. లేనిచో శ్వాసమునకును దదనుసారి గమనమునకును వైపరీత్యము గలుగఁ ద్రికరణములకును సామరస్యము గలుగనేరదు. దానంజేసి పురుషుఁడు వ్యాకులచిత్తుఁ డగును. దానంజేసి కార్యదక్షుఁడు గాకపోవును గావునఁ జిత్తప్రసాదమునకు శ్వాసయుక్తపాదప్రక్షేపణ మావశ్యకము గావున నయ్యది విధింపఁబడుచున్నది.

బహిర్గమనమునందు దిగ్వ్యవస్థ—ప్రకృతము స యామ్యదిగ్గమనమో నిర్ఋతిదిగ్గమనమో విధింపఁబడు చున్నది. ప్రకృతగమనము మలచ్యుతికొఱకు. మలము దేవతలకు హేయమును అసహ్యకరమును, మలభక్షకులగు నసురాదులకుఁ బ్రీతికరము. గావున మలచ్యుతి యాసుర స్థానమునందుఁ జేయఁబడవలయును. యామ్యనిర్ఋతి దిశలు అసురసేవితములు గావున నట్టి దిగ్గమన మచట విధింపఁబడుచున్నది.

మలచ్యుతికాలమునఁ జేయవలసిన కార్యవిశేషములు— "అథ మౌనీ" యనునది మొదలుగాగల్గి "శౌచం కృత్వా" యనునది యంతముగాఁగల వాక్యముచే మలచ్యుతికాలమున నాచరింపవలసిన విషయ ముపదేశింపఁబడు చున్నది. మలచ్యుతి యపవిత్రమగు కర్మము; అట్టి కాలమునం దుపవీతము ధరింపఁబడెనేని యపవిత్రమగును, ధరింపఁబడకపోయినచో శూద్రత్వమలవడును గావున ధరింపవలయును. అట్లు ధరించుటయం దపవిత్రమెట్లు గాకుండునో యట్లు ధరింపవలయును—అందుచే "దక్షిణకర్ణోపవీతవా న్నివీతం పృష్ఠతో కృత్వా" యని చెప్పఁబడి యెను. దక్షిణకర్ణతలము సర్వవిధములచేత నెల్లయపుడును పవిత్రమేయగుటచే యథోచితవిధిచే ధరింపఁబడి నచోఁ బవిత్రతకు లోపముండదు. మలచ్యుతికి ననంతరము మృత్తికచేతను జలముచేతను శౌచము విధింపఁ బడుచున్నది—

"ఏకా లింగే గుదే సప్త దశ వామకరే తథా।
ఉభయోః సప్త దాతవ్యా స్తిస్రో జ్ఞేయాశ్చాపి మృత్తికాః॥
గన్ధలేపక్షయకరం మనోగ్లానిహరం పరం।
కుర్యా ద్ద్వాదశ గణ్డూషా న్పురీషోత్సర్జనా న్తరే ॥" యని-

స్త్రీశూద్రాదులకుఁ గూడ గంధలేపాదిక్షయకరముగ శౌచము విధింపఁబడుచున్నది. —ఇతి నారాయణస్మృతిః

# లౌకిక రాజ్యాంగము - మతప్రాశస్త్యము

కొండముది శ్రీరాములుగారు అడ్వొకేటు, తెనాలి.

ఆర్యమత ధర్మాదాయముల పరిపాలనమునకై ఆంధ్రరాష్ట్రపాలకవర్గముచే నియమింపఁబడిన అధికారిసమితిలో నుపాధ్యక్షపదవి నలంకరించియున్న శ్రీ సి. వి. ఎల్. వరప్రసాదరావుగారియాదేశమున అన్నవర శ్రీ సత్యనారాయణస్వామివారి ధర్మకర్త మున్నగు వారిచే నాహూతులై భక్తిప్రబోధ మొనర్చుట కొకప్రణాళిక నేర్పరచుటకు సమీహితులైన పండితులలో కొందఱు ఉపన్యసించుచు మన కేంద్రప్రభుత్వము మతాభిమానము లేని దగుటచే నార్యమత ధర్మములు వికాసము నొందుటకు తగిన వాతావరణము లేదను నిస్పృహను వెలిబుచ్చియున్నారు. అట్టి నిస్పృహ జనసామాన్యమునందును గలదు. అది సమంజసము కాదని నేను నుడివియున్నాను. నే నుపన్యసించు సమయమునఁ గొందఱు పండితులు లేరు. ఆ విషయమును అచ్చట నేను వివరించిన మరి కొన్ని విషయములను విపులీకరించుట యుచితమని నే నీ వ్యాసమును వ్రాయుచున్నాను.

పండితపామరులు నిస్పృహులగుటకు కారణము లేకపోలేదు. ఆర్యావర్తమును దిలీపరఘుశ్రీరామాది సూర్యవంశజులును బురూరవ భరత యుధిష్ఠిరాది చంద్ర వంశీయులును జిరకాలము పరిపాలించిరి. వారు రాజర్షులు. వారికి శ్రుతి స్మృతి సదాచారములు పరమ ప్రమాణములు. పిమ్మట క్షత్రియులును క్షత్రియేతరులును దొర లైరి. కాని వారలకుఁ గూడ నవియే ప్రమాణములు. మధ్యకాలమున నశోకాదులు చక్రవర్తు లైరి. వారు బౌద్ధులు. బౌద్ధధర్మ మపుడు రాజధర్మ మైనది. అటుపిమ్మట మహమ్మదీయులును మొగలాయీలును పరిపాలించిరి. వారు మహమ్మదీయమతస్థులు. ఇస్లామ్ వారిమతధర్మము, రాజదర్మమును అయినది. తరువాత పోర్చుగీసు ఫ్రెంచి బ్రిటిష్ వారు పాలకులైరి. క్రైస్తవము వారి మతధర్మమును రాజధర్మమునుగ విలసిల్లినది. భారతీయుల భాగ్యవశమున భరత ఖండము ఖండితమయ్యును ఎట్టకేలకు వారిచేఁ జిక్కనది. కాన శ్రుతి స్మృతి సమ్మతమైన వైదికమతము రాజధర్మమని వారేల ప్రకటించుకొనరాదు ? పాకిస్తానీయులు ఇసలాము తమ రాజధర్మ మని ప్రకటించుకొనలేదా ? యని పండిత పామరు లేకగ్రీవముగ ప్రశ్నించుచున్నారు.

వారి సంప్రశ్న మనుచితమని త్రోసివేయఁదగినదికాదు. కాని మన రాజ్యాంగ మెట్లు ప్రసవావస్థఁజెంది జననమైనదో వారు గమనించుటలేదు. మనరాజ్యాంగము ప్రజాస్వామికము. ప్రజాప్రతినిధులవలన నిర్మాణము చేయఁబడినది. ప్రజాప్రతినిధు లప్పటి శాసనసభ్యులు. వారు ప్రజలచే నెన్నుకొనఁబడినవారు. వారు రాజ్యాంగనిర్మాణము నందతికుశలులైన శాస్త్రజ్ఞుల సహాయముతో వివిధదేశ రాజ్యాంగములను శోధించియు వాటిపై విమర్శకులు నిర్దాక్షిణ్యముగ వ్రాసిన గ్రంథజాలమును బరికించియు చిరకాల మాలోచించి మన రాజ్యాంగనిర్మాణము చేసియున్నారు. ప్రజాప్రతినిధులలో కొందఱు హిందువులు, మరికొందఱు క్రైస్తవులు, ఇంకను గొందఱు మహమ్మదీయులు, పారసీలు మున్నగువారై యుండిరి. ప్రభుత్వధర్మము వైదికధర్మ మన్న హిందువులు కానివా రందఱకును గడుపుమంటయేకదా? అట్లే క్రీస్తవమో ఇస్లామో ప్రభుత్వమతధర్మమన్న హిందువు లంగీకరించరుగదా? కాన నాసేతు శీతాచలపర్యంతము మనదేశమునఁగల మతధర్మములన్నియు రాజధర్మములనియైనను జెప్పవలె, లేదా ఏమతధర్మమును రాజధర్మము కాదనియైనను జెప్పవలెను. అన్నియు రాజధర్మములని చెప్పుట కేమతాభిమానులు సమ్మతింపరు. సమ్మతించినను అది ఆచరణయోగ్యము కానేరదు. కాన రెండవదియే అనుసరణీయమైనది. ప్రపంచమున అనేకదేశముల ప్రాముఖ్యముగఁ బ్రజాస్వామికములుగల దేశముల రాజ్యాంగములఁ బరిశీలించినచో రాజ్యాంగములు మతాచారములతో ముడిపెట్టబడియుండనట్లు మనము గ్రహించఁగలము. మతము వ్యక్తిగత మనియుఁ బ్రజల ఆర్థిక సాంఘికనైతిక రాజకీయ వ్యవహారములతో సంబంధముగల రాజ్యతంత్రమునకును వ్యక్తిగతమైన మతమునకును సంబంధము లేదనియును ఆయా దేశ రాజ్యతంత్రనిర్మాతల యభిప్రాయమైనట్లు తెలియవచ్చుచున్నది. ఆ సూత్రమునే మనప్రజాప్రతినిధులు ప్రమాణముగ నంగీకరించినట్లుకూడఁ దెలియవచ్చుచున్నది. మన మెన్నుకొన్న ప్రతినిధు లొనరించిన శాసనమును మనము ఉల్లంఘించుట రాజనీతి కాదు. మన ప్రతినిధివర్గముచేతనే రాజ్యాంగము సవరణ చేయించుటయు అంతదనుక దానికి కట్టుబడియుండుటయును రాజనీతియై యున్నది. సవరణ దేశకాలస్థితులను బట్టి ప్రయత్నించ దగినదా కాదా యను విషయము గాఢముగ యోచించవలసినదై యున్నది.

ప్రభుత్వము మతధర్మాభిమానము లేనిదైనను రాజ్యాంగమునఁ బ్రజలు వ్యక్తులుగఁగాని సంఘముగఁగాని తమ తమ మతాచారముల స్వేచ్ఛగ ననువర్తించ వచ్చుననియు

సహజముగ వారి కావిషయమునఁగల స్వత్వమును ప్రభుత్వము పరిపాలించుననియు రాజ్యాంగముననే ఒక నియమ మంగీకరింపఁ బడియున్నది. ప్రభుత్వమునకు మతాభినివేశము లేని కారణమునఁ బ్రజలలో నానాటి కభివృద్ధి చెందుచున్న మతమునందలి యౌదాసీన్యము ప్రమాదకరముగఁ బరిణమించ గలదను భయముతోనే కేంద్ర ప్రభుత్వ సర్వాధికారియైన శ్రీ బాబు రాజేంద్రప్రసాదు గారు తామేగిన చోట్లనెల్ల మున్ముందుగ దేవాలయముల స్వామిదర్శనము చేసికొనుచు నర్చించి తీర్థప్రసాదములఁ గైకొనుచు మతాధిపతులను భక్తిపూర్వకముగ సేవించి వారి ఆశీర్వాదములను బొందుచునున్నారు. ఆంధ్రరాష్ట్ర మంత్రులలో శ్రీ చంద్రమౌళిగారును అట్లే చేయుచున్నారు. తక్కినవారుకూడ వారి అడుగుజాడలలో నడిచిన యెడల ప్రజల కుత్సాహము కల్గఁగలదు.

"యద్య దాచరతి శ్రేష్ఠః త త్తదే వేతరో జనః
స యత్ప్రమాణం కురుతే లోక స్త దనువర్తతే। అని

కదా శ్రీ కృష్ణభగవానుని యుపదేశము.

మరియొక విషయము. వైదికధర్మమునందు భక్తిశ్రద్ధలను బురికొల్పు పండితులు తమ యుపన్యాసములలో వైదికమతములలోనే ఒక దానిని భూషించుటయు మరియొకదానిని దూషించుటయును వదలివేయుట యవసరము. ఆంధ్రదేశమున ద్వైతము అద్వైతము విశిష్టాద్వైతము నను వైదికమతములు ప్రబలియున్నవి. అందు విశిష్టాద్వైతము వైష్ణవ శైవభేదములతో నొప్పుచున్నది. కేవలవైష్ణవులకు వైష్ణవక్షేత్రములు మాత్రమే సేవ్యములు అట్లే కేవలశైవులకు శైవక్షేత్రములు మాత్రమే సేవింపఁ దగినవి. విశిష్టాద్వైత ద్వైతమత స్వరూపములలో భేదమున్నను మధ్వమతావలంబులు వైష్ణవులుగనే పరిగణించఁబడుచున్నారు. అద్వైతులకు మాత్రము శివకేశవ భేదములేదు. మతభేదము లెట్లున్నను సగుణబ్రహ్మోపాసనము మువ్వురకును ఉపాదేయమే. ఉపాసనాదియందును అంతగా భేదములేదు. కావుననే విశాలహృదయులైన ధీమంతులును భగవద్భక్తులును భిన్నమార్గములొకే గమ్యస్థానమును బోధించునట్లు భిన్నమతములు కూడ నధికారి భేదమునుబట్టి క్రమముగనో సాక్షాత్తుగనో ఒకే బ్రహ్మమును బోధించునని బోధించియున్నారు. మహిమ్నస్తవములోని క్రింది శ్లోకమును బరికించిన ఆ విషయము తేటపడఁగలదు.

త్రయీ సాంఖ్యం యోగః పశుపతిమతం వైష్ణవమితి
ప్రభిన్నే ప్రస్థానే పర మిద మదః పథ్య మితిచ
రుచీనాం వైచిత్ర్యాత్ ఋజుకుటిల నానాపథజుషాం
నృణా మేకో గమ్యః త్వమసి పయసా మర్ణవ ఇవ."

దురదృష్టవశమున నొకానొకప్పుడు మన మాతృదేశమున మతవైషమ్యములు విపరీతముగఁ బ్రబలియుండియుండుట వాస్తవము, మత సామరస్యము బోధించవలసిన కాలమిది యని పలువురు గ్రహించియున్నారు. అట్లు చేయనియెడల వాటిల్లు అనర్థములును గుర్తించియున్నారు. కాన మతవిషయములంగూర్చి యుపన్యసించు పండితులు తమ శ్రోతలకు ఒక మతము ఉత్కృష్టమైనదనికాని మరియొకటి నికృష్టమైనదనిగాని బోధించి వైషమ్యములు పెంపొందించక భిన్నమతముల సామరస్యమును ప్రపంచించుట కర్తవ్యమని మనవిచేయుచున్నాను. భిన్నమతస్వరూప నిరూపణము చేయఁగూడదని నా యభిప్రాయము కాదు. చేయవచ్చును. ముండనమండనములు చేయుట తగ దనియే నాతలంపు.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

---

# హేమచూడోపాఖ్యానము

"కృష్ణభిక్షు"

(పూర్వతో ఽనువృత్తము)

తర్వాత, చపలచెల్లెలింకొకతె కలదు. దానిపేరు మహాశన. అది మనస్సు కింపని అయస్థిరునే మగనిగా గోరెను. అస్థిరు డెపు డామెయందు ఎక్కువగా మేలుపడెనో అపుడు దానిప్రీతికొఱకతడు భోగముల తెచ్చుకార్యమున తత్పరుడాయెను. ఎంతతెచ్చినను క్షణమాత్రమున దానిని మ్రింగి మఱల నాకలి పీడింపగా భోగముల దెమ్మని ఎప్పుడును ప్రియుని నాజ్ఞాపించును. అతడును ఎప్పుడును తెచ్చుటకే చూచును. అయిదుగురు బిడ్డలు తెచ్చినదానిని, మగడు మోసి తెచ్చినదానిని, క్షణమున మ్రింగి మఱల నాకలిపీడచే గ్రుంగును. ఎప్పుడు భోగవిషయముల దెండని బిడ్డలను పతిని ఆజ్ఞాపించును. స్వల్పకాలములోనే అదియు నిద్దరు బిడ్డలఁ గన్నది. వారిలో బెద్ద 'జ్వాలా

ముఖుడు.' పిన్న ' నింద్యవృత్తుడు.' ఎల్లకాలమును తల్లికి ప్రియతము లిద్దరు పుత్రులును. మహాశనయం దాసక్తిచే నస్థిరు డామెను గౌగిలించునో అపుడు జ్వాలాముఖుని జ్వాల యతని దేహమునం దంతట నెగయును. అస్థిరుడు మిక్కిలి పీడింపబడి గాఢమూర్ఛలో మునుగును. ఒకప్పుడు ప్రియసూనుడైన నింద్యవృత్తునితో గూడుకొని మృత తుల్యు డగును.

ఇట్లు అస్థిరు డెప్పుడు దుఃఖభోగములందు తత్పరు డాయెనో అప్పుడే స్వభావశుద్ధయైన నానఖి పుత్రవాత్సల్యము చేత దుఃఖభారము గైకొన్నది. మనుమలు నింద్యవృత్తుడు జ్వాలాముఖులతో చేరికొని ఆ మనుమలు తన్ను కౌగలించు కొనగా దేహము అంతయు తగులబడి నట్లయి లోకుల చేతను నిందితయై మృతప్రాయయైనది. ఎప్పుడును దాని ననుసరించియే నే నుండుటంబట్టి నేనును అట్లే యైతిని. ఇట్లు నఖిదుఃఖముతో ఎన్నియేండ్లు నేనును దుఃఖపడు చుంటిని.

ఇంతకు ఆ అస్థిరుడు ఈ మహాశనను గ్రహించుటచేతనే అస్వతంత్రు డయ్యెను. ఆ మహాశన జ్వాలాముఖ నింద్య వృత్త సమేతయై సవతి చపల తన్ను వర్ధిల్లజేయగా అవ్వ శూన్య పోషింపగా మామ మూఢుడు అభినందింపగా మగని యగ్రమున నిలచి అతనిం దనకట్టిడిలో పెట్టుకొని నది. ఆ అస్థిరున కేదో కర్మముపట్టి కర్మము చేవలె నేదో శరీరమును పొందినట్లై, కోరునది సుఖమే అయినను అనుభ వించునది దుఃఖమే కాగా దివానిశము బాధపడుచుండెను. అతని దుఃఖముచేత అతనితల్లి నాచెలి అట్లే యైనది. దాని దుఃఖముచేత నేనును అందరిని రక్షింప నుద్యుక్త నైతిని. శూన్యతోపాటు శూన్యనై మూఢునితోపాటు మూఢనై చపలతోపాటు చపలనై జ్వాలాముఖునితోపాటు తగుల బడుచు నింద్యవృత్తునితోబాటు నింద్యవృత్తనై తత్తదాకార ములదాల్చి ఈ విధముగా నైతిని. ఒక క్షణము నఖిని విడిచి యుండినచో అనఖి నాశన మయ్యెడిది. వారితో కూడినందున జనులు నన్నును వ్యభిచారిణి యనిరి. వా రందరు మూఢులే గదా! నేర్పరులు మాత్రము కొందరు నన్ను శుద్ధయని తెలిసియుండిరి.

నా జనని మహాసతి, విశుద్ధ, నిర్మలాకార, ఆకాశమున కంటె విస్తీర్ణ, అణువుకంటె సూక్ష్మ, సర్వజ్ఞ, అజ్ఞ, సర్వ క్రియారూపిణి, నిష్క్రియ, సర్వాశ్రయ, నిరాశ్రయ, సర్వా ధార నిరాధార, సర్వరూప అరూప, సర్వయుక్త అయుక్త, సర్వదా భాసమాన, అయినను ఎచ్చటను ఎప్పుడును ఎవ్వని కిని లక్షింపరానిది, మహానంద నిరానంద; మాతాపితృవర్జిత, కాని నావంటి తనయలు ఆమెకు సంఖ్యకు మీఱిగలరు. జలధియందు తరంగములట్లు నా సోదరీగణము అనం ఖ్యము. మే మందఱమును మహామంత్రవేదులము. మేము దేనితో కూడి తత్పరులమైనను స్వరూపమున మాత్ర తుల్యులము.

అస్థిరుడు ఎపుడు అలయునో ఇక చాలునని అత డపుడే తల్లియొడిలో నిర్భరుడై శయనించును. అతడు నిద్రింప గనే అతని కుమారులు నిద్రింతురు. ఎవ్వడును మేల్కొని యుండడు. అపుడు అస్థిరుని పురమును అతని సఖుడు ప్రచారాఖ్యుడు పూర్వద్వారద్వయమున దిరుగుచు రక్షిం చును. తనయునితోడ అతని తల్లి దానితో స్నేహితురాల నైన నేనును నిద్రింతుము. అందరు నిద్రింపగా చిరకాల మునకు నేను స్వస్థానమును బొంది తల్లి కౌగలింపగా అనిందితను అగుదును. మరల వారు లేవగనే వారిని వెంటనంటియే యుందునుగదా!

ఆ అస్థిరుని చెలికాడు మహాబలుడు ప్రచారుడు అస్థి రాదుల నందరిని అనుదినము పోషించును. వారినేగాదు. పురము, నా పురవాసుల నందరిని తనకౌగిలియందే రక్షిం చును. ఒక్కడయ్యు అనేకవిధముల కనబడును. దారము తెగిపోయిన మాలయందలి మణులు చెల్లాచెదరగునట్లు వాడు లేకపోయిన అంవరును నాశనమై పోవుదురు. అసలు అతడే నాదగ్గరకు వచ్చి వారందరితోను కలుపును. ఆ పుర మున వాడు సూత్రధారుడు. అయినను వాడు నా మూలక ముగనే జీవించువాడు. ఆ పురము జీర్ణించినపుడు వారి నింకొక పురమునకు శీఘ్రముగా పంపును.

ఇట్లు ప్రచారుని ఆశ్రయించి అస్థిరుడు ఎన్నోపురములకు వరుసగా రాజైయుండును. సతీపుత్రులతో ఆ అస్థిరుడు ఆ మహాబలుని ఆశ్రయించినను నేనెంత యెక్కువగా గారవించినను దుఃఖభాగుడుగనే యున్నాడు. చపలా మహాశనలతో కూడుకొనుటవలనను పుత్రులు జ్వాలాముఖ నింద్యవృత్తులతో కూడుకొనుటవలనను. ఇక యితరు లైదు గురు పుత్రులతో చేరెనా? వారందరన్నివైపుల లాగు చుండగా మహాక్లేశపరీతాత్ముడై సుఖలేశమును లేక యుండెను. ఒకొప్పుడు చపలచేత చాలితుడై ఖేదమును పొంది మహాశన కారణముగా అశనార్థము పరుగిడుచు జ్వాలాముఖునిచే ఆక్షిప్తుడై ఆపాదమస్తకము తగులబడు చున్నవాడై ప్రతిక్రియ నెరుగక మహామూర్ఛను పొందుచు నింద్యవృత్తునితో కలసి పరులచే గర్హింపబడుచు ఎప్పుడు యెక్కడను శోకమే కాగా తన్ను మృతతుల్యునిగా తలంచు కొనును. దుష్టులోద్భవుడు దుష్టపత్నీసుతులచే మోహి తుడు; వారే యెప్పుడును తన్ను నడుపువారు, వారితోపాటు అతడు చిత్రవిచిత్రములైన ఉచ్చనీచపురములందు ఉండును. ఒకప్పుడు క్రవ్యాదాదుల భూములందు కాంతార కీర్ణదేశముల, వేరొకకాలమున మిక్కిలి వేగుచోట, ఇంకొక

కాలమున జడశీతల ప్రదేశమునందు, ఒక్కొక కాలమున పూతిగంధవహమునందు, గాఢతమస్సులం దొకప్పుడు, ఇట్లెక్కువగా తన తనయుడు తపించుచుండగా సదా దుస్సంగమున నాచెలి దుఃఖమూఢ యయినది. ప్రియా, నేను స్వభావశుద్ధనయినను నిత్యము వ్యర్థముగా దానితో మూఢవలె నెక్కువగా తత్కుటుంబపరాయణ నైతిని. దుస్సంగతు డెవడు ఎక్కడనేని సౌఖ్యమును కొంచె మైనను పొందగలడు. మరుస్థలమున గ్రీష్మకాలమున నరుడెట్లు తృష్ణాశాంతిని పొందును? ఇట్లు చాలకాలము కాగా అత్యంతఖేదముచే నాయాచెలి భ్రమపడి మోహితయై నాతో నేకాంతమున నుండి ఉపాయ మెఱిగినది. ఇపు డది సరియైన పతిని పొందినది. తనయుని గెలిచి వాని తన యోధులను గట్టివైచి చంపి నాతోగూడి త్వరగా నా తల్లి పురమునకు వచ్చినది. నా తల్లిని మాటిమాటికి కౌగిలించి కల్మషరహితయైనది త్వరగా ఆనందసముద్రమున మునిగి స్వభావ మైనది.

ఇట్లు చెలిమిని బట్టి దుర్వృత్తి అని గ్రహించి నీవును నాథా, స్వమాతను బొంది నిత్యము సుఖమును బొందుము. నాథా, దీనిని స్వానుభవమును సుఖాస్పదమును నీకు జెప్పితిని.

---

# తంత్రాలోకము

(పూర్వతో ఽనువృత్తము)

*జమ్మలమడక మాధవరామశర్మ*

శ్లో॥ గురో ర్వాక్యా, ద్యుక్తిప్రచయరచనోన్మార్జనవశాత్
సమాశ్వాసాత్ శాస్త్రం ప్రతి ప్రముదితా ద్వాపి కథితాత్
విలీనే శంకాభ్రే హృదయగగనోద్భాసిమహసః
ప్రభోః సూర్యస్యేవ స్పృశత చరణాన్ ధ్వాంతజయినః

గురువు వచనమున, యుక్తికల్పనమున శాస్త్రపరిపాటి విశదముగ గోచరింపగా స్వపక్షనిశ్చయము కలుగును. అపుడు బుద్ధిగతమయిన యజ్ఞానము పోవును. బౌద్ధజ్ఞాన ముదయించును. పరామర్శదార్ఢ్యము కలుగును. శివసం మిత మయిన తంత్రమున విశ్వాస ముదయించును. ఇట్లివి మూడురీతులు. కొందరు గురువచనమున, కొందరు శాస్త్ర మున, కొందరు స్వయముగ సప్రతిభు లగుదురు. కొందరు మూడిటివలన నట్టి వా రగుదురు. వారు తీవ్ర తీవ్ర శక్తిభాజనులై శంకావికల్పము విడిచిపెట్టుదురు. వారి హృదయాకాశమున శంకామేఘము లుండవు. ఇక పరమాత్మోపాయము లందుకొందురు. క్రమముగా నా యుపాయముల నిరూపింతుము.

### శాంభవోపాయము

శివతత్త్వము ప్రకాశరూప మంటిమి. అది యఖండ మండలము. అందను ప్రవేశ మనుపాయసమావేశమున గల్గును. అనుపాయస్థితి లేని యాతడు ప్రకాశరూప శివ తత్త్వమున ప్రవేశము పొందనేరడు. అప్పు డాతడు స్వాతంత్ర్యశక్తి సర్వాధిక మని సంభావించును. అధికసంభావన మనునది కేవలకల్పనాప్రసవము. కల్పనా సారము గ నది యధికమని భావించు నాతడు నిర్వికల్పక సమావేశ మనుభవించును. ఇది యాతని యుపదేశము. "ఈ గోచ రించు సర్వము బోధగగనము ప్రతిబింబమాత్రమె. ప్రతి బింబ లక్షణ మిందు సుష్ఠు సమన్వయించును. ముఖము దర్పణమున ప్రతిబింబించును గదా! ప్రతిబింబ మది భేదమున భాసితము. వేరుగా గోచరించును. శక్తము కాదు. అన్యవ్యామిశ్రమయియే భాసించును. అద్దములో ముఖ మట్టిది. నో రూరినప్పటి దంతోదకమున రసము తాదృశము. ప్రాణమున గంధము, ఆనందేంద్రియమున మిథునస్పర్శము, యాకాశమున ప్రతిధ్వని యన్నియు నీదృశములు. ఈ ప్రతిబింబిత మగునటులనే యీ విశ్వ విశ్వము పరమేశ్వరప్రకాశమున ప్రకాశించునని సారము. ఇక దీని ప్రస్పంద మిట్టిది.

శ్లో॥ స్వాత్మత్వేపి విచిత్రం
నిఖిల మిదం వాచ్య వాచకాత్మ జగత్।
దర్పణనగరవ దాత్మని
విభానయన్ విజయతే విజయః ॥

వాచ్యవాచకమయిన ఈవిచిత్ర జగమంతయు, స్వాత్మ విజయు డాశివుడు దర్పణమున నగరము వలె జగమం తయు నాత్మలో నవభాసింప జేయును. విజయశివోపలబ్ధికి శాంభవ ముపాయ మిందు వివేచింతుము. పరోపాయమని శాంభవోపాయమునకు పర్యాయ నామము. ఇదియు నను త్తరరూపమయిన నిట చెప్పడు. అభ్నికాంతరమున జెప్పుట దాని జెప్పుటకె.

యః ప్రకాశః స సర్వస్య
ప్రకాశత్వం ప్రయచ్ఛతి

ప్రకాశనక్రియలో పరశివుడు కర్త. అతడె పరప్రమాత. ఆత్మ అనుత్తరుడు. ప్రకాశాత్ముడు. అతడె ప్రమాతృ ప్రమేయాత్మకమయిన విశ్వమున కంతకు ప్రకాశమానత నిచ్చును. విశ్వము నంతటిని స్వాత్మైకాత్మ్యమున నవభాసింప జేయును. అంతియకాని విశ్వ మన్నది ప్రకాశించుటకన్న వేరుగా నొకటి లేదు. అదియె వేరుగా నున్నచో ప్రకాశమానత్వమె కుదురదు. భావమె యుండదు. పరమేశ్వరుడే యనర్గలమగు తన స్వాతంత్ర్యమహాత్మ్యమున స్వాత్మభిత్తిలో విశ్వవైచిత్ర్యము ప్రదర్శించును. విశ్వమిది శివాతిరిక్తము కాదు. కాని యతిరిక్తముగ నుండును. ఇది యిందలి విచిత్రత. ఈవిశ్వము చిత్ప్రతిబింబమని తేలినది.

శ్లో॥ నిర్మలే ముకురే యద్వత్
భాంతి భూమిజలాదయః।
అమిశ్రా స్తద్వ దేకస్మిన్
చిన్నాథే విశ్వవృత్తయః॥

అమలినమయిన యద్దమున భూమిజలాదు లవభాసించునట్లు ఆ యొక చిన్నాథునం దీవిశ్వవృత్తు లమిశ్రములై భాసించును. ప్రతిబింబించుటలో నిది విభాగము. ఎందుగాని సదృశమె యవభాసించును. నిర్మల రూపమున రూపమె యవభాసించును. ఎందెం దేగుణము స్వచ్ఛముగ నుండునో యందం దది ప్రతిసంక్రాంత మగును. రూప మున్నచోట రూపమె సంక్రమించును. అన్య మతుకదు. ఇది యసంబద్ధము కాదు. దీని భావింపుడు!

శ్లో॥ ప్రచ్ఛన్నరాగిణీ కాంతా
ప్రతిబింబితసుందరం।
దర్పణం కుచకుంభాభ్యాం
స్పృశంత్యపి న తృప్యతి॥

ఒక రాగభరితహృదయ వనిత రాగిణీ యయినది. ఆమెరాగము రహస్యము, ఆమె ప్రచ్ఛన్నరాగిణి. దర్పణము చూచినది. కాంతుడందు ప్రతిబింబించెను. అది సుందర మయినది. కుచకుంభములతో గట్టిగ నాని పట్టినది. కాని యేమున్నది? తాకునె గాని తృప్తిపడలేదు. పెద్దలు దగ్గరలో నున్నారని యది యదను కాదని సాక్షాద్దర్శనము పొందలేక పోయినది. అయినను దర్పణప్రతిబింబద్వారమున "అమ్మ! నేను చూచితిని!" అని సంతోషము భావింపగలదు. తద్దర్శనమున నున్మిషితాహ్లాదయు కాగలదు. ఇంత యిది యిట్లయినవదని యామగ్ధ "ఏరికి తెలియకుండు నట్లు స్పర్శసుఖము కూడ పొందుదు" నని సహస్రజపము చేసినను ఫలమేమి? దర్పణమున ప్రియుని రూపసంక్రాంతి యున్నదే కాని స్పర్శసంక్రాంతి లేదు. అది యామెకు లేదు. సుప్రీత కాదు. ఏమయినది? రూపమునందె రూపము పరిక్రమించు ననిన ట్లయినది.

శ్లో॥ నైర్మల్యం ముఖ్య మేకస్య
సంవిన్నాథస్య సర్వతః
అంశాంశికాంతః క్వా ప్యన్యత్
విమలం తత్తదిచ్ఛయా॥

ఈ విశ్వ మంతయు సంవిత్సంలగ్నమై సంవేద్యమగును. సంవిన్నాథు డొకడే సర్వనిర్మలుడు. సర్వతః స్వచ్ఛుడు. దర్పణాదులందలి విమలత యంశాంశరూపము. రూపాది రూపమగు నంశ మంశ మవలంబించి దర్పణాదులు స్వచ్ఛములుగ నుండును. ఒకచో రూపము విమలముగా నున్న వేరొకచో రసము విమలము. మరి యొకచో స్పర్శము విమలము. లోకమున నన్నియునొకచో నుండవు. ఉన్నచో "సర్వత్ర సర్వం భాయాత్" అంతట నన్నియు భాసించేని. ఆమే యద్దములో స్పర్శసుఖము కూడ పొందేని. పరశివుని సంవిచ్ఛక్తియే యట్లట్లు ప్రసరించును. పరమేశ్వరుడే స్వస్వాతంత్ర్యమాహాత్మ్యమున బింబ ప్రతిబింబా ద్యాభాస విచిత్రముగ నవభాసించును.

శ్లో॥ భావానాం యత్ప్రతీఘాతి
వపు ర్మాయాత్మకం హి తత్
తేషా మేవా స్తి సద్విద్యా
మయం త్వప్రతిఘాతకం॥

లోకమున పదార్థములు కొన్ని ప్రతిఘాత మొనర్చును. ఇతరానుప్రవేశము నవి సహింపవు. అవి మాయాస్వరూప గోపనకారు లగుట పరమేశ్వర క్రియాశక్తి రూపములు. అవి యస్వచ్ఛములగుట ప్రతిబింబము గ్రహింపవు. మఱికొన్ని యున్నవి. అవి ప్రతిఘాత మొనర్పవు. వాని వపువు సద్విద్యామయము. జ్ఞానశక్తి స్వభావము। కావుననె యిట్టివి స్వచ్ఛములు, ప్రతిబింబగ్రహణసమర్థములు. ప్రతీఘాతి కాని యప్రతీఘాతికాని యాభాసమాత్రసారము. తాత్వికము కాదు.

తస్మా దేకో మహాదేవః
స్వాతంత్ర్యోపహితస్థితిః
ద్విత్వేన భా త్యసౌ బింబ
ప్రతిబింబోదయాత్మనా॥

ఆ మహాదేవు డొక్కడే తన స్వాతంత్ర్యమున స్థితి పొంది బింబమని ప్రతిబింబమని రెండుగా భాసించునే. కాని యంతయును సద్వయము. భావముల యవభాస మెంతేని



దేవాలయ నిర్మాణచాతురి - తిరువాలంగాడు



గోపుర శిల్పసంపద - తిరువాలంగాడు



తిరువాలంగాడు - నటరాజస్వామి

యాభానమాత్రసారము. అట్లె సంవిన్మయముగ గోచరించు నవియు యాభానసారములు. వీనికి బహిరూపమున నునికి లేదు. కావున బాహ్యార్థమున నభినివేశము వలదు. అది లేకున్న ద్వైతమోహము గతించును.

శ్లో॥ న దేశో న రూపం న చ నమయయోగో న పరిమా
న చా న్యోన్యాసంగో న చ తదపహానిః న ఘనతా॥
న చావస్తుత్వం, స్యా న్నచ కిమపి సారం నిజ మితి
ధ్రువం మోహః శామ్యే దితి నిరదిశ ద్దర్పణవిధిః॥

ప్రతిబింబము దర్పణమునకు వేరుగా నుండదు. కావుననే ప్రతిబింబమునకు దర్పణాతిరేకమున వేరు దేశమును లేదు. దర్పణమునకున్న కాఠిన్యము లేదు. వేరు రూపమును లేదు. మూర్తమయిన వేరు రూపమున్నచో నమాన దేశత్వమె కుదరదుకదా! ప్రతిబింబమునకు కాలనంబంధమును లేదు. దర్పణముకన్న పృథక్సత్తయే లేనప్పడే నమయనంబంధ మెట్లుండును? ప్రతిబింబమునకు పరిమాణమును లేదు. పరిమితమయిన దర్పణమున మహాగారము పర్వతము ప్రతిసంక్రాంత మగుచున్నది. ప్రతిబింబములం దన్యోన్యసంగమును లేదు. అనేక పదార్థములు సహప్రతిభాతములయినను పరస్పరము నిబిడ సంశ్లేష మేమియు లేదు. సర్వార్థములు వివిక్తముగ భాసించును. ఒకటొకటి యంటుకొనవు. రూపహాని లేదు. భాత మభాతము కానందున ప్రతిబింబ మవస్తువు కాదు. ప్రతిభాసించుచున్నది కదా! యని దాని తత్స్వరూపము కల వస్తు వనరాదు. నిజసార మేదియు లేదు. అంతయు నాభానమాత్రసారము. బాహ్యార్థవాదులు ద్వైతప్రథ గలిగి సంకుచితప్రజ్ఞు లగుచున్నారు. వారి సంకుచితజ్ఞానము శమింపవలెననియె దర్పణవిధి వ్యాఖ్యానించినది. కాగా; ఈ విశ్వము దర్పణ ప్రతిబింబమువిధమున సంవిదవస్థితమై యున్నది. తదతిరిక్తముగ లేదు. అందభినివిష్టులు కావలదని భావసారము తెలినది.

---

# తిరువాలంగాడు (వటారణ్య క్షేత్రము)

ఎక్జిక్యూటివ్ ఆఫీసరు రిపోర్టుబట్టి రచితము—'సబ్ ఎడిటర్'

ఉత్తరభారతమున బదరికారణ్యమువలె దక్షిణ భారతమున వటారణ్యక్షేత్రము ప్రసిద్ధమగు దివ్యక్షేత్రము. భారతదేశమున అరణ్యాంతనామములతో ప్రసిద్ధములగు దివ్యక్షేత్రములు దైవప్రతిష్ఠితములుగాఁ గన్పట్టును. ఉత్తరమున బదరికారణ్యము, బ్రహ్మారణ్యము, కేదారారణ్యము, నైమిశారణ్యముల వలె దక్షిణమున, వటారణ్యము, వేదారణ్యము, శ్వేతారణ్యము, సిద్ధారణ్యములు ప్రసిద్ధములు. విష్ణుక్షేత్రముగ బదరికారణ్యమున కెంత ప్రతీతియో శివక్షేత్రముగ వటారణ్యమునకును నంత ప్రతీతి గలదు. బదరికారణ్యమున శివుని జటాజూటమునందలి గంగ మందాకినీ, అలకనందలై ప్రవహించును. వటారణ్యమున గల మోక్షపుష్కరిణియం దీగంగ పడునని ప్రతీతి. ఈ క్షేత్రమునకు "తి రు వా లం గా డు" అని నామము. తిరు=శ్రీ. అలం=మఱ్ఱి, కాడు=అడవి అని వచ్చినది.

ఈ క్షేత్రము ఆంధ్రరాష్ట్రమునందలి చిత్తూరు జిల్లా తిరుత్తని తాలూకాలోనిది. మద్రాసు-రేణిగుంట రైలు మార్గములో మద్రాసుకు 35 మైళ్ల దూరమున తిరువాలంగాడు రైలుస్టేషను కలదు. యాత్రికు లిచట దిగి క్షేత్రమునకు పోగలరు.

ఈక్షేత్రమునందలి ప్రతిష్ఠితుడగు స్వామి వటారణ్యేశ్వర స్వామి యని యందురు. కాని స్థలపురాణమును బట్టిచూడ శివుడు తాండవరూపమున యిచట తపస్సుచేసిన తన భక్తులగు సునందునకు (తరువాతను ముంజికేశుడుగా పిలువబడెను—) కర్కోటకునకు దర్శనానుగ్రహమొసగినందున యీమూర్తిని నటరాజమూర్తి యని కూడ వ్యవహరింపవచ్చును. పంచ భూతమయ లింగములలో వాయులింగముగ చిదంబరమున నుండునట్లు యిచటను ఆకాశలింగముగ నటరాజమూర్తి యున్నట్లు ఐతిహ్యము. "పంచారం చక్రం పరివర్తతే పృథు" ఇత్యాది త్తైత్తిరీయారణ్యకభాగములో వివరింపబడిన పృథివ్యప్తేజోవాయ్వాకాశతత్త్వాత్మకలింగములలో నాల్గవది యగు కనకసభ చిదంబరమున శివుని తాండవక్షేత్రమువలె అయిదవది యగురత్నసభయు వటారణ్యమున శివుని తాండవక్షేత్రము. ఇచటి యమ్మవారు భ్రమరాలకాంబ—ఆవరణదేవత భద్రకాళి. ఈ ఆలయ నిర్మాణము యొక్క కాలము సరిగ తెలియదు. గాని క్రీస్తుశకం 1200 సంవత్సరపు శాననముల వలన చోళ, పాండ్య, పల్లవ రాజులు ఈ ఆలయమును అభివృద్ధి పరచిరనియు, తరువాత కృష్ణదేవరాయలు అయి

దంతస్తులుగల పెద్దగోపురమును నిర్మించినట్లును, ఆల యమునందలి శాసనములవలన తెలియదగును. ఆర్కి యాలజీ డిపార్టుమెంటు వారి సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్సు లోని 383-439 పేజీలలోని శాసనముల వలన క్రీస్తుశకం 1173 సంవత్సరంలో రాజేంద్రచోళుడు యీక్షేత్రనిర్వ హణమునకై కొన్నిగ్రామములు, సంవత్సరమునకు 3280 బస్తాల ధాన్యం వచ్చు మాన్యములు, 193 కళంజీలు (కళంజీ అనగా తూకపుమానము) బంగారం యిచ్చినట్లు కానవచ్చుచున్నది. ఈ ఆలయమునందలి శిల్పసంపద హంపీక్షేత్ర శిల్పసంపదను కూడ మించి యున్నది—

శ్రీకృష్ణదేవరాయల యనంతరము ఈ ఆలయమును పాళయపట్టు సంస్థానాధీశులు నిర్వహించుచుండిరి. అనం తరమున ఈ ఆలయనిర్వహణము యిచటి శైవపీఠాధి పతులు చేకొనిరి. ఇచట యీ క్రింది నాలుగు శైవపీఠ ములు, తదధిపతులు కలరు—

1. కార్కోటకమఠం—అధిపతి—శైవపండారం అను శైవాచార్యులు—వీరు ప్రాతఃకాల పూజావిధులను నిర్వ హించుచుండిరి.

2. కారెక్కాలమ్మ పీఠం — శైవాచార్యులు — వీరు మధ్యాహ్న పూజావిధులను నిర్వహించుచుండిరి.

3. నాట్టుమఠం—దీనికికూడ కార్కోటకపీఠాధిపతియే అధిపతులు—వీరు రాత్రిపూజను నిర్వహించుచుండిరి.

4. శ్రీ ముంజికేశస్వామి మఠం. అధిపతి—ధర్మశివా చార్యులవారు వీరు సాయంకాలపూజలను నిర్వహించు చుండెడివారు—

పైవారిలో స్పర్థలు పెరిగి పూజావిధులు సరిగ నిర్వ హింపబడక పోవుటచే శ్రీ కార్వేటినగరం రాజువారు యీ క్షేత్రమును నిర్వహించుచుండిరి. అనంతరము ఈఆలయ నిర్వహణాధికారము దేవాదాయ ధర్మాదాయశాఖకు ఒప్ప గింపబడెను.

## పౌరాణిక ప్రశస్తి

సునందు డను మహాముని తన యుగ్ర తపస్సుచే శివుని ప్రసన్నునిగా జేసికొనెను—అతని తీవ్రతపంబునకు ప్రసన్నుడై శివు డాతనికి ప్రత్యక్షమయ్యెను. సునందుడు ప్రణమిల్లి యిట్లు ప్రార్థించెను—"దేవదేవా! నీవుతక్క అన్యదేవతలను నేనారాధించి యెరుగను—త్వదేకధ్యాన నిష్ఠతో దివ్య తేజోరూపముగ, చిద్రూపమైన, నిసగుణాకార మగు రూపతాండవమును నేత్రములతో ననుభవించి యానందమును పొందగోరుచున్నాను. ఈ నా కోరిక నెర వేరునట్లనుగ్రహింపవలెనని ప్రార్థించుచున్నాను. అ భక్తుని కోరిక విని శివు డిట్లనుగ్రహించెను—"ఓయీ! దక్షిణ మున వటారణ్యమను క్షేత్రముగలదు.—ఆ క్షేత్రమునందు, మూర్తి, సభ, తీర్థము మూడును అత్యుత్తమ మైనవి. నీ వచటికి పోయి తపం బాచరించుము. నీ కోరిక నెర వేరును." అని.

శివుడు జీవాత్మముక్తికొరకై సర్వకాలము, సూక్ష్మశరీర ముగా (అంతర్ముఖముగా) యీ క్రింది స్థలములందు తాండవము చేయుచుండునటుల ప్రతీతి గలదు.

1. కైలాసము, 2. శివలోకము, 3. హిమోద్గారి, 4. దేవలోకము, 5. భద్రపీఠము, 6.నేపాళము, 7. కాశీ, 8. కామరూపము, 9. నైమిశారణ్యము, 10. కురుక్షేత్రము, 11. మందరగిరి, 12. కమలానందగిరి, 13. భుజంగ కులపర్వతము, 14. సౌరాష్ట్రము, 15. కేరళస్థానము, 16. కేదారము, 17. బదరికాశ్రమము, 18. చంద్ర స్థానము, 19. సుమంత్రము, 20. వీరాపురంధరము, 21. విశాలాక్షము, 22. మేరుపర్వతము, 23. పణ్ణగ వనము, 24. చోడమారము; 25. అమ్రకము, 26. తులసీ వనము, 27. అయవంది, 28. శూలవరము, 29. శిఖం డము, 30. అసారము, 31. మంజరి, 32. గాంభీర్యము, 33. అప్పృతము, 34. బ్రహ్మాండము, 35. ఐరావతి, 36. మాయూరము, 37. చిత్రసేనాకరము, 38. పుష్క రిణి, 39. పాతాళము, 40. మంత్రాశ్రయము, 41. హేమ కూటము, 42. కమలమణి, 43.శివాశ్రమము, 44.సిద్ధా శ్రమము, 45. చిత్రకూటము, 46. మల్లికార్జునము, 47. గంగానదీద్వారము, 48. పుష్పరథము, 49.ఉదయ గిరి, 50. పున్నాగవనము, 51. నందిపురం, 52. కుంభ కోణము, 53. నాళరక్తము, 54. సీర్కాళి, 55. సోమ పీఠము, 56. సాలగ్రామము, 57. ఋషభాచలము, 58. సరస్వతీ తీర్థము, 59. చిదంబరము. 60 యవది ముముక్షువుల హృదయ స్థానము.

పురాణములలో చెప్పబడిన పై అరువది స్థానములలో కొన్నింటిని మాత్రమే నేటికాలమున ఆ యా నామములతో గుర్తెరుగ గలము. ప్రాచీన భారత దేశము నందలి దేశ ములు, నదులు, క్షేత్రములు, నగరములు—ఇవి పురాణ ములలోను, ఇతిహాసములలోను వర్ణింపబడిన నామములు. నేటికాలమున మారినందున గుర్తెరుంగుట కష్టము. అయి నను తెలిసిన వారెవ్వరైన నుందురనియు, శివుడు ఈ విధముగా లోకసంగ్రహార్థమై అంతర్ముఖముగా జీవుల యందు తాండవము చేయునని సూచించుటకే యీ అరు వది స్థానముల నిందు పొందుపరిచితిమి.

ఇట్లు వటారణ్యమున సునందుడు తపస్సు చేయు చుండెను. అక్కడకే కర్కోటకుడు కూడ తపమాచరిం చుట కరుదెంచెను. కారణము:—శ్రీపరమశివుని హస్త మునకు కంకణభూషణమగు కర్కోటకు డొకనాడు విషము

క్రక్క ఆ విషము శివుని చేతిమీద పడెను. ఆమాలిన్య మునకు శివుడాగ్రహపడి యింకను కర్కోటకునికి పూర్వ జన్మ సంచితానుభవమున్నదని యాకర్కోటకుని తనమండి మానవలోకమునకు పొమ్మనియెను. అంత నాకర్కోటకుడు శివుని తన ప్రారబ్ధకర్మము నశించుట కనుగ్రహింపమనియు తాను తిరిగి నరలోకమునకు పోనిచ్చగించ ననియు ప్రార్థించెను. కరుణామయుడును, భక్తపరతంత్రుడును నగు పరమశివుడు కనికరించి కర్కోటకునితో నిట్లనెను. "ఓయీ! వటారణ్యమున సునందుడు తపం బొనరించు చున్నాడు. నీవును అచటికి పొమ్ము. కొంత కాలము నన్ను గురించి తపం బొనరింపుము. నా తాండవనృత్యమును సునందునికి చూపి యనుగ్రహించునపుడు అతనితో కూడ నిన్ను కూడ ననుగ్రహించెదను." అది విని కర్కోటకుడు యిట్లు ప్రార్థించెను. "మహాప్రభో! సర్వసమర్థులగు మీచేతి కంకణముగా నున్నందున నాకు గరుడునివలన భయము లేకపోయినది. తమ చేతినుండి విడువబడిన నాకు వెనువెంటనే గరుడునివలన నాపద కలుగును. దీనిని నెట్లు తప్పించుకొనెదను." అనిన సర్వజ్ఞుడగు శివు డిట్లు పలికెను. "కర్కోటకా! భయపడకుము. నా జటాజూటము నందలి గంగయందు నీవు మునిగిన తిన్నగా వటారణ్య క్షేత్రమునందలి ముక్తితీర్థమునందు తేలగలవు. నీకు గరుడుని వలని భయము లేకపోవుటయే గాక నీ అంతర బాహిరమాలిన్యములు కూడ తొలగును." అనిన కర్కోటకు డట్లే చేసెను.

ఇట్లు వటారణ్యమునందలి ముక్తితీర్థమునకు పవిత్రత పురాణములందు చెప్పబడినది. ఇందు స్నానమాచరించిన కుష్ఠాదిమహారోగములు కూడ నశించునని ప్రఖ్యాతి గలదు.

ఇట్లు కర్కోటకుడును, సునందుడును వటారణ్యమున తీవ్రమగు తపము చేయుచుండిరి.

శుంభ నిశుంభాసురులను సంహరించిన పిదప చాముండి, అనంతరము రక్తబీజుని సంహరించుట కవతరించిన శక్తిరూపిణియగు భద్రకాళియై యీవటారణ్యమున పార్వతియానతిచే శివతాండవమునకై వేచియుండి యచటి పశు పక్ష్యాది రక్తపానము జేయుచు తమోరూపిణి యగుటచే ప్రాణులకు హింసను కలుగ జేయుచుండెను. ఈహింసానివృత్తి నొనర్పవలెనని బ్రహ్మాదిదేవతలు శివుని ప్రార్థించిరి. అంతట శివు డుగ్రరూపముదాల్చి, నిత్యప్రళయము, నిమిత్తప్రళయము, ప్రాకృతప్రళయము, అను అవస్థలను దాటి అష్టభుజములతో, కపాలము, శూలము, అంకుశము, పాశము, పట్టిశము, ఖడ్గము, వేలాయుధము, ఘంట ఈ యెనిమిది ఆయుధములను ధరించి, పార్వతీ, గణేశ, సుబ్రహ్మణ్య, భైరవ, వీరభద్ర, శాక్త, భృంగి, నంది, చండీశ, భూతగణ, పరివారములతో బయలుదేరి స్వైరవిహారమొనరించు భద్రకాళీ నివాస భూతమగు వటారణ్యమున కేగెను. అచట యిరు పక్షముల సైన్యములకు యుద్ధము జరిగెను. ఆ సమయమున భద్రకాళికి పార్వతి పూర్వము వచించిన మాట జ్ఞప్తికి రాగా "ఓహో! శివుడే వచ్చియున్నాడు; నేను అతనిని కలియుదును." అని మనస్సునందు తలంచి శివుని వద్దకు పోయి అహంకారముతో నిట్లనెను. "ఓయీ! నీవెవ్వరవు? నా యాజ్ఞ లేనిదే యీ యరణ్యమున ప్రవేశించితివి. ఈ యరణ్యము నా భుజబలార్జితము. నన్ను జయింపనిదే యిందు ప్రవేశింప శక్యము కాదు." అనిన పరమశివుడు కొంచెము చిరునవ్వుతో యిట్లు పలికెను. "ఓహో! నీవు కేవలము తమోగుణప్రధానమగు నహంకారముతో నిండి నేనెవ్వరినో గుర్తించ లేకున్నావు. యుద్ధమును కాంక్షించు చున్నావు. అట్లే నీ యభీష్టమేల కాకూడదు? నీవు కోరు కొనుము. ఎట్టి యుద్ధము నీకు కావలయును?" అనిన భద్రకాళి "నృత్తయుద్ధములో నన్నోడించిన సంతసించెదను." అనిన వెంటనే పరమశివుడు తమ యిరువురి తాండవ నృత్త యుద్ధమునందు జయాపజయములను నిర్ణయించుటకై తపంబాచరించు మన్న సునందముని కర్కోటకులను పిలువ బంపెను. సునందమహర్షి ధ్యాననిమగ్నుడై తీవ్రతపంబున నుండ నతనిపై పుట్ట పెరిగి అందు ముంజిగడ్డి మొలచెను. అది చూచి పరమేశ్వరు డాతని "ముంజికేశా! లెమ్ము! నీ తపంబునకు మెచ్చితిని. నీవు కోరిన తాండవదర్శన వరమునొందితివి. రమ్ము. తాండవమును జూచెదవుగాక!" అని బిగ్గరగా పిలువ సునందుడు కర్కోటకునితో నాసభ కరుదెంచెను. అచట బ్రహ్మాదిదేవతలు, ఇంద్రాది దిక్పాలురు, ద్వాదశాదిత్యులు, అష్టవసువులు యక్షగంధర్వకిన్నరులు వచ్చి సభ నలంకరించిరి.

సభయందు భద్రకాళియు, శివుడును, నవ రస భావాలంకారములతో, భావ రాగ తాళ యుక్తముగా నృత్యము చేయుచు పరమశివుడు మేఖలాభరణము కదలక నటించుటను భద్రకాళి చూచి తనదే జయమను భావముతో చూడగా శివుడది గ్రహించి చండతాండవమును (అనగా దక్షిణపాదమును క్రింద నిలువబెట్టి వామపాదమును పైకెత్తి అందుపై హస్తమును బెట్టి ఉగ్రముగా నటించుట) చూపిరి. ఈ తాండవమునం దొకరికిని తెలియని విచిత్ర సంఘటన కలదు. పరమేశ్వరుని యెడమ చెవి యందలి కుండలము క్రింద పడగా దానిని తాండవములోనున్న పాదముతో తీసి చేతి కందించుకొని చెవికి ధరించిరి. ఈ యుగ్రతాండవమును భద్రకాళి చూచి కొంచెము భయపడి

తరువాత సిగ్గుపడి జయకాంక్షతో తానుకూడ వామపాదము నెత్తుట కాయత్తపడగా పార్వతి అమెను కోపపడి నృత్యమును అపమని శివుని ప్రార్థించెను. లోకకళ్యాణమును కోరు శివుడు తన ఉగ్రతాండవము నుపసంహరించెను. భద్రకాళియు సిగ్గుతో తలవంచుకొనెను. అంత శివుడామెను చూచి యిట్లనెను. "నీవు మహాశక్తి స్వరూపిణివి. నీవు తప్ప నాతో తాండవమొనర్చు వారెవ్వరునులేరు. గనుక నీవు యిప్పటినుండి తమోగుణమును విడచి కేవలము సత్త్వగుణప్రధానురాలవు కమ్ము! ఈ క్షేత్రమునందు భక్తులు ముందుగా నిన్ను పూజించినగాని నాకడకు రారు. ఇదియే నీకు నావరము." అని భద్రకాళికి ప్రసన్నుడై వర మొసంగెను.

సునందమహర్షికి "ముంజికేశుడ"ని పేరొసగి తన ప్రక్కనే యుండవలయునని యానతిచ్చి కర్కోటకుని తిరిగి తన కంకణముగా స్వీకరించెను.

ఈ స్థలపురాణమువలన యీ వటారణ్యస్వామి యెట్టి దుర్మార్గులనుకూడ చేర దీసి ముక్తినొసగుననియు, తమోऽహంకారములను పారద్రోలి సత్త్వగుణమును ప్రసాదించు ననియు తెలియనగును.

ఇట్టి మహత్త్వము కల పవిత్రక్షేత్రము—ఈ వటారణ్యము. (తిరువాలంగాడు) ఇందు నటరాజస్వామి—అకాశలింగము—శాంత్యతీత కలా రూప మీ రత్న సభ· భక్తులకు వరముల నొసగుగాక!

శ్లో॥ సేతు ర్వ్యాదపురీ చిదంబరసభా గోకర్ణ పంపాపురీ
శ్వేతారణ్య వటాటవీ శ్రుతిపురీ శోణాద్రి వృద్ధాచలా।
కాంచీ శ్రీగిరి కాళహస్తి నిలయాః కేదార వారాణసీ
కైలాసా ఇతి శంకరస్య నిలయాః ఖ్యాతా హి ముక్తిప్రదాః॥

శ్లో॥ నిరాకారజ్యోతిర్మయ మకల మత్యంత మమలం
మహాదీర్ఘం స్థూలం నిరవయవ మత్యంతరుచిరం।
మహానాదం లింగం శమధనమునిధ్యేయ మతులం
మనోమార్గాతీతం హరిహరనుతం నౌమి హృదయే॥
కార్కోటకార్చితం దేవం ముంజికేశతపఃఫలం।
పరశంభుమహాదేవం వటారణ్య మహం భజే॥

సిందూరాభాం త్రినేత్రాం అమృతకలధరాం శేఖరీం రక్తవస్త్రాం।
పీనోత్తుంగప్రవృత్తస్తనభరణమితాం యౌవనారంభరూఢాం।
నానాలంకారయుక్తాం సరసిజనిలయాం బీజసంక్రాంత మూర్తిం
దేవీం పాశాంకుశాఢ్యాం అభయవరకరాం అంబికాం త్వాం నమామి॥

---

# ఆగమములు

శ్రీవేదాల తిరువేంగళాచార్యులుగారు, గుంటూరు.

తంత్రములను నామాంతరము గల అగమములు హిందువులచే అత్యంతపవిత్రములైన ప్రమాణగ్రంథములుగా నెన్నబడుచున్నవి. అగమమనగా సాధనశాస్త్ర మనిగాని, ఆత్మసాక్షాత్కారమున కుపయోగపడు విద్యయని గాని, చెప్పవచ్చును. సాధకుల యుపయోగార్థము ఒకానొక శిక్షాబద్ధమగు జీవితవిధానము ఇందు ప్రతిపాదింపబడి యున్నది. దేవాలయములయందలి పూజావిధానమును, మనయిండ్లలో నిత్యానుష్ఠానములును, కొంతవరకు ఈయాగమముల ననుసరించియే జరుపబడుచున్నవి.

ఈయాగమములయందలి విషయములను నాలుగు విధములుగా విభజించిరి.

1. జ్ఞానము. (మోక్షసాధనమగు పరమాత్మజ్ఞానము).
2. యోగము. (ఏకాగ్రతాధ్యానము)
3. క్రియ. (దేవాలయములు కట్టుటకు పునాదులు వేయుట, దేవాలయములను పూర్తిచేయుట. శాస్త్రానుసారము విగ్రహములను స్థాపించుట మొదలగునవి)
4. చర్య. (నిత్యము చేయవలసిన పూజలు ఉత్సవములు మొదలగునవి.)

ఇది సామాన్యమగు విషయవిభాగము. ఒక్కొక్క తెగవారు ఒక్కొక్కవిషయమునకు ఎక్కువ ప్రాధాన్యము నిచ్చియున్నారు. చాల గ్రంథములందు క్రియ, చర్య, అను నీరెండు విషయములు విపులముగా విచారింపబడినవి.

ఆత్మతత్త్వమును ప్రతిపాదించుటలో అన్ని తెగలవారును ఒకే మార్గమును అనుసరించుచున్నారు.

1. పరమాత్మ. 2. జీవాత్మ. 3. పరిదృశ్యమానమగు ప్రపంచము. ఇది సామాన్యమగు విభాగము. వీటినే

నామాంతరములతో కొన్ని తెగలవారు వ్యవహరింతురు. ప్రపంచమంతయు సత్యమే యనియు, మిధ్య కాదనియు, ఈయాగమములు చెప్పుచున్నవి. ప్రపంచమంతయు మిధ్యయను మాయావాదుల సిద్ధాంతము ఇందు ఎచటను కానరాదు. జగన్మాతకుగాని, జగత్పితకుగాని భక్తి చూప వలయును అనునది అన్ని అగమములకును సమ్మతమగు విషయము.

ఆగమములు విస్తరించిన కొలదియు, ఒకే దేవుని భక్తి ప్రపత్తులతో నారాధించవలయు నను భావము ప్రజలలో వ్యాపించెను. ఈభక్తిభావము కళాభివృద్ధికి కడుంగడు దోహదము నిచ్చినది. అర్చింపబడు విగ్రహములు, దేవాలయములు, వానికి వాహనప్రాకారాదులు మొదలగు వాని నిర్మాణము ప్రారంభమైనది. సంగీతము, నాట్యము, అభినయము, మొదలగు నితరకళలుకూడ, ఈభక్తిభావము వలననే యభివృద్ధిపొందినవని చాలమందియభిప్రాయము.

ఈయాగమములు రహస్యవిద్యలను ప్రతిపాదించును. శైవాగమములు, శాక్తాగమములు, వైష్ణవాగమములు అను మూడుతెగలకు సంబంధించిన యాగమములు మనకు లభ్యము లగుచున్నవి. బ్రహ్మయొక్క దేవాలయములు, అటనట (గుంటూరుజిల్లా, చేబ్రోలు) నున్నను వానిలోని యారాధన యేయాగమములనుబట్టి జరుగునో తెలియదు.

**శైవాగమములు:** శైవాగమములును, శాక్తాగమములును అత్యంతము సన్నిహితములై యున్నవి. శైవాగమముల సిద్ధాంతములు శివుడే జగత్పిత యనియు, ప్రపంచమునకు మూలకారణమనియు, చెప్పుచున్నవి. అందువలననే వీటికి శైవాగమములను పేరు వచ్చినది. ఈయాగమములకు మహేశ్వరాగమములను నామాంతరము కలదు. ఈయాగముల ననుసరించువారు మూడు తెగలుగా నున్నారు.

1. పాశుపతమతము: హరదత్తాచార్యుడు, లాకులీశుడు రచించిన పాశుపతసూత్రములు, వీరికి ప్రమాణగ్రంథములుగా నున్నవి.

2. సిద్ధాంతము లేక శైవసిద్ధాంతము రెండవమతము. ఈ మతమును దక్షిణదేశమందున్న చాలమంది అరవలు అవలంబించుచున్నారు. వీరికి ప్రసిద్ధికెక్కినవి ఇరువది యెనిమిది శైవాగమములు కలవు. వేదాంతసూత్రములకు రచింపబడిన నీలకంఠభాష్యము, వీరి ప్రమాణగ్రంథములలో అత్యంత ప్రమాణమగు గ్రంథము. కామికము, కారణము, సుప్రభేదము, వాథూలము, ఇరువదియెనిమిది ఆగమములలోను ముఖ్యములగు ప్రమాణగ్రంథములు.

3. కాశ్మీరులయొక్క ప్రత్యభిజ్ఞామతము మూడవది: వసుగుప్తుడు రచించిన శివసూత్రములు, కల్లటుని స్పందకారిక, సోమానందనాథుని శివదృష్టి, ఉత్పలుని ప్రత్యభిజ్ఞాసూత్రములు వీరి ప్రమాణగ్రంథములు (మాహేశ్వరులలోని, కాపాల, కాలాముఖుల శివార్చన యే యాగమములననుసరించి నడుచునో యా మతస్థులు ప్రకృత మీ దేశమున గానకుండుటవలన దెలియరాదు.)

**శాక్తాగమములు:** ఈ శాక్తులు జగన్మాతయగు శక్తినే ఆరాధింతురు; కాన ఈ మతమునకు శాక్తమను పేరు వచ్చినది. ఐదు శుభాగమములు, అరువదినాలుగు కాలాగమములు, ఎనిమిది మిశ్రాగమములు ఈ మతమునకు సంబంధించినవియే. ఇంకను శక్తిసూత్రములు, శంకరభగవత్పాదులు రచించిన గ్రంథమనబడుచున్న సౌందర్యలహరి (ఈ సౌందర్యలహరి ఉపాసన కనుదినము ఉపయుక్తమగుచున్నది) ఈ మత గ్రంథములే.

**వైష్ణవ ఆగమములు:** విష్ణువు లేక వాసుదేవుడు లేక నారాయణుడు లేక శ్రీమన్నారాయణుడు, ఈ మతమువారియొక్క పరమాత్మ. ఈ వైష్ణవాగమములు, వైఖానసాగమములనియు, పాంచరాత్రాగమములనియు, రెండు విధములుగా నున్నవి. వైష్ణవాలయములలో జరుగు నేటి పూజావిధానము, ఈ యాగమముల ననుసరించియే యున్నది. వైఖానసులు ముఖ్యముగా వేదముల ననుసరింతురు. పాంచరాత్రులు తంత్రముల ననుసరింతురు. విఖనసుడు లేక బ్రహ్మయే వైఖానసాగమమును తన శిష్యులగు, అత్రి, మరీచి, కశ్యపుడు, భృగువులకు చెప్పెననియు, వారు నల్వురును, వేరువేరు సంహితలను రచించిరనియు, మనకు తెలియుచున్నది. అత్రి, మరీచి సంహితలు మనకు నేడు లభ్యము లగుచున్నవి. ఇవి తిరుపతి దేవస్థానమువారిచే నచ్చువేయబడినవి. తిరుపతిలో పూజావిధానము వైఖానసాగమము ననుసరించియే జరుపబడుచున్నది.

పాంచరాత్ర ఆగమమును శ్రీమన్నారాయణుడు, నారదునకు, శాండిల్యునకు, ఇతర ఋషులకు చెప్పెనట.

ఛాందోగ్యోపనిషత్తు; శతపథబ్రాహ్మణము, రామాయణము, మహాభారతము, ఈ పాంచరాత్ర ఆగమమును గూర్చి చెప్పుచున్నవి. పాంచరాత్రాగమము అగమములన్నిటిలోను చాల ప్రాచీనమైనదని తెలియుచున్నది.

పంచరాత్రాగమమునకు భాగవతమనియు, సాత్వతమనియు, భగవచ్ఛాస్త్రమనియు గూడ బేరులు కలవు. ఐతరేయబ్రాహ్మణము, శతపథబ్రాహ్మణము ఈశ్వర సంహిత మొదలగువానియందు సాత్వతమను పేరుతో నిది వ్యవహరింపబడియున్నది. వేదాంతదేశికులు దీనిని భగవ

చ్ఛాస్త్రమని వ్యవహరించిరి. దీని నవలంబించువారు పాంచరాత్రులు, భాగవతులు, వాసుదేవులు, సాత్వతులు పరమైకాంతులు నని వ్యవహరింపబడుదురు. మొట్ట మొదట పంచరాత్ర మను పేరు శతపథబ్రాహ్మణములో "స ఏతం పురుషమేధం పంచరాత్రం యజ్ఞక్రతు మపశ్యత్ " అని కన్పడుచున్నది. ఐతరేయబ్రాహ్మణము వగైరాలలో సాత్వత మను పేరు కన్పడుచున్నది. రామా యణముత్తరకాండమందును భారతమునందును, ఇంకను సంహితలయందును, పాంచరాత్రమను పేరు కన్పడు చున్నది. భగవంతుడును శుద్ధసత్త్వమయుడును నగు శ్రీమన్నారాయణునిచే తెల్పబడుటయు, భగవానుని పాంచకాలిక పూజల విధానమును దెల్పునది యగుటయు, కారణముగా నీ పంచరాత్రము భాగవతమనియు, సాత్త్వతమనియు, పిలువబడును. ఇందులో వాసుదేవ సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధులను, సంస్థలు కల పరమాత్మయొక్క నాల్గు వ్యూహములను విధిగా నుపా సించుట యిందు తెల్పబడును. కనుక నిది యాగమమని

"కర్తవ్యత్వేన వై యత్ర చాతురాత్మ్య ముపాసతే ।
క్రమాగతై స్స్వసంజ్ఞాభిః, బ్రాహ్మణై రాగమం తు తత్॥"

అను ప్రమాణవాక్యము తెల్పును

ఆ యుపాసనము, అభిగమనమనియు, ఉపాదాన మనియు, ఇజ్య యనియు, స్వాధ్యాయ మనియు, యోగ మనియు, నైదు విధములు; వీని నైదు కాలములందు పరమైకాంతులగు శ్రీవైష్ణవులు అనుష్ఠింపవలసిన విధాన మును వివరముగా దెల్పుటకు అనేక సంహితలు అనగా సుమారు రెండువందల పైచిల్లరవరకు నున్నవని షోడరు మహాశయుడు అహిర్బుధ్న్యసంహితయొక్క పీఠికలో వ్రాసియున్నాడు. పౌష్కరము, పాద్మము, జయము, సాత్వతము, కాలాంతరము, ఈశ్వరసంహిత, శ్రీవిష్ణు తిలకము, పురుషోత్తమము, కపింజలసంహిత, పరమేశ్వర సంహిత, అహిర్బుధ్న్యసంహిత, మొదలగు పేరులతో చాల సంహితలు ఇప్పుడు కన్పడుచున్నవి. కాని వీనిని గూర్చి బాగుగా పర్యాలోచన మాత్రము మనవారు చేసియుండ లేదు. దీనికి చతుర్వేదవిభాగమునకు పూర్వమందున్న ఏకాయనశాఖ మూలమని తెలియుచున్నది. ఈ విషయము అనగా పాంచరాత్రము వేదైకమూలకమను విషయము మహాభారతము శాంతిపర్వమునందుకూడ తెలుపబడి యున్నది. క్రీస్తుశకము తొమ్మిదవశతాబ్దముచివర కాశ్మీర దేశములో ప్రసిద్ధికెక్కిన భట్టోత్పలాచార్యులు స్పంద ప్రదీపిక యను పాంచరాత్రాగమవిచారగ్రంథమును వ్రాసెను. అందులో పాంచరాత్రశ్రుతు లుదాహరింప బడినవి. అందువలన దానినిబట్టి చూడగా ఈపాంచరాత్ర మునకు మూలమగు నేకాయనము, పాంచరాత్రశ్రుతి యని యిప్పుడు ప్రసిద్ధిగా నుండెనని తెలియును. ఇది శ్రుతి, సంహిత ఉపనిషత్తు, అని మూడువిధములుగా కన్పడుచున్నది. ఇందులోని శ్రుతులు, శ్రుతప్రకాశికలోను, స్పందప్రదీపికలోను గూడ నుదాహరింపబడియున్నవి. ఆ శ్రుతులే ఏకాయన మనుపేరుతో నీపంచరాత్రాగమ మునకు మూలముగా నున్నవి. మహాభారతము శాంతి పర్వములోని

"ఇదం మహోపనిషదం చతుర్వేదసమన్వితం ।
సాంఖ్యయోగకృతాం తేన పంచరాత్రానుశబ్దితం ।
నారాయణముఖోద్గీర్ణం నారదో శ్రావయత్ పురా ॥

అని **347** అధ్యాయములో **62, 63** శ్లోకములలో శ్రీమ న్నారాయణుడు నాల్గువేదములలోని విషయములను సమన్వయించి జ్ఞానయోగ కర్మయోగనిష్ఠతో నేర్పడు నట్లుగా పంచరాత్ర మను పేరు గల యీమహోపని షత్తును నారదునకు విన్పించెనని తెల్పబడినది బ్రహ్మ సూత్రములం దిది రెండవ యధ్యాయము రెండవపాదము చిట్టచివర నాల్గు సూత్రములందును పూర్వపక్షనిరాసముగా ప్రమాణతమమని సిద్ధాంతీకరింపబడుట చూడగా దీని ప్రాచీనత విషయమై సంశయింప నావశ్యకత లేదని తెలియును.

## పాంచరాత్ర మని పేరు

దీనికి పాంచరాత్ర మను పేరు వచ్చుటకు చాల కారణ ములు తెల్పబడినవి.

1. పంచరాత్రము లనగా శబ్ద స్పర్శ రూప రస గంధ ములను నైదు విషయములు లేదా పంచభూతములు, ఇవి యన్నియు పరమతేజస్సగు పరమాత్మప్రాప్తి కల్గినం తనే సూర్యుని ప్రాప్తి కల్గినంతనే రాత్రి తొలగిపోవునట్లు తొలగిపోవును కనుక పాంచరాత్రమని విష్ణుసంహిత తెల్పును

2. శ్రీమన్నారాయణుని శంఖ చక్ర గదా ఖడ్గ ధనుస్సులైదింటి యంశములనుండియు నుదయించిన శాండిల్యుడు, ఔపగాయనుడు, మౌంజాయనుడు, కౌశి కుడు, భరద్వాజుడు, వీరైదుగురును వేరువేరుగా సకల జగన్నాథుడగు శ్రీమన్నారాయణునుండి యొక్కొక్క అహోరాత్రమునందీ యాగమమును నేర్చుకొనిరి. కనుక నిది పాంచరాత్రమనబడును; అని యీశ్వరసంహితలో నున్నది.

3. సాంఖ్యము, యోగము, వైశేషికము, న్యాయము, మీమాంస యీ యైదు శాస్త్రములును ఈ యాగమము ముందర రాత్రివంటివి గనుక అనగా ప్రకాశశూన్యము లగును గనుక పంచరాత్రము అని పాద్మసంహిత తెల్పును.

4. పర, వ్యూహ, విభవ, అంతర్యామి, అర్చ యను పరవాసుదేవుని యైదు రూపముల స్వభావమును నిరూపించి మోక్షఫలమును సమకూర్చును కనుక పంచరాత్ర మని అహిర్బుధ్న్య సంహిత తలంపు. శతపథబ్రాహ్మణములోని "స ఏతం పురుషమేధం పంచరాత్రం యజ్ఞక్రతుమపశ్యత్" అను వాక్యమునకు పూర్వము "పురుషో హ, నారాయణోఽకామయత" అను మంత్రమున్నది, పురుష సూక్తమునందును, నారాయణోపనిషత్తునందును, తెల్పబడిన శ్రీమన్నారాయణుని స్వరూపమే పైమంత్రమువలన దెలుపబడుచున్నదనియు, పరమాత్మ వాసుదేవుని యిచ్ఛ చేతనే యేర్పడిన పర, వ్యూహ, విభవ, అంతర్యామి, అర్చ, అను నైదుమూర్తుల స్వరూపమును నిరూపించు భగవచ్ఛాస్త్రము - పాంచరాత్రశాస్త్రమును శ్రీమన్నారాయణుడు రచించెనని, శతపథబ్రాహ్మణమున దెల్పిన తీరున యజ్ఞరూపధరుడైన ఆ పరవాసుదేవుడె పాంచరాత్ర యజ్ఞరూపుడగు పురుషుడుగా నగునని పోడరుదొర తలంపునకీ క్రింది శ్లోక మాధారము.

యజ్ఞరూపధరం దేవం యజతే స్వాత్మనైవ యః ।
తేన సర్వే కృతా యజ్ఞాః భవంతి, స్వయమాత్మనా ॥
అహిర్బుధ్న్యసంహిత.

5. అయిదు కాలములందు పరమాత్మ నుపాసనము నిత్యము అనుష్ఠించు విధానమును తెల్పునది పాంచరాత్ర మని వేదాంతదేశికులు.

6. ఇవి యన్నియు గాక మహాభారతములో దెల్పిన యీ క్రింది వ్యుత్పత్తిని భగవద్రామానుజులు శ్రీభాష్యములో నిరూపించియున్నారు. "ఏవ మేకం సాంఖ్యయోగం వేదారణ్యక మేవచ పరస్పరాంగా న్యేతాని పాంచరాత్రం తు కథ్యతే ।" జ్ఞానయోగ కర్మయోగములు వేదోక్తకర్మలు అరణ్యకములలో తెల్పబడిన సకలతత్వములకు శ్రీమన్నారాయణాత్మకత్వము, సకలకర్మలకు శ్రీమన్నారాయణ కైంకర్యరూపత్వమును సమన్వయించి పై నాల్గు సిద్ధాంతములకు తరువాతిదియైన యిది పంచరాత్రమనబడును. (ఇదియే చాలవరకు సమంజసము. ఈ విషయము దర్శనసమీక్షలో విస్తరించి నిరూపించియున్నాము.)

## ఇందులోని విషయము

పర, వ్యూహ, విభవ, అంతర్యామి, అర్చ లను నైదు రూపములందును అర్చరూపము దక్క మిగిలినవన్నియు, చర్మచక్షుష్కులమును, అల్పప్రజ్ఞులమును నగు మనకు కన్పడవు, దొరకవు. కనుక విభవములగు శ్రీకృష్ణాదుల రూపములను బంగారు, వెండి, రాగి, రత్నము, కొయ్య, మొదలగువానితో నేర్పరచి ఆ యర్చారూపములను సరిగా నర్చించి అనగా విభవార్చన చేసి దానికి పైరూపమగు వ్యూహమును బొందవలయును, వ్యూహమునుండి దాని పైరూపమగు పరవాసుదేవుని పొంది మోక్షలక్ష్మి ననుభవింపవలయునని మార్గము. అందుకై యర్చావతారమును అర్చించుటకు కావలసిన విధానమునంతయు సరియగు వైదికపద్ధతిలో నిరూపించుట యీ యాగమము యొక్క పరమార్థము. ఇందులో, అర్చన చేయవలసి యున్నది కనుక, అందు కవసరమగు విగ్రహములు, దేవాలయములు వాటి నిర్మాణప్రకారము, విన్యాసరీతులు, వాని ప్రతిష్ఠించుట, పూజోపకరణములు, పూజాపద్ధతి, ధ్యానము, తదంగమగు మంత్రములు, దాని కవసరమగు యోగము, మొదలగున దంతయు, నీ యాగమములందు విస్తరించి నిరూపింపబడును. ఈ యర్చావిధినే సంగ్రహముగా కర్షణాది ప్రతిష్ఠాంత మందురు. (పరుడుగాని, అతని నాల్గు వ్యూహములుగాని, మన శరీరములో అంతర్యామిగా నున్న యాత్మస్వరూపము గాని మనకు దుర్లభములే కదా!)

## దీని విభాగములు

ఈ పాంచరాత్రము ఆగమసిద్ధాంతము, దివ్యసిద్ధాంతము, తంత్రసిద్ధాంతము, తంత్రాంతరసిద్ధాంతము అని నాల్గు విధములు. ఈ నాల్గింటికే స్వయంవ్యక్తసిద్ధాంతము, దివ్యసిద్ధాంతము, సైద్ధసిద్ధాంతము, ఆర్షసిద్ధాంతము నని వేరే పేరులున్నవి. ఈ నాల్గురకముల సిద్ధాంతములును వేదోపబృంహణములే, ఈ యభిప్రాయమునే "మహతో వేదవృక్షస్య మూలభూతో మహానయం" అని మహాభారతము తెల్పుచున్నది.

నాలుగుగా విభజింపబడుటకు పూర్వమున్న వేదరాశికి ఏకాయనవేద మని పేరు. దానినుండి యీ పాంచరాత్రాగమ మేర్పడినది ఈ యేకాయనముప్రశంస ఛాందోగ్యములో నారద సనత్కుమార సంవాదములో "ఋగ్వేదం భగవోఽధ్యేమి యజుర్వేదం, సామవేదం, అథర్వణం, చతుర్థం. ఇతిహాసపురాణం పంచమం, వేదానాం వేదం, పిత్ర్యం రాశిం దైవం నిధిం వాకోవాక్యం ఏకాయనం (6-1-2; 6-1-4) అని కన్పడును. ఈ యేకాయనమున కొన్ని శ్రుతివాక్యములు శ్రీసుదర్శనసూరులు కటాక్షించిన శ్రీశ్రుతప్రకాశికలోను ఇప్పటికి సుమారు వేయి సంవత్సరముల కింకను పూర్వమున ఉన్న ఉత్పలవైష్ణవుని స్పంద ప్రదీపికలోను ఉదాహరింపబడియున్నవి. దీనినిబట్టియే పాంచరాత్రశ్రుతి, పాంచరాత్రోపనిషత్తు, పాంచరాత్ర సంహిత, యని మూడువిధములుగా నీశాస్త్ర మగుపడుచున్నదని తెల్పితిమి. ఇందులోని శ్రుతులు ఉద్యోగపర్వములో నుపబృంహితములై యున్నవి. ఈసంహితలు

నాల్గు రకములుగా నున్నవి. దివ్యములు, సాత్త్వికములు, రాజసములు, తామసములు నని.

1. దివ్యములు—సాత్వతము, పౌష్కరము, జయ సంహితలు ;

2. సాత్వికములు—ఈశ్వర, భారద్వాజ, సీమస్తము మొదలగునవి.

3. రాజసములు—సనత్కుమార, పద్మోద్భవ, శాతాతపము మొదలగునవి.

4. పంచప్రశ్నము, శుకప్రశ్నము, తత్త్వసాగరము మొదలగునవి తామసములు.

ఈ సంహితలన్నిటిలోను కూడ, జయము పౌష్కరము సాత్వతము అను, మూడు సంహితలును సాక్షాత్తుగా శ్రీమన్నారాయణుని నోటిగుండ తెలుపబడుటవలన రత్నత్రయమని ప్రశంసింపబడును. ఈపంచరాత్రసిద్ధాంతము లన్నియు, ఒక ప్రయోజనవిశేషమును బట్టి స్వయం వ్యక్తము, సైద్ధము, దివ్యము, ఆర్షము నని నాల్గురకములుగా అగును. వేదాంతసిద్ధాంతము, దివ్యసిద్ధాంతము, తంత్రసిద్ధాంతము, పురాణసిద్ధాంతము ననియు మరియొక విభాగమున్నది.

అర్చనీయులగు దేవులున్న క్షేత్రములు స్వయం వ్యక్తములనియు, దివ్యములనియు సైద్ధములనియు మానషములనియు నాల్గు రకములు. వానిని బట్టియే సిద్ధాంతములకు గూడ మొదట చెప్పిన విభాగమేర్పడిన దని తోచుచున్నది; అట్లే యీ పాంచరాత్రాగమమునందలి పూజయు వైదికము, తాంత్రికము, శ్రౌతము, మిశ్రముననినాల్గు రకములు. దానిని తెల్పు శాస్త్రముకూడ స్వయం వ్యక్తము, దివ్యము, మునిభాషితము మానుషము నని నాల్గు రకములు. స్వయంవ్యక్తమైన శాస్త్రమనగా మూలమైన యాగమము. దివ్యమనగా భగవానుడగు శ్రీమన్నారాయణునిచే సాక్షాత్తుగా తెలుపబడి బ్రహ్మరుద్రాదులచే ప్రవర్తింప చేయబడినది. మునిభాషితము, సాత్త్వికము, రాజసము, తామసము నని మూడురకములు. భగవానుని నోటినుండి వినినదానినే తెలుపునట్టి శాస్త్రము సాత్త్వికము, భగవంతుడు తెల్పినది కొంతయు, ఋషుల యోగమహిమ వలన కనుగొనినది కొంతయు గలసియుండునది రాజసము, కేవలము తన యోగమహిమవలననే కనుగొనిన యర్థములనే మునులు గూర్చినచో నది తామసము, దివ్యమునుకాక మునులు తెల్పినదియునుకాక మనుజులు రచించినది మానుషము.

## అర్చనవిధానము

ఈ యాగమమున దెల్పబడిన యర్చనవిధానమే ప్రశస్తమని చాలమంది మహర్షులు శాండిల్యవ్యాసాదులు, వైష్ణవ ధర్మశాస్త్రములందు తెల్పియున్నారు. ఆయర్చన యిట్లుండును. అభిగమనము ఉపాదానము, ఇజ్య, స్వాధ్యాయము, యోగము అని యైదు తీరులు.

1. **అభిగమనము :** బ్రాహ్మముహూర్తమున లేచి మనోవాక్కాయముల నియమముతో జపము, ధ్యానము. అర్చనము, స్తోత్రము నొనరించుచు సకలజగత్కారణమగు పరవాసుదేవుని భగవంతుని అభిగమించుట, ఇది బ్రాహ్మముహూర్తము ననగా తెలతెలవారునపు డొనరింప వలసినది.

**ఉపాదానము :** అతరువాత లేచి యొక జాము లోపల పూవులు పండ్లు మొదలగువానిని భగవంతు నర్చించుటకై సంపాదింపవలెను. ఇది మొదటి జాములో చేయ వలసిన పని.

3 **ఇజ్య :** ఆతరువాత యెన్మిది యంగములలో గూడ భగవంతుని జాముకన్న నెక్కువసేపు పూజింప వలెను. దీనినే యాగమనియు, ఇజ్య యనియు నందురు. ఇది మొదటిజాములో ప్రారంభమై రెండవజాము ముగియు వరకు జరుగవలసినది.

4. **స్వాధ్యాయము :** శ్రుతి స్మృతి పురాణాముల నెవరినుండియైనను వినుటయు, మనన మొనరించుటయు, ఇతరులకు వానిని వివరించుటయు స్వాధ్యాయ మనబడును. ఇది యాగ మనబడు భగవదర్చన తరువాత అనుయాగ మనబడు భోజనాదికమును ముగించిన తరువాత మూడవజామున నొనరింపవలసిన పని.

5. **యోగము :** సాయంకాలము కాగానే సంధ్యావందనము భగవదర్చనము హోమము మొదలగు దానినొనర్చినతరువాత భోజనమొనర్చి నిదురించి ఇంక తెల్లవారుచున్నదనగా మనసు నేకాగ్రమొనర్చి భగవంతుని ధ్యానించుట. ఇది రాత్రితుదిజామున నొనర్చవలసినది.

ఈ పైని చెప్పిన పంచకృత్యములనుబట్టియే అవి యొనర్చవలసిన పంచకాలముల వివరముగా దెల్పుచున్న యీ శాస్త్రము పాంచరాత్రశాస్త్ర మనబడును. ఇచట రాత్రియనగా వేళ యనియర్థము. యాగముయొక్క యెనిమిదియంగము లేవనగా అభిగమనము, భోగము, పూజ, అన్నార్పణము, సంప్రదానము, వహ్నిసంతర్పణము, పితృయాగము, ప్రాణాగ్నిహోమము, లేక అనుయాగము అని యష్టవిధముల నున్నది.

1. **అభిగమనము :** ఇది యాగాంగమగు నభిగమనము. అంతఃకరణయాగముమొదలు ఆత్మనివేదనము పర్యంతమున్న యిది, యాగాంగమునకు మొదటి యంగమగు నభిగమనము. అనగా మొదట నంతఃకరణమున

నేకాగ్రతతో పరమాత్ముని వాసుదేవమూర్తిని ధ్యానించి, ఆ పరంజ్యోతియందు తన యాత్మను సమర్పించునట్టి యధ్యవసాయముతో ధ్యాననిష్ఠ కల్గియుండుట. ఇది యన్ని యాగాంగములలో గొప్పది, మొదటిది.

2. **భోగము :** అర్ఘ్యము, పాద్యము, పుష్పములు మొదలగు బాహ్యోపచారములను శ్రీపరవాసుదేవునకు భోగరూపములుగా సమర్పించుట.

3. **పూజ :** తేనె, నెయ్యి, పెరుగు కలిపి గోవుతోకూడ దేవునకు సమర్పించుట. అనగా మధుపర్కపూజ.

4. **అన్నపూజ :** అన్నము మొదలగువానిని సమర్పించి నివేదించుట.

5. **సంప్రదానము :** దేవునకు నివేదించిన యన్నమును ఇతరుల కోసము ప్రసాదముల వినియోగము.

6. **వహ్నిసంతర్పణము :** అగ్నియందు హోమ మొనర్చి అగ్నితృప్తి చేయుట.

7. **పితృయాగము :** పితృతర్పణము మొదలగునవి యొనర్చుట.

8. **అనుయాగము :** ప్రాణాగ్ని హోమము అనగా ప్రాణాహుతి పురస్సరముగా దేవనివేదితాన్నమును భోజన మొనర్చుట. ఈతీరున నున్న యర్చనాక్రమముతో అనగా జ్ఞానపూర్వకమగు కర్మతో—ఇంకను వివరించుచో జ్ఞాన యోగసహితమగు కర్మయోగముతో నర్చించువారికి పర వాసుదేవుని ప్రాప్తి కల్గును. ఈ విషయమును బోధించు నీపంచరాత్రసిద్ధాంతము వాసుదేవసిద్ధాంతమే. విభవార్చన మునుండి వ్యూహము, వ్యూహమునుండి పరవాసుదేవుని పొందజేయు నర్చన యీశాస్త్రమునందు సమారాధనమను పేరుతో కర్షణాదిప్రతిష్ఠాంత మని తెలుపబడును. అయితే ఈ నాల్గు సిద్ధాంతములలో సంకరము పనికిరాదు. ఆగమ సిద్ధాంతముల వారివారి పితృపైతామహమగు సాంప్రదాయమే యనుసరింపదగును. గాని అనగా దానిప్రకారమే దీక్షాదుల నొందిననే భగవదర్చనాధికారము కల్గునుకాని యొకసిద్ధాంతమువాడు తన తండ్రితాతలమార్గము వీడి మరొకసిద్ధాంతమునుబట్టి దీక్షనొందినచో నతనికి నర్చనాధికారము లేకపోవుటయే కాక పాపము కూడ సంభవించును. కనుక నీశాస్త్రములలో సాంకర్యము, సాంప్రదాయత్యాగము కూడదు. అంతేకాక వైఖానససాంప్రదాయముతో కూడ సాంకర్యము ఎంతమాత్రము కూడదు. ఆయాగమమునకు మాత్రము పాంచరాత్రముతో అట నావశ్యకత తప్పదు. కనుక వైఖానసమునకు పాంచరాత్రముతో సాంకర్యము తప్పదు. ఇంతేకాక యీపాంచరాత్రాగమము సకలాగమములకును గూడ నుపజీవకమే.

## ఆగమములసమయము

"ప్రతిమాస్వల్పబుద్ధీనాం" అను ప్రమాణవాక్యమును బట్టి వైవస్వతమనువుకాలమునకన్న ప్రాచీనమైన సమయముననే యీప్రతిమల విగ్రహముల యారాధన మున్నట్లు తెలియుచున్నది. "అగ్నిహోత్రం ద్విజాతీనాం" అను వాక్యమును బట్టి మొదట అగ్నిహోత్రమునందే ఈశ్వర బుద్ధితో నుపాసన ముండెడిదని యూహించుట కవకాశము కలుగుచున్నది. దీనికి సరిపోయినట్లు బైబిలులో నొకచోట నొకభక్తునకు మండుచున్న పొదమంటలో దేవుని దర్శనమైనట్లు తెల్పబడియున్నది. దీనివలన చాలప్రాచీనకాలమున చాలమందిలో అగ్నిహోత్రునందు భగవద్రూపోపాసనమున్నట్లు తోచును. ఇందు కనుగుణముగా మనకు "అగ్నే నయ సుపథా రాయే అస్మాన్, విశ్వాని దేవ వయునాని విద్వాన్ యుయోధ్యస్మ జ్జుహురాణ మేనో భూయిష్ఠాంతే నమ ఉక్తిం విధేమ" అను నీశావాస్యోపనిషత్తు చివరనున్న అగ్న్యుపస్థాపనమంత్రము ఈ విషయమును సూచించుచున్నది.

కాలక్రమముగ బుద్ధిబలము తగ్గి అందు ఈశ్వరభావన నొనరింపలేకపోవుటయు నందువలన మూర్తియర్చన మొనరింపవలసివచ్చినదనియు దేలుచున్నది "చిన్మయస్యాద్వితీయస్య నిష్కల స్యాశరీరిణః ఉపాసకానాం పూజార్థం బ్రహ్మణో రూపకల్పనా" అను శ్లోకము కూడ మొదట సత్యజ్ఞానానందరూపునిగా బ్రహ్మను సాసించిరనియు గాలక్రమమున నట్టి మనోబలము క్షీణించి భావన దుర్బలముకాగా పరమేశ్వరునకు రూపము నాయాయుపాసకులు తమతమ యిచ్ఛకొలది కల్పనచేసిరనియు అది వాస్తవము గాక కల్పనమాత్రమేననియు దెల్పుచున్నది. కాని యీశ్లోకము ప్రమాణ మనుటకు తగిన యుపపత్తికాని యోగ్యతకాని యగుపడుట లేదు. ఏమనగా—శ్రుతులందు, పరబ్రహ్మమునకు—జగత్పితకు రూపమున్నట్లే కన్పట్టుచున్నది.

ఈశావాస్యములో "యత్తే కళ్యాణతమం తత్తే రూపం పశ్యామి" యని చెప్పబడినది. ఛాందోగ్యములో "య ఏషో న్తరాదిత్యే హిరణ్మయః పురుషః హిరణ్యశ్మశ్రుః హిరణ్యకేశః అప్రణఖాత్సర్వ ఏవ హిరణ్యః తస్య యథా కప్యాసం పుండరీక మేవ మక్షిణీ తస్మో దితి నామ" యని జగత్పితకు మీసములు గడ్డము తలవెంట్రుకలు రవికరవికసితమగు నెత్తామరవంటి కనులున్నట్లు చెప్పటయేకాక శిరసు మొదలు చివరిపాదమువరకును దివ్యోజ్జ్వలమగు హిరణ్యమువంటి రూప మున్నదని తెల్పబడినది.

బృహదారణ్యకములో "యథాపాణావేక........మాహారజనం వాసః" ఇత్యాదిగ్రంధముచే పరమాత్ముని వస్త్రాభరణాదిసమ్పత్తి తెల్పబడినది.

ఇక కౌషీతక్యుపనిషత్తులో శ్రీవైకుంఠము అట సహస్ర స్థూణాపరిచితమైన తిరుమామణిమంటపము అందు అనన్త శేషశాయియగు జగజ్జనకుని వైభవము దివ్యమంగళ విగ్రహసంపత్తి అంతయు వర్ణింపబడినది.

నారాయణములో "నీలతోయదమధ్యస్థా విద్యుల్లేఖేవ భాస్వరా, నీవారశూకవ త్తన్వీ పీతా భాస్వ త్యణూపమా" అని పరమాత్మని రూపమును నీలతోయద భాస్వరముగా వర్ణించెను. "రుక్మాభం స్వప్నధీగమ్యం" అని మనువు నారాయణుని రూపమును వర్ణించెను. తైత్తిరీయములో నింకకొంచెము ముందుకేగినచో "నమో హిరణ్యబాహవే" యని బాణాదిసమ్పత్తి వర్ణింపబడినది.

విష్ణుపురాణములో యోగనిష్ఠయందు శుభాశ్రయముగా బ్రహ్మరుద్రాదుల రూపములు పనికిరావని నిరసించి పరమపితయైన శ్రీమన్నారాయణుని దివ్యమంగళవిగ్రహమే పాదాదికేశాన్తముగా వర్ణించి నిరూపించి యిదియే యోగనిష్ఠయందు శుభాశ్రయముగా స్వీకరింపదగునని తెల్పబడియున్నది.

శ్రీమహాభారతములో పరమాత్మని రూపము అత్యంత మనోహరముగా తెల్పబడినది.

ఇక పరమేశ్వరి—జగన్మాతరూపమును గూర్చి కేనోపనిషత్తులో "స్త్రియం ఉమాం హైమవతీం" అని ఉన్నది. ఇందులో "స్త్రియం" అని యీమెరూపమును లక్షిత మొనర్చెను, "హైమవతీం" అని హిరణ్యాభరణభూషితురాలని తెల్పెను.

శ్రీసూక్తములో "హిరణ్యవర్ణాం" అని యీమె రూపమును పత్యనురూపముగానున్నదని తెల్పుటయే కాక 'హరిణీం' అని హరిణజాతిస్త్రీ యని చెప్పబడినది. సువర్ణ రజతస్రజాం యని అభరణసమ్పత్తి యున్నది." ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్" యనియు "హిరణ్మయః" అనియు "ఈశావాస్యమిదం సర్వం" అన్తఃప్రతిష్ఠ శ్శాస్తా జనానాం "ఈశాన స్సర్వవిద్యానాం" ఇత్యాదులందు తెల్పబడిన పతి కనురూపముగా "ఆదిత్యవర్ణే" హిరణ్మయీం, అస్యేశానా జగతో విష్ణుపత్నీ" యనియు నీమె తెల్పబడినది. "హ్రీశ్చ తే లక్ష్మీశ్చ పత్న్యౌ" యని యీమె జగజ్జనకుని పత్నిగా తెల్పబడెను కదా! "పద్మే స్థితాం" అని యీమెనెలవు తెల్పబడినది. సుప్రసిద్ధములైన ఈశాద్యుపనిషత్తులందును పురుషసూక్తశ్రీసూక్తాదులందును ఇట్లు శ్రీపరమేశ్వరిరూపము స్పష్టముగా దెల్పబడియుండగా మనుష్యుల కల్పనకు చోటేది? అట్లనుట కేవల మనంగతము కదా! అది యెవరో జగన్మిథ్యాత్వవాది వ్రాసుకొన్న శ్లోకము. అస లామిథ్యాసిద్ధాన్తమునకు అగమములందు చోటే లేదని ఈవ్యాసము మొదట్లోనే తెల్పియుంటిమికదా!

అంత మిథ్యావాదికి తల్లి యుండునా? తండ్రియుండునా? జగత్తునకు తల్లిదండ్రుల నుపాసించుట అవశ్యకర్తవ్యమను పరమసత్యసిద్ధాంతముతో ప్రవర్తించిన ఆగమములందు మిథ్యావాదమునకు స్థాన మెంత మాత్రమును లేదు. "మాతృదేవో భవ, పితృదేవో భవ" అను శ్రుతివిహితమగు మాతాపితరుల యారాధనము మొదట వ్యక్తిగతముగా నారంభమై రానురాను దృష్టి విశాలమైనకొలదియు సకలజగత్తులకును మాతాపితరులయందు విశ్రాంతమైనది. ఆ తల్లితండ్రులు శ్రీశ్రియఃపతులు కావచ్చును. లేక పార్వతీ పరమేశ్వరులు కావచ్చును. నామభేదమున కేమి? వారికి విస్పష్టముగా నామరూపసంప్రతిపత్తి శ్రుతియందు తెలుపబడియే యున్నది. కనుక అది కల్పన యనుట ఆత్మవంచనయే. "యథాభూతవాది హి శాస్త్రం। మాతా పితృసహస్రేభ్యోపి వత్సలతరం శాస్త్రం" అని ప్రామాణికమూర్ధన్యు లంగీకరించిన వేదశాస్త్రములు అసత్యమైన కల్పనను మనకు తెల్పు ననుట యుక్తముగాదు. అది "సర్వం వాక్యం అప్రమాణమ్" అన్నట్లగును.. అట్టి పెద్దమనుష్యులను గూర్చియే భగవానుడు "అసత్యమప్రతిష్ఠం తే జగ దాహు రనీశ్వరమ్। అపరస్పరసంభూతం కి మన్య త్కామహైతుకమ్" అన్నాడు. కానిచో వారికి తల్లిదండ్రులు సత్యముగా నున్నట్లు నమ్మకమున్నయెడల వారిరూపమును కల్పనయందురా? వారిపూజలను కల్పనాప్రవృత్తము లందురా? ఈయభిప్రాయముతోనే వేదవేత్తలకు "సత్సంప్రదాయప్రసూత" యను విశేషణమును పెద్దలు వాడుదురు. "యథా సాలగ్రామశిలాయాం పరిభావనా" అని సూత్రభాష్యములో అనుగ్రహించిన భగవత్పాదుల పరమతాత్పర్యమును గ్రహింపక యిట్టి శ్లోకములుత్పన్నము లగును. అట్టివారినిగూర్చి "అసత్య" మిత్యాదిగా తెల్పిన భగవానుడే "యో యో యాం యాం తనుం భక్తః శ్రద్ధయార్చితు మిచ్ఛతి। తస్య తస్యా చలాం శ్రద్ధాం తామేవ విదధా మ్యహమ్" అని తత్తదంగ దేవతాపూజను తెల్పి "మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు"అని తనపూజను విధించెను. "యజ—దేవపూజాయాం" అని కదా! అంతెందుకు? "పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి। భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః' అని తన మూర్తి పూజను అవశ్యకర్తవ్యమునుగా తెల్పినాడు. అర్చామూర్తి గాక తదితరరీతిలో పైజెప్పినపూజగాని పత్రపుష్పసమర్పణముగాని కుదురదుగదా! గనుక "చిన్మయస్యాద్వితీయస్య నిష్కల స్యాశరీరిణః। ఉపాసకానాం పూజార్థం బ్రహ్మణో రూపకల్పనా" అను శ్లోకము ప్రమాణోపహతము.

ప్రకృతములో ఈమూర్తిపూజకు పాశ్చాత్యవిమర్శకులు వారికి తోచినట్లుగా కాలనిర్ణయమొనర్చిరి. క్రీస్తుపూర్వము 7వ శతాబ్దమువెనుక ఈదేశములో మూర్తిపూజయు దేవాలయనిర్మాణము లేదని. ఇది తప్పేననుట భగవద్గీతవల్లనే తెలును. వారి నిర్ణయమును బట్టియు భారతయుద్ధము క్రీస్తుపూర్వము 1400 సంవత్సరమునకు ముందుగానే జరిగినదిగదా! మన ప్రమాణములనుబట్టి వేదములందే యున్నదనుట స్పష్టము. "తా మగ్నివర్ణాం"—ఇత్యాది శ్రుతులందు దేవతాస్వరూపము స్పష్టప్రతిపాదితమే.

బౌద్ధులకాలములో గౌతమబుద్ధుడు మైత్రేయనాధుడు మొదలగువారి రూపమును నిర్మించి పూజించుచుండిరని తెలియుచున్నది. 'సమ్యక్సంబుద్ధలక్షణ' మను బౌద్ధగ్రంథములో విగ్రహముల నిర్మించు రీతులు వ్రాయబడినవి. ఆ బౌద్ధులనుండియే శ్రీవిద్య నవీనమాయావాది మతములో ప్రవేశించినది. "తథాగతగుహ్యసమాజము" అను నొక బౌద్ధమతగ్రంథమును పరిశీలించుచో ఈవిషయము తెలియవచ్చును. శ్రీవిద్యలోని వామాచారము బౌద్ధులు పాశుపతులు మొదలగువారి సంప్రదాయము నుండియే శ్రీవిద్యోపాసకులలో ప్రవేశించినది. ఈవిద్యలో యంత్రార్చనతోపాటు వామాచారప్రసక్తి యున్నది.

జైనులు కూడ మహావీరుని మూర్తిపూజలు చేయుదురు. పాతంజలభాష్యములో మౌర్యులు అను నొకతెగవారు విగ్రహములను చేసి అమ్ముచున్నట్లున్నది. మనవారు శ్రీమద్రామాయణములోని "ఇక్ష్వాకూణాం కులధనం" అను శ్లోకములో 'కులధనం' అను పదము శ్రీరంగనాయకుని తెలుపు ననుచున్నారు. ఇందువలన ఇక్ష్వాకులకాలముననే ఈఅర్చన యున్నట్లు కన్పట్టును! 'మనురిక్ష్వాకవే బ్రవీత్' అను గీతనుబట్టి అప్పుడే ఆగమములు అర్చనకై ఉపయోగింపబడినవి. ఇట్లతిప్రాచీనమైన ఈఆగమములు హైందవసంస్కృతియొక్క బీజవిస్తరణరూపములు. అవి ఆస్తికుల కందరకును శిరోమాల్యము వలె అత్యంత మాదర్శనీయములు.

ఈఆగమములందు హైందవుల సర్వవ్యవహారములును, ఇదిఅది అననేల? ఈవ్యాసము మొదటిలో చెప్పినట్లుగా భారతీయుల నిత్యజీవితవిధానము గూడ క్రమబద్ధముగా నువదేశింపబడినది. అంతతో నిలిచిపోక అధీతిబోధాచరణములందు తగినంత పరిపూర్ణతతో ఆదరింపబడి ఒకకాలమున హైందవుల నందరను ఆర్యుల నొనర్చినది. సకలదేశములవారిచేతను సమాదరణీయులుగాను,అత్యంత నాగరికులుగను చేసినవి. కనుక హైందవసంఘనిర్మాణమునకై, భారతజాతీయసంస్కృతిసమారాధనకై, తత్ప్రవర్తనకై, తదభ్యాసమునకై, తత్ప్రతిష్ఠాపనకై ప్రకృతకాలములో ప్రయత్నమొనర్చుచున్న మన ప్రభుత్వము సకలకళ్యాణగుణసంపన్నులగు పరమేశ్వరీ పరమేశ్వరుల ఆరాధనను విధించి తద్వారా సంఘమునందు ఆ కళ్యాణగుణములను సమాధానమొనర్పింప సామర్థ్యముగా ఈ ఆగమశాస్త్రములను ముఖ్యముగా నాదరింపవలెను. భగవానుని సూక్తి యిది—

"యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహం"
"యాదృశీ భావనా యత్ర సిద్ధి ర్భవతి తాదృశీ."

---

# విష్ణుతిలకము

(పూర్వతో ఽనువృత్తము)

శ్రీ వేదాల తిరువేంగళాచార్యులుగారు

## అందరును పంచరాత్రులు

ప్రాణు లందరును పంచరాత్రసంహితల నధ్యయనమొనర్చి నిరతిశయానందము నొంది ముక్తులైరి. కొందరు స్వర్గనివాసులైరి. నారకప్రదేశమంతయు శూన్య మయ్యెను. యముని కింకరులు పని లేక తమ యిచ్చ వచ్చినట్లు ఆటలాడుకొనుచుండిరి. అపుడు నేను తపస్సు నొనరించి శ్రీహరి యనుగ్రహము వలన నతని సాక్షాత్కారము నొందితిని. అపుడు శ్రీమన్నారాయణుడు నన్ను, రుద్రుని, కపిలదేవుని, అత్రిని జూచి యనెను.

## మాయా శాస్త్రముచే నందరును మోహితులగుట

"స్వల్పమగు నాయాసముతో నల్పఫలము నొదవించునట్టి శాస్త్రములను మీరు రచించుడు. ఆ శాస్త్రములు ఉత్తమమగు పరిశోధనలకు విరోధములుగా నుండవలెను. నేనుకూడ అట్లే బౌద్ధశాస్త్రమును నిర్మింతును."

ఆ శ్రీహరియాజ్ఞచేత మే మందరమును ఈ తీరుగానే వేరువేరుగా శాస్త్రముల రచించితిమి. ఆ శాస్త్రములను జదివి ఫలముల నొంది ప్రాణులు పంచరాత్రములను నిందించి మాటిమాటికి దూషించుచుందురు. పంచ రాత్రమున బాగుగా పరిశ్రమ జేయక, పాషండుల యుప దేశమున జెడిపోయిన ఆ ప్రాణులం దందరును, ముక్తికి ఏది యుపాయమో సరిగా గుర్తింపలేకున్నారు.

పంచరాత్రాగమము అనేకములగు సంహితలతో నున్నది. అభాగములు పరస్పరము వేరువేరుగా నుండును. ఏయే తంత్రమునం దెవడెవడు నిష్ఠ గలిగి యుండునో వాడు అతంత్రముప్రకారముగా శ్రీహరిని భక్తితో నారా ధించినచో ముక్తిమార్గమును జేరగలడు. ఒక తంత్రము ప్రకారము దీక్ష నొందినవాడు మరొకతంత్రము నెక్కడుగా నాశ్రయింపరాదు. ఒక తంత్రమునందు దీక్ష నొందియు తెలివిలేక పరతంత్రము నాశ్రయించుచో తప్పక నరకము నొందును. కనుక నొకతంత్రమునందే నిష్ఠ కలిగి పరమ పురుషుని ఆరాధింపవలెను. తనతంత్రమున జెప్పిన పద్ధతి గాక మరొక తంత్రముగతి అతనికి కూడదు.''

ఇట్లు పంచరాత్రులందరిని కష్టము లేకుండ బ్రతికించు నట్టి యీమాటను విని తంత్రములోని విశేషములు నెరిగి యున్న కుమారుడు వశిష్ఠుడు తండ్రిని అడుగ మొద లిడెను.

## స్వతంత్రమున దెల్పనిది పరతంత్రమున గ్రహింప నగును

''అన్ని తంత్రములను నీ వెరుగుదువు. తంత్రములు అనేకములుగా నున్నవి. తనతంత్రములో దెల్పని దానిని పరతంత్రముననుండి సాధింపవలెను. ఒక తంత్రమున ప్రకాశించి యుండుచు నితరతంత్రములను గూడ నభ్య సింపవలెను. లేనిచో నత డొనర్చు పని సరిగా నేర్పడదు. అందువలన అతడు పనిచేసినను చేయనివాడే యగును. పంచరాత్రతంత్రముల నన్నింటను వైశారద్యము కలిగిన నీవు తెల్పినది ఈతీరేనా? ఒకతంత్రమున దీక్ష నొందిన వాడు సరిగా క్రియ నొనర్చుటకై తంత్రాంతరములను గూడ చక్కగా నభ్యసింపవలెను. అనేకతంత్రములను సరిగా నేర్చుటవలననే అతనికి స్వతంత్రమునందు చెప్ప బడిన క్రియలందు సరియగు నధికార మేర్పడునా? కాని తంత్రాంతరముల ననుసరించిన ప్రతిష్ఠాదులందు ఇతని కేమియు అధికారము గలుగదా!'' అని ఇట్లు కుమారు డడుగుచుండగా నాలుగు మొగములను నవ్వు లొలుక భగవానుడు బ్రహ్మదేవుడు వసిష్ఠుడు మొదలగు ఋషు లతో నిట్లనెను.

## ఒక తంత్రమున దీక్ష నొందినచో నంతటను చేయనగును

''ఓ ఋషులారా! సాత్వతతంత్రమున దీక్ష నొందిన వాడు తన తంత్రమునందును ఇతరుల తంత్రమునందును గూడ అధికారి యగును.

పౌష్కర తంత్రములో ప్రవేశించి దీక్ష నొందినను అతనికి అధికార మేర్పడును. పంచసంస్కార మొందెనేని అదీక్షతో అత డన్నితంత్రములందును ధ్రువముగా అధికారి యగును. దీక్ష లన్నింటిలోను గూడ పంచసంస్కారమని పేరు వడసిన దీక్ష చాల శ్రేష్ఠమైనదిగ మునులు స్మరించిరి. అదియే శ్రీహరికి ప్రీతికరమైన దీక్ష.

తాపము (అగ్నియందు వెచ్చచేయబడిన శంఖచక్ర ముల రెండిటిచేతను భుజమూలములను తపింపజేయుట), పుండ్రము (తిరుమణి శ్రీచూర్ణములతో ద్వాదశ ఊర్ధ్వ పుండ్రముల ధరించుట) నామము (శ్రీహరిదాసుడని ఈ తీరుగా భగవ ద్దాస్యనామమును పెట్టుకొనుట) మంత్రము (అష్టాక్షరిమంత్రము ఆచార్యు నొద్ద నుపదేశ మొందుట) యాగము (నిత్యము భగవంతుని పూజించుట) ఇది పంచ సంస్కార దీక్ష. ఈ దీక్షను దేవదేవుడగు శ్రీహరి చాల ప్రేమించును. ఈదీక్ష నెవడు పరిగ్రహించునో వాడు అన్ని తంత్రములందును క్రియల నొనర్ప వచ్చును. ఈదీక్ష నొంది ఆరాదించిననే దేవదేవుడు భుక్తిని ముక్తిని గూడ చక్కగా నమకూర్చును.''

పిమ్మట మునిశ్రేష్ఠుడగు అగస్త్యుడు భగవానుడగు పితామహునకు ప్రదక్షిణ మొనర్చి నమస్కరించి అడుగ మొదలు పెట్టెను. ''పంచరాత్రము అని పేరొందిన ఈ శాస్త్రము చాల విస్తారమైనది. దీనిని హృదయమున ధరిం చుట చాల కష్టము. శాస్త్రమును కష్టము లేకుండ మాకు తెలియున ట్లుపదేశింపుము.

## శాస్త్రము మొదలిడుట

అగస్త్యుని మాటను విని అన్ని లోకములకును పితా మహుడగు బ్రహ్మదేవుడు భగవానుడగు శ్రీమన్నారాయ ణుడు తనకు చెప్పినదానిని వీరికి చెప్పట కారంభించెను. ''పూర్వకాలమున నేను పంచరాత్రము నభ్యసించితిని. అది చాల గొప్పదగుట వలన దానియందు నిశ్చయము నెరుగక తిరిగి సర్వేశ్వరునే వేడుకొంటిని,

''ఓస్వామీ! అన్ని జగములకు ప్రభువా! అన్ని చేతన ములకును ప్రియమును కూర్చువాడా! తాము చాల యెక్కువగా నుపదేశించుట వలన నాకు దానియందు స్థైర్యబుద్ధి కలుగలేదు. పరబ్రహ్మమా! నాయందు అను గ్రహమున్నచో సరిగా తెలియునట్లుగా చెప్పుము.''

ఇట్లు నేను వేడగా నన్ని భూతములకును హితము నొనరించుటయందే ప్రీతి కలవాడు కనుక సర్వసమర్థుడగు నాదేవుడు తెలుసుకొనవలెనను కోరికతో నుండిన నా కుపదేశింప మొదలిడెను.

శ్రీ పాంచరాత్రములో శ్రీవిష్ణుతిలకమున బ్రహ్మోపదేశమునందు శాస్త్రావతరణ మను మొదటి యధ్యాయము ముగిసినది.

---

తరువాత స్వర్గాదుల వర్ణనాత్మకమైన
ద్వితీయాధ్యాయము ప్రారంభము.

### భగవానునకును బ్రహ్మకును సంవాదము

"ఓ చతుర్ముఖుడా! మనసు నేకాగ్రముగా నుంచుకొని వినుము. శాస్త్రము నుపదేశింతును. ఇదివరకు కోటిన్నర ప్రమాణముగ శాస్త్రము నుపదేశించి యుంటిని కదా! అందరికిని శ్రేయస్సు కలుగవలె ననియు, మిక్కిలి యధికముగా భుక్తి సమకూడవలె ననియు నది యుపదేశించితిని. ఇపు డందరికిని సులభముగా దెలియుటకై ఆపంచరాత్ర ప్రసారము ఇట దెల్పుదును. మనసు నితరములందు చెదరనీక నన్ను బూజించి నాయందు భక్తి కలిగియున్నచో నెవ్వడైన ముక్తి నొందును. అంతే కాక విశేషించి భుక్తిని గూడ నొందును. బ్రహ్మను దెలియ నగునదియే జ్ఞానము.నిరంతరము నాధ్యానమును గావించు చున్నచో బ్రహ్మము నెరుంగ గల్గును

### బ్రహ్మస్వరూపము

ఇక బ్రహ్మ మెట్టి దనగా అది యెవ్వరికి స్పష్టముగా నెరుగ బడదు. తన స్వభావమునుండి తొలగదు, దానికి మార్పు లేదు. ఆదిమధ్యములు లేనిది. ఎల్లప్పుడును లో టేమియు లేక సంతృప్తిగా నుండును. దానితో బోల్ప దగిన దేదియు లేదు. ఇట్టి దోషమును లేని గొప్ప తేజస్సు. వర్ణముల వికారము లేమియు దానికి సంభవింపవు. తమస్సున కవ్వల నుండును. అన్నింటికన్నను గూడ గొప్పది. అట వేడి, చలువ, ఈ రెండింటి కలయిక యేదియు లేదు. సర్వాకారము, నిరామయము. ఎట్టి యాకారమును లేనిది. లోకోత్తరమైన తత్త్వమది. దాని నెరిగిన వా డెవ్వడును లేడు. ముముక్షువులు మాత్రమే దాని నెరుంగ గల్గుదురు. అది యంతటను వ్యాపించి యుండును.

### భగవానుని సృష్టి స్వరూపము

ఆ బ్రహ్మ మొక కారణము వలన జ్ఞానఘనముగాను, స్ఫటికము వంటి కాంతి కల్గియు, అనేకమంది సూర్యులు, చంద్రులు, అగ్నులు, వీని తేజస్సుల గుట్టవలె నిర్మలముగాను అయ్యెను. తేజోమండలము నడుమను రెండు చేతులతోను చక్రములను ధరించి కిరీటము, హారము, కేయూరములు, శ్రీవత్సము, వనమాలయు కలిగి, కాలికి అందెలను బెట్టి, కటి యందు పచ్చని పట్టుబట్టను కట్టి, చెవుల కందమైన కుండలములను దొడిగి యుండును. అది వాసుదేవుడని పేరొందిన తేజస్సు. దానిని యోగనిష్ఠులు నిత్యము ధ్యానింపవలెను.

### వ్యూహ భేదము

ఆ పరవాసుదేవునుండి పురుషోత్తములు నాలుగు వ్యూహముల పేరుతో నేర్పడిరి. ఆపురుషోత్తములు అన్ని యలంకారములతో గూడి యుండుటయే కాక అన్ని సామర్థ్యములును గలిగియుండిరి. వారి రొమ్ములందు కౌస్తుభము వెలుగొందు చుండెను. శ్రీవత్సము నుండెను. వారి స్వరూపమునందు నిత్యము ఆనందము విలసిల్లు చుండెను. మొదటి వ్యూహము పురుషోత్తముడు చీకటి పూవురంగుగాను, రెండవ వ్యూహము రెల్లుపూవురంగుగాను, మూడవవ్యూహము ఇంద్రనీలము రంగుగాను, నాలవది తామరపూవురంగుగాను నుండెను.

### నారాయణుడు

నాల్గు చేతులతో నున్న వాసుదేవుడు నారాయణుడనబడును. ఆవాసుదేవుడు మొదలగు వారందరును కేశవుడు మొదలగువారి నుదయింప జేసిరి, నారసింహుడు, మత్స్యావతారము మొదలగు రూపములతో నున్నవారును పై వారినుండి యేర్పడిరి. మొదటి వ్యూహము వాసుదేవుడు, రెండవది సంకర్షణుడు. ప్రద్యుమ్నుడు మూడవది, అనిరుద్ధుడు నాలవది. ఆ తరువాత సముద్రమును, మాయను, పద్మనాభుని మఱ్ఱిచెట్టును నారాయణుడు నిర్మించెను. అనిరుద్ధుడు మాయను నిర్మించగా నది నీకు కదమువానిని సృష్టించుట కుపకరణమయ్యెను. మహానుభావుడగు అనిరుద్ధునుండి పరుడు పద్మనాభు డుదయించెను. అనేక శాఖలతోడి మఱ్ఱియగు మాయ నతడు నిర్మించెను. నారాయణునుండి ఎన్మిది బ్రాహ్మ్యాది దివ్యరూపములున్నూ, మత్స్యాదిరూపము లన్నియు వాసుదేవునుండియు నుదయించినవి. సంకర్షణుడు పురుషుడు మొదలగు నల్వురను నిర్మించెను. జ్ఞానైకరూపుడైన శ్రీహరి హయగ్రీవుడుగా సంకర్షణునుండి జనించెను.

### హయగ్రీవుడు, అనంతుడు, గరుడుడు, దేవులు పార్షదులు

సర్వచక్రవర్తి యగు అనన్తుడు చక్రాదులైన ఆయుధము లన్నియు, పక్షీంద్రుడు వాహనగరుడుడును నగలు శ్రీదేవి

మొదలైన యెనిమిదిమంది దేవులును, దివ్యలాంఛనమగు శ్రీవత్సమునుండి యుదయించిరి. మహాత్ముడగు అనిరుద్ధు నుండి కుముదాదులైన పార్షదులు కల్గిరి. అతని పాదము నుండి వేలకువేలు గుంపు లుదయించినవి. ఆయని రుద్ధుడు స్వయముగానే గొప్పయాకారముతో నీసకలప్రపం చవురూపమున నేర్పడెను. లనేకములైన తలలు పాద మును, చేతులు, కనులు, ముక్కులు, చెవులతో తనశరీర మునుండి యీవిశ్వమును సృజించెను ఓకమలాననుడా వినుచున్నావా? ప్రపంచపు టాకారమును దాల్చిన యా యనిరుద్ధుని ముఖపద్మమునుండి అగ్నియు, నింద్రుడు నుదయించిరి. శిక్షాదులగు అరు వేదాంగములును అట నుండియే కల్గినవి. శిరమునుండి దివ్యలోకమును, కన్ను నుండి సూర్యుడును, మనసునుండి చంద్రుడును నేర్పడిరి. చెవులనుండి దిక్కులును, బొడ్డునుండి నీవును, పాద ములనుండి భూమియు, ప్రాణమునుండి వాయువు అపా నమునుండి మృత్యువు, వెంద్రుకలనుండి మబ్బులు, తలంపునుండి కాలములు, అడవిలోనుండు చెట్లు ఓష ధులును రోమకూపములనుండియు మొగమునుండి బ్రాహ్మణులు, భుజములనుండి క్షత్రియులు, తొడలనుండి కోమటులు, పాదములనుండి శూద్రులు నుదయించిరి. ఇంత విస్తృతమగు నీజగమంతయు నామహానుభావుని తేజస్సునందు పరమాణువువలె విశ్రమించినది. తిరిగి అట నుండి యిట్లు విస్తరించినది.

జీవుడు

జీవుడు బ్రహ్మతేజస్సునందు కౌస్తుభమణిగా విశ్రాంతి నొందెను, పరవాసుదేవుని యిచ్ఛచే నీజగత్తునందు విస్త రించినాడు. ధ్యానము, యోగము, అర్చనము వీనిచేత నన్ను ఎల్లపుడును చక్కగా నుపాసించునట్టి జీవుడు జగత్తునుండి వెలికి వచ్చి నాకౌస్తుభమును జేరును. నిరా మయుడును, చిద్ఘనుడునునగు జీవుడు కౌస్తుభమను పేర్వడిన మణి యయ్యెను. అద్యంతములు లేని యారత్నము నాయందెల్లపుడు నుండును. ఒకదీపము నుండి మరొకదీపము అంతకంతకుపెద్దదైవెలుగొందు నట్లుగా జగమున జీవునివృద్ధి యిపుడు విస్తరించినది— జీవుడు జగమున విస్తరించును. నాయందు సంకోచము నొందురు. ఓచతురాననుడా! అంతేకాని జీవున కుత్పత్తియు వినాశమును లేవు.

జగత్తు

బ్రహ్మము, జీవుడు, జగత్తు, అని మూడు తీరు లిట నున్నవి. తేజస్సుల రాశి బ్రహ్మ, భూతముల రాశి, జగత్తు జ్ఞానముల రాశి జీవుడు. అతని కుత్పత్తియు లయమును లేదు. ఈజగము తనకర్తయగు పరబ్రహ్మమునకు ప్రకరణ మగు) ద్రవ్య మయ్యెను. మణిశ్రేష్ఠమగు కౌస్తుభము ప్రభావము చేత నీజగమంత యు వికసించును. జీవుడు తొలగగానే జగమంతయు ముడుచుకొని పోవును. ఇట్లు సంకోచము నొంది యీజగము పరమాణువువలె నగును.

అట్లణువంత యల్పతనొంది బ్రహ్మమునందు లీన మగును. ఇట్లు ఈజగమునంతయు సృజించిన యా యనిరుద్ధుడు విశ్వము రూపమున నుండి దీనిమీద ప్రభు త్వము నెరపును. శ్రీలక్ష్మి మొదలగు దేవులతో గూడశే షపీఠమున నుండును. అంతటను జలముపొంగి వెల్లువగా నున్న సముద్రములోని యా మఱ్ఱిచిగురుటాకున శేషుని యందు శయనించి అనిరుద్ధబ్రహ్మముజగము నింద్రాదులతో పరిపాలించెను. ఇంతవరకును అనిరుద్ధుని సృష్టిని తెల్పితిని.

---

नमस्तुभ्यं नमो मह्यं तुभ्यं मह्यं नमो नमः ।
अहं त्वं त्वमहं सर्वं जगदेतच्चराचरम् ॥

**O Lord, salutations to Thee; salutation to Me; salutations to both Thee and Me. For, I am verily Thyself and Thou art Myself. Nay, Thou art the whole world, the moving and non-moving.**

# AMARAVATI

*By*

N. RAMESAN, M. A. I. A. S.

*(Deputy Secretary, Home Department, Andhra Government Kurnool)*

Amaravathi, which has made Andhra sculpture a by-word among the leading plastic arts of the world, is also the seat of a famous temple to Lord Siva, worshipped as Amareswara. It is situated twenty miles north north-west of Guntur and is connected with it by a good motorable road. Amaravathi and Dharanikota which adjoins it, were the seats of ancient Andhra empires, and the place is full of antiquities of much archaeological value. The lofty temple of Amareswara stands on the banks of the holy river Krishna, and is situated at a spot on the river, where it takes a north-south course. The origin of the temple is shrouded in mystery, though there are many legends, puranic and otherwise about it, but the sanctity and holiness of the place, attract even now thousands of people. The temple is full of medieval inscriptions of local chieftains, like the Kota chiefs of Amaravathi, and this paleography helps us to reconstruct the local history of the tract, when there was confusion and anarchy after the fall the Chola-Chalukyas and before the advent of the Kakathiyas. The inscriptions are roughly from the 11th century A.D. onwards only and include these of Ana Vema Reddy of the Kondavidu line, a wife of a chieftain of Kulottunga I, alias Koppara Kesarivarma and of Krishnadeva Raya of Vijianagar dynasty. Inscriptions prior to the 10th century are very rare here.

Amaravathi had a very ancient and varied history. It was the seat of the empire of the early Andhra Kings and later became celebrated as the seat of a very famous university. Dharanikota, which adjoins it, was the seat of the Andhra kings in the 3rd century A.D. The earliest reference to this contained in that famous copper-plate grant of the Pallava king Sivaskandavarman, whicn is known to all historians as the 'Mayidavolu grant,' called after Mayidavolu village of Narasaraopeta taluk of Guntur Dt., where the copper-plate was unearthed. By the date of this grant which may be assigned to roughly 260 A.D., Andhradesa, upto river Krishna had already been annexed to the Pallava kingdom. The edict was addressed to the Vyāpṛta (Prakrit Vyāpita), i.e. the viceroy stationed at Dhanakataka which is identified with the present Dharanikota. The grant was made by Yuvamahārāja Sivaskandavarman, for victory in war and for increasing his Punya, Āyur, and Vīrya. It was a record of a gift of the village 'Viripara' in the Āndhrapatha, to two Brahmanas, 'Puvakotuja' and 'Gonandija' (These two Prakrit names can be read as Pūrvakōtyārya and Gōnandyāryā in Sanskrit) of the 'Agnivesya Gotra.' This is a very vital and important grant, which helps us in the reconstruction of Pallava early history. The village was granted as a 'brahmadeya', and the grant was given in person by the heir-apparent and was carried out by himself as the 'ājñapti' (executor). This is probably the earliest reference to Amaravathi we have and it speaks of the place as the seat of the viceroy. There is also a pillar inscription at Amaravathi which records a love-affair between Madani and Ashwathama, which has been intrepreted by some scholars as referring to the union of Ashwathama, with a Nāga maiden; the off-spring of which was

కొండకుఁ బోయి భిక్షుకుఁ డయినాఁడు. పలని 'పండార' మీయనే. అమ్మ పోయి బ్రతిమాలి బుజ్జగించి 'అన్ని తపస్సులకు ఫలము నీవె గదా. నీకు ఫల మేమి ''యని తేల్చి యింటికి తెచ్చినది. ఇది పలని కథ.

## ఉద్భవము

ఈయన దేవసేనాపతిగా ఎందరో అసురులతో యుద్ధము చేయవలసివచ్చినది. మొదట ఈయన యుద్భవించినదే అందుకట. మొదట దేవతల సేనాపతి శివుఁడు. ఆయన మొదటి భార్య దక్షునికూతురు సతి. శివుని శ్మశానవాసిత్వము ఆచారము కర్మనిష్ఠుఁడైన దక్షునికి సరిపడక ద్వేషములు పెరిగినవి. దక్షుఁడు యజ్ఞము చేయుచు కూతురిని అల్లుని పిలువలేదు. సతికి కోపము వచ్చినది. తండ్రితో తగవులాడ నందు పోయినది. శివుడు వద్దన్నను వినలేదు. తండ్రి అనుకొన్నట్లే యనాదరించినాఁడు. 'మరల నేముఖము పెట్టుకొని మగనిదగ్గరకుఁ బోదు'నని నిప్పులో తన దేహమును దహించుకొన్నది. శివునికి కోపము వచ్చి దక్షునితల వీరభద్రునిచే దరిగించి యజ్ఞమును నాశనము చేసినాడు. కాని విరక్తిచేత యోగి యైనాఁడు. దేవతలకు వేఱు సేనాపతి లేకపోయినారు. అసురులు 'తారకాసురు'ని యాధిపత్యమున విజృంభించినారు. అతనికి శివునిమీద నెంతో భక్తి. శివుడు ఆయనను చంపడు. శివునికొడుకు తప్ప నెవ్వ రతని చంపలేరు. ఎట్లో దేవతలంద రాయన నొప్పించి పర్వతరాజు కుమారితను ఆయన కిప్పించి వివాహము చేసినారు. శివుఁడు పార్వతితో పుత్రోత్పాదనమునకై రమించుచుండగా నెంతకాలమునకును ఆ క్రీడ ముగియకపోయెను. ఆ యుద్భవించు కుమారుని లోకమెట్లు భరించునని దేవతలే భయపడి యింక క్రీడ నుడుగుమని శివుని వేడిరి. ఆయన యట్లే చేసినాడుగాని అదివరకే యింద్రియము కొంత స్కన్న (జాఱు) మయియుండినది దాని నేమి చేయుదు నన్నాఁడు శివుఁడు. ఆ తేజోధారణము అగ్నికిఁ దక్క నితరులకు సాధ్యముగాదు. అగ్ని యా తేజస్సును ధరించెనుగాని యా వేడి కోర్వలేక పోయెను. గంగయందుంచుమని యన్నారట. గంగయు భరించలేక పోయినది. ఆమె హిమవత్పర్వతపాదమున నా తేజస్సును విసర్జించినది, ఱెల్లుమధ్యమున. అక్కడ కుమారస్వామి యుదయించినాఁడు. స్కన్నమైన రేతస్సున నుద్భవించినాఁడు గనుక నీయనకు స్కందుఁడని పేరు. అరవమున కందన్. కృత్తికానక్షత్రము లార్వురు నీయనకు తల్లులై పాలిచ్చినారు. ఆరుమొగములతో నందఱి పాలను ద్రావి ఆరుదినములలోఁ బెరిగి పెద్దవాడాయెను అని యొక కథ. కనుక ఈయన శివునికి పార్వతికి అగ్నికి గంగకు శరవన(ఱ)మునకు (ఱెల్లు దుబ్బుకు) కృత్తికలకు వరుసఁగాఁ బుత్రుఁడు.

ఇంకొక కథలో అగ్ని రుద్రవీర్యతాపమున కోర్వలేక పోయినాఁడు. సూక్ష్మతేజోంశరూపమున హోమార్థము తన దగ్గఱకు వచ్చిన ఋషిపత్ను లార్వురియందు దానిని నిక్షిప్తము చేసినాఁడు. లోకమెల్ల అగ్ని ఋషిపత్నులకు గర్భము చేసినాఁడని ఘోషించినది. ఋషులు తమ పత్నులను బరిత్యజించిరి. వారి గర్భములను అందరును ఱెల్లు దుబ్బులు ప్రబలముగానున్న యొకకుండమునఁ ద్యజింపఁగా నక్కడ యొక కుమారుఁ డుద్భవించినాఁడని యొక కథ. ఆయనయే స్కందదేవుఁడు.

ఇంకొకటి ఋషిపత్నుల నగ్ని వలచియుండినాఁడు. ఆయన భార్య స్వాహాదేవి కీగుట్టు తెలిసినది. ఆమె ఋషిపత్నుల రూపమును దాల్చి అగ్నితో సంగమించి ఆ వీర్యమును నొక ఱెల్లునందు విసర్జించినది. అందు కుమారుఁ డుదయించినాఁడు. లోకనిందయేమో ఏపాప మెఱుఁగని ఋషిపత్నులను జుట్టుకొన్నది. భర్తలు వారిని త్యజించినారు. కుమారుఁ డుదయించినతర్వాత వా రాయనకుఁ దల్లులై స్తన్య మిచ్చి కృత్తికానక్షత్రము లారుగా నైనారని యింకొక కథ. పెండ్లికాలమున వధూవరులకు సప్తర్షిధ్రువ సందర్శనము చేయించునపుడు 'షట్కృత్తికా ముఖ్యా యోగం వహంతీయ మస్మాక మేధ త్వష్టమీ' అని కృత్తికా నక్షత్రములయొక్క ప్రాధాన్యమును వచించియున్నారు.

ఆ కొండలలో కుమారుఁ డుద్భవించి పెరిగి తారకాసురునితో యుద్ధము చేసినాడు. తారకునికంఠమున నొక యమృతలింగ మున్నది. తాను దానిని నైదుఖండములు చేసిన దాక వాడు చావలేదు. ఆయైదుఖండము లయిదు చోట్ల బడినవి. అవియే మనయాంధ్రదేశ మందలి పంచారామములు. అమరావతి (అమరారామము), మొదలగునవి. కొంతకాలమునకు శూరపద్ముఁడని యింకొక యసురుఁడు ప్రబలుఁ డయినాఁడు. కుమారుఁ డాయనను జయించి ఒక క్షణము ఒకకొండ మీద విశ్రమించినాఁడు. అదియే క్షణికాచలము. అరవములో తన్నికాచల మందురు. అదియే తిరుత్తని చిత్తూరుజిల్లా తిరుపతికి ఆగ్నేయముగా యేబది మైళ్ళలో నున్నది.

ఈ కథ లన్నియు నాలోచించిన చరిత్రకారు లిట్లు సర్వమును సమన్వయపఱచి చెప్పవచ్చును.

## చారిత్రక దృష్టిని శివగాథ

శివుఁడని యొక ఆటవికప్రభువు. ఆయన తండ్రి యొక బ్రాహ్మణుడు. (బ్రహ్మ) తల్లి నాగకన్య. అనాగ జాతి నాయన పెరిగి నాగభూషణు డైనాడు. ఆయన

వృద్ధికి వచ్చినతర్వాత పిశాచకిరాతాది సకలాటవిక సైన్యప్రభు వైనాఁడు. సముద్రమున కవ్వలనున్న సింహళాదిభూములలోను పడమటి దెసనున్న యసురులతోను (అస్సీరియనులతో) ఆర్యావర్తమునం దున్న రాజులకు ఘోరయుద్ధములు జరుగుచుండినవి. ఆర్యరాజులకు దక్షప్రజాపతి నాయకుఁడు. ఈయుద్ధములలో శివుని సాహయ్యము కావలసివచ్చినది. ప్రజాపతి కిష్టము లేకున్నను బ్రహ్మ బలవంతపెట్టి ఆయన కూతురు సతిని శివుని కిచ్చి పెండ్లి చేయించెను. శివుడు ఆర్యరాజులపక్షమున నిలిచి యసురులను సంహరించెను. కాని ఆర్యప్రజాపతికిని శివునికిని సఖ్యము చాలకాలము నిలువలేదు, ఆచారవ్యవహారములు భిన్నము లైనవి. శివునికి కోపము హెచ్చే కానిండు, మామగా రాయనను చాల నిందించి 'రుద్రుఁ' డని (ఏడుపుగొట్టు) తామసుఁ డని ఏమో ఏమో యని వెలి వేసినాఁడు. సతికిని తాను చేయుచున్న యజ్ఞమునకు తాను పిలువకయే వచ్చినను అవమానము చేసినాడు. ఆమె అగ్నిప్రవేశము చేసినది. శివునకు కోపము వచ్చినది. ఆటవికబలముతో వచ్చి యజ్ఞమును ధ్వంసము చేసినాఁడు. ఆవిరాగములో రాజ్యమును పరిత్యజించి యోగియై ముక్కుమూసికొని కూర్చున్నాడు. దేవతలకు అనఁగా ఆర్యరాజులకు బలము చాలలేదు. నలువైపుల నుండి అసురులు కమ్ముకొన్నారు. బ్రహ్మ ఎట్లో శివుని అనునయించి ఈపర్యాయము జాగ్రత్తగా కొండరాజు కూతురునే పార్వతిని పెండ్లి చేసెను. ఈదంపతులకు మొదటికొడుకు వికారాకారుఁడు. మఱుగుజ్జు. బహుబుద్ధిశాలి కాని యుద్ధవీరుఁడు కాఁడు. తరువాత సంతానము కుమారుడు. అయన కొండలలోనే పెరిగి చిన్నతనమునందే అగ్నివలె విజృంభించి అసురులను దహనము చేసినాడు. ఆర్యరాజు దేవేంద్రుని కూతురు దేవసేన నిచ్చి వివాహము చేసి ఆర్య ద్రావిడ జాతులసఖ్యమును స్థిరము చేసినాఁడు. కుమారుని రాజ్యము తొండమనాడు మొదలు దక్షిణసముద్రపర్యంతము. ఆయనను ఆర్యసంస్కారసమ్మితునిగా పెంచినా రార్వురు ఋషిపత్నులు. వారు ఆయనకు సర్వజ్ఞానము నుగ్గుపాలతో పోసి పెంచినారు. నాయన మహాయోధుఁడు జ్ఞాని. సమస్తకళలకు నిధి. అట్లే కుమారుఁడును. ఆటవికజాతులకు వా రిచ్చినవే తంత్రములు ఆగమములు. వారు అనగ శివకుమారులిర్వురు ఆటవికజాతులకే కాక ఆర్యులకును దైవస్వరూపు లైనారు. సమస్తవిద్యలు యోగములు వ్యాకరణాది సర్వశాస్త్రములు వారు అనుగ్రహించినవే.

మనకును ఇట్టికథ యున్నది. మనకు నిశుంభాసురుని సంహరించిన ఆంధ్రవిష్ణు వున్నాడు. ఆయన యసురులపట్టయిన కృష్ణా గోదావరీ మధ్యస్థ—అరణ్యమును అగ్నితో వేగించి (దహించి) దానిని వేంగినాడును సృజించి అంధమును (చీకట్లను) బోగొట్టి అంధ-చీకటిని-ర (అగ్నిబీజము) దహించిన యాంధ్రు డైనాఁడని చెప్పవచ్చునుగదా.

## II

### చరిత్రకారుల సిద్ధాంతములు

భారతమున నాప్రాచీనకాలము దృశ్యాదృశ్యము. అపుడేమి జరిగినదో తెలిసికొనుట కాధారములు లేవు. ఉన్నవన్న వేదములు పురాణము లితిహాసములు, జనులలో వే రూనిన విశ్వాసములు సంప్రదాయములు, చరిత్రకారులు వీనిని నమ్మరు. యథాస్థితముగ జరిగినవని నమ్మువా రరుదు. ఇవన్నియు అభూతకల్పన లందురు. తదుపరి నిమిషనిమిషమునకును వ్యక్తివ్యక్తికిని మారు తమయూహలే సత్యము లందురు. వీరిలో నొకశాఖ యున్నారు. వారు కొంతనిజ మున్నను పురాణములు గోరంత కొండంత చేసి వ్రాయబడిన వందురు. పురాణములలో వ్రాసినదానిలో నేది నిజము అని వీరు పరీక్ష చేయుదురు.

వీరియూహలప్రకారము నాగభూషణుఁడు శివుఁడన్న శివునికి నాగములు భూషణము లనరాదు. నాగులకు శివుఁడు భూషణ మనవలెను. నాగుఁలన్న నాగపతాకము కల రాజులు లేక నాగముద్రాచిహ్నితులగు (totem) జాతి. శివునికి పరివారములైన పిశాచకిన్నరయక్షాదులు పూర్వకాలమునందలి జాతులు. అవన్నియు గలసి యిప్పటి తమిళజాతులైనవి. వా రనార్యులు, ద్రావిడులు. ద్రావిడజాతీయత వేరు, ఆర్యనాగరికత వేరు. శివషణ్ముఖు లనార్యదైవములు. తరువాత తరువాత ఆర్యులు వీరి నంగీకరించి పురాణములలో వేదములలో వారిస్తుతులను నింపినారు. అని వీరి సిద్ధాంతము.

మొదట పురాణగాథలు భూమిపై జరిగిన విషయములుగా వనుట వీరిమూలసూత్రము. వీరికి చుక్కెదురు ప్రాచ్యపండితులు. తుచ తప్పక సర్వపురాణగాథ లీభూమిపై జరిగిన వని వీరివాదము. పురాణములే చెప్పుచున్నవి. ఆయాకాలములతో పదునాల్గుభువనములలో ముల్లోకములలో నానాకల్పములలో జరిగిన సంఘటనములను క్రోడీకరించి వేదచోదితములగు ధర్మములకు లక్ష్యములుగా పురాణములు రచింపఁబడినవని. కావున పురాణములు పూర్ణములుగావు (not exhaustive). లక్ష్యమాత్రములు. (Illustrative). మూడులోకముల అనఁగా సూక్ష్మకారణ స్థూలజగత్తులలో జరిగిన గాథానివేదనలు. మరి వీరి కల్పగణన అత్యాశ్చర్యకర మగు కాల

విభాగము గ్రహాదిజ్యోతిస్సుల (stars) బట్టి నిర్ణీత మైనది. గణితసిద్ధము. పాశ్చాత్యోపకులకు ప్రాచ్య జ్యోతిషప్రవేశము సున్న. మరి మనపురాణములలో ఆయా ఘటనల గ్రహస్థితి నీయని సంవత్సరములు దాదాపు లేవు. ఇట్టిపరిస్థితులలో నీ చరిత్రకారులయూహాసిద్ధాంతములను మనము దర్శించి ప్రయోజన మేమి? తర్క మనవసర మైనట్టి ప్రత్యక్షసిద్ధమైన దేవాలయ మొకటి తిరుత్తనియం దున్నది. అమూర్తి యెల్లరకుపాస్యము. కావున నాదేవాల యమును చూచిన తర్వాత నూహాప్రపంచమునంబడు దుము గాక.

## III

### తిరుత్తని క్షేత్రము

గూడూరు-రేణిగుంటరైలుమార్గమున నెడమవైపున శ్రీ కాళహస్తీశ్వరునిదేవాలయము కనవచ్చును. రేణిగుంటస్టేష నుండి చూచిన కుడివైపున నొకఇరువదిమైళ్ళలో తిరు పతివేంకటేశ్వరుని నివాసమైన శేషాచలశ్రేణి యున్నది. రేణిగుంటనుండి మద్రాసునకుఁ బోవుమార్గమున మువ్వది రెండుమైళ్లలో తిరుత్తని యున్నది. స్టేషనుకుఁ బడమట నొకకొండపై నీసుబ్రహ్మణ్యేశ్వరుఁడు వెలసి యున్నాఁడు.

ఇదిగో! దేవాలయ మొక్కతిప్పపైనున్నది. తిప్పయం తయుఁ బాషాణమయము. ఉత్తరమున నొకకొండ, చూచుటకు తెల్లగ నుండుటనుబట్టి కాఁబోలు 'పచ్చి బియ్యముకొండ,' దక్షిణమున నొకటి చిరునలుపుంబట్టి దానిపేరు 'గానుగుపిండికొండ' సఖులవలె నున్నవి. పచ్చిక, చెట్లు, చీమ కొండపై సమృద్ధిగానే యున్నవి. స్టేషను నుండి బాట సరాసరి కొండపాదముదగ్గరికిఁ తీసికొని పోవును. అక్కడ నొక 'కుమారతీర్థ' మున్నది. దాని ప్రక్కనే కొండమీది దేవాలయమునకుఁ బోవు మెట్లు షుమారు 365; ఈ మధ్యనే రిపేరు చేయించినారు. కొండ నెక్కుచుఁ బోయిన నగముదారిలో 'బ్రహ్మతీర్థము'. దాని చెంతనే 'బ్రహ్మలింగము', విఘ్నేశ్వరుఁడు. వీనిని గురించి కథ; బ్రహ్మ భవభవానులకు మ్రొక్కి చిన్నవాఁ డని కుమారుని గౌరవించలేఁదట. ఆయనకు కోపము వచ్చి బ్రహ్మకు సృష్టిశక్తి లేకుండునట్లు శపించెను. బ్రహ్మ శివుని వేడుకొన్నాఁడుగాని ఈ శాపమునకుఁ బ్రతిక్రియ చేయుట కాయనకును శక్తి చాలలేదు. కడకు కుమా రునే బ్రహ్మ శరణు వేఁడి ఈ తీర్థమున ఆయన యాజ్ఞచే స్నానము చేసి తన శాపమునుండి తప్పించుకొన్నాఁడు. మొత్తముమీద నెత్తురు నెత్తురే. పరుల కిద్దరు అబ్బ కొడుకు లొక్కరె.

కొండమీద రథవీదికి దక్షిణమున దక్షిణద్వారము దగ్గర నున్న పుష్కరిణిలోనుండి స్వామి కభిషేకతీర్థమును తీసి కొనిపోవుదురు. దీని పేరు 'ఇంద్రతీర్థము'. ఈ తీర్థములో నొకప్పుడు ఎఱ్ఱకలువలు విరియబూచియుండినవఁట. వానితో నింద్రుఁడు కుమారుని బూజించి చింతామణి మొదలగు నవనిధులు పొందెను. ఆకారణమున నీతీర్థ మునకు 'చెంగల్వతీర్థ' మని కుమారునికి 'చెంగల్వరాయ' డని పేరు వచ్చినది.

దేవాలయనిర్మాణ విన్యాసములో విశేషము కనరాదు. గర్భగృహము చాల పాతదట. దానిలో గోడలో నొకక్రింద రాయిమీద ఎనిమిదవ శతాబ్దినాటి పరాంతక 1 నామధారి, చోళరాజు పరకేసరి మధురకొండఁ రాజ్యవర్షములు 32 నాఁటి శాసన మున్నది. భూదానము, దాత పరకేసరి ముత్తరాయన్. అప్పు డీ యూరి పేరు తిరుత్తనిగల్. జయంగొండ చోళమండలములో మేలూరుకొట్టము విష యములో ఓగవలనాడులో పెరుంగంజియూరి తూర్పు మజరా అగుపూరుచెంత నికొండ అని వర్ణన. కాని శాసన లిపి ఆధునికముగా నుండుట యనుమానమునకుఁ గారణమగుచున్నది. ముఖమండపమును కృష్ణదేవ రాయఁడు కట్టించినాఁ డందురు. కథలను నమ్ముదుమేని దక్షిణదేశమునందు సర్వమండపము లాయన కట్టించిన వనియే జనఘోష; అదియే ఆయన జయఘోష.

దేవాలయమున నుత్తరభాగమున 'రుద్రాక్షమండప' మున్నది. ఉత్సవమూర్తుల కిది ఉండుచోటు. మంట పోపరిభాగము రుద్రాక్షములతో కట్టియున్నారు. (కొయ్య చట్టము) మధ్యభాగమెల్ల రుద్రాక్షలు.

కొంచెముదూరమున కొండవాఁ డొకటి 'నందినది' అందురు, దానిచెంత 'వీరట్టేశ్వర' దేవాలయము కలదు. ఇక్కడ బ్రహ్మకు కుమారుఁడు ప్రణవార్థ ముపదేశించె నందురు. ఇంక కొంతదూరములో వల్లిమల కలదు. వల్లి తండ్రి నంబిరా జుండినచోటు కాఁబోలు. సేలము జిల్లాలో నొక 'వల్లిమల' కలదు.

కొండమీద దేవాలయములో నొకమూల 'అపత్సహాయ' విఘ్నేశ్వరు కోవెల గలదు. వల్లిని వరించుటకు కుమా రుడు వృద్ధునివేషమున బోయి—ఆమె తలిదండ్రులు కనుగొన్నయెడల నిరాకరింతురని భయము కాఁబోలు— వల్లిచే చీవాట్లు తిన్నాఁడు. మునలిని ఏకన్నె వరించును? ఇఁక నన్నగారే తమ్మునికి దిక్కయినాఁడు. వల్లిమీదికి ఏనుగురూపములో దుమికినాఁడు. వల్లి భయపడి మునలి వానినే కవ్వుకొన్నది. ఏనుగు దూరము పోయినది. వల్లి మునలివానిని మరల నిరాకరించినది. మరల ఏనుగు వల్లిమీదికి వచ్చినది. వల్లి మునలివానిని కౌగిలించికొనక-

భయమున—తప్పలేదు. కౌగిలిలోనే ఆ పెద్ద, పడుచువాఁ
డయి వల్లి వలపులదైవము కుమారుఁడై ప్రియతో ఆకాశ
మున కెగసినాఁడు. తమ్మునికిఁ జేసిన యీ సహాయము
నకు గుర్తుగా నీ 'యాపత్సహాయుఁడు' ఇట కుదురు
కొన్నాఁడు. 'ప్రియదర్శిక'లో హర్షుడును భయపీడితగౌరీ
పరిష్వక్తుఁడు హరుడు నిల్లే యానందించినాఁ డని వర్ణించి
నాఁడు. ఆయనయంశమేగదా కుమారుఁడు.

దేవాలయములో నొక రాతిసాన కలదు. ఇంద్రునిదగ్గర
ఆయనసనూతురు కుమరయ్యగారి పెద్దపెండ్లాము దేవ
సేన-ఇక్కడ నామెను దేవయాని యనియు నందురు,
అరణము తెచ్చుకొన్నదఁట. తాతలనాఁటినుండి కాదు—
ఆపెండ్లినాఁటినుండి ఆసానమీదఁ చందనముచెక్కతో
గంధము తీయుచునే యున్నారు. స్వామికిఁ బూయుచునే
యున్నారు. సాన యరుగలేదు. ఆగంధము పూసికొన్న
లోనికి తీసికొన్న రోగములు అసాధ్యములుకూడ సాధ్య
ములే యగునఁట. భక్తిప్రబావమో ; దేవప్రభావమో. ఏట
వాలుగఁ జూచిన సాన వజ్రఖచితమా యన్నట్లు తళతళ
లాడిపోవుచుండును.

శూరపద్మని జంపి స్వామి యిక్కడే విశ్రామము పొంది
నందువల్ల నిది క్షేత్రమైనది. మొదటిపేరు 'శాంతి' పురి.
'క్షణికాచలము' తర్వాత తన్నికాచలము. తర్వాత తనిగై.
ఇది యొక గొప్పవరముల క్షేత్రము. తిరుపతి వేంక
టేశ్వరునికివలె ఈయనకును మొక్కు లర్పింతురు. ఆ
మొక్కులలో విచిత్ర మైనవి కావడిమొక్కులు. ఆ మొక్కు
తీర్చువారు కాషాయములు ధరింతురు. ఒంటికి గంధము
పూలు ధరింతురు. కావడికుండలలో పాలుచక్కెర పూలు
మోసికొనివచ్చి తల బోడి చేయించుకొని రుద్రాక్షమంట
పము లోని యుత్సవమూర్తి కర్పింతురు. ప్రతికృత్తికకు
వందలకొలది వత్తురు. ఆనాఁటి దేవాలయము రాబడి
రెండు వే లుండును. ఆషాఢకృత్తిక మిక్కిలి విశిష్ట
దినము గనుక ఇరువదిముప్పదివేల కావడులు వచ్చును.
స్వామి కాదాయము రు. 40000. దీనినే ఆడి (అరవ
నెల) కృత్తిక యందురు.

మహాశివరాత్రినాడు 1008 శంఖాభిషేకము జరుగును.
కాని భక్త్యుద్రేక గీతములు వేలాదిజనుల 'హరోం
హరహరహర' నాదాలతో వినవలెనా, డిసెంబరు ముప్పది
యొకటవతేది జనవరి ఒకటవతేది రండు. ఇరువదివేల
జను లైకకంఠ్యమునఁ జేయు భజనలయఖండరావము
దిగంతములకు సాగిపోవుచుండును.

ఈ క్షేత్రములో వైష్ణవాంశ బాగుగనే యున్నది.
స్వామికి ధనుర్మాసములో తులసిపూజ ప్రధానము. వారి
పాదచిహ్నముద్రితము శఠారిని భక్తులశిరములపై దాకిం
తురు. వారివలెనే తీర్థ మిత్తురు. కుమారుఁడు విష్ణువు
నామభేదములే గాని వ్యక్తి యొక్కడే యనిగదా తత్త్వజ్ఞుల
నిర్ణయము.

స్వామికి గర్భాలయములో నిరువైపుల భోగశక్తి యోగ
శక్తి యున్నారు. వారే దేవసేన వల్లి యని కొంచరు. ఈ
స్వామి ఇరువైపుల ఇచ్ఛాక్రియాశక్తు లొప్పఁగా వేలాయుధ
రూపమగు జ్ఞానశక్తితో విరాజిల్లుచున్నాడు.

కుమారునికి 'జ్ఞానశక్తిధర' అని యొకనామము. వల్లి
క్రియాశక్తి యనియు దేవసేన యిచ్ఛాశక్తి యనియు
సంప్రదాయజ్ఞులనుచున్నారు. అన్నిటికన్న ఆయన కృపయే
అద్భుతముగ నున్నది. శూరపద్మని శక్తిచే రెండుఖండ
ములు చేసినపు డొక ఖండము కోడి యైనది. ఒకటి
నెమిలి యయినది. స్వామి మొదటిదానిని ధ్వజముగా
రెండవదానిని వాహనముగా నంగీకరించుట కేవలము
కృపావిశేషము కాక మరేమి ?

వీరట్టేశ్వరదేవాలయములోని 'దక్షిణామూర్తి'ని జూడని
వారి 'కన్ను లేలే, కన్నుమిన్న లేలే'

## IV

### స్కందభక్తులు—అరుణగిరినాథ—దీక్షితులు

దక్షిణదేశమున శివభక్తులగు అప్పర్, సుందరర్, జ్ఞాన
సంబంధర్ మాణిక్యవాచకర్ పాడిన కీర్తనలకువలె వైష్ణ
వాళ్వారులు పాడిననాల్వాయిరప్రబంధములకువలె కుమా
రునిపై అరుణగిరినాథకవి పాడిన 'తిరుప్పుగళ్'నకును
నత్యంతప్రాముఖ్యము కలదు. రసానుభూతికి పారవశ్య
మునకు స్కందభక్తులు బృందములు తీరి 'తిరుప్పుగళ్'ను
తాళరాగవిన్యాసములతోఁ బాడుచుండఁగా వినవలెను.
ఈనడుమ 'తిరుప్పావై తిరుప్పుగ' ళుద్యమము అనఁగా
వీనిని వ్యాప్తి నొందించుప్రయత్నము ప్రబల మగుచున్నది.

తిరుప్పుగళ్ రచించిన మహాకవి అరుణగిరినాథుఁడు.
ఈతనితల్లి యొకవేశ్య. ఈతని కొకయక్క గలదు. అరుణ
గిరినాథుఁడు చిన్నవాఁడై యుండఁగా తల్లి మరణించుచు
కూతురునకు వాని నప్పగించి 'వా డడిగిన దంతయు ని'
మ్మనెను. యౌవనము రాఁగానే అరుణగిరినాథుఁడు
విశృంఖలవృత్తి నవలంబించెను. అక్క ఎంత చెప్పినను
వినలేదు. అతనియుంపుడుకత్తెలకుఁగా నతనితల్లి చేర్చి
పెట్టిన ధనరాసులేగాక అక్క సర్వస్వమును కొల్లపోయినది.
అటుపై నైన నతడు దుర్వృత్తి మానక యొకనాఁ డామెను
తనచెలిమికత్తెకుఁగా ధన మిమ్మనెను. ఆమె 'నాయనా,
నాయొద్దనా ధనము లేదు : అమ్మయా నీకోర్కెలను
తీర్చు మన్నది. నీకోర్కె స్త్రీసంభోగమే. ఆకోర్కె తీర్చుటకు
నేను సిద్ధముగా నున్నాను. నీ కేమి ? మనకుఁ దల్లి

యొకతె గాని తంద్రులు వెలుగవా! త ప్పుండదు లే.' యని తాఁకనాడినది. అరుణగిరినాదునికి కన్నుపొరలు వీడి పశ్చాత్తాపమున నతఁ డరుణాచలమునందు దేవాలయమున 'బల్లాలగోపురము' నెక్కి యాత్మహత్యకే దుమికెను. గోపురసుబ్రహ్మణుఁ డాయనను మధ్యముననే పట్టుకొని రక్షించి జపమాలయు షడక్షరీమహామంత్రము నొసంగెనఁట. అరుణగిరినాథుఁ డంత మహాకవిగాఁ బరిణమించినాఁడు.

ఆయన రచించిన కీర్తనలసంపుటికి 'తిరుప్పుగళ్' అని నామము. భక్తులవలంబించు సర్వవిధభక్తుల యుద్వేగములు ఈకావ్యమునఁ బ్రతిబింబితములగు చున్నవి. వాని ననుభవించి పాడి తాము కృతార్థులై లోకమును దరింపించినవా రీకాలమున 'వల్లిమలై మురుగర్'ను తిరుప్పుగళ్ మణియు. మొదటివారు సేలముజిల్లావాసి. పాండిత్యమించుకయు లేని పామరభక్తవతంసుఁడు. రెండవవారు మద్రాసునందు న్యాయవాదిశిరోమణులలో నొకరు. లోకజ్ఞులు పండితులు. అ ను భ వ ర సి కు లెల్లవారిలో నుందురు గదా.

ద్రావిడలోకము నిట్లు మురుగనిపాటల తీపిలో అరుణగిరినాథర్ ముంచెత్తగా సంస్కృతమున 'గురుగుహరూపుని' భజించి కృతార్థుడై సంగీతసుధాబ్ధిగా సంగీతమునిత్రయములో మధ్యముడై రాజిల్లినవాఁడు ముత్తుస్వామి దీక్షితుఁడు. ఈయన గుహవరప్రసాదమునఁ బుట్టి తద్వరమున సంగీతవేత్తయై గుహుడే గురువుగా భాసిల్లు పరమభక్తుఁడు. 19 వ శతాబ్ది ప్రారంభమున వెలసినవాఁడు. 'మానస, గురుగుహరూపం భజరే' వినని సంగీతజ్ఞుఁ డెవఁ డుండును? ఈయన రచించినది సంస్కృతభాషయందు. ఒక్కొక్కకీర్తనకును 'గురుగుహ' ముద్ర యుండును. వీరు రచించు లయ, ఆనందోన్మాదావస్థలో తన్మయతలో మందమందసరణిని అప్రయత్నముగ పై బొంగిన నాదతంతు వన్నట్లుండు స్వరరచన మైమరపును గల్గించును. ఈయన కర్మిష్ఠి భక్తుఁడు. భక్తికిని కర్మకు వైరుధ్యము కాదని నిరూపించినవాఁ డీమహావేత్త. పొంగులు లేవు, కుంగులు లేవు. గంగామహాప్రవాహము రెండొడ్డు లొరసి గంభీరనాదముతో బారుచున్నట్లువలె ఈయన కీర్తనల గతి యొప్పారుచుండును.

## V

### కుమారుఁడు - వైదికవాఙ్మయము

వై దిక వా ఙ్మ య ము లో ని కుమారుని వృత్తాంతము పురాణములలోని వృత్తాంతమునకు బిన్నముగా నున్నది ఛాం దో గ్యో ప ని ష త్తు న సప్తమప్రపాఠకమున శిష్యుఁడు నారదుఁ డడుగఁగా సనత్కుమారుఁడు ఆయన కాత్మవిద్య నుపదేశించును. ఆయనయే స్కందుఁడని అందు చెప్పియున్నారు. "పారం దర్శయేతి భగవాన్ సనత్కుమార; స్తగ్ం స్కంద ఇత్యాచక్షతే, తగ్ం స్కంద ఇత్యాచక్షతే,

నారాయణవల్లిలో స్కందగాయత్రి ఉద్ధారమున్నది.

"తత్పురుషాయ విద్మహే మహాసేనాయ ధీమహి
తన్నః షణ్ముఖః ప్రచోదయాత్."

కర్మకాండమున నరుణకౌతుకచయన మని యొక క్రతువు. అందొక్కొక్క దేవత నాహ్వానించుచు నిష్టికాధానము (ఇటికలను నిర్ణీతపద్ధతి నుంచుట) చేయుదురు. అందు సుబ్రహ్మణ్యా నామమున నొక దేవత కాహ్వానము గలదు. 'సుబ్రహ్మణ్యోగ్ం సుబ్రహ్మణ్యోగ్ం సుబ్రహ్మణ్యోగ్ం' దీని కర్థము. శోభనం బ్రహ్మ సుబ్రహ్మ=వేదః, తస్మై హితః సుబ్రహ్మణ్యః=యింద్రః ఓ మితి సంబోధనమ్. అనగా పరమమంగళ మగు బ్రహ్మము శబ్దబ్రహ్మమైన వేదము. అది యెవరికి హితముగా నున్నదో అతఁడు సుబ్రహ్మణ్యుఁడు. అతఁ డింద్రుఁడని భావము. ఈ సుబ్రహ్మణ్యుఁడు మన మనుకొను సుబ్రహ్మణ్యుఁడు కానేకాఁడు. భాష్య మీయాహ్వాన మింద్రుని కని వివరించుచున్నది.

కావున నీప్రకారము పర్యాలోచించినపు డీ నా మ ము ఇంద్రపరమే. ఉపనిషత్తున నింద్రుఁడు దేవతానేతగాఁ గాక జ్ఞానదాయకుఁ డను నర్థమున నున్నది.

వాసిష్ఠులు ఋగ్వేదసంహితనుండి స్కందపరముగ నింకొక మంత్రము నుద్ధరించియున్నారు.

'వృషా జజాన వృషణం రణాయ
తం ఉ చిన్నారీ నర్యంస సూవ
ప్రయః సేనానీ రధ నృభ్యో అ
స్తినః సత్వా దవేషణః స దృష్ణుః

వృషా=అనఁగా విజ్ఞానమును వర్షించు రుద్రుఁడు, వృషణం=జ్వాలలను వర్షించు దేవుని, రణాయ= యుద్ధముకొఱకు జజాన=పుట్టించెను. తం=అయనను, నారీచిత్=దేవీశక్తి (నరులయందున్నది నారి, అనఁగా గుప్తమైన కుండలినీ శక్తి,) ససూవ=కనెను. అయన ఎట్టివాడు? నర్యం=సిద్ధపురుషులందు నేతను. సేనానీః= సేనాపతిని. కనుట దేవతలకొఱకు. నృభ్యో=నేతలకొఱకు అస్తి=సహాయభూతుఁ డనుట. ఇనః=స్వామీ సత్వా= సత్యశక్తిమంతుఁడు, గవేషణః=అన్వేష్టా సర్వమును పరిశీలించువాఁడు, ధృష్ణుః=శత్రువులను జయించువాఁడు. విజ్ఞానదాయకుఁ డగు శివుడు యుద్ధము చేయుటకుఁగా అగ్నిజ్వాలలను వర్షించు సేనాపతిని సిద్ధపురుషనాయకుని

దేవతలకొఱకు గనెను. చిచ్ఛక్తి కుండలిని ఆయనమాత. ఆయన ప్రభువు. సత్యశ క్తిమంతుఁడు. సర్వమును బరిశీలించువాడు, శత్రుజేత యని చిని తాత్పర్య మేమనఁగా అగ్నికే స్కందుఁడని పేరు కలదు అనియు, వాసిష్ఠ వచనము.

'వ్రాజసీ మన దతిర దబ్ధా
దేవో యహ్వో రవసానా అనగ్నాః
సనా అత్ర యువతయః సయోనీ
రేకం గర్భం దదిరే సప్తవాణీః

సప్తవాణీః=సప్తమాతృకలు సప్త ఛందస్సులు. ఇవి అగ్నిని కల్పించెను అని యర్థము. ఆ యగ్ని అస్త్రాగ్ని యని ఆ అస్త్రాగ్నియే కుమారుఁడు. అని సిద్ధాంతము.

వైదికవాఙ్మయోద్ధారములవలన కుమారుఁడు సనత్=శాశ్వతుఁడు, సేనాని=దేవతల సేనాని అస్త్రాగ్నిరూపుఁడు. శక్తి=కుండలినీ శక్తిధరుఁడు రుద్రకుమారుఁడు.

## VI

### సనత్కుమారుఁడు

సనత్కుమారుని పురాణములు బ్రహ్మమానసపుత్రులం దొక్కనినిగ స్మరించుచున్నవి. సనక, సనందన సనత్కుమార సనత్సుజాతులను నల్వురు బ్రహ్మమానసపుత్రులు. ఎప్పుడును కుమారదశయం దుండు వారు. వారియం దంచరును జ్ఞానోపదేశకులే. వారి కీశ్వరుఁడే దక్షిణామూర్తి రూపమున తోఁచి వారి సంశయములను మౌనవ్యాఖ్యచేతనే చిన్ముద్రను ధరించుటచేత, జీవబ్రహ్మైక్య సూచకము అగు ముద్రను ధరించి, తీర్చె నని యైతిహ్యము.

భాగవతమున నేకాదశస్కంధమునందుకూడ సనకాదులకు విష్ణువు సందేహములను హంసరూపమున నివారించె నని యున్నది.

ఎట్లు చూచినను కుమార నామమున వ్యవహృతుఁడైన దేవుఁడు ఒకవంక యుద్ధవీరుఁడు, ఇంకొకవంక జ్ఞాన స్వరూపుఁడు.

## VII

### స్కందుఁడే విష్ణువు—"శెఱ విడు అతాంది"

తమిళవాఙ్మయమున కుమారునిగూర్చిన కథలలో నొకటి. 'శెఱివిడు అంతాది' అని ప్రఖ్యాతమగు పద్యావళి కుమారునిపైఁ గలదు. దీనిని రచించినవాఁ డొక వీరవైష్ణవుఁడఁట. ఆయన విష్ణుమూర్తులందును తన యూరిలో తాను సేవించు నర్చామూర్తినిదక్క రెండవ మూర్తిని తలఁపడు. అయన తనయూరి దేవాలయము నందే నిద్రించువాఁడు. ఇట్టి ఛాందసునికి జ్ఞాన ఘోనఁగ వలెనని స్కందునికి తోఁచినది. ఒకనాఁటి రాత్రి దేవాలయమున నిద్రించుచున్న నాతనికి కలలో కుమారుఁ డగపడి తనపేరున పద్యములను రచింపు మని అడిగెన్మ ఆవైష్ణవుఁ డంతమంచికవి. ఆయనకు స్కందరూపము తోఁచఁగానే అతఁ డులికిపడి లేచి వీరవైష్ణవునికి తనకు ఈ శివతనయుఁడేల యగపడును? తా నేదే దైవాపచారము చేసియుండుటచేతనే యని తీర్మానించుకొని క్షమాపణ మును చెప్పుకొని మరల నిద్రింపఁబూనెను. ఈసారి కలలో కనపడినరూపము సగము విష్ణువు, సగము కుమారుఁడు. ఈ రూపమును ఆ వైష్ణవుని స్కందుని గీర్తింపు మన్నది. మరల నులికిపడి లేచి ఆయన "ఇ దేమి ప్రారబ్ధము ? అబూడివమేనివానికొడుకు ఇన్నిరూపుల నా వెంట బడుచున్నాఁ డేమి ? నానాలుక కోసినను నే నా యకార్యమును జేయుదునా ? నావేల్పు నన్ను రక్షించును గాఁక" యని మరల స్వామిని బ్రార్థించుకొని నిద్రింపఁ బూనినాఁడు. ఈ పర్యాయము తోఁచినది తా నుపాసించు విష్ణుదేవతామూర్తియే. విష్ణువే ఆయన నుద్బోధించినాఁడు, 'ఏరా తండ్రీ, నీ కింత యజ్ఞాన మేమి ? కుమారుఁడును నేనును వేరా? అతఁడే నేను, నేనే యతఁడు. మాయిరువుర కభేదము. కనుక నతనిపై కీర్తనల రచింపుము" అన్నాఁడు. బ్రాహ్మణునికి దుఃఖ ముప్పొంగి 'నేను కొలిచిన దేవుఁడే న న్నీయకార్యమును చేయు మన్నాఁడు. ఇఁక నేను బ్రదికియుండి యేమి ఫలము?' అని యాత్మహత్య చేసికొన నిశ్చయించి, అది కోవెలలో చేసిన కోవెలకు సంప్రోక్షణ చేయవలసియుండునని భయపడికాఁబోలు, కోవెలతలుపులు తెఱచి బయటి కడుగుపెట్టఁగానే రాజభటు లిరుచేతులను గట్టిగఁ బట్టుకొని బంగారు సంకెళ్లు తగిలించినారు. వారు చెప్పుకొన్న మనవి, ఆ క్రిందిదిన మా యూరికి చోళసేనాపతి వచ్చియుండెను. ఆయనకు కుమారస్వామి కలలో కనపడి "ఫలానివైష్ణవు డాత హత్యకుఁ బూని కోవెలబయటికి వచ్చును. ఆయనను తన్ను చంపుకొన నీయరాదు. బంగారుసంకెళ్లు ఫలాని కమసాలిదగ్గర నున్నవి. వానిని వేయించవలసినది. అన్ని విధముల సగౌరవముగాఁ జూచి పూజించవలెను" అని. ఆ ప్రకారము తాము పట్టుకొన్నా రావైష్ణవుని.

తాను విష్ణువును నిష్కల్మషముగా సేవించినందు కీ ఫలము వచ్చినది. ఇదేమి కర్మమని ఆ వైష్ణవోత్తముఁ డాచెరలో మూడుదినములు తపించిపోయెను. కడకు అయనకు తాను చేసిన యపరాధస్వరూపము తెలిసినది. తాను పరతంత్రుఁడు. తనకు విష్ణువు పాలకుఁడు నియంత. అయనయే తనసర్వము, తాను, తనయింద్రియాదులు. తనవాక్కుమ అయ్యనదే. ఆయన యేమి

యాజ్ఞాపించిన నది చేయక స్వతంత్రించినదాని కీ చెఱ ఫలము.* కనుక ఆయన కోరినట్లే తాను కుమారునిపై పద్యావళిని రచించును.

ఇట్లనుకొన్నాఁడో లేదో బంగారునంకెళ్లు తెగిపోయినవి. ఆ క్షణముననే రాజభటులు వచ్చి విన్నవించుకొన్నారు. 'స్వామీ మాసేనానికి కుమారుఁడు కలలో తోఁచి ఆజ్ఞా పించినాఁడట, తమ రాయసపై పద్దెము లల్లుదురని. తమ్ము పల్లకిలో తిరుచ్చెందూరునకు కొంపోయి మంటప మునఁ గూర్చుండఁబెట్టవలెను. అక్కడ తమరు కీర్తనల రచింతురు. తమరిని తర్వాత చోళరాజునభకుఁ దీసికొని పోవలెను. అక్కడ తమకు సత్కారము చేయుదురు." అట్లే సర్వమును జరిగినది. శెఱవిడు=చెఱను వీడు అంతాది=ముక్తపదగ్రస్తాలంకారసహితపద్యావళి. పూర్వ పద్యము కడపటిపదమే తర్వాతిపద్యమునకు మొదటిపద మనుట.

ఈ కథవలన నిర్ణీతాంశము. కుమారుఁడే విష్ణువు. విష్ణువే కుమారుఁడు. ఇది కథమాత్రము గాదు. కుమారుని కిని దక్షిణదేశమువారు మనము తిరుపతివేంకటేశ్వరునికి మ్రొక్కుకొన్నట్లే మ్రొక్కుకొందురు. ఆ మ్రొక్కుల తీర్చు టకు ఆదేవుని సన్నిధికిఁ బోవలెనుగదా. మధురకు పదు నైదుమైళ్లదూరములో 'కళ్లళఘర్' దొంగ-సుందరస్వామి యని యొకవిష్ణ్వాలయ మొకకొండకోనలో నున్నది. అక్కడకుఁ బోయి తమమొక్కులను తీర్చుకొందురు. దీనినిబట్టియు కేశవకుమారుల కభేదము జనుల కంగీ కృతమే యని నిష్కృష్ట మగుచున్నది.

స్కందోపనిషత్తు అని యజుర్వేదమున నొకయుప నిషత్తు గలదు.† దానియందు స్కందుఁడే తానే విష్ణువని చెప్పుట తాత్పర్యముగాఁ దోఁచుచున్నది. ఇది చాల చిన్నయుపనిషత్తు. స్కందుడే విష్ణువు విష్ణువే స్కందుఁడు. ఈ దేవుఁడే సర్వవ్యాపియగు పరమేశ్వరుఁడు. సగుణ బహ్మము నిర్గుణబ్రహ్మముకూడ.

## VIII

### స్కందోపాసన—తంత్రశాస్త్రము

తంత్రశాస్త్రమున నీదేవు నుపాసించుట కనేకమంత్రము లున్నవి. ఒక మంత్రమునకు ధ్యానశ్లోకము.

"తమో వినిఘ్నంత మకల్మషాణం
గుహం గుహావాసిన మప్రమేయం
జ్యోతిర్మయం విశ్వసృజః కుమారం
ప్రజ్ఞాన శక్త్యాయుధవంత మీడే.

తమో=చీకటిని వినిఘ్నంతం=నాశనము చేయువాడు జ్యోతిర్మయమ్ = ప్రకాశస్వరూపుడు. అది బౌతికముగ నర్థము చెప్పినయెడల చీకటిని నాశనము చేయుట సూర్యునిపని కాదా అగ్నిపని. జ్యోతులు వారేగదా. సూర్యుడు నారాయణుడని యొకభావము. "ఆదిత్యహృద యము"నకు అధిష్ఠాత అనఁగా నుపాసనాలక్ష్యము ఆదిత్య మండలాంతర్వర్తియగు పురుషుఁడు. సూర్యుడే శివుఁడని యింకొకయుపాసనము గలదు. 'నీలలోహితుఁ' డనియు 'అరుణుఁ' డనియు శివు నుపాసింతురు గదా. తత్ స్వరూపుఁడు. అకల్మషాణం=శుద్ధుడు దోషరహితుఁడు సత్వగుణుఁడు గుహం=రహస్యముగ నుండువాడు గుహా వాసి, విశ్వసృజః కుమారం=విశ్వమును సృజించిన వాని యొక్క కుమారుఁడు అసృజించినది బ్రహ్మయైనఁ గావచ్చును. పరమశివుఁడైన గావచ్చును సంప్రదాయభేద ములఁబట్టి, ప్రజ్ఞానశక్తి యాయుధముగాఁ గలవాడు. కనుక మహాజ్ఞాని ఉపదేశకు డనుట. ఇందీయన యుద్ధ వీరత్వము స్ఫురించుట లేదు.

ఇంకొకటి మంత్రము కలదు. ఈ మంత్రోపాసనలో హస్తన్యాసమున ఈయన పరాపరుఁడు బ్రహ్మమయుఁడు విద్యాదేహుఁడు. బ్రహ్మచారి (పలనికుమారస్వామి బ్రహ్మ చారి, సన్న్యాసి.) ద్వాదశనేత్రుఁడు స్కందుఁడు కుమా రుఁడు బ్రహ్మతేజోమయుడు మూఁడుకన్నులవాఁడు (ఇందీయన శివుని కభిన్నుఁడుగనే స్ఫురించుచున్నాఁడు) బ్రహ్మరుద్రతేజోమయుఁడును. (కనుక పురాణములలోఁ చెప్పినట్లు బ్రహ్మకుమారుఁడు=సనత్కుమారుఁడు, రుద్ర కుమారుఁడు = స్కందుఁడు). ఇందును ఈయన ఉపదేశక మూర్తియే. ధ్యానశ్లోకముమాత్ర మీపద్భిన్నముగ నున్నది.

"శక్తిహస్తం విరూపాక్షం శిఖివాహం షడాననం
దారుణం రిపురోగఘ్నం భావయే కుక్కుటధ్వజం"

ఈ శ్లోకమున నీయన వీరుఁడే. శక్తిహస్తుని శత్రువులను రోగములను నాశము చేయువానిని మూఁడు నేత్రముల వానిని నెమిలివాహనమువానిని ఆరుమొగములవానిని కోడి టెక్కెమువానిని దారుణుని ఈ శ్లోకము స్మరించు చున్నది.

---

* సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచ ఇతి గీతాప్రవచనమ్.

† అనుబంధము 'స్కందోపనిషత్' చూడుడు.

## IX

### స్కందోపాసన—హైరణ్యగర్భులు

ఈవిషయములకన్నిటికి సమన్వయమెట్లు? పురాణములకు వైదికమంత్రములకు తంత్రగ్రంథములకు భావములందు పరమసామ్యము, నామములందు వైరుధ్యము స్పష్టముగా గోచరించుచున్నది.

అన్నియు నొకడే దేవతావిశేషమును వర్ణించుచున్నవి. ఆదేవత తేజోమయుఁడు. వీరుఁడు జ్ఞానమయుఁడు సృష్టికర్త పరమేశ్వరుని కుమారుఁడు. ఆయన సాధారణముగ రహస్యముగ నుండును (గుహుఁడు) హృద్గుహయందు నివసించును. శత్రూద్భవమునందు వారిని నాశన మొనర్చును. ఆయన గురువు, బ్రహ్మవిద్యోపదేష్ట.

త్రిమూర్తులలో బ్రహ్మ నుపాసించువా రాయన పుట్టుక నిట్లు వర్ణించిరి. బ్రహ్మ సృష్టికర్త. ఆయన భార్య వాణి. (నాదము) వాణి అనుచ్యమాన మైనపుడు రహస్యముగ నుండును. వాణి యొక్కటియు సప్తరూపముల సప్త ఛందస్సుల నున్నది. నాదము ఈ స్థితియం దుచ్యమానావస్థయం దున్నది. అనాహతనాదమునుండి యుద్భవించి స్వరరూపమును దాల్చియున్నది. సృష్టకర్త సృష్టికే వాణిని సేవింపఁగా మొదట మంత్రగ్రామ ముద్భవించెను. దానికే బృహస్పతి బ్రహ్మణస్పతి యను నామమును నేత. ఈ మంత్రములు సౌమ్యములు. వీనిమూలమున నగు కార్యము సౌమ్యమే. శత్రుశక్తులు జడశక్తు లుద్భవించినపుడు అనఁగా తమస్సు రజస్సు ప్రకోపించినపుడు వానిని చంపుటకు సౌమ్యమంత్రములు చాలకపోయినవి. పటుతర మంత్రములు కావలసివచ్చినవి,

అపుడు సనత్కుమారుఁ డుద్భవించెను. ఆయన ఎప్పటి కప్పు డుద్భవించువాఁడు. కార్య మైనవెంటనే తొలఁగువాఁడు కావున ఇంద్రసూక్తమున 'అర్భకో న కుమారకః' అని యున్నదఁట. సనత్=ఎప్పుడును కుమారుఁడే. సనకః = శాశ్వతుఁడు, సనత్సుజాతుఁడు = ఎప్పుడును సుజాతుఁడు = చక్కగా పుట్టియుండువాడే. సనందనః = తోడు బుట్టిన కొడుకు=బృహస్పతితోఁ బుట్టినవాఁడు. ఈయనయే 'సుబ్రహ్మణ్యుఁడు'. శోభనాత్ = చక్కని బ్రహ్మణః = బ్రహ్మనుండి శబ్ద+బ్రహ్మనుండి యుత్పన్నుడు. 'బ్రహ్మగర్భుఁ' డనియే ఈయనను కోశకారుఁడు చెప్పియున్నాఁడు. ఈయన రోగములను (శరీరాశ్రితములు) మనస్సు నాశ్రయించు నాసురశక్తులను జ్ఞాననిరోధకము లగు శక్తులను నాశనముచేసి ఆధ్యాత్మికాధిదైవికాధిభూతములందు జీవిని రక్షించును.

## X

### స్కందోపాసన - వైష్ణవులు

విష్ణువు నుపాసించువారును ఈతత్త్వము ని ట్లభివర్ణించి యున్నారు. విష్ణువు లోకపాలకుఁడు. లక్ష్మిని పొందినంత సృష్టికర్త బ్రహ్మయు కాముఁడు జన్మించిరి. కాముఁడనఁగా విషయోపభోగమునకుఁ బ్రేరేపించువాఁడు. ఆయన రుద్రాగ్నిలో జ్ఞానమయాగ్నిలో క్రాగిపోయి జగద్గురువగు శ్రీకృష్ణునియుదరమున జన్మించెను. చాతుర్వ్యూహ సిద్ధాంతమున నాప్రద్యుమ్నుఁడు బుద్ధి కధిదైవతము. తన్మూలకముగ నాచార్యత్వ మీయనకు సిద్ధించినది. మాయామయులైన శంబరాదుల గెల్చిన మహాజేత. మంత్రమార్గమున నీతత్త్వము వైష్ణవమతావలంబులచేత నృసింహరూపమున నుపాస్య మగుచున్నది.

## XI

### స్కందోపాసన - శైవులు

శివు నుపాసించువారి సంప్రదాయ మిట్లు. పరమేశ్వరుఁడు ఆకాశతనువు. దానిధర్మము నాదము. అనాహత నాదమే తార (ప్రణవము). జీవుల దేహములందు నాదము భైరవీరూపమున (కుండలినీ) మూలాధారమున నున్నది. శక్తిశక్తుల సంయోగమున నాకాశమున ప్రథమమున శబ్ద ముత్పన్న మయినది. దాని కధిపతి గణపతి. ఈ గణపతియే 'కవి' ఋషి, మంత్రద్రష్ట. వైదికుల భాషలో బృహస్పతి. ఈయన తరువాత వాయు వుత్పన్న మైనది. ఈయనయు శబ్దము చేయువాఁడే కావున రుద్రసూనులు మరుత్తులని కథ చెప్పినారు. తర్వాత తేజ స్సుద్భవించినది. ఇది యగ్ని సూర్యసోమాత్మకముగా ముల్లోకములందు భాసించినది. ఈ యగ్ని వాగింద్రియమునందు అస్త్రమంత్రాధిదేవతగా భాసించినది. కుమారస్వరూపము దాల్చినది. శరము లనఁగా నొకవిధమగు వేణువులు. వానితో బాణములు చేయుచున్నారు. ఆ బాణములందు నస్త్రాగ్నిని యోజించువారు, ప్రయోగించువారు. కనుక నీయన శరవణ(న)భవుఁడు. అగ్ని వేణువులం దుప్పతిల్లుట యెల్లరకు తెలిసినదే. ఆ యగ్ని వరుణరూపమునఁ బరిణమించెను. వరుణుఁడు జలాధిదైవతము. జలమునకు ధర్మము రుచి. రసము. రసస్వరూపమగు శబ్దము కావ్యము జనించినది. ఈ జనించుట ప్రచేతస్సు (వరుణుఁడు) కుమారుఁడగు వాల్మీకియందు. ఇదివరకు జ్ఞానరూపముగా భావించినది బృహస్పతి (గణపతి) రూపమున, కుమారరూపమున లోకమున విజ్ఞాన, అస్త్రమంత్రమయముగా లోకమున కుపదిష్టమై ఉపాస్యమైనది ఇపుడు

రసమయమగు కావ్యరూపమున నుపాస్యమైనది. ఈ కావ్యమే గంగ. ఈ గంగ యెందుఁ జేరును, రసమయుఁడగు వరుణునియందుఁ దక్క? తర్వాత నీ యగ్నిని భూలోకమునకు అంగిరసులు తెచ్చిరి. తమ తపశ్శక్తిచే ఆంగిరసులే ఆగ్నేయులగు దేవతలుకూడ నైనారు. అంగిరసుడు కొంతకాలము అగ్నిదేవతాధిపత్యము నెఱపినవాఁడు.

## XII

### స్కందోపాసన - యోగులు

ఆరుమొగములదేవర కుమారుఁ డనుట ప్రౌఢవాక్కు. కుండలినియం దుద్భవించిన శక్తి పట్చక్రములను భేదించికొని రుద్రగ్రంధి అగ్ని, ఆజ్ఞాచక్రమునఁ జేరునప్పటికి విజ్ఞానము లభించినను తర్వాత దాని విలాసము ఆరు విధములనై కడ కది సహస్రారము చేరుచున్నదఁట. ఈ యారువిధముల యుద్గతికే ఆరుమొగముల దేవత అధినాధుఁడు. ఇట్లుగా యోగులచే నీ షణ్ముఖుఁ డుపాస్యుఁడైనాఁడు. కుండలిని సర్పగతికి వల్లి (తీగ) రూపమునకు సాటి కలదు.

## XIII

### స్కందోపాసన - శాక్తులు

పరమతత్త్వమును శక్తిగా దేవిగా నుపాసించువారు శాక్తులు ఈ తత్త్వమును గుర్తించియున్నారు. పరమేశ్వరి త్రిపురాదేవి. ఆమె లోకసృష్టిఁ గాను భువనేశ్వరీ తనువును దాల్చినది. భువనేశ్వరీ రూపము అనఁగా ఆకాశ తనుత్వమునకు సమానము. అందు అనాహతనాద రూపమున నీమె ప్రణవమయీ దేవీ. ఆమెనే తారాదేవిగా నుపాసించుచున్నారు. యుద్ధదేవతగా తరువాత పరిణమించిన దీమె. ఆమెను దుర్గా చండీత్యాది నామముల వ్యవహరింతురు. అస్త్రమంత్రమున కధిష్ఠానముగా చండీదేవిని గొలువవచ్చును. అప్పు డుపయోగించు నక్షరములు 'హూం, ఫట్,' అగ్నిమయముగా నేమంత్రము నుపాసింప దలంచినను 'స్వాహా' పదము నవక విది లేదు.

## XIV

### ఆచార్య స్కందుఁడు

ఈ స్కందదేవుఁడు దాల్చిన యుపదేశకావతారములు పెక్కులు. మనకు దెలిసి శైవసంప్రదాయములో కుమారిల భట్టు జ్ఞానసంబంధమూర్తి శ్రీరమణమహర్షి ముఖ్యావతారములు అని భక్తుల యభిప్రాయము.

అవతారములు దాల్చుమున్నే యీయన యితరులకు ఉపదేశమీయ నారంభించె నని యైతిహ్యములు కలవు. బ్రహ్మ యొకనాఁడు శివదర్శనార్థము కైలాసమున కేగఁగా అక్కడ ఆటలాడుకొనుచున్న కుమారుఁ డాయన సడ్డ గించి యర్హత లేదనెను. బ్రహ్మ హఠమున లోనికి పోనుంకఁగా కుమారుఁ డాయనను బట్టి చెఱలో బంధించెను. శివునికీ సంగతి తెలిసి కుమారుని కారణ మడుగఁగా 'ఓంకారార్థము తెలియనివానికి నీ దర్శనార్హత యేమి' టన్నారు. "నీకుఁ దెలియునా?" యన్నాఁడు శివుఁడు. 'ఓ' అన్నాఁడు సుపుత్రుఁడు. "చెప్పు" మన్నాఁడు శివుఁడు. 'అది గురుశిష్యపద్ధతిగా చెప్పవలసినదిగదా' యన్నా డబ్బాయి. 'అయినచో నేను శిష్యుఁడ నైతిని' అని తండ్రి యనఁగా నేకాంతమునకుఁ దీసికొనిపోయి "ఓంకారార్థము నీవేగదా" యన్నాఁడు కుమారుఁడు. తర్వాత బ్రహ్మకుఁగూడ క్రమముగా నుపదేశించినాఁడట. ఈ కథ స్వామిమలలో జరిగినది.

ఈ కథచేత కుమారుని జ్ఞానము ఎంత పరిరూఢమో తెలియుచున్నది. వాచకార్థముకన్న వాచ్యార్థము ముఖ్యమనియు, వాచ్యార్థముకంటె లక్ష్యార్థ మనియు అన్నిటికంటె వ్యంగ్యార్థము ఉత్తమ మని పరోక్షజ్ఞానముకంటె అపరోక్షము ప్రధానమని. కుమారు ననుభవ మాపరాకాష్ఠను బొందియుండెనని నిర్ణయము.

ఈ కథను గణపతి కవిగారు

"ఓంకారార్థ ముపాదిశో భగవతే వాణీమనోహారిణే తాతాయా ప్యుపదేష్టు ముద్యత మభూత్ కించిత్త్వదీయం ముఖం" అని చెప్పినారు.

ఏకం సత్, విప్రా బహుధా వదంతి.

---

नम स्तस्मै नम स्तस्मै नम स्तस्मै महात्मने ।
नामरूपं न यस्यैको योऽस्तित्वे नोपलभ्यते ॥

# స్కాందోపనిషత్

( యాజుషీ )

సహ నా వవ త్వితి శాంతిః

ఓం. అచ్యు తోస్మి మహాదేవ తవ కారుణ్యావేశతః
విజ్ఞానఘన ఏ వాస్మి. శివోస్మి కి మతః పరం ?
న నిజం నిజవ ద్భాతి అంతఃకరణ జృంభణాత్,
అంతఃకరణనాశేన సంవిన్మాత్రస్థితో హరిః.
సంవిన్మాత్రస్థిత శ్చాహ మజోస్మి కి మతః పరం
వ్యతిరిక్తం జడవ త్సర్వం స్వప్నవచ్చ వినశ్యతి
చిజ్జడానాం తు యో ద్రష్టా సోచ్యుతో జ్ఞానవిగ్రహః
స ఏవహి మహాదేవః స్స ఏవ హి మహాహరిః
స ఏవ జ్యోతిషాం జ్యోతిః స ఏవ పరమేశ్వరః
స ఏవ హి పర బ్రహ్మ, త ద్బ్రహ్మాహం న సంశయః
జీవ శ్శివః శివో జీవః స జీవః కేవల శ్శివః
తుషేణ బద్ధో వ్రీహి స్స్యాత్ తుషాభావే తు తండులః
ఏవం బద్ధ స్తథా జీవః కర్మనాశే సదాశివః
పాశబద్ధ స్తథా జీవః పాశముక్త స్తదా శివః
శివాయ విష్ణురూపాయ శివరూపాయ విష్ణవే
శివస్య హృదయం విష్ణుః విష్ణోశ్చ హృదయగ్ం శివః
యథాంతరం న పశ్యామి తదా మే స్వస్తి రాయుషి
యథాంతరం న భేదాః స్యుః శివకేశవయో స్తథా
దేహో దేవాలయః ప్రోక్తో జీవో దేవః స్సదాశివః
త్యజే దజ్ఞాన నిర్మాల్యం సోహంభావేన పూజయేత్
అభేదదర్శనం జ్ఞానం, ధ్యానం నిర్విషయం మనః
స్నానం మనోమలత్యాగ శ్శౌచ మింద్రియనిగ్రహః
బ్రహ్మామృతం పిబే ద్భైక్ష మాచరే ద్దేహరక్షణే
వసే దేకాంతికో భూత్వా చైకాంతే ద్వైతవర్జితే
ఇత్యేవ మాచరే ద్ధీమా న్స ఏవం ముక్తి మాప్నుయాత్
శ్రీమత్పరమధామ్నే స్వస్తి చిరాయు ష్యోం నమ ఇతి.
విరించినారాయణశంకరాత్మక
నృసింహ దేవేశ తవ ప్రసాదతః
అచింత్య మవ్యక్త మనంత మవ్యయం
దేవాత్మకం బ్రహ్మ నిజం విజానతే
తద్విష్ణోః పరమం పదగ్ం సదా పశ్యంతి సూరయః
దివీవ చక్షు రాతతం తద్విప్రా సోవిపన్యవో
జాగృవాంస స్సమింధతే విష్ణో ర్య త్పరమం పదం
ఇత్యేవ నిర్వాణానుశాసనం వేదానుశాసనమి త్యుపనిషత్

సహ నా వవ త్వితి శాంతిః

ఇతి స్కందోపనిష త్సమాప్తా

ఓం తత్సత్.

( యజుర్వేదము )

'సహ నా వవతు' అని శాంతి.

ఓం. ఓమహాదేవుడా నీ కారుణ్యావేశమున నచ్యుతుడనైతిని. విజ్ఞానఘనుడనే అయితిని. ఇఁక తర్వాత నేమున్నది. నిజము నిజమువలె అంతఃకరణము విజృంభణ చేత తోఁచదు. అది నాశనమైన జ్ఞానమాత్రముగా నున్న హరియే. నేనును సంవిన్మాత్రముగా నుండు వాఁడనే అజుఁడనే. తర్వాత నేమున్నది. ఇతరమంతయు జడము, స్వప్నమువలె నశించును. చిజ్జడముల జూచువాడు జ్ఞానవిగ్రహుఁడైన యచ్యుతుఁడు. ఆయనే మహాదేవుడు. ఆయనయే మహాహరి. జ్యోతిస్సులకు జ్యోతి. పరమేశ్వరుడు. పరబ్రహ్మము. ఆ పరబ్రహ్మమే నేను. సందేహము లేదు. జీవుఁడే శివుఁడు, శివుఁడే జీవుఁడు. కేవలజీవుఁడు శివుడే. పొట్టున్నప్పుడు ధ్యానము, పొట్టు లేకున్న బియ్యము. ఇట్లే బద్ధుడైన జీవుఁడు, కర్మ నాశన మైన శివుఁడు జీవుడు పాశబద్ధుడు. అపుడు శివుడు పాశముక్తుఁడు. విష్ణురూపుడైన శివునికి శివరూపుడైన విష్ణువునకు నమస్సు. శివుని హృదయము విష్ణువు, విష్ణు హృదయము శివుడు. వీరిలో నంతరము కనను గనుక నాకు స్వస్తి ఆయుస్సు కల్గునుగాక. వారిలో శివకేశవులలో భేదములు లేవు. అట్లే దేహము దేవాలయ మన్నారు. జీవుఁడు దేవుడైన సదాశివుడు. అజ్ఞాన నిర్మాల్యము విడువవలెను. సోహంభావముతో పూజింపవలెను అభేదమును జూచుటే జ్ఞానము. మనస్సు నిర్విషయమైన అదియే ధ్యానము. మనోమలత్యాగమే స్నానము. ఇంద్రియనిగ్రహమే శౌచము. వేదమను నమృతమే త్రాగవలెను. దేహరక్షణము కొఱకు భైక్ష మెత్తవలెను. రెండవ వస్తువు లేని ఏకాంతమున నేకాంతియై జీవించవలెను. ధీమంతు డిట్లు చేయవలెను. అప్పడే అతనికి ముక్తి అనగా పరమధామమున మంగళము చిరాయుస్సు. ఓం నమః బ్రహ్మవిష్ణుశివరూపా దేవేశ నృసింహా నీకరుణచే అచింత్యమక్త మనంత మవ్యయము దేవాత్మకము ఆత్మ బ్రహ్మము తెలియనగుచున్నది. అది విష్ణువు పరమపదము. విద్వాంసులెప్పుడు కనుచున్నారు. అకాశమునందు చూచు కన్నువలె విస్తృతము. కర్మత్యాగులై విష్ణువుపరపదమున హెచ్చరిక యందుండి వృద్ధి నొందుచున్నారు. అని నిర్వాణానుశాసనము వేదానుశాసన మని యుపనిషత్తు.

' సహ నా వవ ' తని శాంతి

ఇట్లు స్కందోపనిషత్తు ముగిసినది.

ఓం తత్సత్.

# విష్ణుతిలకము

(పూర్వతో ఒనువృత్తము)

శ్రీ వేదాల తిరువేంగళాచార్యులుగారు

## బ్రహ్మసృష్టి

ఓ కమలాసనుడా! ఇక నీ సృష్టినిగూర్చి చెప్పెదను వినుము. అనిరుద్ధుని యంశమున నుదయించిన పద్మనాభుఁడు, నారాయణు నంశమున గల్గిన గొప్పసముద్రమునందు పటచ్ఛదము (పొత్తిళ్లు) నందువలె పరుండి యుండఁగా అతని బొడ్డునుండి గొప్పపద్మము వెలసెను. దానికి చుట్టును రేకులు వేయింటివరకు నున్నవి. దాని నడుమనుండి సూర్యచంద్రాగ్నులు మూవురు కలసి వెలుగుచున్నట్టు బంగారపు గ్రుడ్డొకటి దిక్కుల నన్నింటిని వెలుగొందఁ జేయుచుండెను. అది రెండుగా జీలి దాని మధ్యమున నాల్గుమొగములతోడ నీవు విశ్వేశ్వరుని యిచ్ఛవలన నుదయించితివి. నిన్నిట్లు సృజించిన వెంటనే పెద్దధ్యానమున నిలిచిపోతివి. నీ వట్లు ధ్యానించుచుండగా నీముందట మెఱపులగుంపు మెఱసెను. వాని నడుమ నొకపురుషుడు పచ్చనిబట్టతో నాల్గుజేతులతో రొమ్మున శ్రీవత్సకౌస్తుభములతో కిరీటాదుల నలంకరించుకొని యాయుదము లన్నియు దనను బరివేష్టించియుండగా గొప్పసిరితో వేదములను వైష్ణవాగమములను నుపదేశించి యదృశ్యు డయ్యెను. అంతటినుండి నీవు సృజించువాడ వైతివి.

## నాల్గుగుణములు

నీ కొకరహస్యము నెరిగింతును. సత్త్వము, రజస్సు, తమస్సు, దీనికి తరువాత ఆనందము ఈ నాల్గుగుణములును ఈ ప్రపంచపు వృద్ధికి—పెరుగుటకు, హ్రాసమునకు-తరుగుటకు కారణము లగును. ఈ వృద్ధిహ్రాసములకివియే కారణములు కాని మరొండు కావు. మొదటి మూడుగుణములనుండియు సంసార మేర్పడి జగము పెరుగును. ఆనందమను దానివలన, నీ పెరిగిన జగమంతయు దరిగిపోవును. నేను రజస్సుతో సృజింతును. సత్త్వముతోఁ బాలింతును. తమస్సుతో సంహరింతును. కనుక నీమూడును సంసారమును సమకూర్చు గుణములు. నాలవది యగు ఆనందముతో నీసంసారమును విడిపింతును. ఈనాల్గింటిలో మొదటిదానిని (సత్త్వము) అవలంబించి నడుమవి రెండును (రజస్తమస్సులను) విడువవలెను. నాలవదానిని బాగుగా పొందుటవలన నాకౌస్తుభరత్నములోఁ జేరును. నడుమవి రెండుగుణముల నవలంబించుచో నీలోకముననే దొరలుచుండును. కనుక నడుమవానిని జులుకన చేసి సత్త్వగుణమున నభివృద్ధి నొంది న న్నుపాసించుచో నాతో సమానమగు రూపము నొంది లోకమున గొప్పవారిచే నారాధింప బడును. నా యొక్క కౌస్తుభమణిశ్రేష్ఠములో జేరినవారికి సాయుజ్యమార్గము సమకూడును. అతనికి భగవానుని రూపము సంప్రాప్తించును. ఇతరు లందరు నితని సర్చింతురు. అది సారూప్యమార్గము. అందులోని విశేషములే "సాలోక్యము" అనియు, "సామీప్యము" అనియు చెప్పఁబడును. గుణత్రయము (సత్త్వరజః తమస్సులు) వలన జీవుఁడు బద్ధుఁ డగును. అవి తొలగినచో నా సంసారబంధమునుండి ముక్తు డగును. ఈసంసారరూపమైన ప్రకృతి సత్త్వాదిగుణములతో, విడివడకుండ పెనవేసుకొని యున్నది. ఈజీవుడు స్వభావతః నిర్గుణుడు. ఇతడు బ్రహ్మానందము నొందఁగల్గును. ఇఁక జగము స్వభావమన్నచో సత్త్వరజ స్తమస్సు లను మూడుగుణముల తొను నిండియున్నది. ఇట్టి ప్రకృతిచే బంధింపఁబడి యుండు జీవుఁడు ఆయాకర్మల నాచరించుచుండును.

## ప్రకృతిసన్తానము

ఆకర్మయే ప్రకృతిసన్తాన మనఁబడును. ఈకర్మ బలీయమై జీవుని మాటిమాటికి తాడువలె బంధించును. కర్మబంధముతో ఈజీవునకు జన్మసంతానము కల్గును. అందును మంచికర్మ యొనరించుచో దాని ఫలమును (సుఖమును) జీవు డనుభవించును. చెడ్డకర్మ నొనరించుచో నతడు దుఃఖము ననుభవించును. కావున నేమియు నొనరింపక ప్రకృతి సన్తానమును—అనఁగా 'కర్మను' ఛేదించి మోక్షముమీది కోరికతో తపస్సులను, ధ్యానములను, చేయుచు నన్ను సేవింపవలెను. ఓ బ్రహ్మ! 'పురుషుఁడు, ప్రకృతి' యనునవి రెండును నాయొక్క నిత్యములగు రెండురూపము లని తెలిసికొనుము. జీవులకందరికిని నేనే దిక్కు.

## తత్త్వసృష్టి

ప్రకృతి పురుషప్రేరితయై 'మహ'త్తను తత్త్వమును సృష్టించును. అది జీవుని మోహపెట్టునట్టి గుణములతో నుదయించినది. దానినుండి అహంకారములు ఏర్పడినవి. వైకారికము, తేజస్కము, భౌతికము, అని యవి మూడు.

వైకారిక మను నహంకారము జ్ఞానేన్ద్రియములను (త్వక్కు, చక్షుస్సు, శ్రోత్రము, జిహ్వ, ఘ్రాణము) ఐదింటిని కల్గించెను. తేజసాహంకారమునుండి "వాక్కు, పాణి, పాదము, పాయువు, ఉపస్థము" అను నైదు కర్మేన్ద్రియములు పుట్టెను. భౌతికాహంకారము శబ్దతన్మాత్రమును కల్గించెను. అది యాకాశమును సృజించెను. ఆకాశమునుండి స్పర్శతన్మాత్ర ముదయించెను. స్పర్శతన్మాత్రమునుండి వాయువు జనించెను. వాయువునుండి రూపతన్మాత్ర ముదయించెను. రూపతన్మాత్రమునుండి అగ్ని కల్గెను. అగ్నినుండి రసతన్మాత్ర ముదయించెను. రసతన్మాత్రమునుండి అప్పులు కల్గినవి. అప్పులనుండి గన్ధతన్మాత్రము జనించెను. గన్ధతన్మాత్రమునుండి పృథివి పుట్టినది. ఆకాశమునం దొక్క శబ్దముమాత్రమే గుణము. వాయువునందు శబ్దమును స్పర్శయును రెండు గుణములు. అగ్నికి శబ్దము, స్పర్శ, రూపము మూడును గుణములు. ఈ మూడును రసముతో గలసి అప్పులం దుండును. ఈ శబ్దస్పర్శరూపరసములును, గంధమును కలిసి యైదును గుణములు. పృథివియం దుండును. ఈతత్త్వముల కలయికలోని యొక గొప్పదనమువలన ప్రజ లుదయించిరి. ఈభూతము లన్నియు (పృథివి, అప్పులు, అగ్ని, వాయువు, ఆకాశము అని యైదు) సరిగా కూడుకొనుచోటికి జీవుడు కొనిపోబడుచుండును.

## రెండురకములుగా నున్న జ్ఞానము

ఓ బ్రహ్మదేవుడా! సత్త్వ మనియు, క్రియ యనియు జ్ఞానము రెండు రకములు. సత్త్వము క్రియచేత సిద్ధించును. ఆసిద్ధియు నంతటను వ్యాపించునదియే. క్రియ యనునది, 'యమ' మనియు, 'నియమ' మనియు రెండు రకములు. జీవు డీరెండు రకముల క్రియచేతను జ్ఞానము నొందును. ఆపొందబడునది సత్త్వమను జ్ఞానము. ఆ సత్త్వమనబడు జ్ఞానము పరబ్రహ్మమునకు కడుగూర్చునది యని తెలియుము. అందువలన బ్రహ్మ మెఱుకవడును. ఎట్లనఁగా ఆసత్త్వజ్ఞానము యమనియమముల సాయమున క్రమముగా శర్మమును ఆనందమును నగు తేజస్సును గోచరించును. అదియే బ్రహ్మము.

## బ్రహ్మలక్షణము

ఆ బ్రహ్మ మెట్టిదో తెలియుటకు దాని లక్షణమును దెల్పెదను వినుము, మనసును ఇతరవిషయములందు బోనీయక దీనియందే శ్రద్ధ యుంచుము.

ఎట్టి వికారమును లేక దివ్యమగు రూపముతో దనను దానే తెలుసుకొనుచు, నిరంజనమై ఎట్టిదోషమును లేక అపరిమితమై దేనిస్పర్శయును లేనిదై నిర్వికల్పకమై బ్రహ్మ ముండును. సుఖదుఃఖాదిద్వంద్వములు లేక క్షీణింపక శాన్తమై అస్తమయమే లేని సూర్యునితేజస్సువలె నుండి చిదానందరూపముతో నది విలసిల్లును. దానికి ఎట్టిబుద్ధియు లేదు. దేనితోడను దానిని బోల్చి తెలుసుకొనుటకు వీలు లేదు. సహజముగానే ఎట్టి మలసంపర్కమును లేక శుద్ధమై రాకపోకలు కలుగక 'యింత' యని మితి లేనిదై తరగలు లేని కడలివలె వికృతి లేక నిరామయముగా నుండును అతేజస్సునకే వాసుదేవుఁ డను పేరు. వానినుండియే సకలభూతములు నుదయించినవి. మోక్షమునందు గోరిక యున్నను, అప్రశస్తు లగువారు ఆతేజస్సును సేవింపఁజాలరు సరి కదా యూహింపను గూడ జాలరు. యోగు లెల్లపుడును ధ్యానించుచున్నను గోచరము కాదు. ధ్యానించుటకు వలనుపడక యుండును. ప్రధానమగు ప్రకృతికంటె వేఱుగా భోగ్య మగును. భోక్తలతో నెట్టిసంబంధమును కల్గియుండదు ఆతేజోరూపమైన వాసుదేవపరబ్రహ్మమునకు అంతటను, కనులు, తలలు, నోళులు, చెవులు, చేతులు, కాళులు నుండును. వెలుపలను లోపలనుగూడ దనంత దానే వ్యాపించుయుండును. గొప్ప ప్రకాశము కలిగి విలసిల్లు నాతేజము చాల గొప్పది. అది ఓంకారము, అక్షరము, వ్యక్తము, విచిత్రరూప మైనది. దానివలన శుభములు సమకూడును. దాని స్వరూపము మూలమంత్రమే. అది నిత్యము, అవ్యక్తము, దానికి పుట్టుక లేదు. చ్యుతియు లేదు. లోకములోని గొప్పవాని యన్నిటికన్నను గొప్పది. అట్లే చిన్నవాని యన్నిటికన్నను చిన్నది. మెత్తని వన్నింటికన్నను ఇంకను మిక్కిలి మెత్తనిది. మోసపురూపేమియు లేనిది. జ్ఞానపు గడ్డ. మూర్తమును అమూర్తమునుగూడ అగునది యా పరబ్రహ్మము.

## బ్రహ్మకు అంగము లున్న వని సమర్థించుట

అట్టి బ్రహ్మను పాంచరాత్రశాస్త్రమున నెర్పుగలవారు జ్ఞాననేత్రములతోఁ జూడగల్గుదురు. ఈ సమస్తజగత్తును సృజించిన యాబ్రహ్మమున కంతటను జేతు లున్న వన దగదా? అన్నిదేశకాలములందును, ఏమియు తేడా లేకుండ ఈప్రపంచము నంతటను వ్యాపించునని యెరుగుదువుకదా! అట్టి బ్రహ్మమున కంతటను పాదము లున్న వనుటలో దోష మేమి? పైనను, క్రిందను, ప్రక్కలను గూడ ఈజగమును బ్రకాశింపఁజేయు నీపరబ్రహ్మమున కంతటను కన్ను లుండకమానునా? ఈప్రపంచములో పుట్టినదంతయు బ్రహ్మమున కెదుర నగుపడని దేదియు లేదు. అట్టిది అంతటను మొగములు కల దనుట యుక్తమేకదా! అన్ని జ్ఞానేన్ద్రియములకును శిరస్సే

ఆశ్రయ మగునట్లుగా చేతనాచేతనముల కన్నింటికిని పర బ్రహ్మమే ఆశ్రయము. కావున దాని కంతటను తలలున్న వందురు. దూర మందలిదైనను దగ్గరదైనను, ఏశబ్దమైనను ఆబ్రహ్మమునకు వినపడనిది లేదు, కనుక, ఆబ్రహ్మమున కంతటను జెవు లున్న వనుటలో నయుక్త మేమియు లేదు. నిప్పు ఇనుపగుండుకన్న వేరైనను దీని నావరించి యుండి దీనికన్న (ఇనుపగుండుకన్న) వేరుగా నట్లే యగు పడునుకదా ! అట్లే ఈబ్రహ్మమును వ్యక్తమగు జగత్తుకన్న భిన్న మైనను దీని నావరించియుండును. బైటనున్న బొమ్మ అద్దములోపల నగుపడునట్లు అ పరబ్రహ్మమునందే యీజగ మంతయు కనుపడుచుండును. కనుక ఆ బ్రహ్మమును "అవ్యక్తరూపము" అనదగును. ఈ పర బ్రహ్మమున కుండు జ్ఞానము, మనకువలె ఇంద్రియము లకు లోపడి కలుగునది కాదు. అట్టి జ్ఞానము కల యితఁడు సర్వజ్ఞుడుకాక మ తేమగును. పుట్టుక లేదు. కనుక, అనాది యగును నశింపదు, కనుక అనన్తము, మొదలు-తుద లేనిది కనుక అమధ్యము, (నడుమయు లేనిది.) అంతటను వ్యాపించి యుండును గనుక "సత్" అని యందురు. ఎవరికిని ప్రత్యక్షముకాదు కనుక 'అసత్' అందురు. అతనిని సత్త్వ, రజ, స్తమో గుణములు. మూడునుగూడ బంధింపఁజాలవు. అయినను బంధింపఁ బడినట్లే యుండును. తామరాకులందు నీరు అంటక యున్నట్లుగా లోపల వెలుపలగూడ వ్యాపించి యీబ్రహ్మ మొక్కఁడే మహాజలరాశియందు నిలచియుండును. అది యెట్లుండు ననగా నీటిలో మునిగిన కడవకు లోపలను వెలుపలను నీ రున్న ట్లుండును. శ్రుతులు జీవాత్మపర మాత్మలు రెంటికిని ఐక్యమును బోధించుచున్నవి. దేహములు అనేకములుగా వేరువేరుగా నుండుటనుబట్టి జీవులు అనేకులుగా దోచుదురు. ఒక పట్టణమునందలి యనేక ద్వారములనుండి మనుజులు బయలుదేరి వచ్చుచుండునట్లుగా బ్రహ్మమునుండి జీవులు బయలువెడలు చుందురు. అదియే సృష్టి యని యందురు. పట్టణపు టనేక ద్వారములనుండి ఆ పట్టణములో నుండు వారు లోనికిఁ బోవునట్లు జీవు లనేక ముఖములుగా సందరును బ్రహ్మయందు ప్రవేశింతురు. అదియే సంహార మని యందురు. ఇన్ద్రియముల జయించిన మహానుభావులు, తమ యాత్మలోనను, కనుబొమల నడుమను, నాభిచక్రము పద్దను, కంఠబిలమునందును, నాలుకచివరను పరబ్రహ్మమును భావింతురు. అ భావనలో బ్రహ్మ మిట్లుండును— జ్యోతిర్మండలపునడుమను బంగారుకాన్తితో రెండు భుజములు కలిగి తన తేజస్సులరాశులతో నీలోకము సంతను వెలుంగజేయుచు వ్యాపించుచుండును.

## జీవునకును జగత్తునకును నుండు చోటు

ఇట్లు పరబ్రహ్మమును ధ్యానించి ధ్యానించి యా బ్రహ్మము తేజస్సునందు లీన మయిపోదురు. అనఁగా బంగార మె ట్లగ్నిలోపల నంటియుండియు వేరుగా వెలుగొందునో అట్లే యీ మహానుభావులును పరబ్రహ్మ తేజములో లీనమైనను, కౌస్తుభమణి రూపములతో వేరుగా వెలయుదురు. ఆబ్రహ్మ తేజమునందు పిడుకవలె ఈ జగము శ్రీవత్సమురూపమున నుండును. జీవుతోడి కూడికవలన జగమునకు వృద్ధియు నెడబాటువలన క్షీణతయు నేర్పడును.

## తత్త్వములు నిత్యములు

మహదాదు లగు తత్త్వము లన్నియు నిత్యములే, నశింపవు. వానికి వృద్ధియు క్షీణతయు నుండునేగాని పుట్టుకయు చావును లేదు. అవి యన్నియు జగమునందే యుండును. ఇది గోప్యమైన విషయముసుమా !

## జగము జీవులకూడిక

శ్రీవత్సమును కౌస్తుభరత్నమును సూర్యచంద్రులవలె కలసియుండును. ప్రకృతియు శ్రీవత్స కౌస్తుభరత్నముల కలయికయందు వికసించి అవి యెడబడినపుడు సంకోచము నందును. వికాసము సృష్టికాలము. సంకోచము గొప్ప ప్రలయకాలము.

## చిత్తప్రసాదనము

చిత్తము ప్రసన్న మగునపుడు జ్ఞాన ముదయించును. దానితీరును నుడివెదను. కర్మలను భగవానుని యారాధన రూపమున నొనరించుచో బాహ్యము లగు నుపరాగములు శాంతించి జ్ఞానము నిర్మల మైనది యుదయించును. యోగాంగములగు యమాదులచేత పరమాత్మ పర్యన్తము లయ మొందుట యోగము.

# అవధూతమాత పిచ్చమ్మగారు

జనపనేని వేంకట్రాజు బి.ఏ.

అఖండజ్యోతి. సచ్చిదానందమయి. పరాశివశక్తి కపర రూపం. ఆంధ్రదేశంలో నూతనావతారమూర్తి, కృష్ణాజిల్లాలో గుడివాడతాలూకాలో కురుమద్దాలి గ్రామంలో గుంపులు గుంపులై ప్రజలు నిత్యము కొలిచి సేవించికొనే అవధూత మాత. "నీవు దేవాలయాల యినస్పెక్టరివి. బెజవాడ డివిజనులో పనిచేస్తావు కురుమద్దాలికి మూడుమైళ్ళు మాత్రం మంటాడగ్రామం. అక్కడివరకూ అనేకసారులు ప్రయాణం చేశానన్నావు. పిచ్చమగారినే ఎరుగవటయ్యా!" చిన్న ఉపన్యాసం యిచ్చా రొక పండితమహాశయుడు, 1945లో, ఏలూరు పట్టణంలో, ఒకానొక నాటి సాయంత్రం పార్కులో, నాతో యిష్టాగోష్ఠి మాటాడుతూ.

'అరే' అన్నాను. విస్తుపోయాను. ఆశ్చర్యపడ్డాను.... అంత గొప్ప వారా? పిచ్చమ్మగారా? నేనెరుగనే? పేరు కూడ వినలేదే. అన్నాను. అక్కడ గుమిగూడి కూర్చుండి ఖులాసాగా కబుర్లు చెప్పికొనే మిత్రబృందం అందరినీ వరుసగా చూస్తూ.

'ఆశ్చర్యపడకు. ఆంధ్రదేశంలో అవలిజిల్లా లన్నిటినీ ఆక్రమించింది పిచ్చమ్మగారి ప్రతిభ, ఉత్తరహిందూస్థానం లోనూ దక్షిణాదినీ కూడా యీమె పేరు మ్రోగింది. తన జిల్లాలో చాలా తక్కువ. తన తాలూకాలో మరీ స్వల్పం, స్వగ్రామంలో పిచ్చమ్మగారి విలువ గ్రహించినవారు నిన్న మొన్నటివరకూ లేనేలేరు. పెఱటిలో మూలిక మందుకు రాదు గా డటయ్యా!' అంటూ నా ఆశ్చర్యభావాన్ని సమర్థించాడు సభలో మరొక మిత్రుడు.

"మన యేలూరు పట్టణంలోనే. రెండు మూడు వేదాంత సభల్లో దర్శన మిచ్చింది.... జా తేంవింటో తెలుసా? ఆది ఆంధ్రులు. బహు బీదకుటుంబ మట. అయితే నేం? ఛాందసాచారసంపన్నులైన బ్రాహ్మణులుకూడా ఆయోగిని పాదపూజ చేస్తుంటారట. కులభేదతత్వాలు మరిచిపోతారట. పరమ శుద్ధాత్మురాలు. విజ్ఞానమూర్తిగా నేటికాలంలో వెలిగిపోతున్న యోగవిద్యారహస్యవేత్త మళయాళ స్వాముల వారంతటి మహనీయు లా తల్లిని వినయవిధేయ భావంతో సేవిస్తుంటారు. అనేకులు కళ్ళారా చూచారు." అని మరో క్రొత్తపత్రం తిరగవేశాడు మూడవమిత్రుడు, బ్రాహ్మణుడు.

'చాలా మహత్తుగల యోగి నటండీ. మీ బెజవాడకు దగ్గరేగా. బస్సులో వెళితే ప్రక్కబాటెడు. గంటలో పోవచ్చు. చూచి రండి, సాధ్యమైనంత తొందరలో అమూల్యమైన ఆ యమ్మ సచ్చరిత్రావిశేషాలు మాకుకూడా అందజెయ్యండి.' అని మరీమరీ ప్రాధేయపడ్డా డింకొక భక్తమిత్రుడు.

ఒకమాట కంటే ఒకటి చిత్రంగా ఉన్నది నాకు. పిచ్చమ్మగారి సంగతు లింకా వినా లనిపించింది. ముఖ్యంగా ఆమె మహత్తు లేంవిటో తెలిసికోవాలి. ఉత్సాహం మితిమీరింది. కోరిక వెల్లడించాను సభలో. అందరినీ అడిగాను. వివరాలు సరిగా తెలియవన్నారు ప్రతివారు. అనేక మహత్తులున్నాయట మాత్రం అవిడదగ్గర, అన్నా రందరూ. ఉత్సాహం పాటులో పడ్డది నాకు. భ్రాంతి మాత్రం హృదయగోళమంతా క్రమ్మికొన్నది. త్వరలో కలిసికోవా లా తల్లిని. భావాలు జల్లుజల్లుగా వచ్చాయి మనోహృదయాల్లోకి. భావపరధ్యానంలో మిత్రుల యితర లోకాభిరామాయణ ప్రశంస లన్నిటిలోనూ మూకీభావంతో ఉన్నాను చాలసేపు. వారి పలుకులకూ ప్రశ్నలకూ ఏకాక్షరశబ్ద సమాధానాలు చెబుతూ సాయంకాలం అందరితోపాటు నేనూ లేచిపోయా నక్కడినుంచి.

మరునటిరోజునే బెజవాడ ప్రయాణం. అదృష్టవశాత్తూ అర్జంటు కాగిత మొకటున్నది మంటాడగ్రామానిది. మంటాడ పోయాం జవానూ నేనూ. పని పూర్తి చేసికొన్నాం. అక్కడినుంచి కురుమద్దాలి నడిచాం. ఆశ్రమం చేరికొన్నాం. ఆశ్రమ ప్రాకరద్వారంలో అడుగు పెట్టాం. ముందు నేను. వెనుక జవాను. ఆశ్రమావరణ పెద్దది. ముందుభాగంలో పూలతోట. వెనుకమూల ఆశ్రమభవనం యెడమవైపున చిన్నది. దానికి కుడిప్రక్క అవరణ ఖాళీ స్థలం. అక్కడ యిరువురు స్త్రీలు. నేలమీద యేమో పని చేస్తున్నారు. వాళ్ళప్రక్కన ఒక స్త్రీవ్యక్తి. చేతిలో కఱ్ఱ భూమిపైన ఆన్చి కఱ్ఱపైన వంగి నిలచింది. పనివాళ్ళవంక చూస్తూ. ఆమెనయ్యా పిచ్చమ్మగారు. జేగూరుగుడ్డ లవిగో అన్నాడు జవాను. అయిదునిమిషా లలాగే చూస్తూ నుంచున్నాం. ఇంతలో ఆవ్యక్తి లేచి నుంచున్నది. మావంకకు తిరిగింది. కనుబొమలపైన తర్జనీ ముఖచతురంగుళాలూ నిల్చి మావంక తేరి చూచింది....ఎవడవురా నువ్వు? ఎవడవు నువ్వు? బిగ్గరగా మాటాడింది. నడిచి వస్తున్నది నా వంకకు, చేతి గఱ్ఱ చిటుకు చిటుకున యెత్తి నేలమీద వేస్తూ. నేనూ నడిచిపోతున్నా నామె వంకకు నెమ్మదిగా. నా వెనుక జవాను. పదిగజాల దూరం ఆమెకూ నాకూ.... ఎవడవురా నువ్వు? ఎవడవు నువ్వు? అని ప్రశ్నించింది.

మళ్ళా....నమస్కరించాను. మీ దర్శనానికే వచ్చా నమ్మా! అన్నాను మెల్లగా....దరిశినం! వారంరోజులు పదిరోజులు పడిగాపులు పడుంటేగాని పిచ్చోడిదరిశినం దైవాలక్కూడా లేదంటారు. ఇట్టి వచ్చావు. ఇట్టి సూశావు. ఎవడవురా నువ్వు? అంటూ చిన్నగా నవ్వింది. తల్లికి పిల్లలమీద దయమ్మా! అన్నాను....తల్లిదయే అవును. తల్లిదయే.... రా....రామరి....వచ్చేవుగా....రా....అంటూ తాను ఆశ్రమానికి త్రోవ తీసింది. వెనుక మేము. ఆశ్రమ ముఖసాల లోకి నడిచింది. అక్కడ చీడీమీద కూర్చున్న దొక ప్రక్క. మేము ఎదుట నుంచున్నాం....కూకోరా. అన్నది. మరొక ప్రక్క క్రింది చీడీమీద నేను కూర్చున్నాను. జవా నొక ప్రక్క నుంచున్నాడు. నన్నామె తేరి పాఱ జూచింది. నే నామె నవలోకించాను.

ఉన్నతమైన శరీరం. రమారమి 80 ఏండ్ల వృద్ధు. అజానబాహువులు. కటిస్థలంమీ దొక జేగురు లుంగీ. బోడితల. వక్షస్థలంపైన వల్లెవాటు. ముఖంలో మూర్తీభవించిన బ్రహ్మతేజస్సు. జగచ్ఛానకమైన కనుచూపులు. మోవిపైన ముసిముసి నవ్వులు. మిక్కలి గ్రామ్యభాష. కాని మృదుమధుర గంభీరం. తేటతెల్లం. ఆ నాలుక ఆమె గుండెలకు గుఱుతుబద్ద. తల్లిదావులో తనయునికి వలే ఉన్నది నాకా నిమిషంలో.

వీడినెలా గెరుగుదువురా ? అన్నది అమ్మ.
అజ్ఞానులం అమ్మా ! నిన్ననే తెలిసికొన్నాను.
ఋణంరా, ఋణం....ఏటి నీ సంగతి ?
తల్లి యెరుగని దేంవిటమ్మా !
అవును. తల్లి కంతా తెలును....చిన్నపాపలవగ్గిర డబ్బుంచదురా అమ్మ.
సంసారులం గదా అమ్మా !
సారం దెలిసి సంసారం సెయ్యాలిరా.
జ్ఞానం లేదుగా అమ్మా !
అ అలు తరవాత కా కాలురా.
ఎటూ త్రోవ తెలియటం లేదు తల్లీ!
రెండు మెట్లెక్కేవురా.

ఈ మాట నా కనలే అర్థంకాలేదు. ముందు గుమాస్తాను. అప్పటికి యినస్పెక్టరును. 1927 లో సూర్యజపం నేర్చికొన్నాను. 1942 లో వేదాంతోపదేశం స్వీకరించాను. అమ్మమాట నా నౌకరీకి చెందినదో దైవికమో ఆలోచిస్తున్నాను.

పెళ్ళాన్ని అమ్మా ! అనాలిరా అన్నది అమ్మ .

ఈ మాటలు నన్ను చకితునిచేశాయి. అప్పటికే నాకు సంతానం బాగా ఉన్నారు. కామం తగ్గించికోవాలని ఉపదేశం గాబోలనుకొన్నాను.

నీ యింటోనే నీ వున్నావురా. పెళ్ళాన్ని గెల్లేకపోతే నువ్వు నువ్వట్రా ? అన్నది మాత.

బాల్యం అమ్మా ! తేటతెల్లంగా చెబితేగాని తెలియదు.
మళ్ళా కలసికొంటాం గాదట్రా ?

ఈ మాట యేంవిటో. మళ్ళీ ఆలోచనలో పడ్డాను.

వల్లకాట్లో పదేళ్లు కాలిపోయాడురా. ఇసికి తిన్నాడురా.
కొండా బూంవీ నిండేలా గేడిశాడురా. అన్నది అమ్మ.

ఈ ఉపదేశం నాకేనా ? పరికిస్తున్నాను.

పై సీడీమీద కూకోలేకపొయావంట్రా ? అన్నది మళ్లా
తల్లిపాదాలు దగ్గరున్నానుగా అమ్మా !
అవునులే. నా తల సూడు. బోడిదాన్ని.
ఆ బోడి తలలో భావాలు మాకు తెలుస్తాయా అమ్మా?
తలుపు లేసుకుక్కోకో. ఇంటోనే తిరుగు.
ఏడు. అమ్మను సూత్తావులే. మళ్లా కలుసుకొంటాంగా?

ఈవిధంగా అరగంట మాటలాడింది మాత. కాలంమీరిన మూలాన జ్ఞాపకంలేదు సంభాషణంతా. కొన్ని మిడిమిడిగా అర్థమయాయి. కొన్ని అయోమయం. ఆలోచిస్తున్నాను. ఇంతలో; పొద్దుగూకిందయ్యా !' అన్నాడు జవాను.

అవునురా. ఇంకోసారి పొద్దుపొడుపుని రా అన్నదిఅమ్మ
అలాగే అమ్మా....లేచాను.
బెజవా డెల్తావా ?
అవు నమ్మా !
దురగ దగ్గిరేగా నీకు....పో.

నేను లేచాను. నమస్కారం చేశాను మళ్ళా.

తిన్నగా యెల్లు బస్సు లున్నాయి. అదెక్కావంటే
తిన్నగా బెజవా డెల్తావు, పో. అన్నది.
చిత్తం అమ్మా ! అన్నాను. రోడ్డు వైపుకు తిరిగాను.
పండట్టి కెల్లా ఒకటి అన్నది అమ్మ.
మళ్ళా వెనుకకు తిరిగాను.

ఒకటో, రెండో. మిగల ముగ్గి తొక్క నల్లబడిన అరటిపం డ్లిచ్చింది. రెండు చేతులతోనూ స్వీకరించాను. నమస్కరించాను. సెల వమ్మా ! అన్నాను; పో, అన్నది. నేను నడిచాను. వెనుక వచ్చాడు జవాను. రోడ్డు సమీపించాం. బస్సు వచ్చింది. ఎక్కాం. రెండు గంటల్లో బెజవాడ చేరికొన్నాం.

నన్ను సూడలేదు. పలకరించ లే దయ్యా! అని పదిసారు లన్నాడు జవాను త్రోవలో.

ఆ నాటినుంచీ పిచ్చమ్మగారి ప్రశంస వచ్చిన చోటెన్నడూ విడువను. సాధ్యమయినన్ని వివరాలు తెలిసికొంటాను, వేడుకగా. ఆ సంగతులు చెప్పేవారి ననేక ప్రశ్నలతో విసిగిస్తుంటానేమో కూడాను. రైళ్ళలో ప్రయాణం చేస్తుండగానే, పల్లెటూరి భక్త సమావేశ సందర్భాలలోనే,

కేవలం కురుమద్దాలి గ్రామంలోనో, పిచ్చమ్మగారి శిష్యులనో, పిచ్చమ్మగారి నెరిగిన వారినో, పిచ్చమ్మగారిని గూర్చి ముచ్చటించడం పరిపాటయి పోయింది నాకు. కాని కొలది వివరాలే లభించినయ్యి మాత్రం. విపరీత వైరాగ్యం కరోరోపవాసదీక్ష విస్తారరుద్రభూసంచారనివాసాలు గుర్తించి గుభరగభర లాడేకాలంనుంచే పిచ్చమ్మగారి వివరాలు వచ్చేయి. అంతకు పూర్వం పిచ్చమ్మెవరికి కావాలి? అంటరాని ఆది ఆంధ్ర కులంలో జననం. ఊరు పేరు లేని బీద యిల్లు. విద్యాయోగ్యత లంటని నీరసకుటుంబం. పిచ్చమ్మ వివరాలు తెలిసికోవలసిన అవశ్యకత యేంవిటి? ఎవరికి? ఎందుకు? సూక్ష్మవివరాలేమీ దొరుకవు. స్వగ్రామస్థులు పరిసర ప్రాంతీయులు ఆప్త బంధువులు పిచ్చమ్మ పూర్వీకులచేత కూలినాలి చేయించికొన్న దొరల కుటుంబాల వారు వెతుక్కుంటూ సందేహిస్తూ నిర్నిర్ణీతంగా పలికే పల్చపల్చని పలుకులే యీ పవిత్రవ్యక్తి బాల్యచరిత్రాంశాలకు పట్టుగొమ్మలు. ఆ పలుకులే యిక్కడ రేఖామాత్రంగా రూపిస్తున్నాను.

పిచ్చమ్మగారిని దైవంగా నమ్మి ఆమె పూజకు వినియోగించే నిమిత్తం 1954 వ సంవత్సరంలో "శ్రీరామ అవధూత పూజావిధానం" అనే చిన్న పుస్తకం ప్రకాశింపజేశారు కొందరు భక్తులు. అందలి పీఠికలో, "ఇప్పటి 80 ఏండ్ల క్రిందట జనించి" అన్నవాక్యాన్నిబట్టి పిచ్చమ్మగారి జననం 1954 వ సంవత్సరానికి 80 ఏండ్ల పూర్వం అని గ్రాహ్యం. షుమారు 1870 నుండి 1872 సంవత్సరాల్లో జనించి ఉండాలి. ఇదే నిజం అయి ఉంటుందన్నారు గ్రామస్థు లనేకులు....'శ్రీరామ అవధూత' అనే పదం యిప్పుడర్థం కాదేమో పాఠకులకు, బాల్యంలో 'పిచ్చాం' దరిమిలా 'మూలరాముడు' పరిపక్వయోగ కాలంలో 'శ్రీరామావధూత' భక్తులందరూ పవిత్రప్రేమతో పూజించి కొనేప్పుడు 'అవధూతమాత' యివి పిచ్చమ్మగారి సార్థకనామాలు.

కురుమద్దాలిగ్రామం పిచ్చమ్మగారి జన్మస్థానం. వట్టే ముత్తాయి తండ్రి. వీరమ్మ కన్న తల్లి. పోతురా జగ్రసోదరుడు. మాలపల్లిలో పూరింట వీరి వాసం. ఆస్తి దొప్పెడు. కుటుంబపోషణకు చాలనిది. కూలికీ నాలికీ పొలాల్లో రెండు పూటలూ కాయకష్టంచేసి గంజి త్రాగేవాళ్ళు. తలిదండ్రులు దూబానులుకారు. పొదుపుగా జీవిస్తూ వీలయినన్ని డబ్బులు వెనుకవేసికొనేవాళ్ళు. తోటికూలివాళ్ళలో దోఅగానే కనుపించేవాళ్ళు. దొరికినది తినడం తృప్తి పడడం వీరినైజం....పాపం! వయసు ముదిరింది. పిల్లలు లేరు. అదే విచారం. వీరమ్మకు మరీని. తూరితూరికీ కన్నీరు కారిచేది. మూఢభక్తి. మూఢవిశ్వాసం చెట్లకు పుట్లకు మ్రొక్కేది. మాలపల్లిలో రామమందిరంలో సాష్టాంగ ప్రమాణాలు చేసేది పలుమారు. సుద్దులు భారత రామాయణ కథలు భక్తిశ్రద్ధలతో వినేది. భర్తకూడా రానురాను భార్యచేష్టల్లో పాల్గొనక తప్పేదికాదు ..నోములు ఫలించినాయి. అమాయకదంపతుల ప్రార్థన లాలించాడు రాముడు. ఒక కుమార్తెను కన్నది వీరమ్మ యెట్టకేలకు. ముదుసలిదంపతుల ఆనందాని కంతులేదు. అల్లారు ముద్దుగా పెంచికొంటున్నారు శిశువును.

పేరు పెట్టాలి పిల్లకు....తాత తండ్రుల పేరా? దైవాల పేరా?...తలిదండ్రులు చాలా తికమకలు పడ్డారు. అమ్మలక్క లనేక సలహా లిచ్చా రిరుగుపొరుగు వాళ్ళు. ఊహుఁ...నచ్చలేదు. ముఖ్యంగా తల్లికి. ముదికాలంలో లేకలేక కన్నబిడ్డ. ప్రాణప్రాయం. ఆ బిడ్డ బ్రతికి బాగుండాలి. అంతే ఆమెకు కావలిసింది. అందచందాలు కాదు. భాగ్యభోగ్యాలు కాదు. బ్రతికి బాగుండాలి. చాలు. ఏ పిచ్చిపేరైనా సరే. ఏ పిచ్చిదానిలాగా బ్రతికినా సరే. అయితే 'పిచ్చమ్మ' అనే పేరే పెడితేనో? భార్య మాట విన్నాడు ముత్తాయి. ఫకాళించి నవ్వుకొన్నాడు. కానీలే నీ పిచ్చి. నీ కెలా నచ్చితే అలాగే చేదాంలే అన్నాడు. భార్యా భర్త లైక్యభావంతో పేరు పెట్టేరు. పిచ్చమ్మ. పిచ్చాం.

నాటానూటా పెరుగుతున్నది పిచ్చాం. చింకిరి తల. చిరిగిన గుడ్డలు, చీంది ముక్కు. ఆటలూ పాటలూ పిచ్చిగా వుండేవి. 'పేరు సగం బలంవే యిారీ! పిచ్చమ్మ పిచ్చిదేనే అనేవాడు ముత్తాయి తేరిపార చూచినప్పుడల్లా ముసిముసినవ్వులతో. ఖామందులూ అలాగే అనేవారు. చుట్టపక్కాలూ అంతే. అందరూ అంతే. పిచ్చమ్మ పిచ్చిది కాకపోతుందా? అయినావరే. బ్రతికి బాగుంటే చాలు. పాపం! తల్లి ప్రేమ. అలాగే పెంచింది. అయిదారేండ్లు వచ్చాయి పిచ్చమ్మకు.

తోడి పిల్లలతో ఆటలాడుతూ ఆడుతూ ఎవరో అడ్డినట్టుగా ఆగిపోయేది పిచ్చమ్మ. పాట పాడుతూ పాడుతూ గొంతు పట్టికొన్నట్టుగా నట్టుకొట్టేది. ఆనందంగా అల్లరి చేస్తూ చేస్తూ హఠాత్తుగా యేడ్చేది. ఎవ్వరూ లేనీ మూలమూలల యెన్నోసారు లేకాంతంగా కనబడేది. ఏఁవిటో ఆలోచిస్తూ కూచోడం యెందరో చూచారు. ఎప్పటి కప్పుడు తలిదండ్రు లడిగేవారు కారణం యేఁవిటని. నా తలలో ఏటో ఓరే. ఏటో సంగీతం అమ్మా! గుండెల్లో ఎవరో గొడవ సేత్తుంటారయ్యా! అని పలుమారు సమాధానం చెప్పేది. పిచ్చమ్మ. ఏంవి టీ పిచ్చిగోల? పిచ్చిదే నట్టా యిది. పిచ్చమ్మ పిచ్చిది. పిచ్చిది పిచ్చమ్మ. కురుమద్దాలిగ్రామం అంతా యీ నామం సార్థకనామం అయిపోయింది. అయితే

మానెలే. బ్రతికి బాగుంటే చాలు పిచ్చమ్మ. కన్నతల్లి కాపాడికొంటున్నది పిచ్చమ్మను.

పిచ్చమ్మకు పది పం(డ్రెండేండ్ల వయసు వచ్చింది. నా అమ్మకు పెండ్లీడు వస్తున్నది. మనం ఉండగానే పెండ్లి చెయ్యాలి. ఒకయింటిది కావాలి. అల్లుడూ కూతురూ కాపురం చేస్తుంటే కమ్మగా చూడాలి పెళ్ళి చెయ్యాలి బేగే. తల్లి అరాటం మితిమీరి పోతున్నది. పిచ్చిదాన్నెవడు పెళ్ళాడతాడు? అయినా తప్పదు. తల్లి ముచ్చట పడు తున్నది. తీర్చాలి. ముత్తాయి సంబంధం కుదిర్చా డొకటి. బాల్యంలోనే పెండ్లి చేశారు పిచ్చమ్మకు. కలిగినంత మట్టుకు సారెచీర లిచ్చారు. కాపురానికి పంపించారు. భర్త పేరేంవిటో గుణశీలా లెలాటివో వివరాలు తెలియవు అత్తవారి యింటి పెరు నీలంవారు. అని మాత్రం తెలు స్తుంది. గుడవాడ తాలూకా. తుమ్మలపల్లి గ్రామం. పిచ్చమ్మ కొక మరిది. ఉమ్మడి కాపురం. చిన్న తాటా కుల యిల్లు. కొన్ని పశువు లుండేయి. కొద్దిగా భూమి ఉండేదేమో. మరది పెండ్లయింది. తోడికోడలు కాపు రానికి వచ్చింది. తనకంటే చిన్నది. వంటయింటి పని వానికి. పశువులకాపు పొలంపని పిచ్చమ్మకు. భాగాలు వేసింది పిచ్చమ్మ. తగవులేదు. తాపంలేదు తోడికోడళ్లకు. చల్లగా నడిచిపోతున్నది కాపురం.

గోవుల కాపరి పిచ్చమ్మ. గోవుల తిండి. గోవుల శృం గారం. గోవుల సౌఖ్యం. ఇదే పిచ్చమ్మ శ్రద్ధ. ఇదే పని. మూతులుపట్టి ముద్దాడేది. పొదుగుల వంక తిరిగి పూజించేది. ముఖాలకు పసుపు కుంకుమలు పూసి ఆ రేణువులు తన ముఖానికీ శరీరానికీ రాచికొనేది పాలు పితికేది. గోవత్సాలను కుడువబెట్టి కూర్చుండి ఆనందిం చేది చూస్తూ, గోగణంతోకూడా రోజంతా పొలాలు పచ్చిక బయళ్ళూ తిరిగేది. చేతిలో కఱ్ఱ. అది యెప్పుడూ నేల మీదనో, భుజంమీదనో. ఎన్నడూ గోవులమీద పడలేదు. పచ్చిక మేసే గోవులకు ప్రక్కనే పండికొనేది. కొంతసేపు కూర్చునేది. గోవుల వెనుక నడుస్తూ నడుస్తూ తన కడుపు పట్టికొని కన్నులు మూసుకొనేది. ఏంవిటో నాదాలు. అనేకం, తలలో, బ్రహ్మరంధ్రంవద్ద అనేకరకాలు. ఎంతో చిత్రం. వినాలి. భయం, ఆనందం, సుఖం. అడుగడు గునా యీ నాదాలు వినిపించేవి. నడుస్తూగాని కూర్చుండి గాని పండుకొనిగాని ఆ నాదా లాలకిస్తుండేది ఆలోకనలో ఆవళింతలు. వాటితో మైకం, మైకంలో మైమరుపు, దానిలో అచేతన స్థితి. ఎక్కడున్న దక్కడే నిలవడం. ఇంతలో సాయంకాలం. గోవులు తమంతట తామే ఇంటికి పోవడం. భార్యను వెతుక్కొంటూ భర్త రావడం. ఇంటికి తోల్కొని పోవడం. ఢమారమి నిత్యకృత్యం అయిపోయిందిది....ఏంవి టీ నాదాలు! ఒకటా? రెండా? పది.

అనతికాలంలోనే పిచ్చమ్మ కాడుపిల్ల కలిగింది. అబ్బ! ఎంత ప్రసవవేదన! నరకం చూచింది....బిడ్డ, కన్నబిడ్డ. ముద్దుగా ఉండేది. చాలా సంతోషం...ప్రసవవేదన మాత్రం మరువరాదు బాబూ! బిడ్డలైతే ఆనందమే. కాని ప్రసవ వేదన యెవరు పడతారు? అంత కష్టం యెందుకు పడాలి? బిడ్డల నెందుకు కనాలి? అడును ద్రొక్కనేల? కాలు గడుగనేల?...ఇక వద్దు స్వామీ! బిడ్డలు. ఈ బిడ్డ చాలు...బిడ్డ కలిగిన తదుపరి పిచ్చమ్మ భావా లిలా మారేయి. అసహ్యం. ఉదాసీనత. భయం...ఛీ ఛీ. ఏంటీ సంసారం! భార్యా భర్త లేటి? ఎందు కీ కామాలు కీడలు యిలాసాలు. మొదట్లో కించెత్తు సుఖమేగాని మిగతా కాలం అంతా కష్టంగదా. అయితే ఎందుకు సాగనివ్వాలి వాటిని? కాని, వయసులో వున్న భర్త, అనుభవంవల్ల తనకైతే సంగమం చాలా భయం. వికారం. భర్త నెలా గాపేది! తనపై నతని కెందు కంత మోహం? తన కంత స్పురద్రూపం యెందు కిచ్చాడు రాముడు? భర్త నాపడం యెలా? వద్దని బ్రతిమాలేది. మూర్ఛించినప్పుడు మొఅటుగా మాట్లాడేది. ప్రశాంత సమయాల్లో చేతనైన చిన్న మాటల్లో సంసారవైరాగ్యం చల్లగా ఉపన్యసించేది. భర్త ఉద్రేకం మీరినప్పు డేడ్చేది. జలజలా కన్నీరు కార్చేది. అయినా అప్పు డప్పుడు తప్పేదికాదు. ఏటి అన్యాయం! ఈ బా దెలా తప్పుద్ది? ఇ ల్లిడిసి పారిపోతే? సచ్చిపోతే బాగుండేదేమో? అమ్మయ్యో! పసిపాప. బిడ్డ నెవరు పెంచుతారు? అదికాదు త్రోవ. అసలు భర్తగారే లేకపోతే? అదెలా సాద్దిం? అగ్గిసాచ్చిగా పెళ్ళాడిన భర్త నిడవటం యెలా? తా నిడిసినా అత డిడవొద్దు? కులపెద్ద తప్పెత్తాడుగా? అయితే ఎలా?....భగవంతుడే ఈ చిక్కు తీర్చాడు. భర్తకు నూకలు సరిపోయినయ్యి. పాపం! యౌవనకాలం—పంచమదశ పొందేడు. ఇలా జరిగిందేటి? తన పాపంవా? అతని కాయువు లేదా? రాంవుడు తన వాక్కు తద్దిం సేశాడా?....ఏడాలా? నవ్వాలా? సామీ! రాంవసెంద్రా! ఎందు కిలా సేశావు? నీ అకరి అలోసి నేటి?...పిచ్చమ్మ పరిపరివిధాల యోచించేది. ఆ యోచ నలో మైకం. ఆ మైకంలో మైమరుపు... పాపం! చివరకు కురుమద్దాలి తిరిగి వచ్చింది. తోటివా ళ్ళొక నిట్రాటిపాక వేసియిచ్చారు. దానిలో బిడ్డతో యేకాంతవాసం చేస్తున్నది. తోటి కోడలితో ఆస్తిపాస్తులు పంచికోలేదు. అడుగనైనా లేదు. కట్టుబట్టలతోనూ బిడ్డతోనూ వచ్చింది స్వగ్రామం.

కాయకష్టంచేసి తననూ బిడ్డనూ కాపాడుతున్న భర్త విడిచిపోయాడు. పాపం! చిన్నబిడ్డ. దిక్కుమాలిన

పయింది. పోషించే వెలాగ? ఆ పిల్ల ముద్దు ముచ్చట లెలా తీరేది? త్రోవ లేనేలేదా? కాదు...వున్నది. స్థిర సంకల్పం చేసికొన్నది పిచ్చమ్మ. తా నుండగా పిల్లకు లోటురాదు. తనది నిండుయౌవనం. బలిష్ఠమైన శరీరం. పొలంపనులన్నిటిలోనూ ఆరితేరింది తను. కూలినాలి చెయ్యాలి. కష్టపడాలి. పిల్లను పోషించాలి. ఏమైనా బిడ్డకు ముట్టజెప్పాలి...ఈ దృఢసంకల్పంతో పిచ్చమ్మ పనులు చెయ్యడం ప్రారంభించింది. కోతల్లోనూ ఊడు పుల్లోనూ కట్టివేతల్లోనూ కలుపుతీతల్లోనూ పిచ్చమ్మది ముందంజ. మేరలేని పట్టుదల. అంతులేని ఓర్పు. తగిన యుక్తి శక్తులు. బలిష్ఠమైన శరీరం. నిశ్చలమై నిజాయితీ గల యజమాని విశ్వాసం. పిచ్చమ్మ పనులు విస్మయాక రాలు. నలుగురు పనిచేసేది ఒక్కతే. ఉదయంనుంచి సాయంకాలంవరకూ వంచిన నడుం ఎత్తేదికాదు. దొర లిచ్చిన బత్తెపు నూకలేగాని పదిరూక లొకరివి పడిపోయి తనకు కనుపించినా ముట్టేదికాదు. పెన్నిధానాలవద్ద పిచ్చమ్మ కాపుంటే యెవరి గుండెలకూ కలతలేదు. పిచ్చమ్మ పనికి తర్జుమాలేదు. హెచ్చరిక అవసరం లేదు. అదలాయింపుకు తావులేదు. అనతికాలంలో అందరిదొరల ఆదరాభిమానాలకూ గురైంది. ఒక్క చిత్రం. తన జీత బత్యాలు ధాన్యరూపంలోనే తీసికొనేది. నాణె రూపంలో కానీ—డబ్బు ముట్టలేదు. పాపపు డబ్బు. సేత్తో ముట్టుకో రాదు. పొట్టకు ధాన్నం సాలు. ఏంవితెచ్చికోటా సెకన్నా దాన్నిం పనికిరాకపోదు. అనేది. ఈ నియమం యెన్నడూ విడువలేదు పిచ్చమ్మ. ఏ ఘడియలోనూ రామనామ స్మరణ విడువలేదు...పిచ్చమ్మ పనికితగ్గ ప్రతిపలం వచ్చేది. తాము తినడం, తోడి బీదలకు పెట్టడం. మిగిలితే తన కుమార్తె పెండ్లినాటికి దాచటం. దాపరికం తన అన్న పోతురాజువద్ద. అనాటి కీతడు కొంత తెలివితేటలు గల వాడు. మాటకారి, లౌకికం తెలిసినవారిలో తల త్రిప్పు కొంటున్నాడు. అన్న, తన సొమ్ము దాస్తాడు. అన్యాయం సెయ్యడు. విశ్వసించింది.

కుమార్తె పెండ్లి చేసింది. అత్తవారింటికి పంపింది. వారిద్దరూ కాపురం చేసికొంటున్నారు. తాను మాత్రం ఏకాంతంగా కురుమద్దాలిలో కాపురం. తన భర్త లేడు. ఏకైక పుత్రి జీవితేశ్వర సమాగమం చెందింది. చుట్ట పక్కాలు వేరెవ్వరూ లేరు. ఉన్నవారు రారు. ఏమీ తోచదు. ఊబుసుపోదు. ఏదో బెంగ, ఏదో కలత. సీరామ సెంద్రా! ఏటీ పరితాపం? ఏటీ నమ్మందం? తనకు శాంతి కావాలి. రామనామస్మరణలో తన విచారం కష్టం మరిచిపోవాలి. పిచ్చమ్మ యెప్పుడుచూచినా స్మరణలో ఉండేది. కుమార్తె అత్తింటికి పోయింది. కూలిపను లెక్కు వెందుకు? ఎవరికోసం హెచ్చు సంపాదన? అల్లుడు మంచివాడు. కుమార్తెను అణిముత్తెంలా ఆప రిస్తున్నాడు. తన సంపాదన వే రవుసరం లేదు వాళ్ళకి. తన పొట్ట పోసికొంటే చాలు తాను స్వల్పంగా పనిచేస్తే చాలు. అయితే మిగతకాలం అంతా తనదే. రామనామం యెంతైనా చేసికోవచ్చు. అవకాశం ఘడియకూడా పోనీ లేదు పిచ్చమ్మ.

తన కింకెవరూ తినేవారు లేరు. కూతురు, అల్లుడు, ఇంతే. తాను లోగడ కూడబెట్టికొన్న కష్టార్జితం తనకు గాదు. కూతురికి. తల్లిపేరట కుమార్తె కా ధనం వుండాలి. తన డబ్బు అన్న పోతురాజువద్ద ఉన్నది. ఇంకా అతని దగ్గ రెందుకు? కుమార్తె కిచ్చివేయడం మంచిది. అన్న గారి నడిగింది పిచ్చమ్మ. అన్న, ఎంతచేశాడు! కర్చై పోయిందన్నాడు. డబ్బు యివ్వలే నన్నాడు. క్షమాపణ కోరేడు చెల్లెలిని. ఛీఛీ. ఎంత బాధ! చిరతర కష్టార్జితం. కాలిపోయింది. అన్న శీలం అసహ్యకరం! స్త్రీ విత్తం. విధవా విత్తం. అపహరించాడు. లేదన్నాడు. నిజంగా లేకనా? కాదు కాదు. ఇది రాక్షసం...కాని చేసే దేంవిటీ? క్షమించమంటున్నాడు తిడితే లాభం? ఉచ్చుకెక్కిస్తే ఫలం? విచారిస్తే డబ్బు తిరిగి రాదుగా?...కన్న కూతు రికి గ్రుడ్డిగవ్వ యివ్వలేకపోయింది. అంతా దెప్పపోశారు. అంతా దైవికం. లోకంలో ఎవరికి సాయం సెయ్యగలో ళ్లెవరు? ఎవరి కెవరు? భగమంతుడె పెపంచంలో జీవు లందరికీ పెబువు. రచ్చకుడు...తన కుమార్తె, ఎవరిచ్చారు దాన్ని? భగమంతుడే. దాని మంచిచెడ్డలు చూచికొనే వాడు భగవంతుడే. ఈశ్వరేచ్ఛ కెదు రెవరు? ఊరికొన్నది పిచ్చమ్మ.

కాపురం చేసికొంటున్న రెండు మూడేళ్ళలోనే కాలి పోయింది కుమార్తె సౌభాగ్యం. అల్లు డకస్మాత్తుగా చని పోయాడు. భగవదిచ్ఛ. ఇదేం సొదా? ఈ పడుసు జీవనం యెలా కావాలో? గోలుగోలున యేడ్చింది కూతురు. కన్న తల్లి కడుపు కటకట లాడింది. భర్త లేని అత్తింట యెలా గుంటుంది కూతురు? ఎందుకు? తనతోనే వుంటుంది. తనతోటిపాటే త్రాగుతుంది కలో గంజో. కుమార్తెను తన యింటికి తీసికొని వచ్చింది పిచ్చమ్మ...పాపం! నిండు జవ్వని బొట్టు పోయింది. రూపు చెడింది. పాముకు గడి చిన న్నేళ్ళు గడపాలి. ఐహికవాంఛలు తీరలేదు. ఎలాగ? తల్లితోపాటు దౌర్భాగ్యం అనుభవించగలదా? ఎన్నాళ్లు? కాదు కాదు. 'పెళ్ళి చెయ్యాలి మళ్ళీ. మరొక మగణ్ణి వెతికాడు మేనమామ, పోతురాజు. పెండ్లి ప్రయత్నాలు చెయ్యమన్నాడు చెల్లెలిని. ససేమిరా సహించలేదు పిచ్చమ్మకు. ఈ యెతా లనీ యెరం. అనరం. మానండి.

అన్నది పిచ్చమ్మ. కన్నతల్లివి. బిడ్డ శుభకార్యం. అవాచ్యా లాడకు. పెండ్లి తప్పదు. ముహూర్తం ఫలానానాడు. కపి లేశ్వరపురం అత్తవారు. కుఱ్ఱవాడు చూపఱి కలవాడు. నవయౌవనుడు. పిల్ల సుఖపడుతుంది. కాదనకు. అన్న ప్రతిపాదించాడు, పట్టుబట్టాడు. ప్రయత్నాలన్నీ చేశాడు. ప్రతిఘటింపలేక పోయింది పిచ్చమ్మ. భగవదిచ్ఛ. పున ర్వివాహం జరిగింది కూమార్తెకు.

కాపురా లన్నీ కంటకమయం గాదు. అన్నీ ఆనందపూరి తంగాదు. ఆకొన చూచేవి కొన్ని, ఈచివర చూచేవి కొన్ని. మధ్యరకం మాత్ర మపారం. పిచ్చమ్మ కూతురి పునర్వి వాహం కేవలం కంటకమయం అయిపోయింది భార్యా భర్తలకు పొత్తు లేదు. పొందు లేదు ఆనందం లేదు. అంతా కన్నీటి మడుగు. నిరంతరం పోట్లాడేవాడు భర్త. కారుకూతలు కూసేవాడు. చితక దన్నేవాడు, మాటి మాటికీ. ఆ యింట్లో ఇతర సభ్యుల కింకేం గౌరవం? కట్టి కొన్న భర్త కావంటే అత్తింట స్త్రీ మరెవ్వరి కండ్ల కింపు? దినదిన గండం. భూలోకనరకం అమ్మాయి కా యిల్లు, నిలువ లేకపోయింది. నీళ్ళధార విడిచింది కాపురానికి. బ్రతుకు జీవుడా అన్నది. ఆకస్మాత్తుగా అమ్మవద్దకు వచ్చింది...వివాహం అయింది. ఎదవలా గుండగూడదు పిల్ల. పతి విడిచిన పిల్లకి దురుగతి. పరిత్తితు లెలాగున్నా పసుపు కుంకాలున్న పడతికి బర్తిల్లే నివాస యోగ్యం. అమ్మ యిల్లు అదమాదమం, అనర్థకం, అనాశారం, అప నిందల కాలవాలం. న్యాయ మెరిగిన తల్లి, కుమార్తెకు బోధించింది. యకోవా మృత్యుర్వా భర్త యింటనే. భావం చెప్పింది ప్రశాంతంగా. తన యింట నుండడం తగ దన్నది. తాను సహించ నన్నది. కుమార్తె గుండె గుభేలుమన్నది. అక్కడ నరకం. అక్కడికి మళ్ళా పోతే ఆత్మహత్య మాత్రమే గతి. తిరిగిరాదు. కన్నీటితో చెప్పింది కన్న కూతురు. నుయ్యి, లేకపోతే గొయ్యి. అక్కడ నేను జీవించలే నమ్మా! అన్నది. పిచ్చమ్మ ముఖంమీద చిరునవ్వు మొలకలెత్తింది. సావధానంగా మాట్లాడింది. రాంపుడు దయ తల్లీ! నీ జీవితం నీసేత లేదు. అది దయ. అది యిచ్ఛ. మరణం తప్ప దెవరికీ. నూతిలో పడ్డా గంగాభాగీత్తమ్మని తలుసుకుంటా పడాలి. నారాయణిడిని సారిత్తూ దిగాలి. భగవంతుడి పేరితో సేసిన పని పెతీదీ పయిత్తరం. సిన్నా! భయపడకు. ఎల్లు అన్నది గంభీరంగా. గిఱ్ఱున తిరిగింది కుమార్తె. గంగా భాగీరథీ! నారాయణా! తదేక స్మరణ మొదలుపెట్టింది. చఱచఱా నడిచింది. కపిలేశ్వరపురం గంటలో చేరింది. ఇంట ప్రవేశించింది. భర్త ఇంట లేడు. నిర్జనంగా వున్నది ఇల్లు. పెఱటిలో బావి. బావిగోడ ఎక్కింది. కాళ్ళు కట్టి కొన్నది. గభాలున దూకింది కూపంలో. శవం పైకి తేలింది కొద్దిసేపట్లో. అన్నన్నా! ఎంత దుర్ఘటన! ఎంత సాహసం! సాహసం...ఎవరిది? బిడ్డదా? తల్లిదా? బిడ్డను నూతిలో పడుమనే తల్లు లుంటారా? పిశాచమా? తనయకు చావు తప్పదని ముందే యెరుగునా? అందుకే ఆ నిశ్చయ వాక్కులా? చచ్చే బిడ్డకు సన్మార్గమైనా బోధించిందా తల్లి? ముక్తిమార్గం చూపించిందా?

రామరామ! ఏం కర్మం యిది! పిచ్చమ్మ కుటుంబానికి యింత పీడ పట్టికొన్నదే? భర్త పోయాడు, ఆస్తి క్షీణిం చింది, అల్లుడు గతించాడు, ఏకైక పుత్రికకూడా తుద కెగిరిపోయింది. కష్టాలన్నీ కట్టగట్టికొని వస్తున్నాయి అన్న దొక ముదుసలి అవ్వ. రామ భక్తురాలు కదూ? పాదాలు పట్టిన భక్తురాలి నిలా పాలిస్తున్నారు రాములవా రన్నా డొక మాటకారి వ్యటకారంగా. భగవంతుని చేష్ట లిలాగే ఉంటాయి. ఆప్తులైన భక్తుల సంసారాల్లో అటమటలు రేగిస్తుంటాడు అన్నాడు ఒక తంబురాదాసు. సత్యం, పర మేశ్వరుడు పట్టుపట్టి చేస్తున్నా డిదంతా. బంధనాలు తెగి పోతున్నాయి పిచ్చమ్మకు అని రహస్యం చెప్పా డొక వేదాంతి.

పిచ్చమ్మ మాత్రం నేడు నిజంగా పిచ్చిదేమో. ఇంతలో ధారాపాతంగా కన్నీరు, ఇంతలో నవ్వు, ఇంతలో దీర్ఘాలో చన, ఇంతలో మైమరుపు, ఇంతలో వెఱ్ఱిచూపులు, ఇంతలో బోరున యేడ్పు. తిండి లేదు. నిద్ర లేదు. మంచినీళ్ళు మాత్రం మాటిమాటికి త్రాగేది. మాటలాడదు. కదులదు, మెదలదు. పదిరోజులు పొయ్యిమీదకి కుండ ఎక్కలేదు. పొయ్యి మండ లేదు. మందు మ్రింగిన కోతి, మత్తెక్కిన తుమ్మెద, మతిలేని మూగ. చూపఱుల కిదొక విచిత్ర దృశ్యం.

పదకొండవ రోజు పిచ్చమ్మ లేచింది. తన యింట్లో బిందెలు తెచ్చింది. గుమ్మం ముందునుంచి పోయే కోటమ్మ కిచ్చింది. పొమ్మని సంజ్ఞచేసింది. ఆమె పోయింది. చెంబులు తెచ్చింది మళ్ళా. ఇద్దరు బైరాగుల చేతుల్లో పెట్టింది. పొమ్మని చెయ్యి ఊపింది. చీఱలు రవికెలు మూట మోసుకు వచ్చింది. దూరాన్న నుంచున్న బిచ్చ గాండ్రవద్దకు నడిచివెళ్ళింది. వాళ్ళ చేతుల్లో పెట్టింది. తిరిగివచ్చింది. చెవి తమ్మెంట్లు మెడలో కృత్తిగంటు మూడు పగడాల దండ తీసింది. ప్రక్కింటి అమ్మాయి వస్తుంటే ఆమె కిచ్చింది. లోనికి పోయింది. ఇల్లంతా— గుమ్మాలు పెండెలుగూళ్ళు తేరిపాఱ చూచింది. మాటి మాటికీ. దొడ్డిగుమ్మం పంచాదిలో వున్న ధాన్యం మూట యెత్తుకవచ్చింది. ఎదుటి యింటి గుమ్మంలో దించి వచ్చింది. దొడ్లో కోడి పిల్లలు తల్లితో తిరుగుతూ మేస్తు



ోహినీ ముక్తికాం తయిందా ?



అమ్మ నవనీత ప్రేమమూర్తి



అవధూతమాత - యోగిని పిచ్చమ్మ

ోసినోరు ముత్యాలు పోసింది



దేహో దేవాలయః ప్రోక్తః



న్నాయి. బొటబొట కన్నీరు కార్చింది. మరొక ప్రక్క చూచింది. ప్రాత గోనీగుడ్డలు పడివున్నాయి—అక్కడికి పోయింది. లేవనెత్తింది. దుమ్ము దులిపింది. అటు నిటు త్రిప్పి చూచింది. ఆకాశం వంక దృష్టి మార్చింది. నలుదిక్కులూ పరికించింది. నవ్వుకొన్నది. శరీరంమీద తెల్లపంచి తెంపుతెంపులుగా చీల్చింది. వికారంతో భూమి మీదికి విసిరింది. గోన గుడ్డలు కులుకుతూ ధరించికొన్నది, కటిస్థలంమీదనూ చనుగప్పుగానూ. ఇంటివంక చూచింది. ఫకాళించి నవ్వింది. మళ్ళా ఆకాశం వంక చూచింది. చేతులు జోడించి ఫాలంమీద మోపింది. గిరుక్కున తిరిగింది. వంగి గుమ్మంలోనుంచి దూరి చావిట్లోకీ అక్కడి నుంచి వీధి గుమ్మం దాటి రాజవీధిలోకీ వచ్చింది. తల వంచింది. మెల్లగా నడిచిపోయింది. ఘడియలో కంటికి కనబడలేదు. రెండవ ఘడియలో తండతండాలుగా మేఘం, ఉరుములు, మెరుపులు, భోరున వర్షం. ధారాపాతం. నదులూ కాలువలూ యేకమైపోయి యెదురు ప్రవహించాయి.

ఆరడుగుల యెత్తరి. కండరపుష్టిగల పసుపుపచ్చని బలిష్ఠకాయం. ఆపాదమూ విరబోసిన దీర్ఘ శిరోజాలు. ఆజానబాహువులు కేంద్రీకరించిన దివ్య తేజః పూరిత చక్షుర్ద్వయం. గోనీగుడ్డలు కట్టిన కటిస్థానం ఉరః ప్రదేశం. చేతులో ఏ ప్రాతమానవునిదో ప్రాబడ్డ కపాల పాత్ర. మౌనముద్ర. కురుమద్దాలిగ్రామ రుద్రభూమిలో సంచరిస్తున్న దొక విచిత్ర వ్యక్తి. హఠాత్తుగా చూచిన మానవుని గుండె లాగిపోయేంత భయంకరరూపం. రాత్రి లేదు. పగలులేదు. ఎండలేదు. వానలేదు. చలిలేదు. ఎప్పుడూ రుద్రభూసంచారం, నిద్ర అననం తపస్సు నివాసం పలుమారు కన్నీటి ధారలు. అకస్మికంగా వచ్చిన మనుష్యులకు మాత్రం అగపడేది. చీమ చిటుకుమంటే చెంగు చెంగున పరుగెత్తేది. చేరువ పొదల్లోనో చెట్లల్లోనో గోతుల్లోనో దాగుడుమూతలాడేది. అక్కడికీ జనులు వస్తే దూరాన కాలువగట్టుమీదికి గంతువేసేది. అక్కడా కాదంటే నిర్జనసమయాల్లో బందరు బెజవాడ రోడ్డుమీద ప్రాయకంగా తాండవించేది. మరల రుద్రభూమిలో మనుష్యులు మసలునప్పటికి చేరికొనేది. భూతమో పిశాచో దయ్యమో దైవమో పిచ్చిదో మరేదో! స్త్రీ వ్యక్తి. కాలుతున్న కాష్టాల ప్రక్క పడక, గోతులు త్రవ్వుతూ గొల్లుపెట్టే గుంటనక్కల మధ్య తపోదీక్ష. ఎముకల ప్రోగుల్లో విశ్రాంతి. చేతిలో కపాలంతో నీళ్ళు త్రాగడం. కతిపయ దినాలు కఠోరోపవాసం. అనేకనాళ్ళ కొకసారి యెండుటాకులు పరపరా భక్షించడం. మరొకప్పుడు గండ్రయిసుక కంకరరాళ్ళు ఒండ్రుమన్ను తినడం. అప్పుడప్పుడాయా జనుల కంట బడేవి. దిగంబరిగా తిరగడం చూచారు మరి కొన్ని సంవత్సరాలు పోయిన తరువాత. రమారమి 20 సంవత్సరాలీవిదంగా చూస్తున్నారు ప్రజలు. కర్ణాకర్ణికగా వింటున్నారు. గభరగభరలుగ గోప్యాలాడి కొన్నారు. గ్రామస్థుల్లో ధైర్యవంతులు తేరిపార చూచారు. ఈ వ్యక్తి పిచ్చమ్మ అని పేర్కొన్నారు. క్రమక్రమంగా గ్రామమంతా కలియబ్రాకిందీ వార్త. పిచ్చి దన్నారు పలువురు. పోనీమన్నా రనేకులు. మరిచిపోయారు మరి కొందరు. కాని లోకం విచిత్ర విషయాల్లో రహస్యం వెతకడం మానవుల్లో కొందరికి సహజం. పిచ్చమ్మ ప్రస్తుత భీభత్స రుద్రభూవాస సంచారవార్తలు పరిసర గ్రామాల్లోనూ ప్రక్క తాలూకాల్లోలోనూ జిల్లాల్లోనూ క్రమక్రమంగా హిందూదేశ మంతటా ప్రబలిపోయినాయి. కఠోరోపవాసం రుద్రభూమిలో నివాసం. మౌనం. ఇసుక వగైరాలు తినడం. ఏమి టీ చిత్రం? ఎందు కీమె ఇలా గుంటుంది? ఈమె ఆశయా లేమిటి? అనేక ప్రజల్లో సంచలనం ఱేగింది. ఆలోచనలు మీరినవి. గుంపులు విమర్శలు వివిధ నిర్ణయాలు ఱేకెత్తినాయి. చోద్యం చూడ్డానికి దూరదూరాన్నుంచి వస్తున్నారు ప్రజలు. మహాప్రవాహం. వచ్చిన వారంతా ఊరికేపోరు. ధైర్యవంతు లుంటారు కొందరు. కొందరు పిచ్చమ్మ దగ్గిరికి పోయేవారు. అందరికీ కనుపించలే దామె. అందరికీ దొరకలేదు. అందరివద్ద అగలేదు. అందరినీ పలుకరించలేదు. అందరితోనూ మాట్లాడలేదు. పోయిన శత సంఖ్యాకులలో ఒకరికో ఇద్దరికో యెప్పుడో యెలాగో యీ భాగ్యం సంప్రాప్తించేది. ఆమెను గమనించి చూచిన సాధువులు యోగులు భక్తులు నిర్ధారణ చేశారు. పిచ్చిది కాదు. భూతం గాదు. దయ్యం కాదు. పిచ్చమ్మ నవనీత హృదయ. ప్రేమస్వరూపిణి. ప్రకృతికి సన్నిహితురాలు. కఠోర బ్రహ్మనిష్ఠాగరిష్ఠురాలు. మహా తపస్వి. కేవల విరాగి. జీవేశ్వర సంధాన సౌఖ్యానుభవంలో శరీరం సంసారం విస్మరించిన జ్ఞాన తేజస్సు. శాశ్వత సచ్చిదానందాన్నన్వేషిస్తున్న అవధూతి. పలువురు ప్రమాణపత్రా లిచ్చారు. శ్రీరామభక్తురా లని గ్రహించారు. అనేక చోట్ల చెప్పికొన్నారు. అక్కడినుండి పలుతావుల నుంచి ప్రజలు రావడం పిచ్చమ్మను దర్శించడం నమస్కరించడం మాట్లాడడం ఆమెతో కలిసి సంచరించడం జరిగేది. ఇప్పుడు పిచ్చమ్మ పిచ్చమ్మగారయింది. పిచ్చమ్మావధూతగారి శ్మశానవాసం నిండిరువదేళ్ళు నిండించిందిలా.

ఆహహ! అవధూతల ప్రకృతి ప్రత్యేకం.

శ్లో॥ కౌపీనం శతఖండ యుర్జరతరం కంథా పున స్తాదృశీ
నైశ్చింత్యం నిరపేక్ష భైక్ష్య మశనం నిద్రా శ్మశానే వనే

స్వాతంత్రేణ నిరంకుశం విహరణ స్వాంతం
ప్రశాంతం సదా
స్థైర్యం యోగ మహోత్సవేపి చయది త్రైలోక్య
రాజ్యేన కిమ్ ॥

క ॥ కూరలు కాయలు నీళ్ళా
హారముగా గొనుచు నియమ మలవడగ ననం
స్కార శరీరుం డగుట ను
దారత నవధూత వేషధరుడై వరుసన్ ॥

సీ॥ తలి దండ్రులకు నేను తనయుడనై పుట్టి
తత్వమార్గమ్మును తలుప నైతి
తత్వమార్గం బది తలపున దగులగా
తల్లితో పొందాయె తనయునకును
ఈ పొందు నే పొంది యిహపర లోకంబు
లేలంగ గంటి నే నెఱుకతోడ
తల్లి మగడనైతి దాత దైవము నైతి
దాత ముత్తాతల తండ్రి నైతి

తే॥గీ॥ పరమ సిద్ధాంత వేదాంత పరుడ నైతి
బట్ట బయ లైన యా పరబ్రహ్మ మైతి
భవన పరిపాలి! బుధజన భావ శీలి!
జీవ శివ శక్తి! శ్రీముక్తి! శ్రీపరేశి! ॥

1921 లో ఒకానొకనాడు. అప్పటికి రుద్రభూసంసారం నడుస్తున్నది. అదేమి కళో. పిచ్చమ్మగారు కపిలేశ్వర పురంలో హరిజన వాడలోని శ్రీరామాలయంలో వున్నారు అప్పుడు కురుమద్దాలి గ్రామవాసిని శ్రీమతి పిన్నమనేని వెంకట నరసమ్మగారు పిచ్చమ్మగారిని కలిసికొన్నారు. సేవించారు. లాలించారు. బ్రతిమాలేరు. కురుమద్దాలిలో తన యింటికి తీసుకువచ్చారు. పాదపూజ చేశారు. పరి చర్యలు చేశారు. పంపించారు. అప్పటినుంచి పిచ్చమ్మ గారికి వెంకట నరసమ్మగారు ప్రియశిష్యురాలు. పిచ్చమ్మ గారి జీవబ్రహ్మైక్యతను గూర్చి లోకానికి చాటిన భక్తురాలు. పిచ్చమ్మగారిపేర ఆశ్రమం కట్టించాలి. పిచ్చమ్మగారిని దేవతగా ఆరాధించికొనే ఏర్పాట్లు చెయ్యాలి. పట్టుపట్టేరు. ప్రచారం చేశారు. విరాళాలు ప్రోగుచేశారు. 1925 నాటికి ఆశ్రమం తయారు చేయించారు. భక్తులతోను శిష్యులతోను కలసి పిచ్చమ్మగారిని కలిసికొన్నారు. ఆశ్ర యించారు. ఆశ్రమవాస స్వీకారాని కంగీకరింప జేశారు. మంగళవాద్యాలతో తీసుకవచ్చారు. ఆశ్రమంలో ప్రవేశ పెట్టారు. అంతటినుండి పిచ్చమ్మగారు ఆశ్రమ వాసిని. అవధూతమాత.

ఆశ్రమవాసకాలంలో పిచ్చమ్మగారి చర్యలు మహత్త రాలు. కొన్నింటిని వినండి. వినోదించండి.

పిచ్చమ్మగారిని చూడవచ్చేవారు ప్రజలు. సేవించే వారు. కీర్తించేవారు. బుచ్చమ్మగా రనే భక్తురా లుండేది. పిచ్చమ్మ రూపం చేష్టలు చూచినప్పుడల్లా పిచ్చమ్మ సామాన్య స్త్రీ గాదు. గొప్పస్థితికి వస్తుంది. భక్తురాలు. అంటూండేది మొదటినుంచి. అవధూత జీవనసమయంలో ముందుగా పిచ్చమ్మగారిని దర్శించి సేవించి పూజించిన జ్ఞాని బుచ్చమ్మగా రనే చెప్పాలి. సంసారులు సాధువులు యోగులు పిన్నలు పెద్దలు స్త్రీలు పురుషులు అనేకులు సేవించేవారు పిచ్చమ్మగారిని. అనేకులు శిష్యులైనారు. శ్రీమతి చల్లపల్లి రాణీవారు, బందరు A. D. M. O. ఉమా పతి మొదలియారుగారు, గుంటూరుజిల్లా రెడ్డిపాలెం ఆశ్రమ వాసి యోగి కాంతయ్యగారు, విజయవాడ న్యాయవాదులు పర్వతం వీరభద్రశర్మగారు, తుమ్మలపల్లి జగన్నాథంగారు, నూజివీడు గవర్నమెంటు ప్లీడరు సుంకర వెంకటప్పగారు, చీరాల ఉన్నత పాఠశాల ప్రధానోపాధ్యాయులు అయ్యం గారు, కారంచేటి వాస్తవ్యులు కాటూరి జమీందారులు యార్లగడ్డ రంగనాయకులుగారు, బ్రహ్మశ్రీ మళయాళ స్వాములవారు, కొండిభద్ర వీరభద్రాచారిగారు, B.A.L.T. ఉపాధ్యాయులు, దిట్టకవి రామకృష్ణయ్యగారు, ట్యూటర్, పిన్నమనేని వీరయ్యగారు, బెజవాడ సత్యనారాయణశర్మ గారు, ఫుడ్ యినస్పెక్టర్ ఒక నాయుడుగారు, పిన్నమనేని నాగయ్యగారు, గుడిపాటి వెంకటాచలంగారు, ఆంధ్రప్రభ ఎడిటర్ నార్ల వెంకటేశ్వరరావుగారు, గుడివాడ కళాశా లోపన్యాసకులు ఎఱ్ఱోజు మాధవాచార్యులుగారు, గోపీచంద్ కవిగారు, కొప్పర్తి కవులు. ఈ పేరులు మాత్రమే ఇప్పటి వారు చెపుతారు. ఇంకా యెందరెందరో పిచ్చమ్మగారిని సేవించారు. శిష్యులైనారు. అవధూత కాలంలోగాని తదు పరి ఆశ్రమవాసంలోగాని.

వైవారిలో పిన్నమనేని వీరయ్యగారు కురుమద్దాలి వారే. ప్రథమంలో పిచ్చమ్మగారిని దూషించేవారిలో ప్రథమ గణ్యులు. వీరికి కురుమద్దాలిలో ఒక మిల్లు ఉండేది. దానికి లైసెన్సు తెచ్చికోవడం వీరికి చాల కష్టం అయి పోయింది. జిల్లా ఆరోగ్యశాఖాధికారులను పిలిపించింది పిచ్చమ్మగారు. లైసెన్సు ఇప్పించింది. తాను విరోధిస్తే తనకు సహాయం చేసింది. ఏంవిటీ అకారణ ప్రేమం. ఎంత దయ! వీరయ్యగారి భావం పరిణమించింది. పిచ్చమ్మగారికి శిష్యుడైనాడు. పరిచర్యలు చేశాడు నాటినుంచి.

కొండిభద్ర వీరభద్రాచార్లుగారు పోను పోను సన్యా సాశ్రమం తీసికొని ప్రణవానంద స్వామివా రైనారు. బుచ్చమ్మగారు తదుపరి అనేక శిష్యులకు గుర్విగా పని చేశారు.

దిట్టకవి రామకృష్ణయ్యగారికి అప్పటికి 40 సంవత్స రాలు, భార్యకు 30 సంవత్సరాలు. సంతానము లేదు. పిచ్చమ్మగారు 1943 లో వీరి చేతులు చూచారు. 20 రోజులు ఆశ్రమంలో వాసంచేశారు వీరు. సేవించికొన్నారు. పిచ్చమ్మగారి పంపున సూర్యనమస్కారాలు చేశారు. మరునటి నెలలో వీరికి సంతాన సూచనలు కలిగినవి.

ఫుడ్ ఇనస్పెక్టరు నాయుడుగారికి ఆశ్రమంలో కుష్ఠు రోగ నివారణమైంది.

సత్యనారాయణ శర్మగారి భార్యకు క్షయరోగం మద్రాసులోకూడా బాగుపడలేదు. ఈ ఆశ్రమంలో బాగుపడింది.

పిన్నమనేని నాగయ్యగారు పిచ్చమ్మగారి ప్రథమ శిష్యుడు. ఈ తల్లితోకూడా దేశసంచారాలు చేసేవారు. ఎవ్వరైనా పిచ్చమ్మగారికి ధనదానం చేస్తే ఆమె తీసికో లేదు. నాగయ్యగారినే తీసుకోమనేది. ఈయన తీసి కొనేవారు.

అవధూతమాత జీవకారుణ్యం ముఖ్యంగా రెండు జీవుల విషయంలో ప్రత్యక్షం. ఒక కుక్క. ఒక నాగు....కుక్క ఎక్కడిదో. ఏమి సంబంధమో అవధూతమాతతో. ఆశ్రమానికి వచ్చింది. మాతను కలిసికొన్నది. ఎదుట నిలుచున్నది. తోక ఆడిస్తూంది. చెవులు వంచింది. నాలుక చాస్తూంది. మాత చల్లగా చూచింది. ముసిముసి నవ్వు నవ్వుకొన్నది. ఎవతెవే నువ్వు? ఏం పని? ఎందుకు వచ్చావు? అని ప్రశ్నించింది. ప్రత్యుత్తరం లేదు. నా దగ్గిరేం ఉన్నదే? నన్నాశిరిత్తే సుఖంయేంటి? అన్నది మాత. ప్రత్యుత్తరం లేదు. ఎక్కడికైనా పో, తిండి తిను. అన్నది. సమాధానం లేదు. నా దగ్గిరే ఉంటావేటే? అని ప్రశ్న. శునకం తల ఊపింది. ఊంఊం అని మూలిగింది. ఉండయితే అన్నది మాత. శ్వానం ఆశ్రమవాసి అనాటి నుంచీ. అవధూతమాత ఆదరణకు ప్రథమ పాత్రురాలు. పదియేళ్ళున్నది. ఒకరోజున చనిపోయింది. ఈ కుక్క శరీరం కుళ్ళినప్పుడు మాత కళేబరం మానవలోకం ఇడుస్తుంది అన్నది అమ్మ. శ్వాన చర్మం జాగ్రతగా ఉంచారు శిష్యులు. అదేమి చిత్రమో! ఆ చర్మం కుళ్ళదు. ఈగలకు చెదలకు తావీయదు. వాసనరాదు. నశించదు. అమ్మ నిర్యాణంవరకూ అలాగే ఉన్నది చెక్కుచెదరకుండా.

ఆశ్రమం తాచుపాముల మయం. ఈనాటికీ అంతే. 'దూడ లుంటయ్యి. భయం పడకండిరా' అనేది అమ్మ. దూడ లంటే తాచుపాములు అని అమ్మ పరిభాష. ఒకనాడు ఒక సర్పం ఆశ్రమనుంచి బయటపడింది. నూతనాతిథుల్లో ఒక డా పామును కఱ్ఱతో కొట్టేడు. అమ్మ చూచింది. అగు అగు అని అఱిచింది. పరుగెత్తివచ్చింది. తాచుపాము తల పట్టికొన్నది. లేవదీసింది. పాపం! పాము పంచమావస్థకు దగ్గరలో ఉన్నది. కొన ఊపిరి మాత్రం. ఉస్సురని నిట్టూర్చింది అమ్మ. పాము తలను తన నోటివద్దకు చేర్చికొన్నది. ఏదో గొణిగింది. మరునటి జన్మకైనా మానవుడు కాకపోవులేరా అన్నది. సర్ప శరీరాన్ని ఆశ్రమంలో ఒక మూల ఉంచింది.

అమ్మ చైతన్య స్థితిలో రెండు రోజు లుంటే మూడవ రోజునుంచి సమాధిస్థితి తప్పనిదే. ఈ సమాధి వారం పది రోజులుకూడా నడిచేది. ఆశ్రమంలో ఉన్నప్పుడు సమాధికి ముందు సమాది గదిలోకి వెళ్ళేది. తలుపులు బంధించేది. ఆ గదిలో ఆ చీకటి కోణంలో ఆ పాముల పుట్టలో సమాధి, పరస్థలాల్లో ఉన్నప్పుడుకూడా 'తలుపు వెయ్యి' అనేది. వెంటనే అమ్మ నాలుక ఆకాశ జిహ్వవంక తిరిగేది పాముమెలికలా. అదే కవాటబంధనం. అంతనుండి సమాధి, సమాధిలో అమ్మ శవప్రాయం. నిశ్చైతన్య శరీరంలో ముఖం మాత్రం దేదీప్యమానంగా ఉండేది. అమ్మ సమాధికాలంలో శిష్యులు భక్తులు పడుగాపులు పడి వుండేవారు. ఎవరికి వారు పూజాపునస్కారాదులు చేసి కొంటూ తమతమ పనులు నిర్వహించి కొనేవారు. ఏకాంతంగా దూరదేశ యాత్రలు చేస్తూ పొగబండిలో పోతూండగా సమాధికాలం వస్తే అయా స్టేషనుల్లో దిగిపోయేది. మౌనం వహించేది. ఎవరో వచ్చేవారు, ఎక్కడికో తీసికొని పోయేవారు. దూరదేశాలు. తన్నెవ్వరూ యెరుగని చోట్లు. తాను పలుకదు. అక్కడి భాష రాదు. అక్కడ అమ్మపైన ఆదరభావం యెవరికో? ఎందుకో? సమయాని కెలా వచ్చేవారో? ఎక్కడికి కొనిపోయేవారో? ఎవ్వరూ ఎరుగరు.

వర్షం కురుస్తూండగా అవధూతమాత అప్పు డప్పు డవ్వలికి పోవడం తటస్థించేది. తడిసిపోతారు పోవద్దు. అని తెలియని శిష్యులు ప్రయాణం నివారించేవారు. అమ్మ ప్రయత్నాని కడ్డు లేదు. నిప్పనకు చెద లంటవు. వర్షంలో నడిచిపోయేది. అమ్మ నడిచే చోటల్లోనూ నిలచిన ప్రదేశాల్లోనూ చినుకు లుండవు. అమ్మ వల్లెవాటుపైన తడే కనుపించదు. పలువురి కీ దృశ్యం పరమాశ్చర్యకరం.

రెడ్డిపాలెం ఆశ్రమస్థులు యోగి కాంతయ్యగారు అవధూతమాత ఆశ్రమానికి పలుమారు వచ్చేవారు. అమ్మ రెడ్డిపాలెం ఆశ్రమానికి చాలసారులు పోయేది. ఆశ్రమంలో కాంతయ్యగారి పూజామందిరం అమ్మ విడిది గృహం. ఆ మందిరంలో అనేక తాచుపాము లుండేవి. ఒక సర్పం ఎప్పుడూ అక్కడి శివలింగాన్ని చుట్టికొని ఉండేది. అమ్మ ఆ సర్పాన్ని తట్టిం దొకనాడు. ఏం సుబ్బారాయుడూ! అయ్యో భుజంమీద తీపి పోలేదింకా. కన్నతండ్రి నిప్పుడు కూడా కౌగలించుకొనే ఉన్నావురా? అన్నది.

మొదటిలో పెదతిరుపతి పోయినప్పు డొక చిత్రం. ఎవ్వరినీ అంగీకారం అర్థించలేదు. గర్భాలయంలో ప్రవేశించింది. అడ్డినవారు లేరు మూల విరాట్టు శ్రీ వేంకటేశ్వర స్వామిని చేరికొన్నది. భుజం మీద తట్టింది, ఏంవిరా! ఏంకన్నా; ఇక్క డున్నావట్రా! అన్నయ్యా! అన్నది. భక్తు లందరూ తెల్లబోయి చూస్తున్నారు.

అవధూత మాతకు దివ్యజ్ఞాన పిపాస మెండు. హిందూ దేశంలో యెందరెందరినో విజ్ఞాన మూర్తులను వారి వారి ఆశ్రమాలలో కలిసికొన్నది. సంభాషించింది. సహచరించింది. శ్రీ మాన్ మళయాళ స్వాములవారు తొలిసారి కురుమద్దాలి వచ్చినప్పుడు యేర్పేడులో తన ఆశ్రమానికి తీసికొని పోయారమ్మను. పదునేను రోజులు ఏర్పే డాశ్రమంలో విడిది చేసిం దమ్మ. ఇద్దరు సూర్యులు వలె యోగ మూర్తులు లిరువురూ తదాశ్రమంలో సంచరించి సంభాషించి పరస్పరభావ వ్యక్తీకరణం చేసికొన్నారు. అక్కడి నుండి పెదతిరుపతి పోయారు. తిరువణ్ణామలెలో రమణ మహర్షిని కలసికొన్నారు. పుదుచ్చేరీలో అరవింద యోగిని సందర్శించారు. కాశీలో లలితానంద స్వామివారితో ముచ్చటించారు. మరి ఇతర దివ్య స్థలా లనేకం తిరిగారు. తిరిగి వచ్చారు, 1934 లో బందరు పట్టణంలో గాంధీమహాత్మునితో సంప్రదించింది మాత. మహాపురుషు లనేకు లాదరించారు. గౌరవించారు. పూజించారు అమ్మను.

ఎవ్వరినైనా 'ఒరే! ఏరా!' అని ఆత్మీయంగా పిల్చేది. అమ్మ తనను గూర్చి చెబుతూ 'వీడు' అని ఉత్తమ పురుష పుంలింగంలో మాట్టేడేది. 'నేను' పొరపాటున కూడా అనలే దెన్నడూ.

అవధూత మాతాశ్రమం క్రమక్రమాభివృద్ధిగా జొచ్చింది. వల్లూరి గ్రామస్థులు బి. హెచ్. యి. స్కూలు మాస్టరుగారు శ్రీ నోరి సత్యనారాయణగారు ఆశ్రమానికి ఒక యెకరం భూమి యిచ్చారు. ఫుడ్ యినస్పెక్టరు నాయుడుగారు నూరు రూకలు చందా యిస్తుంటారు. రాయవరంలో ఒక దేవాంగికి అమ్మ దయవల్ల సంతానం కలిగింది. ఆయనకూడా 100 రూపాయలు అన్నదానానికి వార్షిక చందా యిస్తారు. లింగవరం రామలక్ష్మమ్మగారు ఒక యకరం భూమి వాగ్దానం చేశా రాశ్రమానికి. ఇంకా పలువురు వార్షిక చందా లవీ యిస్తుంటారు.

ఆశ్రమంలో ప్రతి సంవత్సరం అన్నదానం జరుగుతుంది. పుష్య శుద్ధనవమినాడు ఆరాధన. మృగశిర కార్తిలో రోహిణీ దీక్ష. 108 సమిధలతో ఆహుతి జరుగుతుందా దీక్షలో. శరన్నవ రాత్రులలో ఉత్సవాలు నడుస్తాయి. ఇవి మాత చేసిన యేర్పాటులు.

నిత్యం త్రిసంధ్యలలో పూజాపునస్కారాలు. మంగళహారతులు. శ్రీ రాజ రాజేశ్వరీ! కన్యకాపరమేశ్వరీ! అంటూ అనేక దేవతలతో ఐక్యం జేస్తూ ఆ నాటినుండి యీ నాటివరకూ చేసే భక్తుల మంగళహారతి గీతాలు మిక్కిలి హృదయరంజకంగా ఉంటాయి చూపఱుల కందరకూ. ఆశ్రమంలో నిత్యకల్యాణం. పచ్చతోరణం.

కురుమద్దాలి గ్రామ కాపురస్థులు ఎలమంచిలి వేంకటేశ్వరరావు, బి.ఏ., బి.యల్ గారు అధ్యక్షులుగానూ బందరు, రామ్‌జీ. హైస్కూలు ఉపాధ్యాయులు పిన్నమనేని రామచంద్రరావుగారు కార్యనిర్వాహకులుగానూ ప్రస్తుతం ఆశ్రమ కార్యనిర్వహక సంఘంలో పని చేస్తూ ఆశ్రమాన్ని చాలా అభివృద్ధిలోకి తెస్తున్నారు.

అవధూతమాత ఉపదేశాలతి స్వల్పం. అతి సామాన్యం. 'ఎంత తింటావో అంత దర్మం సెయి.' 'నీ యిల్లు నువు తెలుసుకో.' అమ్మకు మొగుడు కాకపోతే తాతలకు తండెలా గవుతాడు. అనే మాట లనేక మారులు వినేవారు శిష్యులు. ఈ లాగే స్వల్పంగా చెప్పేది. చెప్పడంకంటే చేతలు హెచ్చు. ఉపదేశాల వల్లకంటే అమ్మ దర్శన స్పర్శన సాహచర్యాల వల్లనే చాలమంది తాపత్రయ విముక్తు లయ్యారు. సాలి గ్రామ స్పర్శ క్షుద్ర లోహాలను బంగారం చేస్తుంది,

సుమారు 80 సంవత్సరాలకు పైగా శరీరయాత్ర నడిపించి జీవజగత్తులో చైతన్యాన్ని చిత్కళనూ జేపింది. ముక్తికాంతా ప్రసాదం ప్రత్యక్షంగా పంచిపెట్టింది. భక్త మానవులకు శిష్యకోటికి వేదాంత సూక్ష్మాలు రేఖామాత్రంగా మాత్రం సూచిస్తూ 10 రోజులు భూశయ్యాపైన ఆరీఢ పదంలో అలంకరించి 11వ నాడు కండ్లలో కడలేని కాంతులు వర్షిస్తూ స్వస్తి శ్రీ వికృతినామ సంవత్సర పుష్య శుద్ధ అష్టమి రోజున రాత్రి 1 గంటకు (1951లో) అవధూత మాత జీవబ్రహ్మైక్య సంధాన మయింది. ఆశ్రమ వాసుల కది పరమ విషాదకాలం. లింగవరం గ్రామ కాపురస్థురాలూ లింగవరం దేవాలయ ధర్మకర్తగారూ అయిన మలిరెడ్డి మహాలక్ష్మమ్మగారు అమ్మ విగ్రహం చేయించి అమ్మ సమాధైన చోటనే ప్రతిష్ఠ చేయించారు. నిర్యాణానంతరం దబ్బాకు పల్లి గ్రామ కాపురస్థు లొక పుణ్య పురుషులు మార్చి నెలలో 20 బస్తాల బియ్యంతో పెద్ద సమారాధన చేయించారు. రుద్రాక్ష మంటపం వగైరా ఆశ్రమానికి కావలసిన వస్తుసామగ్రు లనేకం చేయించారు. 5000 రూపాయలు కర్చు చేశారు. ఆహా! బిడ్డల కమ్మపైన యెంత ప్రేమ. ఆధ్యాత్మిక బలం యెంత అమోఘం రాయైనా సూర్యకాంత మాణిక్యం శోభిస్తుంది గదా!

ఓమ్ శాంతిః శాంతిః శాంతిః.

# వార్తలు - విశేషములు

**1. దేవాలయ ధర్మకర్తల సమావేశము గుంటూరు:**

జూలై తే 25 దిన ఆంధ్రరాష్ట్రదేవాదాయశాఖామాత్యులు శ్రీకల్లూరిచంద్రమౌళిగారు గుంటూరులో ఈశాఖకమీషనరు గారి ఆఫీసులో ఆంధ్రరాష్ట్ర దేవాలయధర్మకర్తల సంఘము వారి కార్యనిర్వాహకవర్గముతోను ఆహూతులైన కొందరు ధర్మకర్తలతోను శాఖోద్యోగులతోను సమావేశ మయినారు. ఇతరధర్మకర్తలును దాదాపు రెండువందలమంది వచ్చియుండిరి. అమాత్యుల సమక్షములో సంఘమువారి యధ్యక్షులు శ్రీ దుగ్గిరాలబలరామకృష్ణయ్యగారును ఇతర ధర్మకర్తలును అర్చకసమస్యనుగురించి దేవాదాయభూముల పంపకముసమస్యనుగూర్చి అర్చకులస్వాదీనములోనున్న భూమిహక్కులనుగురించిన్ని అర్చకధర్మకర్తలరాజీలను గురించిన్ని సుదీర్ఘముగా విన్నవించుకొన్నారు. మంత్రిగారి యాహ్వానముపై గుంటూరుజిల్లా ప్రభుత్వన్యాయవాదులు శ్రీ టి. రంగారెడ్డిగారు ఇటీవల తయారుచేయబడిన అర్చక ధర్మకర్తలరాజీపత్రములోని షరతులనుగురించి శాసన దృష్ట్యా విపులముగా చర్చించినారు. ధర్మకర్తల సంఘమును సర్వాంధ్రదేశధర్మకర్తలకు ప్రతినిధిగాం జేయుటకు ప్రయత్నించవలసినదనిన్ని దీనికి రెండుమాసము లగుననిన్ని అట్లు ప్రాతినిధ్యము వహించిన సంఘముతో మంత్రిగారు ఆలోచించి ఈ సమస్యల పరిష్కారమునకు ప్రయత్నింతు రనిన్ని ఈలోపల శాఖోద్యోగులదగ్గరను కోర్టులలో నున్న పెండింగువ్యవహారములలో వాయిదా తీసికోవలెననిన్ని కాలదోషముపట్టే సందర్భములో తప్ప ధర్మకర్తలు మంత్రిగారు ఈసమస్యనుతేల్చువరకు అర్చకస్వాదీనముల భూములవిషయము కోర్టులలో ప్రారంభించకుండవనిన్ని నిర్ణయములు కాబడినవి.

మొత్తముమీద ధర్మకర్తలలో బహుళసంఖ్యాకులకు అర్చకులస్వాదీనములో దేవాలయభూము లుండుట సమ్మతము గాదని కనవచ్చినది. దేవాదాయాదాయములో భాగముగాని జీతములుగాని అర్చకులకు ఆదాయమునకు తగినట్లు ఈయవలసినదనిన్ని అర్చకత్వముహక్కు తండ్రి నుండి పెద్దకుమారుని కొక్కనికే (కరణీకములవలె) రావలెననిన్ని విధిలేని చోట్ల తప్ప ప్రతినిధి (proxy) పద్ధతి నంగీకరించరాదనిన్ని అర్చకులకు టెస్టు లుండవలసినదనిన్ని బహుళ సంఖ్యాకు లయిన ధర్మకర్తల యభిప్రాయముగా తోచినది.

**2. అంతర్వేది శ్రీ లక్ష్మీనరసింహస్వామివారి దేవస్థానము :**

పైదేవస్థానమునకు ఉభయగోదావరి జిల్లాలయందును సుమారు వెయ్యియెకరముల భూములు గలవు. ఈ దేవస్థానమునకు వంశపారంపర్యాగతమగు ధర్మకర్తలు శ్రీ మొగల్తుర్రు రాజావారు. ఈ దేవస్థానము నిర్వహణ సక్రమముగా జరుపబడుటకుగాను 1943 సంవత్సరంలో దేవాదాయ ధర్మాదాయ పరిపాలనాశాఖ క్రింపకు దీనిని తీసికొని ఎక్సిక్యూటర్ ఆఫీసర్లును నియమించినారు. ఈ పన్నెండు సంవత్సరములనుండియు యీ భూము లెచట నున్నవి, యెవరి యధీనములో నున్నవి, దేవునకు వీటి వలన యెంత రాబడి వచ్చుచున్నది, రికార్డులో ఎవరి పేర నమోజుకాబడినవి వగైరా వివరములు సరిగా తెలియనందున రాబడిలేక దేవస్థానం నిర్వహణ సరిగా జరుగుట కష్టమైనది.

నేటికి ఈ భూములతాలూకు యావత్తు తప్సీళ్ళతో సమాచారమునంతను సేకరించి 327 గురి క్రింద అక్రమముగా యీ దేవస్థానము భూములుండినవని ఎక్సిక్యూటివ్ ఆఫీసరుగారు కావలసిన యావత్తు రికార్డును సంగ్రహించి అక్రమముగా దేవస్థానము ఆస్తులను అనుభవించుచున్న సుమారు 40 మంది ఆభాసితార్చకులమీదను, 320 మంది యితర అసామీలమీదను చర్యతీసికొనుచున్నారు. ఇదియే గాక సుమారు 25 యకరములు రు. 50,000 లు కిమ్మత్తుచేసే మాగాణిభూమి యితరుల స్వాధీనంలో నున్న దానిని యే చర్య-రభస లేకుండగనే సామోపాయముచే స్వాధీనము చేసుకుని యందుపైన వచ్చేరాబడి దేవుని కైంకర్యమునిమిత్తము వినియోగించుచున్నారు.

రు. 30,000 విలువగల శ్రీస్వామివారి జవాహరీ నగలను అర్చకులనుండి స్వాధీనపరచుకుని గవర్నమెంటు ట్రెజరీలో భద్రపరిచనారు. ఇంతేగాక ధర్మకర్తగారగు శ్రీరాజావారి వద్దను ఒకలకరూపాయిలు విలువగల జవాహరీ భద్రముగా నున్నట్లు ధ్రువపత్రము తీసికొని భద్రపరిచినారు.

**3. ఆర్షవిద్యాపరిషత్ - రాజమండ్రి :**

దేవాలయములు - ఆగమములు -
పండితగోష్ఠి - ప్రముఖుల సమావేశము

ది 27-5-55 తేదీ శుక్రవారము సాయంత్రము 6 గంటలకు రాజమండ్రి విక్రమహాలులో ఆర్షవిద్యాపరిషత్తువారిచే దేవాలయములు—ఆగమములు—అను విషయమును గూర్చి పండితగోష్ఠి నిర్వహింపబడినది. పెక్కురు ప్రముఖులు పాల్గొనిరి. హిమాలయములలోని ఉత్తరకాశీ నివాసులును, వీతరాగులు, తపోధనులును అగు శ్రీశ్రీశ్రీ జగద్గురు శంకరాచార్య త్ర్యక్షకానందపురి స్వామీజీవారధ్యక్షతవహించిరి. వేదమంత్రపఠనముతో సభ ప్రారంభ

మైనది. హాజరైనవారిలో ముఖ్యులు (1) శ్రీ రాజా కాండ్రేగుల జగన్నాధగోపాలరావు జమీందారుగారు (2) శ్రీ తాడూరి శ్రీరామనరసింహరావుగారు జమీందారు కొణితివాడ, (3) శ్రీ వాడ్రేవు వెంకప్పారావు జమీందారుగారు, శ్రీ డా. టి. కనకరాజుగారు M.B.B.S. F.R.C.S. (Lond.); శ్రీ భావరాజు వెంకటకృష్ణారావుగారు M.A.B.L., శ్రీ రాళ్లబండి సుబ్బారావుగారు M.A.L.T., Prof. శ్రీ కొండూరి సూర్యనారాయణరావుగారు, శ్రీ మిత్తింటి నరసింహమూర్తిగారు B.A., B.L., శ్రీ దువ్వూరి రామకృష్ణారావుగారు B.A., శ్రీ చిలకమర్రి నరసింహాచార్యులుగారు M.A.,Bed.,B.L , శ్రీ డి. రామకృష్ణయ్యగారు M.A., Phd., Prof. శ్రీ చిర్రాపూరి అనంతపద్మనాభశాస్త్రిగారు, శ్రీ బులుసు వెంకటేశ్వర్లుగారు, శ్రీ వెన్నేటి సత్యనారాయణగారు B.A., B.L., శ్రీ వింజమూరి సుబ్రహ్మణ్యగారు B.A.,B.L., శ్రీ దిగమర్తి సాంబశివరావుగారు, మున్నగు ప్రముఖులు గలరు.

శ్రీ జగద్గురు శంకరాచార్య కాంచీకామకోటి పీఠాధిపతుల యాశీస్సులు చదువబడినవి.

మద్రాసురాష్ట్రములోను, నైజాము సంస్థానమునను దేవాదాయధర్మాదాయములకు కమిషనరుగ పనిచేసిన శ్రీ భావరాజు కృష్ణారావుగారు దేవాలయములకు సంబంధించిన తమ అనుభవములను చెప్పుచు వివిధ రాష్ట్రములలోని దేవాలయములు, అందలి మహిమలు, విశేషములు, బౌద్ధమహాయానుల ఆరాధనా క్రమము, భక్తిశ్రద్ధల తారతమ్యము, దేవాలయములద్వారా సర్వతోముఖ విశ్వకల్యాణహేతువు, ఉత్సవవిశేషములద్వారా జాతీయ జీవనవికాసము, కళాభివృద్ధి, సాంస్కృతిక వ్యాప్తి మున్నగు విషయములనుగూర్చి అద్భుతముగ నుపన్యసించిరి. ఆగమ పాఠశాలలద్వారా వంశపరంపరాగత అర్చకులకు, ఆచార్యులకు శిక్షణ లిచ్చి యోగ్యులైన అర్చకులకు నెలకు రు. 100/- తక్కువకాని వేతనము లవసరమని సలహా నిచ్చిరి. మరియు ధర్మకర్తలలోని అధికారవ్యామోహము, అక్రమ ధనకాంక్ష మున్నగు అత్యాచారములను చెప్పుచు ధర్మకర్తలకుకూడ యోగ్యతలతో పాటు ఆగమసంబంధమైన శిక్షణముల నియ్యవలెనను మహోపదేశమును జేసిరి.

తరువాత శ్రీచేబ్రోలు బాలసుబ్రహ్మణ్యశాస్త్రిగారు (అడ్వకేటు) ఉపన్యసించుచు దేవాలయముల స్థూలసూక్ష్మ, కారణస్వరూపములను, మంత్ర, యంత్ర, తంత్ర ప్రాముఖ్యమును యంత్ర భేదములచే తిరుపతి, ఘటికాద్రి మున్నగు క్షేత్ర మహిమలను, బ్రహానందాది సిద్ధుల అనుభవములను గూర్చి విపులముగ చెప్పిరి. భగవంతుడు సర్వవ్యాపకుడైనను దేవాలయములో విశేషముగ నభివ్యక్తమగుటకు గల ముఖ్యకారణములను యుక్తియుక్తముగను, సహేతుకముగను నిరూపించుచు దేవతాసాన్నిధ్యమున ఆగమ నియమము లావశ్యకములగుటచే విశేషవ్యయప్రయాస సాధ్యములై తమచే సేకరింపబడిన కామిక, కారణ, సుప్రబేద, విజయ, విమల, లలిత, బద్ధ, కిరణ, వాతులాద్యాగమములు, పద్మ, ఈశ్వర, కపింజల, విష్ణుతిలక, పురుషోత్తమ, పరమపురుష, ఆనందాది సంహితలచే ప్రతిపాదింపబడిన శైవ, శాక్త, వైష్ణవపాంచరాత్ర, వైఖానసాది ఆగమములను గూర్చి చెప్పుచు అందలి విషయసూచికలోని కొన్ని విషయములను చదివి అర్చకుల క్షణచర్య, దినచర్యలకు సంబంధించిన విధులనుగూడ ఆగమములు నియమించుటలోని యౌచిత్యమును ప్రదర్శించి సభ్యులను ముగ్ధులనుజేసిరి. ఈ సందర్భములో దేవాలయములను సక్రమముగ నిర్వహించి సముద్ధరించుటకై ప్రభుత్వపు మంత్రులుమొదలు సామాన్యాధికారులవరకు గల పాలకులు చూపు శ్రద్ధ, జిజ్ఞాస, కార్యదీక్ష, యోగ్యత మున్నగు గుణములను ప్రశంసించుచు పాలకవర్గమునకు సర్వతోముఖ పరిషత్సహకారమును వాగ్దానము చేసిరి.

తరువాత శ్రీరాళ్ళబండి సుబ్బారావుగా రుపన్యసించుచు తాము హిస్టారికల్ రిసెర్చి కేంద్రముద్వారా ఆర్షవిద్యాపరిషత్తుకు సహకరించగల మనియు ప్రచారమావశ్యకమనియు సెలవిచ్చిరి.

డా. టి. కనకరాజుగారు తరుచు ఇట్టి సమావేశముల నేర్పాటుచేసి ప్రజలకు వైజ్ఞానిక శిక్షణమిచ్చుట ఆవశ్యకమనిరి.

శ్రీమిత్తింటి నరసింహమూర్తిగారు ప్రతినెల సమావేశముల నేర్పాటుచేసి సమర్థులగు పండితుల ద్వారా శాస్త్రీయ విషయములనుగూర్చి ప్రచారముచేయించగలమని వాగ్దానము చేసిరి.

పరిషత్సభ్యులగు శ్రీ దర్భాసర్వేశ్వరశాస్త్రిగారు, శ్రీపిడపర్తి కృష్ణమూర్తిశాస్త్రిగారు, శ్రీవారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, శ్రీరేమెళ్ల అన్నావధానులుగారు, శ్రీకొండూరి అచ్యుత రామయ్యగారు, శ్రీఓరుగంటి నరసింహయోగిగారు, శ్రీ చేబియ్యం శ్రీరామమూర్తి M.A.గారు సభకు రాజాలనందుక విచారముదెల్పుచు ప్రకృతవిషయమునుగూర్చి తమ యమూల్యమైన సలహాలను వ్రాతమూలకముగ నందజేసిరి.

ఆగమముల సందర్భములో ఆగమాచార్య శ్రీ కొత్తలంక సుబ్రహ్మణ్యశివాచార్యులవారి పరిశ్రమను ఆగమానుభవమును ప్రశంసించుచు, భావిశిక్షణకార్యక్రమములో వారి సహకారము నర్థించడమైనది.

వాజపేయం సుబ్రహ్మణ్యశాస్త్రిగారి ధన్యవాదములతో సభ ముగిసెను.

## 4. ధర్మకర్తలు

కృష్ణాజిల్లా దేవాలయ ధర్మకర్తలు 1955 జూలై 7వ తేదీన బందరులో హిందూమత ధర్మాదాయముల ఆఫీసులో సమావేశమయి, శ్రీ సి. వి. యల్. వరప్రసాదరావు, డిప్యూటీ కమీషనరు వారధ్యక్షత వహింపగా ఈ క్రింది తీర్మానము లంగీకరించిరి.

1. కృష్ణాజిల్లా దేవాలయ ధర్మాదాయ ధర్మకర్తలు ఈ క్రింద వివరించిన యుద్దేశ్యములతో నొక సంఘముగా నేర్పడవలెను.

1. ఉత్తమ పండితులచే మత ప్రచారము చేయించుట.
2. ప్రస్తుతము ధర్మకర్తలకు అర్చకులకు జరుగుచున్న వ్యవహారములను సర్ది యావదాంధ్ర దేశమునకు ప్రభుత్వమువారు ఏర్పరచు పద్ధతి ప్రకారము రాజీల నేర్పరచుట.
3. ఆగమ శాస్త్ర ప్రకారము దేవాలయములను జీర్ణోద్ధరణము కావించుట.
4. ప్రతి దేవాలయములో ఆగమ ప్రకారము పూజలు జరుగునట్లు శ్రద్ధ పూనుట.
5. నిత్యార్చన విధానములను అర్చకులకు నేర్పించుటకు స్కూలులోగాని ప్రత్యేకముగ గాని ఏర్పాట్లు చేయుట.
6. విద్యార్థులకు రామాయణ, భాగవత, గీతలలో శ్లోక పఠనమునకు, వ్యాసమునకు పోటీల నేర్పరచి బహుమతుల నేర్పాటు చేయుట.
7. మత గ్రంథాలయముల నేర్పరచుట, ఉన్నచోట్ల వృద్ధి చేయుట,
8. 'ఆరాధన' పత్రికను ప్రోత్సహించి ప్రజలలో వ్యాప్తము చేయుట.

(2) ఈ క్రింది వారిని సంఘ కార్య నిర్వాహక వర్గముగా నెన్నుకొనుటయయినది.

ప్రెసిడెంటు :-శ్రీ సి. వి. యల్. వర ప్రసాదరావు గారు,

వైస్ ప్రెసిడెంటు :-శ్రీ అవటపల్లి హనుమంతరావు పంతులు గారు,

కార్యదరి అండ్ ట్రజరరు :-శ్రీ పి. వి. యస్. రాజు గారు,

జాయింటు కార్యదర్శి :-శ్రీ నర్రా వెంకటరత్నం గారు.

కమిటీ మెంబర్లు

1. కృష్ణా జిల్లా అసిస్టెంటు కమీషనరు వారు (ఎక్స్-ఆఫీసియో)
2. శ్రీ లక్కరాజు గోకర్ణేశ్వరరావు గారు,
3. శ్రీ లక్కరాజు లక్కరాజు పంతులు గారు,
4. శ్రీ అట్లూరి వెంకటేశ్వరరావు గారు,
5. శ్రీ లింగమనేని పెద కుటుంబరావుగారు,
6. శ్రీ దీవి నరసింహాచారిగారు.

(3) మత ప్రచారము కొరకు దేవాలయములనుండి యీ క్రింది విధమున ద్రవ్యమును డైవర్షన్స్ ద్వారా సంపాదింపవలెను.

రు. 5000 నుండి రు. 10000 వరకు ఆదాయముగల దేవాలయములవద్ద రు. 250 లు

రు. 10000 నుండి రు. 15000 లలోపు ఆదాయము గల దేవాలయములవద్ద రు. 500 లు

రు. 15000 నుండి రు. 20000 లలోపు ఆదాయము గల దేవాలయములవద్ద రు. 750 లు

రు. 20000 ల పైన ఆదాయముగల దేవాలయముల వద్ద రు. 1000 లు.

(4) ఈ కమిటీ వారు తమ కమిటీలో యితర ధర్మకర్తలను చేర్చుకొనుట కధికారము పుచ్చుకోవడమయినది.

(5) మరునటి సమావేశము అగష్టు తే 21 ది మధ్యాహ్నము గం. 2 లకు బెజవాడలో రామమోహన లైబ్రరీ హాలులో జరుపవలెను. జిల్లాలో గల ధర్మకర్తల నాసమావేశమున కాహ్వానించునట్లు తీర్మానించడమయినది.

---

# పాంచరాత్ర ప్రపంచః

*కౌండిన్యగోత్రః జమ్ములమడక మాధవశర్మా కలాశాలాధ్యాపకః - గుంటూరు.*

పాంచరాత్ర మి తీయం ప్రాచీనవైష్ణవసంప్రదాయస్య విశిష్టా సంజ్ఞా. బహుతిథేఽపి గతే కాలే అద్యాపి లోకే వైష్ణవోపాసకానాం మహతి సంప్రదాయే సశక్తి పాంచరాత్ర ముపలక్ష్యతే. సర్వవ్యాపకో దేవో వాసుదేవోఽత్ర ప్రధానతయా సముపాస్యః. షాడ్గుణ్యవిగ్రహో వాసుదేవో భగవాన్ యస్సోపాసకా భాగవతా ఇతి ప్రఖ్యయా విరాజంతే. వైష్ణవభాగవతధర్మస్య పాంచరాత్రసంజ్ఞాయాం కేచన విశిష్టా భావాః ప్రదర్శ్యమానా భావానాం భావనా ముద్యోతయేయుః.

1. మహాభారత శాంతిపర్వానుసారేణాయ మర్థో నిభాల్యతే. పాంచరాత్రస్య శ్రీనారాయణో నిర్మాతా. వేదచతుష్టయేన సాంఖ్యయోగసమావేశా త్పంచరాత్రానుశబ్దిత మిదం మహోపనిష దవ్యపదిష్ట మామ్నాయతే.

2. నారదపాంచరాత్రానుసారేణేదం నిశ్చేయం. వివేచ్య విషయసంఖ్యయా నామేదం సిద్ధం. రాత్రశబ్దస్య జ్ఞాన మర్థః.

"రాత్రం చ జ్ఞానవచనం
జ్ఞానం పంచవిధం స్మృతం"

పరమతత్వం, ముక్తిః, భుక్తిః, యోగః, విషయశ్చేతి పంచానాం నిరూపణే నాస్య తంత్రస్య పాంచరాత్రతా ప్రసిద్ధా.

3. ఈశ్వరసంహితా త్విదం బోధయతి. శాండిల్యః, ఔపగాయనః, మౌంజ్యాయనః, కౌశికః, భారద్వాజశ్చేతి పంచాయుధాంశాస్తే యోగినః విష్ణు మారాధయితుం తేతాద్రిం గతాః. తపస్యాం మహతీం చక్రుః. భగవాన్వాసుదేవ ఆవిర్భూయ "ఏకాయనవేదం" పృథగేకైక దివారాత్రం పంచా ప్యధ్యాపయామాస. అత ఇదం శాస్త్రం పంచరాత్ర మితీర్యతే.

4. పాద్మతంత్ర మిదం సూచయతి. శాస్త్ర మిదం సర్వోత్కృష్టం. పంచేతరాణి శాస్త్రాణి మహాంత్యపి రాత్రీయంతే. అతః పాంచరాత్రం.

5. విష్ణుసంహితాప్రతిబోధ స్త్వయం. పంచగోచరాః శబ్దాదయః మహాభూతావా. రాత్రయః. తతః పంచరాత్ర మిదం. పరం తేజో ఉవాప్య ఏతాః పంచరాత్రయో నశ్యంతి. తదిదం పాంచరాత్రం సర్వాజ్ఞానవినాశనం.

ఏవంప్రాయం పాంచరాత్ర నిర్వచన మన్యాన్యత్ గ్రంథేషు దృశ్యతే. పాంచరాత్రసంప్రదాయ ఏకవిధోప్యాదౌ పరంపరాప్రాప్తో విచ్ఛిన్నప్రాయో మాభూ దితి ప్రవర్తకాచార్యై స్తదా తదా తథా విలక్షణతయా వ్యాఖ్యాతః. పాంచరాత్రసిద్ధాంతోద్గమః కుత్ర? ఇతి మీమాంసా తు కర్తవ్యా. పరం పాంచరాత్రమతానుసారేణ పంచభిః వ్యాపారైః సాధకో భక్తః భగవంతం వాసుదేవం ప్రసన్నం చికీర్షతి.

1. అభిగమనం ప్రథమో వ్యాపారః మనోవాక్కాయై రవహితస్సన్ దేవాయతనం గచ్ఛేత్.

2. ఉపాదానం ద్వితీయః. నిత్యం పూజాద్రవ్యార్జనే యత్నవా న్భవేత్.

3. ఇజ్యా తు తార్తీయః. సా హి పూజా.

4. స్వాధ్యాయ స్తు తురీయః. అష్టాక్షరమంత్రజపః, అధ్యాత్మికగ్రంథాభ్యాసః ఇతి.

5. యోగః పంచమః. ధ్యానం తదర్థః. అత్ర పంచకే న కస్యాపి విమతిః; చతుర్వ్యూహవాద స్యాపి వేదానుకూలతామేవ సాధయితుం కృతయత్నానాం శ్రీమద్రామానుజ భగవత్పాదానా ముత్పత్త్య సంభవాధికరణభాష్యం పరిశీలయంతు భావాః.

శతపథే తు శ్రూయతే పాంచరాత్రసత్రం. సర్వాధిపత్య సంప్రాప్తయే నారాయణః సత్ర మకరోత్ పాంచరాత్ర మితి. మహాభారతేతు చిత్రశిఖండిప్రభృతాభి స్సప్తర్షిభిః వేదేభ్యో రహస్యం పృథక్కృత్య పాంచరాత్రం శాస్త్రం ప్రణీత మిత్యపి దృశ్యతే. సంహితాసు తంత్రేషు బహుత్ర బహుత్ర బహుధా సముపలభ్యమాన మిదం పాంచరాత్ర తత్త్వం శ్రద్ధయా భాగవతై రవధేయం. యథామ తీదం వితనిష్యామః.

---

# సంస్కృతభాషాప్రాశస్త్యం

*పండిత. వాజపేయం సుబ్రహ్మణ్యా శాస్త్రీ,*
కార్యదర్శీ ఆర్షవిద్యా పరిషత్—రాజమండ్రి.

సువిదిత మేవైత త్సమేషాం విద్వదగ్రేసరాణాం య దేతస్మా ద్బ్రహ్మాండమండలమండనాయమానాత్ భారతా ద్వర్షా త్పవిత్రతరో దేశో నాస్తీతి. య దత్రైవ హి సకల దేవతాత్మా హిమాలయో నామ నగాధిరాజః శీర్షస్థాన మలంకరోతి. య త్పున రత్రైవ హి భాగీరథీ, గోదావరీ, కృష్ణా, కావేర్యాది దివ్యాతిదివ్య తరంగిణ్యః స్వేయమధురాతిమధుర మంగళమయ మనోహర పరమపావనవారి ధారాభి స్సంప్లావయంతి. అత్రైవ హి శ్రీమదఖిలాండకోటి బ్రహ్మాండనాయకస్య, పురాణపురుషస్య రామకృష్ణాద్యవతారాఖ్యా దేదీప్యమాన స్నిగ్ధసుందర కమనీయకాంతిమయ మనోహరమూర్తయః నిఖిలలోకరక్షయా పునః పునః ప్రాదుర్భవంతి.

అపిచ అత్రస్థైరేవ భక్తైః శ్రీకృష్ణచంద్రస్య, వ్రజేంద్ర నందనస్య, శ్యామసుందరస్య, మదనమోహనస్య, గోపాల బాలకస్య అనంతానంతసౌందర్యమాధుర్యసౌగంధ్యసౌరభ్య పరిపూర్ణ మంగళమయశ్రీపాదారవింద మకరంద రసనమాస్వాదన మాద్రియతే, పరమపదా ద ప్యధికతరత్వేన. ఏత ద్దేశప్రసూత స్యార్యజనస్య సకాశా దేవ స్వం స్వం ధర్మం

ప్రజానంతి. పృదివ్యాం సర్వమానవాః ఏత ద్భారతం వర్ష
మేవ పూజ్యతమానా మార్యాణాం భారతీయానాం జన్మ
భూమిః ఏషైవ వసుమతీ సముద్రవసనా పర్వతస్తన
మండితా సతీ విష్ణో రర్ధాంగహారిణీ త్యారాధ్యతే బుధైః

ఏతస్మి న్నేవ దేశే అఘటితఘటనా సామర్థ్యసహితస్య
అచింత్యానంతశక్తిమతః పరమేశ్వరస్య సాక్షా న్ముఖపంకజా
దయత్ననిసృత నిశ్వాసవ్యాజేన నిర్గతశబ్దబ్రహ్మరూపా
వేదాః ఆగమాశ్చ గైర్వాణ్యా వాణ్యా సముల్లసంతః, అమర
సరస్వతీవ లోకా న్పావయంతః, శ్రౌతస్మార్తనిత్యనైమిత్తిక
కామ్యాదికర్మణాం మూలభూతా స్సంతో మాతే వోద్భా
వయంతః అచేతనానపి సచేతనా న్కుర్వంతో ఽప్రతి
మానపీయూష మివ ప్రతిభాస్వంతః, స్మృతిపురాణేతిహాస
న్యాయమీమాంసాయోగసమయ కావ్యాది భారతీయవిద్యా
కలాపరూపేణ పరిణతా దేహినాం కామధేనుభూతా స్సంతో
విజయతేతరామ్"

భగవా న్వాసుదేవః జ్ఞానైశ్వర్యశక్తి బలవీర్యతేజోభి
స్సదా సంపన్నః సృష్ట్వేదం జగత్తస్య చ స్థితిం చికీర్షుః
మరీచ్యాదీన్ సనకసనందనాదీన్ శ్చోత్పాద్య ప్రవృత్తినివృ
త్త్యాత్మకం, వేదోక్తం ధర్మం గ్రాహయామాస. స ద్వివిదో
హి ధర్మః అతీంద్రియజ్ఞానవిశిష్టైః మహామేధావిభి ర్ధార్య
మాణః శ్రేయోర్థిభి ర్వర్ణిభి రాశ్రమిభి శ్చానుష్ఠేయమానః
తత్ర తత్ర భగవతా లోకానుజిఘృక్షయా సంస్థాప్యమాన
శ్చ విరాజతే.

పూర్వతరా మహర్షయ ఏవ విజ్ఞానశాలినః, వయం తు
తైః పరంపరయా ప్రసాదితం గళితం చ జ్ఞానలేశమేవ
ధారయా మేతి సాంప్రదాయకానాం భారతీయానామ్
మనీషా. ఏవం సతి ఇదానీంతనానాం అధునికానాం కేషాం
చిత్ నాగరికతాగ్రస్తానామ్ మతే తు భగవా నాదౌ జడాన్
మంచా నేవససర్జ. తే జడా స్తు క్రమశః స్వత ఏవ లోక
జ్ఞానం వర్ధయంతః ప్రాజ్ఞాః ప్రాజ్ఞతరా శ్చ భవంతీతి
హేతువాదరతి ర్భూయసీ.

కైశ్చి త్పాశ్చాత్త్యైః భారతీయ సంసర్గాతిరయేన పురాకృత
పుణ్యలేశపరిపాకవశేన చ భారతీయానాం జగద్గురుత్వం,
భారతీయభాషాయాః సర్వభాషామాతృత్వ మవగత్య స్వేషా
మపి భారతీయత్వం వేదానుయాయిత్వ ముద్ఘోష్యతే.
కైశ్చి ద్భారతే దేశే పునర్జన్మ తత్తత్సాంప్రదాయావలంబనం
చ ప్రార్థ్యతే. పాశ్చాత్త్యై రేవం భావ్యతే—వైదికభాషా ఆర్య
భాషేతి, వేదా ఆర్యాణా మక్షీణా నిధయ ఇతి; వేద
భాషాయా ఏవ పర్షియన్, పాళీ, సంస్కృతాఖ్యాశాఖా
ఉత్పన్నా ఇతి, పునః పాళీభాషాయాః అరబిక్, గ్రీక్,
లేటిన్, జర్మన్, ఫ్రెంచ్, కెల్టిక్ ఇత్యాద్యా ఉత్పన్నా ఇతి
చ ఆంగ్లభాషావిషయే తు సా సాక్షా ద్వేదభాషాయా
శ్శాఖేతి, ఆంగ్లానా మాచారా ఆర్యానుగతా ఏవేతి చ కిం
త్విదానీం ఖిలా స్సంతః నిమ్నజాతిసారూప్యం గతా ఇతి
తే వదంతి ప్రవదంతి చ,

అపి చేదానీం పాశ్చాత్త్యై ర్విశ్వవిద్యాలయేషు సంస్కృత
విద్యా సనిర్బంధ మభ్యస్యతే రామాయణభారతాదయ
స్స్వీయభాషాసు ప్రకాశ్యంతే హి.

ఏవం సతి అస్మదీయైః కైశ్చి త్పాశ్చాత్యసంప్రదా
యాంధ, తమోంధచక్షుష్కైః, నాయకం మన్యమానైః,
నాస్తికపత్రికాప్రచాలకవరాకై రాభిజాత్యరహితైః
ఆంగ్లేయా ఏవ ఋషయః, ఆంగ్లభాషైవ దేశభాషా ఇతి
కృత్వా వేదానుయాయినః సంస్కృతభాషాభిమానినశ్చ
అనుచితకర్మాణః, అనాలోచితకర్మాణ శ్చేత్యభ్యూహ్యతే.

అత స్త ఏవ మృతా యే అమృతమయీం పరమ మంగళ
కరాం, మనోహరా మమరసరస్వతీం మృతభాషేతి వదంతి.

ధన్యాస్తే యే తదుద్ధరణాయ యతంతే ప్రయతంతే చ.
ధన్యైషా పత్రికా యా సంస్కృత ప్రచారాయ బద్ధకంకణ
హస్తా. ధ న్యైషా ధర్మాదాయపరిపాలనశాఖా, యస్యాం
సంస్కృత భాషాభిమానినః శ్రీ వేంకటరెడ్డి వరప్రసాద
రాయాద్యా మహాశయా నియుక్తాః ఏవం సర్వతోముఖ
విశ్వకల్యాణహేతుభూతసంస్కృతభాషాయాః సనిర్బంధా
భ్యసనే బద్ధాద రోయ మమాత్యశేఖరః శ్రీ చంద్రమౌళి
మహాశయః ధన్యో ధన్యః పునః పున ర్ధన్యః.

ఏవ మిదానీ మవశ్యకర్తవ్యతయా ప్రాప్తగైర్వాణవాణీ
ప్రచారణోద్యుక్తరాజకీయధురంధరాః, పండితప్రకాండాః,
పత్రికాసంపాదకాదయ శ్చ శ్రీమన్మహారాజ రాజేశ్వరీపూర్ణ
కృపాపాత్రభూతా స్సంతః శ్రేయాంసి భూయాం
స్యవాప్నుయుః.

'ఆరాధనా' ఖ్యా పత్రికా చైషా ఆర్షసమ్ప్రదాయప్రకటన
ద్వారా ధర్మతత్త్వబోధనేన లోకహితప్రవృత్తా సతీ చిరం
జీయా దితి చాశాస్మహే వయ మితి శమ్.

---

यो॑ऽन्तस्त्रिष्वशेषस्य पश्यतीशः शुभाशुभम् ।
तं सर्वसाक्षिणं विष्णुं नमस्ये परमेश्वरम् ॥

# MACHERLA TEMPLES

*By*

N. RAMESAN M.A., I.A.S.
*Deputy Secretary, Home Department, Kurnool*

Macherla, the seat of a Deputy Tahsildar, is an important and ancient place in Palnad Taluk of Guntur District. It is situated at a distance of about 15 miles from Gurzala, the Head-quarters of Palnad taluk, and is only about ten miles, as a crow flies, from the river Krishna. It is the last railway station and is connected by a good motorable road with Nagarjunakonda, the seat of the Buddhist remains, of the reigns of the Ikshvaku kings of Andhra of the 2nd and 3rd centuries A. D. Macherla is, as it were, the very heart of Palnad, a name which still evokes warm and thrilling memories in the minds of the people, connected as it is with the "Palnad Heroes" or "*Palnati Veerulu*" and their heroic exploits.

The Palnad tract, which is geologically so intersting, and not fully exposed so far, lies on the right bank of the river Krishna, from a point roughly 120 miles from the sea. It is bounded on the north and west by about 75 miles of the river, and the south and east sides are shut in by hills and forest land. This tract, contains a large quantity of marble, thowing up in long regular ridges, which imparts a snowy appearence peculiar and characteristic to the tract. It is out of this stone, that the celebrated sculptures of Amarāvathi, Nāgārjunakonda, Gāli, Bhattiprolu etc. were done. The tract measuring nearly 1000 square miles, is undulating rocky country, interspersed with hills and low forests. The area is completely dry and very thinly populated and is perhaps the poorest taluk of Guntur, but with the advent of the Nandikonda project, the site of which is only 13 miles from Macherla, the position is bound to change.

In the midst of this arid dry and poor tract, this Macherla, with its majestic *Chennakesvaswami temple*, and with many other smaller temples, is an undying reminder of the '*Palnati Veerulu*', whose memory is still fondly cherished by the inhabitants. Temples have been erected in their honour, poems have been written, and all people, without distinction of caste or creed, vie with one another in doing homage to the heroes, whose names and exploits have become legendary. Many celebrated poets have sung these deeds in immortal verses, the most notable among them being '*Palnati-Vira-charita*' by Kavi-Sarva-Bhauma Srināthabhatta, written in beautiful '*manjari-dwi pada*' metre, and in a style, which is his own, and widely noted for vigour and originality. The poem is a war song, and reads so, under his magic touch. It thrills listeners to this day and rouses even a worm to heroic deeds. Several others like Mallayya, Kondayya, and Mudikonda Virabasavakavi have sung these and the tradition of Palnad heroes is as strong as ever in Palnad. Macherla was the seat of the kingdom when the exploits were done, and the temple of *Chenna kesava swami* is said to have been built by Brahma nayudu, who took such a leading part in the war of Palnad.

The Temple of Sri Lakshmichennakesavaswami varu is a majestic and imposing one. It is situated on the banks of the river "*Chandra vanka*", a tributary of river Krishna and the temple is located at



*Prakara Gopura, & Dwara*



*Main Shrine*



*Palanadu War Weapons from Karempudi; (battle site)*

*Exquisite Stone carving Near Naga pillar*



*Beautiful carved column in the court yard*



గోపాళ్ళ ఉద్ధవుని బంపినాఁ డా ప్రేమమయుఁడు. తన మేనత్త కుమారులైన పాండవులను సరిగ చూడ మని కౌరవేంద్రుఁడు ధృతరాష్ట్రుని కడకు అక్రూరునిఁ బంపినాఁడు.

## 2. రసరాజ్యము - తెనుగువారు

కృష్ణచరిత్రమున ప్రాయికముగా రసమయకాండ మింతటితో సమాప్త మగుచున్నది. తదుపరి కృష్ణుఁ డుపదేష్ట; భక్తులు తన్ను స్తుతింపఁగా వారి యంతరంగముల లోతులు తరచి చూచి వారివారి కనుగుణములగు తరణోపాయముల నుపదేశించువాఁడు. అయినను రసకాండ పూర్తిగా త్యక్తము కాలేదు. దశమస్కంధోత్తరభాగ మందలి రుక్మిణీనర్మఘట్టము, రాత్రి షోడశసహస్రరాజకన్యల విరహగీతము, అను రెండుచోట్ల మాధుర్యవాహిని జాలువారుచున్నది. కాని బృందావనకృష్ణుడు రసమయ మూర్తి, తదుపరికృష్ణుడు జ్ఞానమయమూర్తి. ఇట్లనుటచే కృష్ణునం దొకప్పు డొకటిమాత్రమే యున్న దనుట గాదు. ఆయన యానందము ఘనీభవించిన మధురమూర్తియే 'ఆనందఘనః'. ఇతరుల కెట్లు తోఁచుచున్నాఁడో వారియం దేయేరసముల నాయనస్పర్శ బయటికిఁ దెచ్చుచున్నదో దానిని బట్టియే యీ విభాగము. మన దురదృష్టమున రుక్మిణితోడ సల్లాప మేలకో రసవర్జ్యమై యంతరార్థముల వేదాంతోపదేశముగ శుష్కముగా నున్నది. షోడశరాజకన్యల విరహగీతము పరిత్యక్తమయి యున్నది. అది రససిద్ధాంతపథము. మచ్చున కొకటి.

'మేఘ, శ్రీమన్, త్వ మసి దయితో, యాదవేంద్రస్య నూనం
శ్రీవత్సాంకం వయుమివ భవాన్ ధ్యాయతి ప్రేమబద్ధః ।
అత్యుత్కంఠః చపలహృదయః అస్మద్విధః బాష్పధామః
స్మృత్వా స్మృత్వా విసృజసి ముహుః దుఃఖదః తత్ప్రసంగః' ॥

ఓయీ శ్రీమంతుఁడా, మేఘా, నీవు నిజముగా యాదవేంద్రునికి ప్రియుడవు గదా! (ఇంద్రునికి మేఘుడు ప్రియుడే గదా. కృష్ణునికి నీలవర్ణమేఘు డిష్టు డెట్లు కాక పోవును) ఆయనను శ్రీవత్సాంకుని మావలె నీవును ప్రేమబద్ధుడవై ధ్యానించుచున్నావు. (శ్రీవత్సము) ఆ గుర్తుగల కృష్ణుడు నిద్రపోవుచున్నాడు. అది కలవా డింకొకడు లేడు. ప్రేమచేఁ గట్టుపడి నీ వెక్కడకు పోలేవు. మాటలాడ లేవు. ఊరక భావావేగమున మౌనముగ ధ్యానించుచున్నావు. నీకు ఉత్కంఠ మిక్కిలిగా నున్నది. నీ హృదయము వానియందు చపల మైనది (నీకు చపల-అనగా మెరపుతీవ; బంగారు తీగవలె నీ హృదయము మాకు స్పష్ట మగుచున్న దనుట.) అనుకొని అనుకొని మాటికి మాటికి బాష్పధారలు విడుచుచున్నావు. ఆతని ప్రసంగము దుఃఖద మోయి (ఆతని మాటలు) విరహమున తలపునకు వచ్చినప్పు డెల్ల బాధించును. అతనియందు యాసక్తియే యట్టిది.)

* * *

తెనుగు వారి కూస్వత చెప్పలేదు. వారికి శృంగారరసాధిదైవముగా సత్యభామ దొరకినది. వా రామెను రససామ్రాజ్యమున కధీశ్వరిని చేసినారు. రసప్రవాహములు పొంగి తెలుగునేలలను మృదుమధురములుగ చేసినవి. అందు మొలక లెత్తినది సంజీవన మైన రాజొపసము. ఈ పుణ్యము గట్టుకొన్నది సిద్ధేంద్రయోగి. ఆయన భామకలాపము శృంగారమందలి సూక్ష్మతమైకభేదములను నిష్ఠతో సంగ్రహించినది. కూచిపూడిభాగవతు లీయమృతమును తెనుగు మాగాణముసందుఁ బంచుటకు నియుక్తులైనారు. ఈ వాహిని తరువాత తంజావూరుదాక ప్రవహించినది. కాని యిప్పటికి మిగిలియున్నది తెనుగు దేశమునందే.

సిద్ధేంద్రుని ప్రభావమునకుతోఁడు ముక్కుతిమ్మనగారు నీ రసమును వ్యాప్తికి తెచ్చినవారే. ఆయన ముద్దుపల్కులు ఆంధ్రచక్రవర్తి కృష్ణదేవరాయని మురిపించినవి. ఆయన పల్కులు కమ్మందనము చక్రవర్తి యంతఃపురమునను జొచ్చి అందలి కలతలను సమరసపరచినదందురు. పారిజాతాపహరణమునందు మొదటి యాశ్వాసము లనుభవింపని వానికి తెనుగు ప్రబంధహృదయము తెలియ దనియే చెప్పవచ్చును. అక్కడి 'భామ'గారు కేవలము తెనుగుభామయే. ఈనాటికిని ఈ భామప్రభావము తెనుగు స్త్రీలపైఁ జూడవచ్చును. కృష్ణుని దక్షిణనాయకత్వముకూడ ఈ రేఖయే 'గిరీశము'గారి కింత ప్రాముఖ్యత నిచ్చిన దన్నను తప్పు లేదేమో; మొత్తముమీద తెనుగువారు తాము వలచినవారు పాదతాడనము చేసినసూరకుందురు; తమ తిరస్కారమునకు (కారణమున్నను లేకపోయినను) పాత్రులైనవారు తమ్ము మెచ్చినను కన్నుమూని లేచి వారి యాదరమును బోగొట్టుకొందురనుట వారి యాధునిక సంఘ జీవనమే ప్రమాణము.—భవతునామ!

* * *

నారాయణతీర్థు లింకొకరు కృష్ణలీలానుభవమున తన్మయత్వము నందినవారు. ఆంధ్రులేకాని వారి రచనల కీదేశమున స్థానము లభించినది కాదు. వారి రచనల ప్రాదుర్భావమే అరవదేశ మందలి వరాహపురియందు. (కొందరు వరాహపురి తిరుమల యందురు గాని చరిత్రకారు లొప్పిన వాదము కాదు.) కాని తరంగములు తమిళదేశ

ము. నభినవ్యాప్తి సంపించి తెనుగువారా తరంగకీర్తనలందలి లయవిన్యాసముల నాదరించువారేగాని రసభావ ముఖ్యముగా నాస్వాదించువారు తక్కువ. అసలే తీర్థుల రచనయందు వేదాంతపుకషాయ మెక్కుడు. స్వామిబాహ్య రూపవర్ణనయందు ఆయనగుణవర్ణనమునందు ప్రసక్తి ఎక్కువగఁ గానిపించుచున్నదిగాని భావరసముల తీరులకు సృష్టియుంచినట్లు లేదు. ఈ మాటలకు తెలుఁగు పెద్దలు మమ్ము క్షమింతురుగాక. తీర్థులకు తన్మయత లేదని యనుటకు లేదు. ఆయన కీర్తనల బాడుచుండగా స్వామి ఆయన యెదుట తదనుగుణముగ నృత్యము సేయువారట! ఒకనాడు కీర్తనసౌందర్యమునను భవించుచు గోపాలమూర్తి తప్పడుగు వేసెనట. తీర్థుల వారికి కోపము వచ్చి తంబురతో నొక్కటి కృష్ణుని భుజమున వడ్డించిరట. పూజాసమయమున మూర్తిభుజమున కదుము గాంచి 'ఇది యే'మని తీర్థు లడిగిరి. కృష్ణుఁడు కారణము నెరిగించెనట. 'చూడు, నీవుకూడ తాళమున ప్రమాదపడవచ్చునా, ఇఁక నట్లు చేయకు' మని యూరార్చిరట. తెనుగువారీకీర్తనల ననుభవించు విధానమునే మేము పేర్కొంటిమి. విశ్వనాథునివారి 'వేయిపడగలయం'దు తరంగకాలక్షేపముప్రశంస యున్నది. ఆంజనేయులుగారు 'బాలగోపాల' తరంగము నెత్తుకొనిరి. మృదంగమువాని చేయి పడిపోయినది! వాయులీనమువాఁ డెన్నడో విరమించియున్నాఁడనుట ఆ ప్రసక్తియందు గ్రంథకారుల మెచ్చుకోలునకుఁ బరమావధి యయినది. పిండితార్థము:—తరంగములందు రసానుభవము తక్కువ. రసమును నృత్యము చేయు విలాసినులందు పోయవలసినదియే. స్వోద్భవముగ రస మందు వెలయదు. తరంగములును రుక్మిణీకల్యాణముతో ముగియుచున్నవి.

## 3. రసఘట్టములు

కృష్ణునిశైశవలీలలందు రసవరుక్షము లైనవి బాలక్రీడలు వేణుగానము రాసక్రీడ అను నువంతములు. సర్వమునకును symbolic అంతరార్థమును జెప్పువారి నటుండనిచ్చినను ఈమూటివలని యానంద మాబాల గోపాలము ననుభవించువారే. ఇందును సంస్కృతభాగవతమునందలి బాలక్రీడాదికమును జదువునపు డనుక్షణము కృష్ణుని భగవత్త్వమే భోగ్య మగుచున్నది గాని అందు శృంగారవాసనలు తెనుగుభాగవతమునందువలె వెగటు గొల్పవు. ఉన్నటు లనువదించిన తెనుగువా రొప్పరని భావించినాడేమో పోతన. భార్యాభర్త లేకతమున నున్నపుడు కృష్ణుడు పాము వైచినాడట. చూలగుటకు నేమూలముచెప్పు మన్నాడట. తను భర్తగ నైకొన్న సంతానము కల్గునన్నాడట. ఇట్టి వికారములు లేక సంస్కృతభాగవతమున కేమి లోపము వచ్చినదో తెలియుట లేదు. సోదరభారతభాషలం దీవికారము లున్నట్లు కానరాదు. ఈ వికారమునకు సంతరార్థములు వ్రాయుటకు మనవారి బుద్ధికౌశలము వెనుదీయదు. జనుమంచివారిన్నింటికి తమ 'కృష్ణావతార తత్త్వమున నొకలక్షకోటి వ్యాఖ్యానములు చేసినారు. ఒకపాటిసాహితీపరులకును సంస్కృతభాగవతము నభ్యసించివారికిఁగూడ నీయంతరార్థములు స్ఫురింపవు. స్ఫురింపనివి ఉత్తమార్థములెందో నిగూఢముగ నుంచి బహిరర్థముల జుగుప్సాకరములుఁగ తీర్చుట ఆంధ్రకవులసంప్రదాయము కాఁబోలు. అట్లనుకొనుట కెఱ్ఱనగారిహరివంశము అడ్డువచ్చుచున్నది. లలితతమముగ బాలక్రీడను వర్ణించినాడు ప్రబంధపరమేశ్వరుడు.

బాలలీలారసము ననుభవించినవారలలో సూర్‌దాస్ లీలాశుకుల నుత్తమశ్రేణిలోఁ జేర్చవలసియున్నది. సూర్‌దాస్ అంధుడు కృష్ణప్రేమచే సర్వవిషయముల నంధుడే యయినాడు. గోపాలకుఁడే అతని కైహికమునకు ఆముష్మికమున కూతగఱ్ఱ. కనుక తనవాత్సల్యరసమును స్వామిపై నతడభిషేకము చేసినాడట. హిందీసాహిత్యమున నతని శశియని తులసీదాసును సూర్యుడనియందురు. ఎట్లయినను గ్రుడ్డికవి హోమరు 'ఇలియడు'నకు గ్రుడ్డికవి మిల్టన్ 'పారడైజు లాసు'నకు గ్రుడ్డికవిసూరుని కవిత్వమునకు ప్రపంచమున తారాకాంతి తప్పలేదు. శాశ్వతప్రభ లీనుచుండును. కాని అతని కవిత్వము భారతదేశజను లందరికిని గ్రోలగలది కాలేదు. అతఁడుగాని ఖాఖానాను గాని మనసు ద్రవించు కవిత్వమును హిందీయందు నిక్షేపించినారు. లీలాశుకులు తమప్రేమామృతమును సర్వభారత సాధారణమగు సంస్కృతమునం దుంచుటచే ఆసేతుశీతాచలము ఆ యమృతవాణి నిత్యోపభోగ్య మగుచున్నది. లీలాశుకులే పూర్వాశ్రమమున మళయాళ రాజ్యమున భారతనదీతీరమునను్న 'కోదండమంగళ మున కగ్రహారికులు. వారు సన్యాసము గ్రహించిన తర్వాతిదేమో ఈ కర్ణామృతము. ఇది కేవలము శ్రీకృష్ణునికే కర్ణామృతముగాదు. వినువెల్లరకు

'ఈశానదేవచరణాభరణేన నీల
దామోదరస్థిరయశస్తబకోద్గమేన ।
లీలాశుకేన రచితం తవ దేవ కృష్ణ
కర్ణామృతం వహతు కల్పశతాంతరేపి ॥

'వహతు' అననేల? ప్రవహించుచునే యున్నది. కావుననే 'ఇంత కర్ణానంద మేమి' యని చైతన్యమహాప్రభువీగ్రంథమును దక్షిణదేశమునుండి తమవెంట గొంపోయిరఁట.

గోపాలాచరితమును బాలకాది వయోభేదముల నెంచు టయే తప్పు. ఒక్కొక జనునిమనస్సు ననుసరించి ఆయన వానికి తోచుచుండెను.

'మల్లానాం అశనిః, నృణాం నరవరః స్త్రీణాం స్మరో మూర్తిమాన్
గోపానాం స్వజనో, ఽసతాం శాస్తా, స్వపిత్రో శ్శిశుః, ॥
మృత్యు ర్భోజపతేః విరా డవిదుషాం తత్త్వం పరం యోగినాం
వృష్ణీనాం పరదేవతేతి విదితః........ ॥

సకలసభాజనుండు స్వామి, మల్లులకు పిడుగు(రౌద్రము) నరులకు నరవరుడు (అద్భుతము), స్త్రీలకు మూర్తి దాల్చిన మన్మథుడు (శృంగారము) గోపకులకు స్వజనము (హాస్యము) దుర్మార్గులకు శాసకుడు (వీరము) తల్లిదండ్రు లకు శిశువు (దయ) అట్లట్లు.

## 4. వేణుగానము

వేణుగానలీల త్రిలోకసమ్మోహక మయినది. పంచ భూతములలో ఆకాశధర్మము నాదము; సృష్టి క్రగేనరము. దానిశక్తి అప్రతిహతము. మనసు నది యాకర్షించునట్లే దియు నాకర్షించును. గోపాలుని వేణువునందలి మోహక శక్తి వేణువువో దానిరంధ్రముల బూరించు మారుతునిదో, లేక గోపాలాధరప్రభావమో గోపీభోగ్యమైన గోపాలాధరము నందలి అమృతము వేణురంధ్రమున ప్రవహించినదో విన్నవా రెల్ల, విన శక్తి లేని యచేతనములుకూడ ముగ్ధము లైనవి; దానిశక్తికి గోపిక లనుచున్నారు 'చెలులారా, ఈ వేణువుభాగ్యమేమి! దీనిభాగ్యమునకు (వృక్షజాతిలో చేరినందున తండ్రులగు తరువులును తల్లులవలె నీరు పోసి పెంచిన నీటిమడుగులును పులకరించి యానందా శ్రువుల మధుధారామిషమున దాల్చినవి." లీలాశుకు లందురు "కి మప్యంతస్తోషం దదతి మురళీకేళినినదాః" మురళీనాదము లంతరంగమునకు ఏదో అనిర్వాచ్యమగు సంతుష్టి నిచ్చుచున్నవి" అని వారు తృప్తినొందుదురు. ఆయనకటాక్షములకు మాధుర్యము మురళీనినాదముల ననుసరించుటచేత వచ్చినదట. ఆయనమురళీనినాద ములు తమసమాధిని భంగము చేసినను చాలును వారికి. 'త దేవ లీలామురళీరవామృతం సమాధివిఘ్నాయ కదా ను మే భవేత్' ఆగీతము 'మధుస్ఫీతము' తేనెలు నిండి నది 'కిమపి మధురా చాపలధురా' ఏదో మాధుర్యమం దున్నది. దాని కొక్క క్రమమును లేదు. ఎట్లది ప్రవహిం చునో లీలాశుకులు ఆ వేణువునే స్వామికి తమ దశను విన్నవింపుమని అంతగా దానిని గౌరవించినారు "అయి మురళి కథయ రహసి కర్ణే మద్దశాం నందసూనోః."

మురళీనాదశక్తి లోకము నెట్లు వశీకరించినది భాగ వతము నందలి శ్లోకామృతములు వెల్లడించుచున్నవి. దశమస్కంధమునందు ౩౫ అధ్యాయమున 'ఆ నాదముచే కొండమీది సకలసత్త్వములును తమ చేష్టల నుడిగినవి. దేవతాస్త్రీలును దానిని విన్నంత నుద్రేకముపాలై వస్త్రబంధ ములనే మరచినారు; మృగశిశువులు తల్లులపాలు త్రాగుచు దానిని మాని కన్నులు మూసికొని కన్నీరు పెట్టుకొన్నవట; కన్నులు మూసికొని ఆ గీతమును వినుచున్న మునులు బహుశః మును లేమో! నదులు గీతమునకు సాక్కి ప్రవ హించుట మాని ఎదురెక్కి ఆయన పాదస్పర్శమునకై గతులు తిరిగినవి.' శుకు లింత వర్ణనచేసినను వారికి తృప్తికాలేదు. ముప్పదియయిదవ యధ్యాయము (దానిని 'యుగళగీత' యందురు; రెండు శ్లోకము లొక్కటిబావ మును వర్ణించును. అమృతస్యంశము ఆయన వామ బాహువునందు వామకపోలము నుంచి భ్రూచాలనము చేయుచు ఎప్పుడు పూరించునో వేణువును, అపుడు వ్యోమ యానులైన సిద్ధుల వనితలు గుంపులు గుంపులు గూడి వ్రజమునందలి వృషములు మృగములు గోవులు చెట్టుల మీది మయూరములు నదులు వనలతలు తరువులు సరసి నున్న జలవిహంగములు మేఘములు దేవలోకవాసులు ఎట్లెట్లు పరవశము లైనవో, అపారవశ్యమున నెట్లు మేనులు మరచినవో కనులం గట్టుచున్నది. పోతనార్యునివాక్కీఘట్ట మున రసప్రవాహము అయ్యును సంస్కృత భాగవత మును, ఈ ఘట్టమును జదువుదుమేని ఆ పారవశ్యమున పతితలగు మనముండము. తెనుగుభాగవతపఠనకాలమున మనముండుము. ఉండి యనుభవింతుము.

## 5. రా స క్రీ డ

కృష్ణవృత్తాంతమున రాసక్రీడయంత వివాదముల కాస్పదమైన విషయము వేరొండు లేదు. కృష్ణుడు గోపి కల ననుభవించెనని గొందఱు. కాదని గొందఱు. అర్థ ములు టీకలు సారస్యములు వివరణములు ఈరెండు వాదములవారును వర్షింతురు. భాగవతమునం దున్నది ఈమాత్రము. ఇరువురి గోపికలమధ్య నొక్కొక్క కృష్ణుడు ఒకచేత నొకరి కంఠమును ఇంకొకచేత నింకొకరి కంఠ మును కౌగిలించినాడు. అ 10-దశమస్కంధము. ఒకతెకు తాంబూలచర్వితము నిచ్చినాడు. ఒకతె యతని అతని హస్తమును తన స్తనముల నుంచుకొన్నది. శ్లో: 8. 'ఏవం పరిష్వంగ, కరాభిమర్శ స్నిగ్ధేక్షణోద్దామ విలాసహాసైః' శ్లో 27. 'సిషేవ్య ఆత్మన్యవరుద్ధసౌరతః' ఇంద్రియస్ఖలనము చేయక క్రీడించినాడు. అనంగా పర దారాభిమర్శనమే పరీక్షితునికిం దోచి ఈప్రతీపాచరణ మేమి? అని అడుగగా శుకులవారు "ఆదేమి? ఆయన

పరదారాభిమర్శనము చేసినా డని నెననలేదే" అయనకు ఇతరవిషయముల సమాధానము చెప్పినాఁడు.

రాసక్రీడాపట్టము అయిదధ్యాయములు. దీనికి నక లార్థములు చెప్పెదరు. కొందఱు జరిగినది నృత్యలీల రాసమను మండలాకారనృత్యమే, ఇతరక్రీడలేవియు లే వందురు. రాసక్రీడ యన కొందఱికి వివిధశక్తులఁ దన చుట్టు తిప్పుచు తాను మధ్యమున నుండి పరమాత్మ జీవ చక్రమును త్రిప్పుచుండుట. కొంద ఱాధునికులమతమున కృష్ణుఁడు వ్రజస్త్రీల నుపభోగించినాఁడు. తన యోగశక్తిచే గోపిక లెందరో అన్ని కృష్ణరూపములఁ దాల్చినాఁడు. యోగశక్తిచేననుడు, మాయాశక్తిచే ననుడు. అంగములను పెంచినాఁడు. లేకున్న పదియేడుల బాలకునికి-అప్పటికిఁ గృష్ణుని వయస్సు—కాపురముసేయు గృహిణులను కంఠ ముల చేతుల గౌగిలించు వపుఃపరిణామ మెట్లు కల్గినది? కనుక కృష్ణుఁడు దోషి.

మనమతమున నేతద్వాదులు పాపిష్ఠులు. భగవంతుఁడు కాక మరియెవఁడు తనదేహము నన్ని దేహములుగా చేసి కొనగలఁడు? కృష్ణుఁడు భగవంతుఁడైన చిత్స్వరూపుఁడే. ఏ స్త్రీపురుషయోగమునను అనుభవము చిత్తుదిగాక జడము దగునా? చిత్తుకు 'తన' వారు 'పరులు నున్నారా? కనుక పరదార లనుట యెట్లు పొసగును? పరదారల నంటరా దనుట సామాన్యుల కనఁగా భగవంతునికన్న నితరులకు నిషేధము. విధినిషేధములు కేవలసాత్వికులై భగవంతునిఁ జేరుటకుఁగాని భగవంతునికి విధినిషేధము లేమి? ఈ కార్యమున నాయనకు స్వస్థితినుండి చ్యుతి యుండునా!

ఈక్రీడను జెప్పినది శుకులు, అపధూత, చెప్పినది పరీక్షిత్తునకు; మరణోన్ముఖుఁడై ప్రాయోపవేశము చేసి సద్విషయశ్రవణమాత్రమున కడతేరవలె నని యున్నవానికి. ఈ ఆఖ్యానశ్రవణఫలమును శుకులుఁ "భక్తిం హరౌ భగవతి ప్రతిలభ్య కామం హృద్రోగ మాశ్వపహినో త్యచిరేణ ధీరః" ధీరుఁడై భగవంతునియందు భక్తిని పొంది హృదయరోగ మైన కామమును బోగొట్టుకొనుట; ఇందు దోషశం కవలదు.

## 6. క్రీడారహస్యము

ఈ క్రీడారహస్య మేమి? అదేమో ఆ వ్రజమువారికి తెలియలేదు. పోతనగారు 'తమకు జేయు నను గ్రహంబు లని యెఱుంగక' అని తేల్చివేసినారు. ప్రాకృతబాల కుడు గాడు శ్రీకృష్ణుఁడు. 'నేను భగవంతుఁడను' అని యడుగడుగున చెప్పినాఁడు; అట్లే యాచరించినవాఁ డాయన కనుక నన్ని లీలలందును యేమో పరమార్థ మున్నది మన మెంత వెదకినను మన మీస్థితికిఁ బోయి కారణజగత్తును శోధించగలమా? మనకుఁ దెలిసిన దుష్ట శిక్షణము గానవచ్చునుగాని నవనీతచౌర్యాదికముల గోపికా వస్త్రాపహరణమున రాసక్రీడావిహారమున నీయన చేసిన శిష్టరక్షణ మేమి? ఈ నిగూఢార్థము మనకుఁ దెలియవలె నన్న నాయనయో శుకులో చెప్పవలెను. చెప్పియు నున్నారు. ఆ ప్రకృతిరహస్యము ఆ పరమపురుషుని కరుణాపర్వరహస్యము శరదృతువర్ణనమునందున్నది. అ-20, శ్లో 42. "శరదర్కాంశుజాన్ తాపాన్ భూతానా ముడుపో౽హరత్। దేహాభిమానజం బోధం ముకుందో వ్రజయోషితామ్॥" ముకుందుడు వ్రజస్త్రీలకు దేహాభిమానజ మైన బోధమును (అనగా అజ్ఞానమును అహంకారమును కారాస్పదమును) పోగొట్టినట్లు శరత్సూర్యునికాంతి వేడిమిని భూతములకుఁ బోఁగొట్టెను. ఇదియా రహస్యము! సమన్వయింపుఁడు? నవనీతచౌర్యాదులు మమకారమును ద్రవ్యవిషయమునఁ బోగొట్టనవిగదా! గొల్లవాండ్రకు ప్రాణము వారిద్రవ్యములైన పసువులు గోరసములు, వానికి నష్టము కల్గించును, తాను వారికి ప్రాణాధికుఁడు, తనకై యానష్టమును వారోర్చుకొందురు. మానవసహజ మైన లోభము నిట్లు వారు తనయందలిప్రేమచేఁ బోగొట్టి నారు. స్త్రీలకు సహజమైనది సిగ్గు; మానరక్షణార్థము ప్రాణత్యాగము చేసినవా రున్నారు. తాను వారివస్త్రముల హరించును; ఆదశలో వారిని రెండుచేతుల నెత్తి నమస్కరింపుఁ డనును. తనప్రేమచే వా రోర్చుకొందురు. పురుషులకు బలవంతులమను గర్వము హెచ్చు; వారు చేయలేని పనులను తాను చేయును, వారిబలగర్వము డిందినది. భగవద్దర్శనము కావలయు నన్న లౌకికమర్యాదలు సడలవలెను. అప్పటికిఁ గాని సర్వాంగీణమగు శరణాగతి సర్వస్వార్పణము కాదు. భార్యాభర్తలబంధము కారణజగత్తు వరకుండు బంధము. మునిపత్నులకు మొదట తర్వాత గోపికలకు ఆది తాను తొలగించును. తనకై తనవేణుగీతమును విన్నంతమాత్రమున 'పతి, సుతా, న్వయ, భ్రాతృ, బాంధవా నతివిలంఘ్యంతే౽చ్యుతాగతాః' సమాజధర్మములు ప్రేమపరాకాష్ఠయందు లుప్తము లైనవి. ఆముష్మికముగ తామే భగవత్ప్రియుల మను గర్వము కలుగును. తా నదృశ్యుఁ డైనాఁడు. గోపికలు గీతములఁ బాడవలసివచ్చినది. భగవంతునికి తమయందే కరుణ యను భావము వారికిఁ గలదు. బృందావనమును వదలి కృష్ణుఁడు మధురకుఁ బోయిన తర్వాత మరల నక్కడ యడుగుపెట్టలేదు. వారికి పరితాప మగ్గల మైనది. ప్రాకృతస్త్రీలవలెనే తమకు నవతులైన మధురాపురినారీజనమును వారు ఉద్ధవునిముందు శపించినారు. లాభములేకపోయెను. ఎన్నాళ్లకో భగవంతుఁడు కురుక్షేత్రమున వారికిఁ గనఁబడి ఉపదేశమును చేసినాఁడు. అ-82, శ్లో 45-

" అహం హి సర్వభూతానా మాది రంతో உంతరం బహిః ।
భౌతికానాం యథా భూ మిర్జలవాయ్వాది రంగనాః ।
ఏవం భూతాని భూతేషు తథాచాత్మా త్మనా తతః ।
ఉభయం మ య్యథ పరే పశ్యతేదంత దక్షరే॥

నేను సర్వభూతముల కాది అంతమును అంతరము లను. వస్తువులకు పంచభూతములవలె. ఇట్లు భూతము లను (లోకవస్తుజాతమును) పంచభూతములందు. వీని యందు ఆత్మ తానుగా వ్యాపించియున్నది. భూతములు ఆత్మ రెండును అక్షరమునైన నాయం దున్నవి చూడుడు. ఏజ్ఞాని కింతకన్న నెక్కుడు వలయును? ఇది జ్ఞానము కాదు భక్తి యనియు నిర్వచించిన నిర్వచింపనిండు. నష్టము లేదు. తపస్సుచేయని వ్రతములబూనని శాస్త్ర ముల చదువని గోపికల కీయుపదేశ మొసగుట కెంత వారిని దీర్పవలెను.

## 7. పూర్వగాథలు

కొందరు గోపికలు శ్రీరామావతారకాలమున ఋషు లనియు, కాదు గోలోకమందలి యచ్చర లనియు, కాదు నారాయణఋషిచే శపింపఁబడిన దేవకాంత లనియు కొన్ని కారణములవలన నిందు జన్మించి రనియు గోవులు నట్లే వేదము లనియు గొల్లలు దేవత లనియు పక్షులు బృందా వనముచెట్లు మృగములు కొంతలు నదులందరు పక్వ జీవులనియు పరిపూర్తికిఁగాను కృష్ణావతారమందు బృందా వనమున జన్మించినవా రనియు నందురు. బ్రహ్మ వైవర్త దేవీభాగవతాదిగ్రంథములం దట్లే కలదు. కాని మననమ్మకముల ప్రకారము ఒక్కొకపురాణ మొక్కొక కల్పమునఁ జరిగినది. కనుక అన్నియుఁ దెచ్చి ఈవైవ స్వతమన్వంతర జన్మకి ముడిపెట్ట వలసిన యవసరము కానరాదు ఈ కల్పవృత్తాంతము కృష్ణునిది భాగవతము నందే కలదు. ఆం దీవరదానాదికముల ప్రస్తావము లేదు. కృష్ణులు ఆ బృందావనవాసులు పూర్వజన్మాదికములఁ జెప్పలేదు దేవకీవసుదేవుల యశోదానందుల పూర్వజన్మ వృత్తాంతములఁ జెప్పియున్నారు. తాను గోపికల నుద్ధరిం చుట ఆ ప్రాతచరిత్రలవలన నని గోపాలప్రభువు చెప్పడు. ' కేవలేన హి భావేన సిద్ధా మా మీయు రంజసా ' తీవ్ర భావము ప్రేమ యను దేమైన ననుడు; అది ద్వేషము కావచ్చును, భయము కావచ్చును, తీవ్రభావమున భగ వంతునిదప్ప వేఱు విషయము తెలియకుండు మేని ముక్తి తప్పదు. తన్ను ద్వేషించిన శిశుపాలాదులను అంత్యక్షణ ముల భారతయుద్ధమున తన్నుఁ జూచుచు మరణించిన రాజులకు ముక్తి నిచ్చెను కృష్ణుఁడు.

ప్రాతకథలఁ ద్రవ్వుటలో నొకచి క్కున్నది. కృష్ణభక్తు లలో విభాగములు కల్గినవి. బ్రహ్మవైవర్త ప్రాధాన్యమున గోలోకవాసి కృష్ణునికి రాధకు గోపికలకు సుదామాదిభక్తు లకు ప్రాధాన్య మిచ్చు భక్తులు కొందరు, అందును చైతన్యమహాప్రభునంప్రదాయమువారు భగవద్విరహ భావ ములకుఁ బ్రాధాన్య మిచ్చువారు; ఇతరులు వల్ల భాదులు పుష్టిమార్గమునకుఁ బ్రాధాన్య మిత్తురు. పుష్టి మార్గమున సారాంశము భగవ దనుభవము. భాగవతభక్తి ఈ రెంటికి నీషద్భిన్నము. భాగవతసారమును శుకులు ఏకాదశస్కంధమును ఉద్ధవగీతాంత్యమని కంఠోక్తిగఁ జెప్పియున్నారు. "య ఏతదానంద సముద్రసంభృతం జ్ఞానామృతం భాగవతాయ భాషితం " ఆనందసముద్రము నుండి జ్ఞానామృతము దీసి దాని కర్తలు భాగవతులు కనుక కృష్ణుడే 'కృష్ణేన యోగీశ్వరసేవితాంఘ్రిణా' యిచ్చినాఁడు 'నిగమకృదుపజహ్రే భృంగవద్వేదసారమ్' వేదములుచేసినవాఁడే వేదసార మిందు చెప్పినాడు. కావున భాగవతసారము తత్కారునిమతము భాగవతత్వము అధి కారము, వారికి భగవంతుఁ డిచ్చునది జ్ఞానము. చైతన్యుల యభిప్రాయ మది కాదు. వారికి భక్తియే ఉపాయమును ప్రాప్యమును, వారిసాధనము మధురభక్తి, దేహాభిమాన నాశము గాదు.

## 8. మ ధు ర భ క్తి

ప్రాచీన సూత్రగ్రంథములందు భక్తి నిర్వచనమున 'సాత్వస్మిన్ పరమప్రేమరూపా' నారదభక్తిసూత్రము-2. 'యథావ్రజగోపికానామ్' నా॥ భ॥ సూ॥ 21. అని లక్ష ణము లక్ష్య మొసగబడినవి. తర్వాత చైతన్యుల కాలము వఱ కెవరును ఈమార్గమునఁ బ్రసిద్ధులు లేరు. ఈ యయిదువేలేండ్లకాలము భక్తులు కరువైరా?

చైతన్యులు మహాప్రభువు. ఆయనకుఁ గృష్ణుఁడు ప్రియుఁడు ప్రాణములకన్న; తానే రాధిక, కృష్ణుఁడే ప్రాణ నాథుఁడు. కాని ఆయన సంభోగప్రేమ నుపదేశింపలేదు. విరహార్తి ప్రాప్తికన్న మధురతర మని దానినే యుపాసించి నాడు. వారి శిష్యులు రూపసనాతనగోస్వాములు, ఇతరులు బృహద్భాగవతాదుల రచించి సిద్ధాంతము చేసి ఈప్రేమ మార్గమును వ్యాప్తికిఁ దెచ్చినారు. మధురాప్రాంతమున రాజస్థానచంద్రకళ మీరా బృందావనగోపాలుఁడు 'మీరా కే ప్రభూ గిరిధర నాగర' అని స్వామికి తన ప్రేమామృతా భిషేకము నొసగినది. కాని యిందును ప్రణయిని విరహార్తి యే యుజ్జ్వలించినది. నిర్మల చేతస్కులు స్వామిని బొందిన తర్వాత నుందురా? సంభోగశృంగారమును చౌశీతిబంధ ముల కళాస్థానస్పర్శనముల దశవిధచుంబనాదికముల నఖరవక్షతముల వర్ణింతురా? క్షేత్రయవలె; వారి కెప్పుడును మీరా యున్నట్లు " గగనమండలపర్ సేజ పియాకీ— శూలీఉపర్ సేజ హమారీ—కిస్ బిధ్ మీలనా హెూయీ"

ఆకాశమండలముపైన స్వామిసెజ్జ (ప్రపంచ) శూలములపై తమసెజ్జ మేళసి మెట్లు సంభవించును. వారియనుభవము స్వప్నాదికములందు కాదు, ఇంద్రియ ప్రపంచమునకు నవతరించునందురా? ఆకాలమునందును సాక్షాత్తు భగవంతునితో తన క్రీడ నభివర్ణించిన కవి లేడు. శ్రీరామకృష్ణపరమహంసయు రాధికాభావమునఁ గృష్ణుని గొంత కాల మారాధించినవాఁడే కాని అందును స్వామితో క్రీడా శృంగారములు పల్లవింపలేదు.

సాత్త్వికభక్తు లున్నఁ గొంచెము రజఃప్రకృతిఁగల వారు నుందురు వారిఁకి చైతన్యసిద్ధాంతము నందిచ్చినది. ప్రేమ కామములు బిన్నములని, మొదటిది స్వానంద ప్రయోజనము గావని, ద్వితీయము అట్టిదని, సిద్ధాంతులు విభాగముపెట్టి గోపికలకుఁ గామము అనగా స్వేంద్రియ తృప్తి ఉద్దిష్టము కాదని వారు తాము లేకున్న గృష్ణుడు తల్లడిలిపోవు నేమో ! అను నాతురతతోనుండువా రని యొక వాదమును జయులుదేరఁదీసినారు. ఇది యెంతవఱకు నిజమో భాగవతము సాక్ష్యము చెప్పుచున్నది. స్కంధము 10—ఏకవింశాధ్యాయము-శ్లో 9 'దామోదరాధరసుధా మపి గోపికోగ్యాం' దామోదరుని యధరసుధ గోపికలకే భోగ్యము. 29 అధ్యాయము శ్లో 35 "సించాంగజం త్వదధరామృతపూరకేణ హాసావలోకకలగీతజహృచ్ఛయాగ్నిమ్" మామన్మథాగ్నిని నీయధరామృత ప్రవాహముచే నార్పుము! శ్లో 38. "తీవ్రకామతప్తాత్మనాం" వారి మనస్సులు తీవ్రకామముచే తపించుచున్నవి.40" కాస్త్ర్యంగ తే కలపదాయతవేణుగీత సంమోహితా ర్యచరితాత్ న చలేత్ త్రిలోక్యాం" ఓయీ! నీ వేణురవముచేభ్రాంతిపడిన యేస్త్రీ ఆర్యచరితిమునుండి భ్రష్టగాదు? శ్లో 41:—" విధేహి కరపంకజమ్ తప్తస్తనేషు" నీకరపంకజమును తపించుచున్న మాచనుల నుంపుము. ఇవి చాలును. గోపికలకు తమయింద్రియతృప్తి యక్కరలేదట. శ్రీకృష్ణునికి వీరి ననుభవింపకున్నఁ దృప్తి యుండదనియే వీరి భావమఁట.

శుకులు సాక్ష్యమిచ్చుచున్నారు. అ-29, శ్లో॥ "త మేవ పరమాత్మానం జారబుద్ధ్యాపి సంగతాః। జహు ర్గుణమయం దేహం" జారబుద్ధితో సంగమించినను సూక్ష్మదేహము విడిచిరి. కృష్ణుఁడే సాక్ష్యమిచ్చుచున్నాడు. స్కం॥ అ॥ 16- శ్లో 6 మొదలు॥ "కుబ్జా వ్రజే గోప్యః" శ్లో 13. 'మత్కామాః రమణం జారం మత్స్వరూపావిదో ఒబలాః" వారు నాయందుఁ గామము కలవారు. నేను వారికి రమణుఁడ నని జారుడ నని తలంచిరి. నా స్వరూపము వారికిఁ దెలియదు.

ఇన్నియు ఒక తెగవారికిఁ బ్రమాణములు కావు. ఈ అనుభవపంథ జయదేవుని గీతగోవిందములోఁ బ్రథమతః అవిర్భవించినది. 'యది విలాసకలాసు కుతూహలమ్" విలాసకళలందుఁ గుతూహల మున్నచో తన కావ్యము వినవలసినది. మంగళశ్లోకమున ఆయన వర్ణించినది రాధాకృష్ణుల ఏకాంతకేళులను. నిర్వహణమందును పూరుషాయితరతి పర్యంతము జయదేవుడు ఆ యాదిమ దంపతులను విడువలేదు. పశ్చిమదిశను దీనికిఁ బుష్టిమార్గమని పేరు పెట్టి వల్లభాచార్యులు (మన తెనుగువారే లెండి) అనుభవశృంగారప్రధానపంథను లేవఁదీసినారు. కడకు వల్లభపీఠమువారు హైకోర్టులలోను నిందఁబడిరనుట అంతః రెఱిగినదియే. అనుభవపద్ధతిని స్వామిని సేవించుట కాపాలికుల చక్రసాధనలకంటె ఎట్లు బిన్నమో వామాచారమునకు భైరవభైరవీ క్రీడలకు ఎట్లు వేరో పంచమకార సాధనము కెంత దూరమో మాకు తెలిసికొన సాధ్యము గాకున్నది. గురువునకు భార్యను ప్రథమసంగమమున కర్పించుట—భగవద్బుద్ధితోనే లెండి—వల్లభ సంప్రదాయమునఁ గొంతకాల ముండిన దందురు. రామానుజకూటములందు అవికల పండుగ లిత్యాదులు జరుగుచుండినవిగా వినికి అనుభశృంగారపరిణామ మిది.

## 9. అంతరార్థవాదులు

కొందరు గొప్పవారికి స్త్రీ ఎవరైనను ఏ పురుషునైనను గలసిన దన్నంతనే జీవాత్మ నాయికయై పరమాత్మ యను నాయకుని గలసిన దనిపించును. అట్లుగా నంతరార్థము గ్రహింపవలసినదిగా వారి బోధ. కాని యా క్షేత్రయ పదములందు దాటరాని యాతంకము లీగ్రహణము కడ్డుగా నున్నవి. పెద్దపెరిగినతర్వాత నిన్ను గ్రహింతునని చిన్ననాటే నాయికతో నన్నాడట* నాయకుఁడు. డబ్బీయ నవసరము లేనట్లు చేసెద నన్నదఁట నాయిక.† కాని జీవాత్మ పెరుగుట యేమి. విషయపూర్ణ మగుటా? అట్లయినఁగాని పరమాత్మ గ్రహింపఁ డనుట క్రొత్త వేదాంతము. జీవాత్మను గలయుటకు కన్నెరికపుటొవి పరమాత్మ యీవలెనా? ఎవరికో? సగుణబ్రహ్మవాదులును విషయ సంపత్తి భగవానుని కరుణకు అర్హత నొసంగు నని యనుట లేదు.

ఈ యర్థము లీపెద్దలు చెప్పదనుక కేవల మీపదములఁ జదివినంతమాత్రమున మనకు స్ఫురింపవు. సదర్థ

---

* పమ్మిన వేడుకతో భామ నీవు ప్రౌఢైతే కమ్మవిల్తుని కేళి గలసే మన్నది నిజమై.

† అన్నున మావారు వరా లలడుగకుండ జేసేగాని.

షుల గ్రహింపరానట్లు పూర్చిపెట్ట నేల? భాగవతము చదివినవారికిని గ్రహింపనట్లుగా వ్రాయనేల? ఎల్లరకు సులభగ్రాహ్యముగా జుగుప్సాకరములగు వర్ణనముల నింపనేల?

## తెనుగువారు - మధురభక్తి

తెనుగువారియందు ప్రసిద్ధులైన, జనసామాన్యమును ఉద్బోధించిన జనులే తక్కువయేమో? తెనుగుదేశమున రామదాసు, తరిగొండ వేంకమ్మ, క్షేత్రయ్య మొదలైనవారిని వ్రేళ్లపై లెక్కపెట్టవచ్చును. తెనుగువారికి రాము డిష్ట దైవము; కృష్ణుడు రసనిర్ణేతయని తోచుచున్నది. క్షేత్రయ దక్క కృష్ణాంకితముగా గ్రంథములను రచించిన భక్తుని చూడలేము. తరిగొండవేంకమ్మ 'పదములో శృంగారసారంబుగా శృంగారాకృతితోడ' వచ్చిన స్వామిని గొల్చినదే. కాని ఆమె యుపాసనా పద్ధతులు మనకుఁ బరిచితములు కావు. ఇక అన్నమయ్యగారు శృంగారపూరంబుగా వేంకటేశుని అలర్మేలుమంగను అధికరించి పదములఁ జెప్పినారు కాని వారి రచన వర్ణనయే. (Descriptive) తాము వారిని శృంగారమధురపద్ధతిలో నుపాసింపలేదు. తానే నాయికగా ఆయన భావించలేదు అట్లు బావించుటే మధురభక్తిసార మని తత్త్వవిదులమాట. అట్లుపాసించినవాడు క్షేత్రయ యని ఆ పదములందుఁ దానే నాయికయై మువ్వగోపాలుని అనుభవించి చొక్కినవాడని కొందఱు చాటుచున్నారు. ఇటీవల అప్పారాయసంపాదకత్వమున నొకటి గిడుగు సీతాపతులసంపాదకత్వమున నొకటి 'క్షేత్రయ్య పదము'లను గ్రంథములు ప్రకటిత మైనవి.

ఈ పదములం దొక చిత్రము గలదు. క్షేత్రయ్య నాయికయే గాక నాయకుఁడు నైనాడు. పురుషవిరహమును వర్ణించుపదములు నందున్నవి తన్ను భగవంతుని అభిన్నులుగా రచించినాడని వాదమేని మధురభక్తి సంప్రదాయమున నట్టిది లేదు. కాక విస్సావారన్నట్లు క్షేత్రయ ఆత్మోదంతమును పదములందుఁ జూతుమేని తేలుసారము. క్షేత్రయ్య మొవ్వపురివాడు. ఒకవారకాంతతో చిన్ననాడె నేస్త మయినది. ఈ తగులమును పెద్దలు మెచ్చమిచేత కాంచి కేగినాడు. అందతనితో ఆతని ప్రియయుఁ జేరుకొన్నది. కొన్ని పదముల వరదునిపై రచించి పేరుగాంచినాఁడు. తర్వాత నాతని పదములను రాజులు మెచ్చినారు. వారును ఎవరు? తంజావూరు విజయరాఘవుఁడు, తుపాకి కృష్ణనాయకుఁడు, గోలకొండ నవాబు. పదములందు వర్ణితమైనది అనుభవశృంగారము ముఖ్యముగ. 'మువ్వగోపాల' అను పదము అందుండకున్న అది పచ్చిశృంగారము. ఆ వర్ణన లతి జుగుప్సాకరములు. చిన్ననాటి కామకేళులు మొదలు ప్రౌఢపూరుషాయితములవరకందున్నవి. విజ్ఞులకు పాతవారి కందు భక్తి కన్పింపలేదు. శృంగారలక్షణమే అందు తోఁచినది. 'రసమంజరి' యందు నిర్వచితనాయికాలక్షణములకు క్షేత్రయ్యపదముల ద్వారా నొక వ్యాఖ్యాత లక్ష్యముల సంపాదించినాఁడు. ఈ పదములందును భక్తి కొందరికిఁ గనపచ్చుట మన దురదృష్టము. నాయిక యనురక్తి కామభోగతత్పరమే. ఆమె భావములు పచింపరాదు. ఆమెనాయకుఁడు చన్నులు రాకమునుపే సరసము లాడి యింటికి తోడుకపోయి మోవివిందారగించి అలరువిల్తుని కేళి నలవాటుచేసిన సామి. నాయకు డెట్లు తన్ను అనుభవించినది, ఇక్కడ వ్రాసిన సంసారులు నన్ను క్షమింపరు. ఆమె ఆ నాయకునికై ఏమి చేయలేదు? మోవీయలేదా? కౌగిలఁ జేర్ప లేదా? గుబ్బల రొమ్ముకుమ్మ లేదా! ఉపరతి గలయ లేదా! దీనియందు భక్తిపారవశ్య మఁట. పారవశ్యము లేకేమి? లేకున్న నే నాయికయు నిట్లు ప్రేలదు. మనుష్యకాంతలందును, ఈ పదముల నభినయింప నెంత సిగ్గు విడిచిన నర్తకియు సమ్మతింపదు. ఈ పదములఁ జదివిన దోషము ఒక్కదాననే శమించును మీరాకీ ప్రభు గిరిధర నాగరుని సంకీర్తనచే, ఆ తల్లి ఎంత మధురముగ స్వామిని పాడినది? 'అసు వన మాలా పోకీ' అశ్రుమాలఁ గూర్చినది 'తారా గినగిన నైన బిహానీ' తారాగణగణనమున రాత్రి గడపినది. ఆమె సాధుసంగమున లోకలజ్జ విడచినది 'దాస్ మీరా గిరిధరహెూనీ సో హెూయి, మీరా గిరిధరప్రభువు దాసి యయినది. అమె 'ప్రేమ దివానీ' ప్రేమచే వెఱ్ఱి దయినది. 'మేరే దరద న జానై కోయ్, ఆమెబాధ నెవ్వడును తెలిసికోలేదు. ఇంతయేల?

'భాయలకీ గత్ భాయల జానై కోజిన లాగీ హెూయ్'

దెబ్బ తిన్నవానిగతి దెబ్బ తిన్నవాఁ డెఱుఁగును. లేదా ఎవడు కొట్టెనో వాడు. అట్టిదెబ్బ మనల నెవరును కొట్టరైరి! వానికై ఆమె 'ఖాద్ దయా కులకీ కాన' కులగౌరవమును కూడ త్యజించినది. ఆమెను జూచి రూపగోస్వామి తన గురుత్వాహంకారమును పురుషాహంకారమును వదలెను. ఆమెకు లోకమున నొక్కఁడే పురుషుఁడు-కృష్ణుడు. ఇతరులు ఎల్లరు స్త్రీలే. ఆమె ప్రభువును యాచించినది.

'అయీ మే భగతి కాజ, జగత దేఖ మోహీ
దాసీమీరా గిరిధరప్రభు తారో అబ్ మోహీ,

భక్తికై నేను వచ్చితిని, జగత్తును చూచి భ్రమపడితిని. గిరిధరప్రభూ! నీ దాసి మీర; ఇప్పు డీభ్రమనుండి తప్పింపుము' అని. ఆమీరాగీతములే మనలను మోహమునుండి తప్పించి మధురభక్తిస్వరూపమును గుర్తింపఁజేయును గాక!

## 11. ఆచార్య శ్రీకృష్ణుఁడు

గిరిధరగోపాలుఁడు భవరోగవిషఘ్నరుఁడు. బృందావనమువారికి తాను నోట నుపదేశింపక తన ప్రేమపాశముచే వారిని కట్టివైచి దుర్భరమైనవారి గేహశృంఖలలను ద్రెంచినాఁడు. కాని నోటఁ జెప్పి ఎందరి నుద్ధరించినాఁడు? యమళార్జునభంజనమున గుహ్యకుల కుపదేశించినది శ్రీమదాంధులకు విభ్రంశము తాను చేయు సన్నుగ్రహము. బ్రహ్మకు తనమాయావైభవదర్శనముచేత - దేవేంద్రునికి 'తం భ్రంశయామి సంపద్భ్యో యస్య వాంఛామ్యనుగ్రహం' అని. గోపబాలికలకు 'న మయ్యావేశితధియాం కామః కామాయ కల్పతే' నన్ను కామరీతి మీరు కోరినను అది బంధకకామము గాదు. యజ్ఞపత్నులకు 'న ప్రీతయే ఉనురాగాయ హ్యంగసంగో ...'' దేహముతో సంగమము ప్రీతినిగాని అనురాగమునుగాని కల్పించదు. 'శ్రవణాత్ దర్శనా ద్ధ్యానాన్మయి భావో అనుకీర్తనాత్'' నాయందు భావము కల్గుట శ్రవణము దర్శనము ధ్యానము కీర్తనము అని యుపాయోపదేశము గోపికలకు 'నాహం భజతోపి జంతూన్ భజామి' ఏల? ''అమీపాం అనువృత్తి వృత్తయే'' వారు తన్నే స్మరించుచుండవలెనని. కృష్ణాచార్యాత్వము పూర్వలీలయం దల్పమే.

ఉత్తరలీలయందు స్వామి తనతత్త్వమును గొందరికెఱింగించి ధ్యానపరమున నుండఁ బంపెను. వారిలో ప్రథముఁడు ముచికుందుడు. వేటయం దీయన జంతుహింస చేసినదానికి ఫలము ఈయన బదరికాశ్రమమున తనజీవితశేషమును గడపియు నుత్తరజన్మమునఁగాని కృతార్థుఁడు కాకుండుట. తండ్రి వసుదేవునికి సూక్ష్మముగఁ గొంచెము.

'ఆత్మా హ్యేకః స్వయంజ్యోతి ర్నిత్యో ఉన్యో నిర్గుణో గుణైః।
ఆత్మసృష్టైః తత్కృతేషు దేహేషు బహుధా ఈయతే.

శ్రీకృష్ణోపదిష్టము లైనవి భగవద్గీతము ఉద్ధవగీతము. మొదటిది భారతమున, రెండవది భాగవతైకాదశస్కంధమున నున్నవి. మొదటి దుపదిష్ట మయినది భువనభయంకరభారతాహవక్షోణియందు ఐహిక ధర్మాధర్మవిమూఢుఁడైన యర్జునునికి, రెండవది ఆముష్మికధర్మాపేక్షియైన యుద్ధవునికి; తన కులమునకు కానున్న సర్వనాశనముకు అంతకన్న భావిభగద్విరహమునకు సంతపించువానికి. అర్జునుడు సంఘధర్మబద్ధుడు. ఎదురుగ యుద్ధోద్యక్తులైన బంధుజనుల జూచు న ప్పటి కి తనకృపయుద్రిక్తయై తాను జచ్చినను మేలే, Rest not evil అను క్రైస్తవధర్మము ముందుకు వచ్చినది. ఇదియే ధర్మమనుచున్నారు. క్రీస్తువునిబట్టి ఈవలియాచార్యులు ; కృష్ణుఁ డొప్పలేదు. ఒక జగద్వ్యాపారమునే చూచుచున్నాడు అర్జునుఁడు. దానికాధారమై హేతువులుగా నున్న సూక్ష్మకారణజగత్తుల నతఁడు తిలకించుట లేదు. కావున నతనికి భ్రమ కల్గినది. ఈ భ్రమను భగవంతుఁ డనేకవిధములఁ దీర్చినాఁడు, మొదట జగదనిత్యత్వబోధచేత, రెండవది ఆత్మనిత్యత్వ బోధచేత ; ఈ రెంటి వలను సంఘధర్మోపదేశము కాదు. కావున రెండవ మార్గము. ఇది తప్పదు. (కాలోస్మి లోకక్షయకృత్ ప్రవృద్ధః) నేను అనగా నీశ్వరుడను సంకల్పించితిని. నీ వద్దుకొనలేవు. నీవు నిమిత్తమాత్రము. ఈ మాటను దృఢీకరించుటకు విశ్వరూప దర్శనము జరిగినది. కాని దీనివలన సంఘధర్మబోధ యెట్లయినది? ఆవుడు మూడవ మార్గము. నీవు నిమిత్తమాత్రుఁడవు కనుక పుణ్యాపాపములు నీకు లేవు. కాదు, నీవే యాత్మవు గనుక నీకు పుణ్యాపాపములు లేవు. 'నే సర్జునుఁడనుగదా'! అది భ్రమ. దానిని పోఁగొట్టికొనుము. పోగొట్టుకొనలేనంతవఱకు నామాటమీదనైనను నీవు నిలువవలెను ; 'సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ.' కాదా నీ వ్యక్తినే విమర్శించుకొని లోననిగూఢమై తాత్కాలికముగ జారిపోయిన క్షత్రియత్వమును బురస్కరించుకొని నిష్కామముగ క్షత్రియధర్మమును నెరవేర్చుచువచ్చిన భగవానుఁ డేర్పరచిన వర్ణాశ్రమాచారపద్ధతిని తదనంతర బ్రాహ్మణ, సన్యాసిధర్మమునకు నీ వర్హుడ వగుదువు. ఇది బోధ. జగజ్జీవితము తత్త్వప్రాప్తికి సోపానపంక్తి.

ప్రాయికముగ జను లెల్లరికిని అర్జునునికిఁ గల్గిన సందియములే వచ్చుచుండును. కావుననే ఆసందియములను దీర్చు భగవద్గీతయే వా రుపయోగింతురు. వారికి ప్రాప్యము జగద్ధర్మములందు నిస్సంశయస్థితి. ఆగీతను తనకు దోచిన ట్లర్థము చేసికొందురు. (తదనుగుణముగ నడచినను నడువకున్నను) తమయర్థమును ఘోషింతురు. కాని ప్రాగాచార్యులు గీతను బ్రస్థానత్రయమున నొకటిగ గ్రహించినారు, శ్రద్ధాళులై సంస్కృతమును బఠించి ఆచార్యు నడిగి సంశయములఁ దీర్చుకొని తద్వారా తమ వర్తనము దీర్చుకొనువారు. ఈ కాలమున తమకు సంస్కృతము రాదు. కాని గీతా తత్త్వనిర్ణయమున తమదే కడవటిమాట; ఆచరించుట యన నేమి? ఒకరాచరించిరా. అందున్నదని తామైన ననుదాని నాచరింపవలసిన దని లేదు. అందు సర్వము భగవంతునికి నివేదింపు మని యున్నది. 'యజ్జుహోషి యత్కరోషి యదశ్నాసి' తమకు నృత్యము కావలెను. భగవంతుని ముందుమాత్ర మది నిషిద్ధము. తమకు మాంసాహారము వలయును. భగవంతుని కది నిషేధము.

ఉద్ధవులు భాగవతులు. అదివఱకే కృష్ణసేవచే పక్వచిత్తులు. యాదవరాజ్య ముఖ్యమంత్రిగా నుండినను కృష్ణదాస్యమును మరవనివారు. కొందరి మతమున వారికే గోపికలు ప్రేమోపదేశము చేసినారట. ఒకరిమతమున కృష్ణునికిని రాధ ప్రేమరహస్యము నుపదేశింపవలసి వచ్చినది. కృష్ణుఁ డట్లు తలంపలేదు. తాను లుప్తమైన ధర్మము లుప్త మగునని ఉద్ధవులకును మైత్రేయులకును తత్త్వగ్రామము నుపదేశించి విదురుని కుపదేశింపుమని చెప్పినాడు తాను చెప్పు ధర్మ మధికారులైన భాగవతుల కుపదేశింపఁ దగునది. కావున నీ చరమోపదేశము సంభవించినది. అయిన నీయుద్ధవగీతను సాకల్యముగఁ బరికించువారికి అర్హత ఎట్లును మనోవాక్కాయ కర్మలచే క్రమక్రమముగ లబ్ధ మగునది యని తెలియఁగలదు. ప్రేమభక్తి విశిష్టమైన బృందావనజీవనసమకాలమున గోపికలకు, చరమోపదేశము కురుక్షేత్రమున నీయనేల? అందును వారికి పరమస్థితి వేరున్న దనియే యుపదేశము. 'పశ్యతాభ్రాంత మక్షరే'. తర్వాత నామార్గమున వారు కృష్ణునిచే శిక్షితలై "అధ్యాత్మవిద్యయా గోప్య ఏవం కృష్ణేనశిక్షితాః। తదనుస్మరణధ్వస్త జీవకోశాఃత మధ్యగన్" అయినను తత్త్వస్థితియందు వారు పొందలేదు. పొందుట ప్రాప్యము కాకున్న ప్రేమభక్తి కుదాహరణభూతలగు గోపికలకు కృష్ణుఁడు వే రుపదేశము నేల చేయవలసి వచ్చెనో?

భాగవతకారునికి ఈ ప్రేమభక్తి భక్తులం దుత్తమోత్తమ మని తోచినట్లు లేదు. నందయశోదలకు పూర్వజన్మమున బ్రహ్మ భూమిని జన్మింపుఁడని యాజ్ఞాపించెను. వారన్నారు "జాతయో ర్నౌ మహాదేవే భువి విశ్వేశ్వరే హరౌ। భక్తిః స్యాత్ పరమా లోకే యయాఞ్జో దుర్గతిం తరేత్॥" మాకు హరియందు పరమభక్తి కల్గవలెను. ఆభక్తి అజ్ఞుఁడును తరించునదిగా నుండవలెను. వారిలబ్ధమైన భక్తి వాత్సల్యభక్తి. ప్రేమభక్తి కాదు. శుకుల వా రను చున్నారు.

"తతో భక్తిః భగవతి పుత్రభూతే జనార్దనే।
దంపత్యోః నితరా మాసీ ద్గోపగోపీషు భారత॥"

దానికి శ్రీధరుల వివరణము "గోపగోపీనామపి వస్తుస్వభావాదస్త్యేవ భక్తిః, తయోః పునః నితరాం;" కృష్ణుడు పరమాత్మ అగుటచేతనే గోపగోపికలకు భక్తి, వారి కంత కన్న నెక్కుడు. ప్రేమభక్తికి చాపల్యమున చ్యుతిభయమున్నది. (రాధకును అయిన పరాభవము రాసపంచాధ్యాయియందు వర్ణితమే) వాత్సల్యభక్తి ఉత్తమోత్తమము, చ్యుతిభయమే లేదు. కుసుమహరనాథప్రభు సందేశము నదియే. త న్నత్యంత దీనుఁడగు బిడ్డగా జూచుకొమ్మన్నాడు. 'కుపుత్రో జాయేత క్వచిదపి కుమాతా న భవతి' వాత్సల్యము పుత్రునందు గుణములతోన కభిముఖ్యమును కోరునదిగాదు. క్రీస్తుకూడ 'Lost sheep' మీఁదనే (నష్టజీవులయెడలనే) తనకు ప్రేమ యున్నాడు.

ఉద్ధవాచార్యుల విధానము దాస్యభక్తి; వారి కుపదిష్టమైనది, సర్వత్ర బ్రహ్మమయముగా చూడవలయునను జ్ఞానవిధానము కడపటి మాట; "మర్త్యో యదా త్యక్తసమస్త కర్మా నివేదితాత్మా విచికీర్షితోమె। తదామృతత్వం ప్రతిపద్యమానో మయాత్మభూయాయ చ కల్పతేవై॥" అన్నికర్మలు (కర్మఫలమాత్రము గాదు) వదలి మనను నాయందుంచునో అప్పుడె నేను అతని నుద్ధరింప నెంతును, అతఁడు మోక్షమును పొందువాఁ డగును. నే నతని నా యాత్మగా నైక్యము చేసికొందును' ఈయుపదేశమున ప్రేమ భక్తులే ఎక్కువ. వారికి మోక్ష మక్కర లేదు. ఈ మాటలకు కృష్ణుఁ డే యుపకాశ మొసఁగెనో మీరే చూడుఁడు.

## 12· కృష్ణుఁ డెవ్వఁడు

నిజముగ గృష్ణతత్త్వమును దెలిసిన వా డెవ్వఁడు. బ్రహ్మ వత్సాపహరణఘట్టమున 'కోపి నేశే మహి త్వవసితుం మనసాంతరేణ' నీమహిమను బ్రహ్మనైనను మనస్సులోనుగూడ నిర్ణయించుకో లేకున్నా" ననును. శుకులు "న గతి ర్లక్ష్యతే మర్త్యైః తథా కృష్ణస్యదైవతైః" కృష్ణ మార్గమును మనుష్యులు దేవతలును చూడలే రనును. ప్రకృతచర్చ ఫలము చెప్పజాలము,

చాందోగ్యోపనిషత్తునందు మనుష్యజీవితమే యజ్ఞమను విద్య ఘోరఅంగిరస్సు దేవకీపుత్రుఁడు కృష్ణునకుఁ జెప్పె నని యున్నది. ఆ కృష్ణుఁడు మనకృష్ణుఁడే యనలేము, వివరములు తెలియవు గావున. వేదమంత్రములందు కృష్ణచర్చ యున్నదని యింతవర కెవ్వరు ప్రపంచించినారు గారు. అథర్వణీయమగు కృష్ణోపనిషత్తు గలదు. దీనియందు మనకు లభించు కృష్ణచరిత్ర యల్పము. రాముని మునులు రుద్రాదిదేవతలు నాలింగనముచేయవలె నని కోరిరట. ఆయన కృష్ణావతారమున గోపికలై తనతో నంగసంగ మొసర్తురులే' అన్నాఁడట. ఈ యుపనిషత్తుప్రకారము నందుఁ డానందమే. యశోద ముక్తికాంత. దేవకి రాజసీ మాయ. వసుదేవుఁడు నిగమము. పదునారువేలస్త్రీలు గోవులు, గోపికలు ఋక్కులు ఉపనిషత్తులు. ఈ యుపనిషదర్థము అంతరార్థముల జాతిది. అథర్వవేదీయమే గోపాలతాపిన్యుపనిష త్తొకటి ఉపాసనాప్రసాదనము. ఇందు పరమాత్మను గోపరూపమునఁ గొల్చుటయే ప్రధానము, మధురాక్షేత్రప్రాశస్త్యమును. అయిన నీయుపాసనయందు దేవి మూలప్రకృతి

రుక్మిణి. సామవేదీయ వాసుదేవోపనిషత్తు ఊర్ధ్వపుండ్ర ధారణతో ముగియును.

ఇంక మనము భాగవతాదిపురాణముల నాశ్రయింప వలసినదే; బ్రహ్మవైవర్తపురాణమున కృష్ణుఁడు గోలోక వాసి. కారణాంతరముల రాధకు భూలోకజన్మము తప్పని దాయెను. ఆమెకొఱకు తానును వచ్చెను. గోలోకమునకు సరిగ భూలోకమును వ్రజము బృందావనము గోపికలు తయా రైనవి. ఆయాబృందావనవాసులనే చైతన్యసంప్ర దాయమువా రారాధించునది. అందు రూపగోస్వామి తృప్తిపడక వ్యాసభాగవతమున రాధాప్రసావము దొరక మిచేఁ గాబోలు బృహద్భాగవతము రచించెను. ఉజ్జ్వల నీలమణ్యాదిగ్రంథములకు నీబ్రహ్మవైవర్తబృహద్భాగవత ములే గతి. కాని యీబ్రహ్మవైవర్తము వేరుకల్పమునకు సంబంధించిన దనుట మఱవరాదు. గోలోకకృష్ణుఁడు ద్విభుజుఁడు. ఈ యుపాసనయు ముఖ్యమే కాని మన గీతోపదేష్ట భారతకృష్ణుఁడు భాగవతకృష్ణుఁడు. మన కృష్ణుఁడు చతుర్భుజుఁడు. ఆయన ఉదయించినది చతు ర్భుజములతో, అస్తమించినదియు చతుర్భుజములతోనే.

భాగవత మీయన శ్వేతద్వీపపతి నారాయణుఁ డను చున్నది. ఆనారాయణుఁడు చతుర్భుజుఁడే. బ్రహ్మాదులు ప్రార్థించినది ఆయననే. కడపట వైకుంఠవాసి అష్టభుజ నారాయణుఁడు వే రని ఆయన కృష్ణార్జునులను జూచు టకై తనధామమునకు వారిని రప్పించె నను కథ యున్నది. ఇందు వీరు 'కళాఅవతీర్ణౌ' నాకళతో యుద యుంచినా రని యున్నది. అట్లే అవతారఘట్టమునను 'అచ్యుతాంశం' 'అంశేన భగవాన్ విష్ణుః'' 'అంశ భాగేన' అనుటకు సరళార్థము అంశము అయిన బల రామునితోఁగూడ అట! ఒకభాగముతో కాదట. ఏల? ''ఋషయో మునయో దేవా మనుపుత్రా మహౌజసః। కలాః సర్వే హరే రేవ కృష్ణస్తు భగవాన్ స్వయం॥'. ఏ భగవంతుఁడో శ్వేతద్వీపపతియే కాబోలు!

పలుచోటుల కృష్ణార్జునులు నరనారాయణాంశజు లని యున్నది. దీని నెట్లు సమన్వయించుటో తెలియదు. బహుశః నరనారాయణఋషులు విష్ణ్వంశజులు కావున వారియంశమున నుద్భవించువారు కృష్ణార్జునులు కావునఁ గాబోలు. నరనారాయణులును అవతారములలో నే లెక్కింపబడియున్నారు. వీ రిరువురు నారాయణుని తెల్ల నల్లకేశములనుండి యుద్భవించిరఁట! అనగా సత్త్వ, తామసశక్తులు గాబోలు! అర్జునుఁడు తెల్లనివాఁడనియు నొకప్రథ గలదు.

దేవీభాగవతమున నరనారాయణులు తపస్సు చేయు చుండఁగా విఘ్నార్థము వచ్చిన యచ్చరలకు నారాయ ణుఁడు వర మిత్తు ననెనఁట. వా రాతనినే భర్తవు కమ్మని కోరిరఁట. వేఱుజన్మమున నట్లు చేయ సంగీకరించి నారాయణుఁ డప్పటికి తప్పించుకొనెను. ఆవేఱుజన్మమే కృష్ణజన్మము. ఈదేవీభాగవతము సారస్వతకల్పవిషయ మనుట చదువరులు మఱువరాదు. ఈ గ్రంథముప్రకా రము వైకుంఠవాసి చతుర్భుజనారాయణుఁడు. గోలోక వాసి ద్విభుజకృష్ణుఁడు.

ఈపురాణచర్చవలనఁ దెలునది యొక్కటే. కృష్ణుఁడు నారాయణాంశజుఁడు. అయిన ఆయన యవతారకార ణము భూభారావతరణ మని చెప్పబడియున్నది. కావున నవతార మన నేమి? యని చర్చింపఁదగును. (చారిత్రక కృష్ణచర్చను తత్త్వవిచారము గావున వదలితిమి.)

## 13. అవతారచర్చ

అవతార మన మేమి? చంద్రలోకమునుండి భూలోక మునకు ఏ జీవాత్మ జన్మనాశజన్మాదులముందుఁ బ్రయా ణము సేయునో ఆ వ్యక్తి సంసారి; స్వకర్మనిబద్ధుఁడును. ఏదో యీశ్వరుడుకదా చిత్తు ముక్తపురుషుఁడు, లేదేని విశ్వపాలన నియుక్తులైన ఆధికారికపురుషులలో నొకరు స్వేచ్ఛచే లోకానుగ్రహముకొఱ కవతరించినను లేదే నొక పురుషశరీరము నావేశించినను అట్లు సేయుట నవత రించుట యందురు. పైఁ జెప్పినవారు శరీరమును దాల్చుట వారి కామచారత్వమునకుఁ దగియున్నది. వారి యైహికకర్మ వారిని మరల బంధించఁదు.

ఈశ్వరుఁడు యజ్ఞమయుఁడని చెప్పుదురు. గీతయందు ''అధియజ్ఞోహమేవాస్మిన్ దేహే దేహభృతాం వర'' యని కృష్ణుఁడు తన్ను నిర్దేశించుకొన్నాడు. కావున కృష్ణుఁడే ఈశ్వరుఁడని నిర్ణయ మగుచున్నది. యజ్ఞ మయుఁ డన? ఈశ్వరార్పితమైన సత్పురుషకర్మరాశియే గదా. ఈశ్వరార్పితముగావున నీ కర్మఫల మే వ్యక్తిని జెందక అక్షరుఁడైన పరమాత్మకే చెందును. కృష్ణుఁడు తాను హిరణ్యగర్భుఁడు గాఁడు. సూత్రాత్మ గాఁడు. పర బ్రహ్మయుఁ గాడని తెల్లమగుచున్నది. కావున నీయన నింకొకరు. యజ్ఞుఁడు సత్పురుషకర్మరాశియై తేజో మయము చిన్మయము గావున లోకానుగ్రహార్థము శరీర మును ధరించు నని పెద్దలు చెప్పుచున్నారు. భాగవత మునం దీకథ సర్వదేవతలు బ్రహ్మముఖముగా పర మాత్మను శరీరము దాల్పుమని ప్రార్థించుటగా చెప్పఁబడి నది. బౌద్ధులు నీవాదము నాదరించినారు. వారి బోధి సత్త్వులును అర్హతులును ఇట్లావిర్భంచువారే. సంకల్పమే రూపము దాల్చి వ్యవహారము చేయుట యోగవాసిష్ఠ మందు ఎన్నో కథలు చెప్పబడియున్నవి గదా.

నరనారాయణులం దొకఁడు నారాయణఋషి; ముక్త పురుషుఁడు, ఆయనయం దీయజ్ఞుఁ డావేశించె నని ఆయనయే కృష్ణరూపమున నావిర్భవించె నని గొందరి వాక్కు. ఇది సమ్మతమే గాని పురుషోత్తముఁ డావిర్భవించె నను నింకొకవాదము నున్నదిగదా దానినేల యాదరింపరాదు?

పురుషుఁడు తన తేజోంశముచేతనా ఆవిర్భవించెను? అట్లైన 'కృష్ణస్తు భగవాన్ స్వయమ్' అనుట యెట్లు పొసగును? మాయచేతనా? అట్లైన కృష్ణుఁడు మాయాశరీరధారిపురుషోత్తముఁడా? ఆయన లీలాశరీరధారి యనుదుముగాని మాయాశరీరి యనుట ఒప్పగునా? కావున యజ్ఞపురుషుఁడా నారాయణఋషి యుపాధి నాశ్రయించి కృష్ణుఁడుగ నవతరించె ననుటయే సమ్మతము.

దీనిచే కృష్ణుని భగవత్త్వమున కేలోటును రాదు. ఈయనయు ఈశ్వరావిశేషుఁడు, సోపాధికుఁడు, సర్వజ్ఞుఁడు సర్వశక్తుఁడు. కావున నీశ్వరాభిన్నుఁడుగా నీయనను గొలిచినను గీర్తించినను ఫలభేద ముండదు. సిద్ధపురుషుల నుపాసించినను భావనచేత బ్రహ్మదృష్టితోనే యుపాసింతురు. తామును సిద్ధు లగుదురు. కడకు సిద్ధి పడయుటకు ప్రతీకమునందు బ్రహ్మదృష్టి చాలునని (బ్రహ్మదృష్టే రుత్కర్షాత్) రామకృష్ణపరమహంసజీవితమే చాటుచున్నదిగదా!

## 14. రాధా దేవి

ఈచర్చయం దటనట రాధా దేవి నామము వచ్చినది. ఉపనిషత్తునందు రాధిక యారాధ్యగాఁ జెప్పుట లేదు. ఈమెతత్త్వమును విచారింపవలెను.

మేము భూలోకమునందు రాధస్వరూపమును విచారించుట లేదు. కృష్ణప్రేయసి యైన రాధ ఎవరో? మాకుఁ దెలియకున్నది. నందునియనుజయు ఇంకొకయనుజ కుమార్తెయు నిద్దరు రాధ లున్నారఁట. ఈరాధ వారియందెవరో? మాకు విషయము రాధికాదేవి గోలోకవాసిని.

పరమాత్మ పురుషుఁడని యుపాసించువారు కొందఱు; ఆయన చిదంశనే యుపాసించువారు కొందరు. అనఁగా సగుణబ్రహ్మను పురుషుఁడని స్త్రీయనియు నుపాసించుచున్నారు. సగుణబ్రహ్మము ఈశ్వరత్వమును దాల్చి నపుడాయనశక్తి దేవీరూపమును దాల్చినది. ఇపుఁడు శక్తి శక్తిమంతు లిరువురే యున్నారు. ఆశక్తియే రాధ; ఆశక్తిమంతుఁడే కృష్ణుఁ డని దేవీభాగవతము నుడువుచున్నది. ఆకృష్ణునితర్వాతి రూపములే శివచతుర్భుజనారాయణాదులు. ఆరాధికతర్వాతిరూపములే సరస్వతీ లక్ష్మ్యాదులు. ఆయాదిమదంపతులలోకము గోలోకము. గో=కాంతి కిరణము, గోలోకమన తేజోమయలోకము; వైదికమార్గమున తపోలోకము. విష్ణ్వాదులలోకములు దానికిఁ గ్రింది లోకములు. శైవమార్గమున నీరాధికయే త్రిపుర.

తాంత్రికులమతము ఇంకొకటి. పరమాత్మ సగుణబ్రహ్మమైనపుడు శక్తిత్రయమును దాల్చినాఁడు. ఇచ్ఛాజ్ఞానక్రియాశక్తులను ఈశక్తులం దంతర్భూతములైన వెన్నో శక్తులు. అందు హ్లాదినీశక్తి యొకటి. (ఆనందమయి.) ఈశ్వరుఁడు సచ్చిదానందమయుఁడుగదా. ఆయానంద శక్తియే రాధికాశక్తి. ప్రపంచమే భగవానుని రాసోల్లాసము. స్వామి సృష్టి హృదయస్థుఁడై విశ్వమునెల్ల తన చుట్టు స్త్రీపురుషరూపమున నావిర్భవించినదానిని వలయముగ త్రిప్పుచుండును. వలయ మనుఁట నీసంసారమునకుఁ గొన లేదని చెప్పుట. స్త్రీలెల్ల రాధికాంశభవలు. పురుషు లెల్లరు తనయంశమునబుట్టినారు. తాను రాసేశ్వరుఁడు. రాధిక రాసేశ్వరి. ఇట్లుగా నీయానందమయి రాసేశ్వరి యానందరాజ్యము నేలుచున్నది. సర్వక్రియాకారిణియై యున్నది. ఆనందమునకుఁ గాకున్న నెవఁడు క్రియకుఁ బూనును? అనుభవమునకు చిత్ వలయును గాన రాధిక చిన్మయి; కావున రాధిక సకలశక్తిసమష్టిరూప. ఆమెయందు ప్రధానము హ్లాదినీత్వము.

ఆరాసలీలయందు యుగళములు మధ్యస్థరాధికాకృష్ణుల కభిముఖులై యుందురు. అట్లభిముఖముగా (పరమాత్మ) ఉన్నపుడే ఆనందము. ఆగోలోకరాసమునే కృష్ణుఁ డిహలోకమున జూపించినాఁడు. విశేషసమన్వయము విజ్ఞులూహించుకొనసకపోరు.

దేవీభాగవతమున రాధిక నింకొకవిధమున వర్ణించినారు. ప్రపంచకల్యాణమునకందయిదుశక్తు లుద్భవించినట్లు వచించినారు. దుర్గ, రాధ, లక్ష్మి, సరస్వతి, సావిత్రి. వీరి యవతారక్రమ మిట్లు. సగుణబ్రహ్మము - ప్రకృతి (ఆమె - త్రిగుణస్వరూప, శక్తిమయి, శ్రీకృష్ణునిచ్ఛాశక్తిచే జనించి సృష్టికర్మకు భేదము పొంది పంచవిధము లయినది.

1. దుర్గ :—నారాయణి. విష్ణుమాయ, పూర్ణబ్రహ్మస్వరూపిణి, తేజఃస్వరూప, సర్వశక్తిస్వరూప.

2. లక్ష్మి :—సర్వసంపత్స్వరూప. శుద్ధసత్త్వస్వరూప. సర్వప్రాణులందు శోభారూప.

3. సరస్వతి :—సర్వవిద్యాస్వరూప, విషయజ్ఞానరూప, శుద్ధసత్త్వస్వరూప, తపస్స్వరూప.

4. సావిత్రి :—బ్రహ్మణ్యతేజోరూప, జపరూప, పరబ్రహ్మస్వరూప, పరమానందరూప, శుద్ధసత్త్వస్వరూప;

5. రాధ :—పంచప్రాణస్వరూపిణి, ఆనందరూప, రాసక్రీడాధిదేవి. పరమాహ్లాదరూప, (ఈమెయే వరాహకల్పములో వృషభానునిసుతగా నుద్భవించినది.) ఈమె 'నిర్గుణీ చ' కనుక రాధికాతత్త్వము సమష్టిప్రాణ

మయము అనగా క్రియాకారిత్వము ఆనందరూపత్వము. సృష్టిలేని కాలమున నీమె నిర్గుణ నిరాకారము. ప్రాణ మున కున్నధర్మములు రెండు క్రియాకారిత్వము, ఆనం దానుభవమే కదా. కావుననే ఈమె ఆనందమయియై ఇహగోలోకమునను (ఇంద్రియలోకము అనఁగా విషయా నందరూపమున నిహలోకమునను) కారణ గోలోకమునను రాణిగా నున్నది. అయానందమును సంపాదించుటకు కర్మ వలయును. కర్మ ప్రాణవశము. కావున రాధ ప్రాణాధిష్ఠాతృదేవి. ఈమెను గొప్పక విద్యా విద్యాస్వరూప కర్మ సాధ్యము గాదు; విషయానందబ్రహ్మా నంద ములు లభించవు. శ్రీకృష్ణునికి=సర్వాకర్షకుని కీమె దేవి యగుటయం దాశ్చర్య మేమి? ఈమె శక్తిత్రయ ఇచ్ఛ కామము క్రియా-ప్రాణముచే యత్నము జ్ఞానము - ఆనందజ్ఞానము, చిత్) స్వరూపిణి యనుట ఉచితమే.

## 15. ఉపసంహారము

'వయం తత్త్వాన్వేషా న్మధుకర హతాః త్వం ఖలుకృతీ' అని శాకుంతలము 'తత్త్వాన్వేషకులై మేము చెడితిమి. తేనె ననుభవించు తేఁటీ, నీవే కృతార్థవు!' కృష్ణ తత్త్వాన్వేషము నిట్టిదే. చేతికి దొరకిన యానందము ననుభవింపక వ్యర్థచర్చలకుఁ బూనుకొంటిమి. రసజ్ఞులకు యశోదాసుతుని మాధుర్యాంబుధి నోలలాడుటే చాలును. ఇతర మెల్ల బ్రహ్మగీతలయందు నుడివినట్లు

"శ్రేయస్సృతిం భక్తి ముదస్య తే విభో క్లిశ్యంతి యే
కేవలబోధలబ్ధయే
తేషా మసౌ క్లేశల ఏవ శిష్యతే నాన్యత్; యథా స్థూల
తుషావఘాతినామ్ ॥"

శ్రేయస్సుప్రవాహమును భక్తిని వదలి కేవల (తత్త్వ) జ్ఞానమునకు కష్టపడువారికి కష్టమే మిగులును. ఇతరము కాదు. వారు ఊకను దంచువారు. అనంతునిగుణముల లెక్కింపను లేము. అవకాశము లేదు. గ్రంధవ్యాప్తియే గాని, అనుభవము హెచ్చుగాదు. కావున గోపాలుని కొన్ని విషయముల భికించి భిక్షుకులము గావున విరమింతుము మే మరుణోదయమున

"ప్రాతః స్మరామి దధిఘోషవినీతనిద్రం
నిద్రావసానరమణీయముఖారవిందం" 'కర్ణామృతము'

పెరుగు చిలుకు చప్పళ్లచే నిద్ర లేచి తత్కాలశోభా రమణీయమైన (కృష్ణుని) ముఖతామరసమును స్మరింతును. (అట్లగుఁగాక).

సాయంకాలమున..................

"వనాంతే కుసుమితసమయే సైకతే చంద్రికాయాం
త్రైలోక్యాకర్షణాంగం..................

వందేహం రాసకేళీరతమతిసుభగమ్ వశ్యగోపాల బాలమ్' కర్ణామృతము' అడవికొనల తోఁటలందు వెన్నెల నిసుకతిన్నెలందు తిరుగు ముల్లోకముల నాకర్షించు తనువుకలవాని రాసకేళియందు నిరతము మతి నుంచిన సౌందర్యమయునికి వశ్యగోపాలునికి నమస్కారము (చేయుదుము గాక.)

"మమ ప్రయాణాభిముఖే చ వల్లవీ స్తనద్వయాదుర్ల
లిత స్సబాలకః ॥
శనై శ్శనై శ్శ్వాసితవేణునిస్వనః విలాసవేషేణ పురః
ప్రతీయతాత్, (కర్ణామృతము.)

జీవితాంతమున అవ్వలివరికిఁ బ్రయాణము చేయు నున్న నా కెదురుగ మెలమెల్లగా వేణునాదమును విన్పించుచు విలాసవేషముతో గోపికలు తమయెదలకు హత్తుకొన్న ఆ బాలకుఁడు తోచునుఁగాక.

'అతిభూమి మభూమి మేవ వా వచసాం వాసితవల్లవీ
స్తనం
మనసా మపరం రసాయనం మధురాద్వైత ముపాస్మహే
మహః ॥ (కర్ణామృతము)

ఒకతేజస్సు కలదు. వాక్కుల కతిభూమి (పూర్ణముగా వర్ణింపలేనిది) కాదా, అభూమి (వాక్కులు దాని నసలు వర్ణింపనే లేవు) అది వల్లవీస్తనముల వసించియుండునది; మనసునకు వేఱుక్రొత్తరసాయనము. ఆ మధురాద్వైతతేజస్సు నుపాసింతుము.

---

కృష్ణాయ వాసుదేవాయ దేవకీ నందనాయచ ।
నందగోపకుమారాయ గోవిందాయ నమోనమః ॥

# మంత్రమీమాంస

(పూర్వతోఽనువృత్తము)

శ్రీ కళ్యాణానందభారతీయాంతాచార్య స్వాములవారు

ఉపవీతవంతుడై యాచమనమును జేయవలయును— మలచ్యుతికాలమున దక్షిణకర్ణమునందు యజ్ఞోపవీత ముంచఁబడును. అట్టాని యథాపూర్వము ధరించినచో నుప వీతము గలవాఁ డగును. మలమూత్రవిసర్జనకాలముల కంటె నితరకాలములం దెప్పుడును ఉపవీతిగనే యుండ వలయును. ఉపవీత మనగ వామభుజమునందు ధరిం చుట. ప్రాచీనావీతమన దక్షిణభుజమునందు ధరించుట. నివీతమనగ రెండు భుజములందును ధరించుట యని యజ్ఞోపవీతధారణము కర్మవైచిత్ర్యమునుబట్టి మూడు విధములు. దేవకర్మలందు నుపవీతముగను పితృకర్మ లందు ప్రాచీనావీతముగను మనుష్యకర్మలందు నివీతము గను ధరించుట శాస్త్రవిహితము. ఉపవీతమును ధరించ కుండ నెపుడు నుండఁగూడదు. అట్లుండినచోఁ బ్రత్య వాయము స్మరింపఁబడుచున్నది :—

"విశిఖోనుపవీతీ యచ్చకరోతి తన్నిరర్థకమ్।
స్నానదానాదికం కర్మ అసురమపి భవతి।
దినమేకమపి యజ్ఞోపవీతేన వినాస్థితశ్చేత్
శూద్రత్వమాప్నోతి।
మృతశ్చసూకరతాం వ్రజేత్। కాయస్థమేవ తద్ధార్యం।
కదాచననోద్ధరేత్। సకృదుద్ధరణేన ప్రాయశ్చిత్తీ భవేదితి॥

## దన్తధావనము

పచ్చిదంతకాష్ఠముతో దంతధావనముఁ జేయవలయును. అయ్యది సమముగ సత్వచముగను సుగన్ధ యుక్తముగను కంటకాన్వితముగను నుండవలయును. అయ్యది అశో కము, నేరేడు, మామిడి, వెలగ, వకుళవృక్షములతో సం బంధించినదై యుండవలయును. ఉత్తరేణి—(అపా మార్గము) ప్రశస్తము. అరుణోదయమునకుఁ బూర్వమే దంతధావనముఁ జేయవలయును. సూర్యోదయమునకుఁ బిమ్మట దంతధావనమును జేసినచో మునులు, మంత్ర ములు, వేదములు, దేవతలు, పితరులు పరాఙ్ముఖమును జెందుదురు. దాన ప్రత్యవాయము గల్గును. తూర్పు ముఖ ముగ దంతధావనముఁజేసిన ధైర్యము శరీరారోగ్యముఁ గల్గును. దక్షిణముఖముగఁ గావించినచో రోగి యగును. పశ్చిమముఖమునఁ గావించినచో నిర్ధనుఁడగును. ఉత్తర ముఖుఁడైనచో భోగియగును. గావున దక్షిణ పశ్చిమముఖ ములుగ దంతధావనముఁ జేయరాదు.

అరుణోదయము :—"సప్తపంచారుణోదయః" యని చెప్పుటచే సూర్యోదయమునకుఁ బూర్వమందైన నరుణో దయము దంతధావనమునకును స్నానమునకును సర్వ విధముల ప్రశస్తము.

స్నానము :—1. వారుణము, 2. ఆగ్నేయము, 3. వాయవ్యము, 4. బ్రాహ్మము, 5. కాపిలము, 6. దివ్యము, 7. మానసము, అని స్నానమేడువిధములు, జలావగాహనము వారుణమనఁబడును. భస్మమును బూసి కొనుట యాగ్నేయమనఁబడును. గోరజస్సును బూసి కొనుట వాయవ్యము. "ఆపోహిష్ఠామ"యను మంత్ర ములచేఁ జేయఁబడునది బ్రాహ్మము. తడిబట్టచే శరీరమును లెస్సగాఁ దుడిచికొనుట కాపిలము. అవ్యయానంద చిత్స్వ రూప విష్ణుచింతనము మానసము. ఎండతోఁగూడిన వర్షము నందలి స్నానము దివ్యము. ఔషధము సేవించుటయందు గాని, రోగముచే పీడింపఁబడి యున్నపుడుగాని, రాజ చోరాది యుపద్రవములందుగాని మంత్ర స్నానము నాచ రింపవలయును. స్నానములలో వారుణస్నానము నిత్యము. అశక్తియం దితరములును అని యథాసంభవము వ్యవస్థ.

ఇఁక వారుణస్నానము తీర్థస్నానము గృహస్నానమని రెండువిధములు. అందు సింధుసంగమకాసార నదనదుల యందు స్నానము తీర్థస్నానమనఁబడును. అయ్యది ప్రాజాపత్యముతోఁ దుల్యము, మహాపాతక నాశనమును. వాపియందుగాని కూపమందుగాని స్నానము గృహస్నాన మనఁబడును. అయ్యది తత్కాలమునందుఁ జేకొనఁబడిన శీతోదకముచేఁగాని యుష్ణోదకముచేఁగాని చేయనగును. గాని నిలవయుండిన శీతోదకముచే నెంతమాత్రమును జేయఁగూడదు. అట్టి గృహస్నానము వైదికము పౌరాణి కము లౌకికమని మూడు విధములు. ద్విజులకు విధింపఁ బడినది వైదికమనఁబడును, స్త్రీ శూద్రులకు విధింపఁబడి నది పౌరాణికమనఁబడును. తాంత్రికమనిఁగూడ గొంద రిచేఁ జెప్పఁబడును. సర్వప్రాణులచే సౌకర్యముకొఱకుఁ జేయఁబడునది లౌకికస్నాన మనఁబడును. స్నానప్రయో జనము దృష్టమదృష్టమని ద్వివిధము. దేహముయొక్క పరిశుభ్రత, చిత్తముయొక్క నిర్మలత, ఆయాసనివృత్తి యును ప్రత్యక్షముగఁ జూడఁబడుచునే యున్నవి. పాప

క్షయము చిత్తశుద్ధియును నదృష్టఫలము. అయ్యది యఘ మర్షణము మొదలుగాఁగల మన్త్రముల యర్థము—

స్నానము సర్వకర్మాధికారహేతువని కూడ స్మరింపఁబడుచున్నది—

"స్నానపూర్వాః క్రియాః సర్వాః సిద్ధం ప్రయాన్తి చ।
తస్మాత్స్నానం పురా కుర్యాదేవ్యేకం దేహశక్తితః॥" అని.

స్నానమును మౌనముతోఁ జేయవలయును. లేనిచో గొప్ప యనర్థము గలుగునని స్మరింపఁబడుచున్నది—

"మౌనాభావే స్నానం హరతి తేజః" అని.

స్నానాభావమందుఁ బ్రత్యవాయముగూడ నిర్వచింపఁబడుచున్నది—

"జపో హోమో దానం యాగః స్వాధ్యాయః పితృకర్మ చ।
స్నానం వినా తత్సర్వం భస్మీభవతి॥" యని.

వస్త్రధారణము—"నవశమఖణ్డం శ్వేతం ధౌతవస్త్రద్వయమ్। స్నానే దానే జపే హోమే దేవపూజనే చ ధార్యమ్॥ రక్తం నీలం మలినం దశాహీనం చ వర్జయేత్" అని వస్త్రధారణవిశేషము వివరింపఁబడుచున్నది.

## స్నానవస్త్రనిష్పీడనము

"నిష్పీడనావస్య యే గోత్రిణో౽పుత్రామృతాస్తే సర్వే తృప్తిం యాన్తి" యని స్నానవస్త్రనిష్పీడనముచే నదృష్టఫలము గల్గునని స్మరింపఁబడుచున్నది.

తిలకధారణము—జపహోమవైశ్వదేవ దాన దేవార్చన శ్రాద్ధములందు భస్మముచే తిర్యక్త్రిపుండ్రధారణముఁ జేయుటయందు సర్వము నక్షయమగును. గోపీచందనమును ధరించువాఁడు సూర్యరూపమును ధరించును. విభూత్యాది ధారణఫలము స్మరింపఁబడుచున్నది—

"ఫాలే విభూతిమాన్యోసౌ బ్రహ్మవిష్ణుశివాత్మకః।
భూతిదా తు విభూతిః స్యాద్విధినా విధృతా యది॥" యని.

దేవతాప్రతిమాలగ్నం కుంకుమం చన్దనం వా యస్తు దేహే ధారయతే స ముక్తో భవతీతి విజ్ఞాయతే॥

పవిత్రధారణము—స్నానదానజపహోమ సంధ్యాతర్పణపూజనములందుఁ జేతియందుఁ బవిత్రమును ధరించవలయును. లేనిచో నట్టి కర్మ మాసురభావము పొంది యనర్థహేతువగును గావునఁ బవిత్రమును ధరించవలయును. పవిత్రఫలమిట్లు నిర్వచింపఁబడుచున్నది—

"కుశా దహన్తి పాపాన్యనలస్తూలరాశిమివ।
కుశపూతం తోయం పిబేత్కుశపూతముపస్పృశేత్॥" అని.

అయ్యది సోమపాన సమమగును. "పవిత్రం వై హిరణ్యం పవిత్రం వై దర్భాః" యని వినఁబడుటచే—"తస్మాత్సువర్ణం ధార్యమ్" అని విధి వినఁబడుటచేతను హిరణ్యమునుగూడ ధరించవలయును.

ప్రాణాయామము—ప్రాణాయామము సర్వకర్మ సాధారణముగా విధింపఁబడుటచే సంధ్యోపాసనమునకుఁగూడ ఆచమనము, సంకల్పమువలెనే యంగముగా నలరారుచున్నది; గావున నిచట సంధ్యోపాసనమునకు సంగముగా విధింపఁబడుచున్నది. అదెట్లనిన—

"ఉద్ధ్యాసనం నియమ్యాసూన్స్మృత్వా ఋష్యాదికం తథా।
సన్మీలితదృజ్మౌనీ ప్రాణాయామం సమభ్యసేత్॥
సంధ్యాత్రయేపి కర్తవ్యం ప్రాణాయామత్రయం ద్విజైః।
ఆసీనస్తు భవేత్సాయం మధ్యాహ్నే స్థిత ఏవ వా।
తిష్ఠన్నేవ తథా కుర్యాత్ప్రాతఃకాలే సమాహితః॥" అని.

"బద్ధ్వాసనమ్మ"ను ఆసనవిధి సాయంకాల విషయము. ఇచ్చట ఆసనమన స్వస్తికము, పద్మము, వీరము, సిద్ధము లోనుగాఁగల శరీరధారణ విశేషములు.

ప్రాణాయామత్రయము—స్నానకాలమునందును, దానకాలమునందును, జపకాలమునందును, హోమకాలమునందును నాచరింపవలయును శక్తిలేనిచో నొక్క ప్రాణాయామమునైనను జేయవలయును. ప్రాణాయామత్రయము సంధ్యోపాసనమునకు సంగమని నిర్వచింపఁబడుచున్నది. అట్టి ప్రాణాయామము పూరకము కుంభకము రేచక మను లక్షణముతో నొప్పియున్నది. ముక్కుచే నాకర్షింపఁబడు నుచ్ఛ్వాసమునకుఁ బూరకమని పేరు. ఆకర్షింపఁబడిన వాయువును శరీరమునందు ధారణచేయుట కుంభకమనఁబడును. కుంభకమునకుఁ బిమ్మట నుచ్ఛ్వాసము రేచకమనఁబడును. ప్రప్రథమమున నిడచే వాయువు నాకర్షించి నాసాపుటములను మూసికొని యథాశక్తి కుంభకము గావించి పిమ్మట పింగళచే రేచకమును జేయవలయును—ఇయ్యది యొక ప్రాణాయామమనఁబడును. పిమ్మట పింగళచే వాయువు నాకర్షించి కుంభకమును గావించి యిడచే రేచకమును జేయవలయును. ఇయ్యది రెండవ ప్రాణాయామము. పిమ్మట మఱల నిడచేఁ బూరకమును గావించి కుంభకమును గావించి మఱల పింగళచే రేచకమును జేయవలయును. ఇయ్యది మూడవ ప్రాణాయామము. సాధకుఁడు కుంభకమున మానసికముగ యథోచితమగు మంత్రమును నుచితమగు పర్యాయములు జపించవలయును. అట్టి జపముచే శరీరాంతర్గత పాపములు నశించి శరీరము శుద్ధినొంది యుపాసనార్హతను బడయును. యథోచిత ఫలము లభించును. ఇడయన వామనాడి, పింగళ యన దక్షిణనాడి.

ప్రాణాయామము అగర్భము సగర్భము అని రెండు విధములు. అందు సగర్భము శ్రేష్ఠము. అభిధ్యానముతో

గూడిన కుంభకము సగర్భమనియు నభిధ్యానము లేని కుంభక మగర్భమనియుఁ జెప్పఁబడును.

అభిధ్యానమనిన యథోచితమగు మానసజపము జప ప్రకార మధికారిభేదముచే భేదించుచుండును గావున నయ్యది గురుముఖైక వేద్యము. గురూపదేశ రహితముగ నెద్దియో యొకతీరున నెవ్వరో యొకరెద్దియో యొకతీరున వ్రాసిన క్రమమున స్వాయత్తముగ ప్రాణాయామము నెద్దియో యొకతీరున నభ్యసించుట సర్వవిధముల ననర్థావహము.

ప్రాణాయామమువలన గలుగు విశేషమిచట సంక్షేపముగ జిజ్ఞాసువులయొక్క శ్రద్ధాభక్తులకొఱకుఁ బ్రదర్శింపబడుచున్నది.—

వ్యవహారక్షమమగు నీ కరచరణాద్యవయవ విశిష్టమగు శరీరమజ్ఞజనదృష్టిచే సప్తధాతుమయపిండమట్లు భాసింపుచున్నను శాస్త్రదృష్టిచే తగు విద్వదనుభవ దృష్టిచేతను అన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమయ ఆనన్దమయము లను నైదుకోశములతో గూడియున్నట్లు దెలియవచ్చును.

అన్నమయకోశము—సప్తధాతుమయమై శిరస్సు, దక్షిణపక్షము, ఉత్తరపక్షము ఆత్మ, పుచ్ఛము అను నైదవయవములతో నొప్పుచుఁ బ్రత్యక్షముగ గ్రహింపఁబడుచుండిన స్థూలశరీరమన్నమయ కోశమనఁబడుచున్నది. ఇయ్యది ప్రాణులచే భుజింపఁబడునట్టి యన్నరసముచేఁ గల్గుచుండుటచే దీని కీపేరు గల్గినది.

ప్రాణమయ కోశము — అన్నమయకోశమంతటను నిండియుండి సకలేంద్రియములకును అవయవములకు వ్యవహారయోగ్యమగునట్టి యథోచిత బలమునిచ్చుచుండునట్టి వాయువికారము ప్రాణమయమని చెప్పబడును. ఇయ్యది అన్నమయమువలె ప్రత్యక్షము గాకపోయినను అహర్నిశమును నెడతెగకుండ ఇరువదియొక్క వేయి ఆరువందల యుచ్ఛ్వాసనిశ్శ్వాసరూపమగు వాయుప్రచారలింగముచే ననుమేయింపఁబడుచున్నది.

మనోమయకోశము—ప్రాణమయముకంటె విలక్షణమును ప్రాణమయమునంతటను బూర్ణముగ నిండియున్నట్టియు చతుర్వేద స్వరూపముగ నలరారునట్టియు కోశవిశేషము మనోమయ మనఁబడును. ప్రాణాయామ విశేషమును దెలిసికొనుటకు నీ మూడుకోశములయొక్క జ్ఞానము చాలును గావున మిగిలిన కోశముల వివక్ష ప్రకృతమున విరమించబడుచున్నది.

నాడు లను వాయుసంచార విశేషములు —స్థూల శరీరమునందు బహువిధములగు శిరలు ధమనులు మొదలుగాగల నాళములు ప్రత్యక్షముగ దెలియవచ్చుచున్నవి. అటులనే పలువిధములగు నాడులు ప్రాణమయమునందుఁ గూడ గలవుగాని యయ్యవి సామాన్యజనదృష్టికెంతమాత్రమును గోచరములు గాక యోగిజన ప్రత్యక్షసిద్ధములు. దానంజేసి స్థూలదేహమును సర్వవిధముల విశసనము సేయగల్గిన భిషగ్జనుల దృష్టికెంతమాత్రమును గోచరములు గావు నయ్యవి శాస్త్రైకవేద్యములును అనుమేయములును. అట్టి నాడులయొక్క విశేషము త్రిశిఖిబ్రాహ్మణోపనిషత్తునందుఁ బుష్కలముగ బరీక్షింపఁబడియున్నది. అందు ప్రకృతమునకు సుషుమ్నా ఇడా పింగళా యను నాడుల విశేషముమాత్ర మావశ్యకము. అయ్యవి యిట్లు నిర్వచింపఁబడియున్నవి :—

సుషుమ్నా—

కన్దమధ్యే స్థితా నాడీ సుషుమ్నా సుప్రతిష్ఠితా ।
పద్మసూత్ర ప్రతీకాశా ఋజురూర్ధ్వ ప్రవర్తనీ ।
బ్రహ్మణోవివరం యావద్విద్యుదాభానాళకమ్ ।
వైష్ణవీ బ్రహ్మనాడీచ నిర్వాణప్రాప్తి పద్ధతిః ॥

ఇడా పింగళా—

ఇడాపిఙ్గలా చైవతస్యాః సవ్యేతరేస్థితే ।
ఇడాసముత్థితా కందాద్వామనాసా పుటావధి ।
పిఙ్గలాచోత్థితా తస్మాద్దక్షనాసా పుటావధి ॥

సుషుమ్నా నాడియొక్క మూలాధారమందు కుండలినీ యను విఖ్యాతినిగాంచిన ప్రాణశక్తియున్నది అయ్యది యిట్లు నిర్వచింపబడియున్నది—"మూలాధారస్థితా బిసతంతు నిభా విద్యుత్ప్రభా ప్రసుప్తభుజగాకారా సార్ధత్రివలయా స్వయంభూలిఙ్గవేష్టినీ శక్తిః" అని ॥

ఈ కుణ్డలినీ శక్తి ప్రాణమయకోశమునకు మూలాధారభూతమగుటచేఁ బ్రాణశక్తియని విబుధులచేఁ జెప్పఁబడుచున్నది. స్థూలమగు నీ యన్నమయ కోశమన్ననో ప్రాణమయ కోశముచే సర్వవిధములఁ జలింపఁజేయబడి వ్యవహారక్షమమగుచుండును. ప్రాణమయ కోశమున నెట్టి వ్యాపారము గల్గునో యందులకుఁ దగు వ్యాపార మన్నమయకోశమునఁ గలుగుచుండును. ప్రాణమయకోశమన్ననో సర్వవిధముల సుషుమ్నచేఁ బ్రచలించుచుండును. సుషుమ్నయన్ననో కుండలిని యనెడి ప్రాణశక్తిచేఁ జలింపుచుండును. కుండలిని యన్ననో మనోమయకోశముచేఁ జలనమునొందుచుండును. కావున మనోమయ కోశమునం దెట్టి సంకల్పము గల్గునో యట్టి చలనము కుండలియందుఁ గల్గును. అద్దానిచేఁ బరంపరయా అన్నమయ కోశము చలించుచు వ్యవహార క్షమమగుచుండును. ప్రాణమయకోశ మీ స్థూలశరీరమునందెంతకాలముండునో యంతకాలము మాత్రమే జీవునియొక్క జీవత్వమును స్థూలశరీరముయొక్క వ్యవహారక్షమత్వ

మును. ప్రాణమయము నస్తమించినచో స్థూలశరీరము మృత కళేబరమని చెప్పఁబడును.

ప్రాణాయామపు టతిశయము—యదోచిత విధిచే నన్నమయమును నిగ్రహించుటకు మున్ముందుఁ బ్రాణమయమును నిగ్రహింపవలయును. ప్రాణమయముయొక్క నిగ్రహమన్నదే కుండలినీ శక్తియొక్క యధీనము గావునఁ గుండలినీ శక్తిని నిరోధింపవలయును. కుండలినీ శక్తియొక్క నిరోధము ప్రాణాయామమువలనఁ గలుగును గావున సర్వకర్మలయొక్క ప్రారంభమునఁ బ్రాణాయామము విధింపఁబడుచున్నది.

### "సంధ్యాముపాసీత"

సమస్త వేదములందును లెస్సగాఁ జూడఁబడెడి "లిఙ్లోట్తవ్యప్రత్యయఘటిత క్రియాపదములతో నొప్పు వాక్యములు విధులనఁబడును. అట్టి విధులలో "సంధ్యాముపాసీత" యను విధి యగ్రగణ్యమని త్రైవిద్యవృద్ధులచే భావింపఁబడి అత్యాదరముతో ననుసరింపఁబడుచున్నది. ఈ విధియందు "ఉపాసీత" యనునది చోదన యనఁబడును. చోదన యనఁ బ్రేరేపణము, ఆజ్ఞ యని యర్థము. "ఉపాసనంకుర్యాత్" ఉపాసనమును జేయవలయును—అని ప్రకృతి ప్రత్యయములయొక్క యర్థముచేఁ దెలియవచ్చును. ఉపాసనమన నభిధ్యానమని యర్థము. దేని నభిధ్యానము చేయవలయునను నాకాంక్షగలుగ"సంధ్యాం" సంధ్యాదేవత నభిధ్యానముఁ జేయవలయును. ఎట్లు అభిధ్యానముఁ జేయవలయునన్న—గాయత్రీమన్త్రావృత్తి సహితముగ "సోహమస్మీతి" యని సంధ్యాదేవతా విభావనమని చెప్పఁబడును ఇట్టి విభావనము గురుముఖైక వేద్యము. ఇచట సంధ్యాశబ్దము దేవతా వాచకము. అని యిట్టుల నిర్వచింపఁబడి యున్నది—

"బ్రహ్మణోపాస్యతే సంధ్యా విష్ణునా శంకరేణచ।
తస్మాదుపాసయేద్దేవీం శ్రేయస్కామో ద్విజోత్తమః।
యా సంధ్యా సా జగత్సూతే మాయాతీతాతు నిష్కలా।
ఐశ్వరీ కేవలాశక్తిః తత్త్వత్రయ సముద్భవా॥ అని.

ఈ సంధ్యాదేవినే "శ్రీ" యనియు, "మాత"యనియు నఖిలవేదములును బల్కుచు నీ శ్రీయొక్క యుపాసనమే శ్రీవిద్య యని కొనియాడుచు "సామవేదీయమగు "గుణనిక"యను నుపనిషత్తుచే సర్వ విధముల వివరింపఁబడియెను. ఇట్టి గుణనికనే "శ్రీ రహస్యనామ"మని విబుధలోకము సెప్పుచున్నారలు. ఇట్టి గుణనికయందలి—

"గాయత్రీవ్యాహృతిః సంధ్యాద్విజబృందనిషేవితా"యను రహస్యనామము శ్రీవిద్యయొక్క యతిశయమును ముల్లోకములకును బ్రబోధింపుచున్నది.

కాలవాచకము :—సంధ్యాశబ్దము దేవతా వాచకమయ్యును, అట్టి దేవతయొక్క యుపాసనాకాల విశేషమును గూడ బోధింపుచున్నది. అదెట్టులనిన—

"అహోరాత్రస్యచయస్సన్ధిః సూర్యనక్షత్రవర్జితః।
సాతుసంధ్యానమాఖ్యాతా మునిభిస్తత్త్వదర్శిభిః॥ అని.

తంత్రవాచకము—అంతియ కాదు. సంధ్యాశబ్దముచే సంధ్యోపాసనా రూపమగు తంత్రముఁగూడ గ్రహింపఁబడుచున్నది. ఎట్టులన. "సంధ్యాత్రయంతు కర్తవ్యం ద్విజేనాత్మవిదా సదా"యని. ద్విజశబ్దము బ్రాహ్మణక్షత్రియ వైశ్యవర్ణత్రయ సామాన్యద్యోతకము. అట్టులనే విప్ర శబ్దముఁగూడ—

"జన్మనా జాయతే శూద్రః కర్మణా జాయతే ద్విజః।
వేదపాఠాద్భవేద్విప్రః బ్రహ్మజ్ఞానేన బ్రాహ్మణః॥ అని

ఇచ్చట "బ్రాహ్మణ"శబ్దముగూడ ద్విజసామాన్య పరమే కాని వర్ణవిశేషపరముగాదు. మఱియొకచో—

"సంధ్యాస్నానం జపోహోమోదేవతా నాంచపూజనమ్।
ఆతిథ్యం వైశ్వదేవంచ షట్కర్మాణి దినేదినే"యని.

ఇందు ద్విజులకుఁ బ్రతిదినము విధింపఁబడిన యారు కర్మలందు విధింపఁబడియున్న "సంధ్యా"శబ్దము—సంధ్యాతంత్రపరము. సంధ్యాకాలము :—సంధ్యాకాలము సాయంకాలము, ప్రాతఃకాలము, మధ్యాహ్నకాలము, మధ్యరాత్రకాలమని నాల్గువిధములు. దానంజేసి "సంధ్యాముపాసీత" అను విధిచే ప్రతిదినము నాలుగు సంధ్యాకాలములందును సంధ్యాశబ్దవాచ్యమగునట్టి గాయత్రీమంత్ర ప్రతిపాద్యమును చిచ్ఛక్తిరూపమును నగు శ్రీదేవి యనెడి దేవతను దన హృదయమునందు "సోహమస్మీతి" యను భావనముచే గాయత్రీమంత్రావృత్తి పూర్వకముగ ధ్యానము చేయవలయునను నర్థ మప్రతిహతముగఁ దెలియవచ్చెడిని.

సంధ్యోపాసనాఫలము—పైనఁజెప్పఁబడిన న్యాయము ననుసరించి సంధ్యోపాసనము గావించుచుండినచోఁ గల్గు ఫలమిట్లు నిర్వచింపఁబడియున్నది.

"సంధ్యాముపాసతే యేతు సతతం సంశ్రితవ్రతాః।
విధూతపాపాస్తే యాన్తి బ్రహ్మలోకం సనాతనమ్॥

అనియు—

ఏతద్విదిత్వా యస్సన్ధ్యాముపాస్తే సంశ్రితవ్రతః।
దీర్ఘ మాయుస్స విన్దేత సర్వ పాపైఃప్రముచ్యతే" యని

యును పూర్ణాయువు దురితనివృత్తి బ్రహ్మలోకావాప్తియును సంధ్యోపాసనవలన గలుగు ఫలములని స్మరింపఁబడియున్నది.

ఇంతియ కాదు. సంధ్యోపాసనము సకలములగు శ్రౌత స్మార్తకర్మాదికమునకు యోగ్యతా హేతువనియు సకల నిత్య

కర్మలలో నగ్రగణ్యమనియు స్మరింపఁబడుచున్నది— అదెట్లనిన—

"సంధ్యాహీనోఽశుచిర్నిత్య మనర్హః సర్వకర్మసు ।
యదన్యత్కురుతేకర్మ నతస్యఫలభాగ్భవేత్ ॥ అని.

అంతియకాదు. సంధ్యోపాసనమును జేయకపోయినచో గొప్ప యనర్థముగూడఁగల్గునని నిర్వచింపఁబడియున్నది—

"సంధ్యా యేన న విజ్ఞాతా సంధ్యా యేనానుపాసితా ।
జీవమానో భవేచ్ఛూద్రోమృతః శ్వానోభిజాయతే ॥ అని.

కావున నభ్యుదయ నిశ్శ్రేయసాభిలాషులగు సకల ద్విజుల కును అర్థాత్తు ద్విజసములకును నవశ్యకర్తవ్యమగు నిత్య కర్మానుష్ఠానము.

రెండువిధములగు సంధ్యోపాసనము—అవశ్యాచరణీ యమగు సంధ్యోపాసనము వైదికమనియుఁ దాంత్రిక మనియు రెండు విధములు. అందు వైదికము వేదాధి కారవంతులగు ద్విజులకును ద్విజసములకును మాత్రమే. ఇఁక తాంత్రికమన్ననో వేదాధికారరహితులగు స్త్రీశూద్ర ద్విజబంధువులకని వ్యవస్థ సూతసంహితయందు నిర్వ చింపఁబడియున్నది.—

"వైదికీతాంత్రికీ చేతిద్వివిధ్యేః తాంత్రికీ తుసా ।
తాంత్రికస్యైవనాన్యస్య వైదికీవైదికస్యహి ॥ యని.

ఇట్లు శ్రుతిస్మృతిశిష్టాచారానురోధముచే ద్విజపురుషుల కును ద్విజసమపురుషులకును వైదికసంధ్యయందును ద్విజస్త్రీలకును శూద్రులకును ద్విజబంధువులకుఁ దాంత్రిక సంధ్యయందును నధికారమని యవశ్యముఁ దెలియఁదగిన విశేషము.

## స్వశాఖోక్తవిధిః

సంధ్యానుష్ఠానతంత్రము వేదశాఖాభేదముచే భిన్న ములుగాఁ దెలియవచ్చుచున్నది. ఏ వేదశాఖయందు నే ద్విజుఁడు జన్మించునో యట్టి శాఖాసూత్రముచే విధింపఁ బడిన మంత్రములతో నా శాఖాసంధ్యోపాసనమునే చేయ వలయును. వేరొక విధానము నాశ్రయింపఁగూడదు. అట్లుఁ గావించెనో శాఖాభ్రష్టుఁడఁబడి శిష్టులకు దూరుఁడగుచు ననర్థము నొందును. సంధ్యాతంత్ర విశేషమందు శాఖా భేదముచే భేదములు గాన్పించుచున్నను తంత్రసామాన్య మిచట సంక్షేపముగఁ బ్రదర్శింపఁబడుచున్నది. అదెట్టు లనిన—(1) ఆచమనము (2) ప్రాణాయామము (3) సంక ల్పము అనునవి సాధారణము. (1) మార్జనము (2) ఉదక ప్రాశనము (3) అఘమర్షణము అను మూడును పూర్వాం గము. (1) సంకల్పము మొదలుగాఁ గల్గి యాత్మప్రదక్షిణ మంతముగా గల్గినట్టి అర్ఘ్యప్రదానము (2) సంకల్ప పూర్వక గాయత్రీహృదయాద్యుద్వాసనాంతమగు గాయ త్ర్యభిధ్యానము. (3) పిమ్మట వారుణఋుక్కులచేఁ గాని సౌర ఋుక్కులచేఁ గాని యాదిత్యోపస్థానము—ఈ మూడును ప్రధానము. మిగిలినదంతయు నుత్తరాంగము — అని సామాన్యముగ వైదికసంధ్యా తంత్రస్వరూపము. ఇఁక తాంత్రికసంధ్యాస్వరూపమన్ననో సంప్రదాయ గురుముఖైక వేద్యము.

వైదికసంధ్యయందలి విశేషములు మాచే రచింపఁ బడిన సంధ్యాకలయందుఁ దెలిసికొననగును.

## సూర్యాయార్ఘ్యమ్

"ఏహి సూర్య సహస్రాంశో తేజోరాశే జగత్పతే ।
అనుకంపయ మాం దేవ గృహాణార్ఘ్యం నమోస్తు తే॥"

యని యొక తర్పణము స్మరింపఁబడుచున్నది. అట్టితర్పణ ముచే భాస్కరుడు ప్రీతినిఁ జెందును. ఆరోగ్యమునకు హేతువగును.

## నిత్యహోమః

నిత్యహోమమౌపాసనము అగ్నిహోత్రము అని రెండు విధములు. అందు సాహితాగ్నికి నగ్నిహోత్రమును అనా హితాగ్ని యగు గృహస్థునకు ఔపాసనము అని వస్తు గతి. అట్టి హోమమువలన నగ్నిదేవునకుఁ బ్రీతి గలు గును అగ్ని యన్ననో ద్విజులకు నగ్రణి యగు దేవత "అగ్నిర్దేవో ద్విజాతీనామ్" అని స్మృతి. "అగ్నేర్యోవై బ్రాహ్మణః" అని శ్రుతి. అగ్నికి యాగమును జేయకుంత నితరమందు శ్రమ జేయువా డనర్థమును బొందును—అని "యోవై స్వాం దేవతామతియజతే ప్రస్వాయై దేవతాయై చ్యవతే నపరాం ప్రాప్నోతి పాపీయాన్భవతి" అని శ్రుతి ఘోషింపుచున్నది. "అగ్నిముఖావై దేవాః" అను శ్రుతి వలన నగ్ని సకలదేవతలకును ముఖము గావున నగ్ని ముఖ మునవేసి యగ్నినిఁదృప్తినొందించిన సకలదేవతలును దృప్తిఁజెందుదురు. కావునఁ బ్రతిదినము సాయంకాలము నందును ప్రాతఃకాలమునందును సంధ్యోపాసనముతోఁ బాటు అగ్నిహోత్రమునో యౌపాసనమునో యథాధికార మాచరించి తీరవలయును.

## "బ్రహ్మయజ్ఞ తర్పణే"

అగ్నిహోత్రమునుగాని యౌపాసనమునుగాని నిర్వ ర్తించి పిమ్మట బ్రహ్మయజ్ఞమును సద్దాని కంగమగు ఋుషితర్పణమును గావింపవలయును. అందులకు విధి "స్వాధ్యాయాన్మా ప్రమదః । స్వాధ్యాయోధ్యేతవ్యః" అని.

బ్రహ్మయజ్ఞఫలము స్వాధ్యాయ బ్రాహ్మణమునందు నిట్లు నిర్వచింపఁబడి యున్నది.—

"యం యం క్రతుమధీతే తేనతేనా స్యేష్టంభవతి ।
అగ్నేర్వాయోరాదిత్యస్యసాయుజ్యంగచ్ఛతి "యని ॥

బ్రహ్మయజ్ఞముచె నకల యాగముల ఫలములను అగ్నివాయ్వాదిత్యుల సాయుజ్యమును గల్గును గావున బ్రహ్మయజ్ఞము మహాఫలప్రదము. దానంజేసి ద్విజు లెల్లరును నిత్యము బ్రహ్మయజ్ఞము నాచరింపవలయును. పిమ్మట మాధ్యాహ్నిక విధి నాచరించి యథోచితముగ విధి ననుసరించి భోజనమును జేయవలయును

"మాధ్యాహ్నిక విధిః"

మాధ్యాహ్నిక సంధ్యోపాసనము, పితృయజ్ఞము, వైశ్వ దేవము అతిథిపూజనమును నను నాలుగును మాధ్యాహ్నిక మున నాచరింపవలయును. సంధ్యోపాసనము ప్రాతఃకాలిక సంధ్యోపాసనపు ప్రస్తావమున నిరూపింపఁబడినది.

"పితృతర్పణమ్"

పితృదేవతల తృప్తికొఱకుఁ బితృతర్పణమును జేయ వలయును. దానంజేసి వంశాభివృద్ధి గలుగునని చెప్పఁ బడుచున్నది.

"వైశ్వదేవః"

వైశ్వదేవమను కర్మము అన్నసంస్కారము ద్వారా పురుష సంస్కార హేతువగుచున్నది. పురుష సంస్కార మనగాఁ జిత్తశుద్ధి. సిద్ధమగు నన్నము పంచసూనములను పాపములచే దుష్టమగుచు ననర్థమును గల్గించును. పంచ సూనములనగా (1) కండనీ (2) పేషణీ (3) చుల్లీ (4) ఉదకుంభినీ (5) మజిఁజనీ యను పాపములు గృహస్థు నకు నిత్యసిద్ధములు. వానిచే స్వర్గము నెంతమాత్రమును బొందనేరడు. గావున నట్టి పాపములు వైశ్వదేవ కర్మా నుష్ఠానముచే నశించును. గృహస్థుడు శుద్ధుఁడగును.

"అతిథిపూజనమ్"

అతిథిలక్షణ మిట్లు నిర్వచింపఁబడియున్నది.

"అసమానగ్రామోఽతిథి రేకరాత్రికోఽధివృక్ష సూర్యోప స్థాయా "యని. బ్రాహ్మణునకు బ్రాహ్మణేతరుడన క్షత్రి యుడుగాని వైశ్యుఁడుగాని యతి గానేరడనుటచేఁ బైలక్షణముతో నెవ్వ బ్రాహ్మణుఁడే యతిథియగును. అట్టి బ్రాహ్మణుఁడు వైశ్వదేవాంతమునకు లభించెనేని యాతని సర్వవిధములఁ బూజింపవలయును. అట్టి పూజనము వలన సర్వధర్మ సంగ్రహము గలుగును. లేనిచోఁ బ్రత్య వాయము వినవచ్చుచున్నది. కారకోపనిషత్తునందు:

"వైశ్వానరః ప్రవిశత్యతిథిర్బ్రాహ్మణో గృహాన్। తస్యైతాగం శాంతింకుర్వన్తిహర వైవస్వతోదకమ్॥ అశాప్రతీక్షేసంగతగం సూనృతాం చేష్టాపూర్తే పుత్రపశూగంశ్చ సర్వాన్। ఏతద్వృఙ్క్తే పురుషస్యాల్పమేధసో యస్మిన్ననశ్నన్వసతి బ్రాహ్మణో గృహే" యని॥ బ్రాహ్మణులలోఁ బరివ్రాజకుఁడు శ్రేష్ఠుఁ డని చెప్పబడుచున్నాడు. అటులనే బ్రహ్మచారియును—

"యతిశ్చ బ్రహ్మచారీచ పక్వాన్నస్వామినావుభౌ।
తయోరన్నమదత్వాతు భుక్త్వా చాంద్రాయణం చరేత్"

అని.

"భోజనమ్"

పూర్వోక్తముగ మాధ్యాహ్నిక విధినాచరించి భోజనమును జేయవలయును. అట్లు భుజించుటచే నపూర్వము వృత్తి చిత్తశుద్ధి గలుగును. చిత్తశుద్ధివలన జ్ఞానమలవడును. జ్ఞానముచే నైహికాముష్మికనిశ్శ్రేయసములఁ బొంద నవ కాశము గల్గును.

భోజనమును జేయునపుడు ఎట్టి ముఖముగఁ గూర్చుని భుజించినను యథోచిత ప్రయోజనము గలుగును. ప్రత్య వాయము లేదు—"ఆయుష్యం ప్రాఙ్ముఖో భుఙ్క్తే యశస్యం దక్షిణాముఖః। ప్రత్యఙ్ముఖః శ్రియాభుఙ్క్తే ఋతం భుఙ్క్త ఉదఙ్ముఖః" అని పలబోదక వాక్యములు.

"తాంబూల భక్షణమ్"

భోజనానంతరము ఆచమనమును జేసి తాంబూల మును భక్షింపవలయును—తాంబూలవిధి యిట్లుఁ జరుగు చున్నది—

"ఏకపూగం సుఖారోగ్యం ద్విపూగం నిష్ఫలంభవేత్।
త్రిపూగమిరితంశ్రేష్ఠ మధికం నైవశుష్యతి,
పర్ణమూలే మహావ్యాధిః పర్ణాంతే పాపసమ్భవః।
శిరాబుద్ధి వినాశినీ తస్మాత్తాన్వర్జయేత్॥ అని.

"ప్రతిషేధః"

భోజనానంతరము రాగాదులచేఁ బ్రాప్తమగునట్టి యనర్థద్వయమును "దివాస్వాపంమైథునంచన కుర్వీత" పగటియందు నిద్రయును మైథునమును జేయగూడదు— అని. అట్టి యకృత్యములవలన నాయువును బుణ్యమును నశించును. అర్థాత్తు పాపము సంభవించునని యర్థము. దానివలన నరకము గలుగును.

"సిద్ధాన్తచిన్తనమ్"

"ఆసుప్తేరామృతేః కాలం నయే ద్వేదాన్తచిన్తయా।

దద్యాన్నావసరం కించిత్కామాదీనాం మనాగపి "యను విధియొక్క యనువాదము" ఆసాయం సిద్ధాన్తచిన్తనమ్ కుర్యాత్" అని. ఒకవేళ లౌకికకార్యము లేవియైనయున్నచో నవ్వానిని సాయంకాలపర్యన్తము చక్కఁబెట్టుకొనవలయు ననియర్థాత్తు లభ్యమగును. ఏలనన సాయంకాల పర్యంత మును జేయవలసిన శ్రౌతకార్యములుగాని స్మార్తకార్య ములుగాని ప్రత్యేకముగ విధింపఁబడి యుండలేదు. తిరుగ

సాయంకాలమునందు నాచరింపఁబడవలసిన కర్మములు విధింపఁబడియున్నవి.

"సాయంతన కృత్యమ్"

"తతః సాయన్తనం సంధ్యాం హోమంచ విదధ్యాత్" అని. విప్రకారము ప్రాతఃకాలమునందు సంధ్యోపాసనము హోమమును విధింపఁబడియున్నవో యాతీరుననే సాయంకాలమునందును విధింపఁబడియున్నవి.

"రాత్రిభోజనమ్"

రాత్రియందు భోజనమైచ్ఛికము. "ద్విరహ్నో మను ష్యాణామ్" అను శ్రుతి; రాత్రియందు క్షుధార్తుడైనచో భుజింపవచ్చును. లేనిచో మానవచ్చును. భోజనమువలె వైశ్వదేవముగూడ నైచ్ఛికము గావున సాయంతన విధులందు నుపదేశింపఁబడలేదు.

శయనవిధిః

"అథపుష్పానులేపన మిత్యాది సపర్యావిధినేతి" యను వాక్యాంతమున శయనవిధి యుపదేశింపఁబడియున్నది. పుష్పానులేపనమలక్ష్మ పరిహారార్థము. "ప్రాప్తేనిమిత్తే" యన మైథునేచ్ఛ గల్గినచో యని యభిప్రాయము. అయ్యది యిట్లు స్మరింపఁబడియున్నది. "ఋతౌ భార్యాముపేయాత్" "సర్వత్ర ప్రతిషిద్ధవర్జమ్" అను సూత్రములచే విధింపఁ బడిన భార్యాసమావేశకాలము సంప్రాప్తమైనచో —"రేతఃపతనకాలమువరకు భార్యతోగూడ శయనమును గావింపవలయును. రేతఃపాతానంతరముగాని యితర కాలములందు నిషేధముకాకుండఁగాని భార్యతోఁగూడ నెంత మాత్రమును గూడ శయనమును గావింపగూడదు. అయ్యది యాయుఃక్షీణహేతువును ననారోగ్యహేతువును అగును. సుషుప్తికిఁ బూర్వము విధింపఁబడిన భగవద్ధ్యానమునకుఁ గూడఁ బ్రతిబంధహేతువగుచు ననర్థమును గలుగఁ జేయును. సపర్యావిధి యున్ననె గుణములైకమత్యము. శాస్త్రచోదితమైనయది కేవలము భగవద్రూపమే యని "ధర్మావిరుద్ధోభూతేషు కామోస్మి భరతర్షభ" యని యుపదేశించియున్నారు.

శయనమునందుదిగా నియమము లిట్లు స్మరింపఁబడి యున్నవి :—

"నోత్తరాభిముఖః స్వప్యాత్ పశ్చిమాభిముఖోనచ।
నచాకాశే ననగ్నోవా నచుచిర్నాసనే క్వచిత్॥
నశీర్ణాయాంతు ఖట్వాయాం శూన్యాగారేనచైవహి।
ప్రాచ్యాందిశి శిరశ్శస్తం యామ్యాయా మథవాన్నృప.
సదైవస్వపతఃపుంసో విపరీతంతు రోగదమితి॥"

అన్యచ్చ:—

"ప్రాక్శిరావాదక్షిణ శిరావేష్టదేవతాం సత్వాస్వపేత్।
వైణవందండం శయనీయసమీపే నిధాయ ప్రక్షాళిత పాదః కృతరక్షః స్వపేదితి।

అన్యచ్చ :—

"స్వగృహే ప్రాక్శిరాశ్శేతే శ్వాసురేదక్షిణాశిరాః।
ప్రత్యక్శిరాః ప్రవాసేతు నకదాచిదుదక్శిరాః॥ ఇతి.
ఇతి నారాయణస్మృతిః॥

---

# భగవదుపచారములు - తత్ప్రయోజనము

(పూర్వానువృత్తము)

పండిత, వేదాంతం విప్రనారాయణాచార్యులు

(శ్లో) 'స్వార్థం గృహార్చనం ప్రోక్తం, పరార్థం త్వాలయార్చనమ్' దేవదేవునర్చించుట కాలయాభ్యంతర ప్రవిష్టుడైన పూజకుడు స్వార్థమునకుఁగాక (శ్లో) "లోకా స్సమస్తా స్సుఖినో భవంతు" అను భావముతో నాల యార్చనమందు పాల్గొని జగదీశు నర్చించుచున్నాఁ డను నది విజ్ఞుల కవగతమే. పూజకుఁడు ప్రదక్షిణ, నమస్కార ములతో పునీతుడై రాజరాష్ట్రాభివృద్ధికొరకు పాలకుల యొక్కయు పాలితులయొక్కయు క్షేమముకొరకు తాఁ జేయబోవు నిత్యార్చనముతో భగవానుఁ డనుగ్రహచిత్తుడై లోకోపద్రవములు ఉపశమింపఁజేయుగాక యని త్రికరణ శుద్ధితో భగవాను నర్థించుచున్నాఁడు (మం "శామ్యంతు ఘోరాణి శామ్యంతు పాపాని శామ్యంతు ఈతయః। శుభాని వర్ధంతామ్" లోకోపద్రవకరములైన భయంకరభూతములు ఉపశమించుగాక, భగవద్భక్తుల యొక్క సమస్త పాపములు శమించుగాక, లోకానర్థ కరములైన ఈతిబాధలు కలుగకుండుఁగాక, చరాచర ప్రపంచములోని జీవులందరకు క్షేమము లభివృద్ధిఁ జెందుగాక "భగవతో బలేనే" తి దేవం ప్రార్థ

ఘంతి, (మం) భగవతో బలేన భగవతో వీర్యేణ, భగవత స్తేజసా భగవతః కర్మణా భగవతా ఽనుగృహీతో భగవతా ఽనుజ్ఞాతో భగవత్కర్మ కరిష్యామి తి ద్భగవా నను మన్యతామ్" ॥ పదచ్ఛేదము-భగవతః బలేన భగవతః వీర్యేణ భగవతః తేజసా భగవతః కర్మణా భగవతా అనుగృహీతః భగవతా అనుజ్ఞాతః భగవత్కర్మ కరిష్యామి తత్ భగవాన్ అనుమన్యతామ్

ఈ మంత్రము శ్రీవైఖానసభగవచ్ఛాస్త్రపరిచితము. దీని కీశాస్త్రమందు 'బలమంత్ర'మని పేరు. సంహితాకారు లీ మంత్రమును సాత్త్వికత్యాగమందు వినియోగించి యున్నారు. సర్వశేషి యైన శ్రియఃపతి స్వీయములైన దేహేంద్రియాద్యుపకరణములతో తన్ను పూజించుటయే ముఖ్యకర్తవ్య మని స్వనియమ్యుడనైన నన్ను ప్రేరించి నాచే నీ పూజాకార్యమును చేయించుచున్నా డని తలచుట సాత్త్వికత్యాగ మనఁబడుచున్నది. ఈ బలమంత్రమందు భగవచ్ఛబ్దము బహుశో వినియుక్తమైనది "భగో ఽస్యాస్తీతి భగవాన్" (శ్లో) "ఐశ్వర్యస్య సమగ్రస్య వీర్యస్య యశస శ్శ్రియః। జ్ఞానవైరాగ్యయో శ్చైవ షణ్ణాం భగ ఇతీరణా" సమగ్రైశ్వర్యమునకును పరాక్రమమునకును కీర్తికిని యోగాదిరూపములతో నున్న లక్ష్మికిని జ్ఞానమునకును వైరాగ్యమునకును భగమని పేరు. ఈ యారు లక్షణములు కలిగియున్నవాడు భగవంతుడు. షడ్గుణైశ్వర్య సంపన్నుండవై శ్రియఃపతివైన నీయొక్క బలముచేతను పరాక్రమముచేతను తేజస్సుచేతను కర్మముచేతను నా నియమ్యుడైన వీడే కర్మ నాచరించునని తలచబడినవాడైన నిత్యలక్ష్మీ సమేతుండవైన నీచే నాజ్ఞప్తుడనై నీ పూజా కార్యమును చేయుచున్నాను. బ్రహ్మాత్మకమైన ఈ కర్మ నాచరించుటకు భగవాను డనుమతించుగాక యని సాత్త్విక త్యాగము జేసిన పూజకుడు ఉపచారోపసర్జనములైన సమ్మార్జనాది కృత్యముల పరిచారకబృందముచే జేయించి ఉపచారోపక్రమణము జేయుచున్నాడు. ఈయుపచారములు ఉత్తమోత్తమ పక్షమందు మరీచి మహర్షి ముప్పది రెండుగా పరిగణించి యున్నారు. (యథా) ద్విచత్వారింశే పటలే - విమానార్చనకల్పే :-అథార్చనాంగోపచారాన్ వక్ష్యే. ఉపచారో విగ్రహస్యైచ కాథౌ భవతః; ఆసన, స్వాగతా, నుమాన, పాద్యా, ఽచమన, పుష్ప, గంధ, ధూప, దీప, అర్ఘ్య, ఆచమన, స్నాన, ప్లోత, వస్త్ర, ఉత్తరీయ, యజ్ఞోపవీత, పాద్య, ఆచమన, పుష్ప, గంధ, ధూప, దీప, ఆచమన, హవిః, పానీయ, ఆచమన, ముఖవాస, బలి, ప్రణామ, ప్రదక్షిణాః, పుష్పాంజలి సహితా, స్తుతి శ్చేతి ద్వాత్రింశదుపచారాః; నృత్త, గేయ, సహితా ఉత్తమోత్తమమ్; ముఖవాసాన్తాః ప్రణామప్రదక్షిణయుతాః నవవింశత్యుపచారాః ఉత్తమమధ్యమమ్; ముఖవాసాంతాః ప్రదక్షిణయుతాః అష్టవింశత్యుపచారాః ఉత్తమాధమమ్; అర్ఘ్యాఽచమనాంతాః ప్రణామప్రదక్షిణయుతాః త్రయోదశోపచారాః మధ్యమోత్తమమ్; అర్ఘ్యాఽచమనాంతాః ఏకాదశోపచారాః మధ్యమమధ్యమమ్; పాద్యాద్యర్ఘ్యాఽచమనాంతాః అష్టోపచారాః మధ్యమాధమం; పుష్పాద్యర్ఘ్యాఽచమనాంతాః షడుపచారాః అధమోత్తమం; పుష్పదానం ప్రణామశ్చ ద్వావుపచారౌ అధమ మధ్యమమ్; ప్రణామ ఏకోపచారః అధమాధమ మితి ॥

ఆసనోపచారము మొదలు స్తుత్యుపచారమువరకు గల ముప్పదిరెండు విగ్రహములతో నర్చించుట ఉత్తమోత్తమ మనియు ఇందు బలిదానము పుష్పాంజలి స్తుతియు నను విగ్రహత్రయమును విడి చేయుట ఉత్తమమధ్యమ మనియు ముఖవాసోపచారాంతముగా ప్రదక్షిణముతో కలిసి చేయునట్టి ఇరువదెనిమిది యుపచారములచే నర్చించుట ఉత్తమాధమమనియు ఆసనోపచారము మొదలు స్నానోపచారమునకు ముందువచ్చెడి ఆచమనోపచారమువరకును ప్రదక్షిణప్రణామములతో కలసి త్రయోదశోపచారములతో నర్చించుట మధ్యమోత్తమ మనియు పైజెప్పబడిన ఆచమనోపచారాంతముగా గల ఏకాదశోపచారములతో నర్చించుట మధ్యమమధ్యమ మనియు ఈ ఏకాదశోపచారములలో ఆసన స్వాగతానుమానముల వీడిన మధ్యమాధమ మనియు పుష్ప, గంధ, ధూప, దీపా ఽర్ఘ్యాఽచమనములనెడి షడుపచారములు అధమోత్తమ మనియు పుష్పాంజలిదానము ప్రణామమునను రెండు విగ్రహములతో నర్చించుట అధమమధ్యమ మనియు ప్రణామోపచార మొక్కటియే జేయుట యధమాధమ మనియు పైవాక్యములలోని భావము. "హవిర్హీనే త్రయోదశోపచారా నష్టోపచారాన్వా హవిషి లబ్ధే నవవింశత్యుపచారా నష్టవింశత్యుపచారాన్వా కుర్వీత, విమానార్చనార్చనాయామేవ ద్వాత్రింశదుపచారాన్ కుర్యాత్, అథవా షోడశోపచారాన్వా; హవిషి లబ్ధేప-పక్వాన్న ముపలభ్యము కానపుడు పదమూడు ఉపచారములచేతను గాని ఎనిమిది ఉపచారములచేతను గాని పూజింపవలయుననియు పక్వాన్నము లభించినపుడు ఇరువదితొమ్మిది ఉపచారములచేతను గాని ఇరువది యెనిమిది ఉపచారములచేతను గాని పదునారు ఉపచారములచేతను గాని పూజింపవలయుననియు ఆలయార్చనమందు ద్వాత్రింశత్ (ముప్పదిరెండు) ఉపచారములతో పూజించుట ముఖ్యమనియు పైవాక్యముల వలన స్పష్టమగుచున్నది.

ద్వాత్రింశదుపచారములలో ఆసనోపచారము మొదటిది. శ్రీమహీయుక్తుడైన శ్రీనివాసు నాహ్వానించి తా జేయబోవు

సత్కారముల నందుకొనుటకు "ప్రతద్విష్ణుః" "అస్త్వాసనం" అను మంత్రములతో పుష్పములను గాని దర్భలనుగాని పీఠమందుంచి కూర్చుండ ప్రార్థించుటయే ఆసనోపచారము. ఆహూతులుగనో అనాహూతులుగనో సంప్రాప్తులగు పూజ్యులను జూచినపుడు వారికుచితమగు రీతిని ఆసనాదులనొసగి సత్కరించుట లోకధర్మము. లోకపూజ్యుడగు భగవాను నాహ్వానించి పుష్పములతోగాని దర్భలతోగాని మృదువగునట్టి యాసనము కల్పించి కూర్చుండ నియమించుట శ్రేయోదాయకము. "ప్రతద్విష్ణు స్తవతే" ఈ మంత్రము పూర్వము వివరింపబడినది. (మం) "అస్త్వాసనం శుభం లోకే బ్రసీ శుద్ధ స్తపోమయం। తప శ్చాయు స్తథా యోగ మస్తు తే పరమం పదమ్॥" పదవిభాగము = అస్తు ఆసనం శుభం లోకే బ్రసీ శుద్ధః తపోమయమ్, తపః చ ఆయుః తథా యోగం, అస్తు తే పరమం పదమ్,- అర్థము: లోకే = అస్మిన్ లోకే శుభం = మంగళప్రదమ్ తపోమయం = తపసః ఆసనప్రధానత్వాత్తపోమయం మయా దత్తం ఆసనం తే = తవ శుద్ధః = పావనః పావనీ బ్రసీ, అస్తు; తవాఽసనదానేనాస్మాకం తపః = ధర్మార్థం కర్మ, ఆయుః శతవత్సరపరిమితం చాస్తు; కించ పరమం పదం యోగ మస్మాక మస్తు; తాత్పర్యము-వైకుంఠవాసివైన ఓ లక్ష్మీపతీ, నీకీ లోకమందు నాచే కల్పింపబడిన ఈ యాసనము మంగళప్రదమైనట్టిదియు తపోమయమైనట్టిదియునై వ్రతస్థుల యాసనమువలె మెత్తనైనదియు పావనమైనదియు నగుగాక, నీ కాసనోపచారముఁ జేసిన మాకు నూరు సంవత్సరముల పరమాయువును ధర్మకర్మాసక్తియు ఉత్కృష్టస్థానప్రాప్తియు లభించుగాక! "విశ్వాధికానా" మితి స్వాగతం సమ్ముఖీకరణం"

(మం) విశ్వాధికానాం జననాదికర్త్రే ధాత్రే తపో యజ్ఞ సువేదమూర్తే। సుస్వాగతం యత్ర తు తత్ర యస్మా త్తత్తే పదం సూరిభి స్స్వాగతం తే. పదచ్ఛేదము:—విశ్వాధికానామ్ జననాదికర్త్రే ధాత్రే తపోయజ్ఞసువేదమూర్తే సుస్వాగతం యత్ర తు తత్ర యస్మాత్ తత్ తే పదం సూరిభిః స్వాగతం తే. అర్థము:- పూజకస్య పూజాపరిగ్రహణాయాగతం భగవంతం స్వాగతం పృచ్ఛతి; తపశ్చ యజ్ఞశ్చ సువేద స్సామవేదశ్చ మూర్తి రాకృతి ర్యస్య సః తపోయజ్ఞసువేదమూర్తిః "తపశ్చాస్మి తపస్వినాం" "యజ్ఞానాం జపయజ్ఞోస్మి" "వేదానాం సామవేదోస్మీతి" భగవతైవ గీతాయా ముక్తం తస్య సంబుద్ధిః తపోయజ్ఞసువేదమూర్తే, విశ్వస్య = జగతః అధికానాం = అధిపానామిత్యర్థః, బ్రహ్మరుద్రాదీనామ్ జననాదికర్త్రే ధాత్రే పోషకాయ తే = తుభ్యం యత్ర తత్ర తు మయా నిర్మితప్రదేశే సుస్వాగతం = త్వయా సుస్వాగతమితి కాసుః; యస్మాత్ = వైకుంఠపదాత్ తే = తవాగమనం తే = తవ తత్ = వైకుంఠపదం సూరిభి స్సనకాదిభి స్స్వాగతం = సుప్రాప్తం ఖలు! పూజకుని యొక్క పూజను పరిగ్రహించుటకై ప్రత్యాగతుడైన భగవానుని స్వాగత ప్రశ్నముచే నభిముఖుని గావించుకొనుట ఈ మంత్రములోని పరమార్థము. ఇయ్యది ద్వాత్రింశ దుపచారములలో రెండవదియైన స్వాగతోపచారము. స్వాగతమనగా కుశలప్రశ్నల పరామర్శించుట. ఇట్లు పరామర్శించుటచే ప్రత్యాగతులైనవారు పృచ్ఛకునివైపు ముఖము త్రిప్పి సమాధానము చెప్పెదురు తపోరూపివియు జపయజ్ఞ స్వరూపివియు సామవేదస్వరూపివియునై జగన్నిర్వాహకులైన బ్రహ్మరుద్రాదులకు సైతము జననమరణాదులకు కారణభూతుడవై, పోషకుడవై వెలయుచున్న ఓ చిదచిదాత్మస్వరూపీ, నా పిలుపు విని నాచే కల్పింపబడు నీ యాసనాద్యుపచారములందుటకు వేంచేసితిరా? నా భాగ్య మేమని చెప్పుదును! భవదీ యాగమనము శోభనమే కదా! తమరు వైకుంఠలోకమునుండియే వచ్చుచుండిరా! మీ నెలవైన వైకుంఠలోకమునుగూర్చి నిత్యముక్తులైన సనకాదులు వచ్చియుండిరా? యని తాత్పర్యము. "మనోభిమంతే" త్యర్చనాను మానయాచనమ్" (మం) మనోభిమంతా మానవ స్సుధర్మా యత్ మాతరం వచసోమానసేషు। అమోఘమోఘం ప్రతి వేదవేద్య స్వకం జనానా మనుమన్యతా మిదమ్॥ పదచ్ఛేదము:- మనోభిమంతా మానవః సుధర్మా యత్ మాతరం వచసః మానసేషు అమోఘమోఘం ప్రతి వేదవేద్య స్వకం జనానాం అనుమన్యతామ్ ఇదమ్. అర్థము:- సుధర్మా = శోభనధర్మో మానవః = మనుష్యః మానసేషు = మనసి భవేషు కర్మసు మాతరం ప్రతి వచసః = వచనాత్ యద్యథా మనోభిమంతా = మనసి మన్వానో భవతి తథా హే వేదవేద్య వేదైశ్చ సర్వై రహమేవ వేద్య ఇతి గీతాయాం; జనానాం సంబంధి అమోఘమోఘం = సంపూర్ణఫలవత్ (ఐహికాముష్మికప్రదమ్) స్వకమ్ భవదీయమిదం కర్మ (కర్తుం) అనుమాన్యతామ్ ప్రతిగృహ్యతా మిత్యర్థః

"తాత్పర్యము" సత్ప్రవృత్తిగల మానవుడు (బాలుడు) తన మనసునందుదయించిన కోర్కెల విషయమందు తల్లిని గూర్చి (తల్లికి) మాటలవలన నేవిధముగా తెలియ చేసికొనుచున్నాడో వేదవేద్యుడవైన ఓ చిదచిదాత్మస్వరూపీ! నీ నియమ్యుడనైన నేను లోకులయొక్క క్షేమమును కాంక్షించి సంపూర్ణఫలదాయకమైన (ఐహికాముష్మికప్రదమైన) నీ పూజాకార్యమును జేయబోవుచు తల్లికి బాలుడు తెలియజేసికొను విధముగా తమకు విన్నవించుచున్నాను. నా జేయు పూజా సత్కారములందుట కనుమతించెదవు

గాక! "త్రీణి పదా" "ఇంద్రోబిమంతేతి" పాదయో ర్జలం సంస్రావయేత్ పాద్యం; "త్రీణి పదా విచక్రమే" ఈ మంత్రము వివరింపబడినది.

(మం) ఇంద్రో బిమంతా మనవో వాయవ శ్చాపస్సమగ్రా అభితో యస్య దద్యాత్। విష్ణో ఇమాః వైష్ణవాంస్తర్ప యామి ప్రసీద దేవాధికతేజసైనమ్॥ పదచ్ఛేదము:— ఇంద్రః అబిమంతా మనవః వాయవః చ అపః సమగ్రాః అభితః యస్య దద్యాత్ విష్ణో ఇమాః వైష్ణవాః తర్ప యామి. ప్రసీద, దేవ అధికతేజసా ఏనం॥ అర్ధము:—హే విష్ణో = విశ్వవ్యాపనశీల దేవ, యస్య భవతః అభితః = పాద యో రభితః సమగ్రాః = పద్మవిష్ణుపర్ణశ్యామాకసహితా స్సంపూర్ణా అపః, అబిమంతా ఏతత్కర్మాబిమంతా ఇంద్రః దద్యాత్. అభిమంతారో మనవీశ్చతుదశ మనవః దద్యుః వాయవ స్సప్త మరుతః దద్యుః ఇంద్రతులితవిభవానా మేవ భగవత్పూజనం కర్తు ముచితమితి భావః; హే విష్ణో దేవ ఇమాః వైష్ణవాః త్వత్పాదప్రక్షాళనోదకేన తర్పయామి మామధికతేజసా ప్రసీద ఉపలక్షితం కురు "తాత్పర్యము" విశ్వవ్యాపనశీలుడవైన శ్రియఃపతీ; దేవేంద్రుడును ఇంద్రతులిత విభవులైన చతుర్దశమనువులును సప్తమరుత్తులును సమగ్రమైన (అనగా పద్మములతోను విష్ణుక్రాంతము శ్యామాకము, పచ్చిగరిక మొదలగు ద్రవ్యములతోను కూడియున్న పవిత్రోదకమును నీ పదపంకేరుహములందుంచి ప్రక్షాళనము గావించెదరు గాక. ఈ నీపాద ప్రక్షాళనోదకమును భాగవతాగ్రగణ్యులును వైష్ణవులును ఐన వారలకిచ్చి సంతృప్తిపరచుటకు నీ యధికాధిక తేజస్సుతో నన్ను పరీక్షించి యనుగ్రహింపుము. ఇయ్యది ద్వాత్రింశదుపచారములలో నాల్గవదియైన పాద్యోపచారము. గృహస్థుడైనవాడు తన గేహమున కరుదెంచిన అతిధికి కాలు గడుగ నీరిచ్చుట లోకవిదితమే. అవ్విధముగనే లోక రక్షణార్థమై లోకేశునర్చించు పూజకుడు భగవాను నాహ్వానించి సమగ్రమైన పాద్యోదకము నర్పించుట యకించిత్కరము. (సశేషము)

---

# ఆ గ మ ము లు

*శ్రీవేదాల తిరువేంగళాచార్యులుగారు, గుంటూరు.*

## శ్రీవైఖానసాగమము

విఖనసుడను మహర్షి యీ యాగమములను రచించి తన శిష్యులగు కశ్యప, అత్రి, మరీచి భృగువుల కుపదేశించె నని యొకరు. అసలు విఖనసు డనఁగా బ్రహ్మదేవుడు, అతడే వెనుక చెప్పినట్లు జేసె నని మరియొకరు. ఈ నలువురను నాలుగు పటలములను—సంహితలను—రచించి అగమమును విస్తరింపజేసిరి. లక్ష్మీవిశిష్టాద్వైతభాష్యము పైపటలముల నాధార మొనర్చుకొనియే యెక్కుడుభాగము ప్రవర్తిల్లినది. పైసంహితలనుబట్టి శ్రీనివాసదీక్షితులు మొదలగువారు చాలగ్రంధములను రచించిరి. కాని యీ శాస్త్రమునకు పాంచరాత్రాగమ మక్కడక్కడ ఆశ్రయింపక తప్పనిదే యని యిదివరకే చెప్పియుంటిమి.

## మతప్రక్రియ

జీవుడు అల్పగుణుడు; బ్రహ్మము అధికగుణుడు. వీరిరువురకును ఐక్యము "తత్త్వమసీ" త్యాది వాక్యములు తెల్పినవి. అది యెట్లు కుదురు ననగా సోపానన్యాయమున నీ గుణసంపత్తి సమకూడును. సోపానన్యాయమనగా— మొదలుమెట్టెక్కినతరువాత రెండవమెట్టెక్కినట్లుగా క్రమముగా గుణసంపత్తి యేర్పడుట. అసలిది యంతయు అవాస్తవమే. అనగా, వాస్తవమునకు బ్రహ్మము నిర్గుణమే. ఆనిర్గుణియందు బుద్ధి క్రమముగా నిలువబడుటకై సగుణోపాసనము తెల్పబడినది. మోక్షహేతువుగా నే జ్ఞానము తెల్పబడెనో అట బ్రహ్మము నిర్గుణముగానే తెల్పబడిన దని వీరి తలంపు. ఉపాధివశమున జీవభేద మేర్పడును; అని వీరి విశ్వాసము—వైఖానససూత్రములో అహం విష్ణు రితి ధ్యా త్వేతి," "సగుణే బుద్ధిం నివేశ్య పశ్చాన్నిర్గుణే యత్నం కుర్యాత్" అని యిట్టి వాక్యము లున్నవి. వీనినిబట్టి వీరికి బ్రహ్మ నిర్గుణు డగుటయే పరమార్థసత్యమనియు, నతని నొందు నుపాయమే సగుణోపాసన మనియు, ఆ యుపాసనాంగమైన యర్చనమే విఖనస మహర్షి తెల్పెననియు వీరితలంపు. వీరిమతములో మోక్షము రెండురకములు.—సగుణోపాసనవలన సగుణబ్రహ్మలోక ప్రాప్తి—ఇది ఆపేక్షికమోక్షము; నిర్గుణపరబ్రహ్మభావాపత్తి పరమమోక్షము, రెండవది.

## పాశుపతాగమము*

ఈ ఆగమములు చాల యున్నవి. వీనిలో శైవశాక్తమతములుం కలిసియేయుండుటవలన వీనిని ప్రత్యేకముగా విభజించుటకు వీలులేదు కనుకనే శైవశాక్తములు తరుచుగా కలిసియుండు నని వెరొకచో నుడివితిమి. ఈ యాగమములలొ వామాచారబోధకములగు నాగమములు కొన్నియు దాక్షిణాత్యా (సౌమ్యా)చారబోధ ములు కొన్నియు నున్నవి. వానినిగూడ విస్పష్టముగా విడదీయుట కష్టము. ప్రకృతము శివ, శక్తి, దేవాలయములందు జరుగు నర్చన సూత, నిశ్వాస, వాతూల, కామికా, కారణ, సంహితల ననుసరించి జరుగుచున్న దని యందురు. కాని చక్కగా వివేచించుచో యేసంహితయు పూర్తిగా ననుసరింపబడదు. ఆ యా సంహితలలో దెలుపబడినవాటిని కొంతకొంత కల్పుకొని యేదోరకముగా నిపు డర్చన జరుగుచున్నది. దీనియందు నిపుణులును, తత్త్వజ్ఞులును మన దేశమున నెక్కుడుగా దొరకుట లేదు. ఈ దేశమునందలి జనుల యభిప్రాయము లెక్కువగా వామాచారముల నామోదింపకపోవుటవలన నాయా సంహితలందలి తీవ్రవామాచారములను వీడి యేదోరకముగా సౌమ్యమగు పద్ధతిలోనే యాయర్చన యిపుడు జరుగుచున్నది.

ఈ యాగమములు-శైవశాక్తాగమములు కామికాగమము మొదలు వాతూలాగమము వరకు గల సంహితలు ఇరువదియెనిమిది యని లెక్కింపబడును. అందు కొన్నింటి పేరుల నిట నిచ్చెదము.

1. కామికము. 2. నిశ్వాసము. 3. కారణము. 4. వాతూలము. 5. స్వాయంభువము. 6. పౌష్కరము. (ఇది పాంచరాత్రాగమములలోని పౌష్కరము కాదు.) 7. మతంగము. 8. పరాగమము. 9 కౌరవము. 10. అచింత్యాగమము. 11. మృగేంద్రసంహిత. 12 సర్వజ్ఞానోత్తరాగమము. 13. దేవికాలోత్తరాగమము 14. శైవాగమము. 15. పాశుపతాగమము (పంచాధ్యాయి) 16. సూతసంహిత. 17. కాపాలాగమము. 18. కాలాముఖాగమము – ఇత్యాదులు.

మొత్తము యిరువదియెనిమిది యాగమములందును ప్రతిపాదింపబడినదానిని నాలుగు మతములుగా గ్రహించిరి. 1. కాపాలము. 2. కాలాముఖము. 3. పాశుపతము. 4. సిద్ధాంతము లేక నయసిద్ధాంతము.

పాశుపతమతమును ప్రవర్తింపజేసినవాడు బ్రహ్మపుత్రుడైన శ్రీకంఠుడు. అనగా పశుపతియైన మహేశ్వరుడు, ఉమాపతియైన రుద్రుడు. ఈ మతమునందు తత్త్వములు మూడు. 1. పశుపతి, 2. పశువులు, 3. పాశము. పశుపతి పరమేశ్వరుడు, పశువులు జీవులు. పాశము ప్రకృతి లేక సంసారము. దీనినుండి విడివడుటకై–మోక్షము నొందుటకై యీ శాస్త్రమును రచించి లోకమున బ్రవర్తింపజేసెనని మహాభారతమందును గణకారిక యందును గలదు. పశుపతి ప్రవర్తింపజేసినదిగనుక ఈమతమును పాశుపతమత మనెదరు. ఈమతమును అనుసరించువారిని మాహేశ్వరులు అందురు. అనగా మహేశ్వరుని భజించువారు అని తాత్పర్యము. వీరు నాల్గు రకములుగా నున్నారు. 1. శైవులు, 2. పాశుపతులు, 3. కారుణిక సిద్ధాంతులు, 4. కాపాలికులు. (కారుణికసిద్ధాంతులకు "కాలాముఖులు' అనియు పేరున్నది. చూ. రామానుజ శ్రీభాష్యము. పాశుపతాధికరణము. అధ్యాయము ౨. పాదము ౨.) వీరందరును ఆచారములందు కొలది భేదములున్నను సిద్ధాంతమునందు పశుపాశవిమోక్షమునకై అయిదువిషయములను మహేశ్వరుడైన పశుపతి తెల్పె నని యంగీకరింతురు. మహేశ్వరుడే వీరందరికిని ఉపాస్యమగు పరమదైవతము. కనుకనే వీరందరును మాహేశ్వరులనబడుదురు.

అయిదు విషయములు ఏవనగా;— 1. కారణము, 2. కార్యము, 3. యోగము, 4. విధి, 5. దుఃఖాంతము.

1. కారణము: అనగా "సకారణం కరణాధిపాధిపః." "త మీశ్వరాణాం పరమం మహేశ్వరమ్." అను శ్వేతాశ్వతరవాక్యములనుబట్టి పరమేశ్వరుడే అని భామతీకారుడగు వాచస్పతి తలంపు.

నకులీపాశుపతులు మాత్రము "జ్ఞానేంద్రియము లైదు. కర్మేంద్రియము లైదు. మనస్సు, బుద్ధి, అహంకారము అను మూడు అంతఃకరణములు వెరశి యీపదమూడును కారణములు" అని యందురు.

---

* ఈపాశుపతము—మతము లౌకికవాఙ్మయమునందు శ్రీమద్రామాయణములో తాటకా మారీచ రావణాద్యసురులయందును మహాభారతములో జరాసంధాదులయందును కొలదిగా తెలుపబడినది పతంజలి మహాభాష్యమున శబ్దసందర్భమున కొంచెము నిరూపింపబడినది. దండి దశకుమారచరితము, భవభూతి మాలతీమాధవములందు ప్రస్తావించిరి. కృష్ణమిశ్రుడు ప్రబోధ చంద్రోదయమునందు మూర్తిత్వము కల్పించి పాత్రనుగా వర్ణించినాడు. విద్యారణ్యుడు సర్వదర్శనసంగ్రహమునం దుదహరించెను. ఈయది వారి మత గ్రంథములకు సరిపోవుట లేదు. కారణము మొన్నమొన్నటివరకు పాశుపతగ్రంథములు దొరకకపోవుటయే. ప్రకృతమున 'భాసర్వజ్ఞుడు' వ్రాసిన "గణకారిక" మొదలగు సంస్కృతగ్రంథములు దొరకినవి. వీనినిబట్టియే ఈ మతస్వరూపము నిర్ణయింపబడినది.

2. కార్యము: అనగా ప్రకృతివలన నేర్పడు మహ దహంకారాదులైన ఇరువదిమూడు తత్త్వముల ను కార్యము లని వాచస్పతి మతము. (ప్రకృతివలన మొట్టమొదట మహ త్తుదయించినది. దానినుండి అహంకారము (త్రివి ధము) అహంకారమునుండి పంచతన్మాత్రలు, పంచ మహాభూతములు, దశేన్ద్రియములు అన్తఃకరణము నను నివి కార్యములు)

నకులీశపాశుపతమతమువారు—పృథివ్యాది పంచభూత ములును, రూప, రస, గంధ, స్పర్శ, శబ్దములను నైదు గుణములును కలసి పదియు కార్యము లందురు.

3. యోగము: ఓంకారాదుల ధ్యానము, ధారణ మొద లగునది.

4. విధి: ధర్మసాధకమగు త్రిషవణస్నానము (మూడు పూటలను సమంత్రకమగు స్నాన మొనర్చుట) మొదలు గూఢచర్యవరకున్న అనుష్ఠానము. ఈవిధి రెండురకములు 1. వ్రతము, 2. ద్వారము. 1. మొదటిది వ్రతము—1 భస్మముతో—విభూతితో స్నానము. 2. భస్మశయనము. 3. ఉపహారము. అని మూడు రకములు.

పాశుపతమతము

మొదటివి రెండును అంద రెరిగినవే. మూడవ దగు "ఉపహారము" ఆరు రకములు. 1. హసితము. 2. గీతము, 3. నృత్తము, 4. హుడుక్కారము, 5. నమ స్కారము, 6. జపము, వీనిని క్రమముగా వివరింతుము.

1. హసితము :—"హసిత" మనగా పరమేశ్వరు డట్టహాస మొనరించు నని ప్రసిద్ధమే కనుక తత్సారూప్యమే మోక్ష మను వీరును దత్సాదనకై అట్టహాస మొనరింతురు. అనగా పెద్దగా నవ్వుదురు. ఏతావతా హసిత మనగా—అట్ట హాసము లేక పెద్దగా నవ్వుట.

2. గీతము :—"గీతము" అనగా సంగీతశాస్త్రప్రకా రములతో నిమిత్తము లేకుండ పరమేశ్వరునిగూర్చి పాడుట. ఇవి యుత్తరదేశములలో ఆయా భాషలలో పద్యములు, మంత్రములు, పాటలు మొదలగు తీరుల నుండును. దక్షిణదేశములో అనగా అరవల దేశములలో "తేవార ములు" అను పేరుగల విలక్షణములైన పద్యముల రూప మునను గొన్నియెడల పాటలుగాను నుండి, అవి చదువు నపుడుగాని పాడునపుడుగాని కొంతమంది నృత్య మొన రించుటయు నుండును.

3. నృత్యము :—"నృత్యము" అనగా భరత శాస్త్రమురీతులు గాకున్నను, ఉద్ధృతనృత్యమును-తాండవ మును చేయుట. ఇది గీతముతో కలిపియు, కలుపకను గూఢ చేయుదురు. ఇది కొంతకొంత వికారముగా గూడ నుండును.

4. హుడుక్కారము :—"హుడుక్కారము" అనగా—నాలుకతో లోపలిదౌడలను దాడించుచు ఎద్దులు ధ్వని చేయునట్లు ధ్వనిని కల్గించుట.

ఈ చెప్పిన నాల్గింటిని లౌకికు లుండుచోట చేయరా దనియు, వారు లేనిచోటనే చేయవలయు ననియు నకులీశ పాశుపతుల తలంపు. (దీనికే వీరున్నూ శ్రీకంఠులు, అప్ప యదీక్షితులు మొదలగువారు గూఢచర్య యనెదరు. కాని కాపాలుల శాస్త్రమునుబట్టి భగాసనస్థునిగా నాత్మను ధ్యానిం చుట మొదలగు వామాచారములు (కొన్ని నోటితో జెప్పు టకును ఇట వ్రాయుటకునుగూడ యుక్తములు కానంతటి ఘోర జుగుప్సితములు.) గూఢచర్య యని తెలియవచ్చు చున్నది.)

5. జపము :—"జపము" అనగా పశుపతిమంత్ర ములను—జప మొనర్చుట. అవి పంచబ్రహ్మ (తత్పురుష, ఈశాన, అఘోర, సద్యోజాత, వామదేవ, అను రూపముల నైదువిధములుగా వారి బ్రహ్మమైన "పశుపతి" యుండు నందురు.) మంత్రములును. ప్రాసాదపంచాక్షరియు ఇత్యాదికములు.

6. నమస్కారము :—"నమస్కారము" అనగా పశుపతికి శాస్త్రీయమగు ప్రణామ మొనర్చుట. ఇది యంతయు వ్రత మని వా రందురు. ఇక రెండవది ద్వారము. దానిని వివరింతుము.

ఈ రెండవదగు ద్వారము ఆరు రకములు. 1. కాయ నము, 2 స్పందనము, 3. మందయానము, 4. శృంగా రణ. 5. తత్కారణము, 6. తద్భాషణము. వీనిని క్రమ ముగా వివరింతుము.

1. కాయనము :—"కాయనము" అనగా-నిదుర బోవకుండియు, పోయినట్లుగా నిదురచిహ్నములను ప్రద ర్శించుట.

2. స్పన్దనము :—"స్పన్దనము" అనగా వాతవ్యాధి కల్గినవాని యవయవములు వడకునట్లుగా అవయవముల వడకించుట.

3. మందయానము :—"మందయానము" అనగా కుంటివానివలె కాళ్ళు దెబ్బతిన్నట్లుగా నడచుట.

4. శృంగారణ :—"శృంగారణ" యనగా-రూపము యౌవనము బాగుగా కల్గియున్న యొక కాముకు రాలిని జూచి తనను కామకునిగా ప్రదర్శించునట్టి విలాస ముల నాచరించుట.

5. తత్కారణము :—"తత్కారణము" అనగా తప్పొప్పుల నెరుగనివానివలె లోకనిందితములగు పనుల నైనను చేయుట.

6. తద్భాషణము :—"తద్భాషణము" అనగా అస్తవిస్తముగాను, తప్పటర్థములతోను, ఇంకను ఈరకము లైన పద్ధతులతే మాటల నాడుట.

ఈ యారు రకములగు ద్వారములును పశుపతియొక్క ఏకాన్తభక్తులు తప్పక యొనరింపవలసినవి. ఇప్పటికి నాలవవగు విదిని నిరూపించితిమి. ఇక నైదవవగు దుఃఖాన్తమును వివరింతుము. దుఃఖాన్తమనగా మోక్షము ఇది పరమేశ్వరసారూప్యమైనను సాలోక్యమైనను "సాంఖ్య యోగాధిగమ్యతా" అను శ్వేతాశ్వతరశ్రుతినిబట్టి సాంఖ్య యోగములమూలమునసే లభించు నని నమ్మి సాంఖ్యము లోని తత్త్వముల నెరిగి యోగమువలన ముందు జెప్ప బోవు లౌకికశక్తులతోబాటు పరమేశ్వరసాక్షాత్కారమునొంది మోక్షము సంపాదింప నగు నని వీరి ప్రక్రియ. (వీరిలోని యోగశక్తి యెంతటి యుపద్రవకరమో బాగుగా గ్రహించుడు.)

ఈ దుఃఖాన్తము—రెండురకములు—మొదటిది అనాత్మకము రెండవది సాత్మకము

1. అనాత్మకము :—"అనాత్మకము" అనగా సకల దుఃఖములును సవాసనగా నశించుట. ఇదియే మోక్షము. ఇందులో గాపాలికు లింతమాత్రమే కాక "పరమేశ్వర రూపము నొంది పార్వతీసంభోగము నొందుట - మోక్షము" అని యందురు. అందువలననే వారిసిద్ధాన్తమునకు సోమ (స+ఉమ) సిద్ధాన్త మనియు బే రున్నది. (చూ. ప్రబోధ చంద్రోదయము.)

2. సాత్మకము :—"సాత్మకము" అనగా ఆత్మశక్తి అతిశయించుట. అది దృక్ఛక్తిసామర్థ్య మను నైశ్వర్యము, క్రియాశక్తిసామర్థ్య మను నైశ్వర్యమునని రెండురకములు. అందు మొదటిది.

1. దృక్ఛక్తి సామర్థ్యము:—ఈ దృక్ఛక్తి యొక టైనను, విషయములనుబట్టి దీని సామర్థ్యము ఐదు విధ ములుగా వ్యవహరింపబడుచుండును.

1. దర్శనము, 2. శ్రవణము, 3. మననము. 4. విజ్ఞానము, 5. సర్వజ్ఞత్వము. అందులో మొదట పేర్కొన బడిన

1. దర్శనము :—పంచేన్ద్రియములకు గోచరములు కాజాలని వస్తువులు ఎంత సూక్ష్మములైనను, ఏవి యడ్డుగా నున్నను, ఎంత దూరములో నున్నను కనుగొనగల్గు తెలివి. ఇది కళాపూర్ణోదయములో సిద్ధునిలో ప్రదర్శింపబడినది.

2. శ్రవణము :—ఎవ రెంత రహస్యముగా ఏకాల మున, ఏభాషలో మాటలాడుకొన్నను వాని నన్నింటిని అనగా నన్నిరకముల శబ్దములను దెలియగల బుద్ధి సామర్థ్యము. ఇదియు కళాపూర్ణోదయములో తెల్పబడినది.

3. మననము :—న్యాయ, వైశేషిక, సాంఖ్య, యోగ, పూర్వోత్తరమీమాంసాది సకలశాస్త్రములనే కాక సకల కళ లను అనగా నరువదినాల్గు కళలనుగూడ దెలియగల మనశ్శక్తి.

4. విజ్ఞానము :—ఏగ్రంథములనుగాని, ఎట్టి గ్రంథ ములనుగాని వాని యర్థములతోగూడ నేమాత్రము సంశ యము లేకుండ తెలియగల్గుట.

5. సర్వజ్ఞత్వము :—ఈ లోకములు మొదలగువాని లోని అన్నివిషయములను దెలిసియుండుట.

ఇది యైదురకముల దృక్ఛక్తిసామర్థ్యరూపమైన యైశ్వర్యము.

ఇకను క్రియాశక్తిరూపమగు రెండవయైశ్వర్య మెటు వంటిదో గమనింతము. ఈ క్రియాశక్తి వాస్తవమున కొక్క టియేకాని విషయభేదమునుబట్టి మూడువిధములుగా వ్యవ హరింపబడును.

1. మనోజవత్వము 2. కామరూపిత్వము, 3. వికరణ ధర్మత్వము. ఇందులో మనోజవత్వము మొదటిది. మితి లేని వేగముతో నెక్కడికి పడితే అక్కడకు పోగల్గుట. దాని స్వరూపము. రెండవదగు కామరూపిత్వము - లెక్కలే నన్ని శరీరేన్ద్రియములతో తన యిచ్చవచ్చిన ట్లుండగల్గుట. తనయిష్టము వచ్చిన రూపముతో నుండగల్గుటయు నిదే. మూడవదగు వికరణధర్మత్వము ఎట్టి దనగా—శరీరేన్ద్రి యములేమియు లేకున్నను తనయిష్టము వచ్చినట్లుగా నిరతిశయమగు నైశ్వర్యముతో నుండగల్గుట.

ఇట్లు కార్యకారణయోగవిధి దుఃఖాన్తముల నైదింటిని వివరించితిమి. ఇకను ప్రధానతత్త్వములైన 1. పశు, 2. పాశ, 3. పశుపతులనుగూర్చి కొంచెము ముచ్చటించు కొందము.

1. పశువులు :—జీవులు - వీరు సహజముగా వివే కము లేక ఆహరనిద్రాభయమైథునములను కృత్యములందు స్వభావప్రవృత్తు లగుదురు. వీరికి విషయము లగు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములందే అభిలాష యుండును. పశువులకు పచ్చగడ్డి జూపినచో దగ్గరకు వచ్చుటయు కఱ్ఱ చేత బట్టినచో బరువెత్తిపోవుటయు సలవాటేకదా! అట్లే యీజీవులుకూడ ఎవడైన తమ కేదైన నిష్టమును జూపి నచో దగ్గరకు జేరుటయు, కత్తి మొదలగువానిని బట్టుకొని జళిపించుచున్నచో బరువెత్తిపోవుటయు యొనర్తురు. పశు

పులవలె వీరు పశుపాశకులగు పరమేశ్వరునిచేత ద్రిప్పబడు చుందురు. అతని పాలనములో నుండుదురు కనుక నీజీవు లందరును పశువు లని పిలువబడవలెనగుదురని వీరి యభి ప్రాయము (శ్రీశంకరభగవత్పాదులుకూడ తమ యధ్యాన భాష్యములో (1-1-1) "పశ్వాదిభి శ్చావిశేషాత్" అని యిట్టి యభిప్రాయమునే తెల్పిరి.)

2. పాశము :—ఇది యిరువదినాల్గురూపముల నుండు ప్రకృతి. ఇది సంసారరూపమున విస్తరించి యీ జీవులను బంధించును. పశువులు మెడత్రాటితో నెట్లు అస్వతంత్రములై దుఃఖముల నొందునో–బంధింపబడునో, అట్లే యీజీవులుకూడ ఈప్రకృతిచేత బంధింపబడి దుఃఖా దుల నొందుదురు. అందువలననే సంసారమును పాశ మందురుకదా! ఈ సంసారరూపమగు ప్రకృతి జీవులను బంధించును గనుక 'పాశ' మనబడును.

3. పశుపతి :—ఈజీవు లందరకును ప్రభువు. వీరిని తన యిచ్చ వచ్చినట్లుగా ఆలమందలను గోపాలకుడువలె సుఖదుఃఖాదులకు లోబడజేయుచు ద్రిప్పి పాలన మొన రింపగలడు. ఇష్టము వచ్చినచో గట్టివేయగలడు. అట్లే యిష్టము వచ్చినచో తాడును విప్పివేయగలడు పరమ స్వతంత్రుడు. పరమైశ్వర్యసంపన్నుడు. అన్ని లోకముల లోని అన్నిపనులకును అతడే నిమిత్తము. అసలు ఈలోక ముల సృష్టియుగూడ నాపశుపతి కెప్పు డెట్లు తోచిన నట్లే యేర్పడినది. అంతేకాని మొదట నాకాశము పిమ్మట దాని నుండి వాయువు "ఇత్యాదిగా నితరులగు వేదాన్తులు చెప్పు క్రమమున జరుగలేదు. సర్వస్వతంత్రుడగు పశుపతి యెప్పు డెట్లు సృష్టింపదలచుకొనిన నట్లే జరిగినది. కను కనే శ్రుతిలో కొన్నిచోటులందు "తస్మా ద్వా ఏతస్మా దాత్మన ఆకాశ స్సంభూతః, ఆకాశా ద్వాయుః" అని యున్నది, మరొకచోట" ఏతస్మా జ్జాయతే ప్రాణః మన స్సర్వేన్ద్రియాణి చ" అని యున్నది. ఇంకను నిట్టితీరున వాక్యము లన్నియు పశుపతి తన యిచ్చ వచ్చిన క్రమమున నీప్రపంచసృష్టి నొనరించె నని తెల్పుచున్నవి. ఈపశువులు —జీవులు వీరి కర్మలతో నిమిత్తము లేకుండ తనయిచ్చ తోనే ఫల మొనసంగును. పశుపాలకుని వ్యవహార మంతె కదా? అయితే జీవులు కర్మ మొనర్చుట నిరర్థకము కాదా? యనరాదు. పరమేశ్వరున కిష్టమైన కర్మము సఫల మగును. అతని కిష్టము గానిది విఫల మగును. పొలము కాపు దున్నినను వాన యనుగ్రహించనిచో నది వ్యర్థమే కాదా! అయినను అందువలన నేమైన దోష ముండ బోవునా? ఈశ్వరు డనుగ్రహించు నను నమ్మకముతోనే ప్రజలు తమపనులందు ప్రవర్తింతురు. వాన కురియు నను నమ్మకమే కదా పొలముకాపును పొలము దున్నించినది. కనుక లోకములో పను లొనరింపకపోవుట సంభవింపదు. ఇట్లే పశువులైన జీవులకందరకును పతి కనుక నా మహాను భావుడు మహేశ్వరుడుమాపతి, పశుపతి యనబడును. (ఈ మతములో మోక్షమునుగూర్చిన యభిప్రాయభేద మిది వరకే తెల్పితిమి.) ఈపశుపతి యీ జీవుల సందరకును తాను జెప్పినరీతిని ప్రవర్తింపజేయుచు మోక్షసౌభాగ్య మొసంగునని యీ మహేశ్వరులకు పాశుపతులకు పూర్ణ విశ్వాసము.

## వేషము, ఆచారము, విశ్వాసము

ఈమహేశ్వరుల వేషాచారవిశ్వాసము లిట్లుండును.

వేషము :—చేతులందు రుద్రాక్షకంకణమును తల యందు జటయు కరమునందు కపాలమును ఒడలియం దంతటను భస్మము విభూతి నలదుకొనుటయు, ఏవో యొక దీక్ష (కాపాలవ్రతదీక్ష) మాత్రముననే బ్రాహ్మణ్యము వారికి సిద్ధించుననుట.

ఆచారము :—వీరి యాచారము రెండు పేరుల బిలువబడును. 1. కాలాచారము, 2. శాస్త్రాచారము. కపాలపాత్రమున భుజించుట, శవభస్మమున స్నానము, ఆ భస్మమును తినుట, లగుడమును - లాఠీవంటి యొక చిన్నచేతికఱ్ఱను బట్టుట, కల్లుకుండను సమంత్రముగా స్థాపించుట, దానియందు దేవతాఽవాహనాదుల చేసి పూజించుట వీరి యాచారములు. ఈయాచారములు వీరి కైహికాముష్మికఫలముల నొసంగు నని వీరితలంపు. (కాలా ముఖుల ప్రక్రియ యిది) ఇది కాలాచారము. దీనినే వామా చార మందురు. శాస్త్రాచారము సౌమ్యముగాను వెనుక జెప్పిన యాచారమునకు బూర్తిగా వ్యతిరేకముగాను నుండును.

విశ్వాసము :—"ఆరు ముద్రల తత్త్వము నెరిగి యుండి పరముద్రయందు నేర్పు కలిగి భగాసనమునందు ఆత్మను ధ్యానించినచో మోక్షము ప్రాప్తించును" అని వీరి విశ్వాసము (కాపాలికుల ప్రక్రియ).

## ముద్రికాషట్కము

పైజెప్పిన ఆరుముద్ర లేవనగా - 1. రుద్రాక్షము, కంఠిక (కంటె) 2. రుచకము, 3. కుండలములు, 4. శిఖామణి, 5. భస్మము, 6. యజ్ఞోపవీతము. ఈయారు ముద్రలును దేహమునం దున్నచో తిరిగి యీ లోకమున జన్మము రాదని వారి నమ్మకము. ఇది యంతయు పాశుపతపంచా ధ్యాయ సూత్రప్రక్రియనుబట్టి వ్రాయబడినది.

ఇకముందు "కామికాగమము" మొదలుకొని వాతూ లమువరకు గల ఇరువదియెనిమిది శైవాగమముల ననుస రించిన యీమత ప్రక్రియను తెల్పుదుము. "పతి, పశువు,

పాశము'' నని మూడే పదార్థములు. స్వాయంభువాగమ మున నేడుగాను, పౌష్కరాగమమునను మతంగాగమ మున నారుగాను, పరాగమమున నైదుగాను, తెల్పబడినను రౌరవాగమమున దెల్పబడిన యీ మూడింటిలోనే అవి యన్నియు నంతర్భవించును.

ఆ మూడుపదార్థములలో మొట్టమొదటి తత్త్వ మగు పతినిగూర్చి అచిన్త్యాగమ మిట్లు చెప్పుచున్నది—ఈ పతి జ్ఞానానందరూపుడు, పంచేన్ద్రియములకుగాని, అనుమాన మునకుగాని, శబ్దప్రమాణమునకుగాని గోచరముగాని వాయానన్దము. ఆశంకరాత్మకమను నాయానన్దము సర్వతః పరమము అనగా నన్ని యానన్దములకన్ననుగూడ చాల గొప్పది. అది ఆత్మానుభవైకవేద్యమే. అనగా తనకు దానే గోచర మగును. మహాప్రకాశమైన గొప్పజ్యోతిస్సు.

ఈచెప్పినది స్వరూపలక్షణము. ఇక తటస్థలక్షణ మేదనగా—సృష్టి, స్థితి, సంహారము, తిరోధానము, అనుగ్రహము అను నైదు కార్యములను నెరవేర్చుట. అని మృగేన్ద్రాగమము తెల్పును.

ఈపతి శాన్తు డనియు, ఉద్యుక్తు డనియు, ప్రవర్తు డనియు, మూడుపేరుల పిలువబడును. ఈ ప్రపంచ మంతయు ప్రలయకాలములో దన యుపాదానకారణము నందు - అనగా మూలకారణమునందు లీనమై యుండు నపుడు కార్యమును నుదయింపజేయు శక్తిమాత్రమే యప్పు డుండునుగాని కార్యమును జేయుట లేదు. కావున నా దశలో ''శాన్తుడు'' అనబడును.

ఈమహానుబావుని శక్తి కార్యము నుదయింపజేయుట కుద్యోగించు నపు డీతడు ''ఉద్యుక్తుడు'' అనబడును.

ఆ శక్తి కార్యమునందు ప్రవర్తించు చుండు నపుడు ఈతడు ప్రవృత్తిశక్తి కల్గియుండును గనుక నపు డితనికి ''ప్రవర్తుడు'' అని పేరు.

ఈపతి కీశక్తి యెప్పుడు నుండును. ఆశక్తి ''చిచ్ఛక్తి'' యనియు, ''పరిగ్రహశక్తి'' యనియు రెండు రకములు. మొదటిదగు చిచ్ఛక్తి కార్యము నుదయించుట కను కూలముగా దృష్ట మగు దానిని పరామర్శించునపుడు జ్ఞాన మను దశ నొందును. అనగా నపు డాశక్తి జ్ఞానమగు ననుట. అశక్తి ''పరిగ్రహశక్తి కార్యరూపముగా నగు గాక'' యని సంకల్పించునపుడు ''ఇచ్ఛ'' యగును. కార్య మును గల్గించునపుడు ''కృతి'' యగును. ఇది యంతయు చిచ్ఛక్తియొక్క మూడుతీరులు. ఇక పరిగ్రహశక్తినిగూర్చి తెలుసుకొందము. అది రెండురకములు ''బిందువు'' ''మాయ'' యని. వెనుకజెప్పిన చిచ్ఛక్తి పతికి సూక్ష్మ శరీరము బిందుశక్తి స్థూలశరీరము అని చెప్ప బడును.

ఈ బిందుశక్తివలన పరిశుద్ధమగు శబ్దమును, అట్టివె యగు తత్త్వములును నుదయించును; అనగా వాని కన్నింటికిని నిది యుపాదాన (మూల) కారణము. ఈ బిందువునే ''కుండలిని'' యనియు నందురు

''లయాది భేదః ప్రాగుక్తో యదుపాదౌ శివస్య తు। స బిందురితి మన్తవ్యః సైవ కుండలినీ మతా'' యని పౌష్కరాగమము తెల్పును.

ఇట్టి యీబిందుశక్తినుండి శుద్ధమగు శబ్దము ''సూక్ష్మ'' యనునది కల్గును. ఈసూక్ష్మశబ్దమునుండి ''పశ్యన్తి'' యను శబ్దము పుట్టును దానినుండి ''మధ్యమ'' యను శబ్ద ముదయించును. ఈ శబ్దమునుండి ''వైఖరి'' యను శబ్దము కల్గును.

జ్ఞానమునుమాత్రమే యాశ్రయించియుండునట్టి జాతి మాత్రరూపమైన యర్థమును (meaning) ''సూక్ష్మ'' యను మొదటి శబ్దము తెల్పును. (ఇదియే భర్తృహరి మొదలగు వైయాకరణులు 'పరా' యనెదరు). అక్షర ముల రూపమునొంది అర్థవిశేషమును తెల్పుశబ్దము ''పశ్యన్తి'' యనబడును.

బుద్ధిలో నక్షరములు గోచరించి వాని క్రమవిశేషముతో (ప్రాణవృత్తికి గోచరము గాకుండ) నేర్పడు శబ్దము ''మధ్యమ'' యనబడును. ఈ శబ్దము ప్రాణవృత్తి, వాయువ్యాపారముచే వ్యక్తము కాజాలదు.

ఇక నాలవదగు ''వైఖరి'' శబ్దము ప్రాణవృత్తిచే నభి వ్యక్త మగును. చెవులకు గోచరమగును. అర్థవిశేష మును బోధింపగల్గును. అని రౌరవాదులగు చాల యాగ మములం దున్నది.

ఈతీరుగా బిందుశక్తి స్వరూప మున్నది.

ఇక బిందుశక్తిని గమనింతము—

బిందువుదశ శివతత్త్వ మందురు. శివతత్త్వదశ శక్తి తత్త్వము దశ సదాశివతత్త్వము, దీనిదశ ఈశ్వరతత్త్వము. దీని దశ విద్యాతత్త్వము. ఈ యైదనుతత్త్వములు (దశ యనగా—అవస్థ లేక పరిణామము)

ఇంకను కలాత్మకము లగు నివృత్తి మొదలగునవికూడ బిందువు నవస్థలే.

నివృత్తిశ్చ ప్రతిష్ఠా చ విద్యా శాన్తి స్తథైవ చ। శాన్త్యతీతా చ పంచైతా శ్శుద్ధమార్గే పురాత్మికాః'' అని యాగమ వచ నము. ఈ యైదును శుద్ధాధ్వయందు నగరములవంటి వనియర్థము; ఇందులో నివృత్తి ఈశ్వరతత్త్వము. ప్రతిష్ఠ సదాశివతత్త్వము, విద్య విద్యాతత్త్వము, శాన్తి శక్తితత్త్వము శాన్త్యతీత, శివతత్త్వము.

ఈ యైదుతత్త్వములలో శివతత్త్వము, 'సూక్ష్మ' శబ్దము నకు అధిష్ఠానము. శక్తితత్త్వము 'పశ్యన్తి' కధిష్ఠానము.

ఈశ్వరతత్త్వము, "మధ్యమ" శబ్దమున కధిష్ఠానము. మంత్రాదులకును, అంతేకాక ఈశ్వరతత్త్వము నారాధించు అనన్తేశాదులకును, ఆపదము నొందిన తనుభువనాదు లేర్పడుటకు గారణము. విద్యాతత్త్వము, 'వైఖరి' శబ్దమున కధిష్ఠానము అంతేకాక సప్తకోటిమహామంత్రముల కును విద్యారాణులకును తనుభువనాదు లేర్పడుటకు గారణమగును. సదాశివతత్త్వము సామీప్యముక్తి నొందు వారి తనుభువనాదులకు గారణము.

ఈ విషయమంతయు మృగేన్ద్రసంహితయం దిట్లున్నది.

"విద్యారాజ్ఞ్య స్సమాఖ్యాతాః విద్యాయాం రుద్రసంస్తుతాః।
తాసా ముపరి దీప్తశ్రీ ర్దేవో విద్యాధిపః స్థితః ॥
రుద్రా గణా స్సదిక్పాలా శ్శాస్త్రాణి పతయ స్తతః।
సదాశివే పవిత్రాంగా స్సకలాపి పరిచ్ఛదాః॥
దేవ స్సదాశివో బిందౌ నివృత్త్యాది కలేశ్వరః।
నాదె ఉద్యని పదే శక్తౌ సర్వశక్తిమతాంవరః।
యోనిర్విశ్వస్య వాగీశా పతయ శ్శివతత్త్వకాః॥"

పైజెప్పిన శుద్ధాధ్వయందు మలరహితులుమాత్రమే భోగ మనుభవింతురు. ఇందువల్లనే ఆభోగమునకు గర్మ కారణము కాజాలదు. కర్మాదిరూపమైన మలము నశించిననే శుద్ధాధ్వయందు ప్రవేశము సంభవించును కనుక అట భోగమునకు గర్మ యేది? ఇట నీవ్యవస్థ ముఖ్యముగా గుర్తింపవలసియున్నది–శివతత్త్వముతో గలసియుండి పతి 'శివుడు' అనబడును. అతడె శక్తితత్త్వముతో గలసియుండి "శక్తుడు" అనబడును. అతడే సదాశివతత్త్వముతో గలిసియుండి 'సదాశివు' డనబడును. అతడే ఈశ్వరతత్త్వముతో గలసియుండి ఈశ్వరుడనబడును. అతడే విద్యాతత్త్వముతో గూడి "అనన్తేశుడు" "శ్రీకంఠుడు" మొదలగు పేరుల నొందును. ఇందులో వెనుక వెనుక తత్త్వములతో గూడియున్నట్లె 'పతి' తరువాత, తరువాత తత్త్వములతో గూడియుండవలసిన పతికి గారణము. (తనతరువాత పతిని కల్గించు ననుట)గా వ్యవహరింపబడును ఆ పతికి సంబంధించిన చిచ్ఛక్తి శివతత్త్వముతో గలసియున్న రూపమును "శివ" యని పిలుతురు. ఆ చిచ్ఛక్తియే శక్తితత్త్వముతో గూడియున్న రూపమునందు "శక్తి" యను పేరొందును. అదియే సదాశివతత్త్వముతో గూడియున్న రూపమునందు "మనోన్మనీ" యని పేర్కొనబడును. ఆ శక్తికి ఈశ్వరతత్త్వముతో గలసి యున్నప్పటి రూపమును "మహేశ్వరి" యందురు. విద్యాతత్త్వముతో గూడియున్న రూపమును "విద్య" యందురు.

ఇప్పటికి పరిగ్రహశక్తిలోని బిందుశక్తినిగూర్చి తెల్పితిమి.

ఇక రెండవదగు "మాయా"శక్తినిగూర్చి తెల్పుదుము.

కాలము మొదలు పృథివివరకు గల ముప్పదియొక్క తత్త్వములకును సాక్షాత్తుగానో పరంపరగానో మూలకారణమైన పతియొక్క పరిగ్రహశక్తి 'మాయ' యనబడును. ఇది "మాయాశక్తి" యనియు బిలువబడును. పతియొక్క చిచ్ఛక్తి జడము కాకున్నను, పతి మాయాశక్తితో గూడి యీ అశుద్ధమైన జగత్తును సృజింపబోవు వేళయందు, ఈ యశుద్ధజగమున కుపాదానకారణ మని వ్యవహరింపబడును. ఇట్లే శుద్ధజగమున కుపాదానమైన బిందు శక్తితో గూడియున్న పతి శుద్ధజగమును నిర్మింపబోవు చుండునపుడు ఈచిచ్ఛక్తి శుద్ధజగత్తున కుపాదానకారణ మనియు వ్యవహరింపబడును. ఈరెండురకముల జగత్తులకును నుపాదానకారణమైన చిచ్ఛక్తితోగూడి పతి నిమిత్త కారణ మనబడును. ఈమాయాశక్తిరూపముతో బిందు శక్తితోను గలసియున్నరూపమున 'పతి' యుపాదాన మనియు ననబడును.

'శివుడు' మొదలు "శ్రీకంఠుని"వర కుండు పదార్థము లన్నియు 'పతి' పదార్థము; అనగా పతియొక్క దశావిశేషములే ననుట.

అతీరుననే విద్యాతత్త్వముయొక్క అవస్థ 'ఉమా' తత్త్వము. దాని యవస్థ "లక్ష్మీతత్త్వము." దాని యవస్థ "వాణీతత్త్వము." 'పతి' 'ఉమాతత్త్వము'తో గూడియున్న రూపమును రుద్రు డందురు. అతని చిచ్ఛక్తికి 'ఉమ' యని పేరు. "లక్ష్మీతత్త్వము"తో గూడియున్న రూపమునకు "విష్ణుడు" అని పేరు. అతని చిచ్ఛక్తికి "లక్ష్మి" యని పేరు. వాణీతత్త్వముతో గూడియున్న పతి రూపమును "బ్రహ్మ" యందురు. అతని చిచ్ఛక్తి 'సరస్వతి' యని పేరుబడినది. ఈ రుద్రవిష్ణుబ్రహ్మలు ముగ్గురును పతి పదార్థములోనివారే. ఈపతి శివరూపమునందును శక్తిరూపమునందును నిష్కలుడే. 'శివ' రూపయు, "శక్తి" రూపయు నగు చిచ్ఛక్తి నిష్కలయే. "సదాశివు" డను పతి సకలనిష్కలుడు. అట్లే "మనోన్మనీ" యను చిచ్ఛక్తియు సకలనిష్కలయే. ఈశ్వరుడు, శ్రీకంఠుడు రుద్రుడు విష్ణువు చతుర్ముఖుడు అని పేరుగల పతు లందరను కేవలము సకలులే, వీరు నిష్కలులు కారు. మహేశ్వరి, విద్య, ఉమ, లక్ష్మి, పేరుగల చిచ్ఛక్తు లన్నియు కేవలము సకలులే. నిష్కలులు కారు. (ఈ విషయ మంతయు మృగేన్ద్రసంహిత మొదలగువానిలో విస్తరించి యున్నది. అట జాచుకొన నగును) శుద్ధజగత్తును నిర్మింపబోవునపుడు దాని కనుకూలముగా బిందుశక్తి క్షోభ మొందును ఆ క్షోభము పతియం దున్న చిచ్ఛక్తివలననే బిందుశక్తియందు ఏర్పడగలదు. ఇట్లే మాయాశక్తియు అశుద్ధజగ మేర్పడబోవునపుడు దాని కనుకూలముగా క్షోభ

మొందవగియుండును. ఆ శోభమునకాప పతియం దున్న చిచ్ఛక్తివలననే కల్గునని గ్రహింపవలెను.

ఈ విషయమును పౌష్కరసంహిత యిట్లు తెల్పు చున్నది.

"బిందుమేవో యత శ్చంబో శ్శక్తే రేవ ప్రవర్తతే। జ్ఞాన క్రియాత్మికా సాపి నిత్యా నిత్యోదితప్రభా". ఇట శక్తి యన చిచ్ఛక్తి; ఆ చిచ్ఛక్తి జ్ఞానాత్మిక, క్రియాత్మికయుగూడ; అది మాయావాదుల మతమందువలె మిథ్యారూప మైనది కాదు. మిథ్యాత్వము లేనిది. సత్య మైనది. అది పతివలె 'నిత్యోదితప్రభ' అనగా ఎల్లపుడును స్వప్రకాశరూపమై యుండును అని తాత్పర్యము.

ఇప్పటికి మొదట దెల్పిన పతి, పసు, పాశములు మూటిలో పతిపదార్థమును వివరించితిమి. ఇక రెండవ దగు "పసు" పదార్థమును వివరింతుము. పశువు దేహము, ఇన్ద్రియములు మొదలగు జడములకన్న వేరై నిత్యము చిద్రూపుడుగా నుండునది. ఈ పశువులనేకములు, విభువులు. వీరిని అనాదిగా మల మావరించియుండును. అస్వతంత్రులు; కర్తలు కారు; భోక్తలు. కర్త యనగా స్వతంత్రుడు.

మృగేన్ద్రసంహితలో ఈ "పశువును"గూర్చి యిట్లున్నది.

"అథ సా తత్వగమనే వ్యుత్పన్నాత్మస్వభావతః।
పరామర్శాత్మకాశ్చైతే గతేః జ్ఞానార్థతా యతః॥
ఆత్మానోవ్యాపినో ఽనన్తాః చిద్రూపాః పశవస్స్మృతాః।
నావ్యాపకోన క్షణికో నైకోవాపి జడాత్మకః।
న కర్తా భిన్నచిద్యోగీపాశాన్తే శివతాం వ్రజేత్॥"

"ఇక్కడ భిన్నచిద్యోగీ" అనగా వేరైన చిత్తు—జ్ఞానము కలవారు. తాను (పశువు) ధర్మి చిద్రూపుడె కనుక తనకంటె వేరైన ధర్మభూతజ్ఞానము కలవాడు, అని యర్థము. ఎట్లు దీపము ప్రకాశైకరూపము ప్రకాశధర్మక ముగానుండునో అట్లే యీపశువును స్వయముగా చిదేక రూపుడును చిద్ధర్మకుడును నని తాత్పర్యము.

ఇక మూడవదగు పాశమునుగూర్చి మాటాడుదము.

పాశ మనగా శివానందము అభివ్యక్త మగుటను నిరోధించునట్టిది. పాశ మైదువిధములు.

1. అణవతిరోధాయకము, 2. శక్తి, 3. బిందువు, 4. మాయ, 5. కర్మ.

1. అణవమైన తిరోధాయకము.—అణవతిరోధాయకము, ఇదొకపాశము. అణవ మనగా మలమునకు పేరు. మల మన ద్రవ్యము. ద్రవ్యము ఆత్మకు గల దృక్క్రియాశక్తిని కప్పివైచును. "మలమునకు అనేకశక్తులు అగ్నికివలె కలవు" అని యాగమము తెల్పుచున్నవి కనుక అది ద్రవ్యము.

2. శక్తి:—అనగా చిచ్ఛక్తి. ఇది మలమును ప్రేరేపించి యాత్మని బంధింపగల్గును గావున పాశము.

3. బిందువు:—
4. మాయ:—
5. కర్మ:—
ఈ మూడున్ను భోగ్యములను, వాని భోగమును ఆత్మకు సమకూర్చి విషయసుఖములను కలిగించి బంధించును గనుక పాశము లనబడును.

ఇట మాయను 'పాశ' మనుటవలన - దానికి సాక్షాత్తుగాగాని పరంపరాగాగాని మాయయొక్క పరిణామములైన ముప్పదియొక్క తత్త్వములుకూడ "పాశములు" అనిన ట్లైనది.

'మాయ'యొక్క మొదటి వికారము కాలతత్త్వము. ఇది నియమనమునకు గారణము. నియమన మనగా పని యొనరించి వానికా ఫలమును సమకూర్చుట. శ్రావణములో నాటువేసినవానికి దానిఫలమగు ధాన్యమును సమకూర్చునది హేమంత మను కాలమేకదా!

మాయయొక్క రెండవ వికారము నీతి యను తత్త్వము. మూడవ వికారము, కలాతత్త్వము. ఆత్మ కున్న దృక్క్రియారూపమైన చైతన్యమును ఆవరించునట్టి మలమును ఈ కలాతత్త్వము తొలగించును. దాని ఫలమైన చైతన్యము, అజ్ఞత్వము, కర్తృత్వమును ఆత్మకు కల వ్యక్త మొనర్చును. 'అది యతనికే తిరోహిత మొనర్పబడినది' 'తత్తు తస్యైవ తిరోహితం' అని యాగమము తెల్పుచున్నది. మాయయొక్క నాలవ వికారము 'విద్యాతత్త్వము.' కలాతత్త్వముచే చైతన్య ముపోద్బలితమైన వారిని విషయములందు ప్రవర్తింపజేయుట విద్యాతత్త్వపు పని.

అయిదవవికారము రాగము. అనగా విషయానురాగ తత్త్వము. దీనివలన ఆత్మ ప్రకృతిని - ఈప్రపంచమును అనుభవించును. ఆరవ వికారము పురుషతత్త్వము. ఇది గుణములు మొదలుకొని పృథివి పర్యన్త ముండు మల (ద్రవ్య)మున కుపాదాన మగును. ఏడవ వికారము ప్రకృతి తత్త్వము.

ఈ ప్రకృతినుండియే సత్త్వరజస్తమస్సులను గుణములును చిత్త మను తత్త్వమును నేర్పడును. విషమముగా నుండుట కున్ముఖములైన సత్త్వరజస్తమోగుణములే దాని (చిత్తము) స్వరూపము. ఈచిత్తతత్త్వమునుండి అనుద్భూతములై రజస్తమస్సులతో నుండు బుద్ధితత్త్వ మేర్పడును. ఆ బుద్ధి అధ్యవసాయిని, అనధ్యవసాయిని యని రెండు రకములు. అనధ్యవసాయిక బుద్ధిలో ఇష్టాపూర్తాదు (యజ్ఞము లొనర్చుట చెఱువులుత్రవ్వించుట మొదలగు

ములను, అక్షరములను గను వస్తువులన్నియు గణ శబ్దమునకర్థము. బ్రహ్మవాచకములగు అప్పు, ప్రాణ శబ్దములన్నియు గణశబ్దమున కర్థము. ఇట్టి గణముల కీశ్వరుడే గణేశ్వరుడు.

ఇట్టుల, "గణ" శబ్దమునకెంత విస్తృతమైన యర్థము లున్నవి. ఉపాసనలను చేయునప్పుడీ యర్థములను భావన చేయవలయును.—

III. గణేశ స్వరూపము:—గణపత్యుపనిషత్తు నందు గణేశ్వరుని స్వరూపమిట్లు వర్ణితమైనది.—ఏ కదన్తం చతుర్హస్తం పాశమంకుశధారిణమ్। అభయం వరదం హస్తైర్బిభ్రాణం మూషకధ్వజం। రక్తం లంబోదరం శూర్పకర్ణం రక్తవాససమ్। రక్త గంధానులిప్తాంగం రక్త పుష్పైస్సు పూజితమ్। భక్తానుకంపినం దేవం జగత్కారణమచ్యుతమ్। ఆవిర్భూతం చ సృష్ట్యాదౌ ప్రకృతేః పురుషాత్పరం। ఏవం ధ్యాయతి యో నిత్యం స యోగీ యోగినాం వరః ॥—

శ్రీ గణనాయకునకు ఒక దన్తము, నాలుగు హస్తము లున్నవి. నాలుగు హస్తములలో, పాశము అంకుశము లును, రెండు చేతులలో నుండును. ఒక చేయి "యభయ" ముద్రను, మఱియొక చేయి "వరద" ముద్రను సూచించును. —ధ్వజము పైన మూషక ముండును;-ఎఱ్ఱని పెద్ద పొట్ట-చేటల వంటి చెవులు నుండును. ఎఱ్ఱని వస్త్రములను ధరించును. ఎఱ్ఱని గంధము శరీరమున పూయబడియుండును. ఎఱ్ఱని పుష్పములతో నర్చన చేయుచో నీ దేవునకు సంతుష్టి కలుగును.—ఈ దేవుడు, భక్తులయందనుకంపము కల వాడు.-ప్రకృతికి పురుషునకు నతీతుడు. సృష్ట్యాదియందావిష్కరించినవాడు ఇట్లు గణపతిని ధ్యానించునతడు యోగి శ్రేష్ఠుడగును.—ఈ రూప కల్పనమునకుఁగూడ నాన్తరమగు నర్థముకలదు.

ఏక దన్తము:—మాయ ఏక శబ్దమునకర్థము—ఏక శబ్దాత్మకము మాయకు సంజ్ఞయని భావము.—ఈ మాయ నుండియే ప్రపంచ సృష్టి జరిగినది.—ఈ మాయ కధిష్ఠానము, సత్తాప్రదము; సత్తారూపము మాయాచాలకమును నగునది దన్తమని తెలియవలెను.

"ఏక శబ్దాత్మికామాయా దేహరూపా విలాసినీ
దన్తస్సత్తాత్మకః ప్రోక్తః శబ్దస్తత్ర నసంశయః।
మాయాయాః ధారకోయం వై సత్తామాత్రేణ సంస్థితః
ఏక దన్తో గణేశో వై కథ్యతే వేదవాదిభిః।
సర్వ సత్తాధరం పూర్ణ మేకదన్తం గజాననమ్।
సేవధ్వం భక్తి భావేన భవిష్యతి సదా సుఖమ్"

నాలుగు చేతులు:—ప్రపంచమున సృష్టి నాలుగు విధములు—వీని కల్పించని వారికుడు వినాయకుఁడగుటచే నాలుగు చేతులున్నవి—

"చతుర్విధం జగత్సర్వం బ్రహ్మ తత్ర తదాత్మకమ్
హస్తాశ్చత్వార ఏవం తే చతుర్భుజ నమోస్తుతే"

స్వర్గమునందు దేవతలను, భూమియందు మానవులను పాతాళమునందు రాక్షసులను నాగులను, స్థాపించుచు తత్త్వములను సంచరింపచేయును. అందుచే నితడు చతుర్భుజుడు.

స్వర్గేషు దేవతాంశ్చాయం పృథివ్యాంచ నరాంస్తథా।
అసురాన్నాగముఖ్యాంశ్చ స్థాపయిష్యతి బాలకః॥
తత్త్వాని పాలయన్విప్ర ప్రస్తస్మాన్నామ్నా చతుర్భుజః।
చతుర్ణాం వివిధానాంచ స్థాపకోయం ప్రకీర్తితః॥

ఒక చేతిలోనున్న పాశము రాగమును, మఱియొక చేతిలో నున్న యంకుశము క్రోధమును తెల్పునని, యితర దేవతా మూర్తుల చిహ్నములకిచ్చిన వివరమున ననుసరించి మనము తెలిసికొనవచ్చును. — అభయముద్రయు వరద ముద్రయు, భక్తులకు దైవమిచ్చు అభయమును, అనుగ్రహము నను రెంటికిని సూచకములైయుండును.—

వక్రతుండము—భ్రాంతిని కలుగఁజేయు మాయ వక్రమైనది. ఆ మాయను తన తుండముతో నాశనము చేయుటచే నితడు వక్రతుండుడైనాడు.—

"మాయా భ్రాన్తికరీ జన్తోర్వక్రా సంకథితా మునే।
తుండేన తాం నిహన్తి చ తేనాయం వక్రతుండకః॥

ఈ విషయమున మఱియొక భావన కూడకలదు. గణేశు నిస్వరూపము వక్రమైనది—అనగా తెలిసికొనుటకు వీలు లేనిది—ఇక వినాయకుడా! వక్రముగనుండు విఘ్నముల కధిపతి—అందుచే నితడు వక్రతుండుడయ్యెను.

వక్రమాత్మముఖం యస్య మస్తకం బ్రహ్మవాచకం
వక్రాఖ్యం యేన విఘ్నేశః తేనాయం వక్రతుండకః॥

మూషక వాహనము:—భక్తుల హృదయములందు దొంగవలె దాగియుండును, సుఖదుఃఖాదిద్వంద్వము లను ప్రచాలకుఁడగును. "భోక్తారం సర్వతపసాం" అని సర్వ ఫలములను భోక్తయయ్యును సంబంధము లేకయే దాగియుండును; ఈ భావమునే మూషకము తెల్పును.

(1) "త్వంచ్వం చరసి భక్తానాం
తేషాంహృది సమాస్థితః।
చౌరవత్త్వేన తేఽభూద్వై మూషకో వాహనం ప్రభో"
జగతి బ్రహ్మణి స్థిత్వా భోగాన్ భుంక్షే త్వయోగతః।

జగద్బ్రహ్మ బిస్తేన చేష్టితం జ్ఞాయతేనచ
చోరవద్భోగకర్తాత్వం తేన తే వాహనం పరం"

(2) మూషకం వాహనాఖ్యంచ
పశ్యన్తి వాహనంపరం। తేన మూషకవాహోఽయం
వేదేషు కథితోఽభవత్। ముష స్తేయే తథా ధాతుః
జ్ఞాతవ్యః స్పృక్ స్తేయబ్రహ్మ। నామరూపాత్మకం సర్వం
తథా సర్వబ్రహ్మవర్తతే। అహంకారయుతాస్తంవై
నజానన్తి విమోహితాః। ఈశ్వరః సర్వభోక్తాచ
చోరవత్తత్ర సంస్థితః। సఏవ మూషకః ప్రోక్తో
మనుజానాం ప్రచాలకః॥

శూర్ప కర్ణుడు:—చేటతో చెరగనిదే బియ్యములోని చిట్టు తవుడుపోదు. చెరిగిన తరువాతనే బియ్యము వచన యోగ్యమగును. అటులే గణపత్యుపాసనము లేనిదే బ్రహ్మ సాక్షాత్కారము కలుగదు. (శూర్పమనగా చేట) శూర్పాకారమగు చెవులి భావమును సూచించును.

రజోయుక్తం యథాధాన్యం రజోహీనం కరోతిచ।
శూర్పం సర్వనరాణాంవై యోగ్యం భోజనకామ్యయా।
తథా మాయావికారేషు యుతం బ్రహ్మ న లభ్యతే।
త్యక్తోపాసనకం యస్య శూర్ప కర్ణస్య సుందరి।
శూర్పకర్ణం సమాశ్రిత్య త్యక్త్వా మలవికారకమ్।
బ్రహ్మైవనరజాతిస్థో భవేత్తేన తథా స్మృతః॥

శూర్పకర్ణు నాశ్రయించినచో మాయ తొలగిపోవును. నరుడు బ్రహ్మయగును,—

సిద్ధి బుద్ధులు:— శ్రీ గణేశ్వరునకు, సిద్ధి, బుద్ధి యను నిద్దరు భార్యలు కలరు. అయిదురకములుగ నుండు చిత్తవృత్తియే బుద్ధి; వాని సాహాయ్యము నన్నిటి ననుభవించును. సిద్ధియనునది సర్వవిధములగు మోహములఁ గలుగఁజేయును; బుద్ధియనునది బ్రహ్మజ్ఞానమునుఁగూడఁగలుగఁ జేయును. అయిదు చిత్తవృత్తులు పోయినపుడు సాధకుడు బ్రహ్మైక్యమునందును ధర్మార్థ కామాదులను కూర్చునది సిద్ధి. ఈ రెంటికి నీశ్వరుడు గణేశ్వరుడు —కావున సిద్ధి బుద్ధుల రెంటినిచ్చువాడు గణేశ్వరుడు.—

IV. అవతారములు:—గణపత్యవతారములనంతములుగనున్నను, ప్రధానముగ నెన్నఁదగిన యెనిమిది గలవు,

1. వక్రతుండుడు—సింహ వాహనుడు, మత్సరాసురుని చంపినాడు.
2. ఏక దన్తుడు—మూషకవాహనుడు, మదాసుర నిహన్త.
3. మహోదరుడు —మూషక వాహనుడు, జ్ఞాన ప్రదుడు మోహాసుర నాశకుడు.
4. గజాననుడు—మూషక వాహనుడు, సాంఖ్యులకు సిద్ధి ప్రదుఁడు—లోభాసురసంహర్త.
5. లంబోదరుడు — మూషక వాహనుడు, క్రోధాసుర సంహర్త.
6 వికటుఁడు—మయూర వాహనుడు, కామాసుర సంహర్త.
7. విఘ్నరాజు-శేష వాహనుడు, మమాసురసంహర్త.
8. ధూమ్రవర్ణుడు —మూషకవాహనుడు, అహంతాసుర సంహర్త.—

V. యుగభేదమున నర్చనాభేదము— ముద్గల పురాణము ననుసరించి, ఒక్కొక్క యుగమున నొక్కొక రీతిగ గణేశునుపాసింపవలయును. కృత యుగమున సింహారూఢుడు, దశబాహువు తేజోరూపుడు, కశ్యపాత్మజుడునగు వినాయకుని పూజింపవలెను. త్రేతా యుగమునందు, ఆరు భుజములు కలవాడు, శశివర్ణుడు, శివ పుత్రుడు మయూర వాహనుడునగు మయూరేశ గణపతి నారాధింపవలెను —ద్వాపర యుగమునందు మూషకారూఢుడు, చతుర్భుజుడు, రక్తవర్ణయు గలవాడు, వరేణ్యుని సుతుడగు గజాననుని పూజింపవలెను. కలియుగమునందు ధూమ్ర వర్ణుడును, (లేక తెలుపు) ద్విబాహువును సర్వభావజ్ఞుడునగు గణేశునర్చింపవలెను. కొలది మార్పులతో నీ విషయములనే గణేశ పురాణము క్రింది శ్లోకములో వర్ణించినది.

ధ్యాయే త్సింహగతం వినాయకమముం దిగ్బాహు
మాద్యేయుగే
త్రేతాయాంతు మయూర వాహనమముం
షడ్బాహుకం సిద్ధిదం।
ద్వాపారేతు గజాననం యుగభుజం రక్తాంగరాగం
విభుం
తుర్యేతు ద్విభుజం సితాంగరుచిరం
సర్వార్థదం సర్వదా॥

VI. పూజా విశేషములు:—చతుర్థి తిథి గణేశుని దగ్గరకు వచ్చి నన్ను "త్వదేక నిలయనుగాఁజేయుము" అని ప్రార్థించినది.—గణాధిపతి వరమిచ్చినాడు. "శుద్ధ చతుర్థినాడుపవాసముండి నన్ను పూజించి మరునాడు పారణముఁజేయువారికి చతుర్విధ పురుషార్థములనిత్తును. ఆనాడు నాతో గూడిన నిన్నెవరు పూజింపరో వారి వ్రతములన్నియును నిష్ఫలములగును"—శుక్ల చతుర్థి దినమున మధ్యాహ్న కాలమున గణేశ వ్రతము చేయవలయును.

కృష్ణ చతుర్థికి గూడ విఘ్న గణపతి వరమిచ్చినాడు. “కృష్ణ పక్షమున చవితినాడెవరు తనను ప్రార్థనలు సల్పుదురో వారికి కష్టములన్నియును తొలగిపోవును. అందువలననే దీనికి సంకష్టహర చతుర్థియని పేరు వచ్చినది. ఆనాడు చంద్రోదయ కాలమున పూజ చేయుట మంచిది, ఉపవాసముండవలయును; మరునాడు పారణ చేయవలయును.

పుష్ప విశేషములు:—దూర్వయును గరికెలును, శమి పత్రములును, మందార పుష్పములును గణేశ్వరునకు ప్రియతమమైనవి; తులసి పనికిరాదు. 21 సంఖ్యకును గణపతి వైభవమునకును సన్నిహిత సంబంధము గలదు; అందువలననే దూర్వలచే నిరువదియొక పర్యాయములు పూజించు సంప్రదాయము నేటికిని కలదు.

ఇట్లు, తమ బుద్ధిబలమునకనుసరించి, సాధకులగువారు విఘ్నేశ్వరుని జపించేయుచు నుపాసించినచో విఘ్న వినాశనమును, సర్వసిద్ధులను జ్ఞానమూలకమగు ముక్తియును గలుగునని సిద్ధాంతము తెలుపుచున్నవి.

నమస్తేస్తు లంబోదరాయైకదన్తాయ
విఘ్నవినాశనే శివసుతాయ శ్రీ వరద
మూర్తయే నమో నమః.

(విషయములు చాల వరకు ముద్గల పురాణోక్త గణేశస్తోత్ర కదంబమునుండి సేకరింపబడినవి)

---

# గణేశావతారము

అయ్యల విశ్వనాథ భాగవతార్

1

చ॥ గణుడను వాడు భర్గు వర గర్వమునన్ కపిలార్యు దివ్యస
న్మణి గొనిపోవ నమ్ముని క్రమంబున నిన్నినుతింప భూరిబా
హణలను కాంతులీను వరశక్తివిగా మదిదోచి దైత్యుమా
రణ మొనరించి వెల్గిన పరాత్పర! మ్రొక్కెదనో గణాధిపా!

2

సిందూరుండనువాడు పూర్వ మమరశ్రేణిన్ వెతన్ముంప త
ద్బృందంబెల్ల మహాభయుండవగు నిన్వేడంగ శ్రీ గౌరికా
నందంబెర్పడ నుద్భవించి తొలి విజ్ఞానాత్ముడై శంభుచే
బ్రహ్మంబం గల్గు గజాసు రాఖ్యు ఘన శీర్షంబున్ రహించాల్చినా
సిందూరుందును మోగజానన నినున్ సేవింతు స్వశాంతమున్.

3

సీ॥ అతి గర్వియై యింద్రు డభినందన ప్రభు
యాగంబు మాన్ప విఘ్నాసురు డను
వాని బంపంగ నభ్యాఫల కోర్వకా
రాజు పెక్కురు నిన్ను ప్రణుతి నలుప
పుష్పిక గర్భసం భూతుడవై చతు
ర్భుజములు గజ ముఖంబునఁ జెలంగి
వినప పార్శ్వుని చేత పంపంగ బడియట
సౌరభి ముని శాప శక్తి వలన
మూషకంబైన గంధర్వు మూపునందు
నెక్కి విఘ్నాసురుని బల్మినలఁగ గూల్చి
యతని కోరిక విఘ్నరా జాఖ్య దనరు
భక్త పరిపాల నిన్నునే బ్రస్తుతింతు.

4

శా॥ క్రూరుండైత్రి పురాసురుండునుమ భర్గుండాన పెక్కేడులోం
కారంబున్ పఠియింప నంత మహదాకారంబునన్ దోచి “నా
పేరున్ విన్మ గణేశుడన్ నతము నీ వెంటన్ బ్రకాశింతు” నం
చారాకాసిని గూల జేసెన గణేశా! నిన్ను సేవించెదన్

5

నీ మహనీయ శక్తి గననేర్తు మటయ్య వినాయకా! సుర
స్తోమము బ్రహ్మ విష్ణు హర శూరులె నిన్ మును ముందు గొల్చిన
త్కామిత సిద్ధిగొందు రనగా - మము బోంట్లమ దెంత? గాసనో
స్వామి! దయార్ద్ర దృష్టిని నిశంబుమముందరి జేర్చి బ్రోవవే.

---

# మఠాధిపతులు

జగద్గురు శ్రీ కల్యాణానందభారతీ స్వాములవారి జీవితచరిత్ర—ఓరుగంటి నీలకంఠ శాస్త్రి

నారాయణసమారంభాం వ్యాసశంకర మధ్యమామ్।
కల్యాణానందపర్యన్తాం వందే గురుపరంపరామ్॥

దక్షిణదేశమునఁ గావేరీతటంబునందు "వెలంగమాను" అను నొకగ్రామ మున్నది. నేఁటికాలపరిస్థితులచే ఈనాఁడు ఆగ్రామ మంత ప్రసిద్ధము కాకపోయినను చోళవంశజులు రాజ్య మేలు సమయమున అయ్యది శ్రోత్రియపుంగవులతో విరాజిల్లుచు 'వేదభూమి' యని వాసి కెక్కెను. నామ మాత్రమున రాజు దానికి ప్రభువు అయినను నిజాచారపరిపూర్ణులగు నందలి విప్రులు ఏనాడును ప్రభువును బూజ్య భావముతోఁ జూడలేదు. అయ్యది తనకు ఆశీస్సు అని రాజు తలంచువాఁడు.

ఇట్లుండగా ఒకనాఁడా ప్రభువు ఆ గ్రామమునందలి వైదిక గ్రామమునకు గ్రామణియు భార్గవగోత్రజుఁడును అగు పెనువజ్జలను నతనిఁజేరి తనకు వైదిక సంస్కారములను జేయఁవేడగా అతండును ప్రభువు ద్విజేతరుం డగుటగాంచి యద్దానికి ఇయ్యకొనక అట్టి జనపదంబున నున్నచో ఏకీడు మూడునో యని సాటి వంశంబులతోఁ గూడ సాగ్నిహోత్రుడై క్రమముగ గోదావరీమండలము చేరెను. అప్పుడు ఆతనిని వెలంగమానునుండి పదమూడు గోత్రములవారు సాగ్నులై అనుసరించిరి. వారల నందఱను గని ఆవీటి రాజగు వత్సవాయి వంశస్థుఁడు వారి చరణనిధానముచే దన్ను ధన్యునిగాఁ దలచుకొనుచు ఆ బృందమునకుఁ బ్రధానుఁడగు పెనువజ్జలుగారిని వేఁడి తన రాజ్యమున వారల నెల్లన నిలుపఁదలచినట్లును దాను వారలకొక యగ్రహారమును నెలకొల్పఁ దలఁచినట్లును విన్నవించి ర్యాలి యనునొక గ్రామమున సంతయు నేర్పఱచెనేకాని అయ్యది సదాచార సంపన్నము కాకపోయెను. అంత గౌశికా తీరమునందలి యొక ప్రదేశమున నూతనముగ నొక యగ్రహారమును నిర్మించి యందు బ్రాహ్మణులకు వలయు సాధనంబుల నేర్పఱచెను. నాఁటినుండియు అయ్యది "పేరూరు" (పెరియఊరు) నాఁబరగుచుండెను. వైదిక శిరోమణులగు దాక్షిణాత్య ద్రావిడులకు ఆంధ్రదేశమున నయ్యదియే ప్రథమ ప్రభవమగుటచే నేఁడు అచ్చటచ్చటఁ జెదరియున్న ద్రవిడుల కందఱకు నదియే మూలాధారమై యొప్పెను.

అట్టి పేరూరు గ్రామమునకు నిధానంబగు పెనువజ్జలగారికి సాంగోపాంగముగ వేదము నధ్యయనము చేసిన యైదుగురు పుత్రులు శంకరునికి బంచముఖములట్లు వెలయుచుండిరి. వారిలో జ్యేష్ఠపుత్రుని వంశములోని వాఁడగు లక్ష్మణశాస్త్రి యను నాతడు తీర్థయాత్రాభిలాషతోఁ దూర్పుదేశమునకు రాఁగా అచటి పండితు లాతని సద్యశమును అంతకుమున్నె ఎఱింగిన వారగుటచే ఆతని సర్వవిషయముల నాదరించి క్రమముగా విజయనగర భూపాలునితోఁ బరిచయము గావించిరి. రాజాతని వైదుష్యమును లెస్సగా గ్రహించి ఆతని నెట్టెనఁ దన యాస్థానమున నిలుపరింపఁగోరి ఆతనికి బవిత్రంబగు గోస్తనీ సాగరసంగమ ప్రదేశంబునఁ గల సంగమవలస-(నంగివలస) అను గ్రామమును సెలవుగాఁజేసి జపయాత్రకు దగువసతులను సమగ్రముగ నొసఁగెను. నాఁడుమొదలు వారి కుటుంబము అచటనే నిలిచిపోయెను. ఆతని పుత్రుఁడగు వీరేశ్వరశాస్త్రియుఁ బౌత్రుఁడగు లక్ష్మణశాస్త్రియుఁ దమ పూర్వుల వలెనే సక్రమముగ వేదశాస్త్రములను అధ్యయనముగావించి ఆస్థానవిద్వత్స్థానంబులను అలంకరించిరి. లక్ష్మణశాస్త్రి తనయుఁడగు వీరేశ్వరశాస్త్రి దాను వేదాభ్యాసముగావించియు వర్తకమునందు అభిరుచిగలవాఁడై సమీపమునందలి భీమునిపట్టణమను సాగరతీరమున వర్తకంబున కనుకూలంబులగు గృహంబులను నిర్మించి వర్తకమును నడుపుచుండెను. ఆతని పుత్రుఁడగు లక్ష్మణశాస్త్రియు అపారమగు సముద్ర వ్యాపారమును నిర్వహించుటకు ఎక్కువకాలము భీమునిపట్టణముననే గడుపవలసి వచ్చుచుండెను. ఆయన పుత్రులగు సోమయాజి, వీరేశ్వరశాస్త్రి, సర్వేశ్వరశాస్త్రి, అరుణాచలశాస్త్రి అను నల్వురిలో వీరేశ్వరశాస్త్రి మహామేధావియై గ్రామమునందలి వ్యవహారనిర్ణయమునకుఁ దానే సమర్థుఁడనిపించుకొని వైదిక లౌకికములందుఁ బెద్దపేరు మోసెను. ఈతని సమయముననే వీరి వంశమునఁ గామేశ్వరి ఇష్టదేవతయై వెలసెను. కావుననే తనకుఁ గల్గిన పుత్రుల కిర్వురకును 'కామేశ్వరశాస్త్రి' యనియే యభిధానమును గావించి భేదమునకు మాత్రము 'చిన్న' 'పెద్ద' యను నుపపదంబులతో వ్యవహరింప దొడఁగెను.

ఇది యిట్లుండఁ బేరూరనున్న చాలమంది ద్రవిడులు రాజాస్థానములందు గౌరవములనందుచుఁ గ్రమముగాఁ దూర్పుదేశమున వ్యాపించి అగ్రహారముల సంపాదించి గౌరవపాత్రులగుచు అందే నివసించుచుండిరి. అట్టివారి సంఘ మిప్పటికిని 'పేరూరు ద్రవిడ' పదముచేఁ బేర్కొనఁబడుచుండును. అట్లు తూర్పుదిశకువచ్చి విజయ

నగరాస్థాన ప్రభువులచే సన్మానింపఁబడిన పండితము లలో విజయనగర సమీపగ్రామ మగు నేకతాళాగ్రహారము సంపలి (ఒంటితాత అగ్రహారము) యత్రిగోత్రజులగు 'తాతా'వారి వంశమొక్కటి గలదు. ఇందు వేదమూర్తులు నాదెళ్ల సూర్యనారాయణావధానిగారు ఛాత్రతతికి ఆమ్నాయాధ్యయనము గావించుచుఁ జుట్టుపక్కలకెల్ల పేరెన్నికగల యామ్నాయవేత్తయని కీర్తిపొందెను. ఇట్టి వేద పురుషునకుఁ జంద్ర సూర్యరూపమగు పరమేశ్వరుని నేత్రద్వయముపలె అమ్నాయపారగులగు నప్పావధాని గారును తమ కూలంకష సకలశాస్త్రపాండిత్యప్రతిభచే జిజ్ఞాసుహృదయాధిరూఢతమిస్రమును అపనయించుచుఁ దమ విద్యావంశపాదప సుమగంధము భారతదేశము నందంతటను వ్యాపింప నొకకడ విద్యామూర్తియు వేఱొక కడ వ్యవహారమూర్తియు నగుచు వెలుఁగొందు వైయాకరణసార్వభౌమ, కలాప్రపూర్ణ, మహామహోపాధ్యాయ, సుబ్బరాయశాస్త్రిగారును ఉదయించిరి. శ్రీ భూదేవులవలె నెప్పు నన్నపూర్ణా పార్వతీదేవులు వీరి తోఁబుట్టువులు.

పైఁ జెప్పఁబడిన వీరేశ్వరశాస్త్రిగారు తమ కామేశ్వరులకు ఉపనయనము మాత్రము గావించి పసివనముననె కాలగతి నొందుటచే వారిద్దఱును విజయనగరమున దమ మేనమామ యింటఁ బెరిగిరి. క్రమముగా పెదకామేశ్వర శాస్త్రిగారు వైద్యమునునేర్చి బిషగ్వరులై తమ స్వగ్రామ మగు బిమునిపట్టణమునకు వెడలిపోయిరి. ద్వితీయులగు చినకామేశ్వరశాస్త్రిగారికి మేనమామ తగు సంబంధమును జూచఁదలఁచి ఏకతాళాగ్రహారమునఁగల సూర్యనారాయణావధానిగారి ద్వితీయపుత్రికయగు సౌభాగ్యవతి పార్వతీదేవి అనుకూలయగు కన్యకయని ఆమె నిచ్చి వివాహ మొనర్చిరి. చినకామేశ్వరశాస్త్రిగారును 'మెట్రిక్యులేషను' పరీక్షయందు ఉత్తీర్ణులై విశాఖపట్టణ మండలమునందలి చోడవరమను గ్రామమున మాధ్యమిక పాఠశాలకుఁ బ్రధానోపాధ్యాయులుగాఁ బ్రవేశించిరి.

కొంతకాలమునకుఁ బార్వతీకామేశ్వరుల గర్భమునఁ గామేశ్వరముఖాలోకకల్పిత శ్రీ గణేశునివలెఁ గారణజన్ము లగు శ్రీ జగద్గురువులు చిత్రభానువత్సర వైశాఖ శుద్ధాష్టమీ జయవాసరంబు నుదయంబున మిధునలగ్నమునందుఁ బుష్యమీ నక్షత్రమున ఏకతాళాగ్రహారమునఁ దమ మాతామహ గృహంబున అవతరించిరి.

అప్పటి గ్రహకూటమిట్లున్నది :—అశ్విని చతుర్థమున రవి; పుష్యమిత్రుతీయమునఁ జంద్రుఁడు; పునర్వసు చతుర్థమునఁ గుజుఁడు; అశ్విని తృతీయమున బుధుఁడు; రోహిణి ప్రథమమున గురువు; కృత్తిక ద్వితీయమున శుక్రుఁడు; భరణి ద్వితీయమున శని, అనూరాధ తృతీయమున రాహువు; రోహిణీ ప్రథమమునఁ గేతువు, జనన కాల మహాదశాశేషము 7 సం॥ 6 మా॥ 29 దిన ములు.

పుట్టుకతోడనే తేజస్వియగు పుత్రునిఁజూచి జననీజనకులు సుహృద్బంధువర్గమును అపారముగ ముదమునొందిరి. బిడ్డనికి యథావిధి సంస్కారములఁగావించి తమ యిష్ట దైవంబగు కామేశ్వరీదేవిఁగొల్చి ఆ పవిత్రాఖ్యచేతనే కామేశ్వరశర్మయని పిలువఁబొచ్చిరి. తమకు ఇద్దఱు పుత్రికలతోపాటు ఒక్కరుడె బిడ్డండు కలుగుటంజేసి తల్లి దండ్రులల్లారుముద్దుగా బాలునిఁ బెంచుచుండిరి. కుమారునికి ఐదవయేఁడు రాఁగానే తండ్రియే తనయొద్ద అక్షరాభ్యాసముగావించి క్రమముగా సంస్కృతాంధ్రభాషలను ఉర్దూభాషనుగూడఁ జెప్పఁదొడఁగెను. బాలుఁడు పాఠశాల యందుఁ బ్రవేశించి తోడబాలురకన్న మిన్న యనిపించు కొనుచుండెను. ఐదినుండి రాఁగానే జనకునియొద్ద నీతిని, ధర్మమును, మతమును బోధించు ననేక కథలను శ్రద్ధతో వినుచుండెను. పూర్వవాసనాబలము ఎట్టిదోకాని అందు శంకరచరితమన్న బాలుఁడమితోత్సాహముగని పరవశుఁ డగుచుండెను వెదాధ్యయనమునఁ దనకు అతి వేలంబగు నుత్సాహమున్నను బితృనియోగానుసారియై తాను ఎట్లో ఆంగ్లమునే చదువవలసివచ్చెను. కాని యేసెని విశ్రాన్తి దినములు వచ్చినచో అందుఁ బ్రత్యేకముగ మాతామహ గృహంబునకువచ్చి అటసామాన్యమగు వేదభాగములను జదువుచుఁ గ్రమముగా అవ్వానిని సేకరించెను.

నాఁటి ద్రావిడశాఖా మర్యాదననుసరించి బాలునికి వివాహవయస్సు దాఁటిపోవుచున్నదే యని బంధువర్గము త్వరసేయఁ జినకామేశ్వరశాస్త్రిగారు తమ ముద్దుబిడ్డనికి విజయవత్సర మాఘ బహుళవిదియా సోమవాసరంబునఁ దమ బంధువులలో నొక శ్రోత్రియకుటుంబమునకుఁ జెందిన యొక కన్యనిచ్చి శుభముహూర్తంబున ఏకతాళాగ్రహారముననే వివాహమును గావించిరి.

కాలగతి ననుసరించి జరుగుపనులకుఁగూడఁ గార్యకారణభావము కల్పించుట లోకసహజమైయున్నది. వివాహమునాటి పంచమదివసముననే పార్వతీదేవి కైలాసగిరికేగెను. ఇట్టి ఘోరవిపత్తు తటస్థించుటచే బంధుమిత్రాదులు చకితులైరి. ఇఁక నేమున్నది? వీతిహోత్రునికి ఆజ్యాహుతి అయినది. ముక్కుపచ్చలాఱని ఆపసి బాలకుని అదృశ్యమంతయు ఒక్కసారి భయాశ్చర్య సంభ్రాన్తునిగాఁజేసినది. బాల్యమునుండియు ప్రపంచతత్త్వ విచారపరుఁడగు మన కామేశ్వరునకు ఆనాఁటి దృశ్యము అస్థిగతమై హృద్గతభావములకు మఱింత దోహదము నిచ్చెను. అదిమొదలు ఆతఁడు పరవేదన్యాసహిష్ణుడై ఒరులు శిరోవేదనను అనుభవించుచున్నను జూడఁజాలక

తొలంగిపోవుచుండెను. క్రమముగా ఇట్టి సంఘటనముచే నిరంతర తత్త్వవిచారము హెచ్చి ఆతనికి గార్హస్థ్యమందు నిర్వేదభావమే యేర్పడఁజొచ్చెను.

ఇట్టి విషమపరిస్థితులలో జనకుఁడు దమ్ము భీముని పట్టణములోనే పెదతండ్రిగారియొద్ద నుంచుటచే మన కామేశ్వరులు అటనే నాల్గువత్సరంబులుండి ప్రారంభ విద్యయందుఁ గృతార్థులైరి. అట్టిసమయముననే భీముని పట్టణమునఁ బెదకామేశ్వరశాస్త్రిగారు పేరుమోసిన వైద్యు లగుటచే వారియింట ఒకమూల ఔషధనిర్మాణము, వేఱొక చోట రోగనిదానచర్చయు జరుగుచుండ మేధావులగు మన బాలకామేశ్వరులు ఔషధనిర్మాణమునను దద్వినియోగము నను రోగనిదానమునను మంచి ప్రావీణ్యము సంపా దించిరి.

ఆనాఁడు భీమునిపట్టణమునందుఁ గ్రైస్తవమతబోధకులు సనాతనమతమును దూషించుచుండుటచే అద్దానిని సహింపక వారి బైబిలునందలి యసంగతములను విమ ర్శింపనెంచి చిన్నతనముననే వారు బైబిలు చదువ నారంభించిరి.

అనన్తరము 1896 వ ఱకు భీమునిపట్టణముననే యుండి అచటి చదువు పూర్తిచేసి ప్రారంభించిన యాంగ్ల విద్యను బూర్తిసేయుటకు సమీపముననుగల విజయనగర మునకు వారు వెడలఁదలఁచిరి. అదియుఁగాక తన మనమునందెన్నియో దినములనుండి చదువ నుత్సాహ పడు వేదవేదాంగములన్నియు అటఁ బ్రచారములోఁగలవని వారికి బాగుగాఁ దెలియును. కావున భీమునిపట్టణము నుండి విజయనగరముఁ దమ పెదతల్లిగారింటికిఁజని 1897-వ వత్సరమున హైస్కూలు తరగతియందుఁ బ్రవేశించిరి.

తీవ్రమగు బాలకామేశ్వరుల విద్యాసంపాదనాభినివేశ మును అనాటి విజయనగర పరిస్థితులు మఱింత ఉత్తే జింపఁజేసినవి. నగరమును ఏలు రాజు సకల వైదికధర్మ తత్పరుఁడును సకలకలాతత్త్వజ్ఞుఁడును రసజ్ఞ సార్వ భౌముఁడును పండితాభిమానియునగు నానందగజపతీం ద్రుఁడు. పురమునందుఁగల రెండుమూఁడు పేటలు కేవ లము సకలవిద్యలయందు దిగ్దంతులగు ద్రవిడశిరో మణులచేతను దక్కుంగల విద్వద్విప్రానముతోడను అలం కరింపఁబడినవి.

ఇట్టి మహోత్కృష్టసమయాన నిశితబుద్ధి విభవముతో ఒప్పు మన కామేశ్వరులు ఉత్సాహసంపత్సమేతులై విజయ నగరమునకు విద్యాసంజిఘృక్షచే ఏతెంచిరని నుడివితిని గదా! పైని బేర్కొనఁబడిన విద్యానగర వైభవమునకు అంతకును ద్రవిడభూసురులే కారణభూతులగుటచేతను, అద్దారు తమకు అత్యన్తసన్నిహిత బంధువులు అగుట చేతను, సుముహూర్తమున ఆయాయి వేదభాగంబులను శాస్త్రంబులను వారియొద్దఁ బ్రారంభమునేసిరి. శాస్త్ర పాఠముతోడఁ బ్రపంచతత్త్వ విమర్శనమునుగూడఁ జేయు చుండుటచేఁ గ్రమముగా సంసారవిషయములందు హేయభావ మేర్పడఁజొచ్చెను మిత్రసంఘములతో నెంత ప్రకారులు చేసినను సరియగు సమయమునందుఁ దమ యాత్మతత్త్వవిచారమునకు నిత్యకర్మానుష్ఠానమునకును హాజరు కావలసినదే!

ఇట్లు కృత్యంబులను యథావిధి నడుపుకొనుచుఁ గ్రమ ముగా 1901-వ సంవత్సరమున 'మెట్రిక్యులేషన్' పరీక్ష కాగానే పొంగిపొరలు వైరాగ్యసంపదతోఁగూడ సంన్యాస గ్రహణోత్సాహమున వారణాసిపురంబునకు వెడలిపోయిరి. కాని అచటిమన్కరుల కుహనామాత్ర పరత్వమును విశా కదంబక గవేషణంబును గాంచినంతనే, భాగీరథీస్నాన విశ్వేశ్వర దర్శన ప్రభావముచేతను గాఁబోలు తనకు విద్యావైభవము చాలదని తోఁచి యిట్టిసమయమున సంన్యా సము తీసికొనఁదగదని ఆప్రయత్నమునుండి అప్పుడు విరమించి విద్యార్జనమునకుఁ దమ నికేతనమే సర్వవిధ ముల ననుకూలమైనదని యెంచి విజయనగరము రాఁగానే తమ 'మెట్రిక్యులేషన్' పరీక్ష సఫలమైనట్లు సుహృద్వర్గము తెలిపెను.

విశ్రాంతి దినములు తీరినవెంటనే F. A. (ఎఫ్. ఎ.) తరగతియందుఁ బ్రవేశించి నగరమున గొప్ప యుపాస కులుగాఁ బేరెన్నికగన్న రాణి మహగ్ని చిన్నరసింహచయ నులవారి నాశ్రయించి యొక మంత్రదీక్షఁ బొందిరి. అయ్యదియే మన బాలకామేశ్వరులకు ఉపాసనమునందుఁ బ్రథమప్రవేశము. క్రమముగా B. A. (బి. ఎ.) తరగతికి వచ్చునరికి శ్రీ విద్యోపాసనావిషయములను గురువులనుండి గ్రహించుచుఁ బూర్వమునే యారంభించిన యుపనిషత్తు లను సేకరించి వేదాన్తగ్రంథములను జదువనెంచిరి. అందుఁబొలుత గీతను సవిమర్శంబుగఁ జదివి ఆకాల మున నూతనప్రతిష్ఠితంబగు రాజమహేంద్రవర హిందూ సమాజగీతాపరీక్షలో వారు ప్రథములుగా ఉత్తీర్ణులై ప్రథమ పారితోషికమును బొందిరి. అప్పుడు వారు సమా ధానపత్రములపై వ్రాసిన సమాధానములు ఎంతయో సవి మర్శంబుగను సాధారణ పురుషబుద్ధులకు అగోచరం బులుగను స్వతంత్రభావోపేతములుగను ఉన్నవని పరీ క్షాధికారులవలనఁ గ్రమముగాఁ దెలిసినది. ఇట్లు దాము బహుమతులను బడయుటయేగాక కోరిన తోడిఛాత్రులకెల్ల గీతల నుపదేశించుచు వారలను అపరీక్షకుఁ బంపుచు నెందఱకో పారితోషికముల నిప్పించిరి. ఈవిధమున

ఒకప్పుడు ఇతరులకు గీతలను ఉపదేశించుచును, గలాశాలయందలి పాఠములను వేఱొకప్పుడు చదువుకొనుచును ఉదయముననే ఉపనిషత్తులను అధ్యయనముగావించుచునే యవకాశము లభించినపుడెల్ల తమ మాతులనన్నిటిని ఉపనిషత్సూత్రభాష్యంబులను గొన్తివేసిరి. ఇట్లే జ్యోతిర్విద్యను గాప్యనాటకాదులను ఆయా పండితులయొద్దఁ జదువుచుండిరి

మతవిషయమునఁ జూచినచో అది మిక్కిలి గడ్డు కాలము. అందునను విజయనగరము సకల కళలకు ఆకరమగుటచే అందఱును దమదమ మతములను అచటఁ బ్రతిష్ఠింపఁజేసి ఎక్కువ ప్రతిష్ఠను బొందఁ గోరుచుండిరి. కావుననే బ్రహ్మసమాజ ప్రబోధములను, దయానందుని యార్యసమాజ విజ్ఞానములను, అన్యేభశాంతమ్మ దివ్యజ్ఞాన విఖ్యాతియు అట నెలగొల్పుట కెండతెందతో ఎన్నియో ఉపన్యాసంబుల నొనంగుచుండెడివారు. అట్టితఱి బాలకామేశ్వరులు వారలకుఁ బ్రతివాదిగ ఉపన్యాస వేదికలపై సాక్షాత్కరించి అవ్వారి మతములను యుక్తియుక్తముగ ఖండించి వైదికమత ప్రాశస్త్యమును నిలువఁబెట్టుచుండిరి. ఇట్టి సంఘటనమువలనఁ గ్రమముగా ఆయా మతబోధకులు విజయనగరమునకు రావెఱచుచుండిరి. ఇట్లు ఒక వైపు మతవిషయమున మిగుల సేవ చేయుచున్నను దమ తరగతి యందుఁ దమ 'గ్రూపు' అగు రసాయన శాస్త్రమునఁ బరిశోధనముల నన్నింటిని సక్రమముగఁ జేయుచు ఉపాధ్యాయులచే మెప్పుపడుచు 1905 సంవత్సరమున బి.ఏ పరీక్షయందు ఉత్తీర్ణులైరి. తమ వెంటఁ దిరుగు ఛాత్రావళికిని మిత్రబృందమునకుఁగూడ దమ గురు సన్నిధినే ఏదియో యొక మంత్రమును జెప్పించుచు ఉపాసనా శక్తి గల్గించుచుండుటచే ఉపాసనమునందు బాలకామేశ్వరుల కుండు శ్రద్ధ గని శ్రీచయనులుగారు వారికిఁ బ్రతిదినమునను రాత్రియందును మంత్రశాస్త్ర రహస్యంబుల నుపదేశించుచుఁ బూర్ణదీక్షితులగాఁ జేసిరి. దానఁ దమకుఁ గొంతతురీయాశ్రమాధికారము కల్గినదని లోలోన సంతసించి బి.ఏ పరీక్షయం దుత్తీర్ణులైన వెంటనే తమ బంధువుల ప్రోత్సాహమున ఆయూరనే ఒక ఉపాధ్యాయ పదవిన ధిష్ఠించిరి. కాని భృతకాధ్యాపకత్వమునకు మిక్కిలి వగనొందుచుఁ దమ మనోరథ సిద్ధికి అనువగు సమయము కొఱకు వేచుచుండిరి.

ఇది యిట్లుండ మహాగ్ని చిన్నృసింహమూర్తులు తమ ధర్మపత్నీ వియోగముచే అతివేలంబగు వైరాగ్య సంపద నొంది సచ్చిదానంద భారతులకడ యథావిధి సంన్యాసమును గ్రహియించి బోధానంద భారతులు నా నొప్పుచుఁ గ్రమముగా క్రీ. శ. 1906 సంవత్సరమున శృంగేరీ గ్రీ విరూపాక్ష శ్రీపీఠమునకు అధిపతులైరి. పరిస్థితులు తమకు అనుకూలములుగా నున్నవని సంతసించి బాలకామేశ్వరులు 14-8-1907 దివసంబున దమ కోరికను శీఘ్రముకాలమున నెరవేర్చుకొనుటకు విజయనగరము నుండి అప్పటికి తీరము విజయముచేసియున్న గోదావరి మండలాంతర్గతంబగు అమలాపురమునకు వేగిరి. ప్రియాస్తేవాసియిట్లు హఠాత్తుగా వచ్చుట శ్రీ బోధానంద భారతీంద్రులను జకితులనుగాఁ జేసెను. అనాఁటి రేయి ఏకాన్తముగా బాలకామేశ్వరులు గురువులకడఁజేరి తమ హృదయమును వారికి విప్పిచెప్పిరి కాని బోధానందులు అప్పటికేమియు మాఱుపలుకక రాత్రి అతిక్రమించుచుండుటచే శిష్యునిఁ బరుండఁబంపిరి.

కొద్ది దినములనుండి బోధానందులు వ్యాధిపీడుతులై యుండిరి. మూడవదినము మఱింత తీవ్రరూపము దాల్చెను. తమ జాతకానుసారముగ అవ్యాధి మారక సమయమగుటచే వారు అందులకు సన్నద్ధులై మధ్యాహ్నము మూడుగంటలకు గ్రామమునందలి యున్నతోద్యోగుల రావించి మరణశాసనము నొకదానిని వ్రాయించిరి. తమ యనంతరము పీఠాధిపత్యము వహింపగల వారెవ్వరని వారలడుగఁ బార్శ్వవర్తులగు మన బాలకామేశ్వరులను వారు చూపిరి. దాన వారలందఱు నివ్వెఱపోఁగాఁ గని భారతీంద్రులు మీ పరిషదనుజ్ఞ అయిననేకాని మేమీ తనికి సంన్యాసమీఁ దలంపలేదు. మా యనంతరము గురువులెవ్వరను విషయమును నిర్ణయింపవలయు బాధ్యత మీదే యగుటచే ఈతని యధికారము మీరు పరీక్షింపవలయునని నుడివిరి. వెంటనే యా నిండు సభలోని ప్రధానులగు నున్నతోద్యోగులందఱు వివిధంబులగు ప్రశ్నంబులఁ గురుపింపఁగా బాలకామేశ్వరు లద్దానిపై రెండు గంటలు దీర్ఘోపన్యాసముగావించి వారి సందేహములను బాపిరి. దానితో వారలందఱు బాలకామేశ్వరుల జ్ఞానమున కచ్చెరువునొంది వారి యోగ్యతను జగద్గురువులకు నివేదించి బాలకామేశ్వరులఁ బ్రశంసించుచుఁ దమతమ నెలవులకేగిరి.

మఱునటి దినమున సమీపమునందలి పేరూరున కీవార్త తెలుపనందలి వైదికబృంద మంతయు వచ్చెను. ప్లవంగ శ్రావణ శుద్ధ చతుర్దశీ గురువాసరంబున (22-8-1908) యథాశాస్త్రంబుగఁ బారివ్రాజ్యంబును స్వీకరించి మన బాలకామేశ్వరులు కల్యాణానందభారతి యను పవిత్రతమంబగు నభిధానంబుతోఁ ద్వితీయంబగు జన్మంబు నందిరి.

బోధానంద భారతీంద్రుల యారోగ్యముకూడ సరియగు త్రోవఁబడుచుండెను. అంతఁ జాతుర్మాస్య దీక్ష భాద్రపద

ప్రార్థమినాఁటికి బూర్తికాగాఁ బీఠముతోఁగూడ వారు నవ రాత్రములకుఁ బేరూరు విజయంచేసిరి. నవరాత్రానంతరము బాలభారతీంద్రులు తామింకను శాస్త్రవిషయ జిజ్ఞాసువులై యుండుటచేతను పేరూరునందు సకల శాస్త్రంబులందును, శ్రౌతస్మార్త విషయంబులందును, జగమెఱిఁగిన పండితు లుండుటచేతను పేరూరి విద్వద్బృందముయొక్క సప్రశ్రయంబగు ప్రార్థనపై నటనిలువ గురువులఁ గోర వారద్దాని కంగీకరించిరి. అంతఁ దాముస్వంతకాలమును ఆ యూరి నుండు జమిందారులగు జిల్లెళ్ళ భానోజీరావుగారు తమ గృహముననే శ్రీవారిని బిక్షసేయ వేఁడఁగా నందులకు ఇయ్యకొనిరి.

ఇట్లు 1907 సంవత్సరము మొదలు 1919 వ సంవత్స రము వఱకు మధ్య మధ్య నెటకేని స్వల్పకాలము విజయ యాత్ర చేసినను బ్రధానముగాఁ బేరూరనే నివసించి సకల శాస్త్రసారంబులను బాలభారతీంద్రులు చూఱగొనిరి. భార తీంద్రుల ప్రతిభావైభవము ఉపన్యాసాదులందుఁ గనివిని యుండుటచేఁ గొందఱు విద్యారతులు తమతమ గ్రామ ములయందు నివసింప వేడుటచే శ్రీవారు 1919, 20, 21, 22, 23 సంవత్సరముల యందు బెజవాడ, గుంటూరు, తెనాలి, బాపట్ల ప్రభృతి స్థానములయందే పర్యటనము చేయవలసివచ్చెను.

ఒకనాడు గుంటూరుపురమున ఛాత్రగణమునకు వేదాన్తో పదేశముచేయు సమయమున హఠాత్తుగా బోధానంద భార తీంద్రులు అటకు విజయముచేసి సమర్థుఁడగు కుమారుఁడు ఉండగా గురువు రాజ్యభారము వహింపవలసు పడదనుచు మేము వృద్ధులమగుటచే ఈ భారమింక వహియింపలేమని రుధిరోద్గారి మార్గశీర్షశుద్ధ పూర్ణిమయందు (23-12-1923) శుభముహూర్తమున శ్రోత్రియ సందోహములు, రాజకీయో న్నతోద్యోగి సమవాయము న్యాయవాది కదంబకము తక్కుంగల చాతుర్వర్ణ్య బృందమును సంపూర్ణ చేతో మోదము నొందుచుండ శ్రీ కల్యాణానందభారతులను, వ్యాఖ్యాన సింహాసనము జగద్గురు పీఠంబుననగు శృంగేరీ శ్రీ విరూపాక్ష శ్రీ పీఠంబునఁ బట్టాభిషిక్తులుగా నొనర్చి చతుర్వర్ణ చక్ర మహోదయకరంబగు శ్రీ విద్యారణ్య భారతీంద్ర ప్రతిష్ఠిత శ్రీ చక్రరాజము నొసగిఁ ధర్మరాజ్య పరిపాలనాధికారులుగ నొనర్చిరి నాఁటినుండి కుమార భారతీంద్రులు ఆవిష్కృత జగద్గురువులైరి.

వైదిక సామ్రాజ్యమునకు సంకటసమయము సమీ పింపఁ బెచ్చుపెరిగిన మచ్చరంబుతోడ ద్వైత విశిష్టాద్వైత మతంబులు ఈ యౌపనిషదంబగు నద్వైతంబును దూఱ నారంభించినవి. ద్వైతాది పీఠస్థుల మాట కాలవశమునఁ జలామణి యగుటచేతను బ్రతిఘటింప నిల్వఁగల సాహ సాదికము పీఠాధిపతులకు లేకపోవుటచేతను, ఇంతమాత్రముననే మేరుమహీధర స్థిరంబగు నద్వైతంబునకు ఏమి ఛిన్నంబైనదను విపశ్చిదుపేక్షాభావముచేతను ఆ యవైదిక వాదములు వృద్ధిపొందినవి.

అట్టి సమయాన భారతీంద్రులు పీఠము నొక పరిచిత దేశమున స్థాపించి తాము క్రమముగా భారతదేశమున దిగ్విజయయాత్ర సేయనెంచిరి. కావున బీఠమునకు నింత వరకుఁ బరిచితంబులగు గోదావరీ విశాఖపట్టణ మండల ములలో నెందైనను బీఠమును స్థాపింపఁదలఁచిరి. కాని ఆనాఁడు గుంటూరు శిష్యస్తోమమునందుఁ బ్రధానులగు శ్రీ పొన్నాడ రామకోటి సాగర్వాలా రుస్తుంసింగుగారలు ఎట్లైన శ్రీ పీఠమును గుంటూరునందే యుంచి ఆ కీర్తి గుంటూరుకే రావింపవలయునని వేఁడుచు అద్దానికి అను కూలంబులగు నివేశనంబుల నేర్పఱచిరి. జగద్గురువు లును దాన గుంటూరినే వైదిక సామ్రాజ్యకేంద్రస్థానముగ నేర్పరచి వ్యవహరింప గడంగిరి.

శ్రీవారి ధర్మప్రబోధములచేతను బీఠచరిత ప్రఖ్యాప నముచేతను శిష్యకోటికి దాని చరితము వెల్లడియగుటచే బీఠప్రతిష్ఠకు అనువగు పరిస్థితులేర్పడినవని తలఁచి తగు సౌధముల నిర్మింపఁజేయుటకు గుంటూరువచ్చి తొలుత 10-5-32 తేదినాడు విద్యాశంకర తీర్థరాజ ప్రతిష్ఠగావించి 12-5-32 తేదీకి సరియగు అంగీరస వత్సర వైశాఖ శుద్ధ సప్తమీ గురువాసరంబున ఉదయము 9-3 గంటలకు మిధునలగ్నమున లోకకల్యాణ ప్రదాయినియగు శ్రీ మహా కామేశ్వర్యంబా రాజరాజేశ్వరీ ప్రతాపభారతీ పరాభట్టారికను వైదికాగమోక్త విధానంబున మహావైభవముతోఁ బ్రతిష్ఠ గావించిరి.

అంత గుంటూరు పురములోని శ్రోత్రియపుంగవులగు కొందఱు న్యాయవాదులేతెంచి ప్రస్థానత్రయమును దమ సన్నిధిని బఠించి తరింపవలయునని వేఁడఁగా దాము సర్వ విధముల దాని కంగీకరించి 5-7-32 తేదీకి సరియగు అంగీరస వత్సరాషాఢ శుద్ధ ద్వితీయా జయవాసరమున నుదయము 6-30 గంటల వేళయందు సుమారు నలువది యేఁబదిమంది వివేకులగు శిష్యబృందమునకుఁ బ్రస్థాన త్రయమును దైత్తిరీయభాష్యముతోఁ బ్రారంభించి క్రమ ముగా ఐతరేయ ముండకములను 28-9-32 నాఁటికి శాన్తిచేసిరి.

ఇంతలోఁ దాము సంకల్పించిన భవననిర్మాణము సంపూర్ణమగుచు వెంటనే యద్దానికి శ్రీ సదనమను నాఖ్య గావించి 30-9-32 తేదీకి సరియగు భాద్రపద బహుళామావాస్యా భృగువాసరముననందు బ్రవేశము గావించిరి.

అనంతరము మఱల శ్రీసపసమునఁగల విశాలమగు నంతర్భాగమున మామూలు శిష్యవర్గమునకు ఛాందోగ్యోప నిషత్ప్రవచనమును 2-10-32 తేదియందుఁజేయ మొద లిడి క్రమముగా అద్దానిని గూడ ముగించిరి.

పైని చెప్పఁబడిన యుపనిషద్భాష్యంబుల శాన్తిగావిం చిన యనంతరము 24-2-32 తేదియందు శాంకరశారీరక మీమాంసా భాష్యరాజంబును యథావిధి నారంభించిరి.

ఇట్లు 5-7-32 తేదియందు ఏముహూర్తంబున నెంత శిష్యబృందముతోఁ బ్రస్థానత్రయ ప్రవచనమును శ్రీవారు ప్రారంభించిరో ప్రతిదినమును ఆవేళకే అంతటి శిష్య బృందముతోడనే అవిచ్ఛిన్నంబుగ మహావైభవంబుతోఁ బ్రవచనంబును గావించుచు 29-9-34 తేది నాఁటికిఁ బ్రస్థానత్రయశాన్తి సమగ్రముగ నొనర్చిరి. అంత తమ సన్నిధానమున ఆద్యన్తము సక్రమముగ అధ్యయనమును జేసిన ఛాత్రతతి విజ్ఞానమునకు మెచ్చి యొక్క సభను గావించి అందువారలకు 'వేదాన్తపారీణ' యను నొక బిరుద మును అనుగ్రహించిరి.

గుంటూర నిట్లు శ్రీవారిచే అనితరసాధారణముగా సర్వ విధముల ధర్మబోధ చేయఁబడుటవలన అచట సనాతన ధర్మాసక్తులు చాలమంది వెలసిరి. కావున ఆంధ్రదేశము లోని సనాతనులంచఱు 'అఖిలాంధ్ర దేశీయ సనాతనసభ'ను గుంటూరునందే జరుప నిశ్చయించి అద్దానికి శ్రీవారినే ప్రారంభకులుగానుండ వేఁడఁగా శ్రీవారద్దానిని జయప్రద ముగ నెరవేర్చిరి.

ఇట్లు మన భాగధేయములకొలఁది మన భారతీంద్రులు మనలకు సాహాయ్యమున మిత్రులై వాత్సల్యమున జనకులై ధర్మశాసనములఁ బ్రభువులై బోధనంబుల నొజ్జలై ఉప దేశంబుల నాచార్యులై అధర్మవర్తనంబుల విరోధులై క్రీడాదుల గ్రీడియై సార్వాత్మ్య భావము నొంది గ్రహీతృ భేదమునఁ దమరూపనానాత్వమును బ్రకటించుచుఁ బాత్రభేదమునఁ దమ యుపదేశామృతమును గ్రోలఁ జేయుచు భారతదేశమునందలి చాతుర్వర్ణ్యంబును దమ ధర్మరూపంబగు క్రీగంటి చూపుతో నేలుచుండ శిష్యవర్గం బున కింక అశుభంబునకుఁ దావెక్కడిది? ఈ కారణ జన్ములగు శ్రీ భారతీమూర్తుల యుపదేశ గీతంబుల శ్రోత్ర పేయంబులుగ వినుచు వారి దివ్యరూపమును గాంచుచు వారి పాదసేవనము సేయుచుఁ దరించు భాగ్యము మన కోటి భారతీయ శిష్యకోటికి అనవరతము అచిత్స్వరూపిణి యగు ప్రతాపభారతీ పరా భట్టారిక అనుగ్రహించు గావుత!

ధర్మసంస్థాపనముకొఱకై అవతరించిన శ్రీ భారతీం ద్రులు తమ వాఙ్ముఖములచే లోకమునకు ధర్మబోధ సేయుచు అద్దానిని స్థిరీకరింపఁదలఁచిరి. కావున భారత దేశమున సామాన్య వ్యవహారమును సర్వత్రగనుచున్న సంస్కృతాంధ్రాంగ్లములయందు గ్రంథములు వ్రాసి ప్రక టించియున్నారు. వీనియందు అనేకగ్రంథములు అపూర్వ ములగు విషయములతో నొప్పుచుఁ బ్రకృతకాలమున వైదిక మార్గానువర్తులకును దదభిమానులకును ధర్మవిచారమునఁ గల్గు సందేహములనన్నిటిని సశాస్త్రీయముగను సయుక్తిక ముగను బాపఁజాలినవై భారతదేశమునందలి యాచార ప్రాశస్త్యమును మతప్రాశస్త్యమును ఖండాంతరవాసులకు సైతము బోధింపఁజాలినవగుచున్నవి. శ్రీవారు మ్లేచ్ఛభాష యగు నాంగ్లమునందుఁ గొన్ని గ్రంథములను వ్రాయుట కియ్యదిగూడ నొకకారణమై యొప్పుచున్నది. అట్టి యసర్వ ములగు గ్రంథరత్నములలో ముఖ్యములను నిటఁబ్రద ర్శించుచున్నాను.

## సంస్కృతగ్రంథములు

౧. పూర్వమీమాంసాదర్శనమ్ (సవృత్తికమ్).
౨. బ్రహ్మసూత్ర సంజీవినీ.
3. శారీరకమీమాంసా సంగ్రహః.
౪. కల్యాణసంహితా.
౫. కల్యాణస్మృతిః.
౬. కల్యాణగీతా; రహస్యగీతా.
౭. అక్షరదర్శనమ్.
౮. ప్రాయశ్చిత్త పశునిర్ణయః.
౯. ప్రమాణనిర్ణయః.
౧౦. కల్పరత్నం (క) దర్శపూర్ణమాసౌ, (గ) అగ్ని హోత్రప్రశ్నః.
౧౧. ఆపస్తంబీయ గృహ్యరత్నమ్.
౧౨. మధ్వమత విధ్వంసినీ (దశదూషణీ)
౧3. అహంకారధ్వంసినీ.
౧౪. మధ్వమతోన్మూలినీ.
౧౫. సంధ్యాకలా.
౧౬. తన్త్రజ్యోత్స్నా.
౧౭. కల్యాణీ (లలితాసహస్రనామ వ్యాఖ్యా)
౧౮. కల్యాణశ్రీకలా (లలితా రహస్యనామవ్యాఖ్యా)
౧౯. శ్రీకలాదర్శనమ్.
౨౦. శ్రీవిద్యాదర్శనమ్.
౨౧. శ్రీమాతృకాదర్శనమ్.
౨౨. శ్రీచక్రదర్శనమ్.
౨3. శ్రీయాగసూత్రమ్.
౨౪. కల్యాణ శ్రీచక్రపరిలేఖనమ్.
౨౫. మహారుద్రయాగత్రయమ్.
౨౬. శ్రీనిత్యకల్యాణమ్.
౨౭. శ్రీమాత్రర్చనమ్.

౨౮. సర్వదేవప్రతిష్ఠావిధిః.
౨౯. కామేశ్వరార్చనావిధిః.
౩౦. సంతానగోపాలోపాసనావిదిః.
౩౧. పార్థివలింగ పూజావిధిః.
౩౨. శ్రీరామతారకోపాసనావిదిః.
౩౩. లఘు సూర్యనమస్కారవిధిః.
౩౪. సూర్యోపాసనావిధిః.
౩౫. చండీసప్తశతీ పారాయణవిధిః.
౩౬. రశ్మిమాలావిధిః.
౩౭. సంన్యాసదీక్షావిధిః.
౩౮. భారతీసంప్రదాయోపాసనావిధిః.
౩౯. గణపత్యుపాసనావిధిః.
౪౦. వనదుర్గోపాసనావిధిః.
౪౧. విష్ణూపాసనావిధిః.
౪౨. శూలినీ దుర్గోపాసనావిధిః.
౪౩. క్రియామయ దీక్షావిధిః.
౪౪. శ్రీయాగానుక్రమణికా (పూర్ణా, లఘుశ్చ)
౪౫. వాజసనేయ స్మార్త నిత్యకర్మానుష్ఠానవిధిః.
౪౬. తైత్తిరీయ సంధ్యాసూత్రమ్.
౪౭. కాణ్వసంధ్యాసూత్రమ్.
౪౮. ఉగ్రరథశాన్తిః.
౪౯. అపస్తంబీయ దర్శపూర్ణమాస వ్యాఖ్యాన టీకా సంజీవని.
౫౦. శ్రీగుణనికా దీధితిః.

### ఆంధ్ర గ్రంథములు

౧. గీతామృత తరంగిణి.
౨. కల్యాణసుధ.
౩. వేదాన్త మీమాంసాశాస్త్ర హృదయము.
౪. భగవద్గీతాతత్త్వ నిర్ణయము.
౫. గీతాహృదయము.
౬. ఆత్మతత్త్వము.
౭. శ్రుతిధర్మ సంగ్రహము.
౮. వైదికధర్మ చరిత్రము.
౯. భారతవర్షీయ ధర్మసంగ్రహ చరితము.
౧౦. అపస్తంబీయ గృహ్యసూత్రమీమాంస.
౧౧. భారతీ సాంప్రదాయము.
౧౨. సంన్యాస సాంప్రదాయములు.
౧౩. మధ్వమత భంజినీ శూలికా.
౧౪. మాలవీయ దుర్వాద నిర్వాపణము.
౧౫. వర్ణవ్యవస్థ.
౧౬. అపరోక్షానుభూతి టీకా తాత్పర్యములు.
౧౭. ఆత్మబోధ.
౧౮. అనుభూతి ప్రకాశిక.
౧౯. అంతర్యామి బ్రాహ్మణము.
౨౦. శ్రీకృష్ణకథా గాంభీర్యము.
౨౧. శ్రీవిద్య.
౨౨. కామకల.
౨౩. మాతృభాష.
౨౪. వర్ణాశ్రమ ధర్మము (మహోపదేశము)
౨౫. ఛాందోగ్యోపనిషత్తాత్పర్యము.
౨౬. కేనోపనిషత్తాత్పర్యము.
౨౭. వివాహధర్మము.
౨౮. వైదికధర్మము.
౨౯. సప్తర్షిమండలము - పూర్వఫల్గుని.
౩౦. ప్రాయశ్చిత్త పశునిర్ణయము.
౩౧. సూర్యసిద్ధాన్తమే సుదర్శనము.
౩౨. శ్రీవిద్యోదన్తము.

### ENGLISH

1. Theosophy Unveiled.
2. At the feet of the Mahatma.
3. Theosophy and Truth.
4. Mndern Ignorance.
5. Logical sequence of Euclid's Elements.
6. Purnamimamsa with Commentary.
7. Epochs of Bharata Varsha.
8. Gitamritabindu.
9. Manavarahasyam.
10. Human Variety.
11. Untouchability.
12. The Values of II (Pi).
13. Kamakala and Magic squares.
14. The development of Races and Nations. (Mathematical Representation)
15. Varnasrama Dharma.
16. Vaidika Dharma.
17. Manusmruti sarah.
18. Constitution of Aryavarta.
19. Constitutionalism of Bharata Varsha.
20. Sovereign Democratic Republic of Bharata varsha.
21. The Citizen of India.

# ఆగమశాస్త్రములు - దేవాలయములు - వాని ప్రయోజనము

"జ్యోతిషవిద్వాన్" "ఆగమవిశారద"
తంగిరాల సుబ్రహ్మణ్య శాస్త్రి

### ఆగమశాస్త్రములు

భారతీయ విజ్ఞానభాండాగారమున దేవాలయములు ప్రముఖస్థానము వహించినవనుట సర్వవేదశాస్త్ర పురాణేతిహాస సమ్మతము. సృష్టికర్త యగు పరమేశ్వరుడు తన ముఖోద్భూతములగు వేదములద్వారా యీ విశ్వమును సృజించి సర్వమానవులకు భోగ మోక్ష సాధనభూతమగు ఆగమశాస్త్రమును తదుక్తజప పూజా హోమాదులద్వారా ఐహికాముష్మికఫలరూపమైన సగుణభక్తిని ప్రసాదించెను.

ప్రపంచమునందు పూర్వార్జితకర్మ పాశబద్ధ జీవులు ఉత్పత్తిమరణప్రవాహరూపసంసారసముద్రమును తరించుటకు మార్గవిహీనులై బాధ నొందుట జూచి పరశివుడు ద్వివిధభక్తిలక్షణమగు ఆగమశాస్త్రమును జగదంబ యగు శాంకరిద్వారా లోకమునకు ఉపదేశించెను—

ఆగతం శివవక్త్రాబ్జా ద్గతం తు గిరిజాశ్రుతౌ।
మతం పశుపతిశ్చైవ తదాగమ మిహోచ్యతే॥

ఇట్లు ఆగమశాస్త్రములు నిర్గుణ, సగుణభక్తిలక్షణమై శివ, విష్ణు, శక్త్యాది భేదములతో వేదసారమై అసంఖ్యాకములై వెలయుచున్నవి.

కామికే॥ ద్వివిధం భక్తిరూపం స్యాత్ సగుణం నిర్గుణం తథా।
సర్వభూతాంతరస్థం చ స్వయం జ్యోతిస్స్వరూపకం॥
చిద్రూపం నిర్మలం శాన్తం పరబ్రహ్మేతి చోచ్యతే।
ఇతి నిశ్చిత్య మనసా పూజయే చ్ఛివ మవ్యయం॥
సాధకో భక్తిభావేన స భక్తి ర్నిర్గుణః స్మృతః।
శిలామృద్దారుచిత్రేషు దేవ మావాహ్య పూజయేత్।
సా పూజా సగుణా ప్రోక్తా సర్వకామఫలప్రదా॥

ఇట్లు ఆగమశాస్త్రములు భోగ, మోక్ష సాధనమైన ద్వివిధ భక్తిలక్షణములై వెలయుచున్నవి.

"ఆగమోక్తేన విధినా కలౌ దేవాన్ యజే త్సుధీః।
కలా వాగమ ముల్లంఘ్య యోన్యమార్గే ప్రవర్తతే॥
న తస్య గతి రస్తీతి సత్యం సత్యం న సంశయః॥"

అను మహానిర్వాణతంత్రవచనమువల్ల కలియుగమందు దేవార్చనాదులు ఆగమోక్తరీత్యా జరుపుటయే ప్రశస్తమనీ అన్యమార్గములు ఆచరణీయములు గావనియు తెలియుచున్నది.

ఆగమశాస్త్రములు విష్ణు, శక్త్యాదిభేదముల గాక శైవాగమములు కామికాదిభేదములతో అసంఖ్యాకమై క్రియా, యోగ, తత్వ, చర్యా భేదములతో చతుర్విధములై కర్షణాది ప్రతిష్ఠాంతవిధి ప్రతిపాదకములై శివస్వరూపములై వెలయుచున్నవి.

కామికాగమతంత్రావతార సందర్భమున యిట్లు చెప్పబడినది:

కామికం పాదకమలం యోగజం గుల్ఫ ముచ్యతే।
చిత్యం పాదాంగుళీరూపం, కారణం జంఘయో ర్యుగం॥
త్వరితం జానుయుగ్మం చ దీప్త మూరుద్వయం విభోః।
బీజం సూక్ష్మాగమం విద్యాత్, సహస్రం తుకటీతటం॥
పృష్ఠభాగోంఽశుమాంశ్చస్యాత్ నాభి స్స్యాత్సుప్రభేదకం।
విజయం జఠరం ప్రాహుః విశ్వాసంహృదయాత్మకం॥
స్వాయంభువం స్తనద్వంద్వం అనలం లోచనత్రయం।
వీరాగమం కంఠదేశో రౌరవం శ్రవణం తథా॥
మకుటం మకుటం తంత్రం బాహువో ర్విమలాగమం,
చంద్రజ్ఞాన మురశ్శంభో ర్బింబం వదనపంకజం॥
జిహ్వాప్రోద్గత మీశస్య లలితం గండయో ర్యుగం।
సిద్ధం లలాటఫలకం విశానం కుండలద్వయం॥
యజ్ఞోపవీతం శర్వోక్తం హారస్తుక్పారమేశ్వరం।
కిరణం రత్నభూషస్య వాతూలం వసనాత్మకం।
ఏవం తంత్రకళారూపం ఈశ్వరస్య విచింతయేత్॥

ఇట్లు శివరూపమై సర్వదేవతాతత్వబోధకములై కర్షణాది ప్రతిష్ఠాంత తంత్రప్రతిపాదకములై ఆలయమండపగోపురాది లక్షణవిశిష్టమై సకలమంత్రజప పూజాహోమతర్పణ దేవతాన్యాస విధివిలసితములై దేవతామూర్తి నిర్మాణ తత్తదాయుధ, వర్ణ కేతు, వాహన లక్షణసంపన్నమై దేవారాధన యోగ్య వస్తు, పాత్ర, యాగోపకరణ, విధివిహితమై నిత్యోత్సవాది సర్వోత్సవవిధి నిరూపణక్షమమై నిత్య నైమిత్తిక కామ్య పూజాలక్షణోపేతమై విధివిహితయాగఫల ప్రశంసా,

విదిరహితదోష నిరూపణ, ప్రాయశ్చిత్తరూపకర్మ ప్రతిపాదకమై జీవలక్షణ, ఈశ్వరలక్షణ వివిధభక్తి నిరూపణపూర్వక జీవేశ్వరసంయోగాద్య భేదప్రతిపాదకమై భోగ మోక్షఫల ప్రధానములై యలరారుచున్నవి.

ప్రపంచమం దుత్పన్నమైన చతుర్విధజీవులు విరాడ్రూపుడగు పరమేశ్వరునికంటె బిన్నులు గారని శృతిప్రమాణమగుటచే స్థూలబ్రహ్మాండ మంతయూ పరమేశ్వరుని రూపమే. అయిననూ కర్మవాసనాబద్ధులగు జీవులు అహంకారాదులచే తమ స్వరూపమును తెలియనేరక సుఖదుఃఖాదులతో ఈ పణత్రయాదులవల్ల బాధపడుచున్నారు. అట్టి జీవులకు భగవత్స్వరూపమును బోధించుటకై నిర్గుణబ్రహ్మకు రూపకల్పన చేసి తద్రూపధారణ పూజ్య పూజక భావములద్వారా భక్తి గలిగించి భక్తిద్వారా జ్ఞానమును ప్రసాదించి జీవేశ్వరులకు అభేదమును సూచించి మోక్షమును పొందించుటయె ఆగమశాస్త్రములలోని ముఖ్య విషయము.

శిలామృద్దారుచిత్రేషు దేవతాబుద్ధికల్పితాః।
అకల్పితం స్వయంజ్యోతి రాత్మనో దేవతా చ నః।

హిరణ్యగర్భ ఇత్యాదా వేకత్వం ప్రతిపాద్యచ॥ ఇట్లు ఆత్మ స్వప్రకాశమై స్వయంజ్యోతియై సర్వవ్యాప్తమై అఖండమై సర్వజ్ఞానసంపన్నమైనప్పటికినీ "విరాట్ హిరణ్యగర్భాది రూపాంతరములను ప్రకృతిసంయోగమువలన "తదైక్షత బహు స్యాం ప్రజాయేయ" "తత్సృష్ట్వా తదేవా నుప్రావిశత్" ఇత్యాదిశృతులవల్ల నానాత్మక ప్రపంచరూపుడై సాక్షీమాత్రుడై సర్వభూతములయందూ చిద్రూపుడై యున్న భగవంతుని మంత్రసంస్కార విశేషముచే చిత్రములయందు (శిలా, మృద్దారు, లోహ, రత్న, క్షణికాదులయందు) మంత్రశక్తి పాతముచేతనున్నూ కళావిశేషన్యాసములచేతనున్నూ భావనచేసి తత్తద్దేవతామూర్తులకు వర్ణ, రూప, నామాదులచే మంత్ర, యంత్ర తంత్ర విధులతో అర్చించి భగవదనుగ్రహమును పొందుటయె ఆగమశాస్త్ర ప్రయోజనము.

## 2. దే వా ల య ము లు

దేవానామాలయం యస్మా త్తస్మా ద్దేవాలయం విదుః॥ దేవతలకు నివాసయోగ్యములు గనుక దేవాలయములు అని పిలువబడుచున్నవి. దేవాలయములు సాత్వికాదిభేదములతో దేశభేదమై తంత్రభేధములతో అలరారుచున్నవి. నాగరము, ద్రావిడము, వేసరము, అను మూడు విధములుగా, సాత్విక, రాజస, తామసాది భేదములతో ఆర్యావర్త, మధ్యబారత, దక్షిణభారతములలో పిలువబడుచున్నవి. దేవాలయములు హర్మ్య, మండపాది భేదములుగా అంగ, ఉపాంగములై, అంతరాలయ, శుకనాసిక, అగ్రమండప, ముఖమండప, సభామండప, ఆస్థానమండప, నృత్యమండప, అర్ధమండప, భద్రమండప స్నానమండప, స్నపనమండప, యాగమండప, అలంకరణమండప, హవిఃపాకమండప, ద్రవ్యమండప, ధనమండప, ధాన్యమండప, వస్త్రమండప, వాహనమండప, నంది మండప, ధ్వజమండప, కళ్యాణమండప, మలయమండప, నక్షత్రమండప, శయనమండప, పుష్పమండప, అధ్యయన మండప, చతుర్ద్వారమండప, కపిలమండప, వీణామండప, దీపమండప, వివిధవాద్యమండపాది ముప్పదిరెండు మండపములతో ముప్పదిమూడవదియై అంగియై యొప్పు హర్మ్యము ఆగమశాస్త్రములలో చెప్పబడియున్నవి. ఇట్లు శిల్పశాస్త్రోక్తలక్షణములై భగవద్గుణచిత్రవిలసితములై పరమేశ్వరుని నిత్య, నైమిత్తిక, కామ్య, పూజా, నిత్యోత్సవ, బ్రహ్మోత్సవాది సకలకైంకర్యములకుగాను దేవాలయములు ప్రకాశింపుచున్నవి.

భగవంతుడు స్థూలసూక్ష్మ కారణములను త్రివిధరూపములతో (అనగా పంచభూతాదులతో గూడిన బ్రహ్మాండము స్థూలరూపముగాను, మనోమయాది సూక్ష్మరూపముగాను, చిద్రూపము కారణరూపముగాను) ప్రకాశించుటను సూచించుటకుగాను దేవాలయమున్నూ ఆగమశాస్త్రములయందు మూడు విధములుగా విభాగింపబడినది.

స్థూలరూపం విమానం తు సూక్ష్మరూపం సదాశివః
కారణం మంత్రరూపం తు త్రివిధం ఆలయస్య తు॥

ఇట్లు భగవంతునకు యెట్లు బ్రహ్మాండము స్థూలరూపమో అట్లె దేవునకు విమానము స్థూలరూపముగాను భగవంతునకు మనోమయాదులు యెట్లు సూక్ష్మరూపమో అట్లె దేవునకు మూర్తి సూక్ష్మరూపము. భగవంతునకు చిద్రూపము యెట్లు కారణమో అట్లె దేవునకు ఆచార్యప్రయుక్తమంత్రశక్తి కారణరూపముగాను చెప్పబడుచున్నది. గాన సాధకునకు యీ త్రివిధరూపములకు అవినాభావమును శాస్త్రము బోధింపుచున్నది. అట్లె వ్యష్టిలో దేహము స్థూలరూపమనిన్నీ మనోబుధ్యాదులు సూక్ష్మరూపమని జీవుడు కారణరూపమనిన్నీ సాధకునకు తెలియుటకై ఆగమశాస్త్రములు నవవిధములగు అవినాభావమును (దేహమునకు - దేవాలయమునకు - బ్రహ్మాండమునకు) స్థూలసూక్ష్మకారణములద్వారా తెలియజేయుచున్నవి - ఏట్లనగా! బ్రహ్మాండము స్థూలస్థూలముగాను. దేవాలయము స్థూలసూక్ష్మముగానున్నూ, దేహము స్థూలకారణముగానున్నూ, మనోమయాదులు సూక్ష్మస్థూలముగానున్నూ సదాశివాదిమూర్తులు సూక్ష్మసూక్ష్మముగానున్నూ మంత్రములు సూక్ష్మకారణముగానున్నూ చిద్రూపము కారణకారణముగాను మంత్రశ

కారణస్థూలముగాను. జీవుడు కారణసూక్ష్మముగాను అవినా భావము తెలియుచున్నది—

దేహదేవాలయములకు అబేదమును ఆగమశాస్త్రములు యీక్రిందివిధముగా తెలియపరచియున్నవి—

పాదౌ పాదశిలా స్తస్య జంఘా పాదోర్ధ్వ ముచ్యతె
గర్భ శ్చైవోదరం జ్ఞేయం కటిశ్చ కటిమెఖలా ॥
స్తంభాశ్చ బాహవో జ్ఞేయా జిహ్వా ఘంటా ప్రకీర్తితా.।
దీపః ప్రాణోఽస్య విజ్ఞేయో హ్యపానో జలనిర్గమః॥
బ్రహ్మస్థానం యదేతచ్చ తన్నాభిః పరికీర్తితా,।
హృత్పద్మం పిండికా జ్ఞేయా ప్రతిమా పూరుష స్మృతః।
పాదచార స్త్వహంకారో జ్యోతి స్తచ్చక్షు రుచ్యతె.।
తదూర్ధ్వం ప్రకృతి స్తస్య ప్రతిమా ఽత్మా స్మృతో బుద్దైః.।
తలకుంభా ధదో ద్వారం తస్య ప్రజననం స్మృతం.।
శుకనాసో భవె న్నాసః గవాక్షః కర్ణ ఉచ్యతె.॥
కపోతపాలీ స్కంథో ఽస్య గ్రీవా చామలసారికా.।
కలశస్తు శిరో జ్ఞేయం మజ్జా క్షీప్తరసం హి తత్॥
మెదశ్చైవ సుధాం విద్యా త్ప్రలోపో మాంస ముచ్యతె।
అస్థీని చ శిలా స్తస్య ధ్వజాః కేశాః ప్రకీర్తితాః॥
ఏవం పురుషరూపం తం ధ్యాత్వా చ మనసా సుధీః।
ప్రాసాదం పూజయె త్పశ్చా ద్గంధపుష్పాక్షతాదిభిః॥

ఇట్లు ఆగమశాస్త్రములయందు దేహదేవాలయములకు అవినాభావము చెప్పఃబడియున్నది. బ్రహ్మాండదేవతలకు దేవాలయదేవతలకు దేహదేవతలకుకూడా యిట్లె అవినా భావము చెప్పబడినది. బ్రహ్మాండదేవతలు ముప్పది ముగ్గురు (వసువులు 8. రుద్రులు. 11. ఆదిత్యులు 12. ఇంద్రుడు ప్రజాపతి-మొత్తం 33 రు.) అట్లె దేవాలయదేవ తలు గూడా 33 గురు మాత్రమే (విమానదేవత-1 మండప దేవతలు—32 మొత్తం 33 గురు) అట్లె శరీరదేవతలు గూడా ముప్పది ముగ్గురే. ఈప్రకారము బ్రహ్మాండ, దేహ, దేవాలయములయొక్క అభెదమును తెలిసి పూజించిన సాధకునకు పరమేశ్వరస్వరూపము చక్కగా తెలియుననిన్ని జ్ఞానము గలిగి ముక్తుడగుననీ దేవాలయములద్వారా ఆగ మశాస్త్రములు బోధించు చున్నవి—

'దీవ్యంత' ఇతి దేవాః అను నిరుక్తప్రకారము దేవతలు ప్రకాశము గలవారనిన్నీ దివ్యులనిన్నీ అనగా ద్యులోక మందు గలవారని స్వప్నము లేనివారని తరుణవయస్కు లని వెముకలు మాంసము మొదలగు వస్తువులు లేనివారని కాంతులు గలవారనీ వేదమంత్రములలో వివరింపబడి యున్నది—

("అస్వప్నయ స్తరణయః॥ 'అనస్థాః పూతాః॥ ఇత్యాదిశ్రుతులు) కావున దేవతలు కాంతిరూపులు గనుక స్వప్రకాశ స్వభావుడగు భగవంతునియొక్క అంశలుగాని వేరుగావు. భగవంతుని కాంతికిరణములలో కొన్ని కిరణ ములు మాత్రము ప్రజాపతిరూపమై సంవత్సరకాలరూప ముగా ప్రకాశింపుచున్నవి. అవియే 360 కిరణములు అట్టి ప్రజాపతి అగ్ని, సోమ, సూర్య, రూపములను పొంది బ్రహ్మ, విష్ణు, శివులై, సృష్టి, స్థితి, లయకారకులై కాంతులు గల్గి ప్రకాశింపుచున్నారు. ఇందులో 108 కిరణములతో అగ్నిరూపుడు బ్రహ్మ సృష్టియున్నూ 116 కిరణములతో సూర్యరూపుడు విష్ణువు స్థితియున్నూ 136 కిరణములతో సోమరూపుడు శివుడు సంహారమున్నూ భూర్భువస్సువర్లోక ములకు కర్తలై ప్రజాపతిరూప బ్రహ్మాండమును పాలింపు చున్నారు. అట్లె దేవాలయములో స్థాపించబడు లింగ రూపుడగు మూర్తి గూడా కూర్మశిలారూపమున బ్రహ్మ యున్నూ బ్రహ్మశిలారూపమున విష్ణువున్నూ పిండికా రూపమున శివుడున్నూ త్రిమూర్త్యాత్మకుడై ప్రజాపతి రూపమున లింగమై భగవంతుడు గలడని భావనాత్మక అర్చనాదులవల్ల భగవత్సన్నిధి పొందుదురని ఆగమశాస్త్ర ములు బోధించుచున్నవి—

గనుక బ్రహ్మాండము సర్వదేవతాత్మకము గనుక సర్వ దేవతలను బ్రహ్మాండరూపకుంభమందు ఆవాహనచేసి కుంభగతప్రకాశాత్మక దైవశక్తిని మంత్రశక్తిపాతము వల్ల బింబమందు ప్రతిష్ఠించిన బింబము సర్వదేవతాత్మకమై- తేజోవంతమై సాధకునకు సకలాభీష్టముల నొసగి సాయు జ్యాదులను ప్రసాదించుననని అగమశాస్త్రములలో దేవా ర్చనాపసరములను నిరూపించుచూ దేవాలయములకు అగ్రస్థానము నొసగియున్నవి—

కలాం కలాం గృహీత్వా వై వేదానాం విశ్వకర్మణా।
నిర్మితోయం సురై ర్యస్మా త్కలశ స్తెన ఉచ్యతె ॥

విశ్వకర్మయగు పరమెశ్వరుడు వేదమందలి దేవరూపము లగు కళలను గ్రహించి కలశమును తయారుచేయుటవలన కలశమే దేహము. కలశమే దేవాలయము కలశమే బ్రహ్మాం డము. కనుక కలశమందు దేవుని పూజించుట దేహ మందు గల దేవుని పూజించుటయె యగునని ఆగమ గ్రంథములయందు దేవతాభావము గోచరించుచున్నది.

లోకమునందు రాజు రాజ్యపరిపాలనాసౌకర్యము కొరకు లోహదిముద్రలయందు తన అధికారపాతము ద్వారా ప్రజలకు యెట్లు సర్వకార్యోపయోగము గావించునో అట్లె బ్రహ్మాండకర్తయగు పరమేశ్వరుడు శిలామూర్తులయందు తనచే నిర్మితమైన ఆగమశాస్త్రములలో చెప్పబడిన మంత్ర శక్తి సన్నికర్షద్వారా ఆలయములందున్నూ మూర్తులయం

దున్నూ సన్నిహితుడై భక్తులగు సాధకులకు కోరిన కోరికల నొనగుచున్నాడు. ఆస్తికులు, విద్వాంసులు ప్రామాణ్య బుద్ధి గల మానవులు శాస్త్రములలో గల శక్తిపాతరహస్య మును గుర్తించి జప, పూజా, హోమ, అర్చనాదుల ద్వారా భగవంతుని సాన్నిధ్యమును చేరుదురు. నాస్తికులు వేద నిందకులు అగు మానవులు తమ జన్మార్జిత ప్రారబ్ధముచే భగవచ్ఛాస్త్రములలోని రహస్యములు గుర్తింప నేరక భగ వదారాధనావిముఖులై ఐహికాముష్మిక సుఖములను గోల్పోయి నరకాదిలోకములయందు పతనమగుదురు—

### 3. ప్రయోజనములు

మానవునకు ముఖ్యావసరములు అనిష్టపరిహారమున్నూ ఇష్టప్రాప్తియు. అనిష్టరూపమగు దుఃఖమును పోగొట్టు కొని ఇష్టరూపమగు కామ్యములను గోరని మానవులు లోకమందుండుట యరుదు. అనేక జన్మపరంపరా ప్రాప్త మగు పాపమువలన మానవునకు దుఃఖము గల్గును. ఆదుఃఖమును పోగొట్టుకొనుటకు భగవదర్చాదులు అవస రమై యున్నవి.

పూర్వజన్మకృతం పాపం వ్యాధిరూపేణ పీడ్యతే
తచ్ఛాంతి రౌషధై ర్దానై ర్జప, హోమ, సురార్చనైః॥

అనుటచే దుఃఖనివృత్తికై దైవోపాసనము అవసరమనుట నిర్వివాదము. కావున ఆగమశాస్త్రములు మానవులకు దుఃఖ నివృత్తికి సుఖప్రాప్తికి దేవమందిర నిర్మాణపూజాదులు చెప్పబడియున్నవి. ఇట్లు శాస్త్రములు విధిముఖము ననేగాక నిషేధముఖమున గూడా చెప్పబడియున్నవి.

శివాలయవిహీనే చ గ్రామనాశం భవే ద్ధ్రువం।
తస్మా చ్ఛివస్య లింగస్య స్థాపయే ద్గ్రామవర్ధనః॥
విష్ణుం వా శంకరం వాపి గ్రామే వా పట్టణేపివా।
పంచమూర్తిప్రకారేణ ప్రతిష్ఠాప్యార్చయేద్విధిః॥

ఇట్లు చెప్పుటవలన గ్రామరక్షార్థము సర్వజనసుఖార్థము గ్రామ, యజమాన, ఆచార్య, అర్చక, పరిచారక, స్వస్తి వాచక, వాద్య, వాహక, నిర్వాహక, పరీక్షకాది, దశవిధపరి చారకాభివృద్ధినిమిత్తము దేశోపద్రవాది, దోషపరిహారార్థము అనావృష్టి, దుర్భిక్ష, రాష్ట్రభంగాది, భౌతికదోషశాన్త్యర్థము జ్వరమార్యాది రోగోపద్రవనివారణార్థము పంచమూర్తి ప్రకారముగా దేవాలయములను నిర్మించి విహిత అర్చ నాదులవల్ల సర్వసౌఖ్యములు పొందునిమిత్తము దేవాలయ ములు అవసరమై యున్నవి. ఇట్లు సర్వజనసౌఖ్యజన కములైన మందిరములు నిర్మించి భక్తులు నిత్యోత్సవాదుల ద్వారా భగవత్సేవాదులొనరించి జ్ఞానవంతులై భగవద్ధామ మును పొందుటయే ఆగమశాస్త్రముల యొక్కయు దేవాలయములయొక్కయు పరమప్రయోజనములు—

సవ ఇత్యుచ్యతే దుఃఖ ముద్ధృత స్స సవస్స్మృతః।
యస్మా త్తదుత్సవో వై ఉత్సవ స్త్రివిధ స్మృతః॥

సవమనగా దుఃఖము అందుండి ఉద్ధరింపబడు గాన ఉత్సవమని చెప్పబడుచున్నది. ఆఉత్సవములు సాత్త్విక, రాజస, తామసాది, భేదములతో త్రివిధములుగా చెప్పబడి నవి. లోకకళ్యాణము నిమిత్తము ప్రతివత్సరము భగ వత్ప్రియార్థము బ్రహ్మోత్సవములు ఆచరించిన పరమేశ్వ రునియొక్క సాయుజ్యాదిలోకములను పొందుటయే ఉత్స వముల యొక్క ప్రయోజనము—

హిందూమతసంప్రదాయములలో అగ్రస్థానమును పొందిన దేవాలయములు మతాభివృద్ధికి ధర్మప్రచారము నకు కేంద్రస్థానములు. సనాతనవిద్యాలయములు ఆల యములందుండి విద్యార్థులకు విద్యాబోధనతోబాటు ధర్మ, భక్తి, జ్ఞాన, యోగము, మొదలగు ధార్మికవిషయములను పండితప్రకాండులు బోధించుచుండెడివారు.

అనాదికాలమునుండియూ హిందూమతము భారతీయ విజ్ఞానము సత్యాహింసలనే ప్రధానలక్ష్యములతో ఆధ్యాత్మిక జ్ఞాన సంపత్తికాలంబమై అలరారుచున్నది. వేదచోదిత కర్మలు (యజ్ఞానుష్ఠానములు) ఉపనిషత్తులలోని జ్ఞానము యీమతమునకు ముఖ్యవిషయములు; వీనిద్వారా ఆధ్యా త్మికశక్తిని బొంది జ్ఞానముచే ముక్తిగాంచుటయే హిందూ మతపరమలక్ష్యము—

భారతీయశబ్దములోనే యీవిషయము గోచరమగు చున్నది. శృతులలో "అగ్నిమిచ్ఛధ్వం భారతాః, "భాయాం రతాః భారతాః" అను వ్యుత్పత్తితో "భా దీప్తౌ" అను ధాతువువల్ల భారతీయులు జ్ఞానరతులు ఆధ్యాత్మనిర తులు అనియున్నూ " ఓ భారతీయుడా ! స్వాధిష్ఠానాగ్నిని ప్రజ్వలింపజేయుము ; తద్వారా బ్రహ్మమునుజేరు " మని తెలుపుచున్నది—

కనుక మానవుని చరమలక్ష్యమగు ముక్తిని బొందుటకు ఆధ్యాత్మికజ్ఞానము అవసరము గాన సగుణరూపములగు బ్రహ్మాండ దేహ దేవాలయములకు ఏకత్వము సాధించి ఆధ్యాత్మికజ్ఞానమును బొంది ముక్తిగాంచుటకై ఆగమ శాస్త్రములలో మందిరనిర్మాణములున్నూ అర్చనాదు లున్నూ బోధింపబడియున్నది, ఈశాస్త్రరహస్యములను గుర్తించి ప్రవర్తించిన మానవులు ఐహిక, ఆముష్మిక, భోగములను మోక్షమును పొందుటయే యీశాస్త్రములకు ప్రయోజనము.

ఆంధ్రప్రభుత్వము, విశేషతః, మంత్రివర్యులు శ్రీ చంద్రమౌళిగారు ఆంధ్రదేశమునందలి దేవాలయముల నుద్ధరించి ప్రయోజనములచే సఫలములు గావించెదరని యాశించెదను. " ఇతి శివమ్ "

# హేమచూడోపాఖ్యానము

(పూర్వసంచిక తరువాయి)

" కృష్ణభిక్షు "

తెలిసినవ్యక్తి భార్య, తెలియనివాడు భర్త—భార్య మాటలకు చాల ఆశ్చర్యపడి నవ్వుచు హేమచూడుడు భార్య నడుగుచున్నాడు. "ప్రియా! నీమాట నాకు గగనకుసుమప్రాయముగా నిరాధారముగా తోచుచున్నది. నాకు తెలిసినంతవరకు నిన్ను గన్నది ఒక అప్సరస, పెంచినది ఒక ఋషి. యౌవన మిప్పుడిప్పుడే నిన్ను స్పృశించుచున్నది. తారుణ్యశ్రీ నిండను లేదు. మఱి చెప్పినది వెలయేండ్ల మాటలు. దయ్యము పట్టినవారి పల్కువలె నున్నది ఈ యసంగతపుమాటలచేత నా కెట్లు నిజము తెలియగలదు? చెప్పుము. ఆ నీసఖి యెవ్వరు? అది యెం దున్నది? మీరు బద్ధుని జేసిన దానికొడు కెవ్వరు? వా డెందున్నాడు? వాడేలిన యాపురము లెందున్నవి? ఇదెల్ల చెప్పుము—ఉండుగాక! ఈ కథచేత నా కేమి? నీ సఖినిగాని నీవు చెప్ప ఆ తల్లినిగాని నేను చూడలేదు. మాతల్లిని నన్ను చూడ మంటివి. నిత్యము మాతల్లిని అంతఃపురమున చూచుచునే యుంటినిగదా! ఆమెతప్ప వేరుభార్య మా తండ్రికి లేదు. గొడ్రాలిబిడ్డను ఎట్లు చూచుట? ఒక నటుడు విదూషకవేషము వేసి అనుచున్నాడు. "ప్రతిబింబమను రథమును వంధ్యాపుత్రుడు యెక్కినాడు. శుక్తిరజతనిర్మితమైన నగలను ధరించు నరునిశృంగముతో నిర్మించిన ఆయుధములను ధరించి, గగనకాననమున యుద్ధము చేసి, భవిష్యద్రాజును చంపి, గంధర్వనగరమును గెలిచి, మరుమరీచికానదిలో స్నానమాడి, స్వప్నకాంతలతో క్రీడించుచున్నాడు." నీపలుకును అన్నివిధముల నిట్లే యున్నది" ఆ చతుర ప్రియునితో నను చున్నది. "నేను నీతో నపార్థకవచనమును చెప్పుదునా? అందులోను నావంటివారివచనములు అసత్యములు, నిరాలంబములు అగునా? తపస్సును నాశనమునుచేయు నసత్యవాక్కు ఏకారణమున తపస్విజనమునందు కలుగును? జిజ్ఞాసువునకు వేత్త సత్యమును చెప్పక అసత్యమును చెప్పెనేని వానికి ఊర్ధ్వలోకము లేదు; అధోలోకమును లేదు. సుఖసాధనమును వేరు లేదుగదా!

రాజకుమారా! నేను చెప్పుదానిని సావధానముగ వినుము. జను లెన్ని యన్నను పుట్టుగ్రుడ్డికి దృష్టి రాదు. మూఢబుద్ధి హితునివాక్యములనుగూడ అసత్యములనియే తలంచును. జిజ్ఞాసువైన నీకు నేను అబద్ధమును చెప్పుదునా? పోనీ, నే నన్నది అసత్యమే యగుగాక! అది అసత్యమని విమర్శించి నిశ్చయించుకొనుము. నేర్పరి జనుడు ఏకాంశమును పరీక్షించి దానిచే సర్వమును సరియని గ్రహించును. నిదర్శనమును చూడుము. మునుపు నీకు విషయము లన్నియు సుఖసాధనములుగా నుండినవి. ఎంతో కాలమైన తరువాత నామాటలచే విషయములు సుఖసాధనములు కాకపోయినవి. ఎందువలన? ఇతరుల కింకను సుఖసాధనములుగానే యున్నవిగదా! ఈ యొక్క నిదర్శనము నీకు చాలదా?

నేను నుడువుదానిని సరళనిర్మలబుద్ధితో వినుము. అప్తులవాక్యములను నమ్మకపోవుటయే లోకమున పెద్ద శత్రు వగును. నమ్మినవానిని అశ్రద్ధయే సన్నతమై వత్సలయగు తల్లి బిడ్డలనువలె అన్నివిధముల పెనుభయము నుండి రక్షించును. సందేహము లేదు. అప్తులను నమ్మని మూఢుని సంపద, సుఖము, యశస్సు, సర్వము త్యజించును. శ్రద్ధారహితుఁ డప్పింటను హీనుఁడే యగును. శ్రద్ధయే జగద్ధాత్రి. అదియే జీవనము. తల్లిని నమ్మని బాలు డెట్లు జీవించును? పెండ్లమును నమ్మని తరుణు డెట్లు సుఖపడును? బిడ్డలను నమ్మని ముసలివానికి యేమి సుఖము? నమ్మని కర్షకు డేల దున్నును? నమ్మకములేని చోట ఇచ్చుట పుచ్చుకొనుట అను వ్యవహారమే జరుగదు. శ్రద్ధలేని యోగము కలిగిన జగత్స్థితియే నాశ మగును. 'ఒకదానిఫలము ఒక్కటియే' అగుటచేతనే లోకప్రవృత్తి, అని అందువా, 'ఒకదానిఫలము ఒకటి' అను సూత్రమును మాత్రము దృఢముగా నేల నమ్మవలయును? కావున ఏదో యొకస్థితియందు నమ్మకమే శరణము; గావున కారణకార్యవాదియు విశ్వాసవాదియే. ఆ విశ్వాసమే లేనిచో లోకము ఊపిరియాడక తప్పక నశించును. గనుక దృఢమైన విశ్వాసముతో ఎక్కువగా సుఖపడుము. "అట్లు కాదు, తనకన్న హీనులను నమ్మరాదు" అని తలంతువేని వినుము. ఇట్టి సిద్ధాంతమును ఒకవిధమైన నమ్మకమేగదా! అవిశ్వాసమునుకూడ విడిచెదవేని ఇఁక నీ కెట్లు ప్రవృత్తి సాధ్యము?"

మిక్కిలినేర్పుతో వాదించుచున్న ప్రియవచనములను విని హేమచూడుఁడు మరల అనుచున్నాడు. "ప్రియా! నమ్మనే వలసినపుడు శ్రేయోఽర్థి శ్రేయస్సు కల్గునట్లు సజ్జనులనే నమ్మదగును, అసజ్జనులను నమ్మరాదు. అన్యథా యొనరించిన లోపల పదను కలిగి కుటిలమైన గాల ముండఁగా, బయటికి కనవచ్చు నెరను చూచి మోన

పోయిన మీనములకువలె నాశనము వచ్చును. కావున ఎక్కడనేని సజ్జనులనే నమ్మవలసినది. దుష్టులను నమ్మిన వారు ఊరున నున్నను నశింతురు. సజ్జనులను నమ్మిన వారు అడవి నున్నను బాగుపడుదురు. నాకు నీవే నిదర్శనము. కనుక ఆనమ్మకటయు ప్రసిద్ధినిబట్టియే. వేఱువిధిని కాదు. ఇక ఈప్రశ్న 'ప్రవృత్తి యెట్లు సాధ్యము' అనుట ఎట్లు పొసగును?"

దానికి హేమలేఖ బదులు చెప్పుచున్నది. "రాజకుమారా! ఇప్పుడు నీ వంటివే 'ప్రశ్నయెట్లు పొసగును' అని; ఆ విషయముననే చెప్పెదను. వీడు సజ్జనుడు, వీడు కాడు అను నిర్ణయమెట్లు? 'ప్రమాణమువలన లక్షణము తెలియును' అని యందువేని అక్కడను వినుము. ప్రమాణమునందు నమ్మకము లేకపోయిన? ప్రమాణము ఎక్కడనో ఒకచోట బొరబడుచున్నదికదా, కనుక నమ్మకము లేకుండుటకు కారణ మేమో చూడుము. ఎట్లును ప్రమాణమును బట్టియే లోకము వర్తించుచున్నది. ఆ ప్రకారమే నేనును చెప్పుచున్నాను. ఎంతకును తర్కించుచునే యుండువాడు, అసలే తర్కింపనివాడును, ఏ విధమునను ఈ లోకముననుగాని పరలోకమునగాని శ్రేయస్సును పొందడు. తర్కరహితునకైనను దీర్ఘకాలమునకైన ఒకప్పుడైన శ్రేయస్సు లభించునేమోకాని తెగని తర్కము వానికి ఎటులును శ్రేయస్సు లేనేలేదు.

మునుపు గోదావరీతీరమున సహ్యగిరియందు కౌశికుడను సద్బుద్ధి సర్వలోకమును తెలిసిన శాంతుడు నివసించుచుండెను. నూర్లకొలది శిష్యు లాయన నాశ్రయించి యుండిరి; ఒకప్పుడు గురు వెందో పోయియుండినాడు. శిష్యులు లోకస్థితినే నిర్ణయింప బూనినారు. తమ తమ బుద్ధుల కనుగుణముగా ఒకరితో ఒకరు వాగ్వాదము చేసికొనుచుండిరి. అపుడక్కడికి వివాదనిపుణుడు, తర్కైకనిష్ఠుడు, విశ్వాస రహితుడు, మహాబుధుడు, ప్రజ్ఞాశాలి శుంగు డను బ్రాహ్మణుడొకడు విచ్చేసెను. అందరును ప్రమాణము నాశ్రయించి సత్యము నెరుగవలయు నను చుండగా తన బుద్ధికౌశలమున అత డావాదమును ఖండించెను. అయన ఆక్షేపణ విని, 'ఓ బ్రాహ్మణులారా! మీ మార్గమున సత్యము సిద్ధింపదు. ఏమన, 'ప్రమాణముచేత గ్రహింపబడినది సత్యము' అనియంటిరి. ఆ ప్రమాణము దోషయుతమైనచో యథాగ్రహణము సాధ్యము కాదుగదా! కనుక ఆ ప్రమాణము నిర్దోషమని మొదటనే నిశ్చయించుకోవలసియున్నది. ఆ నిశ్చయ మెట్లు కలుగును? మీ మతమున ప్రమాణాంతరముచేత; ఆ ప్రమాణాంతరము సాధువని నిర్ణయ మెట్లు? ఇంకొక ప్రమాణముచేత; దాని ప్రామాణ్యమును ఇట్లే చింత్యముగానే యున్నది; కనుక ప్రమాణము లన్నిటికిని అనవస్థాదోషము గలదు. కనుక 'ప్రమాణముచేత సత్యగ్రహణము సాధ్యము కాదు' అని నిర్ణయము. కనుక సిద్ధాంత మేమి? 'ప్రమాణము లేదు. దానివల్ల సత్తాజ్ఞానము (ప్రమితము) లేదు. ప్రమాతయు లేడు.' కనుక స్థితినిగురించి ఏమి తెలియు చున్నది? స్థితి యనునది ఆశ్రయము లేని వివిధ వికల్పాత్మకము. అనఁగా స్వయము శూన్యత. మరి ఆ శూన్యతకు ప్రమాణము? ప్రమాణము సిద్ధించదు. కనుక శూన్యతయు సిద్ధించదు. 'కనుక ఏదియైనను శూన్యమే; ఏదియైనను శూన్యము కాదు; అనునది నిర్ణయము' ఈ శుంగవచనములను విని ఆ నిశ్చయాభాసమును విని కొందరు ద్విజాధములు శూన్యవాదులైరి. తన్నిష్ఠచేత శూన్యమునే పొందిరి. ఆ శిష్యులలో సారహృదయులైన వారు శుంగవాదమును కౌశికునివలన శోధించుకొని హృదయసమాధానమును బడసిరి. గనుక పిండితార్థము:- "అంతులేని తర్కమును సర్వాత్మనా విడువవలెను. ఎప్పుడును సదాగమముల నున్న సత్తర్కములను స్వీకరించవలెను. అట్టివాఁడు శ్రేయస్సును పొందును."

హేమచూడునికి చాల ఆశ్చర్యమైనది. ఆ ధీరాశయతో అనెను. "ఇంతటి విదుషివి" అని మున్నెరుగను. నీవు ధన్యవు. నిన్నుఁ బడసి నేనును ధన్యుఁడను. మఱి 'నమ్మకముచేత జ్ఞానసిద్ధి, సర్వశ్రేయము' అనుచున్నావు గదా! దేనిని నమ్మవలెనో, దేనిని నమ్మకూడదో! ఆగమములు అనంతములు; విరుద్ధార్థములు; భిన్నమతముల వారు ఆచార్యులు, వ్యాఖ్యాతలును; గనుక మతములందు ఎన్నో భేదములు కలవు. తన బుద్ధియా, ఒకచోటను స్థిరపడునది కాదు. తన కభిమత మేమో అదియే మంచిదని తోచును. ఇతరము హానిప్రదమనియు తోచును. కనుక దేనిని కొనతగును, దేనిని కొనరాదు, అని వ్యవస్థ యెట్లు? ఈ వాదమున కంతము లేదు. ఇది అంతయు లేని అనర్థము. ఎవడోగాని దీని నవలంబింపడు. తత్త్వమును శూన్యమని అన్నవాడును ఆశూన్యమన్న యితరుని దూషించుచున్నాడు. కాని దాని నేల నమ్మరాదు. దానికిని ఒక ఆగమమున్నదిగదా! కనుక నాకు వివరించి చెప్పుము. ఇది నీ వాలోచించని విషయముగా నుండదు."

(సశేషము)

---

# తంత్రాలోకము

(పూర్వతోఽనువృత్తము)

జమ్మలమడక మాధవరామశర్మ

ఇంతవరకు చెప్పిన విధమున ప్రతిబింబన మార్గము విశదము. శబ్దమునకును ప్రతిబింబ మున్నది. దానికి ప్రతిశ్రుత్క మని పేరు. ప్రతిసంక్రమణమున శ్రవణ మున్నది కావున "ప్రతి సదృశం శ్రవణం ప్రతిశ్రుత్" సదృశశ్రవణ ముండుటచే నది ప్రతిశ్రుత్తనుట సంగతము. శబ్ద మభివ్యక్తము కాకున్న ప్రతిబింబాత్మతను పొందదు. సముచ్చరితమై యభివ్యక్తమై ప్రతిబింబిత మగును. శ్రుతమగును. ప్రథమక్షణమున వ్యక్త మగును. రెండవక్షణమున ప్రతిబింబితమై శ్రుత మగును. శబ్ద మెప్పుడు నుచ్చరిత ప్రధ్వంసి. ఉచ్చరింపగనె నశించును. బింబముతో సమానమయినను ప్రతిబింబాత్మతావసరమున ప్రతీతము కాదు. ప్రతిబింబకాలమున గూడ బింబ ముండును. ఇది యట్లుండదు. కాన నిది రూప ప్రతిబింబ జాతీయము కాదు. అభివ్యక్తి శ్రవణములు రెండు నిందు సమకాలికములు. ఆభాసమె సర్వవస్తువ్యవస్థాపకము. అదిలేక "ఇది యున్నది. ఇది లేదు" అను నిశ్చయమె కుదురదు. బింబప్రతిబింబము లేకకాలమున నున్నను సమకాలమున ప్రతీతములు కానే కావు.

శబ్దము నిర్మలాకాశమున ప్రతిబింబించును. ఎచ్చటనో యది యభివ్యక్తమై నభమున ప్రతిబింబనము పొందును. సానందస్పర్శధామమునందు సుందరస్పర్శము ప్రతిబింబించును. కంఠము హృదయము తాలుతలము సానంద స్థానము. అందే స్పర్శనైర్మల్యము సంక్రమించును. మిథునోపభోగ సముచితస్పర్శము నచట ప్రతిసంక్రాంత మగుటచే ధాతునిష్యందసుఖ మనుభవమున భాసించును. ఆనందాతిశయకారి యగుటచే నది సుందరస్పర్శము. దుఃఖాదులు గలిగించు అసుందర స్పర్శములు నున్నవి. జఠరము, కూర్మనాడి, కంఠము మొదలగు దుఃఖమయము లయిన యాధారములందు ప్రతిసంక్రాంతమయిన స్పర్శ మూర్ఛాదులను గలుగజేయును. ఈ రూపశబ్దస్పర్శాదు లన్నియు పరస్థములు పరానుభూయమానములై యయి యాస్థలములందు ప్రతిసంక్రమించుట సర్వత్ర సమానము, స్మర్యమాణస్పర్శము ఉత్ప్రేక్ష్యమాణస్పర్శము నిట్లె సంక్రమించుట సాధకుల యనుభవము. ఇట్లె ఘ్రాణాంతరమున గంధము సంక్రమించును. నిర్మలరస గుణసహితము రసనేంద్రియాధిష్ఠానమయిన దంతోదకమున రసము సంక్రమించును.

శ్లో॥ యథా చ రూపం ప్రతిబింబితం స్పృశేః
న చక్షుషాన్యేన వినా హి లక్ష్యతే ।
తథా రసస్పర్శనసారభాదికం
న లక్ష్యతే ఽక్షేః వినా స్థితం త్వపి ॥

అంతట ప్రతిబింబస్థితి యవభాససారము. అవభాసము నాయావస్తువుల గుర్తింపగల యింద్రియముల నంతఃకరణ మనుగ్రహింప వలయును. అద్దము దగ్గరలో నున్నను చక్షురాదీంద్రియము లంతఃకరణాధిష్ఠితములు కాకున్న ముఖాదులు ప్రతిబింబింపవు. మన కంటిలోని రూపముకూడ ఇతరులచక్షురింద్రియములేక గోచరింపదు. కంటిదగ్గరనే యున్నను కాటుక కన్పడదు. వేరొక కన్ను చూడవలె నది కన్పడవలెను. దాని తత్త్వ మది. ఇట్లె రసాదులును ఎంతగా నవి సంక్రమించినను తన యింద్రియవ్యాపారము లేకున్న నిర్భాసింపవు, కావున నంతఃకరణాధిష్ఠాన మావశ్యక మని తేలినది. అది లేకున్న కన్నెంత తెఱచినను ఏమియు గోచరింపదు. స్మర్యమాణ స్పర్శయు సుఖ మిచ్చును గాని నిరంతరప్రవృత్తి యుండ నందున ఆ సుఖము సత్యము కాదు. స్మృతివికల్పోల్లేఖము పొందిన స్పర్శము స్పర్శక్షేత్రమునందు సంక్రాంతమై యసత్యసుఖ మాభాసింప జేయును. స్పర్శక్షేత్రము లెన్నియో యున్నను కొన్ని నాడీసంతతులె యాధారము లగును. కొందరకు కొన్నియె స్పర్శాధారము లగును. నపుంసకులకు కపోలమె స్పర్శధామము, కాగా నిక ప్రకృత మవధరింపుడు.

తేన సంవిత్తిమకురే విశ్వ మాత్మాన మర్పయన్ ।
నాథస్య వదతే ఽముష్య విమలాం విశ్వరూపతాం ॥

ఈ మహావిశ్వము సంవిన్ముకురమం దాత్మరూపము నం క్రమింప జేయుచున్నది. సంవిన్నాథునకు విశ్వరూపత్వ మాపాదించుచున్నది. సంవిదతిరిక్తముగా విశ్వమునకు స్ఫురణము లేదు. నిఖిల మీజగము సంవిదీశ్వరైకరూప మని పిండార్థము. విశ్వజగము ప్రకాశశివునందు ప్రతిబింబించి ప్రకాశమానత్వాది తద్ధర్మ మాశ్రయించును. విశ్వము ప్రకాశరూపముననె యుండి ప్రకాశమానత స్వీకరించును. ఈ వేద్యజాత మంతయు ప్రకాశపరమేశ్వరునకు శరీరభూతమె. రూపాద్యాత్మకమయిన నిఖిలవిశ్వము ఒకే సంవిత్తునందు సంక్రమించు ననియు గ్రాహ్యము.

సంవిదాత్మక మయిన బోధము స్వచ్ఛ స్వచ్ఛందము. స్వచ్ఛ స్ఫటికమున సర్వము సర్వత్ర సంక్రమించునట్లు సంవిత్తునం దన్నియు సంక్రమించును బోధ మత్యంత స్వచ్ఛము. తన ప్రకాశమున నది యన్యాపేక్షము కాదు.

అత్యంతస్వచ్ఛతా సా యత్ స్వాకృత్యనవభాసనః

తనయాకృతి యేమాత్ర మవభాసింపకుండుట యత్యంత స్వచ్ఛత యని సమయసంకేతము. స్ఫటికాదు లేవిధము గను నయనగ్రాహ్యము లగును గావున నింతగా స్వచ్ఛములు కావు. స్వచ్ఛమే యస్వచ్ఛప్రతిబింబము స్వీకరించును. ఏదేని స్ఫుటవేద్య మన్నచో నది యంతగా నస్వచ్ఛము. సంవిన్నాథుని విమలత్వమె విమలత్వము. విశ్వము సంవిత్ప్రతిబింబిత మయినను బాహ్యప్రతిబింబముకన్న విశేషము కలదు. బాహ్యబింబము ప్రతిబింబము సమర్పించును. బింబమే ప్రతిబింబ మయినచో నిఁక బింబ మేది? బింబ మని యభిషేకించుట కేదేని కారణ మభిమానించిన నదియు ప్రతిబింబమే యగును.

తస్యైవ ప్రతిబింబత్వే కిం బింబ మవశిష్యతాం

అంతట ప్రతిబింబసామ్రాజ్య మిట్లే యున్నది. స్వసంవిదస్త్రమె యిందు రక్షణము. లోకమందలి బింబప్రతిబింబములం డట్టిది లేదు. విశ్వము సంవిత్ప్రతిబింబిత మంటిమి. ఇందు బింబ మేది? దేని బింబ మనిన నదియు ప్రతిబింబమె యగును. సంవిన్నాథు డొక్కడె మిగులును. బింబము లేక ప్రతిబింబ మెట్లందురుకాబోలు! మే మేమి చేయుదుము? "న హి దృష్టేఽనుపపన్నం నామ." ఇది యిట్లే యున్నది. ఇం దనుపపన్న మేమి యున్నది? మేము కన్పడుదాని కప్పిపెట్టము. దృశ్యమానవిశ్వము ప్రతిబింబమా? బింబమా? సంవిత్సంక్రాంత మగుట ప్రతిబింబ మందుమా? అయిన బింబ మేది? బింబలక్షణము లేనందున బింబ మనరాదు. ఈ విశ్వభువనము బోధప్రతిబింబ మనియె యంటిమి. దర్పణముకన్న ముఖము వేరు. బోధముకన్న భువనము వే అగునా? కాదే! భువనమునకు ప్రతిబింబలక్షణ మున్నది. బింబలక్షణము లేదు. నిర్నిమిత్తముగా భువనము బింబ మందురా? అనుడు! దోష మే మున్నదిలే? వివాద మే మున్నదిలె! ఇ దేమి భారమా? వస్తువునందే విద్వాంసుల కభినివేశము. బింబము లేకున్నను నిమిత్తాంతరమున ప్రతిబింబము కలుగవచ్చునా? ప్రియుడు దేశాంతర మేగినాడు. ఇంకను రాలేదు. ఆమెమనసు కలవరపడినది. భావనలో దిగినది. బయలు చూచినది. అద్దము చూచినది. స్మరణ ప్రభావమున ప్రియుడు భాసించినాడు. ఇట బింబ మేది? లేకున్నను ప్రతిబింబము కలిగినది. ఇట్లె ప్రియుడు దూరముననుండియు స్మరించి స్మరించి యద్దమున దయితాకృతిని సంక్రమింప జేసికొనినాడు. సంవిదారూఢము చక్కగ గోచరించును. సంవిద్విచ్ఛేదము కలిగిన జాడ్యమె పట్టును. ఏమియు స్ఫురింపదు. సర్వ మిది యంధ మగును. కాన నిమిత్తాంతరమున సంక్రమణము కుదురవచ్చును. నిమిత్త మే మందుము?

అతో నిమిత్తం దేవస్య శక్తయః సంతు తాదృశే.॥

విశ్వప్రతిబింబనమందు చిద్దేవుని జ్ఞానక్రియాదిశక్తులు నిమిత్తము లవుగావుత. ఇట్టిపక్షమున నేమియు దోషము వాటిల్లదు. జ్ఞానక్రియాదిశక్తులును స్వాతంత్ర్యశక్తి పరమార్థములు. ఆ దేవుని నిజైశ్వర్యమాత్రముననె విశ్వాధారధారిత్వ ముపపన్న మగును. ఈ పిండార్థమునె ప్రత్యభిజ్ఞా పరమార్థులు పలికిరి. భావమండల మిట్లు స్వాత్మదర్శితము.

ఇత్థం విశ్వ మిదం నాథే భైరవీయ చిదంబరే

ఈచెప్పినవిధమున చిత్ప్రకాశు డయిన సంవిన్నాథునందీ విశ్వ మిట్లు భాసము పొందినది. ఇంచన్యప్రసాద మేమియు లేదు. అదియె యున్న నింక స్వాతంత్ర్య మెక్కడిది? స్వాతంత్ర్య మన్నది విమర్శస్వభావము. అది ప్రకాశ పరమేశ్వరుని ముఖ్యస్వభావము. నిర్విమర్శప్రకాశము సంభవింపదు. ఉపపన్నమును కాదు. ఇదియె జడములకన్న నిందలి విశేషము.

అంతర్విభాతి సకలం జగదాత్మనీహ
యద్వ ద్విచిత్రరచనా ముకురాంతరాలే ।
బోధః పున ర్నిజవిమర్శనసారవృత్త్యా
విశ్వం పరామృశతి నో ముకుర స్తథాను.॥

అద్దములో చిత్రప్రతిభావమువలె నాత్మలో నీ సకలజగ మవభాసించుచున్నది. ఆ సంవిదాత్మ నిజవిమర్శనసారమున విశ్వము పరామర్శించును. అద్ద మిట్లు కాజాలదు. ఈ యామర్శ మన్నది కేవలము మాసంప్రదాయసంకేతసారసిద్ధము కాదు. ఇది పరావాగ్రూపము. స్వరసోదితము. చిత్తునందు నాంతరీయకము." అని యంద రుద్ఘోషింపగలరు. ఆ విశ్వనాథుని యనన్యాపేక్షిత యనునది ప్రతిభాదేవి.

తాం పరాం ప్రతిభాం దేవీం సంగిరంతే హ్యనుత్తరాం

అది పరారూపము, ప్రతిభాత్మకము, దీవ్యత్స్వభావము, అనుత్తరము, నిరతిశయ స్వాతంత్ర్యైశ్వర్య చమత్కారమయి, అనంతశక్తిచక్రోల్లేఖశోభిత.

ఇక నీ చిద్గగనవిలాస మవధరింపుడు! ఇందు విశ్వము ద్విధా యవభాసించును. ఒకటి వాచ్యాత్మావభాసము; రెండు వాచకాత్మావభాసము. ప్రధానముగ ప్రకాశశివుడె వాచ్యాత్మ విశ్వరూపుడుగ స్ఫురించును. విమర్శమామర్శ

స్వభావమున నుదీయమాన మగును. దేవు డకుల స్వరూపుడు. దేవి కులస్వరూప. అది పరాశక్తి. దేవుడు దేవిని వీడియుండడు. ప్రకాశ పరమేశ్వరు డొక్కడే పరతత్త్వము. అతడు పరపరామర్శాత్మకుడు, పూర్ణుడు, శివు డని శక్తి యని ప్రతినియతములయిన వ్యపదేశములు లేనివాడు, అనాఖ్యుడు, అనుత్తరుడు, అతడు స్వస్వాతంత్ర్యమున విశ్వ మవభాసింపజేయ దలచి మొదట తనయందు శివ శక్తిరూపత్వ మవభాసింపజేయును. పరాపర ఫలప్రద మయిన యనుత్తరనాథుని రశ్మిచక్రమహస్సు శివశక్తి విఖ్యాతము. కావున రుద్రుడుకాని రుద్రశక్తిగాని యమన స్కమున లయించును.

"యత్రోదిత మిదం చిత్రం
విశ్వం య త్రాస్త మేతి చ।
త త్కులం విద్ధి! సర్వజ్ఞ!
శివశక్తి వివర్జితం"

అని యంతర్వేదనము సంవిద్విదు లావేదించిరి. కుల మన్న సంవిదాత్మ శివశక్తి వివర్జితము. అందే యీ చిత్ర విశ్వ ముదయించును. అందె లయించును. సూక్ష్మపరా కుండలినీశక్తి శివునితో సంఘట్టము పొంది సముత్థిత మగును. ఇచ్ఛాజ్ఞానక్రియారూపము పొందును. రౌద్రీత్వ మున్ముద్రిత మొనరించును. అంబికాత్వ మవలంబించును. జ్యేష్ఠాత్వ మధిష్ఠించును. శివుడు శక్తిరహితుడు కాడు; శక్తి శివవర్జిత కాదు. వీని పరస్పరౌన్ముఖ్యరూప మయిన యామలరూపము విశ్వసర్గమున హేతువు. ఇంతకు నిది సారప్రసరము. శివు డకులశబ్దమున శక్తి కౌలికీశబ్ద మున వ్యపదేశము పొందును. వారి సంఘట్టము సమ్యక్చలనము. అదె స్పందము. వీరిద్ద రిప్పటి కనుత్తర రూపులె. ఇది "అ" వర్ణసృష్టినిదానము. ఈ శివశక్తుల సంఘట్టమున ద్వితీయవర్ణము "ఆ" ఉదయించును. ఇక ఇచ్ఛాద్యాత్మకమయిన విశ్వసర్గ మావిర్భవించినది. సర్గారంభమున సంఘట్ట మపేక్షిత మనుట సర్వప్రసిద్ధము. విశ్వసర్గమునందు శివశక్తుల రూపములు వేఱు వేఱుగా విచ్ఛిన్నములుగా నుండును. విశ్వోత్తీర్ణుడు శివుడు. విశ్వమయ శక్తి. యామలరూప ముభయసమరసస్వభావము. అది విశ్వమయ మయినను విశ్వోత్తీర్ణము పూర్ణరూప మును. అందుననె యిది పరమోపేయ మని శాస్త్రము లన్నియు నననవి.

పరాపరాత్పరం తత్త్వం సైషా దేవీ నిగద్యతే।
తత్సారం,తచ్చ హృదయం, సవిసర్గః పరఃప్రభుః॥

విశ్వోత్తీర్ణమయిన శైవరూపము పరము. విశ్వమయ మయిన శాక్తరూప మపరము. ఇది పరాపరములకన్న పరము, పూర్ణము. ఇది సార మిది హృదయము శ్రీ సారభట్టారకులు శ్రీహృదయనయరహస్యవిదు లిదె నిశ్చ యించిరి. ఇట్టి సంఘట్టమున చిదంశమునకు ప్రాధాన్య మున్నది. ఇక నీవిశ్వము సృజింపవలెనని పరప్రమాతకు పరామర్శ ముదయించును. పరామర్శము ప్రత్యవమర్శ నము. అదియె ఇచ్ఛాశక్తి సమనంతరసర్వశక్తుల కిది ప్రభవనిమిత్తము. అనంతశక్తివ్రాత మిందు గర్భీకృతమై యున్నది. అందుచే నీ ఇచ్ఛాశక్తి సర్వోత్కర్షయోగిని. ఇదియె మూడవ వర్ణోత్పత్తి. "ఇ" వర్ణము ఇచ్ఛాశక్తి. ఇందు చిద్ధర్మవిభవ మున్నది. ఆమోదజృంభ యున్నది. విశ్వసర్గప్రవర్తనములో మొదటిస్పందము కలిగి బహి రౌన్ముఖ్యమాత్రరూపమున నుండుటచే స్రష్టవ్యానారూషి తము ఇంకను సృజింపవలసినవాని రంజనము సంస్కా రము రాలేదు. ఇక ఇచ్ఛాశక్తి యాయా ఈషణీయవిషయ ముల యారూషణమున ప్రక్షోభము పొందును. అది యాశక్తి యాత్మప్రయత్నము. ఆత్మ ప్రయత్నరూపమును పొంది బాహిరమై వెలువడి ఈశ్వరత్వము భజించును. అప్పుడు "ఈ" వర్ణ ముదయించును. ఇదియె సారార్ధము. ఇచ్ఛాశక్తి ప్రక్షుబ్ధయై ఈశిత్రి యగును. అప్పుడు బహీ రూపమున దేవీస్వరూపములు ప్రస్ఫురించును. అనంత శక్తిరూపమున బహిరవభాసము పొందుట ఐశ్వర్య మన వలెను. ఇప్పు డనంతశక్తు లుల్లాసము పొందునవి యయి నను వాని బేదము స్ఫుటము కానందున శైవాధ్వదైశిక ములు. తమతమ స్వరూపము నవి యవభాసింపజేయు వ్యాపారమున శోభించును. ఇవి శివమార్గము నిర్దేశింప గలవు. ముక్తిమార్గము నివి నిరోదింపవు. మోరాదిశక్తులు నిరోధకములు. ఇవి యమోరాదిశక్తులు. ఇచ్ఛాశక్తి కిట్టి ఈశిత్రీస్వభావమున "ఈ"వర్ణ ముదయించును.

స్వాత్మప్రత్యవమర్శో యః ప్రాగభూ దేకవీరకః।
జ్ఞాతవ్యవిశ్వోన్మేషాత్మా జ్ఞానశక్తితయా స్థితః॥

పరామర్శ మొకటి యున్న దంటిమికదా! అది యేక వీరకము. పరామర్శము ప్రక్షోభము పొందకపూర్వ మంతకు వేఱయిన విమృశ్య మేమియు లేనందున స్వాత్మమాత్ర నిష్ఠము. విశిష్టముగా తెలియదగిన విశ్వము తెలియుటకై లో జ్ఞానశక్తిగా స్పందింపగా నొక "ఉన్మేష" మాద్యపరి స్పంద ముదయించును. ఇది పంచమబీజనిర్ణయము. 'ఉ' వర్ణ మి ట్లవతరించినది. ఈ జ్ఞానశక్తి పరాపరాదేవీ స్వభావ, ఘోరమాతృమండలి నిది సృజించును. ఈ దేవీ మండలి మిశ్రకర్మఫలాసక్తి కలిగించును. ముక్తిమార్గము నిరోధించును. అందుననె ఘోర యనుట. ఇంక నిది శుద్ధాశుద్ధమార్గైకదీపిక. కాని ఘోరతర్యాదులవలె అధోధః

పాత్తిని కాదు. ఇచ్ఛాశక్తిలోవలె జ్ఞానశక్తియందును ద్వైవ మున్నది. జ్ఞేయాధిక్యమున జ్ఞేయానాధిక్యమున నిభేదములు కలుగును. జ్ఞానముకన్న జ్ఞేయాంశ ముద్రిక్తమై ప్రస్ఫుటమై క్షోభము పొందునేని రూపరూపితముగా భావభావితముగా చిత్రాకారము దరించును. అప్పుడు జ్ఞేయమె యధిక మయి నట్లు గుర్తించునది. అప్పుడు జ్ఞానము జ్ఞానమాత్రరూప మున సంకోచము పొంది యపూర్ణతాభాసనము కల దగును. ఇదియే ఊనతాభాసనము. ఇది షష్ఠవర్ణోదయము. "ఊ" ఆవిర్భవించినది.

రూఢం తజ్జ్ఞేయవర్గస్య స్థితిప్రారంభ ఉచ్యతే।
రూఢి రేషా విబోధాబ్ధే శ్చిత్రాకారపరిగ్రహః॥

ఈ సంవిత్సంకోచము సంజాతాంకురము కాగా ప్రరోహము కలిగిన దని రూఢమయిన దని తెలియవచ్చును. అట్లు రూఢమై జ్ఞేయవర్గమునకు స్థితి ప్రారంభ మగును. ఇది స్థితిప్రారంభమె కాని, సాక్షాత్స్థితి కాదు. ఇందు క్రియాశక్తి యింతవఱ కేమియు లేదు. ఈ రూఢి యన్నది విబోధాబ్ధి చిత్రాకారము స్వీకరించుట. ఇంతియె మహార్థము. ప్రరోహ మని వేరు లేమ. జ్ఞానాతిరిక్తముగ జ్ఞేయ మన్న దే మున్నది? జ్ఞానమె యాయాభాసాత్మకమై స్ఫురించును. సంవిత్సాగరము చిత్రాకారము ధరించుట హేతువుగా నిది కల్గినది. ఈ యంశ మయోగులు గుర్తింపజాలరు. యోగులు గుర్తింతురు. క్రియాశక్త్యాత్మకమయిన స్థూల భేదము వారు తెలియగలరు ఇట్లు పరవిమర్శముఖ్యముగా నిట్లు పరామర్శషట్కము కలిగినది. ఇక పరస్పరము సంఘట్టము పొందగా నిఖిలపరామర్శ ముదయించును. వర్ణసంతతిలో సంతట నీ స్వరషట్కమె మూలము.

అ—అనుత్తర శివశక్తి స్పందము
ఆ—శివశక్తుల ఆనందసంఘట్టము
ఇ—పరప్రమాతృప్రత్యవమర్శనము. ఇచ్ఛాశక్తి
ఈ—ఇచ్ఛాశక్తి ఈశిత్రీరూపము
ఉ—జ్ఞానశక్తి పరామర్శముయొక్క ఉన్మేషము
ఊ—జ్ఞానముయొక్క ఊనతాభాసనము

విశ్వము పరమేశ్వర ప్రకాశమున భాసించు నని మొదటి మాట. బింబప్రతిబింబధర్మ మని యెంతయో చెప్పితిమి కాని యిందు బింబము లేదు. లేకున్న నేమి? బింబవాచోయుక్తి యేలలే! పరమేశ్వరశక్తియె విశ్వభావ హేతువు. విశ్వప్రతిబింబము ధరించినందున పరశివుడు విశ్వాత్మకుడు. విశ్వము సంవిన్మయము. చైతన్యవ్యక్తిస్థాన ము. విశ్వాత్మకమయిన పరమేశ్వరస్వరూప మనామృష్టము కాదు. చిత్స్వభావమున స్వరూపామర్శమున్నది. ఈ యామర్శము సాంకేతికము కాదు. పరనాద గర్భము. చిత్పరామర్శ మెంతగా విశ్వవ్యవస్థాపక మగునో పరమేశ్వర శక్తికలాప మంతగా నామర్శించును. పరమేశ్వరుని యాశక్తులు మూడు ముఖ్యములు. అనుత్తరము—ఇచ్ఛ—ఉన్మేష మని. ఆది "అ-ఇ-ఉ" అనెడు పరామర్శత్రయము. ఈత్రితయ మున సర్వశక్తిప్రపంచ మావిర్భవించును.

అనుత్తరమందలి విశ్రాంతి ఆనందము
ఇచ్ఛయందలి విశ్రాంతి ఈశనము
ఉన్మేషమందలి విశ్రాంతి ఊర్మి

ఈపరామర్శత్రయమె "ఆ - ఈ - ఊ". ఇందు మొదటి పరామర్శత్రయము ప్రకాశభాగసార మగుట సూర్యాత్మక మని, చరమపరామర్శత్రయము విశ్రాంతిస్వభావాహ్లాద ప్రాధాన్యమున సోమాత్మక మని గ్రహింపవలెను. ఊర్మి యనునది క్రియాశక్తిప్రారంభము. ఇంతవఱకు క్రియాశక్త్యంశము జ్ఞానశక్తిప్రధాన మగుటవలన కర్మాంశమున కింకను అనుప్రవేశము లేదు. కర్మానుప్రవేశమున గలుగు విశ్వచిత్రచరిత్ర మిక చర్చింతుము. (సశేషము)

# అఖండదీపము - దాని ఆవశ్యకత్వ లక్షణము

పండిత వేదాంతం విప్రనారాయణాచార్యులు
కృష్ణా జిల్లా రెలిజియస్ యిన్స్పెక్టర్, బందరు, నిజాంపేట.

అజస్రదీపము ప్రతిదేవాలయమందును ఉండితీరవలెనను నియమము ఆగమశాస్త్రవిహితమా? లేకలౌకికమా? అనునది ప్రకృతాంశము; అజస్రదీపమనగా ఎల్లపుడుప్రకాశించునదని యర్థము. (శ్లో, నిత్యానవరతాజస్రమితికోశకారాః) దీనికే అఖండదీపమనియు అనిర్వాణదీపమనియు నామాంతరములు. ఆలయములందు అజస్రము దీపమును ప్రకాశింప జేయుటకు భగవచ్ఛాస్త్రసంహితా కారులందరును అంగీకరించియుండిరి. అట్లంగీకరించుటకు విగ్రహారాధనప్రవర్తకులును శ్రీవైఖానసకల్పసూత్రకారులును అగు శ్రీవిఖనోమునీంద్రులు 'సగుణే బ్రహ్మణి బుద్ధింని వేశ్య పశ్చాన్నిర్గుణంబ్రహ్మాశ్రిత్య మోక్షేనిత్యంయత్నంకుర్యాత్' అనిచెప్పియుండుటయే ముఖ్యకారణమని తలచవచ్చును; అనగా సాకార పరబ్రహ్మమందు బుద్ధిని నిలిపి చిత్తస్థైర్యము కలిగిన పిదప నిరాకారబ్రహ్మమును (మాంసచక్షుర్గోచరుడుగాక దివ్యచిన్మయరూపముతో వెలుగొందువానిని) ఉపాసించుచు మోక్షమును సాధించవలెననుట సగుణనిర్గుణశబ్దముల కర్థాంతరములు చెప్పదగి యున్నను, ప్రకృతమందు సగుణబ్రహ్మమనగా భౌతికవికృతములైన శిలా దారు లోహాదులతో నిర్మింపబడి మాదృశులకు మాంసచక్షుర్గోచరమగు అర్చావతార దివ్యమంగళవిగ్రహరూపమనియు నిర్గుణబ్రహ్మమనగా (శ్లో) తేజస్తేజస్వినామహమ్, అనిగీతలోచెప్పినట్లు అతిహితతేజస్వియై (శ్లో) ధ్యేయస్సదాసవితృమండలమధ్యవర్తీ నారాయణస్సరసిజాసనసన్నివిష్టః. కేయూరవాన్ మకరకుండలవాన్ కిరీటీ హారీహిరణ్మయ వపుర్ధృతశంఖచక్రః॥ అనిచెప్పబడుచున్న అప్రాకృత దివ్యచిన్మయ విగ్రహరూపముతో మాదృశులకు మాంసచక్షుర్గోచరుడుగాక తేజస్తత్త్వమైనదీప జ్వాలయందవ భాసించుచున్న పరబ్రహ్మ మనియు చెప్పదగియున్నది. శ్రీవైఖానస భగవచ్ఛాస్త్ర సంహితాకారులు విగ్రహారాధనమువలన కలుగుప్రయోజనమును విశదీకరింపుచు (గ) "సదీర్ఘాయుశ్శ్రీపుత్ర దారగృహక్షేత్రా రామయశస్సంపదశ్చ ఇహలోకేచిరమనుభూయ దేహావసానే సద్యశ్శంఖచక్రధరః శ్యామలాంగః చతుర్భుజోభూత్వాగగనే గరుడారూఢః సర్వదేవతానమస్కృతః రవిమండలంభిత్వా తస్యోపరి చంద్రమండలం ధ్యాయన్ గతిమార్గేణ సర్వాన్ లోకానతీత్య సత్యలోకేప్రతిష్ఠితం అనాదిజగద్బీజం అశేషవిశేషం నిత్యానందం అమృతరసపానవత్సర్వదాతృప్తికరం పునరావృత్తిరహితం శాశ్వతం పరంజ్యోతిః ప్రవిశతి" అనిచెప్పి యున్నారు. పరంజ్యోతిప్రవేశమనగా శేషశేషిభావముచెందుట. అఖండదీపము నిర్గుణపరబ్రహ్మ రూపమగుటచే సాకార పరబ్రహ్మోపాసన మందొకమెట్టెక్కిన మానవుడు మాంసచక్షుర్గోచరుడుగాని నిర్గుణపరబ్రహ్మమునుపాసించుటకనువగు నట్లు సాకారపరబ్రహ్మము యొక్క సన్నిధానమందు నిరాకార పరబ్రహ్మరూపమైన అఖండదీపమునుగూడ ప్రతిష్ఠించునట్లు శాస్త్రకారులు చెప్పియుండిరి. అజస్రదీపము యొక్క యాథార్థ్యమవగతము జేసికొనలేని మానవులకు దానియందలిశ్రద్ధా భక్తులతిశయించుటకుగాను (శ్లో) అహోరాత్రమనిర్వాణం దీపమారోపయేన్నరః॥సర్వపాపవిశుద్ధాత్మా విష్ణులోకేమహీయతే॥ సర్వకాలంచ చక్షుష్మాన్ మేధావీదీపదోనరః। సువర్ణమణిముక్తాఢ్యం మనోజ్ఞమతిశోభనమ్। దీపమాలాకులందివ్యం విమాన మదిరోహతి।తస్మాదాయతనే విష్ణోర్దద్యాద్దీపం ప్రయత్నతః॥ సాకారపరబ్రహ్మము యొక్క సన్నిధానమందు రాత్రింబవలును ఎడతెగకప్రకాశించు దీపమును ప్రకాశింపజేయుటచే ఐహికమందు మేధావియై వృద్ధాప్యమందుకూడ దృష్టిలోపము లేక మనగలడనియు ఆముష్మికమందు సమస్తపాపములచే విడువబడినవాడై మణిముక్తాలంకృతమై ప్రకాశవంతమైన దివ్య విమానమునెక్కి విష్ణులోకము జేరగలడనియు అఖండదీపదాన ఫలమునుచెప్పియుండిరి. నాస్తికులగువారు అజస్రదీప పాత్రమందు తైలము పోయక దీపోపశమనము జేయుదురేమోనని తలచి (శ్లో) తంచదత్వాఽన్నహీ నోపినచతైల వియోజనమ్ కుర్వీత దీపహర్తాచమూకోంధో జాయతేజడః ॥ అజస్రముగా సంకల్పించి ప్రకాశింప జేసినదీవమును నేయిగాని నూనెగాని బోయక దీపోపశమనమగునట్లు చేసినచో ఉత్తరజన్మమందు మూగవాడుగను గ్రుడ్డివాడుగను మత్తుడుగను జన్మించి క్లేశ మనుభవించుననియు తనకుదినుట కన్నములేకున్నను దీపపాత్రయందు నూనెలేకుండినట్లు చేయగూడదనియు దీపోపశ మనఫలమును కఠినముగాజెప్పియుండిరి. ఇదియునుంగాక (శ్లో) సర్వేషామేవదేవానాం దీపః ప్రియతమోభవేత్। సంధ్యాదీ పవిహీనేతు శ్రీదైవత్యంసవైష్ణవమ్। అగ్నేయంచసకృద్ధుత్వా దీపాంశ్చద్విగుణందదేత్। అజస్రదీపవిచ్ఛేదేశతమష్టోత్తరం యజేత్ (తా) దేవతలందరకు దీపము (ప్రకాశము) చాలాప్రీతికరమైనది కనుక సంధ్యాకాలములందు (భూతబేతాళ గణములు, సంచరించువేళ) దేవతాసన్నిధిని దీపదానము చేయతగియున్నది; ప్రాలుమాలికచేగాని మరపుచేగాని సంధ్యా

కాలములందు దేవతానన్నిదిని దీపదానము జేయకున్నచో శ్రీదైవత్యమును అతోదేవాదిష ద్వైష్ణవ మంత్రములను అగ్నేయ దైవత్యమును నిత్యాగ్ని హోత్రమందు హోమముచేసి ఒక దీపమునకు రెండు దీపములు వెలిగించవలెను. అఖండదీపమే విచ్ఛేదమగుచో ఈపైజెప్పిన భాగములను నూటయెనిమిది పర్యాయములు హోమముజేసి ప్రతిదినము ప్రకాశించు జ్వాలా ప్రమాణమునకన్న రెట్టింపుజ్వాలతో ప్రకాశించునట్లు చేయదగియున్నది. ఇట్లుగాజెప్పియుండుటజూడ మహాప్రతిష్ఠా కాలమునకు ముందుగాజేయబడు అంకురార్పణదినమందు అఖండముగా సంకల్పించి చేయబడినదీపము ఆలయార్చనము జరుగుచున్నంతకాలము సురక్షితముగా సంరక్షించవలసినదని మహర్షులనిశ్చితాభిప్రాయము. ఈఅఖండదీపము ద్రవ్యభేదము తోను లక్షణభేదముతోను ఉత్తమము మధ్యమము అధమము అనిమూడువిధములు యథా (శ్లో) ఉత్తమందీపదానంతు కాపిలేనఘృతేనవై । శ్వేతపంకజనాళోద్భైః సూత్రైః కృత్వాతువర్తికామ్। అష్టాంగుళోచ్ఛ్రయ జ్వాలోదీప ఉత్తమఉచ్యతే॥ (తా) తెల్లతామరతూడులలోని దారములతో వత్తినిజేసి కపిలధేనువు యొక్క నేతితో మానాంగుళమున నెనిమిదంగులముల ఎత్తున ప్రకాశించు జ్వాలగలదీపము ఉత్తమమనియు (శ్లో) రక్తపంకజనాళోత్థైః సూత్రైః కృత్వాతువర్తికామ్। షడం గుళోచ్ఛ్రయజ్వాలో మధ్యమోగవ్యసర్పిషా ॥ (తా) పైజెప్పబడినదారములతో చేయబడిన వత్తినివేసి ఆవునేయిపోసి మానాంగుళమున ఆరంగుళముల ఎత్తుజ్వాలాప్రకాశ ముండునట్లు ప్రకాశింపచేయబడు దీపము మధ్యమమనియు (శ్లో) తైలేనకల్పితోదీపః పిచువర్తియుతోఽధమః। త్రియంగుళోచ్ఛ్రయజ్వాలో ద్వ్యంగుళోచ్ఛ్రయఏవవా ॥ (తా) ప్రత్తితోచేయ బడిన వత్తినివేశి తిలతైలమునుబోసి మూడంగుళముల ఎత్తున గాని రెండంగుళముల ఎత్తునగాని జ్వాలాప్రకాశముండు నట్లుచేయబడుదీపము అధమమనియు చెప్పబడుచున్నది. మహారాజశ్రీ సి. వి. యల్. వరప్రసాదరావుగారు హిందూమత దేవాదాయశాఖా డిప్యూటీకమిషనరుగా వచ్చినతరువాత ప్రతిదేవాలయమందును అఖండదీపము ముఖ్యముగా ఉండితీర వలెనను శాస్త్రవాదమును బహిరంగపరచి తత్తదాలయపరిపాలకులకు తమ తమ దేవాలయములలో అఖండదీపముప్రకా శింపచేయునట్లు ఉత్తరువులు జారిజేసియుండిరి. బుద్ధిమంతులగు దేవాలయపాలకులు కొందరు వారియాజ్ఞను పాలిం చుచు శాస్త్రకారులచే నధమపక్షముగా అంగీకరింపబడిన పిచువర్తి యుతతిలతైలదీపములు ప్రకాశింపజేయ ప్రారం భించిరి; అవియును శాస్త్రములోజెప్పినటుల మూడంగుళముల ఎత్తుజ్వాలతోగాని రెండంగుళముల యెత్తుజ్వాలతోగాని ప్రకాశింపక మిణుకు మిణుకు మనుచు నుండుటకు కారణము ఆరాధకులలోపమో ఆలయపరిపాలకులలోపమో తెలియ కున్నది. మూడంగుళముల ఎత్తులతోప్రకాశించు దీపమున కొకయహోరాత్రమునకు ముప్పదితులముల నూనెకావలసి యుండునని తలచబడుచున్నది. ఆలయపరిపాలకులు పై జెప్పినపరిమితి ప్రకారము ద్రవ్యమిచ్చుచుండినచో అట్లుగా మిణుకు మిణుకులాడు చుండుటకు కారకులు ఆరాధకులేననియు పైపరిమితిప్రకారము ద్రవ్యమీయకున్నయెడల ఈలోప మాచరించువారు ఆలయపాలకులనియు మనమూహించవచ్చును. (శ్లో) ధర్మోరక్షతి రక్షితః ॥శాస్త్రోదితధర్మమును కాపాడుట వలన ఇహపరసుఖములు లభించును; గాన ఆలయపరిపాలకులును ఆరాధకులును అఖండదీపసంరక్షణ మందెవరిలోప మున్న వారుసరిదిద్దుకొనుచు ప్రతిదేవాలయమందును అఖండదీపము అఖండము మూడంగుళముల ఎత్తుజ్వాలతో ప్రకాశించు నటుజేసి ధర్మసంత్రాణము జేసెదరుగాక.

ధర్మోరక్షతి రక్షితః

ఇతిశమ్.

---

## ఆ హ్వా న ము

కృష్ణాజిల్లా దేవాలయముల ధర్మకర్తల మహాసభ తే 1—10—55 దీన విజయవాడ రామమోహన గ్రంథాలయ భవనమున జరపబడును. గాన కృష్ణజిల్లాలోని ధర్మకర్తలు అందరు దయచేసి సభల జయప్రదము గావింప ప్రార్థితులు.

ఇట్లు,
విన్నవించు భవదీయుడు,
లింగంనేని - పెదకుటుంబరావు,
కన్వీనరు.

తే. 30—8—55
మకాం - బందరు

# సమీక్ష

1. పుష్కర నిర్ణయము :—ఈ విషయమునుగూర్చి శ్రీ గౌతమీవిద్యాపీఠము రాజమహేంద్రవరమువారు ప్రచురించిన చిఱుపుస్తకము మాకార్యాలయము చేరినది. పండితవాదము లెట్లున్నను ప్రజలను ఈవిరుద్ధాభిప్రాయములు సంశయగ్రస్తులఁ జేయు ననుటకు సందేహము లేదు. ఈ గ్రంథమున చాల ఆక్షేపణలకు సమాధానములు శాస్త్రోక్తముగ నిచ్చియున్నారు. 1. గడచిన పుష్కర మయి పన్నెండుయేండ్లు కాలేదు అనుసంశయము చర్చితము. 2. గురున కతిచారమా యను విషయమునుగూడ సాకల్యమునఁ బరిశీలించియున్నారు. 3. అన్నివైరుధ్యముల కాస్పదమగు అయ నాంశనిర్ణయము. ఈ యన్నియంశముల నిర్ణయమునకు సరియగు పండిత పరిషత్తును పుష్పగిరిపీఠమువారు సమకూర్చి యుండిన బాగుండెడిది. తదభావమున గవర్నమెంటువారే సమకూర్చుట బాగు. రెండుపక్షము లున్నప్పుడు ఈ వత్సరమే పుష్కరమను నిర్ణయము వారి కనుకూలముగ ప్రభుత్వము ఏర్పాట్లు చేయుట వాంఛనీయము.

2. మల్లేశ్వర విజ్ఞప్తి :—కర్త : చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు. 101 పేజీలు 1/8 డెమ్మిసైజు. వెల రు. 1–4–0 ప్రాప్తిస్థానము : వేంకటేశ్వర పబ్లికేషన్స్ - కడియం (పోస్టు.) తూర్పుగోదావరి జిల్లా.

తెనుగున నాత్మచరిత్రకు సంబంధించి రచితములైన గ్రంథములు అల్పసంఖ్యాకములే. లక్ష్మణకవి రావణ దమ్మీయము, జగ్గకవి చంద్రరేఖావిలాపము ఈజాతివి. పోయిన శతాబ్ది కొనను ఇట్టి గ్రంథములు బహుళములైనవి. వీరికి మార్గదర్శకములు శ్రీ తిరుపతి - వెంకటేశ్వర కొప్పరపు కవుల వాదములలో నుద్భవించిన పుస్తకములు కాబోలు.

ఈగ్రంథము నట్టిదే. కీర్తిశేషులు ఆస్థానకవులు అనేకబిరుదాంకితులు చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు, కొందరు తమ్ము అనేకబాధలు పెట్టగా నూరియం దున్న దేవాలయమున నవాచ్యములు చేయగా తన్నివృత్తికై ఈగ్రంథమును రచించిన ట్లందున్నది. విషయము శ్రేష్ఠమని శాశ్వతముగ నిలుచు కవితకు పాత్ర మనిగాని చెప్పలేము. కీర్తిశేషుల ఆత్మవిశ్వా సము ధారాశుద్ధి తమ శాపానుగ్రహశక్తులపై గల నమ్మిక ఈపద్యములందుఁ దాండవించుచున్నవి. ఉత్తరకాలమున కిట్టి గ్రంథములవలన నానందాదు లొదవునను నమ్మకము లేకున్నను శ్రీవారి చరిత్రయం దీ యధ్యాయము విస్మృతము గాకుండాజేయుటకు మాత్ర మిది యుపకరించును.

శ్రీ నడిమింటి సర్వమంగళేశ్వర శాస్త్రిగారి జీవిత చరిత్రము :—కర్త, శ్రీ నడిమింటి పతంజలిశాస్త్రి గారు బి. ఏ బి. యల్. అడ్వొకేటు, పార్వతీపురము. 1/8 డెమి. పే 76లు. వెల రు 1—4—0.

ఈ కాలమున పుట్టినజాతిని పుట్టినకులమును పుట్టినవంశమును తక్కువ చేసికొని అవమానమును భావనచేయుట సామాన్యము అట్లుగాక పూర్వుల పాండిత్యపు భావముల గ్రహించి రెంటియందు పూజ్య భావముతో వారి యుత్కర్షను. గ్రీర్తించుట అపూర్వము, సంతోషదాయకము. పతంజలి శాస్త్రిగారు తమ ముత్తాతగా రగు సర్వమంగళేశ్వరశాస్త్రి జీవిత ఘట్టములను తేటతెనుగున శ్రమ కోర్చి రచించిరి.

సర్వమంగళేశ్వర శాస్త్రిగారు వ్యాకరణమున సాహిత్యమున మంత్ర శాస్త్రమున సాటి లేనివారు. సద్యఃస్ఫురణ చతురోక్తులందు వారికి వారే సాటి. వారి కథల నిప్పటికిని విశాఖ శ్రీకాకుల మండలముల చెప్పకొందురని వినికిడి. ఆ కథలయందుఁ గొన్నిటిని ఈ గ్రంథము శాశ్వతముచేయుచున్నది. ఇంకను లిఖింపవలసినవి యెన్నియో యున్నట్లున్నది.

శాపానుగ్రహశక్తులు పూర్వుల కున్నవని అధునికులు నమ్మరు. అట్లే దేవతాశక్తులనుగూడ జగన్నాథ దేవాలయ ప్రసాద నిరాకరణఫలమగు శాస్త్రిగారి యందత్వము దేవతా విషయమున నాధునిక భ్రమను పోగొట్టుచున్నది. వారు మయూర కవి సూర్యశతకమును రచించి యారోగ్యమును బడసినట్లు జగన్నాథాష్టకముచే గన్నులను బడయుట అద్భుతము లైనను జరిగినవే. అప్పుడపుడు శాపాలాపనము చేసినవారైనను సర్వమంగళ శాస్త్రిగారు సర్వమంగళులురే

ఈ గ్రంథము నింకను పెంచి విశేషముల నింకను సమృద్ధిగా నిందు ప్రచురించిన బాగని మాకుఁ దోఁచుచున్నది.

## కృతజ్ఞతా నివేదనము

శ్రీతిరుమల తిరుపతి దేవస్థానంవారు వారి ప్రచురణ గ్రంథముల నుచితముగా "ఆరాధన" పత్రికా కార్యాలయ మునం దుపయోగమునకై దయచేయించిరి. వారికి మా కృతజ్ఞతా వందనములు.

శ్రీరామశరణ్ కుందుర్తి వేంకటనరసయ్యగారు యీక్రింది గ్రంథము లుచితముగా "ఆరాధన" పత్రికా కార్యా లయమునకు దయచేయించినారు. వారికి మా అభివందనములు.

---

# వార్తలు

## గౌరవనీయ మంత్రివర్యులు శ్రీ చంద్రమౌళిగారి ఉభయగోదావరీమండల పర్యటనము

**19-8-55** తేదీ రాత్రి శ్రీ మంత్రివర్యులు రాజమహేంద్రవరమునకు విచ్చేసిరి. **20-8-55** తేదీన ఉదయం ధర్మకర్తలు-అర్చకులు-ఉభయుల సమష్టిసమావేశమున కధ్యక్షతవహించి ఉభయులను సమరసతతో వ్యవహరించి దేవాలయాస్తుల తగాదాలను పరిష్కరించుకొని కోర్టులకు పోవద్దని రాజీతో వ్యవహరింపమని యమూల్యమగు సలహాలొసంగిరి. ఈ ఉభయుల సమావేశము రోజంతయు కొనసాగి చివరకు రాత్రి 2 గంటలకు ఉభయులు మంత్రివర్యుల సలహా ప్రకారం అంగీకారమునకు వచ్చి రాజీషరతులకు అంగీకరించిరి. (రాజీనామాషరతులు వేరుగా ప్రకటింపబడినవి.)

ధర్మకర్తల తరపున దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారు అర్చకులతరపున డాక్టరు హరిగారు రాజీనామాషరతుల పత్రంపైన సంతకములుచేసిరి. **21-8-55** తేదీ ఉదయం శ్రీ మంత్రివర్యులు శ్రీ ద్రాక్షారామభీమేశ్వర స్వామిని సేవించుకొని తాళ్ళరేవుమీదుగా సాయంకాలమునకు కాకినాడకు విచ్చేసిరి.

సాయంకాలం కాకినాడ పి. ఆర్. కాలేజీ విద్యార్థుల సభలో నుపన్యసించుచు ఆర్షమతమును, భారతీయనాగరికతను, సంస్కృతిని జాతీయతను విద్యార్థు లలవరచుకొనవలెనని యుపన్యసించిరి. పిదప కాలేజీయందే పండిత పరిషత్సమావేశమునకు అధ్యక్షతవహించి పండితులు వైదికవిజ్ఞానమును ప్రజాబాహుళ్యమున కందజేయుటకు పాటుపడి ఆర్షసంప్రదాయమును, భారతీయధర్మమును కాపాడవలెనని యుపన్యసించిరి. **22-8-55** ఉదయం కాకినాడ నుండి పిఠాపురంమీదుగా అన్నవరం విచ్చేసిరి. అచట శ్రీ వీరవేంకటసత్యనారాయణస్వామివారి పూజలు తమ గోత్రనామములతో స్వయంగా జరిపించుకొనిరి. మధ్యాహ్నం 3 గంటలకు శ్రీ స్వామివారి కళ్యాణమంటపమునందు పండితసమావేశమున కధ్యక్షతవహించి సభను జయప్రదముగా నిర్వహించిరి. సాయంకాలం అన్నవరం దేవస్థానంవారిచే నూతనముగా నిర్మింపబడిన వసతిగృహమును తెరచిరి. (ఫోటో కవరుపేజీయందు చూడనగును) తరువాతను పంపానదీతీరమున యాత్రికుల స్నానార్థము నిర్మింపబడిన స్నానఘట్టమును తెరచిరి.

**5-9-55** తేదీన శ్రీ మంత్రివర్యులు అంతర్వేది వెంచేసి శ్రీ లక్ష్మీనరసింహస్వామివారిని సేవించిరి. అచట రైతులు-అర్చకులను సమావేశపరచి దేవాలయ భూములసొత్తును అన్యులు అనుభవించుట తగదని సలహాయిచ్చి దేవునికి రాగభోగాదులకు, ఉత్సవములకు, దేవాలయనిర్వహణమునకు దాతలు యిచ్చిన ఆస్తులు అక్రమంగా యితరులనుభవించుట న్యాయముకాదని సలహాయిచ్చుచు రైతులకును, అర్చకులకును నష్టములేకుండునట్లు దేవాలయనిర్వహణ సక్రమముగ నిర్వహింపబడునట్లును సమకూర్చుకొను అంగీకారముతో వ్యవహరింపమని సలహాయిచ్చిరి. రైతులు, అర్చకులు అట్లు అంగీకరింపనియెడల పూర్తిగా నష్టపోయెదరని హెచ్చరించిరి.

**6-9-55** తేదీన తణుకునందు పండితసమావేశము నేర్పరచిరి. పండితుల విజ్ఞానమును ప్రజాబాహుళ్యమున కందజేసి Socialistic State లో ధనము విషయమై తారతమ్యము విపరీతంగా నుండక అందరికిని సమానమగు స్వత్వములు కలుగజేయుటకు ప్రభుత్వం, ప్రజలు యెట్లు ప్రయత్నించుచుండిరో అట్లే విజ్ఞానధనులగు పండితులుకూడ తమ విజ్ఞానధనమును దాచిపెట్టుకొనియుండక అందరికిని పంచిపెట్టిననాడే నిజమైన భారతీయుల ధర్మమును నిర్వర్తించినవారగుదురనియు, దేవాలయములు పూర్వపు ఔన్నత్యమునకు రావలెనన్న పండితులు ప్రజాసామాన్యమునందు భక్తి ప్రచారమునెనర్పవలెననియు, పూర్వపు ఋషులవలె కాలానుగుణముగ పండితులు నేటి సమాజమునకు వలయు విజ్ఞానమును వెదజల్లుటకు ముందుకురావలెననియు తమ మృదుమధుర శైలిలో గంభీరముగా నుపన్యసించిరి.

# గురుః

విభాగో నిర్వచనం చ

గురుర్బ్రహ్మా గురుర్విష్ణుర్గురుర్దేవో మహేశ్వరః ।
గురుస్సాక్షాత్పరబ్రహ్మ తస్మై శ్రీ గురవే నమః ॥

లోకే జన్మవతాం నరాణాం సామాన్యేన ద్వివిధం జన్మ ; శరీరతః విద్యాతశ్చ । శారీరజన్మనో మాతాపితరౌ కారణం, విద్యాజన్మనస్తు గురుః ; ద్వయోరపి జన్మనోః విద్యాజన్మ ఉత్తమం దుర్లభం చ, అతః తత్కారణభూతో గురురపి సర్వోత్తమః ॥ విద్యాపి ద్వివిధా ఆధిలౌకికీ ఆధ్యాత్మికేతి । ఆధ్యాత్మికవిద్యా నిగూఢా దుర్గ్రాహ్యా ; తత్ర గురుః అత్యంతం ఆవశ్యకః । తదనుగ్రహేణ వినా ఆధ్యాత్మిక జ్ఞానం ముముక్షుః అధిగంతుం న ప్రభవతి. అతః గురుః జిజ్ఞాసుభిః సర్వదా సంసేవ్యః.

అథ గురుః ద్వాదశధా ప్రాచీనైః పర్యగణ్యత ; యథా :'— ౧. ధాతువాదీ,— ౨. చందన— 3. విచార— ౪. అనుగ్రహ— ౫. పారస— ౬. కచ్ఛప— ౭. చంద్ర— ౮. దర్పణ— ౯. ఛాయానిధి— ౧౦. నాదనిధి— ౧౧. క్రౌంచ— ౧౨. సూర్యకాంతగురురితి :—తత్ర

(1) ధాతువాదీ గురుః శిష్యాయ కేవలం కాయికక్లేశసహాని తీర్థసేవనాని వివిధవ్రతాని ఆత్మజ్ఞానసాధనాంగాని సమ్యగుపదిశతి । (2) చందన గురుః :—యథా చందనతరుః ఆత్మనః సౌరభేణ సౌరభ్యం గ్రహీతుం శక్తాన్ సన్నిహితాన్ వృక్షాన్ సురభయతి ఏవం ఆత్మనః సాంగత్యేన, గురురేషః తత్వజిజ్ఞాసూన్ శిష్యాన్ తత్వజ్ఞానం బోధయతి (3) విచార గురుః :—అయం స్వయం సమ్యగ్విచార్య ప్రపంచస్య అనిత్యతాం బ్రహ్మణో నిత్యత్వం చావధారయతి ; ఏవం శిష్యస్యాపి బుద్ధౌ మాలిన్యం పరిహృత్య ప్రపంచస్య అవాస్తవికతాం బ్రహ్మణో నిత్యతాంచ ప్రమాణైః నిరూప్య తత్త్వజ్ఞానేన ముముక్షుం అనుగ్రహయతి (4) అనుగ్రహ గురుః :—ఏష పునః కరుణయైవ కేవలం శిష్యం వత్సలయతి ; గురోః కృపాంబుధిరేవ శిష్యం అజ్ఞానమలాత్పరిశుధ్య సుఖేన తం తత్త్వం జ్ఞాతుం ప్రభవంతం కురుతే (5) పారస గురుః :—యథా స్పర్శమణిః ఆత్మనః స్పర్శమాత్రేణ కుప్యలోహాన్ సువర్ణత్వేన పరివర్తయతే ఏవం ఏష కేవలస్పర్శేన శిష్యాయ దివ్యజ్ఞానం ప్రయచ్ఛతి. (6) కచ్ఛప గురుః :—కచ్ఛపః ఆత్మనః శాబకాన్ స్వయం ఆహరదానేన న పోషయతి, కింతు కేవలం ధ్యానేనైవ తాన్ వర్ధయితుం ప్రభవతి, ఏవమేవ ఏష గురుః శిష్యం కేవలం కటాక్షవీక్షణేనైవ తత్త్వజ్ఞాన మవగంతుం ప్రభవయతి । (7) చంద్ర గురుః :—చంద్రోదయేన దూరస్థోపి చంద్రకాంతమణిః యథా ద్రవతి, ఏవం దూరస్థోఽపి శిష్యః గురోః అనుగ్రహప్రభావేన తత్త్వం వేత్తుం ప్రభవతి । (8) దర్పణ గురుః :—దర్పణే యథా ఆత్మనః ప్రతిబింబం ద్రష్టుం ప్రభవతి ఏవం అస్య గురోః సమక్షం తిష్ఠన్నేవ శిష్యః తత్త్వజ్ఞానం సంపాదయతి. (9) ఛాయానిధి గురుః :—ఛాయానిధిరితి కశ్చన పక్షివిశేషః, యస్య ఛాయయా నరః రాజ్యమప్యాప్నుయాత్, ఏవం గురోః ఛాయాప్రసారేణైవ కేవలం శిష్యః ఆత్మజ్ఞానే ప్రభవితుం భవతి. (10) నాదనిధి గురుః :—నాదనిధిర్నామ కశ్చనమణిః, యస్య అసాధారణయా శక్త్యా కేవలధ్వనిమాత్రేణ యం కంచిదపి లోహం సువర్ణత్వేన పరిణమయితుం ప్రభవతి, ఏవమేవ ఏష గురుః భక్తస్య శిష్యస్య ఆర్తనాదం శృణ్వన్నేవ తం దివ్య జ్ఞానేన అనుగ్రహయతి ॥ (11) క్రౌంచ గురుః :—క్రౌంచో నామ పక్షీ షణ్మాసాన్ ఆహారార్థం పర్యటన్ ఆత్మనః శిశూన్ సముద్రతీరే అవస్థాప్య గచ్ఛతి, తస్య ఉత్తరోత్తరప్రయాణేషు తదాతదా తీరే స్థితాన్ శాబకాన్ స మనసా స్మరతి. తత్స్మరణమేవ శిశూన్ పుష్టిం ప్రాపయతి, ఏవం ఏష గురుః యత్రకుత్రాపిస్థితం ముముక్షుం శిష్యం కేవలం స్మరతి, తత్స్మరణమాత్రం శిష్యం ముక్తిం ప్రాపయతి । (12) సూర్యకాంత గురుః :—యథా సూర్యకాంతమణిః సూర్యకిరణ సంక్రమితః అనిచ్ఛన్నేవ తూలాదీన్ దహతి ఏవం అయం గురుః అనుద్దిశన్నపి యంకంచి త్పశ్యతి, సః తద్దర్శనమాత్రేణ జీవన్ముక్తో భవతి ॥ ఇతి.

ఏషు ద్వాదశసు గురుషు ఆద్యాస్త్రయః సాధారణాః సామాన్యేన మానవైః సేవితుం లభ్యాః । అన్యే నవ తు మానవాతీతాః విశిష్టమహిమాన్వితాః శక్తివిశేషయుతైః శిష్యైరేవ అవగమ్యాః । అస్మిన్ కాలే సామాన్యాస్త్రయో గురవః సర్వ సాధారణాః । పూజ్యో మహర్షీ రమణః, అరవిందయోగీచ విశిష్టగురువిభాగే గణనీయౌ । మహామహిమాన్వితే విశాలేఽస్మిన్ భారతే వర్షే యత్రకుత్రాపి నిగూఢాః మహానుభావాః మహాత్మానః మహామహిమోపేతాశ్చ గురుమహాశయా వర్తేరన్ తేభ్యః ॥ —అయం ప్రణామాంజలిః

---

# A PAGEANT OF INDIAN PHILOSOPHY

*By*

N. RAMESAN M.A., I.A.S.

## Chapter I

### Introduction:

If we define philosophy as, a human attempt to grapple with the problems of the eternal verities of life, and to solve them in a manner, that would satisfy the rigours of the most exacting standards of reasoning, and the most satisfying standards of intuitional perception, we can say without hesitation, that Indian philosophy has attained the summit of this attempt. Whether it is, the naive and mystic poetry of the seers of the Rigveda, who poured their emotions in lovely song and who in the delight of the contact of the unsophisticated mind with the beauty of nature, burst forth into the hymns to उषा, वरुण and मित्र or whether it is the marvellous suggestions of the Āranyakas and Upanishāds, who even today startle us with their profundity and depth, or whether it is the wonderful psychological analysis of the Mādhyamika, Vaibhāshika, yōgācāra and Sautrantika philosophers of Buddhism; or whether it is the stupendous systems of organised thought of the "Shad-darsanas" with the remorseless logic of a Naiyāyika, the candour of a Sānkhya, the discipline of a yōgī, and the ritual of a 'pūrvamimamsika, or whether it is the pellucid reasoning of a Sānkara, with his "vivarta-vāda" and the concept of अध्यास, or whether it is the soul-stirring theism of a Ramānuja, with his प्रपत्ति (prapatti) and परिणाम वाद; or whether it is the host of commentators and thinkers like कुमारिल, गौडपाद, निम्बार्क, नागार्जुन, वाचस्पति, वात्स्यायन, उद्योतकर, गंगेश, अप्पय्य दीक्षित, who with their वृत्तिs, their कारिकाs and भाष्यs, have not left any corner of human thought, unexplored by human reasoning, and we can say without hesitation that Indian metaphysics, has soared to heights of logic and perception, which leave other systems far behind. And when we consider that all this was attained at a period of time in history, when other nations were groping in the dark, our admiration becomes all the greater. An attempt is made here to present this pageant, in a coherent and easily intelligible manner to the general reader.

It is a common criticism, that Indians lack the historical sense and this holds good in the field of philosophy also. There are very few historical accounts written of Indian Philosophy. But as against this, may be mentioned the fact, that each commentator, generally summarises the conclusions of the previous thinkers, and then goes on to develop his own system. In this manner, we can manage to get a fairly accurate account of each successive system of thought, by a chronological analysis of the various भाष्य's. So far as the Upanishads go, it is a tribute to the universal character of the truth that they expound, that each different thinker always quotes the same Upanishad in support of his contention. Truth being eternal, and the language being so suggestive, one can develop from the same source, two entirely divergent systems of philosophy. There have been some conscious attempts at writing a purely historical account of philosophy, as opposed to merely developing one's own particular school of thought. The most famous and popular of these, is of course the well known "सर्वदर्शनसंग्रह" by माधवाचार्य of the

14th Century. The "सर्वसिद्धान्तसारसंग्रह" wrongly attributed to Sankara, is another useful book. Haribhadra's "षड्दर्शनसमुच्चय", "आप्तमीमांसा" of the Digambara Jain of the 6th Century "सामन्तभद्र", the "तर्कज्वाल" of the 'माध्यमिक' Buddhist, "भावविवेक" and other books like "विद्यानाथ's "अष्टसाहस्री" "मेरुतुंग's "षड्दर्शनविचार" contain useful information. In modern times, western scholars like Max-Muller, Keith, Garbe and others have attempted to study the systems. Prof. Das Gupta has written an erudite and learned book on Indian Philosophy, but the most celebrated and famous work is that by Dr. S. Radhakrishnan, who in his diction and language, in his fairness in treating the subject, and in his masterly and scintillating exposition of the abstrusest thought in the most lucid and vivid expression, rises to such heights, as would make him a compeer to the celebrated भाष्यकाराs of our country. His work has the touch of an inspired genius in it, and his book. "History of Indian Philosophy", has by its ex-cathedra treatment of the subject, a place equal to that of the works of Nagarjunā, or Sankara.

Philosophy being a human attempt to comprehend the universal truths, it is bound to be conditioned by the peculiarities, racial and cultural, of the people amidst whom it develops; and Indian Philosophy is no exception to this. In India, philosophy has not been a mere intellectual pastime, a science to be learnt along with others. Philosophy has dominated the entire life of the people and it is the one basic science, to which all others were subordinated. It is because of this peculiarity, that we find, that sciences, like logic, ethics, metaphysics, eschatology, and even religion, are treated under one head. In India philosophy is the science of sciences, knowing which, all else is known.

A most striking feature of Indian philosophy, that would attract the attention of any unbiased student, is its extraordinarily rational character, and absolute freedom from dogma. It is a general misconception to say that the exclusiveness of the caste-system and the वर्णाश्रमधर्म, with its rigid caste duties, are reflected in Indian Philosoply. In India, social law was developed separately from intellectual belief. This is the reason why we have such a diversity of antagonistic philosophers, all professing to be Hindus. The word 'Hindu' does not connote, as a necessary preliminary for adopting that faith, any irrational adherence to a set dogma or creed, so far as the reason of the mind is concerned. The word "अवैदिक", which is used generally, to denote certain schools of thought, does not mean "heterodox" in the accepted modern sense of the word. It only means that the authority of the Vedas is not accepted. Certain schools of thought developed, which made it a sinequanon, that the authority of the Vedas must be accepted blindly. These are called "वैदिक" systems, as opposed to अवैदिक. What binds a body of men as belonging to the Hindu faith, is not their acceptance of any one system of metaphysical belief or doctrine. It is the adherence to, and strict observance of, the social laws of life, that holds the Hindu society, as such, into an integrated whole. This system of social laws, which developed quite early, does not necessarily require that one particular system of thought alone should be accepted. In the region of mental speculation, Hinduism was amazingly free, while in the region of social laws, it had elaborate rules which had to be strictly observed. These social laws or the Vedangas, of which the most important is the Kalpa,

contain the Srauta, Grihya, and Dharma Sutras. Of these, the most important is the आश्वलायन गृह्य सूत्रास, which determine the social life of a Hindu. They prescribe in minutest detail, the duty of a man from birth to death, laying down several ceremonies, like the Pre-natal, Pumsavana, Nāmakarana, Anna-prāsana, Yagnōpavītha etc. etc. It is this body of domestic laws, as per the Grihya Sutras, that binds a society into Hindus as a whole. So long as these, and the वर्णाश्रमधर्मास are correctly observed, the human mind is left to wander free, how completely free from traditional bias and accepted dogma, to Hindu thought, is clear from the fact, that the Sāmkhya system, is silent about the very existence of God, though it is certain that it is theoretically impossible to demonstrate it. Vais'eshika, and Yoga schools of thought, while admitting a supreme being, deny that he is the creator of the universe, and Jaimini of Pūrva-Mīmamsa, refers to God, only to deny his providence. We have also the Cārvakas, who deny God, ridicule Vedic rites, and seek salvation in the senses. The following extract from the सर्वदर्शनसंग्रह,* may probably come as a jolting surprise to many modern revilers of philosophy. They will realise that they are not really modern or novel, but that they come of an illustrious pedigree of Lokāyatas!

"There is no heaven, no final liberation,
nor any soul in another world,
The Agnihotra, the three vedas, the ascetic's three staves, and smearing
one's self in the ashes,
Were made by Nature as the livelihood of these destitute of knowledge and
manliness.
While life remains, let a man live happily, let him feed on ghee even though
he runs in debt.
When once the body becomes ashes,
how can it ever return again?
If he who departs from the body goes
to another world.
How is it that he comes not back again,
restless for love of his kindred? etc. etc.',

Ajita Kesakambalin, was a noted philosopher who rejected all knowledge by insight, and resolved man into elements that dispersed at death.. Similarly Purāna Kāsyapa, Maskari Gosāla, and Kakuda Kātyāyana, to mention only a few, who were adherents of the Chārvaka school of thought, which either denied a soul, or conceived it in a material manner, were all pious Hindus. It is a strange paradox of Hinduism, that the boldest and freeest adventures of thought, were coupled with the narrowest and most constricted rules of social law. This is an essential point that has to be borne in mind, in any study of Hindu thought. Hindu religion has no set books, no set gods, no set prophet or messiah, whose word alone is final, and in fact, no set doctrine, at all. It recognises only the spirit, and the spirit is allowed to evolve freely, each according to its lights. The Mahabharata declares, that there is no munī, without an opinion of his own, and the Gita, after elaborately discussing the various systems, ends on a characteristically Indian note when it says "विमृश्य अशेषेण यथा इच्छसि तथा कुरु" (After cogitating, fully, do exactly as you think best!). Several of the Buddhist systems of thought, can be traced, to the Upanishads and some of them, come very close to the conclusions of Advaita, though they stop short of the end. Some critics of Sankara, have even called him a Buddhist in disguise. Buddhist thought is much closer in affinity to the Hindu thought of the Upanishads, than say the Pūrva-mīmāmsa, but Buddhism as such

*Refer pages 282–283 of Dr. S. Radhakrishnan's 'Indian Philosophy' Vol. I.

has not been accepted as part of Hinduism, and in fact, has heen swamped out in this country, mainly because, Siddhartha the Buddha, raised the banner of revolt against the caste-order and thereby infringed, the social law of the Hindu. It is because of this, and not because of any essential doctrinal difference, that Buddhism, found short shift in the country of its origin. Hindu Philosophy as opposed to Hindu social law, is untrammelled, recognises no limits, and is unique in its opportunities for fresh and clear thinking.

A great difficulty in the way of writing a connected 'history of philosophy', is the fact that each thinker, shows at times almost a pathetic, inclination to somehow derive his faith from the Upanishads, and pin his ideas, on to some ancient and forgotten Rishi. This argues well for the modesty of the philosophers, who were more interested in their ideas than in themselves, but it makes the task of a cogent and chronological study of the subject, very difficult. The Bādarāyana of the Uttara-mimamsa sutras, has been identified, with Bādarāyana Vyāsa, the author of Mahābhāratam and this is hotly denied by others. Similarly the identity of Patanjali, the author of 'Ashtādhyāyi', and of Patanjali of the Yoga-sūtras, is still a moot point. "The problem of determining the exact dates of early Indian systems, is as fascinating as it is insoluble, and it has furnished a field for the wildest hypotheses, wonderful reconstruction and bold romance". Still, we do arrive at certain fixed dates of Indian History as for e.g., the date of the death ot Buddha 487, B.C. and with reference to these, and with reference to other literary and archaeological evidence we can arrive at fairly satisfactory results. Another difficulty that confronts us is, that, apart from their names, we know practically nothing about the personal lives and events of our greatest thinkers Any system of thought, will have an added interest and liveliness, if we could know something about the lives of the thinkers. But for various reasons, the most notable being a sense of humility of these seers before grand thoughts, which is at times touching, we have to miss this biographical background. Cowell writes of Udayana, a great Naiyāyika philosopher (not to be confused with the Udayana of the Brihad-katha), "He shines, like one of the fixed stars in India's literary firmament, but no telescope can discover any appreciable diameter; his name is a point of light, but we can detect therein nothing that belongs to our earth or material existence". This is perhaps true of every other Indian philosopher and a systematic search for manuscript and legends, may perhaps bring forth fresh data. After all, biography wss not unknown in India, as Bāna's "Harsha-charita", or even Madhava's "Sankara-dig-vijaya" and 'Ānandagiris' 'Sankara-Vijaya' show. Though these are of doubtful historical value, they prove to show, that biographies were not unknown. And a systematic search is bound to yield results. What would we not give, for glimpses of the lives of say, a Mahidāsa, Sāndilya, Satyakāma Jābāla, Jaivali, Uddālaka, Pratardana, Bālāki, Ajātasatru, Gārgi, Maitreyi etc. etc., seers who are just names to us now?

Transcending all these difficulties of paucity of material etc., we can broadly divide the chronology of Indian thought, into the following categories.

(A) Pre-Āryan period (Before 1,500B.C.)
(B) Vedic Period (1,500 B. C.—500 B.C.)
(C) The Epic Period (500 B. C. to 200 A. D.)
(D) The Sutra Period (200 A. D.—500 A. D.)

(E) The Scholastic Period (500 A. D.—1300 A. D.)

(F) The Modern Period (1300 A. D. onwards).

It must be remembered that the above division is extremely arbitrary and has the sole benefit of showing some *Rino* of division in chronology and nothing more. The dates assigned are also quite arbitrary and are the subject of serious differences of opinion between scholars. Thus some scholars assign the Vedic hymns to 6000 B. C. and 3000 B. C. Mr. Tilak divides the Vedas, into its component parts, and assigns different dates to each, thus assigning 4,500 B. C. to the hymns, 2,500 B. C. to the Brahmanas, and 1,600 B. C. to the Upanishads. An occidental scholar Jacobi assigns the Vedic hymns to 4,500 B. C. The chronology given above, which is the closest to that adopted by Dr. S. Radhakrishnan, seems to offer a fairly accurate picture.

About the pre-Āryan period, we know practically nothing, except the excavations at Mohen-ja-daro and Harappa. They however reveal to us a highly advanced society, with its over peculiar religion. In the Vedic period, we have the gradual expansion of the Aryan influence. The Hymns of the Rig-veda, the liturgy of the Brahmanas, and the metaphysics of the Āranyakas and Upanishads fall in this period. We have here, some of the most daring excursions into metaphysics, coupled with much that is turgid and obscure. In the Epic period, we have the message of the new gods and their ideas, conveyed to the people through ideal heroes. We have the great systems of the Bhagavadgita, and the stirring message of Buddhism. Buddhism, Jainism, Saivism, Vaishnavism, the Bhagavata cult, the Vasudeva-worship, the system of self-surrender to God, all belong to this period. Simultaneously, the development of abstract thinking was also going on and it culminated in the "Six Systems of Philosophy" or the "Shad-darsanās", which fall in the next period, the Sūtra-period. The thinking that went on ever in the Epic period, got crystallised and was reduced to cryptic aphorisms, or the Sūtras, during this period. The six systems are the सांख्य (Sāmkhyā) of कपिल (Kapila), the न्याय (Nyāya) of गौतम (Gautamā, not to be confused with Gautamā the Buddha), the वैशेषिक (Vaisēshika) of कणाद (Kaṇada), योग (Yoga) of पतञ्जलि (Patanjali), the पूर्वमीमांस (Pūrva-Mimamsa) of जैमिनि (Jaimini) and the उत्तरमीमांस (Uttara-mīmāmsa) of बादरायण (Bādarāyana). There were several other systems of thought, but these six, justly became famous. Among these systems, the chronology of one before the other is again difficult to determine. "The Yoga accepts the Sāmkhya, the Vaiseshika recognises both the Nyāya and the Sāmkhya. Nyāya refers to the Vedānta (or Uttara-mīmāmsa) and the Sāmkhya. Mīmāmsa, directly or undirectly recognises the pre-existence of all others. So does the Vēdanta". We can only say this, that the six systems developed during this period. Similarly in Buddhist philosophy we have the four great systems of thought, which also developed almost in the same period. The Hīnayāna systems, are the वैभाषिक (Vaibhāshika) and the सौत्रान्तिक (Sautrāntika), who are realists or सर्वास्तिवादिन: (Sarvāsthi-vadi), where as the Mahāyāna systems are the योगाचार (Yōgācāra) and the माध्यमिक (Madhyamika) who are called सर्ववैनाशिका: (Sarva-vaināsikas) or nihilists. The dates of these systems are not very clear, but they range from 2nd century A.D. to 5th century. असंग (Asanga) the founder of the Yogacārā school is as late as the 3rd cen-

# ĀRĀDHANA

(A RELIGIOUS MONTHLY MAGAZINE)

*Anent* THE TEMPLES

FOR THE TEMPLES

BY THE TEMPLES

*(in Andhra State)*

* * * * * *



---

PUBLICATION OFFICE:

"ĀRĀDHANA"

OFFICE OF THE DEPUTY COMMISSIONER

*Hindu Religious & Charitable Endowments (Administration) Department (Andhra)*

MASULIPATAM

| | |
|---|---|
| ANNUAL SUBSCRIPTION (Inland) | Rs. 12/- |
| PER SINGLE COPY | Re. 1/- |
| ANNUAL SUBSCRIPTION (Foreign) | 24 Sh. |

# ఆరాధన

మన్మథ మాసపత్రిక ఆశ్వయుజము

విషయసూచిక — పుట

## తెనుగు



## సంస్కృతము



# CONTENTS

PAGE

## ENGLISH



శ్రీవాసవీ కన్యకా పరమేశ్వరి. పెనుగొండ

★

హేతుః సమస్తజగతాం త్రిగుణాపి దోషై। ర్న జ్ఞాయసే హరిహరాదిభి రప్యపారా।
సర్వాశ్ర యాఖిల మిదం జగ దంశభూత। మవ్యాకృతా హి పరమం ప్రకృతి స్త్వ మాద్యా॥

"ఆనందరూప మమృతం యద్విభాతి"

# ఆరాధన

సకృ దేవ ప్రపన్నాయ 'త వాస్మీ'తి చ యాచతే ।
అభయం సర్వభూతేభ్యో దదా మ్యేత ద్వ్రతం మమ ॥

సంపుటము ౧ | మన్మథ - ఆశ్వయుజము | సంచిక ౯

## వాసవీ కన్యకాపరమేశ్వరి

ఎందు కా యభిప్రాయము కలుగునో కాని జనులకు గృహస్థస్థితి తక్కువ యని పెండ్లి కాని బ్రహ్మచర్యస్థితి యెక్కువ యని నమ్మకము కలదు. అందులోను కన్యక పరమపావని యని వివాహిత కొన్ని కార్యములందుమాత్రము గణనీయ యని, బహుశః కామునికి చోటు కలదు గనుక కాబోలు. జగన్మాత యగు పరదేవతకును పరమేశ్వర సంయుక్తి కొఱత తెచ్చునా? కాని దేవ్యారాధకులలో కన్య కాపూజ కెక్కుడు గౌరవము కలదు. దుర్గానవరాత్రము లలో దినదినమును కన్యకాపూజ విధింపఁబడియున్నది. ఒక్కొక దినమున పూజింపబడవలయు కన్యవయస్సును నిశ్చయింపబడియే యున్నది.

కన్యపూజ దేశమునం దంతటను వ్యాపించియున్నను కన్యాకుమారి యందలి మూర్తి కన్నింటికన్న ప్రాధాన్యము. సిద్ధాంత మెట్లున్నను అక్కడిమూర్తిని జూచినవెంటనే అస్పృష్టపావనకళలతో షోడశవర్షప్రాయమగు కన్యకా మూర్తి మనసునం దేమో నిర్వచింపరాని పూజ్యభావము కల్పించకమానదు.

తెనుగుదేశమునను కన్యకాపరమేశ్వరిపూజ సర్వ వ్యాప్తమే. అందును విశేషముగ ఆమె వైశ్యుల కులదైవ తము. ఆమె వారియింట యావిర్భవించినది. అప్పు డామె నామము వాసవి. తండ్రిపేరు కుసుమశ్రేష్ఠి. జన్మస్థానము వెంగిదేశమందలి పెనుగొండపురము. అప్పటి రాజవంశము తూర్పుచాళుక్యవంశము. వా రందరికి విష్ణువర్ధను లని యొక బిరుదనామము. వారి రాజధాని రాజమహేంద్ర పురము.

ఒక దుర్ముహూర్తమున నా రాజు వాసవికన్యను జూచి నాడు; భ్రమపడినాడు; మోహించినాడు; తన కిమ్మని కుసుమశ్రేష్ఠిని కోరెను. ఈనాడువలెనే ఆనాడును వైశ్యు లకు ధర్మనిరతి యెక్కువ. కులమువా రెల్ల సభ కూడి అన్యవర్ణమువానికి పిల్ల నీయకూడదన్నారు. రాజు దౌర్జ న్యము నుపయోగించు నేమో! ఉపయోగించినచో అగ్ని ప్రవేశమైన చేయవలెనే గాని రాజుకోరిక కీయకొన రాదని కులపెద్దలు తీర్మానించికొనిరి. రాజున కెఱుకపరచినారు.

అనుకొన్నట్లే రాజు సైన్యములతో బలాత్కారము చేయుటకు వచ్చినాడు. డెబ్బదిమూడు గోత్రములవారు గ్రామము విడిచి పలాయనము చేసినారు. రాజు తరుము కొన్నాడు. ఇక పలాయనము లాభము లేదని అగ్నిప్రవేశ మున కందరు పూనుకొన్నారు.

వాసవికి తా నెవరో తేటపడినది. తాను దేవియవతారము గదా. తన కులమువారికి ప్రత్యక్ష మైనది. తనకై త్యాగ మునకు బూనుకొన్న కుటుంబములవారి కిలవేల్పై సర్వ సమృద్ధులను ఒసంగుద నని వరమిచ్చినది. కులకన్యకా పావనత్వము చెరుపఁబూనుకొన్న రాజునకు శాప మిచ్చి నది. డెబ్బదిమూడు గోత్రములవారు అగ్నిప్రవేశము చేసి నారు. వారే ఆర్యవైశ్యులు.

కన్యకావరప్రభావముచేత త్యాగమహిమచే జనులు రేగి రాజసైన్యములను చిదుకఁగొట్టినారు. విష్ణువర్ధను డా యగ్నిలో నశించిపోయినాడు.

శ్రీ వాసవాంబాపూజ వైశ్యులకు ప్రథమకర్తవ్యము.

పెనుగొండ వారికి పుణ్యక్షేత్రము. ఆర్యవైశ్యమహాసభ వారు వాసవీపురాణాదుల రచింపఁజేసినారు. భగవంతం గుప్తగారిది యథార్థచారిత్ర కోపంత మని శాసనాదుల జూపించినారు. ఇంకను పరిశోధనలు జరుగుచున్నవి. జనప్రవాదమునకన్న బలపత్తరప్రమాణ మెంతో కలదు. ఆర్యవైశ్యసభవారికి వ్రాసిన పడయగలరు.

పెనుగొండయందలి శ్రీ వాసవీకన్యకా పరమేశ్వరి అమ్మ వారి యాలయచిత్రమును శ్రీ కన్యకాచిత్రమును నిందుఁ బ్రచురించుచున్నాము.

# శ్రీ శారదా నవరాత్ర మహోత్సవము

శ్రీ విద్యాశంకర పదపద్మారాధక శ్రీ విద్యాశంకర పదమాఽఽవేశప్రకాశిత జగద్గురు
శ్రీ కల్యాణానంద భారతీ మహంతాచార్య స్వాములవారు — గుంటూరు

## శ్రీ దుర్గాదేవ్యారాధనము

శ్రుతిః :- తా మగ్నివర్ణాం తపసా జ్వలన్తీం వైరోచనీమ్ కర్మఫలేషు జుష్టాం। దుర్గాం దేవీం శరణ మహం ప్రపద్యే సుతరసి తరసే నమః॥

శ్లో॥ ప్రథమం శైలపుత్రీతి ద్వితీయం బ్రహ్మచారిణీ।
తృతీయం చన్ద్రఘణ్టేతి కూష్మాణ్డేతి చతుర్థకమ్॥
పఞ్చమం స్కందమాతేతి షష్ఠం కాత్యాయనీతి చ।
సప్తమం కాలరాత్రిశ్చ మహాగౌరీతి చాష్టమమ్॥
నవమం సిద్ధిదా ప్రోక్తా నవదుర్గాః ప్రకీర్తితాః।
ఉక్తా న్యేతాని నామాని బ్రహ్మణైవ మహాత్మనా॥
సర్వమంగలమాంగల్యే శివే సర్వార్థసాధికే।
శరణ్యే త్ర్యంబకే దేవి నారాయణి నమోఽస్తు తే॥

ఆసేతుశీతనగవ్యాప్తమగు నార్యావర్తమనెడి భారత వర్షమున ననాదికాలమునుండి నేటివఱకును వైదికధర్మాను వర్తులగుఁ జాతుర్వర్ణ్యజనము వారిచేతను బ్రతివత్సరము నందు నాశ్వయుజ శుక్లప్రతిపత్తుమొదలు విజయదశమి వఱకును ననగా పాడ్యమి మొదలు నవమితోఁ గూడిన దివసములందు శరన్నవరాత్రమహోత్సవము లేక శారదా నవరాత్రమహోత్సవమని సుప్రసిద్ధముగ నందఱచేఁ బ్రస్తుతింపఁబడునట్టి మహోత్సవము ప్రాజ్ఞులందఱచేతను నాచరింపఁబడుచుండుట నెల్లఱకు సర్వవిధములఁ దెలిసిన విషయమే. ఇట్టి మహోత్సవమును శ్రీయాగమనియు దేవీయాగమనియు చండీయాగమనియు నంబాయజ్ఞమనియు బవిత్రనామములచే సామాన్యముగఁ జెప్పుకొనుచుందురు వాస్తవముగఁ జెప్పినచో నీ మహోత్సవమును శ్రీదుర్గాదేవియాగమనికాని శ్రీదుర్గాదేవ్యారాధనమనికాని చెప్పవలయును. అనగా నీ మహోత్సవ మొక యాగమనియు నద్దానిచే శ్రీదుర్గాదేవి యారాధింపఁబడుననియు సుస్పష్టముగఁ దెలియవచ్చెడిని. యాగమన్నను యజ్ఞమన్నను ఆరాధనమన్నను మూడునామములు నొకే విధానమును సూచింపు పదములే. అట్టి విధానముచే శ్రీదేవి సంతుష్టినిఁ జెంది యజ్వయగు సాధకుఁడను నుపాసకునకు నభీష్టఫలము నొసంగును. అట్టి ఫలవిశేషములాయాగము నాచరించువానియొక్క కామమనఁ గోరిక ననుసరించి యుండు. కామభేదముచే యాగవిశేషమునందుఁ గొన్ని విశేషములుండుటచే యాగమనునది సర్వసామాన్యమగు విధానమైనను అందు కామనావైచిత్ర్యముచే నచ్చటచ్చట విశేషములందు విశేషము గన్పట్టుచుండును. అట్టి విశేషములు శాస్త్రైకసమధిగమ్యములన శాస్త్రముచే నుపదేశింపఁబడినవేయై యుండవలయును గాని పురుషబుద్ధిచే నిచ్చవచ్చినటులఁ గల్పితమంత్రములు గాకూడదు. అట్టి పురుషబుద్ధిప్రకల్పితము లజ్ఞదృష్టి కెంతవినోదముగఁ దెలియవచ్చుచున్నను నభీష్టసిద్ధికి ప్రతిబంధకములే యగునని నిస్సందియముగఁ జెప్పనగును. కావున నిచట శాస్త్రైకసమధిగమ్యములగు విషయములే సంక్షేపముగ నుదాహరింపఁబడును. అద్దాని వలన సకలజనులును నీమహోత్సవపుటతిశయము తెలిసికొని ప్రయోజనమును బడయఁగలరు.

## నవరాత్ర మనెడి శబ్దపు టర్థము

నవరాత్రమనఁగాఁ బవిత్రమైన దివసము అన రోజు అని యర్థము. నవరాత్రశబ్దము "నవ" "రాత్ర" అను రెండు శబ్దములతోఁగూడిన సమాసపదము. ఇందు "నవ" యనునది సంఖ్యావాచకము— తొమ్మిది యను నర్థముతో నొప్పునది. రాత్రమనగా రాత్రి యన పగటికంటె విలక్షణమగు స్వభావముతో నొప్పు గాలవిశేషము. 'పగలు' 'రాత్రి' లేదా 'అహసు' 'రాత్రి' యని విరుద్ధధర్మములతో నొప్పు గాలవిశేషబోధకము, 'దివసము' 'దినము' అను పదములు అహోరాత్రములనువానితో నొప్పునవని యర్థము. 'నవరాత్ర' మన్నచో యందలి నవశబ్దమునకుఁ దొమ్మిది యని గాని, 'రాత్ర' శబ్దమునకు రాత్రి యని గాని యర్థ మెంతమాత్రమును జెప్ప వీలులేక నర్థాంతరముతో నొప్పు పదముగా నలరారుచున్నది. "దిక్సంఖ్యే సంజ్ఞాయామ్" అను పాణిని సూత్రముచే దిగ్వాచక శబ్దముతోఁ గాని సంఖ్యావాచకశబ్దముతోఁ గాని సమాసము చేయఁబడిన నామవాచక మొక సంజ్ఞాపదముగా నొప్పునట్టి లాక్షణిక పదమని చెప్పఁబడును. అటుల నీ నవరాత్ర మనుపదము సంజ్ఞావాచక మగుచు లాక్షణికపదమని చెప్పఁబడుచు 'పరమ పవిత్ర దినము' అను నర్థముతో నలరారుచున్నటుల వ్యాకరణవిద్వాంసులు సుకరముగ గ్రహింపగలరు.

## నవరాత్ర మహోత్సవము

నవరాత్ర మహోత్సవమనఁ బవిత్రదివసములయందుఁ జేయఁబడు మహోత్సవమని యర్థము. ప్రస్తుతమున శ్రీశారదా నవరాత్ర మహోత్సవ మనిన శరత్కాలము

నందు శ్రీ శారదాదేవియొక్క యారాధన విశేషముతో నొప్పు పవిత్ర దివసములతో నొప్పు మహోత్సవ మని పర్థము. అట్టి పవిత్రదివసములు ఎన్ని యనిన— ఆశ్వయుజ శుక్ల ప్రతిపత్తు మొదలుకొని యెనిమిదిగాని తొమ్మిది గాని పది గాని లేక పదునాలుగు గాని పదునైదు గాని పదియారు గాని కావచ్చును. అదెట్టులనిన ప్రతిపత్తున మహోత్సవమును ప్రారంభము సేసి నవమియందు ముగించువారలకు తిథులయొక్క నమ వృద్ధి హ్రాసములను బట్టి తొమ్మిది గాని పది గాని యెనిమిది గాని దివసములు గావచ్చును. అటులనే పూర్ణిమయందు ముగించువారలకు పదునైదు గాని పదారు గాని పదునాలుగు గాని కావచ్చును. ప్రకృతపు మన్మథ సంవత్సరమున చతుర్థీ (చవితి) తిది యొక్క వృద్ధిచే ననగా—బుధవార గురువారములు రెండును చతుర్థీ తిథి ప్రయుక్తములే యగుటచే నవమితోఁ గూడిన నవరాత్రములు పదియును— పూర్ణిమతోఁగూడిన నవరాత్రములు పదునారును అగుచున్నవి. కావున నవరాత్రములన తొమ్మిదిరాత్రులని కాని తొమ్మిది దివసము లని కాని యర్థ మెంతమాత్రమును జెప్పగూడదు. అటుఁ జెప్పుట యజ్ఞానిజన విలసితము.

## మహోత్సవ విశేషములు

ప్రస్తుతమున నాశ్వయుజమునందు జరుపఁబడు మహోత్సవములు సామాన్యముగ శ్రీ దుర్గా దేవీ మహోత్సవములని చెప్పఁబడుచున్నవి. విశేషించి చెప్పినచో నొకప్పుడు శ్రీదేవీ మహోత్సవములు, దుర్గాదేవీ మహోత్సవములు అని చెప్పఁబడవచ్చును. శ్రీదేవి, దుర్గాదేవి యను విశేషములకు 'శారద' యను సామాన్యవ్యవహారముండుట వలన శారదా నవరాత్రము లనియు జెప్పఁబడుచున్నవి. శారదానవరాత్రములను నామముచే శరత్కాలము శారదాదేవతయుఁ గూడ సూచింపఁ బడుటచే నానామము సర్వసామాన్యముగ వాడఁబడుచున్నది.

ఇటులనే వసంత నవరాత్ర మహోత్సవ మని చైత్ర శుక్ల ప్రతిపత్తు మొదలుకొని శ్రీరామనవమితోఁ గూడిన దివసములందు నొక నవరాత్రమహోత్సవము సామాన్యముగా జరుపఁ బడుచుండును. అయ్యదిఁ గూడ పూర్ణిమతోఁ గూడిన దివసములందు విశేషముగను జరుపఁ బడును. అటులనే వైశాఖ మాసమునందుఁ గూడ శుక్ల ప్రతిపత్తు మొదలుగాఁ గల్గి పూర్ణిమతోఁ గూడిన దివసములందు బ్రహ్మర్షి నవరాత్రములు జరుపఁ బడుచుండును. అటులనే శ్రావణ పూర్ణిమ మొదలు కృష్ణాష్టమితోఁ గూడిన దివసములందు హయగ్రీవ నవరాత్రము - లొనరించఁ బడును. అటులనే భాద్రపద శుక్ల చతుర్థి మొదలు పూర్ణిమ వఱకును గణపతి నవరాత్ర మహోత్సవము జరుపఁ బడును. శ్రీకృష్ణాష్టమి మొదలు అమావాస్య వఱకు శ్రీకృష్ణనవరాత్రములు.

ఇట్లు నవరాత్రములను పవిత్రదివసములు పలువిధముల దెలియవచ్చుచున్నను వసంతఋతువునందలి శ్రీరామనవరాత్రములు, బ్రహ్మర్షినవరాత్రములు, శరదృతువునందలి శారదానవరాత్రములు సుప్రసిద్ధములై యున్నవి. అందు శారదానవరాత్రము లన్ననో యెక్కడ నతిశయముతో బ్రాహ్మణ శ్రేష్ఠులచేతను రాజాధిరాజ మహారాజులగు క్షత్రియుల చేతను బరమప్రామాణ్యముచే నాచరింపఁ బడుచున్నవి. అర్థాత్తు వైశ్యులచేతను, అధికారపదవుల నొందిన శూద్రప్రభువులచేతను గూడ నాచరింపఁ బడుచున్నవి. అవ్వాని విశేషము జిజ్ఞాసువుల యుపయోగమునకై సామాన్యముగను విశేషముగను సంక్షేపముగ వివరింపఁబడుచున్నది.

## ఆరాధింపఁబడు దేవతావిశేషము

శారదా నవరాత్రములందు నర్చనీయమగు దేవతావిశేషము శారద యని సామాన్యముగ నిర్వచింపఁబడుచున్నను శ్రీదేవి యనియు దుర్గాదేవి యనియు విశేష నామములచేఁ బేర్కొనఁబడి విశేషారాధనములతో నొప్పారుచున్నది. దుర్గాదేవిని మహామాయా యనియు, శివా యనియుఁ జండిక యనియు మూడు పవిత్రనామములచే బుధులు వ్యవహరింపుచుందురు.—'శ్రీమహామాయా శివా చండిక' యను నామము దేవతావిశేషము యొక్క నిరతిశయఖ్యాపకము. ఇఁక శ్రీదేవి యన్ననో 'శ్రీగుణనిక' యను శ్రీరహస్యనామములచే బోధింపఁబడుచు భక్తుల యొక్క ప్రేమాతిశయముచే సుకరముగ శ్రీ లలితాంబిక యనియు, మహాకామేశ్వరి యనియు రాజరాజేశ్వరి యనియు, ప్రతాపభారతి యనియుఁ జెప్పఁబడుచు "భారతి" యను నామముచే సుప్రసిద్ధముగఁ బేర్కొనఁ బడుచున్నది. ఈ శ్రీదుర్గాదేవీ మాహాత్మ్యాతిశయమును బ్రతిపాదించు గ్రంథరాజము శ్రీదేవీభాగవతమను పురాణ రాజము - గ్రంథవిస్తరభీతిచేఁ జదువుటకును గాని తెలిసికొనుటకుఁ గాని యవకాశము లేని మంద ప్రజ్ఞులకు "శ్రీదేవీ మాహాత్మ్యము", "శ్రీ లలితోపాఖ్యానము" అను రెండు గ్రంథములు ప్రయోజనకరములు. అందు శ్రీదేవీ మాహాత్మ్య మగ్రగణ్యము. ఈ గ్రంథరాజమునకు శ్రీదేవీ సప్తశతి యనియు శ్రీచండీ సప్తశతి యనియుఁ గూడ ప్రసిద్ధి గలదు. 'శ్రీగుణనిక' యను శ్రీరహస్య నామమునకు శ్రీలలితా సహస్రనామస్తోత్రమను వ్యవహారము నెల్లరకును దెలిసిన విషయమే. శ్రీ దేవీరహస్యనామస్తోత్రమును శ్రీ దేవీమహాత్మ్యమును, శ్రీ సప్తశతీస్తోత్రమును, శ్రీ శారదా

నవరాత్రారాధనమునందు న్గ్రస్థానమును వహించి పరమ ప్రమాణములుగ నలరారు చున్నవి.

### ఆరాధనా విశేషములు

శ్రీ శారదా నవరాత్రములందు జరుపఁబడు యుత్తమ మహోత్సవము (౧) శ్రీయాగము, (౨) దేవీయజ్ఞ మను పేర్లతోఁ బరగు రెండు విధానములతో నొప్పుచున్నది. సర్వ సామాన్యముగ రెండును అంబాయజ్ఞములే యని చెప్పఁ బడును. కాని శ్రీయాగమునకు శ్రీలలితాంబా యాగ మనియు దేవీయజ్ఞమునకు శ్రీచండికాంబా యాగము (చండీయాగము) అనియు విశేష వ్యవహారము. అవ్వాని క్రమవిశేష మొకింత సంక్షేపముగఁ బ్రదర్శింపఁ బడు చున్నది.

### శ్రీయాగము - శ్రీలలితాంబా యాగము.

శ్రీయాగమునకు శ్రీచక్రార్చనము లేక శ్రీచక్రారాధనము అని సామాన్యపు వ్యవహారము. ఇట్టి యాగమునకు జగద్గురు శ్రీ కల్యాణానంద భారతీ మాంతాచార్య స్వాముల వారిచే రచింపఁబడి ప్రకటింపఁబడి శ్రీవిద్యోపాసకులందుఁ బ్రామాణ్యభావముతో నలరారుచున్న "శ్రీయాగసూత్ర" మను గ్రంథరాజము పరమప్రమాణము. శ్రీచక్రార్చన మన నర్థగాంభీర్యము చక్ర శబ్దార్థ విశేషముచేఁ బరగుచున్నది. చక్ర మన సమూహ మని సామాన్యార్థము. శ్రీచక్రమన శ్రీసమూహమని యర్థము. శ్రీశబ్దమునకు (౧) దేవత (౨) ఉపాసకులు (3) కుమారి (౪) సువాసిని (౫) విప్రుఁడన వేదమూర్తి యగు బ్రాహ్మణుఁడు. (౬) యంత్ర విశేషము (౭) గురువు (౮) సామయికుఁడు అను నెనిమిది యర్థములు, సర్వసామాన్యముగ గ్రహింపఁబడు చున్నవి. అట్టి యర్థములకుఁ జక్రపదమును జేర్చినచో నాయాయి సమూహము లని యెనిమిది విశేషములు దెలియ వచ్చుచున్నవి. ఇట్టి యెనిమిది విశేషముల యొక్క యర్చనమన నారాధనము. చోదితమగు విధిప్రకారమునఁ గల్పోక్తముగ నాచరించుటయే శ్రీచక్రార్చన మనఁబడును. ప్రకృతమున నిర్వచింపఁబడినట్టి యెనిమిది విశేషములను సంగ్రహముగ వివరింపఁ బడుచున్నవి.

౧. **శ్రీదేవత :** శ్రీదేవత యను దేవతావిశేషపు టతిశయము శ్రీగుణనిక యను రహస్యనామస్తోత్రముచే సహస్రముఖముల నిర్వచింపఁబడి యున్నది. అందు శ్రీ। మాతా। శ్రీ। మహః। రాజ్ఞీ। శ్రీమత్సింహాసనా। ఈశ్వరీ। చిదగ్నికుండ సంభూతా। దేవకార్య సముద్యతా యను మొట్టమొదటి తొమ్మిది నామములచే నుపదేశింపఁబడి నట్టిది పరబ్రహ్మస్వరూపిణి లేక పరబ్రహ్మశక్తి యను పరదేవత యని తెలియవచ్చెడిని. ఇయ్యదియే యీపరి దృశ్యమానమగు జగత్తు యొక్క సృష్టిస్థితిలయకారణ మగు మహామాయాశక్తి. ఈమెయొక్క పవిత్రతమంబగు నామము "శివకామేశ్వరాఙ్కస్థా శివా స్వాధీనవల్లభా" యను గీతమునందలి "శివా" యను నామముచే నుపదేశింపఁ బడుచున్నది. అటులనే "అపర్ణా చణ్డికా చణ్డ ముణ్డాసురనిషూదినీ" యను గీతమున "చణ్డికా" యను నామముచే నుపదేశింపఁబడుచున్నది. అటులనే "మహామాయా మహాసత్త్వా మహాశక్తి ర్మహారతిః" అను గీతముచే 'మహామాయ' యనియు 'మహాశక్తి' యనియు నిర్వచింపఁబడుచున్న 'మహామాయ' యే పరబ్రహ్మ యొక్క మాయ యనియు, 'మహాశక్తి' యన పరబ్రహ్మయొక్కశక్తి యనియు నర్థవిశేషము ఈ పరదేవతయొక్క యతిశయవిశేషఖ్యాపనమునకై "శ్రీ దేవీ భాగవతము" ప్రవర్తింపుచున్నది. వేయేల! ఈ పరదేవతయొక్క పుష్కలమగు ననుగ్రహమును భక్తులగు సాధకులు సర్వవిధములఁ బడయ "శ్రీ దేవీసప్తశతి" యను ప్రసిద్ధిని గాంచియున్న మూడు చరిత్రములతోఁ గూడిన తొమ్మిది యధ్యాయముల గ్రంథరాజము ముల్లోకములందును బ్రకాశింపుచున్నది. ఇట్టి పరదేవతాస్వరూపము "సహస్రశీర్షవదనా సహస్రాక్షీ సహస్రపాత్" అను గీతముచేతను, "సహస్రశీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్ సభూమిం విశ్వతో వృత్వా అత్యతిష్ఠ ద్దశాఙ్గులమ్" అను శ్రుతిచేతను నుపదేశింపఁబడు 'సకలలోకవ్యాప్త' మగు రూపముతో నొప్పుచుండుట వలన సకలదేవతాసమూహరూపమే యగుచు 'శ్రీచక్ర'మని బుధులచేఁ గొనియాడఁబడుచున్నది.

౨. **ఉపాసకులు :** ఉపాసకులన శ్రీవిద్యోపాసకులను సార్థకనామముచే నొప్పారు ద్విజశ్రేష్ఠులు. పురుషులు స్త్రీలును గూడ. అట్టివారలు (1) దీక్షితులు, (2) పూర్ణదీక్షితులు, (3) ఆచార్యపురుషులు అని మూడు విధములు. అందు నాచార్యపురుషులు, యతులు తదితరులగు బ్రహ్మచారులు, గృహస్థులు వానప్రస్థులని నాలుగు విధములు. స్త్రీ లన్ననో దీక్షితలు, పూర్ణదీక్షితలని రెండువిధములు స్త్రీలకు నుపదేశాధికారము లేదుఁ గావున నాచార్యస్త్రీ లను స్త్రీగణమునకు నవకాశము లేదు. ఉపదేశాధికారము స్త్రీలకు నెట్టుల నిషిద్ధమో యటులనే తురీయాశ్రమము గూడను సర్వవిధముల నిషిద్ధమే. అనుపనీతునకుఁ గర్మ యందెట్టి యధికారము లేనటులనే యవివాహితలకుఁ గూడ నెట్టి యధికారము లేకపోవుటచే ననుపనీతులగు పురుషులకును నవివాహితలగు స్త్రీలకును శ్రీవిద్యయందెంతమాత్రము నధికారము లేదు. ఇఁక శూద్రులును ద్విజబంధువులును స్త్రీసములుగ ధర్మప్రవర్తకులచే నిర్ణ

...ంప బడుటచే షాడ్రుణు గూడ ఋతువులు పూర్ణా ...తు ల.. రెండు విధములగు నదికారమునకు నర్హులు. అయ్యాదియును స్త్రీలవలెనే వివాహానంతరమే కలుగును. అయ్యాదియు సచ్ఛూద్రవిషయము. శ్రీవిద్యోపాసకుడు శాస్త్రదృష్టిచే శ్రీవిద్యాస్వరూపమే కావున శ్రీవిద్యోపాసక సమూహము గూడ శ్రీచక్రశబ్దముచే సూచింపఁబడు నని శిష్టులగు బుధుల సమ్మతి.

3. కుమారి : కుమారి యని బాల యని గూడ వ్యవహారము. బాల లేక కుమారి యన రెండు సంవత్స రముల వయస్సుతోఁ గూడిన బాలిక మొదలు పది సంవ త్సరముల వయస్సుతోఁ గూడిన బాలికవరకుఁ గల తొమ్మిది విధములగు బాలికలును శ్రీదేవీస్వరూపులే యని "బంధూక కుసుమ ప్రఖ్యా బాలా లీలావినోదినీ" యను గీతముచే నుపదేశింపఁబడుచున్నది. ఇట్టి తొమ్మిది విధ ములగు బాలికలకును బ్రత్యేక ప్రత్యేకముగాఁ బవిత్ర నామము లర్చన యందలి వినియోగమున కిట్లుపదేశింపఁ బడియున్నవి—అదెట్లనిన.

(1) ద్వివర్ష—కౌమారీ (2) త్రివర్ష—త్రిపురా (3) చతుర్వర్ష—కల్యాణీ (4) పఞ్చవర్ష—కామాక్షీ (5) షష్ఠ వర్ష—కాళీ (6) సప్తవర్ష—చణ్డికా (7) అష్టవర్ష—శామ్భవీ (8) నవవర్ష—సుభద్రా (9) దశవర్ష—దుర్గా ఇచట కౌమారి మొదలుగాఁ గల్గి సుభద్ర యంతముగాఁ గల తొమ్మిది దేవతలును ప్రత్యేక ప్రత్యేకముగా 'నవ దుర్గ' లనియే చెప్పఁబడుచు 'నవదుర్గ' లెందరని ప్రశ్నింపఁ దొమ్మండుగు రని చెప్పఁబడుదురు. ఇచట 'నవదుర్గా' శబ్దము గూడ 'నవరాత్ర' శబ్దమట్లు సంజ్ఞా వాచకమే. అట్టి యభిప్రాయము సువిదితము గాగ నీ నవదుర్గ లను ప్రత్యేకముగా నావాహనముఁ జేయునప్పు డుపయోగింపఁ బడు సామాన్యమంత్రమును బరిశీలించి నచో సువ్యక్తమగును. అదెద్ది యన.

"మంత్రాక్షరమయీం లక్ష్మీం మాతృకారూపధారిణీం,
నవదుర్గాత్మికాం సాక్షాత్కన్యా మావాహయా మ్యహమ్"

అని. ఇట్టి సామాన్య మంత్రముతోఁ గూడ నొక్కొక మంత్రము ప్రత్యేక ప్రత్యేకముగ నుపయోగింపఁ బడును. అట్టి మంత్రములు ప్రత్యేకముగాఁ గలవు. గ్రంథవిస్తర భీతిచే విరమింపఁ బడినది.

౪. సువాసిని : దీక్షిత యగు సువాసిని గూడ దీక్షి తుని వలె శ్రీదేవియొక్క ప్రత్యక్ష స్వరూపయే యని "సుమఙ్గలీ సుఖకరీ సువేషాఢ్యా సువాసినీ" యను గీత ముచే నుపదేశింపఁ బడుచున్నది. అట్టి సువాసినుల నర్చించుటచే శ్రీదేవిని పూజించుటే యని "సువాసిన్య ర్చనప్రీతా శోభనా శుద్ధమానసా" యను గీతముచే నుప దేశింపఁ బడుచున్నది. శ్రీ దుర్గాదేవి యాగమున కుమా ర్యర్చన మగ్రగణ్యముగా విధింపఁ బడుచున్నది. అటు లనే సువాసిన్యర్చనము చూత సవశ్యకర్తవ్యముగా నుప దేశింపఁ బడుచున్నది. శిష్టాచారకోవిదులకు నిది యొక వింత గాదు.

౫. విప్రుఁడు : విప్రుఁడు గూడ శ్రీదేవీస్వరూపమే యని "విప్రప్రియా విప్రరూపా విశ్వభ్రమణకారిణీ" యను గీతముచే నుపదేశింపఁ బడుచున్నది.

౬. యంత్రవిశేషము : "శ్రీచక్రరాజనిలయా శ్రీమత్త్రిపురసున్దరీ" యను గీతముచేఁ ద్రిపురసుందరి యగు శ్రీదేవి శ్రీచక్రరాజము నిలయము నివాసస్థానముగాఁ గల్గియున్నదని వినవచ్చుచున్నది. ఇదివఱకు 'శ్రీచక్ర' మను పదమునకు సామాన్యములగు నర్థములు ఎనిమిది యని నిర్వచింపఁబడినది. అందు యంత్రవిశేషమని చెప్పఁబడిన విశేషము 'రాజ' శబ్ద విశేషముచే నవగత మగుచు, అట్టి శ్రీచక్రరాజము—"బిందుత్రికోణవసుకోణ దశారయుగ్మమన్వస్ర నాగదళషోడశారం వృత్తత్రయం ధరణీ సదన త్రయమ్చ శ్రీచక్రమేత దుదితం పరదేవ తాయాః" అను శిష్టోక్తివలనఁ దెలియవచ్చెడు యంత్ర రాజమని సుప్రసిద్ధముగ నెల్లరకును దెసిన విషయమే. ఈ శ్రీచక్రరాజమే శ్రీయాగమునందు నర్వవిధముల ప్రధా నవిశేషముగా నొప్పుచు నగ్రగణ్యముగా నలరారుచున్నది. శ్రీచక్రరాజార్చనమే శ్రీయాగమని యొక విశేషముగఁ జెప్ప నక్కరలేదు. సకలజనవిదితము.

౭. గురువు : శ్రీవిద్యోపదేష్టలగు గురువులు సాక్షాత్తు శ్రీదేవీ స్వరూపులే యని—"సమ్ప్రదాయేశ్వరీ సాధ్వీ గురుమండలరూపిణీ" యను గీతముచే నుపదేశింపఁ బడుచున్నది.

౮. సామయికుఁడు : గురు మంత్ర దేవతలకుఁ గల నవినాభావ సంబంధము సమయ మనఁబడును. అట్టి గురు మంత్ర దేవతలను దనతోఁ దుల్యముగాఁ గలవాఁడు సామయికుఁ డనఁబడును. అట్టి సామయికుఁడు నర్వ విధములఁ దనతోఁ దుల్యమగు నాత్మతో నొప్పుచుండుటచేఁ దనతో పాటు సామయికుఁడు గూడ శ్రీదేవీస్వరూపుడే. కావున సామయికుల సమూహము గూడ శ్రీచక్ర స్వరూపమే.

ఇట్టి ఎనిమిది శ్రీచక్రములతో నొప్పు యాగవిశేషము శ్రీయాగమని బుధులచేఁ జెప్పఁబడుచున్నది.

ప్రకృతమునందు నిర్వచింపఁబడిన శ్రీయాగసూత్ర విధానము నర్వజనసామాన్యము గాక విశేషవిధానముగ నలరారుచున్నది. రెండవది యగు చండికాంబా -

యాగము - చండీయాగము - సుప్రసిద్ధముగ నెల్లరచే నాచరింపఁబడుచు శిష్టసమ్మతమగు నిర్ణయసింధువు, ధర్మసింధువు మొదలుగాఁ గల నిబన్ధనగ్రంథములచే నొకింత సంగ్రహముగఁ బ్రదర్శింపఁబడి విశేషగ్రంథ ములచేఁ బలువిధములుగఁ బ్రదర్శింపఁబడి యున్నది. అద్దానియొక్క విశేషము ధర్మసింధువునందు నిర్వచింపఁ బడిన విశేషమును యథోచితముగను మాచేఁ బ్రదర్శింపబడిన విధానమున కనుగుణంబుగను నొకింతఁ బ్రదర్శింపబడును.

## శ్రీ దేవీ నవరాత్రము

ధర్మసింధౌ—"ఆశ్విన శుక్ల ప్రతిపది దేవీసపర్యారంభః। నవరాత్రశబ్దః ఆశ్వినశుక్లప్రతిపద మారభ్య మహానవమీపర్యన్తం క్రియమాణ కర్మనామధేయం। తత్ర కర్మణి పూజైవ ప్రధానం। ఉపవాసాదికం స్తోత్రజపాదికం చాఙ్గమ్। తథా చ యథాకులాచార ముపవాసైకభక్త నక్తాయాచితాన్యతమ వ్రత యుక్తం యథాకులాచారం "సప్తశతీం లక్ష్మీహృదయాది స్తోత్ర జప సహితం ప్రతిపదాది నవమ్యన్త నవతిథ్యధికరణక పూజాఖ్యం కర్మ నవరాత్ర శబ్ద వాచ్యమ్ ॥ పూజాప్రాధాన్యోక్తేరేవ క్వచిత్కులే జపోపవాసాది నియమస్య వ్యతిరేక ఉపలభ్యతే। పూజాయాస్తు న క్వాపి కులే నవరాత్రకర్మణ్యభావో దృశ్యతే ॥

నవరాత్రారంభః ॥ నచ నవరాత్రారంభః సూర్యోదయోత్తరం త్రిముహూర్తవ్యాపిన్యాం ప్రతిపది కార్యః తత్ర సూర్యోదయోత్తరం దశఘటీమధ్యే తత్రాసంభవే మధ్యాహ్నే౽భిజిన్ముహూర్తే ప్రారంభః కార్యః, న త్వపరాహ్ణే ॥ అత్ర కర్మణి బ్రాహ్మణాది చాతుర్వర్ణ్యస్య మ్లేచ్ఛాదే శ్చాధికారః ॥

## పూజాద్యధికారః

తత్ర విప్రైః జపహోమాన్నబలినైవేద్యైః సాత్త్వికీ పూజా కార్యా। నైవేద్యైశ్చ నిరామిషైః। మద్యం దత్వా బ్రాహ్మణస్తు బ్రాహ్మణ్యాదేవ హీయతే। "మద్య మపేయ మదేయ" మిత్యాది నిషేధా న్మాంస మద్యాది యుత రాజసపూజాయాం బ్రాహ్మణస్య మద్యపానే మరణాన్త ప్రాయశ్చిత్తోక్తేః। స్పర్శే తదంగచ్ఛేదోక్తే శ్చాల్పప్రాయశ్చిత్తేన దోషాపగమేన పాతిత్యాపాతాత్। ఇత్థమేవ సర్వే ప్రాచీనా నవీనాశ్చ నిబంధకారా నిర్బంధేన లిఖన్తి। క్షత్రియవైశ్యయో ర్మాంసాది యుత జపహోమసహిత రాజస పూజాయా మప్యధికారః। నిష్కామక్షత్రియాదేః సాత్త్వికపూజాకరణే మోక్షాదిఫలాతిశయః ॥ ఏవం శూద్రాదేరపి ॥ అథ నవరాత్రే౽నుకల్పాః ॥

**అనుకల్పాః॥**— తృతీయాది నవమ్యన్తం సప్తరాత్రం వా కర్తవ్యం। పంచమ్యాది పంచరాత్రం వా సప్తమ్యాది త్రిరాత్రం వా। ఏకాహపక్షే కేవలాష్టమ్యాం కేవలనవమ్యాం వా। నవరాత్రాది పక్షేషు క్షయవృద్ధివశేన దినాధిక్య న్యూనత్వే పూజాద్యావృత్తిః కార్యా। ఇదం దేవీపూజాత్మకం నవరాత్రకర్మ నిత్యం। అకరణే దోషశ్రవణాత్ఫలశ్రవణాత్కామ్యం చ ॥

## నవరాత్రే కర్తవ్యాని

అత్ర నవరాత్రే కలశస్థాపనం। ప్రాత ర్మధ్యాహ్నే ప్రదోషకాలే చేతి త్రికాలం ద్వికాల మేకకాలం వా దేవతాపూజనమ్. సప్తశత్యాది జపో౽ఖణ్డదీపః ఆచారప్రాప్త మాలాబన్ధనం ఉపవాస నక్తైకభక్తాది నియమః కుమారీ పూజన భోజనాది సువాసిన్యర్చనాభోజనాది అన్తే సప్తశత్యాది స్తోత్ర మన్త్రహోమాది ఇత్యేతాని విహితాని। ఇదం కలశస్థాపనం రాత్రౌ న కార్యమ్ ॥

## అథ సంక్షేపేణ ప్రయోగవిధిః

దీక్షితో యజమానః ప్రతిపది ప్రాతః శుభదినే వా సపత్నీక స్తిలతైలేన కృతాభ్యంగః స్నాత్వా కుంకుమ చన్దనాది కృత పుండ్రో ధృతపవిత్రః దశఘటికామధ్యే౽భిజిన్ముహూర్తే వా సంపూర్ణకలశహస్తో యాగమణ్టపం ప్రదక్షిణీకృత్య పశ్చిమద్వారేణ ప్రవిశ్య ఉపవిశ్య దేశకాలౌ సంకీర్త్య "మమ సకుటుంబస్యేహ జన్మ న్యముకదేవతాప్రీతిద్వారా సర్వాపచ్ఛాన్తిపూర్వక దీర్ఘాయు ర్విపుల ధనధాన్య పుత్ర పౌత్రాద్యనవచ్ఛిన్నసన్తతి స్థిరలక్ష్మీ కీర్తి లాభ శత్రుపరాజయ సదభీష్టసిద్ధి ప్రముఖ చతుర్విధ పురుషార్థ సిద్ధ్యర్థం - మ మాముక కార్యసిద్ధ్యర్థం వా-అద్యప్రభృతి మహానవమి పర్యంతం ప్రత్యహం త్రికాల మేకకాలం వా ముకదేవతా పూజా ముపవాస నక్తైకభక్తాన్యతమ నియమసహితా మఖండ దీపజ్వలనం కుమారీపూజనం చండీసప్తశతీపాఠం సువాసిన్యాది భోజన మిత్యాదిరూపం శారదా నవరాత్రోత్సవాఖ్యం కర్మ కరిష్యే। దేవతాపూజాంగత్వేన కలశస్థాపనం చ కరిష్యే॥ ఇతిసంకల్ప్య - తదంగతయా నిర్విఘ్నతాసిద్ధ్యర్థం - గణపతిపూజనం పుణ్యాహవాచనం మాతృకాపూజనం అఙ్కురారోపణం నాందీశ్రాద్ధ మాచార్యాది ఋత్విగ్వరణం చ కరిష్యే "ఇతి సంకల్ప్య - తా న్యాదౌ యథాక్రమం కృత్వా - ఆచార్యాదీన్వృత్వా తా న్యథావిభవం వస్త్రాదినా సంపూజయేత్ ॥

అథ మణ్డపశోధనార్థ - కల్పోక్తవిధినా మణ్డపాన్తరం సంప్రోక్ష్య - మండప సంస్కారం కృత్వా - ఋత్విగ్భిః సహాన్తః ప్రవిశ్య - కలశస్థాపనార్థ యథోచితస్థలం సంప్రోక్ష్య- తత్ర వారుణకలశం సంస్థాపయేత్ ॥

అథ తత్ర కలశౌ వరుణం సంపూజ్య, తత్కలశోపరి దేవతాయన్త్రం ప్రతిమాం వా ఉభయం వా సంస్థాప్య,

పూజయేత్ ॥ యద్వా స్వస్థానే ఏవ వా దేవతాయస్త్రిం ప్రతిమాం వోభయం వా ప్రత్యేకశః సంస్థాప్య, పూజయే ద్యథావిభవం యథాశక్త్యుపచారైః ॥ అథాఖణ్డదీపం ప్రతి ష్ఠాపయే న్నవా ॥ ఇతి ప్రథమదివసే విశేషకృత్యమ్ ॥ తత్ర దేవతాపూజా నిత్యైవ ॥ దేవతాపూజానన్తరం ప్రత్యహం కుమారీపూజా కర్తవ్యా ॥

## కు మా రీ పూ జా

ద్వివర్ష కన్యామారభ్య దశవర్షావధి కుమారీణాం క్రమేణ చ॥ కుమారికా త్రిమూర్తిః కల్యాణీ రోహిణీ కాలీ చణ్డికా శామ్భవీ దుర్గా భద్రేతి నామాని ॥ ఏకైకవృద్ధ్యా ప్రత్యహ మేకా వా కుమారీ పూజ్యా। ప్రత్యహం కుమారీణాం నవకపూజా బ్యుచ్ఛ్రయహేతురితి విజ్ఞాయతే ॥

## అథ చణ్డీపారాయణవిధిః

అథ ప్రాఙ్ముఖ ఉదఙ్ముఖో వా స్వాసనే ఉపవిశ్య। శ్రౌతాచమనం కృత్వా తత్త్వాచమనం కృత్వా। దేశకాల నామగోత్రాదికం స్మృత్వా। "మమ శ్రీ మహామాయా శివా చణ్డికా పరదేవతాప్రసాదేన సర్వాభీష్టఫలసిద్ధ్యర్థం— శ్రీ మహామాయా శివా చణ్డికా నవార్ణమంత్రాష్టోత్తరరశతజప కవచార్గల పూర్వకం శ్రీ చణ్డీ సప్తశతీస్తోత్ర మాలా మహా మన్త్ర పారాయణం యథా శక్తి కరిష్యే॥ ఇదిసంకల్ప్య— శిఖా మాబధ్య। భూతా నుత్సార్య। భైరవానుజ్ఞాం గృహీత్వా। త్రివిధవిఘ్నా నుత్సార్య దిగ్బంధనం కుర్యాత్ ॥ అథ భూతశుద్ధిస్వప్రాణ ప్రతిష్ఠాపనే గురూపదిష్టమార్గేణ కృత్వా న్తర్మాతృకాన్యాసం బహిర్మాతృకాన్యాసం చ కుర్యాత్ ॥ అథ ఋష్యాదిన్యాసపురఃసరం— శ్రీ మహామాయా శివా చణ్డికా పరదేవతానవార్ణమంత్రజప మష్టోత్తరశతం కృత్వా— దేవతాయై సమర్ప్య— శ్రీసప్తశతీస్తోత్ర మాలా మహామన్త్రస్య ఋష్యాదిన్యాసం కృత్వా దేవీం యథోక్తవిధానేన ధ్యాత్వా—శాపవిమోచనోత్కీలనే కుర్యాత్ ॥ అథ కవచార్గ లయోః పఠనం కుర్యాత్ ॥ అథ మార్కండేయ ఉవాచ— సావర్ణిః సూర్యతనయో యో మనుః కథ్యతే ఽష్టమః। నిశామయ తదుత్పత్తిం విస్తరా ద్గదతో మమ" ఇతి మంత్ర మారభ్య— "ఏవం దేవ్యా వరం లబ్ధ్వా సురథః క్షత్రియ ర్షభః। సూర్యా జ్జన్మ సమాసాద్య సావర్ణి ర్భవితా మనుః" ఇతి మన్త్రాన్తం గ్రన్థం మన్త్రార్థ మనుస్మర న్నేకవారం ద్వివారం త్రివారం వాథోయద్దిష్టం వా వారాణి పఠేత్ ॥

సప్తశతీవాచనే నియమాః ॥—హస్తే పుస్తకం న ధార యేత్। స్వయం బ్రాహ్మణభిన్నేన చ లిఖితం విఫలమ్। అధ్యాయం ప్రాప్య విరమే న్న తు మధ్యే కదాచన। కృతే విరామే మధ్యే తు అధ్యాయాది పఠే త్పునః। గ్రన్థార్థం బుధ్యమానః స్పష్టాక్షరం నాతిశీఘ్రం, నాతిమన్దం రసభావ స్వరయుతం వాచయేత్ ॥ అత్రాచారా ద్వ్యావృత్తపారాయణ మపి కార్యమ్ ॥

## అథ నవమ్యాం హోమాది

అథ నవమ్యాం పూజాం విధాయ హోమః కార్యః ॥ అథ బలిదానమ్ ॥ బ్రాహ్మణేన తు పశు మాంస మద్యాది బలిదానే బ్రాహ్మణ్యాద్భ్రష్టతే త్యుక్తం పూర్వమేవ ॥

శస్త్రాశ్వాదిపూజా ॥—

ప్రతిపదాది యావదష్టమీ లోహాభిసారికం కర్మ రాజ్ఞాం విహితమ్ ॥

అథ పారణావిసర్జనయోః కాలః ॥ తత్ర విసర్జనం దశమ్యాం కార్యం। యద్దినే విసర్జనం తత్రైవ నియమత్యా గస్యౌచిత్యాత్ విసర్జనోత్తరం తద్దినే ఏవ పారణం కార్యమ్.

## అపరాజితా శమీపూజనాది

తత్ర విజయదశమ్యాం అపరాజితాపూజనం సీమో ల్లంఘనం శమీపూజనం దేశాన్తరయాత్రార్థినాం ప్రస్థానం చ విహితమ్ ॥

ఆశ్వినస్య శుక్లాం దశమీ మేకాదశీం పూర్ణమాసీం వారభ్య ముహూర్తావశిష్టాయాం రాత్రౌ తీర్థాదౌ గత్వా ప్రత్యహం మాసపర్యన్తం కార్తికస్నానం కార్యమితి నవరా త్రోత్సవవిధిః ॥

## సప్తశతీపాఠగ్రన్థవిశేషములు

నవరాత్రోత్సవమునందు సప్తశతీమాలామన్త్రస్తోత్రగ్రంథ ములు ప్రకృతమునందుఁ బలుతావులందుఁ బలువిధము లుగ నన్యోన్యాప్రామాణ్యములుగ నలరారుచున్నవి. దానం జేసి యేగ్రంథము ప్రమాణము ఎద్దాని నాశ్రయింపవలయు నను నది యెల్లవారలకును నియతముగ గమనీయవిష యమే. అట్టి గ్రంథములలో నెద్దియో యొక గ్రంథ మును దురభిమానముతో గ్రహించి వ్యవహరించు నహం కారగ్రస్తుఁడు "అజ్ఞశ్చాశ్రద్దధానశ్చ సంశయాత్మా వినశ్యతి। నాయం లోకోస్తి న పరో న సుఖం సంశయా త్మనః" అను గీతాచార్య శాపము ననుసరించి వర్తించు దుష్టోపాసనములు సర్వథా భ్రంశముఁ జెంది నశించుట కించుకేనియు సందియము లేదు. కావున ప్రాజ్ఞులు నిర్దుష్టమగు విధానమును సర్వవిధములఁ దెలిసికొని నిర్దు ష్టమును పరమప్రమాణము నగు "శ్రీదేవీమాహత్మ్యము దుర్గాసప్తశతీ" యను గ్రంథరాజము జగద్గురు శ్రీ కల్యా ణానందభారతీ మాంతాచార్యస్వాములవారిచే నుపదేశింపఁ బడి శ్రీవేదాన్తపారీణ వ్యాకరణవిద్యాప్రవీణ శ్రీఓరుగంటి నీలకణ్ఠశాస్త్రిచేఁ బ్రకటింపఁజేయఁబడి యున్నది. అద్దాని

ప్రాజ్ఞులు గ్రహించి ప్రయోజనము నొంది యైహికాముష్మి కనిశ్శ్రేయసప్రయోజనములఁ బడయుదురుగాక!

## దేవతాప్రతిమ

పైన కల్పమునందు "వారుణకలశము" నందు దేవతాయంత్రమును గాని ప్రతిమను గాని లేక రెండిటిని గాని ప్రతిష్ఠించికాని లేక ప్రత్యేకముగాఁ గాని సంస్థాపన మును జేసి ప్రతిదినమును బూజింపవలయునని నిర్వ చింపఁబడినది. అట్లు బూజింపవలసిన ప్రతిమావిశేష మేతీరున నిర్మింపఁబడవలయు ననునది సర్వవిధముల సంశయగ్రస్తమే యగుచున్నదన నొకవింత యెంతమాత్ర మును గాదు. అట్టి ప్రతిమావిశేష మొక్క తీరునఁ జెప్పఁ బడకుండ మూఁడు విధములగు మూఁడు విగ్రహములు నిర్వచింపఁబడుచున్నవి. అందలి విశేషములన్నియు నే యే తెరంగులఁ బరగుచున్నను ఎల్లరకును బండితపామర సామాన్యముగఁ దెలియవచ్చెడి విబేదము హస్తసంఖ్య యందు, నసఁ జేతుల సంఖ్యయందు. అదెయ్యది యన— (1) అష్టభుజ యన నెనిమిది భుజములతో నొప్పునది. (2) దశభుజ యన పదిభుజములతో నొప్పునది. (3) అష్టా దశభుజ యనఁ బదునెనిమిది భుజములతో నొప్పునది. భుజములతోఁ బాటు హస్తములందలి యాయుధ విశేష ములయొక్క సంఖ్యయొక్కయు విశేషము అర్థసిద్ధమును పరిశీలితమును గూడ. కాని యీ మూఁడు విధములగు భిన్న విగ్రహములకు పవిత్రతమమగు శ్రీదేవీమాహాత్మ్యమునందు నించుకేనియును గతి లేదు. ఆ తీరుననే యా విగ్రహ ములకు వాచకములగు నామములకుఁ గూడ నని చెప్పి నచో గ్రంథద్రష్టలు విశ్వసింపక పోరు. అట్టి విషయ వైషమ్యము నటుంచి శ్రేయస్కాములకుఁ బూజనీయ విగ్రహవిశేషమును దెలిసికొనగలుగు గ్రంథవిశేషము నుదాహరింప నున్నారము. అయ్యదెద్దియన - రెండవ యధ్యాయమున పండ్రెండవ శ్లోకము మొదలు ముప్పది యవ శ్లోకమువరకుఁ గల పందొమ్మిది శ్లోకములు లేక మంత్రములు. అవ్వానియందుఁ దెలియవచ్చెడి విగ్రహ విశేషము చతుర్భుజ యని, యన నాలుగు భుజములతో నలరారుచున్న దివ్యశరీరమని ప్రాజ్ఞులు దెలిసికొందురు గాక! దేవతా యంత్ర విశేషములు॥—పూజయందు యంత్రమును బూజింప వలయుననియు జెప్పఁబడినఁ సంగతియే. అట్టి యంత్రస్వరూపమునందుఁగూడ విప్రతి పత్తులు గలవు. కారణము మృగ్యము. నియతమగు స్వరూపముతో నొప్పు యంత్రరాజమును గుర్తెరుంగకయో గుర్తెరింగినచో నద్దానియందుఁ బ్రామాణ్యము లేక పోవుటయో కారణమని చెప్పఁబడవలయును. అట్లు గ్రహించక వేరొకదానినిఁ బూజ్యభావముతో గ్రహించుటకుఁ గారణము పాపండభావము దక్క వేరొండు గానేరదు.

## పూజ్యతమమగు యంత్రరాజము

"శ్రీ చక్రరాజనిలయా శ్రీమత్త్రిపురసుందరీ" యను గీతముచే శ్రీచక్రరాజ మనునది యంత్రరాజమని నిర్వ చింపఁబడినది గదా! 'ఆరాధన' పత్రిక రెండవ సంచిక యందు భారతీతత్త్వమను వ్యాసాంతమున "తత్ర బిన్దు త్ర్యష్ట దళ దశ మన్వస్ర నాగస్వరదళవృత్తత్రయ భూపు రాత్మకం హి శ్రీచక్రమితి విజ్ఞాయతే" యని సంక్షేపముగ నుపదేశింపబడియున్నది—అని నిర్వచింపఁబడియున్నది. అద్దాని కనుబంధముగను ప్రకృతమున కనువుగను శ్రీ చక్రస్వరూప మొకింత ప్రదర్శింపఁబడుచున్నది. ఇది వఱకు యంత్రవిశేష మను శీర్షికతో వ్రాయఁబడిన విశేష మందు "బిందు త్రికోణ" యను శ్లోకముచే శ్రీచక్రస్వరూ పము నిర్వచింపఁబడినది. ప్రకృతము చక్రముయొక్క రేఖలచే భావితమగు విశేష మొకింత నిర్వచింపఁబడును. విశేషవిజ్ఞానము మాచే రచింపఁబడిన "బ్రహ్మకళ" యందలి యారవకళవలన గ్రహించునది.

"భావవ్యంజకం రేఖారూపం చక్రం" అను చక్రలక్షణ ముచే నభీష్టభావమును బోధించు రేఖలయొక్క సముదా యములేక స్వరూపము చక్ర మనియు యంత్ర మనియును జెప్పఁబడును. ఇట్టి భావము వ్యావహారికము పారమార్థిక మని రెండువిధములు. వ్యావహారికమన్ననో భూములు గ్రామములు, ఇండ్లు, త్రోవలు మొదలగు లౌకికవ్యవహా క మగు వస్తువిశేష జ్ఞాపకములు. పారమార్థిక మన్ననో శ్రుతి స్మృతి ప్రసిద్ధములగు నాయతనములు, కుండములు శాలలు, వేదికలు, దేవతాస్వరూపములు మొదలగు వాని విశేషములను బోధింపునవి. అట్టి రేఖావిశేషముల చక్కని నియమములతోడను విశేషములతోడను నొప్పుచ గణితశాస్త్ర ప్రసిద్ధములుగా నలరారుచున్నవి. అయ్యవి త్రికోణములు చతురశ్రములు లోనుగాఁగల కోణవిశే ములుగాను బిందువులు వృత్తములు లోనుగాఁగల కో రహితములగు విశేషములుగను బలువిధముల నలరార చున్నవి. అట్టి రేఖల సముదాయస్వరూపము చక్ర మన బడును. ప్రకృతము దేవతాస్వరూప జ్ఞాపక చక్రము లిచట గ్రహింపఁబడి శ్రీచక్ర విశేషరహస్య ముపదేశింపఁబడ చున్నది —చక్రములయొక్క వాచకములు వ్యావహారి పారమార్థికములందు నొకే తీరున నున్నట్లు దోచుచున్నన వాచ్యములందు సర్వవిధముల వైలక్షణ్యముతో నొప్పి యుండును. ప్రకృతమునఁ బారమార్థిక వాచ్యవాచ భావముతో సర్వవిధముల ప్రయోజనము గావున నట్టి నిర్ణయముచే నీ శ్రీచక్రమును వ్యక్తీకరించెదము. శ్రీచక్ర

మునఁ దెలియవచ్చెడి చక్రములయొక్క సంకేతపద ములు—(1) బిందువు (2) త్రికోణము (3) వసుకోణము (4) ప్రథమ దశకోణము (5) దశకోణము (6) మన్వ స్రమన చతుర్దశకోణము (7) వసుదళము (8) షోడశ దళము (9) వృత్తత్రయము (10) భూపురత్రయము.''

## శ్రీచక్రము నవావరణ యుతము

ఇచట నవావరణమను పదము నవరాత్రశబ్దమట్లు సంజ్ఞావాచకమగుచు శ్రీచక్రమునందు నావరణలను సంకే తముతోఁ బరగు ప్రతి యావరణమునకును సామాన్య నామమే యగుచు "దేవతా సమూహ" మను పవిత్రపు టర్థముతో నొప్పుచున్నది. ఇయ్యది మంత్రశాస్త్ర సంకేతము, దేవతా స్వరూప ప్రతీకములగు చక్రము లన్నిటియందు నర్చనాకాలమునఁ బ్రధానదేవతార్చనము ఆవరణదేవతార్చ నమని సుప్రసిద్ధముగఁ దెలియవచ్చుచున్నది. అట్టి విశే షమువలన నావరణమన దేవతాసమూహమని యర్థము, గాని చుట్టు గోడలుగ భావింపఁబడు సరిహద్దు సూచకము లెంతమాత్రమును గావు అట్టి సరిహద్దులను సూచింపు నావరణ చక్రముల శ్రీచక్రము లెంతమాత్రము నుండక మహద్వైలక్షణ్యముతో నొప్పుచు దేవతాస్థాన సూచకము లగుచున్నవి. ప్రధానదేవతాస్థానముగఁ బ్రతి చక్రపుమధ్య నొకే బిందువు ప్రదర్శింపబడియుండుట సర్వచక్రముల కును సమానన్యాయమే. ఇక ఆవరణదేవతలను సూచింపు చక్రములకుఁ గోణములని ప్రత్యేక సంకేతము. అట్టి 'కోణ' మను నామముతో నొప్పారు చక్రములు (1) త్రికోణము (2) వసుకోణము (3) దశకోణము (4) రెండవ దశకోణము (5) చతుర్దశకోణము—అను యైదు చక్రములు గలవు. ఇట్టి కోణవ్యవస్థ చక్రవిశేషమును బట్టి కూడ నత్యంత విలక్షణముగ నుండును. అనగా భూపురచక్రము నందొక తీరునను మేరుప్రస్తార చక్రమునకు వేరొక తీరునను బరగుచున్నది. ఇట్టి భూపుర మేరుప్రస్తార విభేద మొక్క శ్రీచక్రరాజమునకే శిష్టాచారమునఁ బుష్కల ప్రచారము దెలియవచ్చుచున్నది. తదితరముల కన్నిటికిని మేరు ప్రస్తార ప్రశంస యించుకేనియు దెలియరాదు. చక్రము లన్నియు భూపురాత్మకములే. ఒకవేళ నెచ్చోట నెయ్యది యైనఁ గన్పట్టినచో నయ్యది సర్వవిధముల నెవ్వఁడేని యొక యాధునిక పురుషబుద్ధి కల్పితమై స్వర్ణకారుని యొక్క కాని లోహకారుని యొక్క కాని కృత్రిమకల్పనమే యగుచుఁ బ్రమాణపదవి నెంతమాత్రము నొందదు. శ్రీచక్ర పరిలేఖనము భూపురవిషయము సర్వసామాన్య విషయ మెంతమాత్రము గాక సత్సంప్రదాయసిద్ధమగు నాచార్యోప దేశమూలకము గావలయును. అటులనే మేరు ప్రస్తార మును. కావున ప్రాజ్ఞులు గడు జాగ్రత్తతో మెలఁగ వలయును.

## శ్రీచక్రరాజమునందలి చక్రవిశేషములు

శ్రీచక్రరాజమునందలి బిందువు మొదలుగాఁగల చక్ర విశేషములయొక్క విశేష మొకింత నిర్వచింపఁబడు చున్నది.

(1) బిందువు:— అనునది సర్వచక్రములకును గిరీటమట్లు నలరారుచుండును. అద్దానికి సజాతీయమైన చక్రము చక్రములలో రెండవది తెలియఁబడదు. ఇది ప్రధాన దేవతయగు శ్రీదేవీస్థానమని సుప్రసిద్ధము. ప్రధాన దేవతయగు శ్రీదేవి యావరణదేవత గాకపోవుటచేతను అయ్యది కోణరూపముగాఁగాని తద్భిన్నమగు దళరూప ముగాఁగాని యుండక పోవుటచే బిందువు ఆవరణమను సంకేతమున కెంతమాత్రమును నర్హతను గల్గియుండదు. గావున బిందువు నావరణ మనుటయు నట్టి యావరణము లతోఁ గలపి లెక్కించుటయును మూఢజన ప్రకల్పనా విశేషమే యగుచు వాస్తవ మెంతమాత్రమును గాదు.

(2) వృత్తత్రయము:— వృత్తత్రయమును గూర్చి యత్యద్భుతములగు విప్రతిపత్తులు గలవు. వృత్తత్రయ మన మూడు వృత్తములు. అయ్యవి "మన్వస్ర నాగదళ షోడశారం" అను వాక్యమునకు బిమ్మటఁ దెలియవచ్చుటచే మన్వస్రమునకు బిమ్మట మూడువృత్తము లొకదానివెనుక వేరొకటి నిలచి మూడు నొక చక్రవిశేషమనియు నయ్యది గూడ నొక యావరణ విశేషమే యనియు నట్లు పరిలేఖ నముఁజేసి విపరీతవాదములకుఁ గడంగుచున్నారు. అట్లు వారలచే దలంపఁబడు వృత్తత్రయమున నెట్టి యావరణ దేవతలును బేర్కొనబడి యుండలేదు. ఎవ్వరిచేతను నేటి పఱకు నట్టి యావరణదేవతలు పూజింపబడుట లేదు. ఇది యటులుండ పరిలేఖన విశేషమును గమనించినచో నచట నొక వృత్తమును లిఖించుటకు దగు నొక్కభాగము దక్క తదితరములగు రెండువృత్తములను లిఖించుటకు సధమము గావలసిన నైదుభాగలైన నుండి తీరవలయును అట్టి భాగల కించుకేనియు నవకాశము లేదు గావున నచట వృత్తత్రయ కల్పన మసంగతము, అజ్ఞజన విలసితమును. అట్టులైనచో వృత్తత్రయము నెందు గన వలయు ననఁ జెప్పఁబడుచున్నది. (1) మన్వస్రమునకును నాగదళ మునకును నడుమ నొకవృత్తము (2) నాగదళమునకును షోడశదళమునకు నడుమ వేరొకవృత్తము. (3) అటులనే షోడశదళమునకును భూపురత్రయమునకును నడుమన మఱియొక వృత్తమును జొప్పించి వృత్తత్రయమను పదము బరిగణించినచోఁ బ్రత్యవాయము గలుగదు. అట్లు

గాక షోడశదళమునకును భూపురత్రయమునకును ప్రత్యేకముగా నొకవృత్తత్రయము నుద్దేశించినచోఁ బడవలసిన పాట్లు భగవంతునకుఁ దెలియవలయును, అట్టి పాట్ల కింతవఱకును గతి గలుగలేదు. కావున వృత్తత్రయమన షోడశదళమునకును భూపురత్రయమునకును నడుమ నొకవృత్తమునే గ్రహించిన సర్వవిధముల సమంజస మగును. ఇట్టి వృత్తత్రయమునం దెట్టి యావరణదేవతలు నుపదేశింపబడి యుండలేదు గావున నీ మూడు వృత్తములు నెంతమాత్ర మావరణలందుఁ బరిగ్రహింపఁబడవు. అటు లనే బిందువు నావరణము గాదని నిర్వచింపఁబడినది. కాని యావరణములుగాఁ బరిగణింపఁ బడని బిందువు నకును వృత్తత్రయమునకు నొక నవినాభావసంబన్ధ ముండుటచే నాలుగుఁగూడ సమిష్టిగ నొకే చక్రమని పరిగ ణింపఁబడవచ్చును. గణితశాస్త్ర మర్యాదచేఁ బ్రతివృత్త మునకు నట్టనడుమ నొక బిందువుండి తీరవలయును. ప్రకృతమున దెలియవచ్చెడి వృత్తత్రయమునకుఁ బ్రత్యేక ప్రత్యేకముగా నొక్కొక బిందువుండుటకు నవకాశము లేక మూడింటికి నొకే బిందువు దెలియఁబడుట వలన నీ బిందువుతో గూడిన మూడు వృత్తములు నొకే చక్ర మగుచు శ్రీదేవికి నిలయమగుటం జేసి శ్రీదేవీస్వరూపము నందుఁ దెలియవచ్చెడి సకలదేవతలకును నిలయమగుచు తదితర చక్రముల కన్నిటికిని నధిష్ఠానముగ నీ బిందు యుత వృత్తత్రయ మధిష్ఠానభావమును బొందుచు నత్య ద్భుతమైన భావనావిశేషముతో నలరారుచున్నది.

## వృత్తత్రయభావనా విశేషపలము

వృత్తత్రయభావనా విశేష సంగ్రహము నిట్లు గ్రహించు నది. అయ్యది శివకామేశ్వరస్వరూపము. శివకామేశ్వరుఁడే యంతర్యామియగు మహేశ్వరుఁడు. వృత్తత్రయమందలి పరిధిత్రయ మన్ననో యావరణశక్తి స్వరూపద్యోతకము. అందు మొదటిపరిధి సదాశివస్వరూపద్యోతకము. రెండవది లోక-తారాస్వరూపద్యోతకము. మూడవది యుభయాత్మక మగు దహర స్వరూప బోధకము. బిన్దువన్ననో యాకృతి ద్యోతకము. బిన్దువృత్తత్రయ మధ్యరూపమన్ననో యజ్ఞ్కమను సఙ్కేతముతో నొప్పుచున్నది. అట్టి యజ్ఞ్కమే సర్వ శక్తులకు నధిష్ఠానరూపము—

## తద్భిన్నభావనావిశేషము

అధిష్ఠానముకంటె భిన్నముగఁ దెలియ వచ్చునదంత యును అధ్యస్తగుణస్వరూపమని యుపదేశింపఁబడు చున్నది. అట్లు దెలియవచ్చుచున్నది. అధ్యస్త గుణ స్వరూపమంతయును శివాశక్తి శివశక్తి యను రెండు శక్తులయొక్క స్వరూపమే. ఊర్ధ్వాగ్రత్రి కోణరూపము శివశక్తి యనియుఁ దద్విపరీతము శివాశక్తి యనియు గ్రహింపనగును. కోణరూపమంతయును శివాశక్తియే యనియుఁ దద్భిన్నము శివశక్తియనియుఁ గొందరు సెప్పు దురు. ఇయ్యది సామాన్యభావనావిశేషము. విశేషభావనా విశేషము గ్రంథవిస్తరభీతిచే విరమింపఁబడినది. ఇక్కడ ప్రదర్శింపఁబడిన భావనావిశేషము సర్వవేదాన్త సంసిద్ధ మగు సిద్ధాన్తజ్ఞాపకము.

## శ్రీచక్రార్చనా విధానము

శ్రీచక్రార్చనావిధానము పిడుగునకును బియ్యమునకును నొకేమన్త్ర మనునట్లుల జాతి, కుల, గోత్ర, స్త్రీ, పుం వివ క్షత యించుకేనియు లేకుండ సర్వులకు నొకే విధాన మనుట యజ్ఞ జనవిలసితము. మూర్ఖప్రలాపితము. అధికారి భేదముచేతను నిత్యనైమిత్తిక భేదముచేతను మహాత్మ్య సందర్భముచేతను శ్రీచక్రార్చనము పలుతెఱంగులఁ బరగు చున్నది. అట్టి విశేష ప్రయుక్తమగు విధానము మాచే రచింపఁబడిన "శ్రీయాగసూత్ర"మను గ్రంథరాజమువలన సద్గురుముఖమున నేర్చికొని గ్రహించి యాచరింపవలసిన విషయము.

## నిషిద్ధగ్రంథము

కౌలదీక్షను బడసిన ద్విపాత్తు లందరును జాతి, వర్ణ, కుల, గోత్ర, స్త్రీ, పుం, వివక్షత లేకుండ పౌరసత్వముతో నొప్పు భారతనరులందరును పౌరులే—సిటిజనులు— యనునట్లు గౌలికులే యనియును వార లందరకును "పరశురామకల్పసూత్ర" మను గ్రంథము ననుసరించి —కౌలికచండాలుఁడుగ శిష్టులచే బహిష్కరింపఁబడిన జగన్నాథపణ్డితవిరచితమగు "నిత్యోత్సవ" మను గ్రంథముచేఁ దెలియవచ్చెడి విధానము ఆచరించవల యునను విషయము ఐహికాముష్మికనిశ్శ్రేయసములకు సర్వవిధముల హానికరము. వేయేల! వారలందరు ప్రకృతమునఁ బవిత్రముగాఁ గ్రహింపఁబడుచున్న "మద్య పాన నిషేధచట్టము" వలన (Prohibition Act) సర్వ విధముల శిక్షింపఁబడుటకు నెంతమాత్రమును బ్రతిబన్ధము గానరాదు. పరశురామకల్పసూత్ర మన్ననో "పంచమ కారము" లని వాడుకలోఁ జెప్పఁబడు (1) మద్యము (2) మాంసము (3) ముద్ర (4) మైథునము అను వాటి యందు నిరంతరమగ్నుఁడగు దుష్టమ్లేచ్ఛసదృశుఁడగు కౌలికచండాలుఁ డెవ్వడో రచియించి పరశురాముని పేరుఁ బెట్టి యజ్ఞులను భ్రమింపఁ జేయఁదలచెను. అట్టి తలంపు సర్వవిధములఁ గొందరియందు బౌద్ధాదుల తలంపులట్లుం బ్రచారమునకు గడంగియున్నవి. ప్రాజ్ఞులును వైదిక ధర్మనిష్ఠులునగుఁ

చండాలురను సంఘబహిష్కృతులుగా గ్రహించి యట్టి వారలతో సహవాస, సహభోజన, సంసర్గాది, వ్యవహారము లందు నెట్టి సంబన్ధమును లేకుండ చరింపుచు నైహికా ముష్మికనిశ్శ్రేయసములఁ బడయుదురు గాక!

## నవావరణార్చనము

ప్రతి సాధకుసకును దా నొనరించు నభీష్టదేవతాపూజన మునందుఁ బ్రధానదేవతాపూజనముతోఁబాటు పరివారదే వతాపూజనముఁగూడ దెలియవచ్చుచున్నది. అట్టి పరి వారదేవతలు దేవతాభేదముచే భేదములుగా నలరు చుండును. సాధకుఁ డొకప్పుడు ప్రధానదేవతాపూజన మును జేసి యావరణదేవతాపూజనము నైచ్ఛికముగఁ జేసినఁ జేయవచ్చును. లేక విరమించవచ్చును. నైమిత్తి కములందు నవశ్యముఁ జేయుచుండును. అటులనే హోమకాలమునందును గూడ ప్రధానదేవతాహోమ ముతోబాటు ఆవరణదేవతాహోమమునుగూడ నవశ్యముఁ జేయును. అటులనే శ్రీచక్రార్చనముగూడ నిత్యార్చనము ఆవరణార్చన మని రెండు తెఱంగుల వ్యవహరింపఁబడు చున్నది. అట్టి యావరణార్చనము నవావరణార్చన మని సామాన్యముగ వ్యవహరింపఁబడుచున్నది, గాని యాచ రణమునందు బెక్కులు విప్రతిపత్తులు గలవు. విలయన శ్రీచక్రాధీశ్వరియొక్క యర్చనయందుఁ బ్రత్యేకముగఁ బూజింపఁబడు పరివారదేవతలు పలుతెఱంగుల విభజిం పఁబడియున్నారు. అదెట్లన.

### పరివారదేవతలు :

(1) తిదినిత్యలు (2) గురుమండలము (3) ఆమ్నా యదేవతలు (4) పఞ్చపఞ్చికలు (5) విద్యాస్థానములు (6) అష్టవిధచక్రాధిష్ఠానదేవతలు. ఇందీ యష్టవిధచక్రాధిష్ఠా నదేవత లష్టవిధసంకేతములతోఁ బ్రత్యేక ప్రత్యేకములుగ చక్రము స్థానసంఖ్యతో నొప్పారుచున్నారు. అవెవ్వి యనః

| చక్రము | నామము | దేవతాసంఖ్య. |
|---|---|---|
| (1) త్రికోణము | - సర్వసిద్ధిప్రదము | - ఎనిమిది (౮) |
| (2) వసుకోణము | - సర్వరోగహరము | - తొమ్మిది (౯) |
| (3) దశారము | - సర్వరక్షాకరము | - పదునొకండు (౧౧) |
| (4) బహిర్దశారము | - సర్వార్థసాధకము | - పదునొకండు (౧౧) |
| (5) మన్వస్రము | - సర్వసౌభాగ్యప్రదము | - పదునైదు (౧౫) |
| (6) వసుదళము | - సర్వసంక్షోభణచక్రము | - తొమ్మిది (౯) |
| (7) షోడశదళము | - సర్వాశాపరిపూరకము | - పదునేడు (౧౭) |
| (8) భూపురత్రయము | - త్రైలోక్యమోహనచక్రము | - ఇరువదితొమ్మిది. (౨౯) |

పై యెనిమిది చక్రములందలి దేవతాగణములకుఁ బ్రత్యేక ప్రత్యేక సంకేతము లుపదేశింపఁబడియున్నవి-. అదె ట్లనిన.

| చక్రము | దేవతలసంకేతములు | |
|---|---|---|
| (1) త్రికోణము | — అతిరహస్యయోగినులు | — ౯ |
| (2) వసుకోణము | — రహస్యయోగినులు | — ౮ |
| (3) దశారము | — నిగర్భయోగినులు | — ౧౦ |
| (4) బహిర్దశారము | — గర్భయోగినులు | — ౧౦ |
| (5) మన్వస్రము | — సంప్రదాయయోగినులు | — ౧౪ |
| (6) నాగదళము | — గుప్తతరయోగినులు | — ౮ |
| (7) షోడశదళము | — గుప్తయోగినులు | — ౧౬ |
| (8) భూపురము | — ప్రకటయోగినులు | — ౨౮ |

అజ్ఞతచేఁ గొందరీ యెనిమిది విధములగు పరివారదేవ తలే యావరణదేవతలనియు నీదేవతల యర్చనమాత్రమే యావరణార్చనమనియు నిందు నెనిమిది యావరణములె తెలియవచ్చుటచే నిద్దానిని నవావరణార్చన మనుట యెట్లు? వేఱొక యావరణమెందుఁ గలదు? అ దెద్ది? యని విప్రతి పత్తుల పాల్పడుటయు, నితరపరివారదేవతలయందు విప్రతిపత్తులను జెందుచు మూర్ఖతచే నపవాదములకు బాల్పడుచున్నారలు. ఇట్టివారలు సర్వవిధముల భాస్కర రాయుఁడు జగన్నాథపణ్డితుడు మొదలుగాఁగల కౌళిక చండాలురను ప్రవర్తకులుగా దలంచుటచేతనే వీరలు సర్వానర్థములకుఁ బాల్పడుచున్నారలు—పాపము శాంతిం చును గాక!

వేయేల! ప్రాజ్ఞులు మాచే రచింపఁబడిన "కల్యాణ శ్రీకలా" యను గ్రంథమువలన సకలవిషయములను సమగ్రముగ గ్రహింపఁగలరను నిశ్చయముతో నివ్యాసము నుపసంహరించుచున్నాము.

ఇతి నారాయణస్మృతిః ॥

# నానాత్వమునం దైక్యసిద్ధి

కాంచనపల్లి కనకాంబ విద్వాన్

"స్వస్వరూపానుసంధానం భక్తి రి త్యభిధీయతే" తనయొక్క స్వరూపము ననుసంధానము చేయుట భక్తి యనబడును. తా ననగా నెవడు? ఆత్మ కావున ఆత్మారాము నవలోకించుటయే భక్తి. ఈశ్వరుడు తపస్సు చేయుటను కూడ కాళిదాసు వర్ణించునపుడు "ఆత్మాన మాత్మ న్యవ లోకయంతమ్" అని చెప్పియున్నాడు. మలినప్రకృతి యైన మనస్సు శుద్ధప్రకృతియైన ఆత్మయందు లీనము కాగ కేవల మాత్మమూర్తిగ నిలచుటయే భక్తి. భక్తి చేయునపుడు చేయువాని మనస్సువేరే, చేయించుకొనువాని మనస్సు వేరుగ నుండిన నది భక్తి యనిపించుకొనదు. చేయువాడు చేయించుకొనువాడు ఒకటి గావలెను. అనగా చేయువాడే చేయించుకొనువాడు కావలెను. ఈశ్వరునకు పూజ చేయునెడ మనము శ్రద్ధతో నేయే సమయముల కేయే యుపచారము లవసరమో ఆయా పనుల చేయుచున్నాము. అప్పుడా ఈశ్వరుడే పూజచేయువాడు కానియెడల నాయా సమయములందు అయ్యావి ఎట్లు చేయగలడు? తనకు తాను చేసికొనవలసిన పనులను ఇతరుల నడుగడుగదా. తన మనస్సు తన కెట్లు తెలియునో భక్తిచేయు నీశ్వరుని మనస్సును అట్లు తెలియవలయును. తా నీశ్వరుడైనగాని ఈశ్వరభక్తి చేయలేడు. విష్ణుమూర్తి సదా శివుని ధ్యానము చేయుచుండును. కావుననే తిక్కన సోమయాజి మొదలగు బుధులు శివకేశవుల నేకమూర్తిగా, అనగా హరిహరనాధునిగ కొనియాడుచున్నారు. వా రిద్దరు నొకరి విషయమై యొకరు భక్తిచేయుచుండుటచే నేకాకారులగుచున్నారు. వా రిద్దరి విషయమై మాత్రమే కాదు. భక్తులు వరుసగా ఈశ్వరుని యెడ సామీప్య సాలోక్య సారూప్య, సాయుజ్యముల నందుచున్నారు. ఉదా:—

శ్రీ కాళహస్తీశ్వరుడు భక్తుల రూపము దాల్చినాడు. శ్రీ = సాలెపురుగు, కాళము = పాము, హస్తి = ఏనుగు, ఈ మూడును కాళహస్తిలో మోక్షము పొందినవి. శ్రీ కాళహస్తీశ్వర లింగమునందు నిప్పటికిని ఆ భక్తుల చిహ్నము కాననగును. కన్నప్ప భక్తితో నిచ్చిన కన్నుగూడ లింగము నందు గలదు. ఇక్కడ ఈశ్వరుడే భక్తుల సారూప్యము నందినాడు.

భర్త కుపచారము చేయు భార్య అర్ధాంగి యని పిలువబడుచున్నది. భర్త కేయే సమయములందు ఏమి యవసరమో గుర్తెరిగి భార్య చేయుచున్నది. దానివలననే వా రొండొరులఁ బేర్లతో బిలుచుకొనరు. ఒకరి మన స్సొకరికి పూర్ణముగ తెలిసినపుడు పిలుచుట చేయించుకొనుట యేల? అనవసరము. భర్త కుపచారము చేయునపుడు భార్య, భర్త యగుచున్నది. ఇద్దరు ఏకము కానపు డొకరి మనస్సు ఒకరికి తెలియదు. భార్యా భర్త లిద్దరు ఏక మని చెప్పుటకు ఈశ్వరుడు, శక్తి ఏకాకారము దాల్చియున్నారు. ఈశ్వరుని పని యంతయు శక్తి చేయుచున్నది. కాకున్న సృష్టి స్థితి లయములు చేయుట శక్తి కేల? ఈశ్వరునకు భక్తి చేయు ప్రమదగణము శక్తి, ఈశ్వరుడు అందఱు గలసినప్పుడే సాంబు డగుచున్నాడు. ఇంతమంది గానబడుచున్నను వా రంద రొనర్చు కార్య మొక్కటియే, కావున వారందరును ఏకరూపముగ నెంచబడుచున్నారు.

ఇట్లే గురువునకు భక్తు లనేకులు వేర్వేరుగ నుపచారము చేయుచున్నను పని యొక్కటియే ఒక్కొక్కనికి గురువునకు చేయు నుపచారము లన్నియు తెలిసియుండవలెను. లేకున్న నందరు కలిసి యతని కుపచారము చేయలేరు.

సంగీతసభయం దొకడు ఫిడేలు, ఒకడు హార్మోనియము, మరియొకడు మద్దెల, ఇంకొకడు సన్నాయి మరియొక్కడు తాళము వేయుచుండ, నింకొక్కడు పాట పాడుచుండును. ఇందఱకును ఒకేపాట తెలిసియుండవలెను. లేకున్న రసాభాస మగును. ఒకడు పాట పాడునపుడు ఆ పాటయంతయు నైన తరువాత తాళమువాడు తాళమువేసి మద్దెలవాడు మద్దెల వాయించిన నేమి బాగుండును? అప్పుడు సభయందు పాడు పాట సభవారందరకు తెలిసిననే యది రాణించును. ఇట్లే భగవంతునకుగాని గురువునకుగాని సేవచేయు భక్తు లందఱును సేవచేయించుకొనువాని మన స్సెరిగి యుండవలెను. అనగా నందరును సేవ చేయించుకొనువానితో నేకము కావలెను. కార్యకర్తలు చేయు పనులు వేర్వేరుగ నున్నను కార్య మొక్కటియే యగుచున్నది. మద్దెలవాడు పాడలేక పోవచ్చును, ఫిడేలువాడు తాళము వేయలేక పోవచ్చును. కాని పాట మాత్ర మందఱికి తెలిసియుండవలెను. పాట యొక్కటి మాత్రము నేర్చుకొనకపోయినను అన్ని పాటలు తెలిసినవాడైన, సంగీతసభవారిలో చేరినపుడు వా రే పాటపాడినను, దానినే ఈ సర్వజ్ఞు డనుసరించును. ఒకడు ఫిడేలు వాయించినపుడు కొంతసేపు దానితో నాడును. పాట చాలించి కొంతసేపు ఫిడేలు మాత్రము వాయించు

చుండును. అప్పుడుకూడ వాడు పాట పైకి వినబడిన ట్లాయినను పాడుచునే యున్నాఁడు. పనులు భేదమైనను పర్యవసానమొకటే,

రెండు రోకళ్ళతో పోటు వేయునపుడు ఒకతె పోటు వేసినపుడు మరియొకతె రోకలిని పైకెత్తుచున్నది. ఆ పైకెత్తుట మఱల పోటువేయుటకే గదా? రోకలి పైకెత్తినను, రోటిలో నుంచినను అంతయు పోటువేయుటగానే మనము చెప్పుచున్నాము. ఆమె ధ్యానము రోటిమీదనే రెండు సమయములయందు నుండును

కాన భక్తి చేయునపుడు ఒక డొక పనిచేసినట్లును మరియొక డింకొక్కపని చేసినట్లు కనపడునే కాని అంతయు కలిసి భక్తి యనిపించుకొనును.

---

# దుర్గోపాసనాతిశయము

శ్రీ గౌరి నరసింహశాస్త్రి

౧

నారాయణసమారంభాం వ్యాసశంకరమధ్యమామ్।
కల్యాణానందపర్యంతాం వందే గురుపరంపరామ్॥

వేదమాతకును దుర్గాదేవికిని అవినాభావసంబంధ మున్నది. శ్రుతియందు పరమప్రామాణ్యము విజృంభించిన కాలములలో దుర్గోపాసనము బహుళప్రచార మంది యుండెను. అట్టి కాలములలో జనము లిహలోక భోగము లందుచు స్వర్గాపవర్గసాధకులై యుండిరి. నేటి కాలమున దుర్గోపాసన ఉత్తరదేశములో విశేషముగా నున్నను అది వేదవిరోధుల సంపర్కముచే అపమార్గములు త్రొక్కియున్నది. అంతకంటె వైదికనిష్ఠ కొంచె మెక్కువగా నిలిచియున్న దక్షిణభారతములో దాని నిజస్వరూపము చక్కగా భాసింపకుండుటచే, దుర్గోపాసన మన్న నొకానొక భయము ప్రవేశించినది. కావున దేశమంతటను అవైదికమార్గములనుండి దుర్గోపాసనము నుద్ధరించి దక్షిణమార్గమును ప్రవర్తింపజేయుట వైదిక మతాభిమానుల ప్రథమకర్తవ్యమై యున్నది. దీనిని బహుకాలము క్రిందటనే గుర్తించి శ్రీజగద్గురు శ్రీ కల్యాణానంద భారతీ మహాస్వాములవారు అనేక గ్రంథములు రచించి శ్రీవిద్యా పరిషత్తును స్థాపించి సూక్ష్మములగు ననేక విషయముల నుపదేశించి శిష్యప్రశిష్యసంతతి నభివృద్ధిచేయుచు లోకోద్ధరణకు దీక్ష వహించి యున్నారు. శ్రీగురువుల కరుణా కటాక్షలేశమే నన్నీ ప్రయత్నమునకు పురికొల్పినది.

ఏ స్మార్తకర్మ ప్రారంభింపబోయిన ముందు విఘ్నేశ్వరపూజ నిర్వర్తించుట అందరు నెరిగినదియే. ఆ విఘ్నేశ్వరపూజకంటెకూడ ముందీ మంత్రములు నేటికిని పఠించుచున్నాము.

"దేవీం వాచ మజనయంత దేవా స్తాం విశ్వ
రూపాః పశవో వదంతి సా నో మంద్రేష
మూర్జం దుహానా ధేను ర్వా గస్మా నుప సుష్టుతైతు॥

* * *

"య శ్శివే నామరూపాభ్యాం యా దేవీ సర్వమంగలా
తయో స్సంస్మరణా త్పుంసాం సర్వతో జయమంగలమ్॥

* * *

"సర్వమంగలమాంగల్యే శివే సర్వార్థసాధికే
శరణ్యే త్ర్యంబకే దేవి నారాయణి నమోస్తు తే"

ఈ అనుక్రమణము అనూచానముగా పెద్దలనోట వచ్చుచున్నదే కాని ఒకరు కల్పించినది కాదు. ఈ మంత్రములు దుర్గోపాసనలో అగ్రగణ్యము లని నేడు పలువురు గుర్తింపలేకుండుట ఆశ్చర్యకరము.

తైత్తిరీయోపనిషత్తులో నారాయణీయ మను ప్రసిద్ధ నామము గల చతుర్థప్రశ్నలో ఈ సందర్భములో నీక్రింది మంత్రములు గమనింపదగినవి.

"కాత్యాయనాయ విద్మహే కన్యకుమారి ధీమహి
తన్నో దుర్గిః ప్రచోదయాత్॥

* * *

"జాతవేదసే సునవామ సోమ మరాతీయతో
నిదహాతి వేదః, స నః పర్ష దతిదుర్గాణి విశ్వా
నావేవ సింధుం దురితా త్యగ్నిః॥

"తా మగ్నివర్ణాం తపసా జ్వలంతీం వైరోచనీం
కర్మఫలేషు జుష్టామ్, దుర్గాం దేవీం శరణ
మహం ప్రపద్యే సుతరసి తరసే నమః"॥

ఈ మంత్రములలో మొదటిది మూడవది స్పష్టముగా దుర్గామంత్రములే. శ్రీ విద్యారణ్యులు తమ భాష్యములో నవి రెండును వనదుర్గాదేవతామంత్రములని నిర్దేశించి యున్నారు. మూడవదానికి అవ్యవధానముగా ముందున్న 'జాతవేదసే' ఇత్యాది మంత్రమును తర్వాత నున్న "అగ్నే, త్వం పారయా" ఇత్యాదిగాగల ఆ అనువాకములోని

నాలుగు మంత్రములును అగ్నిపరముగా కనబడుచున్నను దుర్గామంత్రములుగనే భావింపవచ్చును. ఏమైనను ఈ మంత్రములవలన దుర్గాదేవి మహత్త్వ మొక్కించుక గోచరించును. ఈ దుర్గాదేవత అగ్నివలె జ్వలించుచు శత్రుతాపన మొనర్చునది; స్వయంప్రకాశమాన మైనది. కర్మఫలములు కోరువారిచే నుపాసింపబడినదిదే. సంసారమునుండి తరింపజేయునదికూడ నిదియే. ఈ దుర్గకే కాత్యాయని కన్యకుమారి అను నామాంతరములు కలవు.

దుర్గాదేవి యవతారమునుగూర్చి కేనోపనిషత్తులో మనోహరమగు నొక యాఖ్యాయిక కలదు. అసురులను జయించిన దేవత లొకచో గూడి ఎవరికి వారు తామే జయమునకు కారణుల మని ప్రగల్భములు పలుకుచు సర్వకారణశక్తిని మరచిపోగా, నది వారియెదుట ముందు ముక్కు మొగము లేని తేజఃపుంజమూర్తియైన యక్షరూపముగా నావిర్భవించి దేవముఖ్యులను పరాభవించినది. ఇంద్రపురస్సరముగా దేవత లాయక్షము నుపాసింపగా కొంతకాలమున కది వారికి హైమవతీరూపముతో ప్రత్యక్షమై అనుగ్రహించినది. దానినే శ్రుతి 'తస్మి న్నేవాకాశే స్త్రియ మాజగామ, బహు శోభమానా ముమాం హైమవతీం' అని పలుకుచున్నది, ఈ యాఖ్యానమునే శ్రీదేవీ భాగవతము ద్వాదశస్కంధములో ఎనిమిదవ అధ్యాయములో కావ్యస్వరూపమున ననువదించి యున్నది.

నారాయణీయమునుండి ఉదాహరించిన కన్యకుమారి శబ్దముతో కేనోపనిషత్తునందలి ఉమాహైమవతీ శబ్దములు జోడించి ధ్యానము చేసినవారికి కర్మభూమియైన ఈ భరతఖండమంతయు దుర్గాదేవీ స్వరూపముగా భాసింపకపోదు. ఈ దేశమునకు దక్షిణాగ్రమందు పూర్వదక్షిణపశ్చిమ సముద్ర జలములచే నిత్యము నభిషేకింప బడుచున్న కన్యకుమారి దుర్గాదేవాలయము క్షేత్రము నేటికిని ప్రత్యక్షముగా నుండి ఎవ్వరికిని ఎన్నటికిని చెరుప సాధ్యముకాని సీమా చిహ్నముగా నున్నది. అట్లే ఉత్తరాగ్రమున హిమవత్పర్వత రాజము బాసిల్లుచు తన యుత్సంగములో వాత్సల్యముతో ఉమను హైమవతిని భీమాదికములగు ననేక రూపములతో ప్రతిష్ఠించుకొని యున్నది.

ఈ రెండు సీమా చిహ్నములమధ్య నెన్నియో దుర్గాక్షేత్రము లున్నవి. ఉత్తరభాగమునన్నున్న క్షేత్రములన్నిటిలో కాశికాపురి విశాలాక్షియు దక్షిణ క్షేత్రములకు శ్రీశైల భ్రమరాంబికయు కేంద్రస్థానయములు, పశ్చిమ భారతమున బృందావన క్షేత్రములోని రాధాదుర్గయు పూర్వ భాగమున జగన్నాథ సమీపమున భువనేశ్వరియు వెలసిరి. ఇట్టిది మనస్సులో భావించియే శ్రీ విద్యాశంకర భగవత్పాదులు జగద్గురువై దిగ్విజయ మొనర్చి వైదికనిష్ఠ సుప్రతిష్ఠిత మొనర్చి పరమహంస సామ్రాజ్యము తద్గుప్తికై నెలకొల్ప నెంచి ద్వారకయందు బదరికాశ్రమమున జగన్నాథ క్షేత్రమున శృంగగిరిని నాలుగు జగద్గురు పీఠములలో భారతీ దుర్గను ప్రతిష్ఠించిరి. శ్రీ దేవీ భాగవతము సప్తమస్కంధమున ముప్పదియవ యధ్యాయములో ప్రధానమైన దుర్గాక్షేత్రముల నూటయెనిమిదింటిని పేర్కొనుచు చివరకు, 'వేదవదన మందది గాయత్రిగను, శివసన్నిధిని పార్వతిగను, దేవలోకములో ఇంద్రాణిగాను, బ్రహ్మముఖములందు సరస్వతిగను, సూర్య బింబమున ప్రభగా, మాతలలో వైష్ణవిగా, సతులలో అరుంధతిగా, సర్వశరీరుల చిత్తములందును బ్రహ్మకలా స్వరూపముగను ప్రతిష్ఠింప బడియున్న'దని యద్భుతముగా వర్ణించియున్నది.

ఇంతేకాదు. భరత దేశములో పూర్వరాజులే నగరము నిర్మించినను ముందుగా ఆ నగరలక్ష్మిని, నగరదుర్గను ప్రతిష్ఠించు నాచారముండెను. అట్లే ఏ క్రొత్తగ్రామము నిర్మించినను గ్రామశక్తిని గ్రామరక్షణకై ప్రతిష్ఠించు నాచారము మనదేశములో ననాదిగా వచ్చుచున్నది. పుర దుర్గలు పురవాసులను గ్రామదుర్గలు గ్రామీణులను కాపాడుచుండును. అదేవిధముగా వనమున గాపాడునది వనదుర్గ, పర్వతములందు కాపాడునది పర్వతదుర్గ. గంగమొదలు కావేరివరకు నదులన్నియు నదీదుర్గలు. సరస్సులును దుర్గలే.

మరియొక విషయము గమనించినచో నిది విస్పష్టతరము కాగలదు. కోటయను పదములకు దుర్గమునకు దుర్గము అనునది పర్యాయపదముగదా। ఏకోట కట్టినను ముందక్కడ కోటశక్తిని ప్రతిష్ఠించుట వృద్ధాచారము. ఆ కోటశక్తికి నిత్యము పూజలును సంవత్సరమున కొకసారి యైన విశేషపూజలును జరుగుచుండెను. అధునికు లిప్పుడది మరచినను, పాడువడిపోయిన కోటలలో నివసించువారు తాము కోటశక్తిని చూచి భయపడితిమని పలువురు చెప్పుచుండుట అట్టి ప్రదేశముల కేగినవారికి విదితమే. శత్రువులబారినుండి రక్షించుటచేతనేకాక అందు ప్రతిష్ఠింపబడిన దుర్గాదేవత కారణమునగూడ కోటలకు దుర్గములను నన్వర్థనామము వచ్చినది.

పురములు గ్రామములు వనములు పర్వతములే కాదు. మన గృహములే దుర్గాక్షేత్రములు. గృహప్రవేశ మొనర్చునపుడు గణపతి నర్చించి పుణ్యాహవాచన మొనర్చి వాస్తుపూజ నవగ్రహ పూజ నిర్వర్తించి నూతన గృహములో తూర్పుభాగమున పూర్ణకలశద్వయము ప్రతిష్ఠించి గృహదేవతా పూజ గావింతుము. ఆ వెంటనే అగ్ని ప్రతిష్ఠాపనము జరుగును గృహదేవతయే గృహదుర్గ. దాని ప్రత్యక్ష

స్వరూపమే అగ్ని. దానికే సంధ్యావేళల దీపారాధన మొనర్చి నమస్కరింతుము

ఎన్ని విధముల మనము విస్మరించుటకు యత్నించినను నిరంతరానుగ్రహబుద్ధితో దుర్గాదేవత మనలను వదలక కటాక్షించుచు అనేక రూపములతో కొట్టవచ్చినట్లు ప్రత్యక్ష మవుచున్నది. ఆసేతు హిమాచల మధ్యస్థ మగు ఈ పుణ్య భూమిలో జను లుపాసించు దేవత దుర్గ. అందులో గ్రామీణు లని నాగరకులని వనవాసులని పురివాసులని, పేదలని ధన వంతులని, సేవకులని మహాప్రభువులని, స్త్రీలని పురుషులని తారతమ్యము లేదు. అందరకును దుర్గాదేవి ఆరాధ్యయే. ఎప్పటికిని వివాహమునకు పూర్వము వధువు విధిగా గౌరీ పూజ చేయుట యాచారము కదా! రుక్మిణీ కల్యాణ కథ విన్నవారికి దుర్గను పూజించుటకు రుక్మిణి పురి వెలుపడి వచ్చుట ఎరిగినదే కదా! రఘువంశ కావ్యములో పదు నారవ సర్గలో కుశస్థలములో నున్న కుశునికి సాకేతపురాధి దేవత అర్ధరాత్రమున ప్రత్యక్షమై అతనిని మరల కులరాజ ధానిని ప్రవేశింపుమని ఆదేశించినది ఈ సందర్భమును గుర్తునకు తెచ్చుకొనదగును.

౨

ఈ విధముగా భరత దేశమం దంతటను సర్వకాలము లందును దుర్గాదేవత ప్రధానముగా పూజింపబడుటకు కారణమేమి? భరతఖండములో ధర్మమంతటికి మూలము శ్రుతి కదా! అది స్వతఃప్రమాణ మని పెద్ద లంగీకరించిన విషయము. అందులో పై నుదాహరించిన మంత్రములే కాక శ్రీసూక్తము మొదలగు మంత్రము లెన్నో దుర్గాపర మైనవి కలవు. అయితే ఒక్క దేవీపరములైన మంత్రములే కాక మరి ఎందరో ఇతర దేవతలను ప్రతిపాదించు మంత్రము లున్నవి కదా యని ప్రశ్నించుట సహజమే. కాని ఒక్క విషయము గమనించినచో ఆ శంక నివృత్తి నందగలదు.

వేదాధ్యయనమున కధికారము ఉపనయనదీక్షతో నారం భించుచున్నది గదా! ఉపనీతునికి ముందు గాయత్రీ మంత్ర ముపదేశించి నిత్యము ముప్పూటలు సంధ్యావంద నము చేయించి ఆ పిమ్మట సమస్తవేదములు ఉపదేశించు చున్నారు. సంధ్యోపాసనము ప్రధానముగా గాయత్రీ మంత్రానుష్ఠానమే కదా! అందులో గాయత్రిని ఆవాహన చేయుచు గాయత్రితోపాటు సావిత్రిని సరస్వతిని ఛందస్సు లను శ్రీ దేవతను ఆవాహనచేయుచున్నాడు. తర్వాత గాయత్రికి ఉద్వాసన చెప్పుచు ఆమెను వరదానశీలయైన వేదమాతనుగా కీర్తించుచున్నాడు. కాబట్టి వేదమాతయే గాయత్రి. ఉపాసనలలోనెల్ల ప్రథమమైనది ప్రధానమైనది ఉత్తమమైనది గాయత్ర్యుపాసనమే దానికి దేవత, సవిత, ముఖ మగ్ని, శిరస్సు బ్రహ్మ, హృదయము విష్ణువు, శిఖ రుద్రుడు, యోని పృథివి. మరియు నది త్రిపద. మూడు సంధ్యలలో మూడు రూపములతో నుండినది. సద్యోజాతాది పంచబ్రహ్మమంత్రములే శిరస్సులుగా గలది. ఇట్టి గాయత్రి నుపాసించుట భరతఖండములో అనాది గదా!

గాయత్రితోడనే ద్విజులకు అగ్నిహోత్రార్చనము వచ్చు చున్నది. దాని రూపము గనుకనే దుర్గను తరుచుగా అగ్ని వర్ణము కలదిగాను తేజస్స్వరూపమున నావిర్భవించునట్లును వర్ణింపబడినది. శ్రీదేవీభాగవతము గాయత్రి వారాధిం చుట నిత్యవిధి యని చెప్పి చెప్పి మరల తుదకు ద్వాదశ స్కంధములో నిట్లు చెప్పుచున్నది. "సత్యయుగ మం దందరు గాయత్రీ జపతత్పరులును తారహృల్లేఖల జపించువారునైయుండిరి. విష్ణూపాసనము నిత్యము కాదు. శివోపాసనము నిత్యము కాదు. ఒక్క గాయత్రి ఉపాసనముతప్ప తక్కిన దేవతల ఉపాసనలు నిత్యములు కావు. గాయత్రి నుపాసింపనిచో ద్విజుడు ద్విజత్వమునే కోల్పోవును. అట్టి ద్విజత్వహాని మరియే యితర మంత్ర ము పాసింపకున్నను కలుగదు. మనువుకూడ ఇతరములు చేసినను చేయకున్నను గాయత్రిమాత్ర మనుష్ఠింపవలెనని శాసించినాడు. గాయత్రిని వదలి విష్ణూపాసనము శివోపాస నము చేయువారు నరకమే పొందుదురు. ఇట్లుద్ఘోషించి గాయత్రీమంత్రాధిక్యతను ప్రతిపాదించు నాఖ్యాయిక చెప్పి శ్రీదేవీ భాగవతము ఉపసంహార మొనర్చినది.

గాయత్రి యనగా గానముచేయువానిని త్రాణము చేయు నదని యర్థము. దుర్గ యనగా భక్తులను కష్టములనుండి రక్షించునది యని యర్థము. ఈ రెండును ఒక్క దేవత నామములే. దుర్గాప్రతిపాదకములైన మంత్రములన్నియు గాయత్రీ మంత్రభేదములే. కావుననే ఉపాసనా రహస్యము లన్నియు నిక్షేపింపబడియున్న సామవేదీయోపనిషత్తగు లలితారహస్యనామస్తోత్రములో ఆ దేవత ఒకచోట 'గాయత్రీ వ్యాహృతి స్సంధ్యా ద్విజబృంద నిషేవితా' అనియు, మరి యొకచో 'దుర్లభా దుర్గమా దుర్గా దుఃఖహంత్రీ సుఖప్రదా' అనియు, ఇంకొకయెడ 'సర్వశక్తిమయీ సర్వమంగలా సద్గతిప్రదా సర్వేశ్వరీ సర్వమయీ సర్వమంత్రస్వరూపిణీ సర్వయంత్రాత్మికా సర్వతంత్రరూపా' అనియు, వేరొక యెడ 'అపర్ణా చండికా చండముండాసురనిషూదినీ' అనియు ఇత్యాదిగా బహువిధముల కీర్తింపబడినది.

వేదమంత్రాధికారము నొసంగు గాయత్రీ మంత్రము పురుషులగు ద్విజులచేతనే అనుష్ఠింపదగినదని పెద్దల నిర్ణయము. మరి స్త్రీలను ద్విజేతరులను తరింపజేయు గాయత్రి యేది? ద్విజపురుషులనేకాక ద్విజేతరులను స్త్రీలను అందరను తరింపజేయుటకు శ్రుతి విధించిన సాధన

ములే దుర్గామంత్రములు. ఇట్లంపర సన్నివిధముల రక్షింపగల గాయత్రి దేవతా స్వరూపములే దుర్గాదేవీ మూర్తులు. రహస్యనామ మందువల్లనే దానిని 'ఆ బాల గోపవిదితా' అని కీర్తించినది. నగరములలో గ్రామములలో గృహములలో ఆయతనములలో వనములలో గిరులలో ప్రతిష్ఠించిన దుర్గామూర్తులే కాదు; భరతఖండమే మహా దుర్గామూర్తి; భరతమాత; భారతీదుర్గ!

3

దుర్గోపాసన ఇప్పటికి కొంతకాలమునుండి వెనుకపట్టిన మాట నిజమే. వేదాధ్యయనమే అస్థితిలోనున్నది గదా! ఈ ఉపాసన కేవలము వేదములో గూఢముగా దాగి యున్నది కాదు. వేదముల తర్వాత పంచమ వేదమని విశేషపూజ్యత నందుచున్న మహాభారతము చూచినను ఈ ఉపాసనాతిశయము కాన్పించును. పాండవులే గడ్డు పని సాధింపవలసివచ్చినను ముందుగా నుపాసించినది దుర్గాదేవతనే.

వారు సాధించిన గడ్డుపనులలో గడ్డైనది అజ్ఞాతవాస వత్సర పరిసమాప్తి. విరాటనగరమును సమీపించుచు తమ అజ్ఞాతవాససమయము నిర్విఘ్నముగా పూర్తియగు టకు ధర్మరాజు ప్రార్థించినది దుర్గాదేవినే. ఆ స్తోత్రము చదివినవారికి దుర్గాసప్తశతిలోని స్తోత్రములు స్పష్టముగా స్ఫురించును.

"విరాటనగరం రమ్యం గచ్ఛమానో యుధిష్ఠిరః
అస్తువన్ మనసాదేవీం దుర్గాం త్రిభువనేశ్వరీమ్ ॥
యశోదాగర్భసంభూతాం నారాయణవరప్రియాం
నందగోపకులేజాతాం మంగల్యాం కులవర్ధనీమ్ ॥

* * *

భారావతరణే పుణ్యే యే స్మరంతి సదాశివామ్
తాన్వై తారయతే పాపాత్ పంకే గా మివ దుర్బలామ్॥
స్తోతుం ప్రచక్రమే భూయో వివిధైః స్తోత్రసంభవైః
ఆమంత్ర్య దర్శనాకాంక్షీ రాజా దేవీం సహానుజః ॥
నమోస్తువరదే కృష్ణే కుమారి బ్రహ్మచారిణి
బాలార్కసదృశాకారే పూర్ణచంద్రనిభాననే ॥
త్రైలోక్యం రక్షణార్థాయ మహిషాసురనాశిని
ప్రసన్నా మే సురశ్రేష్ఠే దయాం కురు శివా భవ ॥
జయా త్వం విజయాచైవ సంగ్రామేచ జయప్రదా
మమాపి విజయం దేహి వరదా త్వంచ సాంప్రతమ్ ।

* * *

దుర్గాత్తారయసే దుర్గే త త్త్వం దుర్గా స్మృతా జనైః
కాంతారే ష్వవపన్నానాం మగ్నానాంచ మహార్ణవే॥
దస్యుభిర్వా నిరుద్ధానాం త్వం గతిః పరమా నృణామ్
త్వం కీర్తిః శ్రీ ర్ధృతిస్సిద్ధిః హ్రీ ర్విద్యా సంతతి ర్మతిః
సంధ్యారాత్రిఃప్రభా నిద్రాజ్యోత్స్నా కాంతిః క్షమాదయా
నృణాంచ బంధనం మోహం పుత్రనాశం ధనక్షయమ్
వ్యాధిం మృత్యుభయం చైవ పూజితా నాశయిష్యసి."

దుర్గాదేవి ప్రత్యక్షమై అన్నవాక్యాలలో క్రిందివి ఉన్నవి.

"అటవ్యాం దుర్గకాంతారే సాగరే గహనే గిరే
యే స్మరిష్యంతి మాం రాజన్ యదాహం భవతా స్మృతా।
న తేషాం దుర్లభం కించిత్ అస్మిన్‌లోకే భవిష్యతి।
రక్షాం కృత్వాచ పాండూనాం తత్రై వాంతరధీయత।

ఆ పిమ్మట వారు సాధించినది మహాభారత యుద్ధములో విజయము. యుద్ధభూమిలో ప్రవేశించిన వెంటనే శ్రీకృష్ణ భగవానుడు అర్జునునితో నిట్లనెను:

"శుచి ర్భూత్వా మహాబాహో సంగ్రామాభిముఖః స్థితః
పరాజయాయ శత్రూణాం దుర్గాస్తోత్ర ముదీరయ"

వెంటనే అర్జునుడు రథముపైనుండి దిగి దుర్గాస్తోత్ర మొనర్చెను:

"నమ స్తే సిద్ధసేనాని ఆర్యే మందారవాసిని
కుమారి కాలి కాపాలి కపిలే కృష్ణపింగలే ॥
భద్రకాలి నమ స్తుభ్యం మహాకాలి నమోస్తు తే
చండి చండే నమ స్తుభ్యం తారిణీ వరవర్ణినీ ॥
గోపేంద్ర స్యానుజే జ్యేష్ఠే నంద గోపకులోద్భవే
మహిషా సృక్ప్రియే నిత్యం కౌశికీ పీతవాసిని ॥
వేదశ్రుతి మహాపుణ్యే బ్రహ్మణ్యే జాతవేదసి।
త్వం బ్రహ్మవిద్యా విద్యానాం, మహానిద్రాచ దేహినామ్।
స్వాహాకారః స్వధాచైవ కలా కాష్ఠా సరస్వతీ
సావిత్రీ వేదమాతా చ తథా వేదాంత ఉచ్యతే ॥
జయో భవతు మే నిత్యం త్వత్ప్రసాదా ద్రణాజిరే।
త్వంజృంభనీ మోహినీచ మాయా హ్రీః శ్రీ స్తథైవచ
తుష్టిః పుష్టిః ధృతి ర్దీప్తిః చంద్రాదిత్య వివర్ధినీ
భూతి ర్భూతిమతాం సంఖ్యే వక్ష్యసే సిద్ధచారణైః ॥"

ఈ స్తోత్రముచే అర్జునుని భక్తి ఎరిగి దుర్గాదేవి గోవిందుని ముందు నిలిచి అర్జునునికి ప్రత్యక్షమై శీఘ్రముగా జయింతువని ఆశీర్వదించి అదృశ్య యయ్యెను.

మహాభారతముననే కాక భారతపరాంశమగు హరివంశ మందును దుర్గామహత్త్వము స్తోత్రము కలవు. తిక్కన సోమయాజివలె వదలక ఎఱ్ఱయ ఆభాగములు తెలిగించి నాడు గనుక ఎఱ్ఱకవి వాక్కులలో నవి ప్రదర్శింతును. శ్రీమహావిష్ణువు అవతరించుటకు ముందు యోగమాయతో నిట్లనెను:

"నా మేనితోఁ దుల్యమై మేను నవమేఘ
కాంతి నొప్పార సంకర్షణునకు
నెనయైన వదన పూర్ణేందుండు శోభిల్ల
నెనిమిది బాహువు లెనఁగి శార్ఙ

చక్రగదాఖడ్గ జలరుహ మధుపాత్ర
ముసలశూలముల నుల్లసితములుగ
నుజ్జ్వలహార కేయూరాది దివ్య భూ
షణ గంధమాల్యవిస్తారలిల
నీలకౌశేయవసనవై నిఖిల సిద్ధ
గణము పూజింప దివి కేగఁగలవు నిన్ను
నెదురువచ్చి తోడ్కొనిపోయి యింద్రుఁ డెలమి
నాదిశక్తిగ నభిషేక మాచరించు॥

"నీవు నాకు నక్కౌశికునకుం జెలియలవై కౌశికి యను పేరం బ్రసిద్ధివహించి వింధ్యాచలంబు నివాసంబుగా నుండి శుంభనిశుంభులను దైత్యుల వధియించి లోకహితం బొనర్చెదవు శ్రీ యు ధృ తి యుఁ శాం తి యు హ్రియు విద్యయు సన్మతియు మతియు సంధ్యయు రాత్రియుఁ బ్రభయుఁ గాంతియు నిద్రయుఁ గాలరాత్రియు నను నామంబులు నీకు వాచకంబులుగా మహామునులుం గీర్తింతు రార్తులై కొలుచువారికి దారిద్ర్య బంధన వధప్రముఖంబులగు సుఖదుఃఖంబు లపనయించి యాయురారోగ్య ధనధాన్య పశు పుత్రభృత్యాదికంబులగు కల్యాణంబులు గరుణింపుము"

పిమ్మట యోగమాయను కంసుడు రాతితో నడుచుటకై పూని యెత్తిన నెత్తనఁ బ్రిదిలి చనలి కెగసి యయ్యుగ్మలి యద్భుతాకారయై యందుండి

తనచేతి పానపాత్రం
బున నెలికెడి దివ్యమధువు ముదమున నాస్వా
దన మొనరించి మదోద్ధత
నినదంబునఁ బలుచ నవ్వి నిష్ఠురభంగిన్॥

కంసునితో నాతని జంపు శత్రు వున్నాడనియు తాను మృత్యుమూర్తియై యాతని ప్రాణములు రుధిరములు నెక్క పూఁవున గ్రోలుదుననుచు నదృశ్య యయ్యెను.

ఈ సందర్భమున దుర్గా సప్తశతిలో మహిషాసురమర్దనమునకు ముందు భగవతి,

"ఉవాచ తం మదోద్ధూతముఖరాగాకులాక్షరమ్।
గర్జగర్జ క్షణం మూఢ మధు యావ త్పిబా మ్యహమ్॥

అన్న మాటలు జ్ఞప్తికి తెచ్చుకొన్నచో రెండు విషయములు స్పష్టమగును. ఈ ఇద్దరు ఒకే దేవత అవతారభేదములే; ఆమె చేతిలోనిది 'దివ్యమధువు' కల సుధాపాత్రమే కాని సప్తశతి అపపాఠములలోనున్న సురాపాత్రము కాదనియు స్పష్టము. దేవత ఒకటే యనుటకు సప్తశతిలో శుంభనిశుంభవధానంతరము శ్రీ దేవి ప్రత్యక్షవచనములే ఉన్నవి.

"వైవస్వతే ఽంతరే ప్రాప్తే ష్టావింశతితమే యుగే
శుంభోనిశుంభశ్చైవా వాన్యా వుత్పత్స్యేతే మహాసురౌ॥

నందగోపగృహే జాతా యశోదాగర్భసంభవా
తత స్తౌ నాశయిష్యామి వింధ్యాచల నివాసినీ॥

అనిరుద్ధుడు బాణుని నాగపాశములచే బద్ధుడై యుండి ఆర్యాస్తోత్ర మొనర్చి పాశవిముక్తు డయ్యెను. అందులో నుండి యీ భాగములు ఉదాహరించిన జాలును:

"నందుని కూర్మి నందన యనంగ యశోదకుఁ గోడలంబు జెందం దగ నావహించి ప్రకటంబుగ విష్ణునితోడఁబుట్టువై సుందరి గోకులైకనవశోభనయై జనియించి యే జగద్వందిత యొప్పె నాయసురదారణి నాదిమశక్తిఁ గొల్చెదన్. తనువులందెల్ల నెలసి చేతనయనంగ....

లక్ష్మి సరస్వతి లజ్జఁగీర్తి...సావిత్రిఁ దుష్టి శాంతి, దైవమాత భక్తప్రియదలఁతు భక్తి....దుర్గ దుర్గయ....శివ పద్మపాణి భగిని....శుంభ నిశుంభవ్యాపర్దిని....ఎల్లపెక్కెల్ల రూపములెల్ల నీవ వరదాయిని మహిషాసురపరిమర్దని వైదికాద్రి బ్రహ్మణి శివసుందరి నారాయణి యచలేశ్వరి కన్యక యనఁగ నీదు సంజ్ఞలు తల్లీ"!

ఇక ఆదికావ్యమగు వాల్మీకి రామాయణములో దుర్గాపూజ ఉన్నదా అని కొందరికి సందేహము కలుగవచ్చును. అందులో సీతాదేవియే ఆదిశక్తి యని సమాధాన మిచ్చి మిన్నకుండ నవసరము లేదు. శ్రీరామునికి వనవాసమునకు బోవుచుండ సర్వరక్ష యొనర్చి కౌసల్య తుద కిట్లు మంగళ మొనర్చినది.

"య న్మంగలం సహస్రాక్షే సర్వదేవనమస్కృతే
వృత్రనాశే సమభవత్ త త్తే భవతు మంగలమ్॥
య న్మంగలం సుపర్ణస్య వినతా కల్పయత్ పురా
అమృతం ప్రార్థయానస్య త త్తే భవతు మంగలమ్"॥
అమృతోత్పాదనే దైత్యాన్ ఘ్నతో వజ్రధరస్య యత్
అదితి ర్మంగలం ప్రాదాత్ త త్తే భవతు మంగలమ్॥
త్రీ న్విక్రమాన్ ప్రక్రమతో విష్ణో రమిత తేజసః
యదాసీ న్మంగలం రామ త త్తే భవతు మంగలమ్॥
ఋతవ స్సాగరా ద్వీపా వేదా లోకా దిశశ్చ తే
మంగలాని మహాబాహో దిశంతు శుభమంగలాః॥

ఈ విధముగా సర్వమంగలా దుర్గనే కౌసల్య యావాహన మొనర్చినది. రామాయణపాఠక్రమములో పెద్ద లీ మంగల శ్లోకములు పఠించుచుండుట సంప్రదాయము గదా! వృత్రవధమందు అమృతాహరణమందు క్షీరసాగర మథనమందు త్రివిక్రమ క్రమమునందు ముందుగా స్తుతింపబడి నది సర్వమంగలా దేవతయే యనియు దీనిచే సూచింపబడుచున్నది. నేటికిని ప్రయాణ సమయముల సర్వమంగలా మంత్రస్మరణ మొనర్చుట వృద్ధాచారము.

౪

పురాణ పురుషులే కాక, నేటివారు చారిత్రక పురుషులని భావించుచున్న మహానుభావు లందరు దుర్గోపాసకులే. వారిలో అగ్రగణ్యులు శ్రీ విద్యాశంకర భగవత్పాదులు. వారి ఆశ్రమ నామమే భారతి. వారు ప్రతిష్ఠించిన పీఠము లన్నియు భారతీ పీఠములే. వారి శిష్యపరంపర భారతీ నామము ధరించి ప్రత్యక్ష దుర్గామూర్తులుగా విలసిల్లు చున్నారు. శ్రీ విద్యాశంకరులు దిగ్విజయము చేయు నప్పుడే వక్రమార్గములు పట్టిన దుర్గోపాసనము వైదిక మార్గమునకు త్రిప్పినట్లు స్థలపురాణము లెన్నో చెప్పు చున్నవి. అట్టివానిలోనిదే బెజవాడలోని కనక దుర్గ. ఆ దుర్గ రాత్రుల పురవీధుల సంచరించుచు నెదురు పడిన నరులను భక్షించుచుండెడి దనియు శ్రీ విద్యాశంకరులు బంధించి శాంతమూర్తి నొనర్చిరనియు నైతిహ్యము కలదు.

శ్రీ విద్యాశంకర పరంపరలో ప్రత్యేకముగా నెన్నదగిన మహానుభావుడు శ్రీ విద్యారణ్యులు. వారి యిష్టదైవము వనదుర్గ. తన యిష్ట దేవతనే నగర రక్షణకు ప్రతిష్ఠించి శ్రీ విద్యానగరము నాతడు ప్రతిష్ఠ చేసెను. ఆ దుర్గకు పూజ జరిగిన న్నాళ్లు శ్రీ విద్యానగర రాజ్యమునకు చ్యుతి రాలేదు.

మహాకవి కాళిదాసు దుర్గాభక్తుడు. చాళుక్య ప్రభువులు తమ వంశకర్త 'నందాం భగవతీం ధ్యాయన్' సామ్రాజ్య చిహ్నములు పడసెనని శాసనములలో వ్రాయించుకొనిరి. వైదిక నిష్ఠతో తెలుగు దేశము పాలించి మన కాంధ్ర మహా భారతము ప్రసాదింప జేసిన రాజరాజ నరేంద్రుడు చీప మార్యుడను బ్రాహ్మణున కిచ్చిన దానశాసనములో తాను 'చండీ ప్రసాద లబ్ధ సామ్రాజ్యధౌరేయుడ' నని చెప్పు కొన్నాడు. ఈ మధ్యకాలములో వైదిక ధర్మరక్షణకు పూను కొన్న శివాజీ మహారాజు దుర్గాభవానీ భక్తుడు.

వైదికధర్మమును ప్రతిఘటించిన బౌద్ధులు జైనులు ఇత్యాదు లుపాసించినదియు తారాది దుర్గామూర్తిభేదము లనే. వారివలననే దుర్గాపూజ అపమార్గములు పట్టినది. మనకి ప్రస్తుతము లభించు తంత్రగ్రంథముల ప్రతులలో వారల సంపర్కము విశేషముగా కనబడుచున్నది. వానిలో నీరక్షీరములు వేరుచేయగలిగిన పరమహంస రూపులగు కల్యాణపాదులను మన మాశ్రయింపవలసి యున్నది.

అన్నిటికంటె నాశ్చర్యకరమగు విషయమీ మధ్య 'హిందూ' పత్రిక బయల్పరచినది. వైదికమతద్వేషి యని యాంగ్లేయ చరిత్రకారులు చిత్రించిన టిప్పుసుల్తాను తనకు యుద్ధములో జయముకొరకై శతచండీయాగము చేయింపవేడుచు శ్రీ శృంగేరిపీఠాధిపతులకు పంపిన యుత్తరము లా పత్రిక ప్రకటించినది.

దుర్గా దేవతాతిశయమునకు చెరుపరాని గుర్తు ఎప్పటికి ఉన్నది. మన పండుగలలో గొప్పపండుగ ఏది? దీనికుత్తర మిచ్చుటకు ఆలోచింప నక్కరలేదు. శరన్నవరాత్రములు, దుర్గాష్టమి, మహానవమి మిగిలిన మూడు నవరాత్రములు మరచినను మనము ఇంకను శరన్నవరాత్రములు మరవ లేదు. గడలు పట్టుకొని ఊరేగు పిల్లల తండములును వారి ఉపాధ్యాయులును మనల మరవనేరరు.

దుర్గా స్వరూపము లనంతములు. ఐనను వానిలో ప్రధా నముగా చండీదుర్గ వనదుర్గ శూలినీదుర్గ యను మూడు దుర్గామంత్రములు విశేషప్రచారము నొందియున్నవి. దుర్గోపాసనల కన్నిటికిని మూలముగా చండీ నవార్ణమంత్ర మును తత్సంబంధమైన దుర్గాసప్తశతీమాలా మంత్రమును గ్రహింపవచ్చును. శివపంచాక్షరియు దాని మాలామంత్ర మగు శతరుద్రీయమును ఎట్లు అనంతఫలప్రదములో, అట్లే ఇవియు అనంతఫల ప్రదములు. ఇవి రెండును శివా శివశక్తి ప్రతిపాదకములగు మహోపాసనలు.

ఈ శరన్నవరాత్రములలో దుర్గాదేవి నారాధించి పిమ్మట దుర్గాసప్తశతి విశేషములు విచారింతము.

---



శ్రీ శృంగేరి శారదాదేవి

శబ్దాత్మికా సువిమలర్గ్యజుషాం నిధాన ముద్గీథరమ్యపదపాఠవతాం చ సామ్నాం
దేవీ త్రయీ భగవతీ భవభావనాయ వార్తా చ సర్వజగతాం పరమార్తిహంత్రీ.



బ్రహ్మీభూత శ్రీశ్రీశ్రీ జగద్గురు
చంద్రశేఖర భారతీస్వాములవారు
శృంగెరి పీఠాధిపతులు

# బ్రహ్మీభూత

## జగద్గురు శ్రీ చంద్రశేఖరభారతీ పూజ్యపాదులు

*శ్రీ శ్రీ శ్రీ విద్యాశంకరభారతీస్వాములు—గాయత్రి పీఠాధిపతి—బందరు*

[ప్రొయిసవత్సరము మహాలయ అమావాస్యనాడు శృంగగిరి పెద్దలను పేరున దక్షిణమునం దెల్ల పరిచితులగు శృంగెరి పీఠాధిపతులు నీటియందు కాలు జారి పడుట యొక నెపముగ స్వేచ్ఛగా దేహత్యాగము చేసినారు. దివ్యపురుషులుగా ప్రఖ్యాతి గాంచిన వారి జీవిత కథనము సంగ్రహముగా నిట్లు రచించినవారు, వారి శిష్యులు, బందరు గాయత్రీ మఠాదిపతులు శ్రీ శ్రీ శ్రీ విద్యాశంకర భారతీ స్వాములవారు. ఈ వ్యాసము నిందు ప్రచురించుకొనుట కనుమతి నిచ్చిన శ్రీ కృష్ణాపత్రికాధిపతులకు కృతజ్ఞులము:-
సం ఆరాధన]

జగద్గురువులగు నాదిశంకరభగవత్పాదులు శృంగేరిలో స్థాపించిన శారదాపీఠము నధిష్ఠించిన జగద్గురుమాలలో శ్రీ చంద్రశేఖరభారతీ పూజ్యపాదులు ఒక రత్నమువంటివారనిన నతిశయోక్తి కానేరదు

ఈ మహాపురుషులు ఆంధ్ర ములికినాటి బ్రాహ్మణోత్తములు. వీరి జన్మస్థానము శృంగేరి మహాక్షేత్రము. వీరి పితామహులు సుబ్బశాస్త్రిగారు. శృంగేరి పీఠములో ఆస్థాన పండితులు. వీరి వంశము పాండిత్యమునకు యోగ్యతకు నిలయము. ఆ సుబ్బశాస్త్రిగారికి గోపాలశాస్త్రిగారను పుత్రరత్న ముదయించగా ఆ గోపాలశాస్త్రిగారికిని వారి సతీమణి మహాలక్ష్మీదేవికిని ఈ జగత్కల్యాణమూర్తులు నందన (1892) ఆశ్వయుజ కృష్ణ ఏకాదశీ పవిత్రదినమున అవతరించిరి.

వీరి తల్లిదండ్రులకు వీరి పుట్టుకకు పూర్వము పదముగ్గురు సంతానము పుట్టి నష్టమైనందున ఈ శిశువును అప్పుడు పీఠకార్యనిర్వాహకులుగ నుండిన శ్రీకంఠశాస్త్రిగారికి ఒప్పగించగా వారియింట వీరి శైశవము బాల్యము గడచెను. ఒకనాడు శ్రీకంఠశాస్త్రిగారితో ఈ బాలుండు—అప్పుడు వీరిపేరు నరసింహశాస్త్రి— అప్పటి జగద్గురువు శృంగేరి పీఠాధిపతి శ్రీ సచ్చిదానంద శివాభినవ నృసింహ భారతీస్వాములవారి సన్నిధికి వెడలెను. ఈ బాలుని చూడగానే జగద్గురువుల దివ్యచక్షుస్సులకు ఈయన భావి భాగ్యోదయ మంతయు గోచరించినది. అప్పుడే ఈబాలుని తమ శిష్యునిగా జేసికొని తమయనంతర మీయనను పీఠాదిపతిగ చేయవలెనను సంకల్పము వారికి కల్గినది. వారు ఈ బాలునికి తమ మఠములోని శ్రీసద్విద్యా పాఠశాలలో విద్యాభ్యాసమును గావించి అక్కడ సాహిత్య, వ్యాకరణ, తర్కశాస్త్రములను జదివించిరి, ఈ బాలుడు ఏకసంధాగ్రాహి. అచిరకాలములో ఆ శాస్త్రపారములను ఈయన పూర్తి చేసెను. అంతట వీరిని బెంగుళూరులో నున్న తమ మఠశాస్త్రకళాశాలలో పూర్వ - ఉత్తర - మీమాంసా శాస్త్రముల అధ్యయనమునకుఁ బ్రవేశపెట్టిరి. ఆ రెండు శాస్త్రములలోఁగూడ ఈయన నిష్ణాతుండయి సర్వవిద్యాపారంగతు డగునప్పటికి 20వ సంవత్సరము వచ్చినది.

అట్టి స్థితిలో ఆ జగద్గురువులు శ్రీ నృసింహభారతీ స్వాములవారు తమ కవసాన కాలము సమీపించినదని గుర్తెరింగిరి. అంత ఈ బాలుని సర్వజ్ఞునిగను జగద్గురు పీఠాలంకారముగాను చేయుమని శ్రీ శారదాదేవిని ప్రార్థించుచు ఒక స్తోత్రమును రచించిరి. తమతరువాత తామీ బాలుడే పీఠాధిపతి కావలెనని సంకల్పించి యున్నామని మైసూరు మహారాజుగారికి కూడ తెలియపరచిరి. బెంగుళూరు నుండి ఈయనను తీసికొనివచ్చుటకు ఒకని పంపిరి.

వీరి తల్లికిమాత్ర మిది యిష్టము లేదు. పదముగ్గురు సంతానము నష్టమైనపిదప ఈబిడ్డ కలిగి వృద్ధిలోనికి వచ్చినందున వీరి తల్లికి వీరియందు మమకార మధికము. కావున నీయన సన్యసించుట ఆమెకు సమ్మతము గాదు. ఈయనద్వారా వంశాభివృద్ధి కావలె నని ఆమె యపేక్షించినది. తల్లియనుజ్ఞ లేనిదే సన్యసించుట కధికారము లేదు. అంతట నీయన తమ తల్లితో "అమ్మా పదముగ్గురు సంతానమును యమధర్మరాజున కర్పించితివే; ఈ నా యొక్కని జగద్గురు పీఠమున కర్పించలేవా. నన్ను పీఠమున కర్పించినను నీవు జీవించియున్నంతవరకు నన్ను చూచుచునే యుండవచ్చును. తరువాత నీకును ఉత్తమగతి కలుగు"నని వినయవిధేయతలతో మాతృభక్తితో ఒప్పించిరి. అంతట వీరిని శృంగేరికి రావించి ఆశ్రమ స్వీకారము చేయించి పీఠాదిపతిగా చేసిరి.

1912 లో వీరు పీఠాధిపతు లయి 'చంద్రశేఖరభారతి' అను యోగపట్టమును బొందిరి. తరువాత అద్భుతమైన తపస్సును గావించి మంత్ర శాస్త్రములో నిష్ణాతు లయి, సిద్ధపురుషులును సర్వజ్ఞులు నయి జీవన్ముక్తులుగ విరాజిల్లిరి. శిష్యుల ప్రార్థన ననుసరించి 1924 సంవత్సరములో దక్షిణదేశ సంచారమునకు బయలుదేరి నాల్గువత్సరములు సంచారము గావించిరి. ఆ నాల్గు సంవత్సరముల

లోను వీరు శిష్యుల ననుగ్రహించుటకై ప్రదర్శించిన యోగలీల లద్భుతములు. ఎంతోమంది పరమనాస్తికులు వీరి దర్శనముచేతను వీరితోడి సంభాషణచేతను ఆస్తికులుగ మారిరి. ఆస్తికులు ఆస్తికోత్తములైరి. దర్శనా దేవ సాధవః అను నార్యోక్తిచొప్పున వీరి దర్శనముచేతనే సర్వ పాపములు నశించును. అంతేకాక సర్వసంశయములు నివారణ మగును. వీరిది దివ్యచక్షుస్సు అగుటచేత వీరికి మన భౌతిక దేహమే కాక మన యంతఃకరణముకూడ గోచరించును. అందుచే వీరి సన్నిధిలో నెట్టి కాపట్యమును దాగియుండనేరదు. దేవతావిగ్రహమును చూచి సంతమాత్రముననే అర్చకుండా విగ్రహమునకు నివేదన పెట్టినది లేనిది వీరు గ్రహింపగలుగుచుండిరి. వీరి కంటికి విగ్రహములు శిలలుగావు. తేజోవంతములైన దేవతలుగా భాసించును. తుంగానది నీటిప్రవాహముగాం గాక దేవతగా గోచరించును. 1924 సంవత్సరములో తుంగానదిప్రవాహము మిక్కుటమై శృంగేరిగ్రామము లోనికి ఇండ్లలోనికి నీరు రాగా జన మందరు వీరిని అపత్తు నివారణ చేయం బ్రార్థించిరి. వీరు నదీతీరమునకు వచ్చి ఆ నదీదేవతను ప్రార్థించి పూజించినారు. అందరి కన్నుల యెదుటనే ఆ నదీప్రవాహమంతయు తగ్గిపోయినది. ఒకసారి ప్రచండ మారుతము జనులను క్షోభ పెట్టినది వీరు ప్రజల ప్రార్థనపై హనుమంతుని యాలయమునకు వెళ్ళి ప్రార్థింపంగా ఆ ప్రచండవాయు వంతట నాగిపోయినది. ఒక వత్సరము వర్షము లేకప్రజలు బాధ పడుచుండంగా వారి మొరల నాలకించి ఋశ్యశృంగ లింగమును బ్రార్థించి యభిషేకము చేయించగా వెంటనే వర్షము వచ్చినది. వీరి యనుగ్రహముచేత డాక్టరులు బ్రతుకరని చెప్పిన రోగులు అనేకులు రోగనిర్ముక్తులైరి. పుత్రులు పుట్టనివారికి పుత్రులు కలిగిరి. నష్టసంతానులు జీవత్పుత్రులైరి. మూగవారు వాచాలురైరి. ఇట్టివి వీరి యద్భుత లీల లెన్నో యున్నవి.

వీరిబోధనాశక్తి యద్భుతము వీరియొద్ద తర్కవేదాంత శాస్త్రముల నధ్యయనము చేసినవారు పలువురు పండితోత్తములై విరాజిల్లుచున్నారు. వీరిగురుభక్తి నిరుపమానము. వీరిగురుపర్యులకు శృంగేరిలో బ్రహ్మాండమైన దేవాలయము కట్టించిరి. కాలడిలోను మైసూరులోను నంజనగుడ్‌లోను బెంగళూరులోను వేదశాస్త్రపాఠశాలలను విద్యార్థులకు భోజనవసతిగృహములను శంకరమఠములను మున్నగువానిని నిర్మాణము చేయించిరి. జగద్గురుత్వము వీరిలో సార్థక మయినది. వీరిశిష్యులలో స్మార్తులేకాక వైష్ణవులు, మధ్వులు పారసీకులు, జైనులు మునల్మానులు, పాశ్చాత్యులు, అన్నిమతములవారును కలరు. వీరు వినయమూర్తులు, వైరాగ్యమూర్తులు, జ్ఞానమూర్తులు, ప్రేమమూర్తులు. నడచునపుడు కాలిక్రింద నేజీవము పడకుండునట్లును వినయముచేతను క్రిందభూమిని చూచుచునే నడచెడరు ప్రపంచములోని నానాత్వములో బ్రహ్మ యొక్క ఏకత్వమును దర్శించు మహాత్ములు. గీతలోని స్థితప్రజ్ఞలక్షణములుగల మహాపురుషులు.

ఇట్టినివృత్తిమహాలక్షణసంపన్ను లగుటచేత లౌకిక వృత్తిని పీఠపాలనము చేయుటకు ప్రవృత్తి లేని వారైరి. అందుచేత యోగ్యుడగు నొకబాలునికి ఆశ్రమ మిచ్చి శిష్యు నిగం వయారుచేసి శాస్త్రముల బోధించి పీఠమును వారికి 1932 లోనే స్వాధీనము చేసిరి. అప్పటినుండి వీరు చాలవర కంతర్ముఖస్థితిలోనే యున్నారు; ఎప్పుడోకాని బహిర్ముఖులు కారు. బహిర్ముఖులైరని తెలియంగనే ఆస్తికులు వారిదర్శనమునకు వచ్చెదరు.

వీరిషష్ట్యబ్దపూర్తికి శిష్యులు రెండులక్షల ద్రవ్యమును సేకరింపంగా తమపేరున నట్టియుత్సవము చేయుటకు వీ రంగీకరింపక, లోకకల్యాణార్థమై చండీయాగము చేయుండని వీ రుపదేశించిరి. ఆప్రకారము గీత 1953 ఏప్రియల్ నెలలో లోకక్షేమమునకై శృంగేరిలో గొప్పచండీయాగము జరిగినది.

వీరిని దర్శించుటకు మైసూరులోని యున్నతోద్యోగులందరు వచ్చుట పరిపాటి. మంత్రులు జడ్జీలు మాత్రమే కాక రాజకుటుంబమునందలివారును. ఇతరదేశముల నుండియు నెందరో ప్రముఖులు వచ్చెదరు. 1953 లో ఇండియా వైస్‌ప్రెసిడెంటు రాధాకృష్ణనుగారును 1954 సంవత్సరము అగస్టుమాసములో భారతదేశాధ్యక్షులు రాజేంద్రప్రసాదుగారును వీరిదర్శనము చేసి వీరియాశీస్సులను పొందిరి. శ్రీరాజేంద్రప్రసాదుగారు వెళ్లిన కాలము వర్షాకాలము; శృంగేరిలో ఆకాలమున వర్షము రాత్రింబవళ్లు తెరపిలేకుండ కురియుచుండును; ప్రసాదుగారు శ్వాసకాసవ్యాధిగ్రస్తులు. అకాలములో స్వామివారిని దర్శించుట ప్రసాదుగారికి సాధ్యము కాదేమోయని తమ సంకల్పశక్తిచేత వర్షము నాపవలసినదిగా శ్రీమంత్రేశ్వరశర్మ మున్నగువారు శ్రీవారిని ప్రార్థించిరి. అంతట శ్రీవారిసంకల్పబలముచే శ్రీప్రసాదుగారు శృంగేరికి వచ్చిన ఉదయము10 గంటలుమొదలు వారు తిరిగిబయలుదేరిన సాయంకాలము అయిదుగంటల వరకు వర్షము రాలేదు సరిగదా సూర్యరశ్మికూడ వచ్చి శ్రీరాజేంద్రులయభీష్టము నెరవేరినది.

సర్వదా లోకకల్యాణమును కోరునట్టియు లోక మంతటిచేతను పూజింపబడుచుండునట్టియు జీవన్ముక్తులగునట్టియు నీమహాపురుషులు గతమహాలయామావాస్య ఆదివారము 26-9-54 తేదిని భౌతికదేహమును వీడి విదేహమూర్తులైరి.

# బెజవాడ—కృష్ణానది—దుర్గాక్షేత్రము

ఇది పరాశక్తియైన కనకదుర్గకు స్థానమైనందున "కనకపురి లేక కనకవాడ" యనియు, మహిషాసుర విజయము నకు స్థాన మగుటచే "విజయవాడ" యనియు, మరిన్ని సహ్యాద్రినుండి శ్రీ కృష్ణవేణి తెచ్చిన యోషధులు నాట బడిన పురి యగుటచే 'బీజవాటిక" యనియు పిలువబడ జొచ్చెను. 'బీ జ వా టి క' శబ్దముయొక్క అపభ్రంశ రూపమే, యిప్పటి "బెజవాడ" యై యుండనోపును.

కృ ష్ణా న ది :— ఈ పట్టణణమునకు ద క్షి ణ ది శ ను (పడమర నుండి తూర్పుగా) కృ ష్ణా న ది ప్రవహించు చున్నది.

శ్లో॥ గోదావరీ భీమరథి కృష్ణవేణ్యాదికా స్తథా ।
సహ్యపాదోద్భవా నద్య స్స్మృతాః పాపభయాపహాః ॥

అను విష్ణుపురాణోక్తవచనములనుబట్టి, స హ్యా ద్రి నుండు బుట్టిన కృష్ణవేణ్యాదినదులు పాపభయములను తొలగించు స్వభావము గలవి యని తెలియుచున్నది. మరియు, గంగా గోదావర్యాది నదు లన్నియు సృష్టికాల మున బ్రహ్మదేవునిచే సృష్టింపబడినవనియు, అవి పాప హరము లనియు, కాని, కృష్ణానది శ్రీమన్నారాయణునిచే స్వయముగా కల్పింపబడెననియు, సదాశివుడు స్వశరీరము నుండి వేణీనదిని కల్పించెననియు, ఆ రెండును కలిసి 'కృష్ణవేణి' యను పేరున లోకమున ప్రసిద్ధి నొందెననియు, ఆ వెనుక, బ్రహ్మ నానాతీర్థములను కల్పించెననియు, ఆ కారణమున యీ పుణ్యనది పాపహరమేగాక విశేష పుణ్యమని పురాణములు తెలుపుచున్నవి. సహ్యాద్రియొక్క ఉత్తర శృంగమునకు బ్రహ్మనగమని పేరు. అచట బ్రహ్మ శ్రీమన్నారాయణునిగూర్చి తప మాచరించెను.

కృష్ణానది సహ్యాద్రియందు మహాబలేశ్వరముయొద్ద పుట్టి, సతారా పట్టణమున కైదుమైళ్లు దూరమున వేణీ నదితో కలియుచున్నది. అటనుండి యేకముఖమై కృష్ణ వేణి యను పేర ప్రవహించుచున్నది.

శ్లో॥ "కృష్ణా విష్ణుతను స్సాక్షా ద్వేణీ దేవో మహేశ్వరః ।
తయోః సంగమో యత్ర కోటి తీర్థ స్సమ స్స్మృతః॥

అని ప్రమాణముకలదు. ఈ కృష్ణవేణియందు విశాలా, తుంగభద్ర, భీమాద్యు పనదులు మరి కొన్నికలియు చున్నవి. ఈ నదిని మహా భారతమునందు 'నదాని రామయాం కృష్ణాం మందగాం మందగామినీం' అని వ్యాసులవారు స్తుతించియున్నారు.

పైజెప్పిన భీమనదియే పండరీ క్షేత్రమున చంద్ర భాగయను పేర పిలువబడుచున్నది. స్వచ్ఛత్వము, రుచ్యత్వము, దీపనత్వము, పచనత్వము నను నవి నదీజల గుణము లని వైద్యశాస్త్రము చెప్పుచున్నది.

కృష్ణానదికి సహ్యాద్రియే ముఖము (మహా బలేశ్వరము); నరహరిపురము (నర్సోవాడా) హృదయము ; ఆంధ్రదేశ మున శ్రీశైలము మొదలు శ్రీకాకుళము వరకు నాభి ; పెదకళ్లేపల్లి, హంసలదీవి మొలగు ప్రాంతము పాదయు గళము. దీని కిరు పార్శ్వములయందు ననేక తీర్థములు గలవు. వాని నామములు మహాత్మ్యములు అనంతములు నప్రమేయములునై యున్నది. అందు విష్ణు, ఆమలక, రుద్ర, బ్రహ్మ, వేణీసంగమ, కకుద్మినీ, నిర్ఝర, విహంగమ, భైరవ, వాసుకి, పౌలస్త్య, మార్కండేయ, విశాలాది సంగమకుబ్జేశ్వర, మహాఘహరీ, సప్తసాగరమూర్తి వర్ధన, కౌశికీ, సప్తకులోద్ధార, కులతారక,భారత, ముని, మధు, కంక, శూరదర్పహర, జంబూశతలింగ, క్రౌంచ, యజ్ఞవాట, ఆదిత్యహృదయ, అష్టతీర్థ సంగమ, స్కందపుర, అనంత, సూర్య సప్తకోటి, ఋణాపహరణ, మలాపహారి, లింగతతీ, జాతిస్మర, విష్ణుచాయా, సప్తర్షి, శ్రీశైలస్థ పాతాళగంగ, ముక్తిక్షేత్ర (ముక్త్యాల), వేదాద్రి, అమరేశ్వర, దుర్గ, ఉభయ రామేశ్వర, (అయిలూరు, చిలుమూరు), సర కోత్తారక (సడకుదురు), శుక్లతీర్థ (వెల్లటూరు), అగస్త్య. వ్యాఘ్రపురి (పెదపులివెర్రు), మోర్తోట, అనగావేణీ సాగర సంగమ, సుబ్రహ్మణ్య (మోపిదేవి), క్రోశతీర్థ (కోసూరు), టేకువన (టేకుపల్లి), కదళీ పురతీర్థ (పెదకళ్లేపల్లి), హంసలదీవి (కృష్ణాసాగర సంగమము అను-తీర్థములు ప్రశస్త ములై యున్నవి.

తీర్థము లన్నిటిలో మున్ముందు ప్రశంసింపదగినది మహాబలేశ్వరము (కృష్ణవేణీముఖము) ; కృష్ణానది జన్మించిన స్థలమున కిది యనతిదూరమున కలదు. పూర్వము రావణాసురుడు ఈశ్వరునిగూర్చి తప మాచరించి, ఆత్మ లింగమును సంపాదించి లంకకు గొనిపోవుచుండగా, మధ్యలో యీ స్థలమున నా లింగము నిలిచిపోయెను. దీని వివరములు యీ గ్రంథములో మహాబలేశ్వర క్షేత్ర మహాత్మ్యమున చూడనగును. రావణుని బలాతిశయ ప్రభావముచే నా లింగము గోకర్ణాకృతిని ధరించెను. నాటి నుండి యీశ్వరుడు గోకర్ణేశ్వరుడన బరగెను. ఈ క్షేత్రము (గో క ర్ణ క్షే త్ర ము) నందు బ్రహ్మహత్యాదోషయుక్తులును, చండాలురును క్షే త్ర ప్ర భా వ మున సర్వపాపవిముక్తులై ఉత్తమ జన్మము లొందుదురని దత్తపురాణాదిగ్రంథములు తెలుపుచున్నవి.

కృష్ణవేణీ హృదయము: – సంగమేశ్వరపురము (సర్వేవాడా), గాణుగాపురము, కురుగడ్డ, మొదలగు ప్రదేశము బ్రహ్మ, విష్ణు, శివాంశలవలన, అత్రి అనసూయలయం దుదయించిన దత్తాత్రేయులు, అనంతర మా దత్తాత్రేయావతారమూర్తులగు శ్రీపాదయతులు శ్రీ నృసింహ సరస్వతీయతీంద్రులు మొదలగువారు సంచరించిన పుణ్యభూములు. కృష్ణవేణికి నాభిదేశము శ్రీశైలము. (శ్రీశైలక్షేత్ర మహాత్మ్యమును చూడవలెను.)

శ్రీ దుర్గా క్షేత్రము

బెజవాడ పట్టణమునకు సమీపమున పశ్చిమదిశను కొన్ని కొండల పంక్తి కలదు. అందు దుర్గాలయమున్న కొండకు ఇంద్రకీలాద్రి యందురు. ఈ పర్వతము సదిష్టించినవాని నింద్రకీలుడనిరి. ఇతడు పూర్వకల్పమున కృష్ణవేణియందు ప్రతిదినము స్నానము చేయుచు, నా నదికుత్తర భాగమున తప మాచరించెను. పార్వతీ పరమేశ్వరు లాతనితపమునకు మెచ్చి వర మడుగుమనిరి. వల్లె యని, తాను పార్వతీపరమేశ్వరుల కాసనముగ నుండు భాగ్య మిమ్మని ప్రార్థించెను మహిషాసుర సంహారానంతరము దేవర్షి సిద్ధసాధ్యాదిబృందములయొక్క ప్రార్థనమున కొడంబడి, పరదేవత మహిషాసురుని సంహరించుటకు ధరించిన స్వరూపముతో నింద్రకీలునకు పూర్వ మిచ్చిన వరములను సఫలత నొందించుట కీపర్వత హృదయపీఠమం దావిర్భవించెను.

[సశేషము]

---

# ధర్మస్య తత్త్వం నిహితం గుహాయామ్

భారతీయ నాగరకతాయాః ప్రధానహేతుః భారతీయైః ధర్మస్వరూపం సమ్యగవబుధ్య యథాక్రమం తదాచరణమేవ ॥

ధర్మశబ్దస్య కేచన మత మితి, అన్యే ఆచార ఇతి, అపరేతు శీలమితి, పరేతు నీతినియమ ఇతి ప్రాదేశిక మర్థం వదంతి. వస్తుత స్తు "ధారణా ద్ధర్మ" ఇత్యాహుర్ధర్మో ధారయతి ప్రజాః" ఇత్యనేన ధర్మఃప్రజాః పశుభ్యోరక్షతి ఇతి మానవాన్ రక్షితుం సమర్థః, సార్వజనీనః, సార్వకాలికశ్చ ఇతి జ్ఞాయతే.

ధర్మాచరణస్య సాధనాని ఏవ ముచ్యంతే

"ధృతిఃక్షమా దమో ऽస్తేయం శౌచ మింద్రియనిగ్రహః।
ధీ ర్విద్యా సత్య మక్రోధో దశకం ధర్మలక్షణమ్" ఇతి,

"విహితక్రియయా సాధ్యో ధర్మః పుంసాం గుణో మతః" ఇతి, సౌమ్యతా, అపరూపతాపితా, అనసూయతా, మృదుతా, అపారుష్యం, మైత్రతా, ప్రియవాదిత్వం, కృతజ్ఞతా, శరణ్యతా, కారుణ్యం, ప్రశాంతిశ్చ "ఇతిచ."

ఏవమాదీని ధర్మసాధనాని ఆచరన్ మానవః, ధర్మేణ సుశిక్షితః, సువ్యవస్థితశ్చ స్వయం భవతి. తేన ఆత్మానం ఆత్మజ్ఞతయా ఉపకుర్వన్ శాంతి, సహన, ఉపకారాది గుణైః స్వీయా నప్యుపకురుతే, యథా యథా చ ధర్మాచరణే ఉత్కృష్టోభవతి తథా తథా స్వస్య, స్వకులస్య స్వజాతేరపి ఉపకారకో భవతి, స్వయం చ నిగూఢం ధర్మతత్త్వం విజ్ఞాయ, బాహ్యాభ్యంతరరూపం ద్వివిధ మపి ధర్మం మనసా, శరీరేణచ ఆచరన్ అభ్యుదయం, నిశ్శ్రేయసం చాధిగచ్ఛతి.

ధర్మస్య విపులతయా ప్రాచీనైః తత్తదనురోధేన "రాజధర్మాః, మాణవకధర్మాః, కింతు సార్వజనీనః, సార్వకాలికశ్చ సార్వత్రికో ధర్మః సత్యాహింసారూపః సర్వేషామపి సాధారణః సర్వైరపి ఆచరణీయ ఏవ, పరంతు వ్యక్తేః, సంఘస్య జాతేశ్చ ఆవశ్యకాని ధర్మసాధనాని, తత్తత్కాలానురోధేన సంస్కృత్య విద్వద్భిస్తైస్తైస్సాలభ్యేన ఆచరితుం యోగ్యాని నిర్వచనీయాని, తదైవ పండితైః సామాన్యమానవైశ్చ సమం ధర్మమవలంబితుం శక్యతే, తత్ఫలంచాను భోక్తుం.

అతః యదా ప్రాచీనా మునయః ప్రజాహితైకకాంక్షిణః ధర్మస్వరూపం తత్తద్దేశకాలానుసారేణ వివిచ్య నిరవోచన్ ఏవం ఆధునికాః విద్వాంసోऽపి ప్రజాహితం, దేశహితంచ కాంక్షంతః ధర్మనిర్వహణాదేవ అద్యాపి భారతదేశస్య సర్వోత్కృష్టత్వమిత్యవగచ్ఛంతః, ధర్మసాధనాని సర్వమానవాచరణ సులభాని, సుగ్రహాణిచ విధాయ, ఆత్మనాం హృదయవైశాల్యం, భారతీయానాం ధర్మతత్పరత్వంచ ప్రకటయేయు రిత్యాశాస్మహే.

"ధర్మఏవ హతో హంతి ధర్మో రక్షతి రక్షితః।
తస్మా ద్ధర్మో న హంతవ్యో మా నో ధర్మో హతో ऽవధీత్॥"

"ఇతి శమ్"

# విశేషములు

కీర్తిశేషులగు శ్రీ. సి. వి. యల్ వరప్రసాదరావుగారి స్మృతినిగూర్చి పలువురు తమసంతాపమును దెల్పియున్నారు. ఆవార్తలందుఁ గొన్నింటి ప్రకటించుచున్నాము.

1. శ్రీ సింహాచల దేవస్థానాగమ పాఠశాలలో 17-9-55 సభ జరిగినది. ఎక్జిక్యూటిక్ అఫీసరు శ్రీ డి. యల్. నరసింహరాజుగా రధ్యక్షులు. తీర్మానము :—"శ్రీహిందూ దేవాదాయ, ధర్మాదాయశాఖ డిప్యూటికమీషనరువారగు శ్రీ. సి. వి. యల్. వరప్రసాదరావుగారి యకాలమరణమునకు తమసంతాపమును వెలిబుచ్చుచు వారిగుణగణమును కొనియాడుచు వారాంధ్రదేశదేవాలయాభివృద్ధికై చేసిన సేవను ఆరాధనపత్రికను స్థాపించుటద్వారా చేయుచుండిన విజ్ఞానసేవను కీర్తించుచు శ్రీవరాహలక్ష్మీ నరసింహస్వామివారి "ఆగమపాఠశాలా" స్థాపనకు వారు చేసిన దోహదమును గుర్తించుచు వారియాత్మశాంతికి స్వామివారిని ప్రార్థించుచు వారి కుటుంబమునకు సానుభూతి తెలుపుటకు తీర్మానించడమైనది.

2. తే 18-9-55 ది పెనుగొండ ఆర్యవైశ్యయువజన సంఘము వారి కార్యవర్గసమావేశము:—అధ్యక్షులు శ్రీ సూరి లక్ష్మీనారాయణ జమీందారుగారు.

"హిందూదేవాదాయధర్మాదాయ డిప్యూటికమీషనరు శ్రీ. సి. వి. యల్. వి. ప్రసాదరావుగారు ఉద్యోగములో ప్రవేశించిన లగాయతు అమితమైన శ్రమతో మిక్కిలిచాతుర్యముగా శాఖకు ఎక్కువ సేవ చేయుచు దేవాలయములు అతివైభవముగా వృద్ధిపరచు సమయములో అకాలమరణము పొందినందులకు వారియాత్మకు శాంతి కలుగుగాక యని శ్రీవాసవాంబను ప్రార్థించుచు వారికుటుంబమునకు సానుభూతి తెలుపుటకు తీర్మానించడ మయినది."

---

# తుదికలయిక

కె. ఎ. పి. చౌదరి

కాలచక్రమున బడి ధర్మము నలుగుచున్నప్పుడు మహాపురుషు లుద్భవించి ప్రాచీన అర్వాచీన ధర్మములకు మేలు కలయిక చేకూర్తురను మన యార్ష ధర్మము ముమ్మాటికి సత్యము. అట్టి దైవమతస్థాపన నిర్వహణమును మనేక్కాయ కర్మల సేవించి తరించినవారు కీర్తిశేషులయిన శ్రీ చల్లకొండ వెంకట లక్ష్మీ వరప్రసాదరావుగారు.

శ్రీ ప్రసాదరావుగా రున్నతోద్యోగమునఁ బ్రవేశించినప్పటి నుండి యాంధ్రదేశమున గల్గు దేవాలయముల నత్యంతాభివృద్ధికి దెచ్చుటయేగాక ధర్మకర్తలకు, పూజారులకు దమలో దమకున్న విభేదములను సహనభావముతో జక్కదిద్దిరి దేవాలయముల సక్రమమైన మార్గముల పెంపొందించిరి. నిత్యార్చనలయందు ధర్మకర్తలను, దిగువ యుద్యోగివర్గమును, అర్చకుల సప్రమత్తులగా నొనర్చిరి. పొట్టకు బట్టకు గాక సేవాధర్మమునకు నిలువెల్ల వ్యయించు పుణ్యామూర్తులలో వీరి కగ్ర తాంబూల మొసగి పూజించుట నిరాకేపణీయమగు కార్యమని వారి నెరిగినవారి కెల్లరకు విదితమే.

అనవరతము చిరునవ్వు గురియించు ముఖములో నెప్పట్టునను తళుకుబెళుకులు గాన్పింపవు. హృదయమున నున్న సత్యధర్మములు మాత్రమే స్వచ్ఛములై కాన్పించును అట్టి పవిత్రమూర్తితో నా తుదికలయిక నాటి ప్రసంగము ఆ మధుర స్మృతులు హృదయమును హత్తుకొని క్షణక్షణమును గ్రొత్త రేపుచున్నవి.

మొట్టమొదటిగా నన్ను జూచి "ఆరాధన" పత్రిక శాశ్వతముగా సాగుటకు ముఖ్య దేవస్థానములవారి సహాయము కావలెను. అందులకు ముద్రణవ్యయమును అన్నవరము దేవాలయమువారు; సిబ్బందిఖర్చు నంతయు సింహాచల దేవాలయమువారు భరించెదరుగనుక మీ పొన్నూరు శ్రీ భావనారాయణ స్వామి దేవస్థానమువారు కాగితమునకు కావలసిన ద్రవ్యమునుమాత్ర మొసగు డనిరి. పత్రికాముఖమున నీ ధర్మముల నెల్లర కందుబాటొనర్చు వీరి యూహ లెంత పవిత్రములైనవి. మా భావదేవునిచరిత్ర వెల్లడి యగునట్లు ప్రతిమలతోగూడిన కళ్యాణమండపమును; హిందూమత గ్రంథాలయ నిర్మాణమునకై శాశ్వత భవనమును గల్పింప ప్రోత్సహించిరి. దేవాలయావరణము లోపలిభాగముల బాగుపరచి నూతన శిల్ప కళాఖండముల నుంప శ్రీవారు మా కెంతయో యండదండలుగా నుండిరి.

క్రమశిక్షణతో నభ్యసించు విద్యార్థులు లేకుండుటచే ఆగమ పాఠశాల నడుప మా కసంతృప్తిగ నున్నను ధర్మ

యుగ ప్రారంభము సమీపమున నున్నదని మందస్మిత ముతో సమాధానపరచి సదుపుట కుద్యమింపచేసిరి. భజం త్రీలకు మంగళవాద్యముల నేర్పించి సుస్వరములతో త్రికాలముల దేవాలయముల సేవింప నొక పాఠశాలను మా దేవాలయమున నెలకొల్ప నూచించిరి. ఉత్సవము లలో కవుల, గాయకుల, శిల్పుల, తత్వవేత్తల రావించి వారి యమూల్యములైన యుపన్యాసముల ప్రజల కెల్లర కెరుకపరుప నుబలాటపడుచుందురు.

ఇట్టి పవిత్రాశయములుగల మా వరప్రసాదరావుగారు శతాయుష్మంతులై దైవసేవ, దానివలన మానవసేవ చేయ నోచుకొననని యాంధ్రులు చురదృష్టవంతులు. 1953 సెప్టెంబరు నాల్గవ తేది యీ యుద్యోగముచేరినాడు. కల గిన తొలి కలయిక సరిగా రెండు సంవత్సరములకు (1955 సెప్టెంబరు మూడవతేది) నా తుదికలయిక యైనది. ఆజన్మాంతము మరపునకు రాని సన్నివేశములు మాత్రము శ్రీవారి మూర్తిని నా కగుపరుపగలవు. శ్రీ వర ప్రసాదరావుగారి కుటుంబమునకు నా హృదయపూర్వక సానుభూతి.

వారియాత్మకు భగవానుడు శాంతిని జేకూర్చుగాక—

ఓమ్ తత్సత్.

---

# విషాదపంచకము

శ్రీమాన్, కవిరాజశిరోమణీ, పండిత. డీవి. నరసింహా చార్యులు, అష్టావధాని.

అవనిగడ్డ

1. సీ ॥ జననమా? యాంధ్రదేశసులలా మామణీ
సీమంతవైశాఖ - సీమయందు
వంశమా? సత్కళా - వర్ధిష్ణులొప్పారు
చలికొండ నామంబు - సార్థకంబు
విద్యయా? ఆంగ్లా-౦ధ్ర - విమలగీర్వాణముల్
బీ. యె. బీ యెల్‌శాఖ - పేరు వడసి
ఉద్యోగమా? ముక్తి - సద్యోగ సంపత్తి
దేవాలయంబులు - దైవసేవ.
గీ ॥ వృత్తియా? భక్తి, చిత్తని - వృత్తిశక్తి
నిండు సహవాసమా? దండి - పండితాళి
చెలగి, చరితార్థ మెటుఁగాదొ? జీవితంబు
సరసగుణధుర్య, సీ. వి. ప్ర - సాదవర్య ॥

2. సీ ॥ అమరేంద్రు డేమైన - యాహ్వాన మంపెనా?
సురలోకమున నిన్నుఁ - జూడఁగోరి
సత్యలోకమునుండి - చారులఁ బంపిరే?
బ్రహ్మవేత్తలు మిమ్ము - బ్రస్తుతింప
కైలాసపతి మీకు - కబు రంపెనా యేమి?
సవతి భార్యలపోరు - సంధిసేయ,
వైకుంఠనాధుఁడే - వార్త నంపించెనా?
సత్వగుణంబునుఁ - జాటుకొరకు.
గీ ॥ కాకయున్నను నిట్టు ల - కాలమరణ
మంద నేలను? వయ సది - వంద లేక,
మమ్ము విడనాడి పోయితే - మాన్యచరిత?
భక్తగుణమోద - సీ. వి. యల్ - వరప్రసాద! ॥

3. సీ ॥ ప్రాబల్యు కల్కని - వానమ్ము వదనమ్ము
శమదమాదిరసార్థ - సరణిఁ దోప,
ఆవేశ లక్ష్మని - త్యక్రీడ హృదయమ్ము
సమహిత తత్వర - సమ్ములొలుక
సత్యదృఢత్వసం - స్థానాధిపతి వాక్కు
చవులూర నమృతవ-ర్షములుఁ గురియు.
సదమల తేజస్సు - సౌంధ్యరజోరోచి
సభలలో వింతతే - జములుఁ బర్వ
గీ ॥ కరుణ నర్చకులకు, ధర్మ - కర్తలకును
జెలగు వైరముల్ మాన్పి, రా-జీలు సేయ
విమల బోధలు వీనుల - విందుఁ గాఁగ
వినెడి భాగ్యంబు మా కింక - విఫల మయ్యె ॥

4. సీ ॥ సాధించితివిగదా! సంస్కృతంబున నిరా
ఘాటమౌ సాహితీ - పాటవంబు
ఆర్జించితివిగదా! అఖిలశాస్త్రాలలో
అర్థవిద్యాసుర - హస్యమెల్ల
పాలించితివిగదా! పరమపవిత్రమౌ
దేవాలయంబులఁ - దీర్చి దిద్ది,
బోధించితివిగదా! బుధులు మెచ్చెడు రీతి
నాగమార్థంబుల - నమలమతిని,

గీ॥ వేదవిద్యల నభివృద్ధి - వేడ్క సేయ
పాఠశాలలు, పెట్టితి - భక్తితోడ
శిల్పకళలను మరి నెల - కొల్పితీవు,
సాధుజనగేయ - సీ. వి. ప్ర - సాదరాయ॥

5. సీ॥ చల్లని హృదయంబు - సరసగం భీరంబు
చలికొండ వంశంబు - చక్కసాక్షి.
వాంఛితార్థములెల్ల - వలనొప్పఁ దీర్పంగ
వరప్రసాదను పేరు - వఱలుసాక్షి
ధర్మపరిరక్షణ - తత్పరుం డనుటకు
దేవాలయంబులే - దివ్యసాక్షి
లలితకళోపాస - లాలసుం డనుటకు
"ఆరాధనంబె" మా - కరయ సాక్షి

గీ॥ సాధువర్తన పటుడౌట - సర్వసాక్షి
బ్రహ్మ విదుడవు నీ వన - ప్రజలె సాక్షి
చతురగుణ కీర్తి - సీ. వి. ప్ర సాదమూర్తి
కోరి యాత్మకు శాంతి చే - కూరుఁగాత॥

శ్రీ శ్రీ శ్రీ

---

# NOTES AND COMMENTS

Messages of grief and sympathy anent the death of our late Deputy Commissioner Sri C. V. L. Varaprasadarao Garu have been received from the following gentlemen and institutions:—

Sri T. V. Sivaramaiah Garu Advocate, Nellore.:—His death was indeed sudden and unexpexted.

He was a good man and in the particular department has done much good service.

2. Sri K. Ramarao, Advocate, Nellore:—He was indeed a lovable character and his death is a hard set back to your activities.

3. Sri M. Srinivasulu Reddy, Trustee, Sri Venugopala Temple, Moolapet, Nellore:- His death was untimely unexpected and irreparable. We have lost a gem of an administrator. It was he who led the Trustee—Archaka compromise.

4. Sri D. Subrahmanyam, M. A. B. L. Government Pleader, Nellore:—He was a nice judge, a good gentleman and a gentle man.

5. Sri G. Seshadri Iyengar, Assistant Cotton Specialist, Agricultural Research Station, Nandyala: Your editorial in the last issue on "Brahmavit apnoti Param" is perfectly a true depiction of the departed soul without any exaggeration.

6. The Trust Board of Sri Subrahmanyaswami temple, Tiruttani have at their meeting on 7-10-55 expressed their deep sense of sorrow at the sudden demise and offered their condolences to the members of bereaved family.

7. "The Board of Trustees of Sri Lakshminarasimha swamy temple, Mangalagiri express herein our sincere condolences for the sudden and premature death of Sri C. V. L. Prasada Rao. He had been a source of inspiration for all the trustees and Archakas. He was a fountain of kindness and sincerity. May his soul rest in peace."

# A PAGEANT OF INDIAN PHILOSOPHY

*By*

N. RAMESAN M.A., I.A.S.,

*(Continued from previous issue)*

### Chapter III
### The Vedic Hymns.

The Vedas are the earliest utterances of the human mind that we possess. The date of the Vedas cannot be determined precisely. Opinion is divided that they are as old as 6000 B. C. and as early as 1000 B. C. However, Buddhism which developed and spread in India about 500 B. C. presupposes not only the existence of the Vedic Hymns, but also the entire body of Vedic thought included in the Āranyakas and Upanishads. For the liturgy of the Brahmanas and the metaphysics of the Upanishads to develop, would require at least a thousand years. So we can date the Vedas as certainly not later than 1500 B. C., and there, we have to rest content, in the light of our present knowledge. The Vedas are thus long anterior to the Greek civilisation, anterior even to the oldest vestiges of the Assyrian and Babylonian empires, and posterior, if at all, to the famous Egyptian dynastics of which however nothing exists except names. All religious denominations in India have recognised the Vedas as their supreme authority, and what is more remarkable is, that the text of the Samhitas, has been preserved, intact, by oral tradition, over a long period of three thousand five hundred years. This feat is unequalled in the history of the human race. Still in villages we can find, veritable walking encyclopaedias of Vedic hymns, reciting the songs in the same tone and intonation as their forefathers did 3500 years ago. The same careful and meticulous preservation of the text, cannot be said to exist for the Sanskrit classics or even for the Upanishads. This amazing vitality of the Vedic hymns, is itself proof positive that it is the very fountain source for the religion of India.

There are four Vedas, the Rig, Yajus, Sāma, and Atharva. The first three Vedas, of which the Rig Veda is the chief, agree among themselves in their form, language and contents. The Rig Veda is the spontaneous outpouring of the early Āryans, in their contact with ravishing nature, and it contains in hymns like the Nāsadiya Hymn, the expression of the human spirit, in union with the universal Spirit. As the Āryans came into contact with the Dāsyus, or the local inhabitants, there arose in them a need to collect and preserve, their hymns, so that they may not be contaminated by mixture with the local culture. Hence arose the Samhitā, or collection, of the Rig Veda. There must have been a considerable period of time between the composition and compilation of the Rig Samhita, and the date 1500 B.c., can only approximate to the latter one. When they were composed, who composed them, and under what circumstances are not known. The Sāma Veda has no peculiar qualities. Much of it is found in the Rig Veda, and its own peculiar hymns, have no distinctive lessons to teach apart from the Rig Samhita. The Sāma vēda was developed to be sung at sacrifices. Therein lies its only importance. The vedic hymns, especially those in poem form, are

composed as to be sung in three swaras. It is well known that for a Rāga, in music, to develop, there must be a minimum of five swaras, at least, both in the Ārōhanā, and Avarōhana. Anything less then this, will not constitute a Raga. A familiar example of this is Mohana Raga, which has only five swaras, Sa, Ri, ga, pa, dha, sa. It is called "Audava-Audava" rāga, *ie* a rāga, having the minimum five swaras, both in Arohana and Avarōhanā The Rig Samhita, has only three swaras, and hence it gives a certain musical intonation, while properly sung, without constituting a full fledged rāga. Sama Veda is an improvement on this, and has four swaras. It is a nearer approach to a regular raga, and hence is more musical than the Rig Samhita, and is useful to be sung at sacrifices. The Yajur-veda also, like the Sama Veda, was constituted to serve only a liturgical purpose. In importance and thought, it has nothing which is not contained in the Rig Veda. The Sama and Yajur vedic hymns, must have been collected in the interval between the Rig Veda, and the Brahmanic period, when the ritualistic aspect of religion was well established. The Atharva Veda, in the orthodox circles, is not given the status of a veda at all, but for purposes of appreciation of the development of thinking in India, its study is very important, because unlike the Sāma and Yajur vedas, which are only a continuation of Rig Veda, it has its own independent contents. Here we reach to a world of occultism and wizardry, as opposed to the spiritualism of the Rig Samhita. It probably represents the fusion of the Aryan thought, with the local goblins of the Dasyus. This development of Vedic thought is well brought out in the following quotation of Whitney. "In the early Vedic times, the sacrifice was still, in the main, an unfettered act of devotion, not committed to the charge of a body of privileged priests, not regulated in its minor details, but left to the free impulses of him who offered it. As in process of time, however, the ritual assumed a more and more formal character, becoming finally a strictly and minutely regulated succession of single actions, not only were the verses fixed which were to be quoted in the ceremony, but there established themselves a body of utterances, formulas of words, intended to accompany each individual action of the whole work to explain, excuse, bless, etc-etc. These sacrificial formulas received the name of Yajus, from the root Yaj, to sacrifice. The Yajur-Veda is made up of these formulas, partly in prose and partly in verse, arranged in the order in which they were to be made use of at the sacrifice."

Each Veda consists of three parts called Mantras, Brahmanas and Upanishads. In between the Brahmanas and Upanishads, come the Aranyakas. The collection of the hymns is called the 'Mantras' or the Samhitā as it is sometimes called. The Brahmanas, include religious precepts and duties. The Aranyakas and Upanishads are the concluding portions of the Brahmanas and contain discussions on metaphysics and philosophy. "While the hymns are the creation of the poets, the Brāhmanas are the work of the priests, and the Upanishads, the meditations of the philosophers." The Mantras are the religion of nature, the Brahmanas, the religion of Law, and the Upanishads, the religion of the spirit, The Aranyakas form the transition link between the ritual of the Brahmanas and the philosophy of the Upanishads, and suggest to the Grihasta who has retired into an Aranya as a Vanaprastha, a substitute for the

ritual he need no longer perform, and suggest the symbolic and spiritual aspects of the Yagna or sacrifice, as seeds for meditation. In the Brahmanas, the householder is tied down by ritual worship; in the Aranyakas, higher values are suggested to him and he is asked to meditate and go behind the ritual; and in the Upanishads, he attains to full realisation and knowledge of the Self. As Dr. Radhakrishnan so aptly puts it, the Upanishads, while in one sense are continuation of the worship, are in another sense a protest against the religion of the Brahmanas. Worship becomes an act of spiritual self-surrender, and in the region of the spirit, ritual has no place. It is from the thought of this period, that almost all later philosophies derived their life force. Many technical terms like, Brahman to stand for the Supreme principle of existence, Atman to stand for the individualised divinity, yoga, for the technique of the realisation that Atman and Brahman are the same in essence. etc-etc. were derived, from the terminology of this period only.

The Rig Veda contains 10,522 mantras, the Sama Veda 1875, the Yajur Veda (the Vajaseniya Samhita recension) 2086, and the Atharva, 5987. Thus the Vedas consist of a total of 20,500 mantras alone, apart from the Brahmanas, Aranyakas & Upanishads. However, most of them are repetitions of the Rig Samhita and hence by a study of the Rig Veda alone, we can have a fairly accurate picture of the thought of the Vedic times. The Rig Samhita of 10,522 mantras, is divided into 1017, suktas or hymns. This is divided into eight astakas, each having eight adhyayas, which are further subdivided into vargas or groups. A more popular division is into ten mandalas. The first mandala containing 191 hymns, is ascribed to fifteen Rishis like Gautama, Kanva etc. Within each mandala, hymns addressed to Agni come first, Indra next and so on. This order of priority is strictly maintained. Ths 2nd, 3rd, 4th, 5th, 6th, and 7th mandalas, are ascribed to a single family of poets. The 8th mandala, like the 1st is ascribed to several Rishis. The 9th mandala consists of hymns to Soma. The 10th mandala is said to be a later appendage, and contains much philsophical thought.

Before considering the Rig Veda in detail, it may be useful to speculate on what exactly is the spirit of these Vedic Hymns. Are we to hold with many western scholars, who have not got any cultural background on India, that the hymns are, as one author says, "primeval child-like prayer," or as Bloomfield says "sacrificial compositions of a primitive race which attached great importance to ceremonial rites"? All these fanciful notions of Westerners spring, from the fact, that they have been trained to think that nothing worth while originated in human race except at Greece. The following extract * from Paul Brunton, a noted authority on Yoga, though a Britisher, should set at rest, these fanciful notions.

"Pythagoras, who travelled to India and succeeded in obtaining initiation into the secret wisdom of the Brahmins, divided men into three classes, placing those who loved philosophy in the highest class. It was indeed in this connection that he coined and used the word PHILOSOPHY, and was thus the first European to do so. Ammonius, who founded an important mystical and philosophical school at Alexandria also divided his disciples into three grades,

* "Hidden Teaching beyond Yoga" (Rider publiation—page 86)

placing them under oath not to reveal his higher philosophical teachings. His rules were copied from the more ancient Grecian mysteries of Orpheus, who according to the historian Herodotus, brought them from India". A Herodotus, come to Judgement! So much for western scholars.

The celebrated and classical inter pretation of the Vedas in our country is by Sayanacharya. He is a famous commentator, whose interpretation, is accepted by all thinkers. He adopts the naturalistic interpretation of the gods of the hymns, and sometimes interprets them in the light of the later Brahmanic religion. In our own time Sri Aurobindo, the renowned poet-mystic, Pondicherry, has suggested that the Vedas are replete with suggestions of secret doctrines and mystic philosophies. His words should carry much weight with as, as he spoke not on the thin stilts of intellectual speculation, but out of the depths of his great and authentic spiritual ecstasy. Writing in the Arya Sri Aurobindo says.

"The hypothesis I propose is that the Rig-Veda is itself the one considerable document that remains to us from the early period of human thought of which the historical Eleusinin and Orphic mysteries, were the failing remnants, when the spiritual and psychological knowledge of the race was concealed for reasons now difficult to determine, in a veil of concrete and material figures and symbols which protected the sense from the profane and revealed it to the initiated. One of the leading principles of the mystics was the sacredness and secrecy of self knowledge, and the true knowledge of the gods. This wisdom was, they thought, unfit for, perhaps even dangerous to the ordinary human mind, or in any case liable to perversion and misuse and loss of virtue if revealed to vulgar and unpurified spirits. Hence they favoured the existence of an outer worship effective but imperfect for the profane, and an inner discipline for the initiate, and clothed their language in words and images which had equally a spiritual sense for the elect and a concrete sense for the mass of ordinary worshippers. The Vedic hymns were conceived and constructed on these principles". These are :weighty words coming from a mystic of the order of Sri Aurobindo and deserve the fullest weight. Except for some such reason, we cannot satisfactorily account for the extreme secrecy that surrounded the teaching of Vedas till recent times. Probably it was felt that an austere religion, which described God as he is, and not as he is imagined to be, would destroy the social fabric of the masses. Or it was felt that the aristocratic nature of this philosophy, was mentally so abstruse and so ethically advanced, that it lay far beyond the popular reach. Or perhaps it was felt that the ethically unprepared, would misinterpret the texts, if it was openly published. Whatever be the reason, there is no doubt that some esoteric meaning was attached to the Vedas, and when a seer like Sri Aurobindo proclaims it, it has to be received with great attention. However the traditional interpretation of Sayana and the Purva-mimasa is against this, and on a rational study of Indian Philosophy, we may agree with Dr. Radhakrishnan "that it is more in accordance with what is known of the general nature of human development, and easier to concede, that the later religions and philosophies arose out of the suggestions and ideas of the early mind, than that they were a degradation of original perfection". This accords well with the scientific outlook, which avoids both the carping criticisms of ignorant and misin-

Anantapala", to march on Vengi. This was successful but short-lived. The Chola prince Vikrama Chola, was able to rally his forces, and with the loyal assistance, of the telugu local chieftains, who did not swerve from their loyalty, was finally able to thrust the Western Chalukyan incursion completely by 1133. A great battle was fought on the banks of the Godawari and the Western Chalukyan power was finally broken. The brief establishment of western Chalukyan hegemony in Andhra, has not yet been clearly set down. Such glimpses as in the Kolluru Temple, help us to show the extent to which this incursion went.

This mutually destructive war between the Cholas and western Chalukyas, so depleted the power and strength of both, the smaller and subordinate powers, showing vigour and strength, broke off and proclaimed their independence as for e. g. the Pandyas in the extreme south, the Hoysalas in Mysore, and the Yadavas and Kakatiyas in Deccan. Thereafter the political history of Andhra is inextricably involved with that of the Kakatiyas, who ruled from "Ekasilanagara" (or modern Warangal). The extension of Kakatiya hegemony to Andhra is well attested by another inscription of Kolluru temple, in the pillar of Anathabhogeswara-swami temple.

The inscription is in eight lines and is unfortunately incomplete, as it has been mutilated. The inscription runs as follows.

1. స్వస్తి శ్రీ శకవష్నంబులు ౧౨౦౧ అగు నేంటి
2. సోమగ్రహణనిమిత్తంబున శ్రీమ -
3. తునరేంద్రీశ్వరదేవర నిత్యదీపానకు
4. శ్రీమన్మహామండలేశ్వరకాకతీ -
5. య్యరుద్రదేవమహారాజులకు -
6. ం బుణ్యముగాను శ్రీకృష్ణవెణ్ణాన -
7. దీతీరంబున కొల్లూరి అడ్డవట్టసుం -
8. ఖమువలన మం[చి]రాజు....

This states that a certain portion of a tax of the village "addavatta-sunkamu", of Kolluru, should be assigned to the temple of Narendreswara of the village, for the 'punya' or merit of the Kakatiya Rudra Deva Maharaja. The inscription is in Saka 1201 or 1279 A. D., and by that time Kakatiya rule was firmly established. Incidentally we may note that 'Benna' or 'Krishna-Benna', which is a very ancient name for Krishna river still continues till the 13th century. It is not quite clear what the "addavatta" tax is.

This Narendreswara temple is also referred to in another inscription of Kolluru, found on a pillar. The inscription is of 9 lines and is as follows.

1. స్వస్తి శ్రీ శకవష్నంబులు....గునేంటిచైత్ర
2. [శు]ద్ధ ౧౧ బుధవారమున విషువుసంక్రాంత్తిని -
3. మిత్తమునం గొల్లూరి శ్రీనరేంద్రేశ్వరమహా
4. దేవరకుం గాపనాయకుని బంటు బోయి
5. [జ]ల్వయ తమ తండ్రి కాపనబోయినికి త -
6. ల్లివిజ్ఞానిక ద్ధమ్మున్వుగానఖండ వత్తిన్
7. [దీ]పమునకుంబెట్టిన రాజ నారా[య]ణ గద్యలు:
8. [వీ]నింజేకొని యిందు లమానులు సానులునడ -
9. పంగలవారు.

This states that one "Boyi Jilvaya" servant of "Kapa-Nayaka" gave five "Rajanarayanagadyas" to Narendreswara temple at Kolluru. Unfortunately some kindly soul has so thoroughly mutilated the year of the inscription that just the date of the inscription is illegible. However we can by the paleography of the inscriptions, conclude that it must be a later record probably the "Kapa-Nayaka" is one of the Musunuru chieftains, who played so notable a part in the later history of Andhras.

The "Rajanarayana-gadyanas" seem to have been accepted tender and in vogue for a long time. There is another inscription in the Kolluru temple, of

very neatly chiselled nine lines of the time of Kulottunga Chola II. as follows:

1. స్వస్తిశ్రీ శకవషన్ములు ౧౦[౬౨] శ్రీకు -
2. లోత్తుంగ్గ చోడదేవర దివ్యరాజ్య సంవ -
3. త్సరములు [౮] నేంటి భాద్రపద[ద] శుద్ధ౫ సో -
4. మవారమున దక్షిణాయ సంక్రాన్తి ౨ నిమిత్త-
5. ముున గొల్లూరి శ్రీయనన్తీశ్వరమహాదేవరకు
6. గొసనాసాని కూంత్తు అు యిందులసాని [పె] -
7. [డు]దమయా చంద్రార్కన్ మఖండవత్తి [౯]నే -
8. పమునకుం బెట్టిన రాజనారా -
9. యన గ౫

This states that 'Indulasani Pedudama', who was the daughter of "Kosanasani" made a gift of five "Rajanarayana-Gadyanas" for a perpetual lamp in the temple of Anantiswara of Kolluru in Saka 1062 (1140 A. D.), or in the 8th regnal year of Kulottunga Chola II. The fact that 'Sanis' so openly and proudly mention their names and pedigree need not trouble us much. They were as much the temple servants as the priests and their social status was definitely very high.

That this "Rajanarayana-gadyna" was also known as "Rajanarayana-Nishkas" (probably the sanskrit translation) is evident to us from another sadly mutilated inscription of Kolluru temple, running to seven lines, and which is as follows:

1. శ్రీ రాజనారాయణ నిష్కపంచకం దీపార్థన్ మాచంద్ర
2. ....వైష్ణ [వై] దామాంబికా కందుకసన్నుతానం పూ[ర్వన్]
3. ....శాకాబ్దేనంద్దా బాణాంబర
4. ....ణితే చైత్రశుద్ధ[ద్వి]తియ్యా సంక్రాంతే మేప నామ్ని
5. ....బుధదివసే పుణ్యాదామాభిధానా జ ంబానంద
6. ....భువననాతకొల్లూయ్యాన్ నంతేశ్వరాయ ప్రాధ
7. ....మనుపమాఖణ్ణ వత్తిన్ ప్రచండ్దే

This refers to a gift of a certain "Damamba" of five "Rajanarayana Nishkas" for a perpetual lamp or Akanda Deepa. The inscription is in Sanskrit, and following the usual method of symbolical Hindu Numerology, the year of the inscription can be fixed as S. 1059 or 1137 A. D.

The earliest in point of chronology, is the inscription, probably the only one, of the time of Kulottunga Chola I, the redoubtable Rajendra II (Chalukya), who kept Western Chalukyan Vikramaditya VI at bay, for so long. This inscription too is much mutilated and is as follows:

1. స్వస్తిశ్రీ శకవషన్౧........
2. [లోత్తు]ంగ్గ చోడదేవర........జ్య
3. [సం] వత్సరంబులు౯ చైత్ర బహుల....
4. ....రము విషువు సంక్రాంత్తి
5. ....శ్రీయనంతీ........
6. ....వరకు పెగ్గడ చిమ్మప....
7. ........దన తండ్రి గేతనకు ధ....
8. ....పత్తిన్ దీపమునకుం బే....
9. నగద్యా౫ ........

This is in Saka 1000 (1078 A. D.), and the 9th regnal year of Kulottunga Chola and states that a certain "Peggada Chimmapa" gave five gadyas for the perpetual lamp. Obviously a gadya is equal in value to a Rajanarayana-gadyana.

The other inscriptions of Kolluru are not very important and the temple which is a flourishing one, is still a live intstitution well worth a visit. A temple which has seen and carries still the message of Chola supremacy, western Chalukyan incursion, and Kakatiya hegemony is certainly a national symbol that should be preserved well.

# ĀRĀDHANA

(A RELIGIOUS MONTHLY MAGAZINE)

*Anent* THE TEMPLES
FOR THE TEMPLES
BY THE TEMPLES

*(in Andhra State)*

* * * * * *



---


PUBLICATION OFFICE:

"ĀRĀDHANA"

OFFICE OF THE DEPUTY COMMISSIONER

*Hindu Religious & Charitable Endowments (Administration) Department*
*( Andhra )*

MASULIPATAM

ANNUAL SUBSCRIPTION (Inland) Rs. 12/-
PER SINGLE COPY Re. 1/-
ANNUAL SUBSCRIPTION (Foreign) 24 Sh.

# ఆరాధన

మన్మథ　　　మాసపత్రిక　　　కార్తీకము

విషయసూచిక　　　పుట

తెనుగు



## CONTENTS

PAGE

### ENGLISH



శ్రీ వేంకటేశ్వర స్వామి - మూలవిరాట్ - ద్వారకాతిరుమల.

" ఆనందరూప మమృతం య ద్విభాతి "

# ఆరాధన

సకృ దేవ ప్రపన్నాయ 'త వాస్మీ 'తి చ యాచతే ।
అభయం సర్వభూతేభ్యో దదా మ్యేత ద్వ్రతం మమ ॥

సంపుటము ౧ | మన్మథ - కార్తీకము | సంచిక ౧౧

శ్రీ వేంకటనాథుడు

## ద్వారకా తిరుపతి

శ్లో॥ "భజే దేవదేవం భజే వాసుదేవం భజే లోకనాథం భజే మానసనాథమ్ ।
భజే సత్ప్రకాశం భజే వేంకటేశం భజేఽహం భజేఽహం భజేఽహం భజేఽహమ్ ॥"

అని ద్వారకుడను బ్రాహ్మణుడు తన యచంచలభక్తిచే ప్రసన్నుడై సాక్షాత్కరించిన శ్రీహరిని స్తుతించెను.

పశ్చిమగోదావరీ మండలమున ఏలూరునకు పశ్చిమముగా యిరువది మైళ్ళ దూరమునందు గలదు— ఈ ద్వారకాతిరుమలక్షేత్రము- ఏలూరునుండి 10 మైళ్ళు మోటారు రోడ్డున పోవుటతోడనే యచటి మార్గమున కిరువైపులనూ దట్టమగు చెట్లు మార్గమున బోవువారి కించుకేనియు శ్రమ కలుగకుండ నిబిడమగు నీడల నిచ్చుచుండును. మార్గమున కుత్తరవైపున కనుచూపుమేర ఆకాశము నంటుచున్న తాళీవనములు, వనముల మధ్యను విశాలమగు పచ్చిక బయళ్ళు, పచ్చికబయళ్ళయందు పశువుల మందలు- చూపరుల కానందము గొల్పుచు, దివ్యక్షేత్రమునందలి స్వామిని సేవించుటకు బోవు యాత్రికుల మనంబుల తత్పరత నొందింపజాలినట్లుండు నా దృశ్యము. సమీపించినకొలది యెదుట ను ధనురాకృతి గల పర్వతపంక్తి. ఈ వరుసలో నొకవైపున పర్వతమునందు క్షేత్రపాలకుడగు మల్లికార్జునుని ఆలయము, రెండవవైపు పర్వతము నానుకొనియే యున్నది. శ్రీవేంకటనాథుని యాలయము. ఇందలి మూర్తి స్వయంవ్యక్తమై భక్తుడగు ద్వారకుడను బ్రాహ్మణుని యనుగ్రహించుటకై యావిర్భవించుటచే యీ క్షేత్రమునకు ద్వారకాతిరుపతి యని పేరు.

వైకుంఠవాసి యగు శ్రీ మహావిష్ణువు భూదేవిననుగ్రహించుటకు కృతయుగమునందు శేషాచలము (తిరుపతి) యందును, త్రేతాయుగమునందు ద్వారకాతిరుపతి యగు అనంతాచలమందును, ద్వాపరమునందు నౌపురి (వాడపల్లి) యందును కలియుగమునందు గరుడాచలము (ఉపమాక) నందును యవతరించి భక్తుల నుద్ధరించెనని యీ క్రింది బ్రహ్మపురాణ శ్లోకములవలన తెలియుచున్నది.

కృష్ణా గోదావరీ మధ్యే ద్వారకేతిచవిశ్రుతా । పురీరమ్యతరైర్హర్మ్యైః రాజతేచనగావృతా ।
తత్సమీపే మహాన్‌శైలోఽనంతనామ్నా ప్రకాశతే । తస్మిన్ గిరివరే రమ్యే రమయాసహసంతతం ।
సుందరేణ స్వరూపేణ స్థాస్యామి శ్రేయసే నృణామ్ । నౌపురీచ సువిఖ్యాతా గౌతమీతీరసంశ్రితా ।
తత్రాప్యావిర్భవిష్యామి తత్రత్యానాం హితాయవై । కళింగే జలధితరే గరుడాచల సంశ్రయః ।
తస్యాం పుర్యాం విరించేఽస్మిన్భవిష్యామి కలౌయుగే । నౌపురీద్వాపరే వ్యక్తిస్త్రేతాయాం ద్వారకాపురీ ।

ఏవమాదిషుదేశేషుస్థాస్యామి జగతాంపతే । అస్మద్వాసాయ భోగీంద్రః శైలరూపోభవిష్యతి ।
అనంతనామ్నితచ్ఛైలే ద్వారకాపురసంశ్రితః । విశేషేణభవిష్యామి పురుషార్థప్రదోనృణామ్ ॥

అని బ్రహ్మపురాణ శ్లోకములని ప్రతీతి.

ఆదిశేషుడు తపంబొనరించి తనయందెప్పుడును శివకేశవులుండునట్లు వరము కోరుకొనగా పర్వతరూపమును ధరించిన ఆదిశేషువు ఫణమునందు విష్ణువు, పుచ్ఛమునందు శివుడు తమ స్థానమును స్థిరపరచుకొని యుండెదమని వరమొసంగిరనియు, అట్లే శేషాచలము (తిరుపతి) అనంతాచలము - ద్వారకా తిర్మపతి క్షేత్రములందు శ్రీ మహావిష్ణువు, శివుడు యావిర్భవించిరనియు యైతిహ్యము. త్రేతాయుగమునందు ఈ ద్వారకా తిరుపతి క్షేత్రమునందలి మహావిష్ణువును సేవించి అజుడు (దశరథుని తండ్రి) ఇందుమతీ స్వయంవరమునందు పరరాజులను జయించెననికూడ ప్రాచీనగాథ.

ఇట్లు త్రేతాయుగమునందు వెలసిన శ్రీమహావిష్ణువు కళామాత్రా వశిష్టుడై నేటి కలియుగమువరకును ఇచటనే నిగూఢముగ యుండెనట.

పరమభాగవతోత్తముడగు ద్వారకుడు తిరుపతియందలి వేంకటనాథుని అనేకపర్యాయములు సేవించుచు తృప్తి నొందక నొకానొక గ్రీష్మకాలమున తిరిగి స్వామిసేవకై తనసతితోకూడ పయనమయ్యెను. గ్రీష్మతాపముచే మార్గమధ్యమున సొమ్మసిలి మూర్ఛపోయెను. అతని సతి యెచటనైన నీరు దొరకునా యని వెదకుచుండ శ్రీవైష్ణవ వేషధారియై శ్రీమహావిష్ణువు ఆ నిర్జల ప్రదేశమున జలపూర్ణమగు పాత్రతో కనబడెను. అంత జలపానముచే నా విప్రునకు తెలివి వచ్చెను. వెంటనే యా దంపతులు ఆశ్చర్యము నొంది అతని నెవరని ప్రశ్నించిరి. కాని కొంత తడవునకు అట్టి గ్రీష్మకాలమున ఆ నిర్జల ప్రదేశమున భక్తపరాయణుడగు శ్రీహరిగాక యింకెవ్వ రట్లు రాగలరని తెలిసికొని యాతని సాష్టాంగముగ ప్రణమిల్లిరి. అంత వైష్ణవవేషధారి శంఖచక్రగదాధరుడై శ్రీ మహావిష్ణురూపమున యా దంపతులకు సాక్షాత్కరించి వారి భక్తికి సంతసించి వరము కోరమనెను. అంత నావిప్రుడు సర్వదా శ్రీహరి సేవ తనకు లభించునట్లు తన స్వస్థానమగు ద్వారకయం దావిర్భవింపవలెనని వరము కోరెను. "అట్లే యగుగాక" యని శ్రీమన్నారాయణుడు పరమొసంగి ద్వారకాపురి సమీపమునందున్న పర్వతమునందు గరుత్మంతుడు అధిరోహించు వృక్షము క్రింద తన యర్చారూప ముండునని యానతిచ్చెను. అంత నా విప్రు డమితానందముతో తనపురి కేతెంచి వృత్తాంతము నంతను పురజనుల కెరింగించెను. పురజనులతోగూడ పర్వతమునకేగి నిరీక్షించుచుండగ గరుత్మంతుడు ఒక కుంకుడుచెట్టుమీద వ్రాలెను. ఆ చెట్టు యిప్పటికిని కలదు. ఆ చెట్టుక్రింద త్రవ్వగా దివ్యమంగళమూర్తియగు శ్రీ వేంకటనాథుని యర్చారూపము ప్రత్యక్షమయ్యెను. పాదములు మాత్రము కనబడనందున యింకను త్రవ్వి విఫలుడై నిస్పృహజెందగా తనకు మహాభక్తుడగు బలిచక్రవర్తి పూజచేయుటకై తన పాదములు పాతాళమునందుండునుగాన వాటికొరకు ప్రయత్నించవలదని శ్రీహరి యానతిచ్చి అట్లే అర్చారూపియై యీ ద్వారకా తిరుమల క్షేత్రమునం దావిర్భవించెను. అది మొదలు భక్తుల కోర్కెలను తీర్చుచు ద్వారకాతిరుమల క్షేత్రమునందు శ్రీ వేంకటనాథుడై విలసిల్లుచుండెను.

ముఖచిత్రమునందలి మూర్తి శ్రీ వేంకటనాథుని మూలవిరాడ్రూపము- ఈ మూర్తి భూమిలోనుండునట్లే చిత్రమున గననగును.

---

శ్లో॥ మామవ సకలజనాంత
ర్యామిన్ సనకాది సన్నుతామలధామన్ ।
స్వామిన్ భక్తావనసుప్రేమన్
పతగాధిరాడ్వరేణ్యాలలామన్ ॥ ఇతిశమ్ ॥

# బ్రహ్మీభూత
# శ్రీజగద్గురు శ్రీకళ్యాణానందభారతీ మాంతాచార్య స్వాములవారు

*సంపాదకుడు*

శ్రీవారు సెప్టెంబరు 28 తేదిని శుక్రవార ముదయము పదునొకండుగంటలకు హఠాత్తుగహృద్రోగముచేత విదేహ కైవల్యము పడసిరి అని పాఠకమహాశయులకు విన్నవించు కొనుచున్నాము.

'ఆరాధన'కిది పెద్దదెబ్బ; శ్రీవరప్రసాదరావుగారు కీర్తి శేషులయిన మరునటినెలయందే వీరిని ఆరాధన కోల్పో వుట దానిదురదృష్టము. పత్రిక ప్రారంభించినదాది స్వాములవారు దానికి పోషకులయి దానినెట్లు నిర్వహింప వలయునో సూచన లొసంగుచు దానికి వన్నెచిన్నెలు ఎట్లు సంకలింపవలయునో తెలియఁజెప్పుచు దానికి ప్రతిసంచిక యందును తాము ప్రచురించుచుండిన యమూల్య వ్యాసములచే నలంకారములఁ గల్పించుచు సర్వవిధముల దానికి ఆధారస్తంభసదృశులుగ నున్నవారు. తామే గాక తమశిష్యపరంపరనుగూడ (ముఖ్యముగ దర్శనాచార్య జమ్మలమడక మాధవరామశర్మగారు, నోరి నరసింహ శాస్త్రులుగారు, ఓరుగంటి నరసింహయోగిగారు) తమ యాదేశముచేనీపత్రికకు సాహాయ్యము నొనర్చునటుల గావించిరి. వరుసవరుసగ నిట్టివిపత్పరంపరలెదుర్కొను చున్నది—ఆరాధన— భవిష్యత్తు ఎట్లుండునో తెలియదు. అయినను ఆస్తికమహాశయులగు శ్రీవారి శిష్యులు తమ గురువుల యాదేశప్రకారము ఉత్సాహముతో నీపత్రిక శ్రీవారిచే తమకు న్యాసముగా నీయబడిన దని దీని పోషణ కుద్యమింప వెనుదీయ రనియే మాయాశ.

శ్రీవారి కైవల్యము ఆంధ్రదేశమున నొక తీరని శూన్య తను గల్పించినది. శ్రీవారు ఒకయపూర్వవ్యక్తివిశేషము. అటు ప్రాచీనసంప్రదాయమును జక్కగ నెరిగినవారు, ఇటు ఆంగ్లవిద్యానిష్ణాతు లగుటచేత నాధునికప్రపంచ మును తెలిసికొన్నవారు. కనుక అటు సంప్రదాయ స్థితులగు సనాతనధర్ములకును ఆంగ్లసంస్కారమయులగు నాధునికసంశయాళువులకును శంకలను దీర్చువారై యిరు వురికి గురుస్థానమున వెలయుచుండిరి.

శ్రీవారిపాండిత్య మద్భుతావహము; వారు పూర్వోత్తర మీమాంసలందు, మంత్రశాస్త్రమున, జ్యోతిషమున పండిత శిరోమణులు. ఆంగ్లమున రసాయనశాస్త్రపట్టభద్రులు. వారిగురుపరంపర విశిష్టమైనది. వారిసాక్షాద్గురువులు బోధానందయతీంద్రులు జ్యోతిషమును పూనాలో ప్రాక్ప్రతీచీగణితశాస్త్రయుతముగ పఠించినవారు. ఆకాలమున లోకమాన్యతిలకుగారి సతీర్థ్యులు; గణితశాస్త్రమూలమున నద్వైతవేదాంతసూత్రములను ఋజువు చేయుటలో వారి ప్రజ్ఞ యనన్యసామాన్యము. ఈవిషయమున శ్రీకల్యాణా నందులు తమగురువులకుఁ దీసిపోవువారుగారు. ఆర్షమత మతిగహనము, గణితశాస్త్రము సరే. అయినను రెంటిని మేళవించి అల్పప్రజ్ఞులకును వారు తెలియఁగలవిధమున క్లిష్టవిషయముల బోధించుచుండుటను గాంచినవారికి విస్మయము గలుగును. గణితశాస్త్రమూలమున శ్రీస్వాముల వారు ఆధునికుల వేదకాలనిర్ణయాదులు పంచాంగ సంస్కారాదులు ఎంత ప్రమాదభరితములో అనేక పర్యాయములునిరూపించియున్నారు.

శ్రీవారిబోధ తృతీయపంథ. సంప్రదాయమునకుఁ దప్పియుండకపోయినను వారిమార్గ మపూర్వమై స్వోపజ్ఞ ములగు నూత్నాంశములతో విరాజిల్లుచుండెడిది. శ్రీశంకర భగవత్పాదు లొక్కరినే (తదనుసారమువిద్యారణ్యులను) వారు సర్వథా ప్రమాణముగ సంగీకరించియుండిరి. ఇతరవ్యాఖ్యాతృజనమును వారు సాధారణులగనే భావించువారు. ఇతరసంప్రదాయముల ఖండించుటలో అద్వైతమును నిలబెట్టుటలో వారికిఁగల యుత్సాహము ఒకవిశేషము. ఈకార్యమునందు వారి కుండిన దీక్ష వారి నెందరిని విముఖులను జేసినను లెక్కించినవారు గారు. ఇప్పటికినివిద్వాంసులకు ఉత్తరాదిమఠస్వాములవారితో వారు జరపిన వాగ్యుద్ధములు స్మరణయందుండనే యున్నవి.

ఈయుద్ధములలో శ్రీవారి వాక్కు పరుషముగ నున్నను ఆ పారుష్యము వాక్పర్యంతమే. ఎన్నడును హృదయమును చేరినవి గాదు. 'నిండు మనంబు, నవనీతసమానము, పల్కు దారుణాఖండలశస్త్రతుల్యము, జగన్నుతవిప్రుల యందు.' అన్న నన్నయగారి వాక్యమునకు వీ రుదాహరణ భూతులు.

తమవాదమును నిలబెట్టుకొనుటకై వారు రచించిన గ్రంథజాల మపారము. సంస్కృతమున నింగ్లీషున తెను గున శతాధికగ్రంథముల వారు రచించియున్నారు. ఈ పత్రిక 55 సెప్టెంబరుసంచికయందు వారురచించిన గ్రంథనామము లిచ్చియున్నాము. వారు తడవిన

విషయములే వారివైదుష్యమెంత విశాలమో తెలియ పరుపఁగలదు.

వా రనర్గళముగ వాక్ప్రవాహమును సభలయందు వెల్వరచువారు. సంస్కృతమునందు తెనుగునందు నింగ్లీషునందును వా రమోఘముగ నుపన్యసింపశక్తులై యుండిరి. మద్రాసున జరిగిన సనాతనధర్మసభయందు శ్రీశ్యామసుందరచక్రవర్తిగా రధ్యక్షులుగ శ్రీవారు ఆంగ్లేయమున ప్రారంభోపన్యాసమును గావించిరి. రెండుమూడు గంటలు గంగాప్రవాహమువలె వారివాక్కు విజృంభించినది. ఆయుపన్యాసమును విన్నవారెల్ల సమ్మోహితులైరి. విశిష్టాద్వైతాదిసంప్రదాయముల ముఖ్యులును సభకు విచ్చేసియుండిరి. వారి దితరసంప్రదాయమైనను గుణజ్ఞులు శ్రీవారిని ప్రశంసింపక ఉండజాలకపోయిరి. శ్రీవారిని అందరు వేనోళ్ల శ్లాఘించిరి. శ్రీవారిని కొందరు వైష్ణవగృహస్థు లిండ్లకు తోడ్కొనిపోయి బిక్షల గావించిరనుట ఆయుపన్యాసప్రభావమును జాటును.

శ్రీవారాంధ్రలోకమునకే గాక సర్వభారతావనికిని గావించిన మహత్తరసేవ యింకొకటి గలదు. అధునిక సంస్కారులకు దేవీపూజలన్న అగమములన్న తంత్రములన్న నసహ్యాము. వారినాసికలకు తంత్రసంప్రదాయవాసనలు గిట్టవు. వారినీతిశాస్త్రులు ఈనిత్యతీతోపాసనల నేవగించుకొనువారు. వారికి తంత్రోపాసనలందు దక్షిణాచారము వామాచారము అను రెండుపక్షములున్న విషయము మనస్సున కెక్కదు. అశాస్త్రములను వారు చదువరు, చదివినవారిని గలసి తద్విజ్ఞానము నార్జింపరు, ఆర్జించి తన్మార్గమున నుపాస్తి చేయరు. చేసి సిద్ధిని బడయరు. ఇట్లుండియు కఠోరోక్తులతో వానిని నిందించుటకు వారినాలుక వెనుకాడదు. ఇట్లయ్యునుతాము హేతువాద విజ్ఞులమని సత్యనిత్యుల మని గర్వింతురు.

శ్రీస్వాములవా రీతంత్రోద్ధరణమునకుఁ బూనుకొనిరి. శంకరమతానుయాయు లగుటచే వారిది దక్షిణాచారము. స్వాములవారి కితరమతములపొడ గిట్టదని వచించియున్నాము. తంత్రగ్రంథములందు శ్రీవిద్యా వామాచారుల (కౌలమార్గుల)బోధనలందు వికృతరూపమును దాల్చిన దని వారిదృఢాభిప్రాయము. భాస్కరాదులు విపరీతవ్యాఖ్యానముల నిర్మించిరని శ్రీవారు వారివాదములను కౌలమార్గమును నిర్మూలించుటకు శతధా ఉపయోగించిరి. శ్రీదేవతానామార్థరహస్యవివరణరూపమగు 'శ్రీగుణనిక' యను గ్రంథమున శ్రీవారు పరిశుద్ధమగు దక్షిణాచారస్థాపనమునకు ఎంత పరిశ్రమించినది తెలియఁగలదు. వామాచారము నువారు నిరసించిరని అమార్గము సర్వథా త్యాజ్య మని గాదు. వేదమార్గానుయాయులగు ద్విజులకు అది అనుపాదేయ మని శ్రీవారి నిశ్చయము.

'రామకృష్ణప్రభ' 55 అక్టోబరుసంచికయందు శ్రీరామకృష్ణపరమహంస భైరవీబ్రాహ్మణిని గురువుగఁ జేకొని సర్వవిధతాంత్రికసాధనల నవలంబించిరని తెలియఁగలదు. వామమార్గమునందును ఉపాదేయవిషయ మేదో ఉండకున్న నామహామహుడు అమార్గము ననుసరించియుండునా! పంచమకారము లన్ననో శిరోవేదన జెందుట సత్యమార్గాన్వేషణగాదు; భావోద్రేకముల పాలగువారికి వివేకశాంతము లుండవు; నిష్పక్షపాతమగు నిర్ణయశక్తియుఁ గలుగదు. ఈశ్వరుఁడు సత్వగుణమాత్రుడని ఉపాసింపవచ్చును; త్రిగుణమయుఁ డనియు నుపాసింపవచ్చును. అయన విధినిషేధముల కవ్వలివిషయము. ఉపాసకుని యధికారతారతమ్యము ననుసరించి ఉపాసన వివిధము కాఁగలదు. పరమార్థవిషయములందు నావేశము మేలుగాదు; ఆలోచన యవలంబనీయము. "యదన్నం పురుషశ్చాత్తి తదన్నాఃతస్య దేవతాః" అని ఆర్యులు నిర్ణయించియున్నారు. వీరభావోపాసన అల్పసంఖ్యాకులకే ఉద్దేశింపఁబడినది. శ్రీవారు దీక్ష పూనినది దక్షిణాచారోద్ధరణమునకు. ఉపాసనలు మృగ్యము లగుచున్న ఈకాలమున విశుద్ధసంప్రదాయము నొకదానినిస్థాపించుట, అనుకూలురగు శిష్యులకు అయుపాసనము నేర్పరించి నేర్పించి సంప్రదాయమును చిరస్థాయిగఁ జేయుట శ్రీవారికి చేతనయినది; కాని ఇతరులకు సాధ్యమగు విషయము గాదు. కొన్నియేండ్లకుముందు వారు శిష్యులతో ననుచుండిరి.

"శ్రీశంకరభగవత్పాదులు శ్రీదేవినామావళికి భాష్యమును వ్రాయ సంకల్పించిరి. శిష్యు నాగ్రంథమును తెమ్మనిరి. అతడును అగ్రంథమును దెచ్చెను. శంకరులును కట్ట విప్పి చూచునప్పటి కాగ్రంథము దేవీనామగ్రంథముకాదు. విష్ణుసహస్రనామావళిగా నున్నది. 'పొరపా' టని శిష్యుడు గ్రంథమును యథాస్థానమునఁ జేర్చి పరీక్షించి సరి యగు గ్రంథమునే తెచ్చెనుగాని శంకరులు చూచునప్పటికి మరల విష్ణుసహస్రనామములే యయి యుండినది. ఎన్నిమారులు తెచ్చినను శంకరుల చేతికి వచ్చునప్పటికి గ్రంథ మేమో విష్ణుసహస్రనామములే యగుచుండెడిది. ఈలీలను జూచి శంకరులు దాము శ్రీదేవీనామావళికి వ్యాఖ్యానముచేయుట దేవి కిష్టము గాదనియు తమకు విష్ణుసహస్రనామవ్యాఖ్యానమే దేవ్యాదిష్టకృత్యమనియుఁ దలచి అట్లు చేసిరి. దేవీనామములకు భాష్యమును సమంజసముగ నింతవర కన్యులు కావింపలేదు. భగవంతు డీకార్యమును నాకుగా నిల్పియుంచినాఁడు. 'శ్రీగుణని'కాగ్రంథరచనముచే నాకర్తవ్యమును నేను నెర

వేర్చితిని. ఈనిధిని మీచేతుల నుంచితిని, దీనిని రక్షింప వలసినవారు మీరు." ఈవాక్యములచే దక్షిణాచార స్థాపనమున శ్రీవారికిఁగల ప్రగాఢదీక్ష సువ్యక్త మగుచున్నది.

శ్రీవా రొనర్చిన యింకొకమహత్తరవిషయము కలదు. సనాతనమతమున మూడుసంప్రదాయములకును సంప్రదాయము నుద్ధరించి శిష్యులకు బోధ చేసి యనుగ్రహింప మఠము లున్నవి. మొదటినుండియు నాంధ్రులకు చిరపరిచిత మైన పీఠములు పుష్పగిరిపీఠము హంపివిరూపాక్షపీఠము. శ్రీశృంగేరిశ్రీవిరూపాక్షపీఠము. మొదటిపీఠము కలికాలవశమున 'నున్నది' అనుకొనవలసినది కాని శిష్యుల ననుగ్రహించు దశయందు లేదు; హంపివారికి నైజాముదేశము రంగ మైనది; తీరాంధ్రులకు నిట్టిదశలో శ్రీశృంగేరిశ్రీవిరూపాక్షపరస్థులు శుద్ధభారతీసంప్రదాయము వారు అగు శ్రీస్వాములవా రొకముప్పదియేండ్లనుండి బోధచే శిష్యగణము ననుగ్రహించు గురువులై విరాజిల్లిరి. ఇతరులనువలె ప్రశ్న వేసి వేదించుటకు శ్రీవారు పృచ్ఛకులకంటె విశేషముగనే ఆంగ్లవిద్యాపారంగతు లగుటవలన సులభులు గారు. ఎంత కొంటెప్రశ్నయైనను ఉచితమైన ఉత్తరము చెప్పి అడుగువారిని నోరు మూయించువారు. నిరవధికమగుపాండిత్యము, ప్రతిభ, ప్రతివాదిముఖపిధానమగు యుక్తి నైపుణి, చాతుర్యము, నిర్భీకత మున్నగు గుణగణములచే విరాజిల్లువారు శ్రీవారు. అందువలన యుక్తినే ఆశ్రయించు పెద్దలు లౌకికులు న్యాయవాదులు మున్నగువా రెందరో శ్రీవారికి శిష్యులై వారినాశ్రయించి వారివలన ప్రస్థానత్రయమును జదివి కృతార్థు లైనారు. లౌకికులుపరమార్థమార్గము నాశ్రయించునట్లు చేయగల్గుట శ్రీవారిప్రతిభను వేనోళ్లఁ జాటుచున్నది. క్షణక్షణభిన్నమార్గులగు వ్యవహారులకుఁగూడ సనాతనధర్మమొకటియే అవలంబనీయ మని నచ్చఁజెప్పి జగద్గురుత్వమును సార్థకము చేసికొన్న మహనీయమూర్తి శ్రీస్వాములవారు.

ఆంధ్రదేశమున నిట్టిమహనీయులు ఒక్కొక్కరు రాలిపోవుచున్నారు. దెందుకూరినరసింహశాస్త్రులవారు, శ్రీపాదలక్ష్మీనరసింహశాస్త్రులవారు, తాతాసుబ్బరాయుడుశాస్త్రులు గారు ఇట్టిదిగ్గజములు, 'నివేశః శైలానాం తదిద మితి బుద్ధిం ద్రఢయతి' యన్న భవభూతివాక్యమునకు లక్ష్యములై ఇట్టివా రుండఁబట్టియే పూర్వకాలముజగద్గురువులు నిట్టివారు అని యూహించుటకేని వీలుండినది. శ్రీచంద్రశేఖరభారతీస్వాములను జూచి ప్రాచ్యగురువుల యంతర్ముఖత్వము శాంతము పరవాదాదిశక్తి ఊహ్యము లగుచుండినవి. కామకోటిచంద్రశేఖరేంద్రసరస్వతులను జూచువారికి శ్రీవారి కర్మానుష్ఠానాదికము తపస్సమాధుల కద్దురా యని తెలిసి కర్మ జ్ఞానమున కెట్లంగమో వ్యక్త మగుచున్నది. శ్రీకల్యాణానందుజూచిన వారివాదపటిష్ఠతచే జగద్గురువుల సంప్రదాయస్థాపనాచార్యత్వము పొడకట్టుచుండెడిది.

ఒక్కొకజ్యోతి కన్నుల కదృశ్య మగుచున్నది. భావ్యాకాశమున అంధకారచ్ఛాయ లలమికొనుచున్నవి. సంప్రదాయసనాతనజగద్గురువాణీనాదములు దిశాంతములకు సాగిపోయి విరళీకృతములై శ్రవోగోచరములు కాకపోవుచున్నవి. కలికలుషప్రభావపరుషమారుతములే వీచుచున్నవి. కాలగర్భమున నే మున్నదో ఎవ్వఁ డెఱుగును? దేవారాధనము దేవ్యారాధానము సాగునో, ముగియునో? అమృత నిష్కళ మగు జ్యోతి అమృత నిష్కళగానే మిగులునో సాకారసగుణపుష్కలకళాయుతమై వెన్నెలల విరజిమ్మునో, ధర్మసౌరభముల ప్రసరించునో?

'దిక్కాలాద్యనవచ్ఛిన్నా నన్తచిన్మాత్రమూర్తయే। స్వానుభూత్యేకమానాయ సమ శ్శాన్తాయ తేజసే ॥

ఓమ్ శాంతి శ్శాంతి శ్శాంతిః.

---

శ్రుతిః॥ వేదాంతవిజ్ఞాన సునిశ్చితార్థాః
సన్యాసయోగాద్యతయః శుద్ధసత్త్వాః।
తే బ్రహ్మలోకేతు పరాంతకాలే
పరామృతాత్పరిముచ్యంతిసర్వే ॥
॥ఓమిత్యేతత్॥

# బెజవాడ - కృష్ణానదీ క్షేత్రము - కనకదుర్గ

(గతసంచిక తరువాయి)

ఇచటనే దుర్గమాసురుని సంహరించుటచే నీమెను దుర్గయనియు పిలుతురు. మొదటనిచట యీశ్వరాలయము వేరుగలేదు. ద్వాపరాంతమున వేరుగ నీశ్వరాలయము ప్రతిష్ఠించియుండవచ్చును. పాండవమధ్యముండగు నర్జు నుండు తీర్థయాత్రసలిపినప్పుడీ క్షేత్రమును దర్శించెను. అప్పుడిచ్చట నొక మల్లయుద్ధ విశారదుడుండి యర్జునునితో బోరుటకుద్యమించెను. అర్జునుడు తాను మల్లయుద్ధమును తెలియనివాడగుటచే భీతినొంది, పరమేశ్వరు నారాధించి, యీశ్వరానుగ్రహమున నాయుద్ధమున గెలుపొందెను. తనకు గెలుపిచ్చినవాడు మల్లులకు ప్రభువైన మల్లేశ్వరుడే యని అర్జునుడు యీశ్వరుని మల్లేశ్వరుడనిపిలిచెను.

అర్జునుడు పాశుపతాస్త్రమును సంపాదించుటకై, పర మేశ్వరునిగూర్చి తపమాచరించుటకు హిమవత్పర్వతము నకు తపమునసున్న ఇంద్రకీలగిరికి పోయెనని మహాభార తమునందు కలదు. అది బదరికాశ్రమమునకు పోవు దారిలో కీర్తినగర్, శ్రీనగర్‌లకు సమీపమున బిల్వకేదార మను ప్రదేశమునసున్నది. అయితే, బెజవాడలో కొండయు నింద్రకీలగిరియని పిలువబడుటచే, నిచటనే అర్జునుడు పాశుపతాస్త్రమును సంపాదించెనని కొంద రూహించు చున్నారు.

ఒకప్పుడు రాఘవవర్మయను రాజిచట రాజ్యముచేయు కాలమున, రాజకుమారుడొక తిలమాతకుని కుమారుని చంపెను. అంత రాజుతన కుమారుని ఘోరకృత్యమును విని మోమాటములేక న్యాయశాస్త్రమున ననుసరించి నేరమునకు శాస్త్రోక్తదండమును విధించెను. రాజుయొక్క ధర్మనిరతికిమెచ్చి పరమేశ్వరి దర్శనమిచ్చి యాతిల మాతకపుత్రుని బ్రతికించి తాను దర్శనమిచ్చుటకు గురుతుగ చినుకుకు చిన్నముపంతున కనకవర్షమును కురిపించెనట. నాటినుండియు నీపురి 'కనకపురి' యనియు, ఈశ్వరి 'కనకదుర్గ' యనియు పిలువబడు చుండెను. ఈ విషయమిప్పుడు భ్రమరాంబా మల్లేశ్వరాల యమున పదిలపరుపబడిన యొక శాసనము చెప్పు చున్నది.

దుర్గ స్వయంవ్యక్త మూర్తియై, పామరులకు పాషాణా కృతితో కాన్పించినను, ఉత్తమసాధకులకు స్వర్ణాకృతితో కన్పించును. మరియు, దుర్గ యిచట "అరిశంఖఖేట శూలకపాలాంకుశమౌర్వీసాయకాఙ్కదధతీం। సింహస్థా మగ్నినిభాందుర్గాందేవీం ప్రపద్య ఇహశరణమ్॥" అను సూక్తి నుడివినరీతిగా ఎనిమిది బాహువులతో యెనిమిది యాయుధములుకలిగి, సింహమునధిష్ఠించి, మహిషాసు రోత్తమాంగమును శూలముతో పొడుచుచున్నటుల కన్పించును ఈమె యొకప్పుడు భయంకర వీక్షణము లతో చూచుటకు వలనుపడనిస్థితియందుండ గనిపెట్టి జగద్గురు శ్రీ శంకరభగవత్పూజ్య పాదాచార్యులవారు దృష్టి సంస్కారముగావించి సర్వులకు సేవింప నర్హురాలగు శాన్తమూర్తిని గావించిరని యైతిహ్యముకలదు. ఈ యాల యమునగల నాగరాలంకృతయన్త్రము వీరిచే నుద్ధరింప బడి ప్రతిష్ఠింపబడి యుండునని పెద్దలను కొనుచుందురు.

ఇచ్చట దేవీయాలయము దక్షిణ భాగమునను, ఈశ్వ రాలయము వామ భాగముననుండుటచే, నిదిశక్తి ప్రధాన క్షేత్రమని చెప్పుదురు.

దుర్గకు వామభాగమున గర్భాలయమున నొక మిగుల మనోహరమైన గణపతి విగ్రహముకలదు. ఈమె సన్నిధి యందు కొన్ని యపూర్వయంత్రములుకలవు. అవి యీ యాలయముయొక్క ప్రాచీనతను స్పష్టపరుపగలవు. దుర్గాలయమునకు పశ్చిమమున నొక చిన్న సరస్సున్నది. అందు మధ్యభాగమున నొక చిన్న గుంటగలదు. ఆ గుంటయందు ప్రతినిత్యమూ దేవ్యారాధనమునకు వలయు మాత్రముదక మూరుచుండును. అందొక గుర్తు ప్రదేశ మున యస్త్రమొకటి స్థాపితమైయున్నది.

పదియేడవ శతాబ్దమున హైదరాబాదు నవాబువద్ద దివానులుగనున్న "అక్కన్న, మాదన్న" లను బ్రాహ్మణ సోదరులీ దేవీదర్శనమునకై యిచ్చటికివచ్చి, కృష్ణానదిలో స్నానముచేసి, దేవీపూజాదులొనరించి, బ్రాహ్మణాదుల కన్నమిడినట్లు చరిత్రలు చెప్పుచున్నవి. వారుండెడి స్థలము లిప్పటికిని "అక్కన్న, మాదన్న చావడు"లను పేరుతో ప్రసిద్ధిగనున్నవి.

ఇంద్రకీలగిరికి దక్షిణ శిఖరప్రాంతమున అర్జునుడు తప మాచరించిన స్థలమని చెప్పబడు చిన్న కట్టడమొకటి యిప్పటికిని కాన్పించుచున్నది.

శ్రీకృష్ణవేణి యీ కొండలమధ్య బహుస్వల్పద్వారమున ప్రవహించుచుండెడిదట. తనపతియగు సముద్రునిం జేరనుత్సాహముతో బోవ నవకాశము చాలనందున, పార్వతీ పరమేశ్వరుల బ్రార్థింప, బెజవాడ—సీతానగరములకు మధ్యనుండు కొండభాగమును పరాశక్తి యెత్తి కొంత దూరముగ పడవైచెనట. ఆభాగమే యిప్పు"డెన మలకు

దురు" అని పిలువబడు గ్రామముగ కృష్ణాతీరమున కలదు.

బ్రాహ్మణవీధిలో మల్లేశ్వరాలయమున కెక్కుమెట్ల సమీపమున జమ్మిదొడ్డియను నొకస్థలముకలదు. అందొక మంటపముకలదు. ఆ మంటపస్తంభములయందును, పరిసరశిలలయందును నలువదియారు శాసనములను చూచితినని "హెూయాంగట్సియాంగు" అను చీనాదేశపు బౌద్ధయాత్రికుడు తనయాత్రా చరిత్రయందు వ్రాసియున్నాడు. ఈ శాసనమున దుర్గాక్షేత్రవిశేషముల సనేకములను వర్ణించియున్నవి.

పూర్వ మీదేవతకు నరబలులిచ్చు యాచారముండెడిదని చరిత్రలు తెలుపుచున్నవి.

ఈమధ్య హిందూరాజుల పాలన మంతరించి దేశము విదేశీయుల పరమైన వెనుక కొంతకాల మీక్షేత్రము పూజ పురస్కారములు సరిగాలేక దేవాలయములు నామావశిష్టములై కొండ యెక్కుటకు సరియైనదారి లేక పొదలతోను, ముండ్లతోను, దుష్టజంతువులతోను నిండియుండగా, రమారమి నలువది సంవత్సరముల క్రిందట శ్రీ పరదేవతారాధకులును, శ్రీ విద్యానర్వజ్ఞులును, యతివరేణ్యులునగు శ్రీ పరమహంస శ్రీ పరమశివేంద్ర సరస్వతీ స్వాములవారు (జ్ఞానానంద స్వాములవారు) విశేష శ్రమకోర్చి, ఉదారవంతులగు నగరవాసుల యాదరమునను, దుర్గాదేవి ప్రేరణవల్లను, తాముమాత్రము నిమిత్తమాత్రులుగ నిలబడి దేవాలయమునకిరుప్రక్కలను రాతితో చక్కని సోపానములు కట్టించి, ముఖమంటపములను, కళ్యాణమంటపమును కట్టించి, ఆలయములచుట్టును నేలకు నాపరాళ్లు పరిపించి, యింకా స్వామి ఆలయముపై విమానమును, యాత్రికులకు వసతిగృహములను, వేద, శాస్త్ర పాఠశాలలకు గృహములను, యతులు నివసించుటకు మఠమును కట్టించి, ఆ మఠమునందు శ్రీజగద్గురు శంకరాచార్యుల మూర్తిని ప్రతిష్ఠించి, మొత్తము సుమారు రెండులక్షల రూపాయిల కైంకర్యములు చేయించి, యిప్పటికి సుమారు 16 సం॥ ల క్రిందట యిచ్చటనే సిద్ధినొంది సమాధిస్థితులైరి. అంతకుముందు కొండ యెక్కుటకైనను వెఱచుచుండెడి స్థితిలో, యిప్పుడు ప్రతిదినమున్నూ దుర్గాదేవి దర్శనార్థము మ్రొక్కుబడులు చెల్లించుకొనుటకును పట్టణమండలి భక్తవరులే గాక, కాశీరామేశ్వర యాత్రలకు పోయివచ్చు యాత్రికులందరును, విధిగానిచ్చటదిగి, కృష్ణానదిలో స్నానమాచరించి, కొండయెక్కి దేవిదర్శనము చేసుకొని పోవుచుందురు.

కృష్ణానదికి అవలవైపుననున్న సీతానగరమునకు రెండుమైళ్ల దూరములో "ఉండవల్లి గుహలు" కలవు. అందొకప్పుడు అనంత పద్మనాభస్వామి మహదైశ్వర్యముతో గూడిన యుత్సవములనుభవించెను. అనంతరమది బౌద్ధులవశమై కొంతకాలము బౌద్ధసన్యాసులుండు మఠముగ నుండెను. ఇప్పుడది పాడుపడియున్నది.

ఓం తత్సత్

---

# హరికథా లక్షణము

*పండిత హరిదాసహంస పాతూరి మధుసూదనరావుగారు - భట్టిప్రోలు*

హరికథలనే పేరుతో తౌర్యత్రికకళ ఈ కాలమున మిక్కిలి ప్రచారములోనున్నది. కొందఱీ కళను ఆధునిక ప్రవృత్తమని భావించు చున్నారు. ఇది వైదిక యుగము నుండియు నున్నదను విషయము నేటి వాఙ్మయములో విస్మృతమైనది. నృత్యగాన వచన వాద్యములు దీనికి అవయవములు. నృత్యగీత వాద్యములు తౌర్యములనబడును. త్రికమనగా మూడు అనియర్థము కనుకనే ఈ కళకు తౌర్యత్రికము లక్షణము. ఆంధ్రదేశమున ఈకళను బ్రవర్తింపఁజేసి ఆచార్యుఁడైన ఆదిభట్టనారాయణదాసుగారు వారు రచించిన "శ్రీ హరికథాఽమృతమ్" అను సంస్కృతగేయ కావ్యోపోద్ఘాతమున "తస్మాద్విద్వాన్ ప్రేవ వదేత్ వీవ నృత్యేత్, దానకామా అస్మై ప్రజాభవంతి" ఇత్యాదికములైన పెక్కు శ్రుతిస్మృతి వాక్యములతో వైదిక యుగమునాటిదిగా పేర్కొని తామాకళను ఉపాసించుటకుఁ గారణము అది సర్వజన తారణోపాయ మనియు భక్తిభావము అవశ్యకమనియు ఉద్ఘాటించినారు. "హరి" అనుశబ్దము శివకేశవ భేదము లేకుండ సమన్వయించుఁ దగినది కనుక ఈకళ "హరికథ" యనఁబడుట సార్థకమైనది. ఇది పారమార్థిక విషయ ప్రధానమైనది అగుటచే దీని ప్రచారమునకుఁ దగిన స్థానము దేవాలయము.

## దేవాలయము

ప్రతిరోజునూ ఉభయ సంధ్యా సమయములలో శుచులై శుభమును సంకల్పించి నియమముగా ఇష్టదేవతను ధ్యానించుటయు మనః సమాధానము నందుటయు శ్రుతి తాత్పర్యము. ఈ ఆచారమునకు వీలైన పవిత్ర ప్రదేశము దేవాలయము. అనేక పూర్వసంస్కార పరిణామ ప్రాప్తములు మానవ శరీరములు. సంస్కారవశుల ననుసరించి ప్రవృత్తి యేర్పడును. ఫలాపేక్ష ననుసరించి దేవదర్శనాపేక్ష. ఎవరికే దేవునియందు భక్తి భావ మేర్పడునో వారాదేవాలయమునకే ఆరాధనాపేక్షతో వెళ్ళుదురు. ఆయాదేవాలయములందు ఆయాఉపాసకులకు ఇష్టమైన సాధనములునూ దృశ్యములునూ అమర్చబడి యుండుట ఆగమములు ఆలయ నిర్మాణ విషయమున నుద్ఘాటించినవి. దేవారాధకుల సంశయములు తీర్చుటకును అచటనుండి ఉత్సవాది కార్యక్రమము నిర్వర్తింపఁ జేయుటకును స్థానాచార్యులను పేరుతో నొకరుండుట విదితము. ఆలయమునకు వచ్చు ఉపాసకులకు బోధించుటకు నిగమాగమ పురాణేతిహాస జ్ఞానులుండుట అత్యావశ్యకము. శ్రోతలకు విషయము శ్రావ్యముగా నుండ వలయును గదా! కనుకనే తౌర్యత్రిక కళ ప్రజానీకము ప్రబోధావసర ఖ్యాతినందినది. ఇట్టి కళ దేవాలయముల యందుగాక ఈ కాలమున గ్రామవీధులలో ప్రదర్శిత మగుటచే అనేక సంస్కారములు అనేక చిత్త వృత్తులు కలిగి వ్యవహార కలుషితములైన హృదయములలో పారమార్థిక దృష్టికి మాంద్యమేర్పడు చున్నది. ఏదేవుని గూర్చిన విషయము ఆదేవాలయములో నియమబద్ధముగా నుండెనేని శ్రోతలు కూడ ఆయానియమముల ననుసరించిన కృతార్థులగుదురు. క్రమబద్ధముగాక వక్తలేమి చెప్పినను శ్రోతలు వినుటయూ, కేవల శ్రోతృప్రియముగ వక్తలు ప్రహసనములు ప్రదర్శించుటయూ, సంఘము వైజ్ఞానికముగా పతనమగును. ఆలయములలో విగ్రహములు బాగుండుననియో శిల్పము బాగుండుననియో మాత్రమే భావించుటకన్న "ఆదియొక పవిత్ర ప్రదేశమనియూ, మహిమ మూర్తీభవించియుండుననియూ, దుష్టులకు ఇది భయంకరమనియూ, ఇత్యాది లక్ష్యభావము కలుగునట్లు యాత్రికులకు బోధించి ప్రజానీకమును మునుముందు దేవాలయములద్వారా ఉద్ధరింపచేయుటే ఆగమముల యుద్దేశము. అట్టి పవిత్రభావములు కూర్చుటకే కవిపండిత కథకగాయకులకు ఈనాముల నొసగి మున్ను పోషించిరి. ప్రజాసామాన్యమునకు బోధింప తగినది హరికథలనబడు సంగీతకథ ఇపుడు మిక్కిలి ప్రచారమున నున్నది.

## హరికథ ఎట్లుండవలెను ?

ఈ విషయము ముఖ్యముగా ఆలోచించ వలసివచ్చినది. ఇపుడు లాక్షణికముగా లేదనుటకన్న ఎట్లుండ వలెనో నిర్ణయమైనపుడు ఆలక్షణము ననుసరించుట కళోపాసకునకు సన్మార్గము. హరికథకు నాయకుడు ఇష్టదైవము. మహిమ విషయము. వేదశాస్త్రతత్వ జిజ్ఞాసువు అధికారి. దేవతోపాసన ద్వారా ఐహికాముష్మిక సౌఖ్యము ఫలము. గాన నృత్యవాద్య ప్రవచనము సాధనము. దీనికి ప్రప్రథమాచార్యుఁడు సర్వశాస్త్రపారంగతుఁడైన నారదమహర్షి యనవచ్చును.

శ్లో॥ దేవదత్తా మిమాం వీణాం స్వరబ్రహ్మ విభూషితాం ।
మూర్ఛయిత్వా హరికథాం గాయమానశ్చరామ్యహం॥
భాగవతమ్. స్కం. అధ్యా। 6 శ్లో. 33

అనుచూ సమాధానించుట గమనింప తగును. కవిపండితగాయకులై మధుర బోధనా విధానమున నారితేరి హరికథ చెప్పువారు నారదాంశ సంభవులనుట అతిశయోక్తి కాదు. నారద మహర్షిచే ఉపదిష్టుడైన వాల్మీకిమహర్షి శ్రీమద్రామాయణము రచించి కుశలవులచే గానము చేయించుటచే కుశలవులు ప్రముఖకథకులైనారు. కవిత్వము నందునూ గానము నందునూ సిద్ధులైనవారు తాళలయలెఱిఁగి యతిప్రస్తారములు గమనించి అనుష్టుప్ మొదలు అన్ని వృత్తములునూ సర్వజన శ్రావ్యముగా గానముచేయగలరు. లయగ్రాహి భుజంగప్రయాత మందాక్రాంతా ద్యనేక వృత్తములు గేయములుగా నుపయుక్తములగుట స్పష్టమేకదా! కవనము గానము శాస్త్రపరిచయము కలిగి యుండుట సమర్థకథకలక్షణము.

## గానమువలన ప్రయోజనము

సామాన్యముగా ఇంద్రియ గోచరముకాని భగవత్తత్వము ననుభవించుటకు తక్కిన కళలకన్న గానకళ సన్నిహిత సాధనము. కనుకనే

శ్లో॥ గీతి జ్ఞానేన యోగస్స్యాత్ యోగాదేవ శివైక్యతా ।
కేవలం లౌకికం గానం నకుర్యాన్మోహతోఽపివా ॥
(నూతసంహిత)

అని చెప్పబడినది. గానమునకు విక్షేపదశ లయదశయని రెండు విధములు. ప్రథమదశయందు స్వర ప్రస్తారములు రాగఆలాపనాచాతుర్యము ప్రదర్శిత మగును. లయదశయందు లక్ష్యనిష్ఠద్వారా ఆత్మానందానుభూతి కలుగును. లక్ష్యములేక ప్రవృత్తిలేదు. గానమునకు లక్ష్యము దైవమైనపుడు తదైక్యానుభవమునే యోగమనియు తత్ఫలము "శివైక్యత" అనియూ చెప్పబడినది. దేవాంకితముకాని గానము లౌకికము. దీనివలన ప్రాపం

చిక విషయసుఖమాత్రఫలముతో ఉపాసకునకు శక్తి క్షీణించును. కనుకనే భ్రాంతి సమయమున కూడ లౌకిక గానము "నకుర్యాన్మోహతోఽపివా" అని నిషేధింపబడినది. ఈ విషయము మనసున నుంచుకొనియే గానవైద్యాదులు స్మృతులందు నిషేధింబడినవి అనగా అప్రశస్తఫలము నిచ్చునటువంటివన్నీ భగవల్లక్ష్యముగాని కళలన్నియూ నిషేధింప తగినవని తాత్పర్యము. కనుక శ్రేయోదాయకముగా కళను గుర్తించుట వలన ఫలము

" అతో గీతప్రపంచస్య శ్రుత్యాదేస్తత్వ దర్శనాత్ ।
అపిస్యాత్సచ్చిదానంద రూపిణః పరమాత్మనః ।
ప్రాప్తిః ప్రభాప్రవృత్తస్య మణిలాభో యథాభవేత్ ॥"
(యాజ్ఞవల్క్య)

తా. గీతమునకు సంబంధించిన విషయములు శ్రుతులు మొదలైనవి. వాటి తత్వమునవగతము చేసి కొనుట వలన సచ్చిదానంద రూపమగు పరమాత్మను పొందుట యను ఫలము కలుగును. దీపకాంతిలో తిరిగే వానికి రత్నము (అప్రయత్నంగా) లభించినట్లే ఆత్మప్రాప్తి కలుగును. అను మహర్షిబోధ యెవరు పూర్వపక్షము చేయగలరు? ఒకప్పుడు నారదుడు సనత్కుమారుని దరికేగి అధ్యయనము చేయింపుమని వేడగా ఋగాది వేదములు, పురాణేతిహాస, వ్యాకరణ, కల్ప, గణిత, దైవ, నిధి, తర్క, నీతి, నిరుక్త, భూత తంత్ర, ధనుశ్శాస్త్ర, జ్యోతిష, శిక్షా కల్ప, గారుడ, ముఖ్యవిద్యలన్నియు నేర్చితినని చివరకు "దేవజన విద్యాం ఏత ద్భగవోధ్యేతి" అన్నారు. "నృత్య గీతవాద్య శిల్పాది విజ్ఞానాని" అని శంకర భాష్యంపిమ్మట నారదుఁడు తన్మహర్షిచే బోధితుడై ఆత్మానందము ననుభవించెను. కనుక తత్వవేత్తకు గానము సన్నిహిత సాధనము. హరికథకు నిది ప్రత్యేకమగునొక అంగము. గై=శబ్దే, యను వ్యుత్పత్తిచే గానమన బడునది ధ్వని విశేషము. "సరిగమపధని" యను సంకేతములకు లక్ష్యమైన సప్తస్వరశ్రుతులు ఉదాత్తానుదాత్త స్వరిత భేదముచే మంత్రములందు ఉపయుక్తములు. చిరకాలము తపము చేయు మహర్షులకు ఇవిశ్రుతములైనవి కనుక శ్రుతులను పేరు కలిగినది. ఎవరికేది శ్రుతమో అశ్రుతికాయన ఋషి. సప్తశ్రుతులకు క్రమముగా అగ్నివేశ, కశ్యప, గౌతమ, అంగిరస, భార్గవ, కౌశిక, వశిష్ఠులు ఋషులు.

మంత్రముల యందలి ఉదాత్తము — ని, గ, అనుదాత్తము = రి, ప స్వరితము = స, మ, ప అనుధ్వనులు కలవి యనుటకు

ఉదాత్తే నిషాద గాంధారే అనుదాత్త ఋషభధైవతా।
స్వరిత ప్రభవాహ్యేతే షడ్జ మధ్యమ పంచమాః ॥
పాణిని "శిక్షా"

ఇట్లనుటచే ఋషులు గానానుభవానందులనుట నిస్సంశయము. ఇట్టిగానము స(షడ్జ) మ (మధ్యమ) ప్రత్యాహారము చేయుట వలన సామశ్రుతులైనవి. దీనినే సామవేదమనుట సార్థకము. మానవున కేకోర్కెయో, దానికేది ఫలింప చేయతగిన మంత్రమో దానినే శ్రుతులలో ఏవేళల గానము చేయవలెనో, ఆమంత్రమున కధిష్ఠాన దేవత యెవరో ఆదేవతకు ప్రియమగు రాగతాళ నృత్యములెవ్వియో తెలిసి విధిగా ఆచరించుట వైదికగానము.

## నృత్యము

"నృతీ = గాత్రవిక్షేపే" యను వ్యుత్పత్తిచే నృత్యమనగా భావాను కూలముగా శిరోముఖహస్త పాదాదిచలనమని తాత్పర్యము. హరికథకునకిది ముఖ్యావసరము. తాళలయాను సారముగా గేయభావము చూపించుచూ చేయబడునదియు నృత్యమనబడును. పాదవిన్యాసమును గూర్చి తండు మహర్షిచే చెప్ప బడినది కనుక తాండవమని పేరువచ్చెను. ఆగమములలో ఇట్టి నృత్య విశేషములునూ దేవతాప్రియములుగా కామికా గమములో చెప్ప బడినవి. విష్ణుప్రియమైనవి—విష్ణుక్రాంత నృత్యము ఘూర్జరీ రాగము, త్రిపుట తాళము—ఇంద్రునకు—సర్వమంగళనృత్యం, కేదార గౌళరాగము, త్రిపుట తాళము; ఇట్లుగ్రహించి హరికథ చెప్పునపుడు ఆయాదేవతలకు ప్రియమైన రాగతాళ నృత్యములు గ్రహించి ప్రయోగించుటచే శాస్త్రీయమైన హరికథ యనబడును. అశ్వమేధము జరుగునెడ మార్జాలీయ స్థానమున స్త్రీలు నృత్యము చేయుట విధిగాజరుగును.

## వీణాది వాద్యములు

ఇవి తంత్రీ సుషిరా నద్ధాది భేదములచే అనేకవిధములు. ఇవియే వీణావంశీ మృదంగాదికములు. వీణమొదలైనవి స్వరప్రస్తారాను రంజక రాగ గేయములు లయానుసారము నినదింప చేయుటకు ఉపయుక్తములు. భేరీమృదంగాదికములు కొట్టబడుటచేతనూ మర్దింపబడుటచేతను వివిధ నాదోత్పాదకమై గేయభావముల నుద్దీపింప జేయును. వాల్మీకి రామాయణమున రావణాంతః పురవర్ణనా సందర్భమున ఇరువది నాలుగు విధములుగా వీణ పేర్కొన బడినది. ఇప్పటి ఫిడేలు అను తంత్రీ వాద్యము పేరును బట్టి పాశ్చాత్య వాద్యమని కొందఱు భావించుచున్నారు. దీనిని హ్రస్వవీణ యనుట సమంజసము. వీణయన్నపుడు ఇపుడున్న మెట్లుకలిగిన నిర్దిష్టరూపమే స్ఫురణకు వచ్చును. అశ్వమేధ కాండ సావిత్రిష్టిలో

"అపవా ఏతస్మాచ్ఛ్రీ రాష్ట్రం క్రామతి యోఽశ్వమేధేన యజతే బ్రాహ్మణే వీణాగాథినౌగా యతః । శ్రియావా ఏతద్రూపం యద్వీణా శ్రియమే వాస్మిన్ యద్ధత్తే ।

(భాష్యం)--వీణాయాం శ్రీరూపత్వం లోకే ప్రసిద్ధం దరిద్రోపి యథాశ్రియం ప్రాప్నోతి తదాని మస్య సుఖార్థం గాయకై ర్వీణా వాద్యతే

ఇత్యాదికములచే వీణావాద్యము సంపత్ప్రాప్తి సాధనముగా రేబవళ్ళు బ్రాహ్మణ క్షత్రియులు యథావిధిగా మ్రోయింతురు. ఇట్టి వీణావంశీ మృదంగాది వాద్యములు హరికధలం దనువాదనోపయుక్తములు.

## ప్రవచనము

వేదములందు అనేక వాక్యములు దేవతాస్తోత్ర రూపకముగను విధులు నిషేధములు కథలు మొదలగు ననేక విధములుగా నున్నవి. పురాణములునూ సంహితలునూ అనువాదములే. ఋగ్వేదము నుండి అనేక వచన రూపమును సామమునుండి గానమునూ, యజుర్వేదము నుండి అభినయమునూ, అథర్వణము నుండి రసమునూ గ్రహించి బ్రహ్మ నాట్యశాస్త్రమును సృష్టించినట్లు

"జగ్రాహ పాఠ్యం ఋగ్వేదా త్సామభ్యో గీతమేవచ।
యజుర్వేదా దభినయాన్ రసానాథర్వణాదపి ॥
నాట్య "అధ్యా। శ్లో 17"

ఇట్లు సృష్టింపబడిన నాట్యశాస్త్రము ప్రప్రథమమున ఏకైక పురుషుని వల్లనే ప్రయుక్తమయ్యెను. నారదమహర్షి బ్రహ్మసభలో త్రిపుర సంహార కథను గానము చేయుట మొదలగు పురాణ వాక్యములు పరిచితములేకదా! సత్యనారాయణ వ్రతాదికము లందు గానవాద్య నృత్యములచే భగవంతుని కథలను చెప్పుకొనుచు రాత్రి మేలుకొను నియమము సామాన్యముగ నందరకు తెలిసినదే. ఏకపాత్ర ప్రయుక్తమగు హరికథ (సంగీత కథ)కు ఆహార్యము లేదు. దశవిధ రూపకములలో నిది "భాణరూపక" మని కొందరు భ్రాంతి పడుచున్నారు. భాణమున నీచుడు నాయకుడు. ఇందు షడైశ్వర్యపూర్ణుడైన భగవంతుడు నాయకుడు. లక్ష్మణరావుగారిచే కూర్పబడిన ఆంధ్రవిజ్ఞాన సర్వస్వమునందు "హరికథ పీష్వాల కాలమున నొక హాస్యకవి నుండి యారంభమైన" దనుట అనాలోచితమే యన వచ్చును. భగవత్కథా విధానము గానవాద్య నృత్యములతో వైదిక యుగము నాటి నుండియు నున్నదే!

## ముగింపు

ఇట్టి కళయొక్కటే యననేల? వైదిక యుగము నాటి వాఙ్మయము శిల్పములు రెండు వేల సంవత్సరముల నుండియు పరపరిపాలకులచే హరింప బడి క్రీ.శ. 1947 సం॥ము నుండిదేశము స్వతంత్రమై స్మరణమాత్ర యోగ్యములైనవి. వైకల్యము చెందిన అనేక శిల్పములు బయట పడవేయుదని భూగర్భములో మూల్గు చున్నవి. వీటి సముద్ధరణమునకు పూనుకొన్న దేవాదాయ ధర్మాదాయ శాఖామాత్యులు ఉన్నతోద్యోగులునూ ప్రశంసనీయులు. తిరుపతిలో హరికథకులకు శిక్షణ తరగతి పెట్టునట్లు పూర్వము ప్రకటించియూ ఉపేక్షింప బడిన హేతువేమో తెలియదు. హరికథనము మిక్కిలి ప్రజానీకములో ప్రచార శాఖకు సంబంధించి అభ్యున్నతి హేతువైనది. కళలన్నియు నిప్పటికిని భారతదేశమున గురుశిష్య పరంపరాగతమై నిలిచి యుండుట ఋషిపుంగవుల ఆశీర్వచన భాగ్యముకదా!

ఓం తత్సత్

---

# తంజావూరు దేవాలయములు

*విద్వాన్ కాంచనపల్లి కనకాంబగారు - విజయవాడ*

మన దేశములో నాయా స్థలములందలి గుళ్లు, గోపురములు, దేవాలయములు, భవనములబట్టియు అందలి శిల్పములు చిత్రములనుబట్టియు గొప్ప పట్టణములని యందుము. ఇతర దేశములలో, పార్లమెంటు భవనములు, ఉద్యానవనములు, రాజభవనములు శిల్పములు మొదలగునవి యున్న పట్టణములకు గొప్పపేరున్నది.

నేర్పరులైన శిల్పులు పూర్వము ఎంతెంత పనులు చేసినారనుకున్నారు? మనుష్యులు మృగములు మొదలగువానియొక్క యాకారములను రాతితో చెక్కుట, కొయ్యమీద చెక్కుట, మంటితో తయారుచేయుట, లోహములను కరిగి ఆయా ఆకారములుగా పోతపోయుట మొదలగువానిని శిల్పవిద్య యందురు. దీనినే "ఆర్కిటిక్చర్" అని ఇంగ్లీషులో నందురు. స్థాపత్యవిద్య యనునది యిదియే. ఒక శతాబ్దములో నున్న మనుష్యులు కొంతకాలమేగాని మరియొక శతాబ్దమువరకు బ్రతికి యుండరుగదా! దేశములోనున్న శిల్పములు, దేవాలగా

ములు, మొదలగునవి, వందలకొలది సంవత్సరములు పరిపూర్ణాకారములతోగాని, కొంత శిథిలమైగాని, నిలిచి యుండి ఆ దేశముయొక్క గొప్పదనమును జాటు చుండును.

చాల పురాతన శిల్పములు కట్టడములు గలవి పాశ్చాత్యదేశములలో, గ్రీసు, ఇటలీ, దేశములు మధ్య ప్రాచ్యదేశములలో భారతదేశము అని మిక్కిలి కీర్తి వహించుచున్నవి. అందు మన భారతదేశములో, వింధ్య పర్వతమునకు పైభాగము, దక్షిణ హిందూస్థానమనియు, దిగువభాగము దక్షిణ హిందూస్థానమనియు లేక దక్కన్ అని వ్యవహరించెదరు. ఉత్తర హిందూస్థానములో ఆగ్రా లోని తాజమహల్, అమృతసరములోని సిక్కుమతస్థుల బంగారుదేవాలయము, సౌరాష్ట్రములోని సోమనాథదేవాలయము, ఢిల్లీ, ఝాన్సీపట్టణములలో గల కోటలు రాజభవనములు మొదలగునవి ప్రపంచములో పేరుగాంచిన కట్టడములు. కాని గుళ్లు, గోపురములు, శిలావిగ్రహములు కంచు రాగి మొదలగు లోహవిగ్రహములు, మొదలగు వాని విషయములోగాని, దక్షిణదేశము గొప్పదని చూచు వారికి తోపకపోదు. కొన్ని కొన్ని మంటపాదులను గాంచి నప్పుడు అవి దేవతానిర్మాణములో యనిపించును.

అట్టి దక్షిణదేశములోనున్న తంజావూరు దేవాలయము లనుగురించి, కొంత తెలిసికొందము. ఇది చెన్నరాజధానిలో తంజావూరు జిల్లాకు ముఖ్యపట్టణము. ఇది కావేరీనదీకాలువల నీటిపారుదల గలదియై సస్యసమృద్ధి యైనది. ఫలవృక్షములతో నిండిన తోటలు, దొడ్లుకలదియై మిక్కిలి భాగ్యవంతమయినది. ఇచ్చటికి చెన్నపట్టణము 120 మైళ్ళు. ఈ తంజావూరును రాజధానిగా చేసికొని చోళరాజులు, తరువాత విజయనగరమునకు, సామంతులైన నాయకరాజులు పాలించిరి. వారి తరువాత 1656—1675 మధ్యకాలమున నీ పట్టణమును మహారాష్ట్ర ప్రభువులు పాలించిరి. 1855 లో బ్రిటీషువారివశ మయినది.

తంజావూరు ప్రాచీనకాలమునుండియు దక్షిణదేశమున గొప్ప రాజధానిగ నుండి సకల కళలకు విద్యలకు స్థానమయి విలసిల్లినది. ఇందు ప్రాచీన నాగరికతా చిహ్నములు అయిన హిందూదేవాలయముల ప్రాముఖ్యత గమనింపదగినది. ఇచ్చట గల పెరియకోయిల్, బృహదీశ్వరాలయము జగద్విఖ్యాతిగన్నది. వీరచోళుడను రాజు ఈ దేవాలయమును నిర్మించెను. అందు ఒకే రాతితో చెక్కబడిన పెద్ద నందిగూడ స్థాపించెను బృహదీశ్వరాలయముయొక్క విమానమును, ఈ నందిని జూచుటకు నేటికిని దేశదేశములనుండి జనులు వచ్చుచుందురు.

బృహదీశ్వరుడు పేరునకు తగినట్లే యుండును. పాను వట్టం డయామీటరు (అనగా మధ్యకొలత) 30 అడుగులు. ఇక నందలి లింగము ఎత్తు 14 అడుగులు. దాని డయామీటరు మధ్యకొలత 5 అడుగులుండును. ఎత్తుపీటమీద ఈ లింగము స్థాపించబడియున్నది. రెండంతస్థుల మేడ మీదికి వెళ్ళి లింగమున కభిషేకము చేయవలెను. అమరావతిలోకూడ మేడ ఎక్కి అభిషేకము చేయవలెను గదా! గుంటూరు సమీపములో నున్నవారు దీనిని చూచి యుందురు. ఈ బృహదీశ్వరాలయములో నున్న నంది చాల పెద్దది. ప్రపంచములో నింతపెద్ద నంది ఎచ్చటను లేదందురు. అది ఒకే శిల. ఆ నంది మనవైపు చూచు చున్నట్లే యుండును.

ఇచటి అమ్మవారు కామాక్షి. మూలవిరాట్టు కామాక్షి బంగారువిగ్రహము. కనకమయమగు మూలవిరాట్టు ఇంకెక్కడను లేదు. 1½ అడుగుల యెత్తు. చాల మనోహరముగ నుండును. ఆ అమ్మవారికి ఒక భక్తుడు నూరు కోట్ల కుంకుమార్చన సంకల్పించి దినమునకు పదివేల చొప్పున నిప్పటికికూడ జరుపుచున్నాడు.

ఈ దేవాలయమునకు రెండు ప్రాకారాలున్నవి. రెండవ ప్రాకారమధ్యలో నున్న గుడిమీద విమానము హిందూ దేవాలయములన్నిటిలో మిక్కిలి గొప్పది. ఇది 96 అడుగుల చదరముగల పునాదిమీద 208 అడుగుల యెత్తుగా కట్టబడినది. ఈ విమానము మీద శిఖరము ఒక నల్లశానం బండతో చెక్కి చేయబడినది. ఈ పెద్దబండను ఆ శిఖరము పైకి నెక్కించుటకు 5 మైళ్ళ దూరమునుండి గుడి విమానము చివరివరకు ఏటవాలైన రోడ్డును ముందు ఏర్పాటు చేసి ఆ రోడ్డుమీదుగా నా బండను కూలీలచేత దొల్లించుకొని వచ్చి శిఖరముమీద పెట్టిరని చెప్పుకొందురు. మూలస్థానేశ్వరుని గోపురము నీడ ఎచ్చటను పడదు. సూర్యునిగతి ననుసరించి ఉదయము ఒకప్రక్క, సాయంకాల మొకప్రక్క నీడపడుట సహజముగదా! ఈ గోపురపు నీడ గోపురమునందే యిమిడియుండును.

ఇది చాల చిత్రమైనది, చూడదగినది. ఈ శివాలయ గోపురప్రాకారము మిక్కిలి ప్రాచీనమైనదిగా గనబడుచున్నది. దీనిని 1330లో కాంచీపుర రాజొకడు నిర్మించె నందురు. ఈ గోపురమునకు, దేవాలయమునకును మధ్య ప్రసిద్ధమైన పెద్ద రాతినంది యున్నది. ఇది 16 అడుగుల పొడుగు 12 అడుగుల ఎత్తు ఉండును. 400 మైళ్ళ దూరమునుండి ఈ పెద్ద రాతిని తెప్పించి నందిగా చెక్కబడినదట. దీనికి ప్రతిదినము తైలముతో అభిషేకము చేయుదురు. అందువలన నది మెరయుచు కంచువిగ్రహమాయన్నట్లుండును.

ఇచ్చట గమనింపదగిన చిత్రమొకటి యున్నది. గోపురమునకు పైన విష్ణువిగ్రహములు, ప్రాకారములోపల శివుని విగ్రహములును నుండుట; పెద్ద గోపురమునకు ఉత్తరముగా సుబ్రహ్మణ్యదేవాలయమున్నది. బృహదీశ్వరాలయము కట్టిన శిల్పికుమారుడే ఈ దేవాలయము కట్టెనందురు. ఇందులోకూడ చక్కని శిల్పచాతుర్యము కనబడుచున్నది. ఈ గుడియొక్క సోమసూత్రమునుండి బయటికి వచ్చు అభిషేకజలమును యాత్రికులు పుచ్చుకుందురు. ఈ తంజావూరులో సరస్వతీమహలులో గల పుస్తక భాండాగారము చాల ముఖ్యమైనది. అనేక సంస్కృతాంధ్రగ్రంధముల వ్రాతప్రతులిచ్చట లభించి అచ్చువేయబడి ప్రకటింపబడినవి.

తంజావూరి పట్టణమున అరవవారి తరువాత తెలుగువారే ఎక్కువగా కనిపించుచున్నారు. ఈ ప్రాముఖ్యమే ఇచ్చటి సరస్వతీమహలుసందలి పుస్తకముల విషయమునకు గలదు. ఇచ్చట సంస్కృతము తరువాత తెలుగు భాషయందే ఎక్కువ గ్రంధములు గలవు.

సంగీత సాహిత్యములకు తంజావూరు ఉనికిపట్టు. కొండపల్లి బొమ్మలలో తంజావూరు బోగంమేళంసెట్టు ఇప్పటికిని కొని సంక్రాంతి బొమ్మలకొలువులో మన బాలికలు పెట్టుకొనుచున్నారు. తంజావూరు నాగరికత ఆసేతు హిమాచలము ప్రసిద్ధము.

ఓమితి శివమ్

(ఆల్ ఇండియా రేడియోవారి సౌజన్యముచే ప్రచురితము)

---

# ఉపాసనా రహస్యము

*జ్యోతిష విద్వాన్, ఆగమవిశారద తంగిరాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు - వెల్లటూరు*

(1)

భారతదేశము ధర్మప్రధానక్షేత్రమని సృష్ట్యాదినుండియూ సర్వవాది సమ్మతము. అట్టి ధర్మము నిగమాగమరూపమగు వేదమై వెలయుచున్నది.

"వేదప్రణిహితోధర్మః అధర్మస్తద్విపర్యయః" అనుట వలన వేదచోదితమైనదే ధర్మము, విరుద్ధమైనది అధర్మమని తెలియుచున్నది. వేదము మంత్ర బ్రాహ్మణ ఉపనిషద్రూపమై కర్మ, ఉపాసన, జ్ఞానప్రతిపాదకమై లౌకిక అలౌకిక పారమార్థిక విషయములకు నిలయమై అపౌరుషేయమై సర్వవిద్యలకు మూలభూతమై యలరారుచున్నది.

అట్టి వేదము పరా, అపరా, అను ద్వివిధ భేదములతో కర్మ, జ్ఞానములకు కారణమై యున్నది, "ద్వెవిద్యే వేదితవ్యేచ పరాచైవాఽపరాతథా" అను శృతివలన అపరారూపము ఋగ్యజుస్సామాఽథర్వణములను చతుర్విధ భేదములతో మంత్ర బ్రాహ్మణాత్మకమై కర్మకాండము బోధించునదిగనూ పరారూపము ఉపనిషదాత్మకమై ఉపాసనాకాండమను అవాంతరభేదముతో జ్ఞానకాండము బోధించుచూ ధర్మజ్ఞానములకు పదునాల్గు విద్యలకు మూలమై యున్నది.

పురాణ న్యాయ మీమాంసా ధర్మశాస్త్రాంగ మిశ్రితాః
వేదాః స్థానాని విద్యానాం ధర్మస్యచ చతుర్దశ ॥

అట్టి మంత్ర బ్రాహ్మణ ఉభయాత్మక అపరారూపమగు వేదము అనిష్టరూపమగు మృత్యువును పోగొట్టుకొని యిషరూపమగు స్వర్గాది సుఖమును బొందుటకు సాధనమగు అగ్నిహోత్రాది సహస్ర వత్సర సత్రయాగాంత కర్మలను బోధించి తత్కర్మాచరణముద్వారా కామచార కామవాద కామభక్షణ మొదలగు స్వేచ్ఛాచార రూప జనన మరణ దుఃఖ సంసార సముద్రమును తరించి బహు కాలిక సౌఖ్య ప్రతిపాదకమగు స్వర్గమును బొందించునదియై యున్నది. ఇట్టి కర్మకాండమును బోధించు సూత్రములను అపస్తంబాది మహర్షులు కల్పమను వేదాంగముగా వ్రాసియున్నారు. యీ సూత్రములలో నిర్ణయించు కర్మలలో కలుగు పరస్పరభేదములను చర్చించి వేదవాక్యములకు ఏకత్వము సాధించి జైమినిమహర్షి పూర్వమీమాంసా శాస్త్రమును రచించెను.

ఇట్లు వేదచోదితకర్మలు ఆచరించుటవలస పురుషునకు అనేక జన్మపరంపరలలో ప్రాప్తమైన పాపము క్షయమై పరమేశ్వరుని అనుగ్రహము పొందుటయున్నూ జన్మతః ప్రాప్తమగు దేహమే దేవుడుగాడనియూ దేహమందుగల జీవుడు వేరనియూ అట్టి జీవుడు కించిజ్ఞుడనియూ అసంఖ్యాక బ్రహ్మాండ నిర్మాణకర్తయగు పరమేశ్వరు డొక్కడున్నాడనియూ అతడు సర్వజ్ఞుడనియూ ఆ సర్వజ్ఞుడగు పరమేశ్వరుని ప్రీత్యర్థము కర్మలుచేసిన ఆ కర్మఫలముచే పరమేశ్వరుని అనుగ్రహము పొందుటకు వీలగుననియూ ఆతని యనుగ్రహమువలన సర్వ కోరికలు పొందగలుగుననియూ అందుచే పరమేశ్వరుడు సేవ్యుడనియూ జీవుడు

సేవకుడనియూ సేవ్యసేవకభావములచే భగవదనుగ్రహము పొందుటయే కర్మసిద్ధాంతమునకు ముఖ్యాంశమని మీమాంసా శాస్త్రము బోధించుచున్నది.

ఇట్లు కర్మానుష్ఠానమువలన చిత్తశుద్ధిగలిగి కర్మ ఫలముచే దేవలోకములనుపొంది పుణ్యవిశేషములచే సౌఖ్యములనుపొంది "క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి" అనుటవలన తిరిగి జన్మలనుపొంది తిరిగి కర్మానుష్ఠానములను జేయుచూ ఎన్నటికీ మోక్షమును పొందలేక మోక్షము గోరువారికి పరారూపమగు వేదము ఉపనిషదాత్మక జ్ఞానకాండమును బోధించుచున్నది—

ఉపనిషత్తులలో బోధింపబడిన బ్రహ్మవస్తువు సర్వవ్యాప్తమగుటవలననూ స్వప్రకాశమగుటవలననూ నిర్గుణమగుటవలననూ నిరవయవమగుటవలననూ సత్తామాత్రమగుటవలననూ సజాతీయ విజాతీయాది భేదములు లేకపోవుటవలననూ అద్వయమగుటవలననూ అట్టి వస్తువును సేవ్య సేవకభావముచేగాని రాగద్వేషములతోగూడిన కర్మఫలముచేగాని పొందుటకు శక్యము గానందువలన చిత్తశుద్ధిచే గల్గిన మోక్షేచ్ఛవల్ల నిరపేక్షజ్ఞానముబొంది బ్రహ్మసాక్షాత్కారమునకై సద్గురువు నాశ్రయించి వేదాంతవాక్యశ్రవణముచేసి తదర్థమనన నిదిధ్యాసలచే జీవుడు బ్రహ్మముకంటె వేరుగాడనియూ అజ్ఞానముచే అన్యధర్మములను తనయందు చూచుటవలన జీవుడు కర్తృత్వ భోక్తృత్వములతో సుఖదుఃఖములను పొందుచున్నాడు గాని జీవునకు సుఖదుఃఖములు లేవు, సాక్షిమాత్రుడు చిద్రూపుడనియూ బ్రహ్మముకంటె వేరుగాడనియూ తెలుసుకొని నిరపేక్ష జ్ఞానముచే అద్వయానందమును పొందుటకు వేదము పరారూపమగు జ్ఞానకాండమును బోధింపుచున్నది. ఇట్టి జ్ఞానకాండమును వేదవ్యాసులు "ఉత్తరమీమాంస" యను పేరుతో సూత్రములను రచించగా 'ఉత్తర మీమాంస' యను పేరుతో శంకరభగవత్పాదులు భాష్యమును రచించియున్నారు.

ఇట్లు వేదములు స్వర్గాऽపవర్గరూపములగు కర్మజ్ఞానములను ధర్మమును ప్రతిపాదించుచూ సృష్ట్యాదినుండియూ సజాతీయ జాత్యాలంబనము కల్గి ప్రకాశింపుచున్నవి. అట్లు వేదములు దుర్జ్ఞేయములై గంభీరార్థకములై సర్వజనజ్ఞేయములు గాకపోవుటవలన వానిని తెలుసుకొనుటకుగాను మహర్షులు వేదాంగములను వేదార్థోప బృంహితములగు పురాణేతిహాసములను ధర్మశాస్త్రములను దార్శనికములను మొదలగు పదునాల్గు విద్యలను రచించి వాని సహాయముచే వేదార్థములను తెలియునట్లు అనుగ్రహించియున్నారు.

ఇట్లు కృత త్రేతా ద్వాపర యుగములు చనగా రాబోవు కలియుగము మిగులపాపభూయిష్ఠమై అల్పప్రజ్ఞాదిదోషయుక్తులగు జీవులు బహుధన, కాయక్లేశ, విధినియమ సాధ్యమగు కర్మముల చేయుటకు శక్తులు గారనిన్నీ దీర్ఘకాలాభ్యాససాధ్య చిత్తశుద్ధిపూర్వక నిర్విశేష జ్ఞానసంపాదనము అసాధ్యమనియూ, పరశివుడు జ్ఞానకాండాంతర్గతమగు ఉపాసనాకాండమును వేదప్రామాణ్యమగు ఆగమశాస్త్రములద్వారా ప్రసాదించెను.

తపః పూర్వం కృతయుగే త్రేతాయాం యజ్ఞ మేవచ।
ద్వాపరే దానమిత్యాహుః కలౌ భక్తి ర్గరీయసీ॥

అను మనుస్మృతి ప్రమాణముచే కలియుగమందు భక్తి కన్న భగవంతుని అనుగ్రహము పొందుటకు వేరు మార్గములు ఉపయోగింపవు—ఘోరమగు కలియుగమును గురించి శివునిగూర్చి పార్వతీ ప్రశ్నము—

అయాతే పాపిని కలౌ సర్వధర్మ విలోపిని।
దురాచారే దుష్ప్రపంచే దుష్టకర్మ ప్రవర్తనే।
నవేదాః ప్రభవ త్తత్ర స్మృతీనాం స్మరణం కుతః।
నానేతిహాస యుక్తానాం నానామార్గ ప్రదర్శినాం।
బహులానాం పురాణానాం వినాశో భవితావిభో।
తదాలోకా భవిష్యంతి ధర్మకర్మ బహిర్ముఖాః।
జాయన్తేచ మ్రియంతేచ తేషాం మోక్షేన విద్యతే।
కేనోపాయేన దేవేశ ముచ్యతే వద మే ప్రభో—
ఇతి ప్రశ్నే—శివోక్తిః

శృణుదేవి ప్రవక్ష్యామీత్యారభ్య॥
ఆగమోక్తేన విధినాకలౌ దేవాన్ యజేత్సుధీః।
కలావాగమ ముల్లంఘ్య యోన్యమార్గే ప్రవర్తతే।
నతస్య గతిరస్తీతి సత్యం సత్యంన సంశయః।
కలౌ తంత్రోదితా మంత్రాః సిద్ధాస్తూర్ణ ఫలప్రదాః।
శస్తాః కర్మసు సర్వేషు జపయజ్ఞ క్రియాదిషు।
నిర్వీర్యాః శ్రౌతజాతీయాః విషహీనోరగాఇవ॥

అనుటవలన కలియుగమందు భగవదనుగ్రహము పొందుటకు ఆగమశాస్త్రములలో చెప్పబడిన భక్తిమార్గముకన్న విశేషమైన మార్గము లేదని తెలియుచున్నది.

ఇట్లు శివప్రణీతములగు శాస్త్రములలోని ఉపాసన భక్తిని విచారించి నారదాదిమహర్షులు సకలజనోపయోగముగా భక్తిశాస్త్రమును నవవిధములుగా విభాగించి సూత్రగ్రంథములను రచించి లోకమునకు అనుగ్రహించి యుండిరి.

(2)

సచ్చిదానందరూపుడగు బ్రహ్మ నిర్వికల్పుడు నిష్కలంకుడు నిరంజనుడు శుద్ధుడు నిరవయవుడు నిస్సంగుడు స్వప్రకాశుడు సత్తామాత్రుడు అద్వయుడు అగు పరమేశ్వరునివలన అనాదియగు ప్రకృతియను శక్తి ఆవిర్భవించి శబ్దరూపమై శబ్ద బ్రహ్మమని చెప్పబడుచున్నది.

అనాదినిధనా శక్తిః వాగుత్సృష్టా స్వయంభువా ।
శబ్దబ్రహ్మేతి తం ప్రాహుః సర్వాగమవిశారదాః ॥
ఇట్టి శక్తితో నిర్గుణుడగు శివుడు సగుణుడై సర్వకర్తయై పంచకృత్యస్వరూపుడై జగన్మయుడై సగుణరూపుడై యున్నాడు.

నిత్యః సర్వగతస్సూక్ష్మః సదానందో నిరామయః ।
వికార రహితస్సాక్షీ శివో జ్ఞేయ స్సనాతనః ॥
తచ్ఛక్తిభూతః సర్వేశోఽబిన్నో బ్రహ్మాది మూర్తిబిః ।
కర్తా భోక్తాచ సంహర్తా సకలస్స జగన్మయః ॥

అని నిర్గుణ, సగుణ లక్షణములు శాస్త్రములు బోధించు చున్నవి.

శివాధీనమగు శక్తివలన నాదము నాదమువలన బిందువు, నాదబిందువుల సంయోగమువలన సృష్టికి కారణమగు బీజము కల్గినవి. ఈ ప్రకృతిరూపమగు నాదబిందు బీజములను మూడున్నూ ఇచ్ఛాజ్ఞాన క్రియా శక్తులై సోమసూర్యాగ్ని రూపములై ప్రకాశింపుచున్నవి.

ఇట్లు సకలుడగు సదాశివునివలన పంచకృత్యములకు కారణములగు నివృత్తి, ప్రతిష్ఠా, విద్యా, శాన్తి, శాన్త్యతీతలను పంచకళలు ఉద్భవించెను. ఈ పంచకళలవలన సృష్టి, స్థితి, లయ, తిరోధాన, అనుగ్రహాఖ్యలగు పంచ కృత్యములకు అధిపతులై బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశ్వర, సదాశివులు పుట్టిరి. ఈ పంచబ్రహ్మలు పంచశక్తులగు ఇచ్ఛా, జ్ఞాన, క్రియా, చిచ్ఛక్తి, ఆనందశక్తులతో పంచ కృత్యములు నిర్వహించుచున్నారు.

సృష్టి—జగత్తును పుట్టించుట
స్థితి—పుట్టించిన జగత్తును రక్షించుట
లయము—పెంచిన జగమును నాశముచేయుట
తిరోధానము — ప్రపంచమును అణువులతోగూడా నాశమొనర్చి తిరిగి సృష్టివరకూ బీజరూపముగా నుంచుట.
అనుగ్రహము—బీజరూపముగానున్న జగమును తిరిగి సృష్టించుటకు అనుగ్రహించుట

ఈ తిరోధాన అనుగ్రహములే బంధమోక్షములేగూడ చెప్పబడును. అనగా యీశ్వరుని మాయవలన బంధము గలిగిన జీవునకు సదాశివుని అనుగ్రహమువలన మోక్షము గల్గును.

సకలుడగు సదాశివుని మూర్ధ్నవలన యీశానుడు, ముఖమువలన తత్పురుషుడు, హృదయమువలన అఘోరుడు, గుహ్యమువలన వామదేవుడు, పాదములవలన సద్యోజాతుడు, పంచభూతస్వరూపులై పంచ బ్రహ్మలు పుట్టిరి. ఈ పంచబ్రహ్మలను ముఖములతో పరమేశ్వరుడు పంచభూతములగు పృథివీ, జల, అగ్ని, వాయు, ఆకాశ రూపబ్రహ్మాండరూపుడై పంచముఖ పరమేశ్వరు డాయెను.

ఇట్టి సకలునివలన షడధ్వములు, అనగా కళాధ్వము, తత్త్వాధ్వము, భువనాధ్వము, వర్ణాధ్వము, పదాధ్వము, మంత్రాధ్వములను షడధ్వములు శివశక్త్యాత్మకమై శక్త్యాత్మక విమర్శబిందువువలన వర్ణ, పద, మంత్ర ములను మూడు అధ్వములున్నూ శివాత్మక ప్రకాశ బిందువువలన కళా, తత్త్వ, భువనములను మూడు అధ్వ ములున్నూ ఉద్భవించెను. ఇట్లు షడధ్వములవలన పంచాశత్తత్త్వములతో అన్యోన్య సంయోగమువలన సమస్త భువనములు శివ, శాక్త, విష్ణు, సౌర, గాణాపత్య బౌద్ధ ములను షణ్మతములకు మూలములగు సర్వమంత్ర ములున్నూ సర్వవిద్యలున్నూ ప్రణవమంత్రమునుండి ఆవిర్భవించి అండాండ, బ్రహ్మాండ, సమష్టి రూపమై వెలయుచున్నది.

పంచముఖుడగు పరమేశ్వరుని ముఖములనుండి పరా రూపమగు శబ్దబ్రహ్మము పశ్యంతీ, మధ్యమా, వైఖరీ రూపములనుపొంది సమస్త వేదశాస్త్ర పురాణ ఆగమ మీమాంసాది సకల వాఙ్మయరూపమై వెలువడెను.

కారణబిందువునుండి పుట్టిన శబ్దబ్రహ్మరవము అవ్యక్తమై స్వాత్మయందుండి పరారూపమునూ, ఆరవమే నాభిపర్యంతమువచ్చి వాయురూపమునుపొంది అభి వ్యక్తమై విమర్శరూపాత్మకమై మనస్సుతోకూడి సామాన్య శబ్దముతో ప్రకాశకార్యబిందుమయమై పశ్యంతీరూపమునూ ఆ శబ్ద బ్రహ్మమే వాయురూపముతో హృదయమువరకూ వచ్చి నిశ్చయాత్మకమైన బుద్ధితో కలసి విశేషస్పంద ప్రకాశరూపమగు నాదముకలదియై మధ్యమారూపమున్నూ ఆశబ్దబ్రహ్మమే వదనమువరకూ వాయురూపముతో వచ్చి కంఠమందు గల వర్ణరూపమును (అక్షర) పొంది స్పష్ట ముగా శ్రవణేంద్రియమునకు తెలియునట్లు ప్రకాశ రూపాత్మక బీజరూపమై వైఖరీరూపమును పొంది ముఖమునుండి వెలువడుచున్నది.

శృతి ॥ చత్వారి వాక్పరిమితా పదాని
తాని విదుర్బ్రాహ్మణా యే మనీషిణః ।
గుహాత్రీణి నిహితానీంగయంతి
తురీయం వాచో మనుష్యా వదంతి "ఇతి"

ఇట్లు శబ్దబ్రహ్మము నాదరూపమై ఆధారాది షట్చ క్రములనుండి అకారాది క్షకారాంత పంచాశద్వర్ణాత్మకమై పంచాశత్తత్త్వరూపమునుబొంది బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశ్వర, సదాశివ, అధిష్ఠానములగు పంచాశత్కళలతో సోమ, సూర్య, అగ్ని ఖండములతో కాలరూపమగు ప్రజాపతి నామక సంవత్సరమై భూర్భువస్సువర్లోకములకు స్థానమైన బ్రహ్మాండరూపమునుపొంది తత్త్వాత్మకమై పిండాండ బ్రహ్మాండాత్మకమగు చరాఽచర రూపమై వెలయుచున్నది.

పిండాండమగు దేహమునందు ఆధార, స్వాధిష్ఠాన, మణిపూరక, అనాహత, విశుద్ధ, ఆజ్ఞా, సహస్రారములను ఆరుచక్రములు వెన్నెముకయగు వీణాదండమును అంటి యున్నవనుట యోగశాస్త్ర ప్రమాణము. ఇట్లు ఆధార చక్రమునుండి సహస్రారచక్రమువరకూ ఆధారభూతమై ఆధారచక్రమున ముఖమునూ సహస్రారమున తోకయూ గలిగి సర్పమువలె ప్రకాశింపుచు, సర్వదా నిద్రావస్థను పొంది కుండలినీశక్తి ప్రకాశింపుచున్నది.

భుజంగాకార రూపేణ మూలాధారం సమాశ్రితా।
శక్తిః కుండలినీ నామ బిసతంతు నిభాఽశుభా॥ "ఇతి వామకేశ్వరతంత్రే"

ఇట్టి కుండలినీశక్తి సోమ, సూర్యాగ్ని, త్రిఖండాత్మక దేహమందుగల భూతరూపములగు చక్రములలో వామ, దక్షిణ మార్గములగు ఇడా పింగళా నాడులలో పరిభ్రమించుచూ అకారాది పంచాశ ద్వర్ణరూపమునుపొంది పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీలను చతుర్విధభేదములతో బయలు వెడలుచున్నది.

1. ఆధార చక్రము—నాలుగు దళములు—పృథివీతత్త్వం—వ, శ, ష, స, 56 కిరణములు—

2. స్వాధిష్ఠాన చక్రము—ఆరు దళములు—ఉదక తత్త్వం—బ, భ, మ, య, ర, ల, 52 కిరణములు

1 (అగ్ని ఖండం, పది కళలు, 108 కిరణములు—)

3. మణిపూరక చక్రము—పది దళములు—అగ్ని తత్త్వం—డ, ఢ, ణ, త, థ, ద, ధ, న, ప, ఫ— 62 కిరణములు—

4. అనాహత చక్రము—పన్నెండు దళములు—వాయుతత్త్వం—క, ఖ, గ, ఘ, ఙ, చ, ఛ, జ, ఝ, ఞ, ట, ఠ,—54 కిరణములు

2 (సూర్యఖండం, 12 కళలు, 116 కిరణములు—)

5. విశుద్ధి చక్రము — పదునారుదళములు—ఆకాశ తత్త్వం — అ. ఆ. ఇ. ఈ. ఉ. ఊ. ఋ. ౠ. ఌ. ౡ. ఏ. ఐ. ఓ. ఔ. అం. అః. 72 కిరణములు

6. ఆజ్ఞా చక్రము—రెండు దళములు—మనస్తత్త్వం-హం, క్షం, 64 కిరణములు

3 (సోమఖండం, 16 కళలు, 136 కిరణములు—)

ఇట్లు త్రిఖండాత్మక బ్రహ్మాండము, దేహమను పిండాండమూ నాదబిందు కళాత్మకమై వెలయుచున్నది. ఈ త్రిఖండములలో ప్రథమఖండమగు అగ్నిఖండమునందు స్వాధిష్ఠానమందు అధిదేవతయగు అగ్ని తన ఖండసమష్టి కిరణములగు 108తో బీజములగు పది అక్షరములనుండి వెలువడిన, ధూమార్చి, ఉష్మా, జ్వలినీ, జ్వాలినీ, విస్ఫులింగినీ, సుశ్రీ, సురూపా, కపిలా, హవ్యవాహా, కవ్యవాహాలను పది కళలతో (దేహమందుగల నాభినుండి క్రిందభాగమును) ఆవరించి వేసవికాలమును కలుగజేయుచున్నాడు-

ద్వితీయఖండమగు సౌరఖండములో అనాహతమందు అధిదేవతయగు సూర్యుడు తనఖండ బీజములగు యిరువదిరెండు బీజములతో వెలువడిన, తపినీ, తాపినీ, ధూమ్రా, మరీచీ, జ్వాలినీ, రుచిః, సుషుమ్నా, భోగదా, విశ్వా, బోధినీ, ధారిణీ, క్షమా, అను పన్నెండు కళలతో తన ఖండసమష్టి 116 కిరణములతో తన ఖండమును ఆవరించి (దేహమందు నాభినుండి హృదయమువరకూ) వర్షాకాలమును గలుగజేయుచున్నాడు—

తృతీయఖండమగు సోమఖండములో ఆజ్ఞాచక్రమందు అధిదేవతయగు సోముడు తనఖండ బీజములగు పదునెనిమిది అక్షరములతో వెలువడిన అమృతా, మానదా, పూషా, తుష్టి, పుష్టి, రతి, ధృతి, శశినీ, చంద్రికా, కాన్తి, జ్యోత్స్నా, శ్రీ, ప్రీతి, అంగదా, పూర్ణా, పూర్ణామృత అను పదునారు కళలతో తనఖండ సమష్టి 137 కిరణములతో తనఖండమును ఆవరించి (దేహమందు హృదయమునుండి నేత్రములవరకూ) చలికాలమును కలుగచేయుచున్నాడు-

ఇట్లు ప్రథమఖండమందు గల అగ్నిస్థానము రుద్రగ్రంథిస్థానము, సంహారాత్మకము—జగద్దహన నామకమగు అగ్ని రుద్రరూపమును పొంది బ్రహ్మాండమును (పిండాండమునుగూడా) దహింపజేయును అనగా సంహారము జేయును.

ద్వితీయఖండమందుగల సూర్యస్థానము విష్ణుగ్రంథిస్థానము, స్థిత్యాత్మకము - సంవర్తాత్మక వాయువువల్ల ప్రేరేపింపబడిన మేఘములచే వర్షింపజేసి సూర్యరూపుడు విష్ణువు రక్షణజేయును.

తృతీయఖండమందుగల సోమస్థానము బ్రహ్మగ్రంధిస్థానము. సృష్ట్యాత్మకము - జ్యోత్స్నానామక అమృత స్రావమువలన సోమరూపుడగు బ్రహ్మ సృష్టిచేసి బ్రహ్మాండమును (పిండాండమును) గూడా ఆనందింపచేయు చున్నాడు. (సశేషము)

# భోగేశ్వర క్షేత్రము

కొలనుకొండ
సంపాదకుడు

### శ్రీ భోగేశ్వర మహిమ !

శ్రీ కరంబయిశుభ శ్రీలచేదనరు మా కొలనుకొండ
గ్రామంబు నందొప్పు ।
ఘనమైన కొండపై గల సమస్థలిని పానుపొందు
మందిరంబున దీప్తినున్న ।
భోగేశ్వరుడు మహాభోగదాయకుడు యోగివందితుడు
సద్యోజాతభవుడు ।
సగుణ నిర్గుణరూప సచ్చిదాత్మకుడు నిగమాంత
వేద్యుండు నిఖిలకారణుడు !
సర్వశక్తియుతుండు సాధుపాలకుడు పార్వతీసహితుడై
భద్రపీఠమున !
నందీశగణపతుల్ నతిజేసికొలువ బృందారకుల
దృశ్యతంది సేవింప ।
పసజబాదులకైన వర్ణింపరాని ఘనతరానంద
చిద్ఘన దీప్తినాగ ।
భాసిల్లుచున్నాడు భవపాశములను కోసివేయగజాలు
కోవిదుండతడు ।
తాపత్రయాగ్ని సంతప్త మానవుల కాపాడి రక్షింపగల
మహామహుడు ।
ముక్తసంగులకు సన్ముక్తిదాయకుడు భక్తుల పాలిటి
పారిజాతంబు ।
శరణాగత త్రాణ బిరుదాంకితుండు వరదుడవ్యయుడు
జీవనదాత సుమ్మీ ।
చేరి సేవించిన చెందు సౌఖ్యంబు సూరిజనుల్
రండు సుఖదమీపదము ।
అని పెద్దలాడగా వినియుంటజేసి పనిబూని సేవింప
జనితి నాగిరికి ।
మార్గమధ్యంబున మసలుచున్నట్టి భర్గు విశ్వేశ్వరు
ప్రస్తుతి జేసి ।
అన్నపూర్ణకు భక్తినంజలి వట్టిపన్నుగా శిఖరాన
నున్న భోగేశు ।
పార్వతీనాథుని భవవిమోచకుని సర్వేశు సర్వాత్మ
సాధు సన్నుతుని ।
పాదాంతికము జేరి ప్రణుతిగావించి తాదాత్మ్య
భావాన తన్మయనైతి ।
"అస్తమించెను సూర్యుడమ్మరో యింక స్వస్థలే లె"
మ్మన్న జనవాక్య మొకటి ।
వినవచ్చి యదటున గనుపిచ్చుచూడ ఘనమైన చీకటి
గనవచ్చె నంత ।
అబలలం దుండరాదనెడు వాక్యములు విబుధులు
పలుకగా వినియుంట జేసి ।
డెందమా దేవాంఘ్రియందె బంధించి వందనం
బొసరించి వచ్చినా నమ్మ ।
అలద్వాపరమునాటి దాలింగమనుచు కలికిసాక్షాంశము
నందు గలదని వింటి ।
అంతర్గతంబులై యష్టకోణములు వింతగాచెన్నొందు
విధము నేగంటి ।
నిగనిగలాడెటి నీలంపుకాంతి జగమెల్ల
నింపగాజాలి నట్లుండె !
కడుపురాతన మంతు గానగారాదు నడుము నిడుపు
కొలువ నలవియేకాదు !
భూమమైయొప్పునా భోగేశుపదము కామించి సేవింప
గతిజూపు నమ్మ ।
తానుగా వెలసిన దైవంబటంచు పూని వచింతురా
భోగేశు మహిమ ।
ఏమని వర్ణింపనే నేర్తు నమ్మ ధీమంతులకుగాని
తెలియరావమ్మ ।
తామసభావంబు తరలించి వేగ కామినీమణులార
కదలిరారమ్మ ।
అలసింపక పర్వతాగ్రంబుజేరి బాలేందు శేఖరు
పదసీమ నిలిచి ।
కరములు శిరముపై గదియించి మ్రొక్కి శరణంచు
వేడిన కరుణించు నమ్మ ।
పదపదంబున శాంతి గదుర నాదేవు గదిసి సేవించిన
కైవల్య మబ్బు ।
కామితార్థులకు తత్కామంబులిచ్చి కామధేనువువోలె
కాపాడగలడు ।
ఆదిమధ్యాంతంబు లరయగాలేని వేదమూల
మతండనాది దేవుండు !
కాదు లేదను ఖేద వాదంబువీడి పోదమురారమ్మ
భోగేశు గొలువ ।
ఘనత నావవేశుగనిన మాత్రమున తను మనస్తాపముల్
తాను గావొలగు
చిత్తమ్ముతత్ పదాయత్తంబుజేసి సత్తుచిత్తనియెడి
సౌఖ్యాబ్ధి తేలి

భక్తియను నౌకలోపల విశ్రమించి ముక్తసంగులమౌచు
మోదంబుమీర ।
తత్త్వమసి వాక్యతాదాత్మ్యంబు జెంది సత్త్వమే
రూపుగా చరియింతమమ్మ ।
రారమ్మ రారమ్మ రమణి భోగేశు కారుణ్య నిధిగొల్చి
కడతేరగలము ।
సూరిజనాశ్రిత సూరినాగాంబ కోరి సేవించి
సద్గురు లాభమందె ।
అని ప్రబోధింపగా జనులెల్లవచ్చి ఘనుని భోగేశుని
వినుతించి రిట్లు ।

"జయము శ్రీ భోగేశ ! జయ స్వప్రకాశ । జయము చిదాకాశ! జయము సర్వేశ! జయము సద్యోలింగ! జయము భవభంగ ! జయము సజ్జనసంగ ! జయమాత్మలింగ ! జయము మా నాథ ! సజ్జన మనోనాథ ! జయము సన్ముని జనాశ్రయయోగ నాథ ! జయము జయ "మ్మని జేజేలు పెట్టి జయగీతములు పాడి సేవించి రంత.

### క్షేత్ర వివరణము

గుంటూరుజిల్లాలో మంగళగిరికి తూర్పున కృష్ణా తీరంలో తాడేపల్లికి దగ్గరగా కొలనుకొండ అగ్రహారం వున్నది. కలకత్తా మద్రాసు రైల్వేమార్గంలో కృష్ణ కద్దరి విజయవాడ, ఇద్దరి కృష్ణాకెనాల్; దానిదగ్గరనే కొలనుకొండ స్టేషన్. అక్కడ దిగి మూడు ఫర్లాంగులు నడిస్తే గ్రామం చేరుకోవచ్చును. గ్రామంమధ్యన అగ్రహారాలిచ్చిన వాశిరెడ్డి వేంకటాద్రినాయుడుగారికి ముందే వారి పూర్వీకులెవరో ప్రతిష్ఠించి కట్టించిన పట్టాభిరామస్వామి దేవాలయం వున్నది. ప్రభువు వేంకటాద్రినాయుడే దానికి మాన్యం యిచ్చాడట.

గ్రామాన్నానుకొని పడమరదిక్కున తూర్పుముఖంగా కొండ, కొండపాదంలో దక్షిణదిశగా ఒక కొలనూ వున్నవి. కొండ ఎక్కడానికి కట్టిన మెట్లల్లో కొన్నిమెట్లు ఎక్కగానే విశ్వేశ్వరాలయం కనుపిస్తుంది. అది అగ్రహారం గ్రహించిన దోర్బల వెంకటశాస్త్రిగారి ప్రథమ పుత్రుడైన శేషాద్రి శాస్త్రిగారి కొమారుడు కాశీనాథశాస్త్రిగారు కాశీనుండి లింగం తెచ్చి ప్రతిష్ఠించి కట్టించిన దేవాలయం. ఆ స్వామికి వారు తమ స్వంతభూమిలోనే-మాన్యం యిచ్చారట.

కొండకొనలో వున్నది భోగేశ్వరాలయం. ఆ లింగ మహిమ ద్విపదలో విశదీకరించబడింది. దానికిన్నీ ప్రభువు మాన్యం యిచ్చారట. వెంకటశాస్త్రిగారికి గ్రామం సమర్పించే సమయంలో ఈ భోగేశ్వరాలయ పట్టాభిరాముల మాన్యాలు ప్రభువు తన క్రిందనే వుంచుకొని తన యాజమాన్యం క్రిందనే కొంతకాలం అభిషేక అర్చనాదులు నడిపిస్తూ అర్చకులకు గ్రామంలో నివేశనస్థల మున్నూ ఏర్పాటుచేసి ఆ వెనుక అగ్రహారీకులను ధర్మకర్తలుగా నియమించారట. తదుపరి స్వామికి స్వస్తిచెప్పే బ్రాహ్మణులకూ సేవకులైన చాకలివాండ్లకూ అగ్రహారీకులే కొద్ది కొద్ది మాన్యాలిచ్చి ఉత్సవాదులు జరిపించుటకు అరంభించారు.

కొన్ని శతాబ్దాలకు పూర్వం ఈ భోగేశ్వరలింగం అలయమే లేకుండా రాళ్ళసందున తీగెలతో పొదువబడి వుంటే ఒక గొల్లవాడు నిత్యం రాత్రివేళ తన గొఱ్ఱెల మందతో కొండమీద వుంటూ ఒకనాడు లింగాన్ని చూచి ఆశ్చర్యంతో తీగెలూ రాళ్ళూ తొలిగించి, గొఱ్ఱెలపాలు దొన్నెలో పితికి లింగంముందర పెట్టి "తాగు సామీ! తాగు" అంటూ నిత్యం అరగింపుచేసేవాడనీ, ఒకనాడు వాడి మంద తప్పిపోయి ఎంత వెతికినా దొరక్కపోతే భోగేశ్వరునివద్ద నిలిచి "సామీ! ప్రొద్దుక్రుంకేలోగా నా మంద దొరికితే తాటాకులతో నీకు పాక వేయిస్తా"నని మొఱపెట్టుకున్నాడనీ, ప్రొద్దుక్రుంకకుండానే మంద దొరికిందనీ, ఆవెనుక వాడు పాక వేయించాడనీ ఒక వదంతి. కొన్నాళ్ళకా పాక కూలిపోతే ఏ పుణ్యాత్ముల్లో చిన్నది పెంకుటిల్లు వేయించారట. ప్రభువుకాలంనాటికి ఆ పెంకుటిల్లే స్వామికి నివాసంగా వుండేదట.

అది శిథిలమైనప్పుడు వెంకటశాస్త్రిగారి ద్వితీయ పుత్రుడైన సర్వేశ్వరశాస్త్రివారి కొమారుడు వెంకటశాస్త్రిగారూ తృతీయ పుత్రుడైన విశ్వనాథశాస్త్రిగారి కొమాళ్ళు గౌరీనాథ, శేషాద్రి, శోభనాద్రి శాస్త్రిగార్లూ కలిసి భోగేశ్వరుడికి ఆలయం కట్టించబోతూ లింగం ఎంత లోతున వున్నదో పరిశీలింతామని తవ్విస్తే ఎంత లోతు తవ్వినా అడుగుభాగం అంతుచిక్కక ఆ యత్నం విరమించి దద్దళం వలె ఆలయం కట్టించి పైన విమానం కట్టడానికి ఆరంభించారటగాని వారి జీవితంలో అది పూర్తికానందువల్ల తదనంతరం కాశీనాథశాస్త్రిగారి పౌత్రుడు నాగయ్యశాస్త్రిగారూ, శేషాద్రిశాస్త్రిగారి దత్తపుత్రులైన చిన్నవెంకటశాస్త్రిగారూ కలిసి కొదవ పూరించారు. ఆవెనుక 1880-90 మధ్యలో భక్తాగ్రేసరులైన చిన్నవెంకటశాస్త్రిగారే గృహస్థాశ్రమ స్వీకారమైనవెంటనే ఆ విమానంమీద శిఖరప్రతిష్ఠ చేసి తాడేపల్లి నివాసస్థుడైన బొంతుల నాగయ్యాచారిచేత శిలలో దేవీ విగ్రహాన్ని చెక్కించి, ధ్వజస్తంభ ప్రతిష్ఠ, దేవీవిగ్రహస్థాపన ఇత్యాదులు జరిపి అభిషేకపూజాదులు క్రమపద్ధతిని నడిపిస్తూ వచ్చారు. ఆవెనుక వారే 1903-4 ఆ ప్రాంతంలో భోగేశ్వరునకు ఉత్సవవిగ్రహాలు చేయించి ప్రతిష్ఠించాలని చూచారుగాని అకాలమృత్యువు వారి శరీరాన్ని పడగొట్టడంవల్ల నాటికీ నేటికీ ఆ తంతు జరగకుండానే ఆగిపోయింది.

1903-4 ఆ ప్రాంతంలోనే మేజస్ట్రేట్ రావులపర్తి చలపతిరావుగారు కొలనుకొండకు మకాముగా వచ్చి శివ దర్శనం కానిది భోజనంచేయనన్న నియమం కలవారవడంవల్ల చెక్కడు మెట్లతో వున్న కొండ యెక్కి భోగేశ్వరస్వామిని సేవించి "ఈ కొండకు మెట్లుకట్టడమంటే కైలాసానికి మెట్లు కట్టడమే. నేను మొదటిమెట్టుకు చందా యిస్తాను. మిగతావన్నీ చందావేసి వారి వారి పేరుతో మీరు కట్టించండి. తిరిగి నేనిక్కడికి మకాముగా వచ్చేలోపల కొన్ని మెట్లన్నా తయారుకావాలి." అని అగ్రహారీకులందరినీ హెచ్చరించి చెప్పి స్వామిని సేవించివచ్చారట. ఆవెంటనే చిన్న వెంకటశాస్త్రిగారు మెట్లు కట్టించడానికి ఆరంభించారు. మూడువంతులవి అయ్యేసరికి వారి జీవితం ముగింపుకావడంవల్ల బొమ్మకంటి విశ్వనాథశాస్త్రిగారు పూనుకొని కొదువ పూర్తిచేశారు. ఈ విధంగా భోగేశ్వరాలయ పునర్నిర్మాణం జరిగింది.

ప్రభువు అగ్రహారం ఇవ్వడంలో తరు, జల, పాషాణ సహితంగా సమర్పించడంవల్ల 1894-5 ఆ ప్రాంతాల నుండీ కొండ తూర్పుభాగం తప్ప తదితర భాగాలలో అక్కడక్కడ రాళ్ళు తొలిచి అగ్రహారీకులు ఉపయోగించుకుంటూ వచ్చారు. ఆవెనుక పి. డబ్లియూ వారూ, రైల్వేవారూ అగ్రహారీకులను ఆదలించి స్వామి నివసించే కొండలో పశ్చిమభాగం చాలావరకు గవర్నమెంటు ఉపయోగం నిమిత్తం లాక్కొని, క్వారీలు పెట్టి విక్రయం క్రిందకు దింపారు. క్రమేపీ వారూ వీరూ అంతా వేలం పాటలు పెట్టడం, కంట్రాక్టర్లు ధనం కుమ్మరించి వ్యాపారం హెచ్చించడం సహజమైపోయింది. తత్ఫలితంగా గుడి వెనుక కొండ చాలా దూరం నేలమట్టమయింది. 1949-50 మధ్యన ఆ నేలమట్టంలో గుంటలుపెట్టి రాళ్ళూ కంకరా తీస్తుంటే అగ్రహారీకుల భాగంలో కొంత సుల్మా బయటపడడమేకాక పి-డబ్లియు. వారి సరిహద్దులలో ఉత్తర దక్షిణ దిక్కులందు కొన్ని సమాధులు బయటపడ్డవి. అవి పెద్ద పెద్ద నల్లరాతి బండలతో కట్టబడి వుండడమేకాక వాటిలో చిన్ని చిన్ని ఇనపసామాన్లూ, దడసరమైన కుండలూ మూకుళ్ళూ వున్నవి. ఈ సమాచారాలు గవర్నమెంటుకు తెలిసి వారితరపున అప్పుడు పురాతనశాఖా పరిశోధకులుగా విశాఖపట్టణంలో నివసిస్తూ వున్న రామచంద్రయ్యరుగారూ డాక్టర్ ఆర్. సుబ్రహ్మణ్యంగారూ ఇక్కడికి వచ్చి చూచి సమాధుల్లో దొరికిన సామాన్లు కొన్ని ఢిల్లీప్రభుత్వానికి పంపితే వారవి పరిశీలించి "ఇవి షుమారు మూడువేల అయిదువందల సంవత్సరాలకు ముందు చేయబడినవనీ ఆ కాలంలో అక్కడ మహాయోధులు నివసించే పట్టణం వుండి వుంటుందనీ, ఆ సమాధులు ఆ యోధులవేననీ రిపోర్టిచ్చారు. ఆ రిపోర్టు ననుసరించి రామచంద్రయ్యరుగారూ, సుబ్రహ్మణ్యంగారూ చాలాసార్లిక్కడికి వచ్చి చూచి ఈ భోగేశ్వరక్షేత్రం ఆ యోధులకాలానికి పూర్వమే వున్న అనాదిక్షేత్రమేనని నిర్ణయించి ఈ క్షేత్రాన్ని పునరుద్ధారణ చేయవలెనన్న సందేశం ఇచ్చారు

అప్పటి ఆ పరిశోధనా సందర్భంలోనే చారిత్రక పరిశోధకులైన ప్రొఫెసర్ రామమూర్తిగారిక్కడికి వచ్చి చూచి "కృష్ణానదీతీరంలో భోగేశ్వరక్షేత్రం వున్నదనీ, అది గొప్ప మహిమగలదనీ" స్కాందపురాణంలో తాను చదివినట్లు చెపుతూ "ఆ క్షేత్రం ఈ కొలనుకొండ భోగేశ్వర క్షేత్రమేననీ, ఆ కాలంలో కృష్ణానది ఈ కొండప్రక్కనే ప్రవహిస్తూ వుండివుంటుందనీ నిర్ధారణచేస్తూ ఈ క్షేత్రాన్ని పునరుద్ధారణ చేయవలెనని ఒక వ్యాసం వ్రాసి భారతిలో ప్రకటించారు. ఇప్పుడీ కొండకు కృష్ణానది కరకట్ట మూడు మైళ్ళ దూరంలో వున్నది. ఇవి పురాతనశాఖా చారిత్రక పరిశోదన నిర్ణయ ప్రామాణిక విషయాలు

ఇటీవల భోగేశ్వరాలయ గర్భగృహంలో చెదలుపట్టకుండా వుండడానికని 1954-నవంబరు 24-వ తేదీన సిమెంటు చేయించుటకు తలపెట్టి ఆ లింగం అడుగు భాగం అంతుచిక్కదన్న వదంతి ఎంత నిజమో చూతామన్న కుతూహలంతో అంతా కుళ్ళగించేసరికి అంగుళం లోతున లింగంచుట్టూ ఎనిమిది కోణాలు గోచరించినవి. ఆ కోణాలమధ్యన అష్టదళపద్మంలో వున్నట్లున్నది భోగేశ్వరలింగం. దాని నానుకొని వున్న చెదలుపుట్టలు అణగకొట్టేసరికి లోపల లోయవలె ఒక కన్నం ఏర్పడ్డది. లింగానికి అడుగుమట్టం అంతు చిక్కతుందేమోనని ఆ లోయలో చేయి దూర్చి చూస్తే అంతు చిక్కలేదు సరిగదా అమరావతీ ద్రాక్షారామాది లింగాలకువలెనే లోవరుసన స్తూపాకారంగా గోచరించింది. గజన్నర పొడుగుగల కఱ్ఱబద్ద దూరిస్తే ఇంకా పోతుందేగాని అంతు గోచరించదు. ఆ దేవరహస్యం అభేద్యమని తోచి పరిశీలన విరమించి సిమెంటుచేయించారేగాని ఆ దృశ్యం సదా కళ్లకుకట్టినట్లే వున్నది.

చాలాకాలంగా ఇక్కడ రాతిది బండీ ఇరుసుచక్రం వంటిది ఒకటి ఉన్నది. ఇది ఏమని ? ఏ వృద్ధులనడిగినా "పూర్వం భోగేశ్వరస్వామికి ప్రభకట్టేందుకుగాను రాతిది బండీ వుండేదట. శిథిలమైన ఆ బండీచక్రమే యిది" అని అనేవాళ్ళు. ఉట్టి పుక్కిటిపురాణాలేనని అప్పు డనుకున్నారు. పై విషయాలన్నీ పరిశీలించినవెనుక ఆ వదంతి నిజమే అయివుంటుందని తోస్తున్నది. ఒకానొక కాలంలో కోటప్పకొండ కోటేశ్వరునకువలెనే ఈ భోగేశ్వరునకున

ప్రభలుకట్టి ఉత్సవాలు జరిపేవుంటారన్నమాట సత్యమని చెప్పక తప్పదు. ఈలాంటి చారిత్రాత్మకమైన యీ పుణ్యక్షేత్రం అజ్ఞాతమైవుండడమేకాక యిరిగేషన్‌వల్ల గ్రామం దేవతామాన్య సహితంగా సస్యసమృద్ధమైవున్న యీ కాలంలో దేవాలయాలు గోపురప్రాకారమండపాదులతో విరాజిల్లవలసిందిపోయి వార్షికోత్సవాదులైనా లేకుండా జీర్ణావస్థలో వుండడం శోచనీయం.

ఇన్నాళ్ళనుండీ ఇంత దూరం కొండ తొలుస్తూవున్నప్పటికీ ఏ ఒక్కరికైనా అపాయంగానీ అపకారంగానీ రాకుండా కాపాడుతూ జీవస్రవంతియై ప్రజారక్షకుడైవున్న ఈ భోగేశ్వరుని మహిమ విజ్ఞులు విమర్శనాదృష్టితో గ్రహించి స్కాందపురాణాంతర్గతమైన ఈ క్షేత్రచరిత్రను వెలిపరచి జీర్ణాలయోద్ధరణకై ప్రజలను ప్రబోధించి క్షేత్రమును ప్రసిద్ధికి తెత్తురుగాకయని మనవి.

---

# శ్రీకాకుళము - ఆంధ్ర విష్ణువు

*కవిరాజ శిరోమణి, దీవి నరసింహాచార్యులుగారు*

## 1. ఆంధ్రము

ఆంధ్రసామ్రాజ్యమునకు శ్రీకాకుళము ప్రథమరాజధానీ నగరము. ఇది కృష్ణామండలములోని దివితాలూకాలోఁ గలదు. ఆంధ్రవిష్ణువునుగురించి వ్రాయుటకుముందు, ఆంధ్రదేశమునుఁగూర్చి కొంత తెలుపవలసియున్నది. అఖండభూమండలమునకు నాంధ్రదేశము మధ్యభాగము. అందు శ్రీకాకుళము సెంటరు (centre). అనగా కేంద్రస్థానము. ప్రాచీనకాలమున ఋషులచే పలుకఁబడిన పురాణేతిహాసములవల్లను, మనభూగోళఖగోళశాస్త్రముల వల్లను నీయంశము నిర్ధారణ యగుచున్నది. ఎవరిదేశము నువారు, యెవరిమతమునువారు తక్కృష్టమైన దని చెప్పకొనుట, లోకసహజము. కాని యిట్లతిశయోక్తిగాఁగాక, సత్యబోధకై వచించుచుంటిని. బ్రహ్మాండములు, బ్రహ్మాదులే, భగవత్సృష్టిలోని వైనపుడు, దీని కివిశిష్టత యేమి ? అనుసందియము కలుగవచ్చును. అన్నియు భగవత్సృష్టిలోని వైనను, కొన్నిటియందు భగవంతుని శక్తి పరిమితముగను, మరికొన్నిటియం దపరిమితముగ నుండును. అట్టిజీవులుగాని. భూతగణముగాని నావిభూతిస్వరూపము లని గీతలలో విశ్వరూపసందర్శనాధ్యాయమున భగవంతుఁడుపదేశించెను. భూలోకమును, నందు భారతవర్షమును నత్యంతమును తక్కృష్టతమము లనియు, నిందల్పతపమున నధికఫలము నిచ్చుశక్తి కలదనియు, తేజోమయములగు స్వర్గాదిలోకములుభోగ్యస్థానములుగాని, యందెట్టియధ్వరాదు లొనర్చుటకు తగుసాధనసంపత్తి లేనందున, నట్టిక్రతువుల నీలోకముననేఁ జేయవలసియుండుటవలన, ప్రతిజీవుఁడును నీలోకమునఁ బుట్టినఁగాని, స్వర్గాదిలోకములకు నేగఁజాల డనియు, నందువలన నీదేశముభువరాది యూర్ధ్వలోకములకు ద్వార మనియు, పూర్వమీమాంసశాస్త్రమును పురాణములును ఘోషించుచున్నవి. విష్ణుపురాణము తృతీయాధ్యాయములో

" కర్మభూమి రియం, స్వర్గ మపవర్గం చ గచ్ఛతామ్
అత స్సంప్రాప్యతే స్వర్గో హ్యతో ముక్తిం ప్రయాంతి చ
ఇత స్స్వర్గ శ్చ మోక్ష శ్చ మధ్య శ్చాంత శ్చ గమ్యతే "

అని కలదు.

ఇట్టిభారతవర్షమున మన "ఆంధ్ర"దేశ ముగ్రస్థానమలంకరించినది. అన్నిదేశములు మనకు పూజనీయములే యైనను మనదేశస్వరూపమహిమాదులను తెలుసుకొనుట మన కవశ్య మనుసరణీయము.

యుగయుగములనుండి జరుగుచున్న ప్రళయములందుపంచభూతముల ప్రకోపాదులవలన కలుగు పరిణామములలో, కొన్నిదేశములు మున్నీటిలో మునుఁగుటయు, కొన్నిద్వీపములు ఖండఖండములుగా తేలుటయు జరుగుచుండును. అందువలన నేటిసరిహద్దులకును, పరిమాణములకును సరిపడకపోవచ్చును. అంతమాత్రమున పురాణము లసత్యములు కానేరవు. నేఁడు "ఆంధ్ర"శబ్దము భాషాపరముగను, జాతిపరముగను, దేశపరముగఁగూడ వాడఁబడుచున్నది.

## 2. ఆంధ్రము—భాషాపరము

ఆంధ్రభాష కడు ప్రాచీన మైనది. ఇది హిమాలయోత్తర భాగమునుండి యార్యులు దక్షిణదిశకు వచ్చుటకుఁ బూర్వముననే యుండినదిగాఁ గన్పట్టుచున్నది. మరియు వ్యాకృతి టిప్పణకారుడు,

"త్రిలింగభాషాయాః కో ధాతుః, కః ప్రత్యయః
కిం ప్రాతిపదిక మితి భగవతా భాష్యకారేణ ఆక్షేపః
కృతః"

అనిన్నీ, "ఏషా త్రిలింగభాషా సంస్కృతభాషాతు ల్యేతి ప్రసిద్ధయా చ పూర్వ మేవ। ఏక శ్శబ్ద స్సుష్ఠుప్రయుక్తః. స్వర్గలోకే కామధు గ్భవతి"

అని పతంజలి మహర్షియు, పలికిన వాక్యములవలన, పతంజలికాలమునాఁటికే "ఆంధ్రభాష" యున్నట్లును, దీనికి లక్షణము లెవ్వియు లేనట్టును, కాని యిది సంస్కృతభాషాసదృశగా భావింపఁబడుచు ప్రయోగములో నున్నట్లు తెలియుచున్నది. ఇదిఁగాక,

"పూర్వ మే వాంధ్రభాషోత్పత్తి ర్భగవద్భిః
కణ్వపుష్పదంత
సోమచంద్రరావణనిర్ఝరాచార్యైభిః మహర్షిభిః భగ
వతా వాల్మీకినా చ ప్రోక్తా"

అనుటవలన నాంధ్రభాష వాల్మీకిమహర్షికిం బూర్వము నుండియు నున్న దనుటకు సందియము లేదు. ఇంతేగాక

"ఆంధ్రసంస్కృతభాషాభ్యాం కవిత్వ మృషితాప్రదం"

అని కాణ్వస్మృతియందును.

"త్రిమూర్తీనాం సంస్కృతాంధ్రప్రాకృతాస్తు
ప్రియంకరాః"

అని అథర్వశిఖోపనిషత్తునందును చెప్పఁబడియున్నట్లు శ్రీయుతులు కొణిదెన బాలకృష్ణయ్యగారు "ఆంధ్రసారస్వతము"లో వ్రాసియుండిరి. ఈవిషయమునే రక్తాక్షి వత్సర వైశాఖబహుళత్రయోదశి శనివారం "ఆంధ్రసారస్వతానుబంధము"లో, "భాషావిమర్శన" మను వ్యాసములో, శ్రీ వెం. కుటుంబయ్యశాస్త్రిగారు, విమర్శించి యున్నారు. అనగా బ్రహ్మవిష్ణుమహేశ్వరులకు సంస్కృతాంధ్రపాకృతములు ప్రియమునుఁ గూర్చున వని యర్థము. ఇందువలన నీభాష యుపనిషత్తులకాలమునాటికే యుండి, సంస్కృతప్రాకృతతుల్యముగఁ జూడఁబడుచుండె నని తెలియుచున్నది. అయినను, ఆర్యు లీదేశమునకు వచ్చుటకుఁ బూర్వముననే యున్న ఆంధ్రభాషను నార్యులు గౌరవించి తమస్వభాషయగు గీర్వాణమునందలి పదములఁ గొన్నిఁటిని దీనిలోఁజేర్చి ఆంధ్రభాషను వెలయించిరి. పదపడి మహామహులగుకణ్వహేమచంద్రాదుల సంస్కారమునుఁ గాంచి, నన్నెచోడ, నన్నయ తిక్కనాది మహాకవివరుల జిహ్వాగ్రముల నటించి, దేశభాషలం దనమానయై విలసిల్లుచున్నది. నన్నయభట్టుకు పూర్వమేనన్నె చోడుని కుమారసంభవమున నున్న,

కII మును మార్గకవిత దేశం
బున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెనుం
గు, నిలిపి రంధ్రవిషయమునఁ
జన నత్యాశ్రయునిఁదొట్టి చాళుక్యనృపుల్ ॥

అను పద్యమువలన, నన్నయభట్టారకుని కాలముననే యొకరిద్దఱు తెలుఁగుకవు లుండుటవలనను, నిక్కవియే ప్రథమాంధ్రకవి కా దని తోచుచున్నది. కాని తెనుఁగున కియ్యనఘుఁడు పరమోపకారమునుఁ జేసియున్నాఁడు. తెలుఁగుభాష సంస్కృతప్రాకృతములకు వికృతి అని తన నన్నయభట్టీయవ్యాకరణములో

"అద్యః ప్రకృతిః ప్రకృతి శ్చాద్యే ఏషా తయో ర్భవే
ద్వికృతిః"

అని నిర్వచించియున్నారు. వెండియు,

"సారమతిం గవీంద్రులు ప్ర - సన్నకథావివిధార్థ
యుక్తిలో
నారసి మేలు నా నితరు - లక్షరరమ్యత నాదరింప నా
నారుచిరార్థసూక్తినిది - నన్నయభట్టు తెలుంగునన్
మహా
భారతసంహితారచన - బంధురు డయ్యె జగద్ధి
తంబుగన్"

అను "నన్నయ" విషయము జగద్విఖ్యాతమై యున్నది. కవిత్రయమున రెండవవాఁ డగు "తిక్కనసోమయాజి" కవిత్వము పరమశ్లాఘ్యమై పండితపామరజనాహ్లాదకరమై యలరారుచున్నది. నిజమగు యాంధ్రకవి యన నీతఁడె యనవలసి యున్నది. ఇక్కవి నిర్వచనోత్తరరామాయణమును, భారతమునఁ బదేనుపర్వములును విరచించెను. ఉత్తరరామాయణశైలి కొంచెము కఠిన మైనది. భారతము ద్రాక్షాపాకమునఁ గడుహృద్యముగ నుండును. మరియుఁ దిక్కనకవి, కవిత్వమున,

కII లలితపదహృద్యపద్యం
బులన కథార్థంబు ఘటితపూర్వాపరమై
యలఁతియలతితునియలుగఁ గా
హల నందించిన విధంబు నమరఁగవలయున్ ॥

అని నిర్వచనోత్తరరామాయణమునఁ జెప్పికొనినవిధముననే రచించియున్నాఁడు. నన్నయభట్టారకుని కృపకుం బాత్రమై, మరల క్రమక్రమమున యాంధ్రకవితాలత, కవిబ్రహ్మయగు తిక్కనకాలమున తొంటి వికాసము నంది యాంధ్రులకు నుత్తమగ్రంథరూపఫలములఁ బ్రసాదించెను.

ఎఱ్ఱాప్రగడయు భారతారణ్యపర్వశేషమును, నృసింహపురాణమును, హరివంశమును, రామాయణమును రచించి ఆంధ్రభాషాయోష నలంకరించెను. ఈకవిశిరోమణియు, నన్నయతిక్కనలయందతిశయమగు భక్తిఁ గలవాఁడై, వారిరువురంబోలి తానును కవిత్వమునుఁ జెప్పి యున్నాఁడు. ఇత డతులితశివభక్తియుక్తుఁడై "శంభు

వాసుఁ"డనియు, చక్కని గ్రంథముల నొనర్చి తనదేశభాష నుద్ధరించుటచే "ప్రబంధపరమేశ్వరుఁడ"నియు బిరుదుల నందెను. ఇటు లనవద్యకవితాసామ్రాజ్యపట్టభద్రులగు నీకవిత్రయము రచించిన గ్రంథము లన్నిఁటియందును భారతము ఆంధ్రకవిత్వలక్షణము లన్నిఁటికిని లక్ష్యగ్రంథమై, సంస్కృతవాఙ్మయమునఁ బంచమవేదాఖ్య నొందియున్నను, ఆంధ్రభాషకుఁ బ్రథమవేదమై, సమస్తధర్మములకునుఁ బుట్టినిల్లయి, భాషాభివృద్ధి నందఁగోరు వారికిఁ బఠనయోగ్యమై విరాజిల్లుచున్నది. ఈఆంధ్రమహాభారతరచనముతోనే తెలుఁగుభాషకు, ఆంధ్రత్వము పూర్తిగ సిద్ధించినది. క్రీ॥శ। మూడవశతాబ్దములో పల్లవుల శాసనములందు "ఆంధ్ర" శబ్దప్రయోగము కలదు. క్రీ॥శ॥ పదునారవశతాబ్దిలోఁ గల "కాకునూరు అప్పకవి" తనలక్షణగ్రంథమున

"తత్త్రిలింగనివాసమై తనరుకతన నాంధ్రదేశంబుఁ
దా త్రిలింగాఖ్య మయ్యెఁ
దెలుఁ గనుచుఁ దద్భవము, దానివలనఁ గలిగె
వెనుకఁ గొందఱు దానినే తెనుఁగు నండ్రు"

అని వ్రాసియుండిరి. కనుక ఆంధ్రము గ్రాంథికము, తెలుఁగు దేశభాష. అనగా వ్యవహారభాష. ఇందువలన రెంటి కభేదము తెలియుచున్నది—

## 3. ఆంధ్రులు—జాతిపరము

ఆంధ్రులనుగురించి చరిత్రకారులు పలుతీరుల వ్రాసియుండిరి. తొలుత నీదేశము సాంద్రతరారణ్యములచే గాఢాంధకారబంధురమై "అంధ" ప్రాయముగ నుండుటచే దీనికి "అంధ" దేశ మని పేరు కలిగిన దనియు, నందు వసించువారు "అంధుల"ని, పిలువఁబడి, రానురాను, ఆంధ్రులై యుండవచ్చునని అభిప్రాయపడిరి. కాని యిది సమంజసము కాదు. "అంధ" "అంధ్ర" "ఆంధ్ర" శబ్దములు, సంస్కృతవాఙ్మయములోను, యాంధ్రవాఙ్మయములోనుఁ గూడఁ గలవు. చరిత్ర పరిశోధకులగు శ్రీ చిలుకూరివీరభద్రరావుగారు "ఆంధ్రుల చరిత్ర"లో మూడవప్రకరణమున "యిప్పుడు ఆంధ్రదేశ మనిపిలుచుచున్న భూభాగము పూర్వము దండకారణ్యములోని దనిచెప్పఁబడినంతమాత్రమున నాకాలమున నాంధ్రదేశముగాని, యాంధ్రులుగాని యిచ్చట లేరని యూహింపరాదు. ఆంధ్రులు ప్రాచీనులుగాని నవీనులుఁ గారు. విశ్వామిత్రశాపమునుఁ బొందిన వారిసంతతివారే దస్యులలో నధికభాగముగా చేర్పబడి రని తెలుపఁబడినది. వారు వింధ్యపర్వతప్రాంత భూములయందు నివసించియుండెడి వారని తెలియుచున్నది" అని వ్రాసిరి. తొలుత నాంధ్రుల ప్రశంస ఋగ్వేదీయైతరేయబ్రాహ్మణము సప్తమ పంచకము, తృతీయాధ్యాయము, 8వ ఖండలో, "తస్య హ విశ్వామిత్ర స్యైకశతం పుత్రా ఆసుః- పంచాశదేవ జ్యాయాంసో మధుఛందసః- పంచాశ త్కనీయాంస స్తద్యే జ్యాయాంసో- న తే కుశలం మేనిరె తా ననువ్యాజహా రాంతాన్వః- ప్రజా భక్షీ ష్టేతి-త ఏ తేంధ్రాః పుండ్రాః శబరాః పుళిందాః మూతిబాః ఇత్యుదంత్యా ఒహవో భవంతి" అని కలదు. దీనికి సాయనాచార్యులవారు.

"మధుశ్ఛందో నామకః- కశ్చి త్పుత్రో మధ్యమ స్తతోపి జ్యేష్ఠా కనిష్ఠాశ్చ ప్రత్యేకం పంచాశత్సంఖ్యాకం .... త ఏతె శప్తా స్సంతో ఽంధ్రత్వాది పంచవిధ జాతివిశేషా భవంతి" అని భాష్యమును వ్రాసిరి.

హరిశ్చంద్రుఁడు వరుణప్రేరితమున జలోదరవ్యాధి పీడితుఁడై వరుణప్రీతికొరకు యజ్ఞమును సేయుచు, నందు "శునశ్శేపుని" యజ్ఞపశువుగ యూపస్తంభమున బంధింప నాతఁడు దేవతలం బ్రార్థించి తృప్తులం జేయ వారు వానిని విడిపించి రనియు, నీవిషయమును నాయధ్వరమందు హోతగా నున్న విశ్వామిత్రుఁడుఁ గాంచి, వానితపశ్శక్తికి మెచ్చి తన యంకమునఁ జేర్చుకొని తననూటొక్కపుత్రులతో నాతనిపుత్రత్వమును నంగీకరింపుడని యాజ్ఞాపింప, మధ్యముఁడైన మధుఛందుని ప్రేరణమున జ్యేష్ఠు లేబదుగురు తండ్రియాజ్ఞ నుల్లంఘించినందున, వారి నార్యజనపదాంతమున వసించుచు ప్రజలను సేవింపు డని శపించినట్లునువారే ఆంధ్రాదిజాతులైరని పైయైతిహ్యమునఁ గలదు. ఈ "శునశ్శేపుడు" అజీగర్తుని కుమారుఁడు. ఈ శునశ్శేపోపాఖ్యానమే శ్రీమద్రామాయణము బాలకాండమున, శునశ్శేపుడు "ఋచీకమహర్షి" కుమారుఁ డనియు, నీయజ్ఞమును "నంబరీషుఁడొ"నరించినట్లును, "పితా జ్యేష్ఠ మవిక్రేయం మాతా చాహ కనీయసం విక్రీతం మధ్యమం మన్యే రాజన్పుత్రం నయస్వ మామ్" అనిరాజుతో శునశ్శేపుడు చెప్పినట్లు కలదు. పైబ్రాహ్మణమున "ఏ తేంధ్రాః" అనుటవల్ల "ఆంధ్రశబ్దమే సాధువని "అంధ్రము" కాదని శ్రీమాన్ ప్రొఫెసరు పుట్టపర్తి శ్రీనివాసాచార్యులువారు, ఎం.ఏ "ఆంధ్ర సర్వస్వము"లో వ్రాసియుండిరి. మరియు విశ్వామిత్రునిచే శపింపఁబడినవారైనను, "పూర్వం వర్షసహస్రం తు పృధివ్యామనువత్స్యథ" అనుటచే వారికి శాపకాలము సహస్రవర్షములుమాత్రమే. నేటికిని అంధ్రులలో అవరవర్ణులు పెక్కండ్రు గ్రామవాసులుగను, (యెరుకుల, యానాది, బంద, మొండి, జాతులు) కొంద రరణ్యవాసులుగను (కోయ, చెంచు, వ్యాధ, కిరాతజాతులు) కలరు. ఇట్లన్నిదేశములందును నుందురు. గృహ్యసూత్రకారులగు బోధాయన అపస్తంబుల

నాటికె ఆంధ్రులకు నీచత్వము లేదు. అని లింగ్విస్టిక్ సర్వే ఆప్ ఇండియా (Lingwistick Survey of India) అను గ్రంధములో వ్రాయబడియున్నది. "ఆంధ్రసూత్రకారులు- బోదాయస ఆపస్తంబులు" అను వ్యాసమున "ఆంధ్రులు బహుప్రాచీనులు. భారతదేశపు నాగరికతలో నేమి! భరతఖండపు సర్వంకషకృషిలో నేమి! ఆంధ్రులు నిర్వహించినది విశేషాంశముకాని స్వల్పమాత్రము కాదు. మొదట కిరాతజాతులలో పరిగణింపఁబడినను, వేదవాఙ్మయమున, ఆంధ్రునకుఁ గలస్థానము గొప్పది. ఆకాలపు ఆంధ్రులు తత్త్వవివేచనమునందును, విజ్ఞానమునందును, కళలయందును, బాహుబలమునందును, శౌర్యధైర్యములయందును ఆర్థికవాణిజ్యవ్యవస్థలయందును, ఒకరికి తీసిపోని దిట్ట లని చరిత్ర వేనోళ్ల మోషించు చున్నది. ప్రాచీనాంధ్ర నాగరికతా స్వరూపము చక్కగా తెలుసుకొనుటకు, మన ముప్రాచీనాంధ్ర ఋషిసత్తములైన, బోధాయన ఆపస్తంబులు చేసిన మహత్కార్యముల కొన్నింటిని స్మరింపవలెను. బోధాయనుఁడు ఆంధ్రఋషులలో చాల ప్రాచీనుఁడు. ఆపస్తంబుడు ఆంధ్రనాగరికతా ప్రపంచమున నఖండ తేజముతో నిరుపమానముగా వెలుఁగు చున్న దివ్యజ్యోతి" అని శ్రీగొబ్బూరి వెంకటానందరాఘవరావుగారు బహుధాన్య సంవత్సర ఆంధ్రసంచికలో వివరించిరి. ఇందువలన, బోధాయన ఆపస్తంబులే ఆంధ్రు లని స్పష్టపడు చున్నది. చీనాదేశవురాయబారి యగు "హియాన్ త్సాంగు" (Hunyandsoug) క్రీ॥ శ 7 శతాబ్దములో కోసలనుండి దక్షిణమునకు 900 మైళ్లు ప్రయాణించి, అప్పటికే కృష్ణాగోదావరీ తీరముల "అంధ్రుల"ను ఆర్యజాతి కలదని వ్రాసియుండిరి. క్రీ॥శ॥ 6 వ శతాబ్దములో నున్న అశోకుని పితామహుఁడును, మౌర్యవంశస్థాపకుఁడు నగు చంద్రగుప్తుని యాస్థానమందున్న గ్రీకు రాయబారి "మెగస్థనీస్" (Megasthanes) ఆంధ్రులు ఆర్యులే, వారి ఆచారవిజ్ఞానము లనాదిగ నుండెను. వారి కప్పటికే ముప్పది దుర్గములును, నొకవెయ్యి యేనుగులును, రెండువేల అశ్వదళమును, యొకలక్ష కాల్బలమును కలిగియుండి రనిన్నీ, ఆంధ్రసామ్రాజ్యము మహోన్నత దశయం దున్నట్లును, వారే వింధ్యవరకు పాలించి రని వ్రాసియుండిరి. క్రీ॥శ 300 సంవత్సరములకు పూర్వమే, ఆంధ్రులు కృష్ణాగోదావరీమధ్య భూమిని కృష్ణాతీరమున నున్న శ్రీకాకుళమును రాజధానిగాఁ జేసుకొని పాలించిరని "విన్‌సెంటుస్మిత్తు" "Winsent smith" గారు వ్రాసియుండిరి. ఆంధ్రరాజైన "హాలుడు" తన భార్య కొరకు "బృహత్కథ" ను వ్రాయించెను. అది పైశాచీ భాషలోఁ గలదు. దానిని రచించిన 'గుణాఢ్యపండితుఁడు' ఆంధ్రుడు. బాణకవి కాదంబరిలో "ఆంధ్రులను శబరులను" పేర్కొనియున్నాడు. క్రీ॥పూ॥ 170 ప్రాంతముల మగధదేశచక్రవర్తి అయిన పుష్యమిత్రపుత్రుఁడు "అగ్నిమిత్రున"కును, ఆంధ్రుఁడైన "యజ్ఞసేనున"కును గొప్ప సమరము జరిగినట్లు మాళవికాగ్నిమిత్రములో వర్ణింపఁబడినది. ఇంకిట్లు ఆంధ్రులు ఆదిమవాసులనియు, నార్యాచారప్రవర్తకులనియు, పరమ పవిత్రులనియు, ప్రభువు లనియు ననేక ప్రమాణములుఁ గలవు.

శ్రీమద్రామాయణము, కిష్కింధకాండలో,

"తథైవాంధ్రాంశ్చ పుండ్రాంశ్చ
చోళ్యాన్, పాండ్యాన్ సకేరళాన్"

అనిన్నీ, మహాభారతము, సభాపర్వము 31వ అధ్యాయమున 71వ శ్లోకము, సహదేవకృతదక్షిణదిగ్విజయ సందర్భములో

"త థాంగ వంగౌ సహ పుండ్రకేణ.
పాం డ్రోడ్ర రాజ్ఞా చ సహాంధ్రకేణ."

అనియు,

"పాండ్యాంశ్చ ద్రవిడాంశ్చైవ సహితాం శ్చోడ్రకేరళైః
అంధ్రాం స్తాలవనాం శ్చైవ కళింగా నుష్ఠకర్ణికాన్॥

అనిన్నీ, కర్ణపర్వములో,

"అంధ్రకుంతల్యాన్ దాక్షిణాత్యాం శ్చ భోజాంశ్చ
శూర్యాన్ సంగ్రామకర్కశాన్"

అనియు కలదు.

ఇందువలన తొలుతనుండియు నాంధ్రులు పరాక్రమవంతులని, ప్రభువు లని, యుద్ధమునందు జయింప శక్యముఁగాని సంగ్రామకర్కశు లని ప్రశంసింపఁబడిరని తెలుచున్నది. మరియు శ్రీమద్భాగవతము, నవమస్కంధము 23 అధ్యాయములో "ఇక్ష్వాకు" వంశవృక్షమున,

"అంగ వంగ కళింగాద్యాః
సుహ్మ పుండ్రాంధ్ర సంజ్ఞికాః
జజ్ఞిరే దీర్ఘతపసో బలేః క్షేత్రే మహీక్షితః"

అని, అంగ, వంగ, కళింగ, సుహ్మ, పుండ్ర, ఆంధ్రు లను వారు ప్రభువులుగనే వర్ణింపఁబడిరి.-

అంధ్రుడు పృధువు కుమారుఁడైన పృషదశ్వుని తనయుఁడు. ఇతని కుమారుఁడు యవనాశ్వుఁడు. ఇతని కాంధ్రుడు. అంధ్రుని కుమారుఁడు శ్రావస్తికుఁడు ఇతని పేరుతోనే "శ్రావస్తి" నగరము నిర్మింపఁబడినదని,

"శశాదస్య తు దాయాదః - కకుస్థో నామ వీర్యవాన్
ఇంద్రస్య వృషభూతస్య - కకుస్థో జాయతే పుర
పూరఁ మాడీవకె యుదే - కకున సేన నసు\తః

అనేన తు కకుస్థస్య పృథు రాజేనస స్మృతః
పృషదశ్వః పృథోః పుత్ర - స్తస్మా దంధ్ర స్తు వీర్యవాన్
ఆంధ్రస్తు యవనాశ్వస్తు - శ్రావస్త స్తస్య చాత్మజః.
జజ్ఞె శ్రావస్తకో రాజా - శ్రావస్తీ యేన నిర్మితా''

అని వాయుపురాణము 88 అధ్యాయము 24 శ్లోకము నుండి కలదు. ఇట్లె మత్స్యపురాణము 276 అధ్యాయములో "ఆంధ్రులు" ఉత్తములుగ ప్రశంసింపఁబడిరి. ఆంధ్రులు ఆర్యావర్తమునకు తూర్పుదక్షిణములఁ గల రని పురాణములలో నున్నట్లు శ్రీవేమూరివిశ్వనాథశర్మ ఎం.ఎ. గారు ఆంధ్ర ఉగాదిసంచికలలో వ్రాసియుండిరి.

'అంధుడు = బృహస్పతి అన్నయైన ఉతథ్యునకు మమత యందుఁ బుట్టినపుత్రుఁడు. ఇతనికి దీర్ఘతమసుఁ డని నామాంతరము కలదు.

ఆంధ్రుఁడు = ఇక్ష్వాకువంశములోని ఏకుక్షికి నారవతరము వాఁడు. ఇతడు "అంధుడను" చక్రవర్తి

ఆంధ్రుఁడు = పృథువుకుమారుఁ డైన పృషదశ్వుని తన యుండు, ఇతని కుమారుఁడు యవనాశ్వుఁడు,

ఆంధ్రుఁడు = చంద్రవంశమున యయాతి పుత్రుఁ డైన "అనువు" అను రాజవంశమునందుఁ బుట్టినవాఁడు. బలికుమారులారుగురిలో చిన్నవాఁడు.

ఆంధ్రుఁడు = యవనాశ్వతనూజుఁ డని "ఆంధ్రమహీపతి" మనుమఁడని బ్రహ్మవిష్ణు పురాణములలో కలదు.''

అని "ఆంధ్రవిజ్ఞానసర్వస్వము 154 పేజిలో, శ్రీ. కె. వి. లక్ష్మణరావుపంతులు ఎం. ఎ. గారు నిర్వచించి వ్రాసియుండిరి. "అంధ"వన మని "జేత" వన మని, నేటికిని యుత్తరకోసలమున "శ్రావస్తి" కి పరిసరములఁ గలవు.

సంస్కృతవాఙ్మయమున నిఘంటువైన "వ్యాకరణ శబ్దస్తోమమహానిధి" 74 పేజీలో, "అన్ధ్ర" శబ్దము దేశభేదముగను, జాతిభేధముగఁగూడ వర్తించు నని,

"అన్ధ్రః = దేశభేదే తత్రస్థలోకే జాతిబేదేచ" అని నిరూపింపబడినది. ఇంకను శ్రీతేకుమళ్లరాజగోపాలరావుపంతులు ఎం. ఎ. గారు "ఆంధ్రులు ఆర్యులు కారా" అను వ్యాసమున దుర్మతిసం॥ర, ఆంధ్రఉగాదిసంచికలో "ఆంధ్రులు ఆర్యులే. ఆంధ్రము ఆర్యభాషయే, సంస్కృతాంధ్రములు సోదరభాష లని" విమర్శించి నిర్ణయించియుండిరి. చివర కాంధ్రులు, ఉత్తరమున మగధవరకును, దక్షిణమున మధురవరకును కూడ పాలించినట్లు పదియవశతాబ్దమునాటి పలుశాసనములును, పెక్కుచరిత్రములును కనుపించుచున్నవి. ఇంతవర కేల? ఈ దేశము, యీజాతి పరమపవిత్రమైనది; కనుకనే క్రీ॥శ॥ 15 శతాబ్దములో నున్న షట్శాస్త్రపండితులును, షట్కర్మనిరతులునైన "అప్పయదీక్షితులు వారు," తాను దాక్షిణాత్యు డయ్యు ఆంధ్రదేశ, జాత్యుత్కృష్టతలను గురించి యిది విజ్ఞాన మూర్తులకు వేదకర్మనిరతులకు నివాసయోగ్యమైనదని అల్పతపస్సుల కివి యమర వనియు,

"ఆంధ్రత్వ మాంధ్రభాషాచ ఆంధ్రదేశవ్యవస్థితిః
తత్రాపి యాజుషశాఖా నాఽల్పస్య తపసః ఫలమ్"

అని వక్కాణించిరి. ఇందువలన నాంధ్రత్వమే, యాంధ్ర భాషయే, ఆంధ్రదేశనివాసమే, మహాతపఃఫల మని సూచించుచున్నది. "ఆంధ్రదేశవ్యవస్థితిః" అను దానికి "ప్రాభాకరపరిశ్రమః" అనికూడ పాఠాంతరముఁ గలదు. ఇందువలన నీవేశము పూర్వమీమాంసమతమున కాటపట్టైనదని తెలియుచున్నది. ఈఅప్పయదీక్షితుఁడు, ఆంధ్రుఁ డని స్వదేశాభిమానముతో చెప్పె ననుకొందురెమో! అప్పయదీక్షితుఁడు ఆంధ్రుఁడుకాడు. ద్రావిడశాఖీయుఁడు, దాక్షిణాత్యుఁడు. ఉత్తరార్కాటుజిల్లాలోని "అడయపలము" గ్రామనివాసి. వక్షస్థలాచార్యుని మనుమఁడు. రంగరాజాధ్వరికుమారుఁడు. గొప్పఅద్వైతమతవాది. శ్రీకృష్ణదేవరాయల యాస్థానమున పండితుఁడుగనుండినట్లు కొన్ని కథలు కలవు. వీరు యవసానకాలమున చిదంబరములో నివసించి, చిదంబరములోనే సిద్ధినిఁబొందిరి. చిదంబరమునుఁగూర్చి వారిచివరకాలమున,

"చిదంబర మిదం పురం ప్రథితమేవ పుణ్యస్థలం
వయాంసి మమ సప్తతె రుపరి నైవ బోగెస్పృహా"

అని చెప్పిరి కాన ఆంధ్రు లుత్కృష్టులని వేద, ధర్మ, కర్మనిరతు లని సిద్ధాంత మగుచున్నది.

## 4. ఆంధ్రము - దేశపరము

ఆంధ్రులుఁగూడ తొలుత ఆర్యావర్తవాసులే ననియు, వారు ప్రత్యేకశాఖ అనియు, వారే సముద్రతీరమునుండి, యిక్కడకువచ్చి కృష్ణాగోదావరీతీరముల నివాస మేర్పరుచుకొన్నందువల్ల దీనికి "ఆంధ్ర"దేశ మని పేరు కలిగినదనువాదముకూడ నొకటి కలదు—కాని పైనఁ జెప్పఁబడినట్లు, యీదేశము దట్టమైన యడవులచే గాఢాంధకార బంధురమై, యంధప్రాయముగ నుండి, "అంధ"దేశ మని పేరుఁ బొంది, కాలాంతరమున "ఆంధ్ర" మైనదనుటకు తగిన యాధారములు కానరావు. అయినను యీదేశ మనాది యనుటకు ప్రబలప్రమాణము లనేకములు కలవు. శ్రీమద్రామాయణమునందు, అరణ్యకాండలో దేశప్రశంసనుఁగూర్చి "అథ దేశవిశేషాః తా స్త్వమే కురుపాంచాలాసాళ్వాశ్చైవ జాంగలాః" అని ప్రారంభించి "అథాపరె జనపదా దక్షిణాపథవాసినః .... నైసర్గికా కుంతలా ఆంధ్రాఉద్ధవానలకాలికాః - పాండ్యాశ్చ కేరళాశ్చైవ చోళాఃకుల్యా స్తథైవ చ .... ఏతే జనపదా స్సర్వే వింధ్య

పృష్ఠనివాసినః” అని విమర్శకాగ్రేసర, రామాయణరత్నాకర, పండిత, ములుకుట్ల సరసింహావధానులుగారు, “రామాయణసారోద్ధారము” 64 పేజీలో భూవిన్యాసప్రకరణమున ప్రమాణముల నుదహరించిరి. ఇందు అంగ, వంగ, కళింగ, కాశ్మీర, కాంభోజ, సౌవీర, సౌరాష్ట్ర మహారాష్ట్ర, మాగధ, మాళవ, నేపాళ, కేరళ, చోళ, పాంచాల, గౌడ, మళయాళ, సింహళ, ద్రవిడ, కర్ణాట, లాట, కటక, పర్వాట, పానాట, నాట, పాండ్య, పుళింద, ఆంధ్ర, హూణ, దశార్ణ, భోజ, కుక్కురవ, కురవ, గాంధార, విదర్భ, విదేహ, బాహ్లిక, బర్బర, కేకయ, కోసల, కుంతల, కిరాత, శక, శూరసేన, సేపన, టెంకణ, కొంకణ, మత్స్య, మద్ర, పార్శ్వఘూర్జర, యవన, జలంధర, సాళ్వ, చేది, సింధు, అను 55 దేశములుగాక, యింక పురాణప్రసిద్ధములైన ఆర్తక, అరట్ట, ఉత్కళ, ఔదుంబర, కచ, కరీషక, కురు, జాంగల, కుశస్థలి, తామ్రలిప్తక, దరద, నిషధ, మలజ, మేఖల, వాత్స్య, అవర్తక, అశ్వక్రాంత, రోమక, పటచ్చర, పశుశీల, క్రౌంచ, సైనిక, కుక్కుట, ఆశ్వీయ, ప్రవీయ, తామస, మారక, మారట, ఆరణ్యక, తురుష్క, రథక్రాంత, హైభ, ఋష, శంఖతురుష్క, పారస్పర, పహసవ, గాంధార, బ్రహ్మదేశ, ఉపమలక, తలహ, దుర్గ, కేకయ, మాహిషిక, కన్యాకుబ్జ, పాటలీపుత్ర, చంపావత్స, బర్బర, అసిక్రాంత, అవంతిక మున్నగు యేబదిదేశములను పేర్కొనిరి. ఇంక కిష్కింధాకాండ 41 సర్గలో సుగ్రీవుడు సీతను వెతుకుటకు, హనుమంతునితో, దక్షిణమున

“తతో గోదావరీం రమ్యాం కృష్ణవేణీం మహానదీం” అని ప్రారంభించి, “తథైవ ఆంధ్రాంశ్చ పుండ్రాంశ్చ చోళ్యా సకేరళ్యా” అని వర్ణించి చెప్పెను. అందు తూర్పున, బ్రహ్మమాల, విదేహ, మాళవ, కాశి, కోసల, మగధ, పుండ్ర, వంగదేశములును, దక్షిణమున, ఉత్కళ, దశార్ణ, అశ్వవంతి, అవంతి, విదర్భ, వంగ, కళింగ, కౌశికి, ఆంధ్ర, పుండ్ర, చోళ, పాండ్య, కేరళాది దేశములను పశ్చిమమున సురాష్ట్ర, బాహ్లీక, శూర, భమ, అంగ, దేశములను, ఉత్తరమున హిమవంత, మ్లేచ్ఛ, పుళింద మద్ర, కాంబోజ, యవన, శూరసేన, శక మున్నగు దేశములును వర్ణింపఁబడినవి.

మరియు నిట్లు శ్రీరామలక్ష్మణులు అయోధ్యనుండి విశ్వామిత్రుని యాగసంరక్షణార్థము, మిథిలానగరమునకుఁ బోవుమార్గములోను, భగీరథుఁడు గంగను భూలోకమునకుఁ దెచ్చుసందర్భములోను, భరతుడు గిరిప్రజము నుండి అయోధ్యకు వచ్చు మార్గములోను, శ్రీరామచంద్ర పరమాత్మ వనప్రవాసగమనమునందును, పలుదేశములు వర్ణింపఁబడినవి. ఇంక నీదేశప్రశంస శ్రీమన్మహాభారతములో, భీష్మపర్వమున జంబూఖండవినిర్మాణపర్వమున నవమాధ్యాయమునందు,

“అత ఊర్ధ్వం జనపదా న్నిబోధత” అని ప్రారంభించి,

“ఉద్దేశమాత్రో మయా దేశా స్సంకీర్తితా విభో” అని చెప్పబడియుండెను. దీనికి ఆంధ్రమహాభారతము భీష్మపర్వము ప్రథమాశ్వాసములో,

| | | | |
|---|---|---|---|
| పాంచాల | శూరసేన | పాండ్య | బహ్లాక |
| పాండ్య | సుధేష్ణ | ఆభీర | బహుదాస |
| బర్బర | సుహ్మ | సౌవీర | కిరాత |
| వత్స | కురు | సౌరాష్ట్ర | కేకయ |
| మత్స్య | కరూశ | మహారాష్ట్ర | అశ్మంతక |
| మగధ | కాశి | విదేహ | కాశ్మీర |
| మళయాళ | కోసల | విదర్భ | గాంధార |
| కళింగ | యవన | ద్రవిళ | కాంభోజ |
| కుళింగ | యుగంధర | దశార్ణ | కేరళ |
| కుకురు | ఆంధ్ర | కర్ణాట | మాళవ |
| కొంకణ | సింధు | గౌళ | నేపాళ |
| టెంకణ | చేది | అంగ | ఘూర్జర |
| త్రిగర్త | చోళ | వంగ | కుంతల |
| సాముద్ర | పుళింద | మరాట | అవంతి |
| సాళ్వ | పుండ్రక | లాట | అనుపాది |

జనపదంబులు సమస్తవస్తుసంపత్సంపాదనంబులయిన గుణవిశేషణంబుల వెలసి, పురుషార్థంబు లగు ధర్మార్థకామంబులకుం గారణంబులై కమనీయంబు లగుచుండు” నని కలదు. ఇట్లె సభాపర్వము ప్రథమాశ్వాసములో 284 వచనములో “అంగ, వంగ, కళింగ, కాశ్మీర, కాంభోజ, గౌడ, ఆంధ్ర, సింహళ, కేరళ, కుంతల, ద్రవిడ, మరు, యవనపతులును” ద్వితీయాశ్వాసము 113 వ వచనములో “కాశ్మీర, కాంబోజ, గాంధార, మద్ర, ద్రవిడ, మగధ, మాళవ, కళింగ, అంగ, వంగ, బంగాళ, గౌడ, ఆంధ్ర, కేరళ, కోసలాది మహీపతులును” అని దేశాధీశులు వర్ణింపఁబడిరి. ఇందాంధ్రదేశము కలదు.

(సశేషము.)

# వార్తలు

## సంస్కృత విశ్వపరిషచ్చతుర్థసమావేశము - తిరుపతి

నవంబరు తే 11, 12, దీలలో తిరుపతి క్షేత్రమందు సంస్కృతవిశ్వపరిషత్తు నాలుగో సమావేశం యేర్పాటైంది. ఈ పరిషత్తు 1951 సంవత్సరంలో సోమనాథ దేవాలయాన్ని స్వర్గీయ సర్దార్ పటేల్ పునరుద్ధరించే టప్పుడు స్థాపింపబడింది. రెండవది కాశీలో, మూడవది నాగపూరులో, సమావేశాలు జరిగేయి. మూడింటికంటెకూడా చాలా వైభవంగా యీనాలుగో సమావేశం జరిగింది.

సమావేశానికి శ్రీ రాజేంద్రప్రసాద్ అధ్యక్షతవహించారు. ఆంధ్రగవర్నరు శ్రీ త్రివేదీగారు సమావేశాన్ని ప్రారంభింప మని డాక్టర్ శ్రీ రాజేంద్రప్రసాదుగార్ని సంస్కృతభాష లోనే మాట్లాడి ప్రార్థించేరు.

శ్రీ రాజేంద్రప్రసాద్‌గారికి వేదస్వస్తివాచనంతోను, పూర్ణకలశలతోను స్వాగతం యివ్వబడింది. చక్కగా అలంకరింపబడిన బ్రహ్మాండమైనపందిరిలో ఎత్తైనవేదికమీద కూర్చున్నారు, శ్రీ రాజేంద్రప్రసాద్ దంపతులు.

సభకు సుమారు 5000 మంది వచ్చారు. ఇందులో అనేకదేశములనుండి వచ్చిన ప్రతినిధులు 1300 మంది.

వేదికమీద, ఆంధ్రగవర్నరు, ఉత్తరప్రదేశగవర్నరు, బొంబాయిగవర్నరు, ఆంధ్ర, హైదరాబాద్‌ల ముఖ్యమంత్రులు, ఇతర ఆంధ్రమంత్రులు, లోక్‌సభఉపాధ్యక్షులు అనంతశయనయ్యంగారు ఆసీనులయ్యారు. ఆహ్వాన సంఘాధ్యక్షుడు, ఆంధ్రప్రభుత్వపు దేవాదాయశాఖామంత్రి, శ్రీ కల్లూరి చంద్రమౌళిగారు స్వాగతోపన్యాసం చేసేరు. ఆంధ్రదేశం వెనుకటినుండి సంస్కృతభాషకు చేసిన సేవనుగ్గడించేరు. ఇప్పుడుకూడ ఆంధ్రదేశంలో సంస్కృత భాష యేవిధంగా ఉద్ధరింపబడుతుందో సూచించారు.

తరువాత, మున్షీగారు-ఉత్తరప్రదేశగవర్నరు-సంస్కృత విశ్వపరిషదధ్యక్షులు సంస్కృతంలోనే పరిషల్లక్ష్యములు వివరించేరు-కార్యదర్శిథవేగారు ఆంగ్లంలో ఉపన్యసింపగా శ్రీ వేంకటేశ్వరదీక్షితార్‌గారు సంస్కృతంలో అనువదించారు.

తరువాత అధ్యక్షులు డాక్టరు శ్రీ రాజేంద్రప్రసాద్‌గారు తమ యుపన్యాసాన్ని హిందీలోవచించారు. శ్రీవేంకటేశ్వర దీక్షితార్‌గారు సంస్కృతంలో అనువదించారు - రాష్ట్రపతి ఉపన్యాసంలో సంస్కృతభాషలోనుండే మాధుర్యం-గొప్పతనం - సంస్కృతి-నాగరకత - వీటన్నిటిని ఉగ్గడించారు - సంస్కృతభాష పునరుద్ధరింపబడాలన్నారు - ఆంధ్రప్రభుత్వం ప్రయత్నాన్ని అభినందించారు.

మరునాడు సభకు, శ్రీ మున్షీగారధ్యక్షతవహించారు. ముగ్గురు గవర్నర్లుకలసి తయారుచేసిన తీర్మానాల్ని శ్రీ హరికృష్ణమెహతాబ్ సభలో ప్రతిపాదించారు - తీర్మానం సంస్కృతభాషా పునరుద్ధరణం యేవిధంగా జరగాలి, అందుకు వలయు సాధనలు-వీటన్నిటిని వివరించేవిధంగా నుంది-అనంతశయనం అయ్యంగారు తీర్మానాన్ని బలపరచుచూ తమ మృదుమధుర గంభీరధోరణిలో చక్కగా ఉపన్యసించారు.

అస్సాం, బెంగాల్, పంజాబ్, కాశ్మీర్, మైసూర్, ఉత్కళ్, మద్రాస్, అన్నామలై, తిరువాంకూరు, మొదలగు ప్రదేశములనుండివచ్చిన ప్రతినిధులు, ఆంధ్రదేశమునుండి వచ్చిన అనేకమంది ప్రతినిధులు తీర్మానం బలపరుస్తూ సంస్కృతంలోనే ఉపన్యసించారు - తీర్మానం ఏకగ్రీవంగా ఆమోదింపబడింది.

మూడవనాడుదయంకూడ సమావేశం జరిగింది. అనేక మంది మాట్లాడారు. మున్షీ, మెహతాబ్, అనంతశయనయ్యంగారు, ఆంధ్రప్రభుత్వం ఈ యేర్పాటు యింత చక్కగా, అద్భుతంగా చేసినందుక్కు కృతజ్ఞతను తెల్పారు. విశేషంగా ఆంధ్రప్రభుత్వపు ముఖ్యమంత్రి శ్రీ గోపాలరెడ్డిగారు, రివిన్యూ దేవాదాయశాఖలమంత్రి శ్రీచంద్రమౌళిగారు, విశేషోత్సాహం చూపించి సమావేశానికి కావలసిన యేర్పాట్లు చక్కగాచేసినందుక్కు వారిని ప్రత్యేకంగా అభినందించారు - సభాసమావేశము యింత అద్భుతంగా, జయప్రదంగా జరుగుటకు విశేషమైన శ్రమతీసుకున్న శ్రీచంద్రమౌళిగారికి ధన్యవాదములనర్పించారు.

వచ్చిన అతిథులకు వలయు సమస్తమైన సదుపాయములు కల్పించి యెవ్వరికిన్ని యేలోపంలేకుండా అన్ని వసతులు కల్పించుటలో సహాయభూతులైన తిరుపతి దేవస్థానం కార్యకర్తలగు శ్రీ చెలికాని అన్నారావుగారి సామర్థ్యాన్ని అంతాకొనియాడి వారికి తమ యభినందనాల్ని అందించారు.

సభకుకావలసిన యేర్పాట్లు జయప్రదంగా, అద్భుతంగా జరిపించుటలో తమ ఓర్పు, చాతుర్యం, చాకచక్యం చూపించి ఆంధ్రదేశానికి, ఆంధ్రప్రభుత్వానికీ, వన్నెతెచ్చిన దేవాదాయ ధర్మాదాయశాఖామాత్యులు శ్రీ కల్లూరి చంద్రమౌళిగారు యెంతయు అభినందనీయులు; వారికి ధన్యవాదములు.

# A PAGEANT OF INDIAN PHILOSOPHY

*By*

N. RAMESAN M.A., I.A.S.

( *Continued from previous Issue* )

## Chapter IV

### " The Atharva Veda "

The Atharva-veda, in orthodox circles, is not given the status of a Veda at all and is regarded as an appendage to the three main vedas, allowed to continue as a veda only by sufferance. The spirit prevailing in the Atharva veda is quite different from the simple and joyous life and poetry of the Rig veda.. Here we meet with devils and hobgoblins, dark and mysterious forces, more to be feared and placated than respected and worshipped. The vigorous and unsophisticated outpourings of the Rig vedic hymns are here transformed, into dark and mysterious charms and incantations to evil forces. "The hymns of the Rig-veda, inextricably confused; the deities of an earlier era confounded; and again merged together in a pantheon now complete; the introduction of strange gods; recognition of a hell of torture; instead of many divinities, the one that represents all the gods and nature as well; incantations for evil purposes and charms for a worthy purpose; formulae of malediction to be directed against these 'whom I hate one'; magical verses to obtain children, to prolong life, to dispel evil magic, to guard against poison and other ills; the paralysing extreme of ritualistic reverence indicated by the exaltation to godhead of the 'remnant' of sacrifice; hymns to snakes, to diseases, to sleep, time, and the stars; curses on the 'priest plaguer'— such in general outline is the impression produced by a perusal of the Atharvan after of that of the Rig-veda."

The Atharva veda represents the culture that crystallised out of the fusion of the religions of the pristine Aryans, and the religions of the local Dasyus, that inhabited the country. Hinduism, has been well described, as a religion, which destroys all opposition to it, by the simple process of assimilating all alien ideas, and working them up to an integrated whole. This characteristic trait of this great religion, is a proof of the touching humility of those, that are really great at heart. A knower of real Truth, knows that Truth is not exclusively revealed in any particular combination of time and place alone, but is universal; and because it is universal, he searches for the glimpse of the underlying reality, in any facet of truth exposed anywhere. It is this realisation of the truth of all faiths, in whatever fashion they may be presented, that makes Hinduism such a to leran one, and enhances its prestige and greatness. The Hindu does not possess the pride of the fanatic, that his, is the only religion. None can lay hold of the entire Truth. If a particular god, or a particular faith satisfies some persons, then it is a facet of truth, as real as his own, and well worth study and assimilation. It is this spirit, that has rid Hinduism of those dark deeds that have marred the glory of other religions. This spirit of toleration of all other faiths, however fantastic they may appear at first sight, and slow absorbtion of them, to produce an integral whole, is well revealed, in the Atharva veda, which has neither the naive poetry of the Rig veda, nor the terrible portions and

incantations of the local religions, but is a mixture of both, satisfying both. It is a kind of religious co-existence that is revealed in the Atharva veda

As the Aryans continued their incursions, and in course of time began to settle down in the land of their adoption, they had to fight a number of wars, with the local Dasyus, which wars have stirred popular imagination, by being depicted in the Puranas, as the wars between the gods and Rakshasas. As happens will all conquests, the period of strife and struggle must necessarily yield place, to one of adjustment and settling down. In this settling down, in a spirit of mutual give and take, there was always the danger of the two races and cultures getting mixed up. If both races are virile, the mixture might produce a result better than either of the two. But if one of them is backward and uncivilised there is the risk of the better culture being completely swamped out of existence. In such a situation, the Aryans preserved their racial purity, by the system of caste, which enabled the two races to live together and at peace, without any racial mixture and without any racial bitterness. They preserved their cultural purity, by collecting and standardising their religion and poetry in the "Samhitas" (which literally mean collection) to be divulged exclusively to their own kith and kin, and for purposes of their relations with the uncivilised local tribes, they evolved the Atharva-veda. The Aryans could not completely destroy the local culture, as their number was small. The only other alternative before them was to civilise the uncivilised tribes, if they had to avoid, their being completely over run by the local culture. In the process of this civilisation, naturally some of their ideas had to give way, and many compromises had to be effected. If this process had not been done, there was the danger of the Aryan religion being completed submerged. When two systems, one good and the other base, one refined and the other vulgar, meet, there is such a thing as a general Gresham's law, which tends for the base and the vulgar, to beat the good and refined, out of circulation. This danger was averted by the compromise of the Atharva-veda. This compromise naturally elevated and ennobled the religion of the primitive tribes; but degraded the freshness and purity of the Vedic religion, by introducing witchcraft and sorcery into it. Thus while the Rig veda gives us a glimpse of the struggle between the Aryans and the local tribes, the Atharvaveda, gives us an insight into their minds, when the conflict is settled, and both parties are living in mutual comprise. It is in this, that the importance of the study of Atharva-veda lies, in any history of Indian thought.

The religion of the Atharva-veda, is the religion of the primitive man, who is afraid of darkness, of eclipses, of ghosts and goblins. There is one very important change in the manner in which God is conceived of between the Rig and Atharva veda. In the former, man is full of bursting joy and he conceives of God with a natural gush of joyousness. The Rig vedic god is a helpful, benevolent god, whom man loves, and likes to love. In the Atharva, god is conceived of as something, mysterious and intangible, something that is powerful and dark, and to be propitiated by sacrifices to keep his malefic power away. "In the Rig veda, the gods are approached with reverential awe, indeed, but with love and confidence also; a worship is paid them which exalts the offerer of it; the demons embraced

under the general name of Rakshasas, are objects of horror, whom the gods ward off and destroy; the divinities of the Atharva, are regarded rather with a kind of cringing fear, as powers whose wrath is to be deprecated and whose favour curried; it knows a whole host of imps and hobgoblins, in ranks and classes, and addresses itself to them directly, offering them homage to induce them to abstain from doing harm. The mantra, prayer, which in the older veda is the instrument of devotion, is here rather the tool of superstition; it wrings from the unwilling hands of the gods the favours which of old their goodwill to men induced them to grant, or by simple magical power obtains the fulfilment of the utterers wishes. It seems in the main that the Atharva is a popular rather than a priestly religion; that in making the transition from vedic to modern times, it forms an intermediate step, rather to the gross idolatries and superstitions of the ignorant mass, than to the sublimated pantheism of the Brahmins."

The theology of the Atharva veda also shows the mixture of the Rig veda with the primitive culture. Rudra is here the lord of cattle and is called 'Pasupathi,' and forms a linkage between the vedic conception of 'Siva' as meaning only auspicious without the name or status of god, and the later Saiva worship. 'Prana' is hailed as a life giving principle. The doctrine of vital forces, or 'Prana', along with 'manas', 'buddhi', 'chitta' etc. etc, which plays such an important part, in later Indian philosophy, is first mentioned here. The first recognition of the sacredness of the cow, which later became such an important plank of Hinduism, is first mentiōned only here. Also the popular cȯnception of Hell or "Naraka", finds a place, for the first time here. All the horrors and tortures of hell, so graphically dealt with in puranic stories, are all familiar in Atharva veda. There is also a curious change in the emphasis of the sex of the gods. While Rig veda recognises female gods, big and large the emphasis is on the male sex. There is a shift to the female sex here. This is the basis for the "Saktha" worship, and the later Tantric philosophies, in which sex becomes the basis. There were charms for good and evil. The old title of the text was "Atharvangiras" the one of "Atharvan", belonging to auspicious practices, and of "Angiras", belonging to hostile practices. Many later ideas of Hinduism, which are so familiar to us today, like Siva standing for an auspicious god, the sacredness of cow, the popular idea of Naraka, the Sakta worship, and in fact the basis for the Devi worship itself, all belong to the Atharva veda. Medicine, sorcery, witchcraft, charms and potions also abound in it.

Since its central theme was sorcery, many regarded it (and still regard it) with contempt, and it has never been fully accepted as a veda. It contributed much to the growth of the pessimistic outlook in India. "Men cannot believe in the devil and the tempter and yet retain joy of life. To see demons close at hand is to shudder at life." However by its emphasis on potions etc, especially in the "Atharvan" section, Atharva veda, did much to prepare the way for the scientific development in ancient India, and for the science of medicine to grow. To a student of the progress of Indian thought, a study of the Atharva veda is quite esssential, as reflecting the thought of the later vedic times, when the conquering Aryans, had settled down, in a spirit of compromise, to live at peace, with the uncivilised and primitive local tribes.

### Chapter V.

### The Liturgy of the Brahmanas

The Brahmanas, or the books of liturgy, which form the middle portion of the vedas, being placed between the Hymns or Mantras and the Upanishads, are elaborate text books, giving minute and detailed instructions to the priests, in the conduct of the sacrificial rites. Loose ends are tied up here, and the ritual is fixed up, into an unalterable pattern, bound by rigid rules and regulations. Worship is no longer a free and joyous expression of the soul. Here it becomes part of an elaborate ritual, where the details get often an importance, which sits at nought the very purpose or the spirit of the worship. The dimensions of the altar, the particular type and number of twigs to be used, the number of grass to be used, the pattern into which they have to be woven, the particulars of the things that have to be offered as "Havis", etc. etc. are all very carefully and minutely laid down, and it was enjoined that even the slightest variation from the set and prescribed procedure would take away much if not all, the merit of the sacrifice. The Brahmanas are thus guide books to the priests, setting down the details of rituals. The two important and chief Brahmanas, are the 'Aitareya' and the 'satapatha'. As usual in India, various interpretations of these, have led to various schools of thought.

The Brahmanas represent a very important change in the religious evolution of the Rig vedic times. In the Hymns, we saw, that man, in his pristine condition of unsullied joy at the contact with nature, burst out into song, deified nature as god, and worshipped it with admiration but with love. There, worship was an individual affair, between man and his maker. It was an expression of man's joy and yearning. Though there are plaints for favour, the spirit of the hymns, was more exalted and pure, and worship was conceived of as communion, in meditative contemplation, with the divine. There was thus no necessity for a priest there, as worship was an individual affair of the spirit. In the Brahmanas, however, we find, that ritual has so far developed, that no one could do a sacrifice, with out observing a thousand and one femalities, non-observance of a single act even, detracting from the whole merit of the sacrifice The need therefore arose, for a body of learned men, called priests, who knew the rules of procedure well, and who could thus be trusted to help the sacrificer. The concept of a "Kartha" or "Yajamana", being helped, by a "purohita", was thus developed, and there arose a body of men well versed in the Brahmanas, namely the Brahmins, who filled this essential and important job. It is a trait of human nature, that man, tends to consolidate any advantage he has over others. Once the priest, with his knowledge of ritual, came to be accepted as a necessary corollary to a yajna, pride of position and prestige, tended to make the Brahmin priest, exclusive and assert his authority. In course of time, thus, far greater emphasis and importance, came to be attached to the ritual of the sacrifice, than would have happened, had there been no priests, with vested interests. This exclusiveness and a certain over-rated importance of the priests, and consequently of the purely ritual aspect of the sacrifice, in which alone the priests excelled, are the characteristics of the Brahmana period.

Along with the rise into prominence of the ritual, there was a corresponding decline in the spiritual life, in the truly religious conscience of the people. Conse-

ద్రవిడదొరలు, ద్రవిడులం గాచియు బ్రోచియు వారికి దేవత లై పోవుటయు కాక, ఆర్యులచేతను పూజచే పరిగ్రహింపఁబడి వేద వేదాంతముల లోనికిం బ్రాఁకినారు అనుట చరిత్ర మార్గము కానోపు నని యూహించినాఁడు. అదియునుం గాక, ఏ రాజు దేవతం బ్రతిష్ఠింపించునో ఆ రాజు ఆ దేవతను తన 'నాథుఁడ'ని పేర్కొనుటయు గలుగును. అట్లని యన్. రామేశంగారును, మేధావులు, పరిశోధకులు, గ్రాహ్యవాక్కులు ఆ 'యాషాఢారాధన'లోనే మాచర్ల దేవళముల యుపన్యాసమున ఆదిత్యమహారాజు నెలకొల్పిన యాదిత్యేశ్వ రాలయమునకు 'చాగిబేట' యను రాజు భూదానము చేసెనను ప్రస్తావమున ఆ దైవత నామముంగూర్చి ఇట్లు పలుకుట గలదు. "The Deity being called Adityeswara need not bother us much, as it is quite common to name the deity as the Iswara of the founder of the temple". ప్రకృత దేవ కులము గోడలమీఁది శాసనములలో ప్రసక్తులగు చోళ ప్రభువులలో త్రిభువనేశ్వరులుగా తమ్మగ్గ డించుకొన్నవారు ముగ్వురు 'రాజరాజ చోడ దేవుఁడు', 'కులోత్తుంగ చోళదేవుఁడు', మధు రాంతక పొత్తపి చోళుఁ డనియు, రాజ గండ గోపాలుఁ డనియు పేరులు గలిగి 'రంగనాథుఁడ'ని వ్యవహారముం గన్నవాఁడును. ఈ రంగనాథుని శాసనముల కాలము సూటిగా చెప్పఁబడియున్నది- క్రీస్తు 1296–1301. అతని రాజ్యము 1291 మొదలు 1305 వఱకు కాఁబోలును. ఈయందఱి లోను అర్వాచీనుఁడు కడగొట్టు ఆ రంగనాథ వ్యవహారముం బడసిన ఈతఁడే. అతనికే రాజ గండగోపాలుఁ డను నది అసలుపేరో బిరుదో గలదు. రంగనాయకులపేటలో పినాకినిలో 'గండగోపాలుని మడుగు' అని చిరప్రసిద్ధముగా ప్రాదము గలదు, ఏటేట పలువురం బలిగొను నది. మొన్న మొన్నటివఱకు ఇండ్లలో కుటుంబ ములలో పెద్దలనోట కోపమునకైన శాపోక్తి లోను, విసుకునకైన నిర్వేదోక్తిలోను 'గండ గోపాలు మడుగులో దూఁకరా, దూకి చావరా, దూకుదునా' అను నిట్టి ప్రలాపములు రూఢమై యున్నవి. ఏ కారణముచేతనో (?) ఏటి మడుగు నకు తన యీ గండగోపాల నామమును సంక్ర మింపఁజేసిన జనవాక్కు ఆ 'రంగనాథనామమును' అతని వ్యవహారనామమును అట్లట్లు 'పళ్ళికొండ పెరుమాళు'నకును సంక్రమింపఁజేసి యుండునా, తన జ్ఞప్తియందు హత్తుకొనియుండునా, ఆ తుర కల దెబ్బ తగిలినప్పుడును తరువాత మరల కుంభిణీ రాజ్యము మొలకెత్తినప్పుడును, శుద్ధ యఱవను ఆ పళ్ళికొండాయనను మఱచి రంగనా థునే స్మరించునట్లు?

ఇట్లు ఐతిహ్యము గలదు:— తురకల మొఱకు చేతల ప్రకారముగా దేశముం బాడుపెట్టి యాదలి విగ్రహములును అపహృతములై తద్రాజధాని యగు నుదయగిరియందు పాఱవైవఁ బడి యుండినవి. ఇప్పటికి ఇంచుమించుగా ఆ 200-యేండ్లక్రిందట దేవళము జీర్ణోద్ధరణ పునః ప్రతిష్ఠలు సంకల్పింపఁబడి నప్పుడు తదంగముగా ఆ విగ్రహములు మరల నుదయగిరినుండి సంపా దించి తేఁబడినవి. వానిని బలిజెకులమువారు 'కంటె' యను కుటుంబము వా రొకరు నిదుర భోజనము లెఱుఁగని యేక ప్రయాణమున ఒక్కటే మజిలీగా తలపై మోచి వేంచేయించుకొని వచ్చి దేవళముం జేర్చిరి. తదీయులు ఇపుడును నవాబు పేటలో నుండువారు, ఆ నిమిత్తముననే నేఁటికిని

దేవళమున కొన్ని మర్యాదలు పొందుచు, నియతముగా తిరుణాళ్ళలో తలంబ్రాల యుత్సవమునకు 'ఉభయ' కర్తలుగా నున్నారు అని.

క్షీరాబ్ధి యనియు, శయ్యా నారాయణుఁడనియు తిరుప్పాఱ్కడల్ అనియు పళ్ళికొండ పెరుమాళనియు ననకున్న నేమి? తల్పగిరి యనియు పినాకిని యుత్తరవాహిని తీరమనియు అందు తల్పగిరి నాథుఁ డనియు కేశవుఁ డనియు నా పౌరాణికులు చెప్పిన పేరులు వ్యవహారముం గనకున్న నేమి? "పదం యః సం (?) త్యక్త్వా శయనశిఖరీ కృత్య భుజగమ్" అని యర్చకులు తప్పే పఠించి స్తుతించిన నేమి? ఆ "రంగస్థలము" (రంగధామమును) పోయి నేఁడు క్షేత్రమునకు 'తల్పగిరి' యనియు దేవునికి "శ్రీ రంగనాథుఁ" డనియు వ్యవహారము రూఢి యెక్కి పేరులు పాఱి, సర్కారునను తిరమై దిగంతములు విశ్రమించి భక్తుల నాశ్రయించుచు వర పరంపరను శ్రేయఃసందోహమును కురియుచున్నది. విశ్వాసమును చిత్తసంగతియు ప్రధానము.

"న కాష్ఠే విద్యతే దేవో, న పాషాణే న మృణ్మయే,
భావే హి విద్యతే దేవ స్తస్మా ద్భావో హి కారణమ్
మన్త్రే తీర్థే ద్విజే దేవే దైవజ్ఞే భేషజే గురౌ
యాదృశీ భావనా యత్ర సిద్ధి ర్భవతి తాదృశీ"

కొయ్యలో గాని, రాతిలో గాని, మట్టివికారములో గాని దేవుఁడు లేఁడు. దేవుఁడు భావనలో నుండును. కావున భావము సిద్ధికారణము. మంత్రమునందును, తీర్థమందును, బ్రాహ్మణుని యందును, జ్యోతిషికునియందును, వైద్యునందును, గురువునందును భావన యెట్టిదిగా నుండునో సిద్ధి యట్టిదిగా నుండును. అంత కన్నను దేవళములకును అందలి దేవతలకుం గూడ 'అదృష్ట' మున్నది. దాని విలాసము ఎఱుంగరానిదియు, దాఁటరానిదియు. అట్లే గదా, ఆ 'పళ్ళికొండ పెరుమాళ్ళు' అట్లు 'మన్వంతర మూర్తి', నందాదీపము మొదలు భోగము, మండపము గోపురమువఱకు సమర్పణలఁ గొన్నవాఁడు. ఈ 'రంగనాథుని' 'కోలమునను' ఇట్లు విరాజిల్లుచుండఁగా మూఁడు నెల్లూరు 'గోపాలుఁడు', అంత పెద్ద పుట్టు సాహుకారయ్యు, చేత వేణువుం గొనియు, మఱి యెట్లున్నాఁడు!

~~~~~~~~~~⊙~~~~~~~~~~
~~~~~~~~~~

# ఉపాసనా రహస్యము

( గతసంచిక తరువాయి )

ఇట్లు సకలుడగు పరమేశ్వరుడు తనశక్తితో త్రిఖండాత్మకము త్రిమూర్త్యాత్మకము త్రికాలాత్మకము మూడువందల అరువది కిరణములతో (దినములు) సంవత్సరరూప ప్రజాపతియై అనేక బ్రహ్మాండములనూ చతుర్విధ జీవులను సృష్టించి రక్షించుచూ అసంఖ్యాక కిరణములతో ప్రకాశమానమై జ్యోత్స్నామయమగు సహస్రార చక్రమందుగల బిందుస్థానమగు సుధాసింధు మధ్యభాగమున సౌదామినీయను షోడశ కళారూపమైన పరాశక్తితో కూడి పంచదశ తిథిరూపములగు కళలకు శక్తులగు కామేశ్వరీ మొదలగు నిత్యలకు నాథుడై సమస్త కార్యములకు సాక్షిమాత్రుడై ఆత్మరూపుడై వెలయుచున్నాడు. అట్టి పరమేశ్వరుని పూర్వజన్మ కర్మవాసనాబద్ధజీవులు భగవంతునివలన నిర్మితములగు ఆగమశాస్త్రములలోని వివిధమంత్ర యంత్ర జప హోమార్చనా విధులవల్ల అంతర్యాగ బహిర్యాగములతో సామయిక మతానుసారము అర్చించి చిత్తశుద్ధి గలిగి కుండలినీ శక్తి చాలనముచే దేహములోని షట్చక్రములను ఛేదనముచేసి షడ్విధైక్య సంధానమహిమవల్ల శివశక్తి సంపుటమును గ్రహించి ఆత్మ సాక్షాత్కారమునుబొంది ముక్తి గాంచుటకై ఉపాసనము అవుసరమైయున్నది.

**(3)**

భగవంతుని అంశమగు చైతన్యమే అనాది అవిద్యాకృతమైన ఉపాధి సంబంధము వలన జీవుడై కర్తృత్వ భోక్తృత్వములతో సంచిత ప్రారబ్ధ ఆగామి కర్మలకు తానే కర్తయై జనన మరణ రూప సంసారమందు సుఖదుఃఖములను పొందుచున్నాడు. అట్టి జీవుని యీ సంసార దుఃఖరూప సముద్రమునుండి ఉద్ధరించుటకు భగవంతునకుదక్క అన్యులకు సాధ్యముగాదు. పరమేశ్వరునివలన ఉత్పన్నమై సర్వదా భగవంతుని ఆజ్ఞానువర్తియగు మాయాకార్యమైన యీ సంసార సముద్రమును భగవంతునియందు అనన్యమైన భక్తిచేగాక యీ మాయను తరించి పరమేశ్వరుని అనుగ్రహము పొందుటకు అవకాశములేదు. గీతావాక్యం —

దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా ।
మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే ॥

అను గీతాప్రమాణముచే మాయామయమైన సంసారదుఃఖమును పోగొట్టుకొనుటకు భగవంతుని ఉపాసనము అవుసరము. ఉపాసనమనగా ఉప సమీపే ఆసనం ఇత్యుపాసనం అనగా యెల్లప్పుడు భగవంతునికి సమీపములో నుండుట. అట్టి ఉపాసనము స్థూల సూక్ష్మ భేదములచే ద్వివిధమైయున్నది. సగుణోపాసనము నిర్గుణోపాసనము-

ద్వివిధం భక్తిరూపం స్యాత్సగుణం నిర్గుణం తథా
సర్వభూతాంతరస్థం చ స్వయం జ్యోతిస్వరూపకం
నిర్గుణం నిర్మలం శాన్తం పరబ్రహ్మేతి చోచ్యతే
ఇతి నిశ్చిత్య మనసా పూజయేచ్ఛివ మవ్యయం
సాధకో భక్తిభావేన సభక్తిర్నిర్గుణ స్స్మృతః
శిలామృద్దారుచిత్రేషు దేవ మావాహ్య పూజయేత్
సా పూజా సగుణా ప్రోక్తా సర్వకామఫలప్రదా ॥

అనుటవలన భగవంతుని సహచరియగు మాయామయమైన బ్రహ్మాండమంతయూ భగవంతుని కంటె వేరుగాదు. "తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్" అనుటవలన స్థూల బ్రహ్మాండమంతయూ

భగవంతునిరూపమే కనుక స్థూల సూక్ష్మములను తెలిసి సమస్తమునూ పరమేశ్వరుని రూపమనే అభేదముతో ధ్యానముచేయుటయే నిర్గుణ భక్తి యనియూ ఆంతర పూజయనియూ, రాయి, మట్టి, కొయ్య మొదలగు ధాతువులయందు భగవంతుని రూపమును కల్పనచేసి శక్తి పాతముద్వారా ఆ మూర్తులను ద్రవ్యభేదములతో అర్చించుటే సగుణభక్తి బాహ్యపూజ యనియూ తెలియుచున్నది.

ఇట్లు నిర్గుణుడగు శివుడు సకలుడై బ్రహ్మాండ పిండాండములను సృష్టించి వానికంటె తాను వేరుగాక నిర్గుణరూపముగనూ సగుణరూపముగనూ బ్రహ్మాండరూపముగనూ పిండాండరూపముగనూ అద్వయుడై యున్నట్లు సాధకునకు తెలియుటకై స్థూల సూక్ష్మాది భేదము కల్పించి స్థూలము ద్వారా సూక్ష్మమును తెలిసి జ్ఞానమునుబొంది ముక్తిగాంచుటకై స్థూలరూపమగు శక్తియొక్కయూ సూక్ష్మరూపమగు శివునియొక్కయూ అభేదమై శివశక్త్యాత్మకమైన శ్రీచక్రమును నిర్మించి యీ చక్రముద్వారా దేహ, బ్రహ్మాండ, మంత్ర, దేవతా, చక్రములకు అవినాభావమును సాధించి తాదాత్మ్యమువల్ల అద్వయజ్ఞానము కలిగించి జ్ఞానముద్వారా మోక్షమును పొందించుటకు సామయిక మతమగు నిర్గుణోపాసనమును ఆగమ శాస్త్రములు బోధించుచున్నవి. ఇట్లు సూక్ష్మమై రహస్య ప్రతిపాదకమైన యీ అవినాభావమును సుకరముగా తెలియుటకుగాను ఉపాసనమునకు స్థూల సూక్ష్మాంగములను శాస్త్రము నిర్ణయించి యున్నది.

ఉపాసనా స్థూలాంగములు :— న్యాస, జప, పూజా, హోమ, తర్పణ, అభిషేక సంపాత పాతము మొదలగునవి.

న్యాసమనగా దేవతా విశేషములనుబట్టి ఆయుధ వర్ణములను దెలుపు ధ్యానవిశేషము. జపమనగా తత్తద్దేవతామంత్ర ఉచ్చారణపూర్వక దేవతాధ్యానము. ఈ జపము త్రివిధము - వాచికము — ఉపాంశు — మానసికము అని భేదములు. వాచికమనగా ఉచ్చారణాత్మకము, ఉపాంశువనగా నెమ్మదిగా (అస్పష్టముగా) ఉచ్చరించుట. మానసికమనగా మంత్రమును మననముచేయుచూ దేవతను ధ్యానించుట. ఇట్లు పూర్వ పూర్వము కన్న ఉత్తరోత్తరము శ్రేష్ఠము. మంత్రమునకు ముఖ్యాంగములు-ఋషి, ఛందస్సు, దేవత, బీజ, శక్తి, కీలక, వినియోగ, కరన్యాస, అంగన్యాసము మొదలగునవి గూడా కలవు - పూజయనగా పూర్వ జన్మమునచేశిన పాపమునూ జన్మమృత్యువులతో గూడిన సంసారమునూ పోగొట్టి సంపూర్ణఫలమును యిచ్చునదిగాన పూజయని చెప్పబడు చున్నది. పూజాంగములు — పాత్ర — వస్తు జాతములుగాక ఉపచారములు 64—32—16—5—1 యీ ప్రకారము చెప్పబడియున్నవి. సామాన్యోపచారములు - 16. హోమము అనగా దేవతను ఉద్దేశించి ఆజ్యాది హవిస్సులను అగ్నిముఖముగా వేల్చుట. హోమాంగములు — కుండ, మండప, స్రుక్, పాత్ర, హవిస్సులు. తర్పణము అనగా తత్త్వాత్మకుడై పరివారసహితుడగు దేవునకు ఆనందమునుకూర్చుట. అభిషేకమనగా, అహంభావము భయమును పోగొట్టి దేహమును పులకింపజేసే ఆనందమును గలిగించునది. సంపాతపాతమనగా శిలాదిమూర్తులయందు మంత్రశక్తిని సమీకరించి దేవత్వమును గలుగజేయుట. ఇవియే ఉపాసనమునకు స్థూలరూపములు. వీనిని గురించి ముందు విపులముగా తెలియజేయబడును.

యీ స్థూలమగు ఉపాసనాంగములవల్ల దేవతా భావము చక్కగా తెలిసి సూక్ష్మమగు నిర్గుణవస్తువును తెలుసుకొనుటకు వీలుగలుగును.

ఉపాసనమునకు సూక్ష్మాంగములు :—

మనస్సుచేత తెలుసుకొనతగు విశ్వాత్మకమైన ఆత్మరూపే దేవుడు. ఆత్మకు దేహకల్పనము చేయుటే న్యాసము. కల్పించిన దేవునియందు అనగా ఆత్మయందు యింద్రియములనూ మనస్సునూ ఉంచి తన్మయను చెందుటయే జపము. (తద్రూపభావనను చేయుట) తన్మయుడై అప్రమత్తతతో నుండుటయే పూజాదికము. ఇతరమగు చింతలను ఆత్మయందు నశింపచేయుటయే హోమము. ఎల్లప్పుడూ దేవతాభావము పొంది ఆనందించుటయే తర్పణము. భగవంతుని స్వరూప వివేచనమువల్ల తాదాత్మ్యమును పొంది ఆత్మాశ్రయమే అభిషేకము. ఈ ప్రకారము దేహమందు అన్తర్యాగము చేయుటయే నిర్గుణమగు ఉపాసనమునకు సూక్ష్మాంగములు.

ప్రపంచమందుత్పన్నమగు జీవులు అనాది మలము వలన పశువులని పిలువబడుచున్నారు.

అనాదిమలసంఛన్నో మాయాకర్మావృతో విభుః
శరీరశివతత్త్వజ్ఞో భేదైకరసికో లఘుః
సర్వదా కర్మ కర్తా చ స్వకర్మఫలభోజకః
నిత్యం విషయసంరక్తః సకలః పశు రుచ్యతే ॥

అనుటవల అట్టి పశువులు అవిద్యవలన ఆణ్వీక, మాయిక, కార్మికములను త్రివిధమలములతో — ఆణ్వీకమల మనగా ఒక్కటేయగు చైతన్యమైన ఆత్మయందు అనేకమైన భేదములను చూచుటయున్నూ అనాత్మయగు దేహమందు ఆత్మను చూచుటయూ అను రెండుదోషములు ఆణ్వీకమలమనబడును. (2) మాయికమలమనగా బ్రహ్మాండసృష్టికి కారణమగు తత్త్వములలో మాయాతత్త్వమూ ఆ తత్త్వమునందు పుట్టిన మిగిలిన తత్త్వములయొక్క మలము మాయికమలమన బడును. (3) కార్మికమలమనగా విహిత నిషిద్ధాత్మకపుణ్య పాపరూప అదృష్టఫలమగు కర్మల యొక్క మలము కార్మికమలమనబడును. యీ మలములతో యేర్పడిన అవిద్యా, అస్మితా, రాగ ద్వేష అభినివేశములనబడు పంచక్లేశములనే పాశములతో బద్ధుడగు జీవుడు (అవిద్య అనగా ఆత్మ అనాత్మ వివేకభావము లేకపోవుటయే అవిద్య. అనాత్మయగు దేహమందు ఆత్మయను విపర్యాసము అస్మితా. అనాత్మయగు దేహముయొక్క భోగము కొరకు ప్రక్చందన వనితాభిలాషము రాగము. అభిలషించిన వస్తువులు దొరకకపోవుట వలన కలుగుభావము ద్వేషము. అనాత్మయగు దేహము అస్థిరమని తెలిసిగూడా అనాత్మయగు దేహముమీద భ్రాంతిత్యాగము చేయలేక పోవుటయే అభినివేశము) శక్తియొక్క అనుగ్రహము లేనిదే ముక్తుడుగాడు. గనుక

శక్తో యయా స శంభుర్భుక్తౌ ముక్తౌ చ పశుగణస్యాస్య।
తామేనాం చిద్రూపామాద్యాం సర్వాత్మనాస్మి నతః ॥

అను అభియుక్తవలన శక్తి అనుగ్రహము అవసరముగనుక ఆగమశాస్త్రములయందు శక్త్యుపాసనము ముఖ్యముగా చెప్పబడియున్నది.

ఇట్లు శక్త్యుపాసనము సర్వదేవతాసమన్వయ రూపమై సర్వతత్త్వబోధకమై కర్మజ్ఞానములకు ఏకత్వప్రతిపాదకమై సర్వశ్రుతిసమ్మతమై (జీవ బ్రహ్మలకు అభేదప్రతిపాదనము) శివశక్తులకు ఏకత్వమును బోధించునదై యున్నది. ఈ శక్త్యుపాసనములో ముఖ్యమగుశక్తి అనేక రూపభేదములతో తంత్రపురాణశ్రుతులలో అనేకవిధ

ములుగా ఉపాసనాసౌలభ్యము కొరకు ధ్యాన విశేషముతో రాధా, సీతా, కాళీ, లక్ష్మీ, సరస్వతి లలితా మొదలగు నామములచే చెప్పబడి యున్నది. ఈ శక్తులను గూర్చి విపులముగా తెలియగోరువారు దేవీభాగవత బ్రహ్మాండ బ్రహ్మవైవర్తాది పురాణములయందు తెలుసుకొనవచ్చును.

పరమకారుణికుడగు పరమేశ్వరుడు పాశబద్ధులగు జీవులను ముక్తులుగజేయుటకుగాను వారివారి సాధనారూపము ననుసరించి ఉపాసనాభేదములను తంత్రరూపములుగా రచించియున్నాడు. ఈ భేదములు కౌళమని, వామమని, మిశ్రమని, సమయమని బాహ్య అంతర భేదములతో వ్యవహ్రియమాణమగుచున్నవి. ఈ మార్గములలో సాధకులు తమతమ అర్హతానుసారము అంతర్బాహ్యములగు ఉపాసనాభేదములతో అర్చించి శ్రీదేవి యొక్క సార్ష్టి సాలోక్య సామీప్య సారూప్య సాయుజ్యము లను పంచవిధ ముక్తులను పొందుచున్నారు. వీనియొక్క భేదములను ముందు తెలుపబడును.

ఉపాసనము బాహ్యము అంతరము రెండు విధములని పూర్వమే చెప్పబడినది. నిర్గుణుడగు పరమేశ్వరుని ఉపాసించుట అంతరమనియూ బాహ్యమనగా మంత్రములద్వారా మండల చక్ర బింబ కలశయంత్రాదులయందు దేవుని సంపాతపాతముచే అర్చించుట.

చిన్మయస్యాఽప్రమేయస్య నిష్కలస్యాఽశరీరిణః ।
సాధకానాం హితార్థాయ బ్రహ్మణో రూపకల్పనా ॥

అనుటవలన సర్వవ్యాప్తమై చిన్మయమై అశరీరమై నిష్కలమైన బ్రహ్మవస్తువు స్థూలోపాధికి గోచరము గాదు గనుక సాధకునకు లక్ష్యముగల్గి అర్చించుటకు గాను రూపమును కల్పించి పూజించుటయే బాహ్యపూజయని తెలియుచున్నది. అంతరపూజ ఐహిక ఆముష్మికఫలప్రదముగను బాహ్యపూజ ఐహికమాత్రఫలముగను శాస్త్రములు నిర్ణయించియున్నవి. ఇట్లు కల్పితమూర్తులయందు దేవతాభావమును ఉంచి పూజించి తాను దేవతాభావమును పొంది క్రమముగా సాధనవల్ల తనకు దేవునకు అవినాభావమును సాధించి మోక్షమును పొందుటయే ఉపాసనారహస్యము.

(4)

ఇట్లు పైన చెప్పినప్రకారము నిర్గుణవస్తువును తెలియుట కష్టముగాన ముందుగా బాహ్యమగు రూపాదులయందు దేవతాభావమును నిరూపించి ఆ దేవతలకు ఆత్మకు ఐక్యతను బోధించి అంతరోపాసనము చేయుటకుగాను శివశక్త్యాత్మకమగు శ్రీ చక్రము శాస్త్రములలో నిర్మింపబడియున్నది. శ్రీ చక్రము శివాత్మకముగను శక్త్యాత్మకముగనూ ఉభయాత్మకమని తెలియుటకు శివచక్రములు నాల్గునూ్న శక్తిచక్రములు అయిదునూ్న కలసి తొమ్మిది చక్రములతో ఏర్పడియున్నది.

చతుర్భిశ్శివచక్రైశ్చ శక్తిచక్రైశ్చ పంచభిః ।
శివశక్త్యాత్మకం జ్ఞేయం శ్రీచక్రం శివయోర్వపుః ॥

అనుటవలన మూలప్రకృతి రూపములగు నవధాతువులు నవచక్రాత్మకములై నవచక్రములూ శివశక్త్యాత్మకములై నవధాతునిర్మితదేహముకంటె శ్రీచక్రము వేరుగాదని తెలుపుటకై దేహచక్రము లకు ఏకత్వమును బోధించుటకు శ్రీచక్రము నిర్మింపబడియున్నది. దేహము శివశక్త్యాత్మకమగు నవధాతు నిర్మితమేగాని వేరుగాదు. తత్త్వరూపమగు దేహము పంచాశత్తత్త్వములయొక్క సంయోగ

మగుటవలననూ తత్త్వములు శివశక్త్యాత్మకములు అగుటవలననూ దేహము శివశక్త్యాత్మకము.

త్వగసృఙ్మాంసమేదోస్థిధాతవశ్శక్తిమూలకాః ।
మజ్జాశుక్రప్రాణజీవధాతవశ్శివమూలకాః ।
నవధాతురయం దేహో నవయోనిసముద్భవః
దశమీ ధాతురేకైవ పరాశక్తిస్తదీశ్వరీ ॥

అనుటవలన దేహము నవయోన్యాత్మకము శ్రీ చక్రము నవయోన్యాత్మకము; యోనిఅనగా కారణ మనుటవలన నవధాతువులు దేహమునకు కారణములు నవధాతువులవల్ల పరిణామము పొందిన నవచక్రములు శ్రీ చక్రమునకు కారణము. ఇట్లే,

ఏవం బ్రహ్మాండముత్పన్నం తద్వద్బ్రహ్మాండమాద్భవౌ
పంచభూతాని శాక్తాని మాయాదీని శివస్య తు ।
మాయా చ శుద్ధవిద్యా చ మహేశ్వర సదాశివౌ
పంచవింశతితత్త్వాని తత్త్వైరంతర్భవంతి తే
శివశక్త్యాత్మకం విద్ధి జగదేతచ్చరాచరం ॥

అనుటవలన పంచవింశతి తత్త్వములచే యేర్పడినది బ్రహ్మాండము. తత్త్వములు శివశక్త్యాత్మకములు అగుటవలన జగతుఅంతయూ శివశక్త్యాత్మకమని తెలియుచున్నది. చరమనగా అండాండరూపమగు దేహము, అచరమనగా బ్రహ్మాండమనియూ గోచరమగుచున్నది. తత్త్వములనగా శక్తితత్త్వములు యిరువదియొకటియున్నూ శివతత్త్వములు నాల్గున్నూ కలశి యిరువదిఅయిదు తత్త్వములు. శక్తితత్త్వములు వరుసగా పృథివీ, ఆప, తేజ, వాయు, ఆకాశ శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ, శ్రోత్ర, త్వక్, చక్షు జిహ్వ, ఘ్రాణ, వాక్, పాణి, పాద, పాయు, ఉపస్థ మనస్తత్త్వములు యిరువదియొకటి, శివతత్త్వములు వరుసగా మాయా శుద్ధవిద్యా మహేశ్వర సదాశివ అనునాలుగున్నూ మొత్తము యిరువది అయిదు అనితెలియుచున్నది. ఇట్లు బ్రహ్మాండ దేహ చక్రములకు సామానాధికరణ్యము వలన ఏకత్వమును శాస్త్రము బోధించుచున్నది. ఇక దేహమునకు చక్రమునకు ఏకత్వమును విచారింతము.

పైన చెప్పిన చక్రగతమగు నవచక్రములలో శక్తిచక్రములు త్రికోణచక్రము అష్టకోణచక్రము అన్తర్దశారచక్రము బహిర్దశారచక్రము చతుర్దశారచక్రము యీ అయిదుశక్తిచక్రములు బిందు అష్టదళ షోడశదళ భూపురత్రయములు శివచక్రములుగాను చెప్పబడినవి. ఇందులో శక్తి చక్రములగు త్రికోణఅష్టకోణ దశారద్వయ చతుర్దశారములు వరుసగా దేహములో మూలాధార స్వాధిష్ఠాన మణిపూరక అనాహత విశుద్ధిచక్రములుగా పరిణామము పొందియున్నవి. శివచక్రముల లోని చతుష్కోణచక్రము ఆజ్ఞాచక్రముగా పరిణామము పొందియున్నది. మిగిలిన శివచక్రములగు బిందు అష్టదళ షోడశదళ చక్రములు శక్తిచక్రములగు త్రికోణమందు బిందువు అష్టకోణచక్రమందు అష్టదళచక్రమున్నూ దశారచక్రద్వయమునందు షోడశదళచక్రమున్నూ చతుర్దశారచక్రమందు చతుష్కోణ చక్రమున్నూ అంతర్భూతమై శివశక్తి మేళనాత్మకమై దేహమందు స్వాధిష్ఠానచక్రమందు మణిపూరక అనాహత చక్రములయందూ విశుద్ధి చక్రమందునూ అంతర్భూతముగానున్నవి. ఇట్లు శివశక్తిచక్రములకు దేహమందుగల చక్రములకూ అవినాభావమును సాధించి పూజించుటచే శక్తి శివులయొక్క తాదాత్మ్యము తెలియుననిభావము. శ్రీ చక్రమందు త్రికోణము శక్తి యనియున్నూ త్రికోణమందుగల బిందువు శివుడనిన్నీ చక్రపూజ శివశక్తులయొక్క పూజ అనియు ఉపాసనమందు శ్రీ చక్రపూజ ముఖ్యమైయున్నది. ఈ చక్ర పూజామార్గములలో అవాంతరభేదములు చాల

గలవు. కౌళమనియూ వామమనియూ సమయ మనియూ వేరువేరుగా గలవు. కౌళములో పూర్వ కౌళమనియూ ఉత్తరకౌళమనియూ రెండు భేదములు గలవు. కౌళమార్గమనగా ఆధారమందు గల కుండలినీశక్తియే కులమని చెప్పబడును. ఆధారచక్రమే త్రికోణచక్రముగా త్రికోణమందు బిందువు శివరూపము గాన త్రికోణపూజారతులు కౌళులు అని చెప్పబడుదురు "ఆధారేబిందు స్తిష్ఠతి" అనుటవలన కౌళమార్గరతులు శ్రీచక్ర మందుగల నవచక్రములలోని త్రికోణచక్రమందు బిందువును పూజించుట పూర్వకౌళమనిన్నీ స్త్రీ యొక్క ప్రత్యక్షయోనిరూపమగు త్రికోణచక్రమును పూజించుట ఉత్తరకౌళమనియూ భేదము. ఇట్లు పూజించుటవలన కులస్థానమగు ఆధార కుండమందు బిందురూపముగు కుండలినీశక్తి ఉద్ధానముగలుగుటయే కౌళులకు మోక్షముగనుక కౌళులు క్షణముక్తులని గూడా చెప్పబడుచున్నారు. యీ ద్వివిధమగు పూజ బాహ్యమే.

వామాచారమనగా శ్రీచక్రాధిదేవతలగు యోగినీరూపముల సమష్టి దేవతయగు శక్తిని పంచమకారములతో (అనగా మద్యము, మాంసము, మత్స్యము, ముద్రా, మైథునము) పూజించుట. యిదియూ బాహ్యమేయగును. శ్రీచక్ర మందలి చక్రదేవతలగు యోగినీ విశేషములు ముందు తెలుపబడును. ఈ మార్గములన్నియూ అవైదికములగుటవలననూ ఐహికసౌఖ్యప్రద ములగుట వలననూ వైదికులకు అనాదరణీయములవి యైయున్నవి.

ఆద్యాచార్యులగు శంకరమతమును అనుస రించి శుభాగమపంచకమురీత్యా ఆంతరపూజ యున్నూ ఐహికాముష్మికఫలప్రదమున్నూ అగు సమయమతము వైదికమగుటవలన సమ యాచారమును విచారింతము. (సశేషము)

వార్తలు — విశేషములు :—

# దేవాలయములు — సంస్కృత భాషాభివృద్ధి

శ్రీ తిరుపతి దివ్యక్షేత్రమునందు గౌరవనీయ మంత్రివర్యులగు శ్రీ కల్లూరి చంద్రమౌళిగారి యాధిపత్యమున గత మే నెల 26, 27 తేదీలలో జరిగిన పండితపరిషత్సభల కనుబంధముగ శ్రీ ఆంధ్రప్రభుత్వపు దేవాదాయ ధర్మాదాయ మంత్రిత్వ శాఖ 9-11-55 తేదీగల జి. ఓ. యమ్. యస్. 2236 ప్రకారం కమిటీ నిర్ణయింపబడినది. అందు ఈ క్రిందివారు సభ్యులు:-

1. శ్రీ పరవస్తు వేంకటరామానుజస్వామిగారు – తిరుపతి.
2. శ్రీ వేదాంతం జగన్నాథాచార్యులుగారు – అప్పికట్ల.
3. శ్రీ ఆర్. పార్థసారథి అయ్యంగారు – తిరుపతి.
4. శ్రీ యస్. టి. జి. వరదాచార్యులుగారు – చిట్టిగూడూరు – మచిలీపట్నం.
5. శ్రీ యస్. సుబ్రహ్మణ్య దీక్షితులుగారు – పుంగనూరు (చిత్తూరు జిల్లా)
6. శ్రీ నాగలింగం వేంకటేశ్వరశాస్త్రిగారు – అమృతలూరు – తెనాలి.
7. శ్రీ నండూరి అప్పలాచార్యులుగారు – సింహాచలం.
8. శ్రీ భాగవతుల అన్నపూర్ణయ్య శాస్త్రిగారు – తెనాలి.
9 ఓరియంటల్ స్కూళ్ళ ఇన్స్పెక్టరుగారు.

ఈ కమిటీకి శ్రీ పరవస్తు వేంకటరామానుజస్వామిగారు అధ్యక్షులుగా నియమింపబడిరి.

శ్రీ సిద్ధేశ్వర పీఠాధిపతులు, శ్రీ గాయత్రీ పీఠాధిపతులు సలహాసభ్యులుగా నియమింపబడిరి. దేవాదాయ ధర్మాదాయ పరిపాలనాశాఖ డిప్యూటీ కమీషనరువారు కార్యదర్శిగాను, ఆరాధన పత్రికా సంపాదకులు ఓరుగంటి వేంకట కృష్ణయ్యగారు కరస్పాండెంటుగాను నియమింపబడిరి.

ఈ క్రింది అంశములను విచారించుటకు ఈ కమిటీ నియమింపబడినది.

(1) దేవాలయముల వలన సంస్కృతభాషాభివృద్ధి.
(2) దేవాలయముల ద్వారా హిందూధర్మ ప్రచారము.
(3) దేవాలయములయందలి అర్చకులకు శిక్షణము.
(4) అర్చనావిధానమునకు వలయు గ్రంథములను, పాఠ్యప్రణాళికను సిద్ధపరచుట.
(5) అర్చకులకును, దేవాలయములను తనిఖీ చేయు డిపార్టుమెంటు ఉద్యోగులకును వలయు యోగ్యతలను నిర్ణయించుట.

పై విషయములను చర్చించుటకు గవర్నమెంటువారి ఉత్తరువున తిరుపతియందు అధ్యక్షులుగు శ్రీ పరవస్తు వెంకట రామానుజస్వామిగారి నివాసభవనమునందు 19-12-55 తేదీన సభావేశ మేర్పరుపబడెను. సమావేశమునకు ఈ క్రింది సభ్యులుమాత్రము హాజరైరి

1. శ్రీ పరవస్తు వెంకటరామానుజస్వామిగారు.
2. శ్రీ యస్. టి. జి. వరదాచార్యులుగారు
3. శ్రీ ఆర్. పార్థసారథి అయ్యంగారు.
4 శ్రీ యస్ సుబ్రహ్మణ్యదీక్షితులుగారు

సమావేశమునందు దేవాలయములద్వారా సంస్కృతభాషాప్రోత్సాహమునకు వలయు విధానములను చర్చించిరి.

దేవాలయముల ద్వారా హిందూధర్మ ప్రచారమును చేయుట — ఆగమ పాఠశాలలు నెలకొల్పుట మున్నగు విషయములను చర్చించిరి.

శ్రీ వేదాంతం జగన్నాథాచార్యులుగారు అర్చనాపద్ధతికి వలయు గ్రంథములు - పాఠ్యప్రణాళికను నిర్ణయించుట మఱియొక సమావేశమునందు జరుపవలెనని కోరుటవే అట్లు చేయబడెను. సమావేశమున కందరు రానందున అన్ని అంశములను మాత్రము చర్చించి, తీర్మానములు నిర్ణయించుటకు సమావేశము వాయిదా వేయబడెను.

తరువాతి సమావేశము జనవరి 10-వ తేదీ ప్రాంతమున సింహాచలమునందు జరుపుటకు నిర్ణయింపబడెను.

# "A PAGEANT OF INDIAN PHILOSOPHY"

*By*

Sri N. RAMESAN, M.A., I.A.S.
*(Deputy Secretary, Home Department).*

*(Continued from previous Issue)*

### Chapter VI

### "The Upanishads ; their general characteristics"

The Upanishads, as we saw earlier, are the last part of the Vedas and form part of "Vedanta", which means literally the "end" or "*anta*" of the Vedas. It is an accident, though a happy one, that the Sanskrit word "anta", also means, the summit or the acme of a teaching, and the Upanishads, which embody the best in the thought of ancient India, came to be regarded as the last word on the teachings of the Vedas. It is difficult to clearly make out, how exactly the word "upanishad" was derived. Sankara, in his introduction to his commentary on "Katha-upanishad", defines the word "upanishad" as follows:

"सदेः धातोः विशरणगत्यवसादनार्थस्य उपनि-पूर्वस्य क्विप् प्रत्ययान्तस्य रूपमिदं 'उपनिषत्' इति। उपनिषच्छब्देन च व्याचिख्यासितग्रन्थप्रतिपाद्य-वेद्यवस्तुविषया विद्या उच्यते।

"The word Upanishad is derived from the root षद् to loosen, to reach or to destroy, with उप and नि as prefixes and क्विप् as termination. The word means knowledge or 'vidya' of the entity, which is to be known, and which is to be the subject matter of this treatise."

Other commentators have interpreted it differently as "sitting" (sad) "near by" (upa) 'devotedly" (ni). Happily the word "upanishad" occurs in the body of the upanishads themselves, and in the context, the most probable meaning, that can be given to it, is that it is a "secret knowledge." The knowledge that they profess to teach, was not something that can be had casually, but only by dint of hard study and meditation, and hence the knowledge was kept a closed book, to be revealed by the knower, to the student, only after the latter has proved his worthiness, by austerity, devotion, service, and deep cogitation. That this is the most probable view of the matter will be evident when we consider the fact, that the upanishads, are not a set body of books, preaching any particular doctrine. It is not a book say like the Bible or the Quran, which have a certain unity of purpose, a cohesion of ideas, pointing out to a fixed goal. The upanishads are not any well thought out and preplanned books or treatises, by a single author, developing a particular doctrine. They are rather in the nature of memory aids to a teacher, who instructs personally, a disciple in the knowledge of the self. The greatest emphasis has always been laid, in India, in acquiring knowledge from a preceptor, or Guru. The idea of either learning a doctrine from books, or preaching them solely through a written book, has been foreign to Indian thinking. Knowledge has always been imparted only by oral tradition from a Guru or (Achārya) to a student or (Anthēvāsi). Propagation for the general public was done by public

debates only. In accordance with this tradition, the upanishads are not conceived as any formulated doctrines, but rather as suggestive phrases, thrown here and there, without any visible and cohesive link between one thought and another. The Guru was expected to supply the missing links. Moreover the upanishads, purporting to teach the science of self, transcend the three modes of waking, dreaming, and sound sleep, and suggest a cosmic consciousness or "Turīyā" state. This state which transcends our categories of description, and is beyond time, space, and causation, cannot by its very nature, be grasped, as an intellectual perception, by the use of reason. The ultimate experience, is not that can be logically deduced or proved, but has to be realised by insight and intuition. To develop this power of intuition, the student is taken, step by step, by the process of reason only, to as far as human thought can reach, and then told to meditate upon the ultimate which is beyond even the farthest point to which human intellect and reason can take him. As a result of this meditation, called "nididhyāsana," the student, transcends reason, and intuits the reality. Intuition thus is not a negation of reason, but rather its fulfilment. This technique is called "Arundhati Nyāya". The teacher points to the "Arundhati" star in the heavens, with his fingers. The student, if he is to see the star, must closely follow the teacher's hand, right from the shoulder to the finger tip, and then take a "Jump" from the finger tip into the void, in the same direction, if he is to see the star. The hand pointing at the star is the intellect pointing at the possibility of an Absolute, viz. the star. The student has first, to see the concrete hand, i.e. should first intellectually satisfy himself, and then take a 'Jump" to see the star and intuit the reality. The upanishads, being merely practical guides for students to know the real, give certain suggestive and mystic passages or even words as for e.g. "Tajjala", or "Tat Tvam Asi" or the *pranava* "Om", and ask the student to meditate on these words, as an effective method of intuiting the reality. The text of the upanishads, being thus, not conceived, as a rigorous set of rules expounding a particular dogma, but being rather, a practical guide, under the personal instructions of a guru, to help a student, contains, many passages, whose meaning is very difficult to grasp, and many ideas which seem to be incoherent with each other. These were intended to be supplemented by the personal instructions of the teachers without which the text would not be quite whole. Hence these texts were thought of as a "rahasyam", not to be freely bruited about, and it is in this sense of something secret. That the word "upanishad" is used in the "upanishad" itself.

The upanishads are the end of the vedas, and each veda has its own set of upanishads. The tradition is that originally there were 108 or even more number of upanishads. But Sankara accepts only about a dozen of these as wholly authentic, and has commented on them. The minor upanishads contain many details of meditation and the 'Siddhis' or occult powers that one can attain by following those methods. For purposes of tracing the development of the thought and philosophy of India, a study of first ten upanishads will suffice. The following table compiled by Swami Sharvananda will give a broad idea of the entire body of Vedic scripture, available to us.

| *Samhita* | *Brahmana* | *Āranyaka* | *Upanishad* |
|---|---|---|---|
| 1. Rig veda | (1) Aitareya | 1. Aitareya | (1) Aitareya |
| | (2) Koushitaki | 2. Koushitaki | (2) Koushitaki |
| | (3) Paingi | | |
| | (4) Shattayana | | |
| 2. Krishna Yajurveda | (5) Taittiriya | 3. Taittiriya | (3) Taittiriya |
| | (6) Ballavi | | (4) Katha |
| | (7) Satyayani | | (5) Swetasvatara |
| | (8) Maitrayani | | (6) Narayana |
| | (9) Katha | | |
| 3. Shukla Yajurveda | (10) Shatapatha | 4. Shatapatha | (7) Isha |
| | | | (8) Brihadaranyaka |
| | | | (9) Jabala |
| 4. Samaveda | (11) Sama vidhana | | |
| | (12) Mantra | Nil | (10) Kena |
| | (13) Arsheya | | (11) Chandogya |
| | (14) Vansha | | |
| | (15) Daivatadhyāya | | |
| | (16) Talavakara | | |
| | (17) Tandya | | |
| | (18) Samhitopanishad Brahmana | | |
| 5. Atharvaveda | (19) Gopatha Brahmana | 5. Mundaka | |
| | | 6. Manduka | Nil |
| | | 7. Prasna | |

Thus these forty-two books quoted about exhaust the vedic scriptures.

Many of the upanishads are pre-buddhist *i.e.*, before 6th century B.C., though their exact dates cannot be fixed. Some of them are post-buddhist and belong to 300 or 200 B.C. The style of the upanishads is very elliptic and suggestive Some are in prose and some in poetry and some in a combination of both. But reading the upanishads as they are, one cannot fail to respond to a throb and thrill of mighty minds, working on the eternal verities and problems of life. Apart from the loftiness of thought enshrined in these memorable records of man's first attempt to solve the riddle of the self and the universe, the very style suggests, a pulsating life and vigour beneath the surface, which can only be felt by a sympathetic soul, brought up in Indian tradition and culture. It is a great pity that we know nothing of the authors of the upanishads. Those mystic seers were more interested in the matter that they taught, than in themselves. And even while recording their compositions, they chose to foist them on Gods like India, Yama, etc., than on themselves. Still we do get very human glimpses of tense situation and exciting drama in the upanishads. Yajnavalkya in the Brihadāranyaka upanishad, being dis-

gusted with ephemeral pleasures, decides to quit and wants to devide his all, among his two wives Maitreyi and Kātyāyani. To one he gives his wealth, and to the other his wisdom. He expounds his knowledge of wisdom and reality, by way of answers to the questions of his wives. The characters are vividly brought before our eyes in this famous dialogue. Simila·ly in the great assembly of King Janaka, Yajnavalkya, stands up, as a giant among pygmies, and offers debate to a host of learned pundits and purohits. To each he gives according to his lights and silences the questions of such mighty thinkers as, Ārthabhāga, Bhujyu, Ushasta, Kahōla, Uddālaka etc., etc., in Janaka's court, by his knowledge and skill. Here the very picture of the court hall, the eager listeneıs, the pretentious pundits, and the really wise Yagnavalkya, are vividly delineated Similarly who can fail to appreciate the tense drama in the Katha upanishad, when Vājasrava, performing a mighty sacrifice where he had to renounce his all, is pestered by his son 'Nachikētas', who went on asking his father, to whom he was going to sacrifice the son. In a fit of temper, the father burst forth "To death do I sacrifice thee." Having said it, he felt the remorse at once, but his word having been given, the son is borne on to the abode of Yama, god of death. There he had to wait for three days and to atone for this discourtesy shown to a guest, Yama offers him three boons, one for each of the three days. Who can fail to be touched, by the filial duty and devotion of Young Nachikētas, who stands before the god of death, and asks as a first boon.

"शान्तसङ्कल्पः सुमनाः यथा स्यात्, वीतमन्युः गौतमो माभि मृत्यो" (Katha ; I—10)

"O god of death ! As the first of three boons I choose that Gautama (my father) may be cheerful, and free from anxiety and may have his anger pacified.'

Or the scene changes to a peaceful Tapovana of a Guru. Some disciples approach the master and ask to be instructed as in the "Prasna upanishad". Details of the names and countries of persons are minutely given. Here the master is said to be "Pippala" and six disciples approach him, with 'Samith' or firewood, in their hands, as a mark of respect and ask to be instructed,

"सुकेशा च भारद्वाजः, शैब्यश्च सत्यकाम, सौर्यायणी च गार्ग्यः, कौशल्यश्चाश्वलायनः, भार्गवो वैदर्भिः, कबन्धी कात्यायनः, ते हैते ब्रह्मपराः ब्रह्मनिष्ठाः, परं ब्रह्मान्वेषमाणाः "एष ह वै तत्सर्वं वक्ष्यति" इति, ते ह, समित्पाणयः, भगवन्तं पिप्पलादमुपसन्नाः'

(Prasna ; 1—1)

"Sukesas, son of Bharadvaja ; Satyakāma son of Sibi (Saibya) ; the grandson of Surya who belonged to the Garga Gotra ; Kousalya the son of Aswala ; Bhargava from Vidarbha (वैदर्भि) Kabandin the son of Katyayana ; All these persons were devoted to the Supreme Brahman were steadfast in their search for Brahman, and were anxious to know the truth of Brahman. With fuel in hand, they approached 'Pippala' the master, thinking, "Here is he, who knows all this".

The details given above are so graphic that we cannot doubt that they were historical persons. Similarly in Chandogya upanishad, we have a human situation, when the son 'Swetakethu' arrives back after a course of study. His father 'Uddālaka', who thinks that his son, has got only intellectual knowledge and not that intuitive vision of Brahman, which alone constitutes real

knowledge, proceeds to question his son and tests his knowledge. Finding that his suspicions were well founded, he proceeds to instruct his son. This is a dramatically human situation where a father tests his homecoming son, finds him a bit of an ignorant prig, and proceeds to teach him true knowledge. Instances can be multiplied from the other upanishads. It is therefore clear that the upanishads were not mere impractical outpouring of world renouncing Sanyasins, but extremely practical hints at knowledge conceived and taught, in human situations. It is this that makes their study so important. The fact that we know so little of the authors of the upanishads. should not blind us to the fact, that they were human beings, whose utterances were addressed to others in mental suffering and in search of peace. Though we know practically nothing of the authors of the upanishads, we can still revere some names as Yāgnavalkyā, Raikva, Sāndilya, Bālāki, Pratardana, Kātyāyani, Gārgi, Maitreyī, Satyakāma, Jābāla, Mahidāsa, Ajātasatru etc. etc.

The upanishads, were in a sense, a revolt against the sacerdotalism and soulless liturgy of the Brahmanas. The early Hymns of the Rigveda, with their vivid and joyous expressions, had given place to minute details of ritual of the Brahmanas. The result was that religious life became mechanical. All that a man had to do, was to observe the various sacrifices prescribed in the vedas, with the help of the Brahmins the priests, and the results were guaranteed either here or in the hereafter. Life was conceived of as a contract with the divine, whereby certain favours were shown as a quid *pro quo* for certain rituals and sacrifices, or if they were not tangible and visible here, in this world, went to the credit of one's spiritual account with god in the other world. This spirit found great favour later on, with the "Pūrva-Mīmāmsikas" whose grip on the life of the body-politic, was shattered only by the devastating logic and satire of Sankara. In such an atmosphere, spiritual or philosophical thought got stultified and man's inner quest, was not satisfied. The problems which the upanishads attempt to solve, are the eternal problems that haunt humanity from the dawn of thinking, such as, "Does God exist"?, "Is there a soul"?, "Is Death the end of all"?, "If so, why should man be moral"?, "If not, does the personality survive death"? "What is the aim of the Universe, assuming that it has one"?, "Can man know it"?, "Whither are we, whence come, and where going"?, "Is there any sense or purpose in living"? etc. etc.,. These questions go to the very root of every human beings thinking and no one can escape them, as a man cannot run away from his shadow. Man may forget these, but sooner or later, a strange yearning grips him. He finds his soul restless and needs peace and calm, which no amount of wealth or fame can give. All the pleasures of the world, being born of the senses, loose their 'kick' with familiarity, and sooner or later a disgust comes over one. Or the thought of death, which is a universal deterrent, always makes man pause in his mad rush of activity, and asks him a silent question "To what end is all this"?. No thinking man can escape these fundamental questions. When Nachikētas, was granted three boons by Yama, the god of death, he chose as his third boon, this

knowledge of death and what it does to a man.

"येयं प्रेते विचिकित्सा मनुष्ये ' अस्ति इति एके,' 'नायं अस्ति इति चैके'। एतन् विद्यां अनुशिष्टः त्वया अहं. वराणां एष वरः तृतीयः"
(Katha upanishad I-20).

"This then I ask of you as my third boon. There is a doubt among men that when they become corpses (प्रेत), some say "He exists", while some others say "He exists not". This I should like to know, being taught by thee".

Yama tries to dissuade him from this strange quest, and offers him herds of cattle, horses, elephants, sons, grandsons, empires on earth, and illustrious Apsara damsels to serve him, and what is more, offers him as many years of life in this world, as he wishes to enjoy Nachiketas turns a characteristic reply of a man, who is deeply disturbed about the verities of life, and disgusted with the pleasures of the sense.

"श्वोभावा मर्त्यस्य यदन्तकैतत् सर्वेन्द्रियाणां जरयन्ति तेजः" (Katha—I-26)

"All these are ephemeral (श्वोभावा means whose existence cannot be guaranteed till to morrow even) and they wear out the sense vigour of the mortal (meaning that pleasures pall after a time).

"न वित्तेन तर्पणीयो मनुष्यो"
(Katha—I-27)

"Man never gets satisfied with wealth" etc. etc. Yama after testing him further agrees with him that without a knowledge of the reality, life is worthless.

"अविद्यायामन्तरे वर्तमानाः स्वयं धीराः पण्डितं मन्यमानाः। दन्द्रम्यमाणाः परियन्ति मूढाः अन्धेनैव नीयमाना यथान्धाः" (Katha—2-5)

"Wallowing in ignorance themselves but in their pride, the ignorant fools conceiving themselves to be 'panditha's,' go round and round, staggering to and fro, like blind men being led by blind". Such fundamental questions demand an answer from human hearts. The same spirit of daring enquiry is visible in the Taittiriya upanishad where Bhrigu the son of Varuna, approaches his father, and asks him to be taught the knowledge of Brahman. The father replies

'यतो वा इमानि भूतानि जायन्ते। येन जातानि जीवन्ति। यत् प्रयन्त्यभिसंविशन्ति। तत् विजिज्ञासस्व। तत् ब्रह्म इति"
(Taittiriya-Bhriguvalli).

"Know then that Brahman is that entity out of which all these creatures are born, being born by which they live and having departed into which they enter. Seek to know that".

The father, after having given this definition takes his son step by step, from matter as the source of Brahman, to life, intellect, and finally to Bliss. These questions, if once asked, had to be solved and the soulless ritual of the Brahmana period, failed to satisfy these restless souls. There was thus a need to restate the philosophy of life, to give a new reorientation to thinking, to evolve altogether a new way of life and thought, if man was not to be eternally damned. It is to the credit of the thinkers of the upanishads, that they realised this need, and saw the danger of allowing the Brahmanical liturgy to swamp and destroy the soul of man, and attempted to resuscitate the religion of the spirit and the philosophy of the soul, from the clutches of a mechanical formalism. The upanishads are thus mainly an attempt to repudiate the ritual and liturgy of the Brahmanas, and restore the doctrine of the soul to its pristine prestige. They also filled an

actually felt need, a keenly felt restlessness of the soul. that failed to be cowed down by sacrifices and yagnas, and clamoured for an answer to their pressing questions. It is to the eternal credit of the philosophers of the Upanishads, that they attempted to satisfy this felt-spiritual need of seeking men, and at the same time, saved society from falling a prey to ritual.

Whenever a conscious attempt is made by some foreseeing souls, endowed with vision and insight far above the ordinary to divert the current of human thought, into new channels, they are always up against the clamour of vested interests. The upanishadic seers were keenly aware of this danger and wanted to avoid controversy in the realm of the spirit. Moreover, whenever a revolutionary uprooting of certain fixed ideas takes place, no matter whether they were correct or incorrect, there is always an inherent danger, that one may end at merely uprooting something, without substituting anything in its place. The upanishadic seers saw the truth of this statement with their characteristic sagacity and shrewdness and which truth we in the modern age, are not even aware of viz. that mere rootlessness is *not* enlightenment, and that tradition with all its drawbacks is preferable to merely creating a vacuum in its place. The danger of the baby being washed away along with the tub-water, was fully realised by them. Also it would be more easy to convince people, if one were to preserve one's old customs etc., and merely try to refine them, instead of completely altering them. This will satisfy the vested interest, and assure, the conservative, that nothing revolutionary is happening. Most important of all, it was in keeping with the tradition of India, which always believed in assimilation, to change the character of the Brahmana ritual, to bring it in line, with the upanishadic philosophy. For all these reasons the upanishads did not completely abolish the ritual of the Brahmanas, but converted its spirit. A sacrifice was no longer a mere act of ritual. It was given a deeper significance. The sacrifice was in the heart and not in the external action. By similar other devices they attempted to win back the dominance of the truly spiritual element from the clutches of the purely formal one. A classic example of this occurs in the Brihadāranyaka upanishad. There the concept of "Aswamedha Yagna" was spiritualised. The sacrifice was no longer a blind performance of certain rites. The several rites were endowed with mystic qualities and the whole sacrifice was conceived of as a spiritual act of self-surrender, and not a mere act of killing the horse. The idea of the horse sacrifice is kept up as a sop to the vested interest, and the time at heart, who cannot easily break away from tradition, but the whole thing was given a new twist and a deeper significance. The Aswamedha is thus transformed into a meditative sacrifice, where the man has to offer up the whole universe instead of a mere horse, and by thus truly renouncing everything attain to true freedom, a result analogous to the overlordship of the ritual aspect of the Aswamedha. By similar means, knowledge of the self, is restored to its proper place, and sacrifices are ennobled by being turned into subjective sacrifices in meditation, instead of objective ones during a ritual. However in some pages a direct assault is made on rites as in the

following passage of Mundaka Upanishad:

" प्लवा ह्येते अदृढा यज्ञरूपा: अष्टादशोक्तमवरं येषु कर्म। एतच्छ्रेयो येऽभिनन्दन्ति मूढा: जरामृत्यु ते पुनरेवापि यान्ति "

(Mundaka—2—7)

"Only fools and ignorant persons, praise these eighteen fold yagnas, which is indeed a very frail raft to hang on, and those fools who praise these sacrifices, as the supreme good, get old age and death again and again!"

There is another devastatingly satirical passage in the upanishads, where a body of priests is likened to a body of dogs, each holding the tail of the other, and going in a procession like the priest going in procession round the fire. Though these are symptomatic of the spirit underlying the upanishads, still the upanishad, by and large, adopt the conciliatory method of reforming the ritual. We can now proceed to study the philosophy that the upanishads teach.

(*To be continued.*)

---

ओं

आप्यायन्तु ममाङ्गानि वाक् प्राणश्चक्षु:

श्रोत्रमथो बलमिन्द्रियाणि च सर्वाणि ।

सर्वं ब्रह्मोपनिषदं माऽहं ब्रह्म निराकुर्यां

मा मा ब्रह्म निराकरोदनिराकरणमस्त्वनिराकरणं मेऽस्तु ।

तदात्मनि निरते य उपनिषत्सु धर्मास्ते मयि सन्तु ते मयि सन्तु ॥

ओं शान्ति: शान्ति: शान्ति: ॥

Om, May my limbs, speech, breath, eye, ear strength and all senses become perfected. Everything is the Brahman proclaimed in the Upanishads, May I never deny Brahman. May Brahman reject me. May there be no denial at all. May there be no denial at least from me. May I, who am devoted to the Atman be endowed with all the virtues taught in the Upanishads.

*Om, Peace, Peace, Peace.*

# TEMPLES VIII

*By*

YATHARTHAVADI

## DEEPARADHANA

In the last article (Temples—VII), it was seen that the bhakta, the Upasaka and the Jignasus (जिज्ञासुः) had their eyes opened and their doubts cleared by the flood of light thrown on them at the time of Deeparadhana, in the temple. We shall now examine, what this Deeparadhana indicates.

Either in the temple or in the house, Deeparadhana is practically the final item of worship. The Lord says in the Bhagavad Gita, Chapter X, Sloka 11,

"तेषामेवानुकम्पार्थमहमज्ञानजं तमः ।
नाशयाम्यात्मभावस्थो ज्ञानदीपेन भास्वता ॥"

("Out of pure compassion for them, dwelling within their self, I destroy the ignornance-born darkness by the shining lamp of wisdom.")

When we stand before God in the temple begging for Jnanabhiksha, the Lord reciprocates as said above. It is in this aspect that God is worshipped as Guru in the third charana of the Gayatri "धियो यो नः प्रचोदयात्" ("One who shall kindle our knowledge) We approach God in the temple through the first charana of Gayatri as "तत्सवितुर्वरेण्यं" ("That which is our goal to be obtained") Through the various items of worship starting with Snana and ending with Nivedana, we pass through the second charana of Gayatri "भर्गो देवस्य धीमहि" ("His effulgence in all aspects should be known").

And as stated above, we pass through the third charana of Gayatri at the time of Deeparadhana. Our great Upanishad makers have been able to see God in the Vahni Sikha (वह्निशिखा) (Flame of the lamp) the lamp that is lit in their hearts. 'तस्य मध्ये वह्निशिखा अणीयोर्ध्वा व्यवस्थितः' Others saw it as a spark of lightning in a dark cloud. 'नीलतोयदमध्यस्था विद्युल्लेखेव भास्वरा' Alwar Vishnuchitta also seems to have realised in a similar way in his Divyaprabandham "తడవర్రై వాయ్ మిళిర్న్దు మిన్నుం ధపర్ నిఱుంకొడిప్పోల్, కుడరాళియాయ్ ఎన్నెంజినుళ్ళైత్తోంద్రుం ఎన్ శోదినంపి !" (This is an exact translation of the Upanishad sentence "नीलतोयद ." etc.) Others saw in the centre of the flame, God, the Hari, the Hara, the Bhrahma, the Indra, the Purusha and the Swarat.—"तस्याः शिखाया मध्ये परमात्मा व्यवस्थितः । स ब्रह्मा स शिवः स हरिः सेन्द्रः सोऽक्षरः परम स्वराट् ॥" The flame of the deepa which we show to God in the temple, represents the वह्निशिखा in our hearts. The deeparadhana—the physical flame or fire of the lamp—is only to light or kindle the spiritual flame in us. The Akhanda deepam that should be kept aflame throughout day and night in the Garbhagruham, represents the same idea. Our Rishis of lore were doing their Aradhana and realising their object of Tapas through the flame of the sacrificial fire (यज्ञ). It is out of the flame of the sacrificial fire that Dasaratha obtained the Payasam, the nucleus for Rama's avatar. It is this flame (वह्निशिखा) that Sita entered and got an apparent purification for her having been in impure Lanka before she took her seat on the lap of Rama.

Five thousand years ago, three great Yogis were wandering in parts of South India. They were mystic poets, realised souls, those who could see the divine in the mundane. But they were Mounees (मौनी). God desired that the truth in their hearts should flow out. He made them meet by accident in the village of TIRUKOILUR. It rained heavily and the three Mounees had to take shelter in an ill-lit path way of a small house. They met but never talked to each other. In the darkness and in the silence they suddenly saw the Lord's Trivikramarupa with one foot on earth and the other foot in the air. Seeing the vision, they wanted to worship Him and do deeparadhana to Him. Finding no lamp that would be sufficiently big for His form, the first Mounee said "Oh Lord! where is the lamp that is big enough for your form? I shall therefore, after the whole earth as the lamp, all the seas as the ghee and the Sun the lighted flame for your deeparadana." The second Mounee heard this and said, "My dear Sir, how can a combination of lamp, ghee and flame bring about a deepam without a wick. Kindly allow me to supply that. Let my mind which is melting like paraffin at the thought of God, be the wick for your lamp" The Jnana deepa was lit by both the Mounees and the third Mounee described the Lord as he saw Him with the help of the lamp lit by the other two. Their sayings form the beginning of the four-thousand Divyaprabandhams and these three Mounees came to be called the first three Alwars.

That this वह्निशिखा is the instrument of action in the removal of ignorance and kindling of knowledge can also be seen from the following instance from the Srimad Ramayana.

Everything is ready for the marriage of Sita with Rama. Between Rama and Sita in the Vivahamantapa, the sacrificial fire is aflame illuminating the whole space. Rama is on one side and Sita is on the other. Their hands are to be stretched over the fire and the Panigrahanam is to be done. Janaka the father of Sita, now looks at Rama and again at Sita, with a view to giving away Sita to the Lord. All the time he had believed that Sita was his daughter and he was going to give his daughter in marriage to Rama. Now, when he sees them in close quarters before the fire, he sees them in a new light. A doubt arises in his mind, as to the correctness of the procedure in the celebration of the marriage. He says, इयं सीता मम सुता? (with a question maik). He asks himself, "Is this Sita my daughter?". Or सहधर्मचरी तव? (with a question mark) addressing Rama, "Is this not your already wedded wife?". This doubt arose in his mind because he saw like the Alwars, Narayana in Rama, and His inseparable consort Mahalakshmi in Sita. If that is so, how were they be seperated? Rama comes from Ayodhya and Sita had been at Mithila all along and they had been seperated so long! Yes, it all happened by an accident. Narayana and Mahalakshmi started in their Vimana from Vaikunta to earth for Ramavatara. A Vimana crash has to be presumed for the purpose of the story. As a result, Narayana fell into the sacrificial fire of Dasaratha at Ayodhya and Mahalakshmi fell on earth which was being ploughed by Janaka for his Yagna at Mithila. The one developed as Rama

మందు వేంచేపుచేసి మూర్ధాదిగా సుగంధతైలమును బూసి, చింతపండు, ఇసుక, శీకాయపొడి, గడ్డికాల్చిన మసి, ఉసిరికాయ, మొదలగు- ఆయాబింబశోధన కనుగుణమగునట్టి ద్రవ్యములతో నలిగిడి, శుద్ధోదకముతో శోధనము చేయవలసి యున్నది. పర్యంకాసనముచేయబడనట్టి స్థానములందు, ఈ నిత్యస్నపనమంతయు, సాలగ్రామమూర్తికి చేయబడుచుండుట గమనీయాంశము. పర్యంకాసనముఁ చేయబడుచున్న స్థానములందు బింబశుద్ధిరహితముగా బింబము నర్చాపీఠమందు వేంచేపు చేయుట ధర్మవిరుద్ధము. [నా పర్యవేక్షణలో ఈదురాచారమును చూచి ప్రశ్నించగా, దేవాలయాధికారులు స్నపన నిమిత్తముగా మాకుద్రవ్యమీయని కారణముచే, మేము చేయజాలకున్నామని సమాధానము చెప్పినారు. ముఖ్యముగా ఇదియే కారణమగుచో ఇకమీదట దేవాలయాధికారులు బింబశుద్ధికొరకు కాతగిన ద్రవ్యమును బోర్డువారి వలన శాంక్షనుపొంది అర్చనాంగములలో ముఖ్యమగు బింబశుద్ధిని చేయించి ధర్మసంత్రాణము చేయగలందులకు కోరబడుచున్నారు. ఇదియునుంగాక, అన్ని ఆలయములందును విష్ణుపంచక దినములలోని ప్రతి ఏకాదశికొకమారైనను, ఆలయగత సర్వబేరములను పాత్రపరిచ్ఛదాదులను పరిశుభ్రపరచుటకు, కాతగియున్న ద్రవ్యముల నిప్పించి పరిశుభ్రపరపించి విగ్రహారాధన ధర్మమును కాపాడగలందులకు కోరబడుచున్నారు. (శ్లో) ధర్మోహ్యాధర్మం గ్రసతే, ధర్మో రక్షతి వై ప్రజాః। ధర్మ ఏవ హతో హన్యాత్, ధర్మోరక్షతి రక్షితః॥ ధర్మ వర్తనులు సుఖమందుదురు, ధర్మము ప్రజారక్షకమైనట్టిది, ధర్మము అధర్మమును నశింపజేయును. ధర్మమును రక్షించినచో మనల కాపాడగల సామర్థ్యము, ధర్మమునకు కలుగుచున్నది. అట్లే ధర్మమును నశింపజేయువారిని నశింపజేయు సామర్థ్యముకూడ ఆ ధర్మమే కలిగియున్నదని ఇందలి పరమార్థము.]

బింబశుద్ధికి పిమ్మట ఉపచారక్రమమందు చేయబడు స్నపనోపచారము ప్రోక్షణమాత్రముగా చేయవలసినదని శాస్త్రకారులు చెప్పియున్నారు. అప్పుడును సాలగ్రామమూర్తికి శుద్ధస్నపనమార్గ మనుకరించి స్నపనము చేయబడుచు నేయున్నది. పర్యంకాసనము చేయబడనట్టి స్థానములందును పర్యంకాసనముచేయబడుచున్న స్థానములందును కూడ స్నపనోపచారము సాలగ్రామమూర్తికి జరుపబడుచుండుట పూర్వాచార్యపరిక్షుణ్ణ సాంప్రదాయము (ఋం) వారీశ్చతస్ర ఇతి పురుషసూక్తేనచ వారిణా సంస్నాప్య (మం) వారీశ్చతస్రస్సదృశః కవీనాం పత్న్యః ప్రత్యావరితాఽక్షరఞ్చ, భూయోభూత్యైభువనస్యపుష్ట్యై స్నాయీత యస్సంగతం స్నాపయామి, (పదము) వారీః, చతస్రః, సదృశః, కవీనాం, పత్న్యః, ప్రత్యావరిత, అక్షరన్, చః భూయః, భూత్యై, భువనస్య, పుష్ట్యై, స్నాయీత, యః, సంగతం, స్నాపయామి, సదృశః=అన్యోన్యసమాః చతస్రః=ప్రాగ్దక్షిణ పశ్చిమోత్తర స్థితిత్వేన, చతస్రత్వం గతాః, వారీః=తోయాని, అర్థాత్సముద్రాంతస్థాని సర్వాణి తోయానీత్యర్థః, (వారిశబ్దస్య స్త్రీత్వం ఛాందసం,) అక్షరణ్=అవికుర్వణ్, ప్రత్యావరిత=స్వమహిమ్నాసమావృత, దేవదేవ భువనస్య=చతుర్దశభువనాత్మకస్య, కవీనాం = ప్రజాపతీనాం, పత్న్యస్తవ, భూయోభూత్యై = మహదైశ్వర్యాయ, పుష్ట్యై=శరీరకాంత్యై, స్నాయీత, స్నానంకుర్యాత్, హేదేవాః, మదీయమాహ్వానం శ్రుత్వా యశ్చదేవః సంగతః పూజాగ్రహణాయ సమ్యక్ప్రాప్తః, తం, స్నాపయామి, భవంతః పశ్యంత్వితి శేషః.

(తా) మహామహిమవంతుడవై సముద్రోదకముల వ్యాపించియున్న దేవదేవా! బ్రహ్మాదులకు నియంతవైన నీవును, ఆతిథ్యమందుటకు స్నానముచేయవలెను. కర్మసాక్షులైన దేవతలారా, నాపిలుపువిని, నాచేయు సత్కారములందుటకు విచ్చేసిన దేవదేవుని, స్నానోపచారమున ఉపచరించుచున్నాను (చూడుడని భావము) పురుషసూక్త భాష్యము విద్యారణ్యులు మొదలగు వారు వ్రాసియుండిరి. పదమూడవ ఉపచారము ప్లోతము (ఋం) మిత్రస్సువర్ణ ఇతిప్లోతేన విమృజ్య (మం) మిత్రస్సువర్ణశ్చంద్ర ఇన్ద్రోరుద్రస్త్వష్టావిష్ణుస్సవితా గోపతిస్త్వమ్। త్వంవిష్ణుభూతానిత్రాసి దైత్యాస్త్వయావృతం జగదుద్భైన గర్భః॥ (పదము) మిత్రః సుపర్ణః చంద్రః ఇన్ద్రః అధ రుద్రః త్వష్టా

విష్ణుః సవితా గోపతిః త్వం విష్ణుః భూతాని తు త్రాసి దైత్యాః త్వయా ఆవృతం జగత్ ఉల్బేన గర్భః ॥ హేవిష్ణో, మిత్రాది సకలదేవతాస్వరూపీ=త్వమేవ విశ్వవ్యాపనశీలస్త్వం, దైత్యాః=నియంతా, భూతాని =స్థావరజంగమాదీని, తుత్రాసి=పాలయసి, ఉల్బేన= జరాయుణా, ఆవృతో గర్భఇవ, త్వయాసర్వమిదం జగదావృతం ॥

సకల దేవతాస్వరూపివైన దేవదేవా, విశ్వవ్యాపన శీలుడవైన నీవు నియంతవై, చరాచరభూతముల నన్నిటిని రక్షించుచున్నావు, మాయచే గర్భమావ రించబడియున్నటుల విరాడ్రూపివైన నీచే సమస్త జగత్తును ఆవరించబడియున్నది. ఇట్టి మహామహిమ వంతుడ వైన నీకు స్తోత్రోపచారముచేయ నేనెంత వాడను! (సశేషము)

---

## కృష్ణా మండలమునందలి

# వడాలి శ్రీ జగన్నాథస్వామివారి స్థలపురాణము

అడివి సాంబశివరాయ నందగిరి వెంకటప్పారాయ కవులు "శివవేంకట కవులు" అను పేరుతో రచించి 1914 సం॥లో ముద్రించిన "జగన్నాథీయము" అను కావ్యమందు వడాలి శ్రీ జగన్నాథక్షేత్రమహిమ, స్థల పురాణము వర్ణింపబడినది.

ఈ దేవాలయము షుమారు 200 సం॥రముల క్రిందటనొక స్వాములవారిచే నిర్మింపబడినట్లు కన్పించు చున్నది. స్వాములవారి పేరు శ్రీ సచ్చిదానంద అవధూత స్వాములవారని కొన్నిచోట్లను "జగన్నాథీయము" నందు శ్రీ పురుషోత్తమానందావధూత స్వాములవారనియు పేర్కొనబడినది. ఉత్కళదేశమందలి జగత్ప్రసిద్ధిగాంచిన పూరీ జగన్నాథక్షేత్రమునకున్నూ, యీ జగ న్నాథక్షేత్రమునకున్నూ సంబంధమున్నట్లు క్షేత్ర నామమునుబట్టియు యీ దేవాలయమునందు ప్రతిష్ఠింపబడియున్న బలరామ కృష్ణ సుభద్రా విగ్రహ ములకు పూరీక్షేత్రమునందలి విగ్రహములతోగల సామ్యమునుబట్టియు గన్పించును.

ఇంద్రద్యుమ్న మహారాజు పూరీక్షేత్రమునందు శ్రీ జగన్నాథస్వామివారి దేవాలయమును నిర్మించి బలరామ కృష్ణ సుభద్రల దారుమయ ప్రతిమలను తయారుచేయించి బ్రహ్మదేవునిచే బ్రతిష్ఠ చేయింప దలచి బ్రహ్మలోకమున కేగగా బ్రహ్మ ఇప్పటికే వేల యేండ్లు భూలోకమున గతించెననియు, అచ్చటి ప్రజలు విగ్రహములను బ్రతిష్ఠించి పూజించుచుండిరనియు చెప్పగా రాజు భూలోకమునకు తిరిగివచ్చి తనచే బ్రతిష్ఠ గావింపబడనందుకు చాలా విషణ్ణుడై జగన్నాథ స్వామిని ప్రార్థించగా స్వామివారు కలియుగంబున అవధూతవై స్వామిని ఇంకొక క్షేత్రమునందు తనను ప్రతిష్ఠించగలవని యనుగ్రహించెననియు అందుచే నా యింద్రద్యుమ్న మహారాజే పురుషోత్తమానందావ ధూత స్వాములవారుగా జన్మించి వడాలిలో శ్రీ జగ న్నాథస్వామివారిని బ్రతిష్ఠించెననియు "జగన్నాథీ యము"నందు చెప్పబడుచున్నది. అది ఎట్లున్ననూ పూరీక్షేత్రము ననుకరింపజేయుటకే యీ క్షేత్రము నందు బలరామ కృష్ణ సుభద్రల విగ్రహములను సరిగా పూరీక్షేత్రమునందలి విగ్రహములవలెనే తయారు చేయించి ప్రతిష్ఠింపబడినట్లు విశదమగుచున్నది.

ఈ దేవాలయము నిర్మించిన స్వాములవారు పూ ర్వాశ్రమమున కర్లపాలెము నారాయణ సోమయాజి యను పాకహవిస్సోమయజ్ఞకర్తయగు నియోగి బ్రాహ్మణుడై యున్నట్లును పూర్వ వాసనా వశంబున స్వామినిగూర్చి తపంబాచరించి సన్న్యసించి యవ ధూతయై శ్రీ జగన్నాథస్వామిని వడాలియందు ప్రతి ష్ఠించెను. వడాలి గ్రామము ప్రథమములో "సన్న పాడు" అని పిలువంబడెను. ఈ ప్రతిష్ఠకు పూర్వము ఇప్పటి దేవాలయమునకు సమీపమునందుండెడి రావి

చెట్టునందు శ్రీ జగన్నాథస్వామి ఆవిష్కరింపబడి యుం డెననియు నచ్చటి "వ్యాధాళి" ఎరుకలు మొదలగు వారు ఆ రావిచెట్టునే పూజించుచుండెడివారనియు స్వాములవారు ఆ యెరుకల సాహాయ్యముచే దేవా లయమును నిర్మించి అంగలూరు గ్రామములోని అమృతేశ్వర స్వామివారి ఆలయ సమీపమునంగల యొక చెట్టును ఈశ్వరాజ్ఞానుసారము ఛేదించి అందు శ్రీ బలరామ కృష్ణ సుభద్రల మూర్తులను చేయించి వాటిని ఆలయములో ప్రతిష్ఠించిరని ప్రతీతి. ఆ పిమ్మట స్వాములవారు దేవాలయ పోషణకై ఏర్పాటు చేయదలంచి అచ్చటి బ్రాహ్మణులతో గలసి కృష్ణానదీ స్నానమునకు పోయి కృష్ణలో మునిగి తమ యోగ బలంబున హైదరాబాదులోని జాముద్దౌలా నవాబు గారి యాస్థానమున వెలసిరనియు ఆశ్చర్యచకితుడైన నవాబుగారివలన "సన్నపాడు" ను జగన్నాథస్వామి వారికి జాగీరుగా ఫరమానా సంపాదించి వెంటనే కృష్ణలో మునిగినచోట లేచి ఫరమానాను తన వెంట వచ్చిన బ్రాహ్మణులకు చూపించెననియు నేటికిని ప్రతీతి యున్నది. ఆ గ్రామమునందలి బ్రాహ్మణులు వార ణాశినుండి వచ్చినవారగుటచే వారణాశివారని పిలువ బడుచుండిరి. స్వాములవారు అగ్రహారములో సగము భాగము స్వామివారియొద్ద స్వస్తి వేదపారాయణ, హరికీర్తన సహస్రనామ పారాయణ నౌకరీకి బ్రాహ్మ ణులకు ఒసంగి సన్నపాటికి దక్షిణపుదిక్కున దేవాల యమునకు వుత్తరముగా వారలకు అగ్రహారము నిర్మించెనని జగన్నాథీయమున గలదు. మానవులు వడాలి శ్రీ జగన్నాథస్వామిని సేవించి పూరీ జగన్నాథ స్వామిని సేవించిన ఫలము బడయగలరని విశ్వసింప బడుచున్నది. ప్రథమములో జగన్నాథుడు డా "వ్యా ధాళి" చే పూజింపబడియుండుటచే నా నామము క్రమముగా మారి చివరకు "వడాలి" అయినట్లు జగన్నాథీయకర్తలు అభిప్రాయపడుచున్నారు. ఇది ఎంతవరకు సమంజసమో విచారణీయము.

(స॥ సం॥)

---

# శ్రీకాకుళము - ఆంధ్ర విష్ణువు

(గతసంచిక తరువాయి)

శ్రీమాన్ కవిరాజ శిరోమణి, పండిత దీవి నరసింహచార్యులు, అష్టావధాని, అవనిగడ్డ.

మార్కండేయ పురాణమునందు 54 అధ్యాయమునందు

"అ థాపరే జనపదా దక్షిణాపథవాసినః
పాండ్యాశ్చ కేరళాశ్చైవచోళాః కుంత్యా స్తథైవచ
శైలుషా మూషికాశ్చైవ కుమారావన వాసకాః
మహారాష్ట్ర మాహిషికాః కళింగాశ్చైవ సర్వశః
ఆభీరాః సహవైశ్చిక్యా ఆటవ్యాశ్శబరాశ్చయే
పుళిందావింధ్యమాలేయా వైదర్భాదండకైస్సహ
పౌరికామౌళికాశ్చైవ అశ్మకాభోగవర్ధనాః
నైషికాః కుంతలాఆంధ్రా ఉద్భిదావనదారకాః
దాక్షిణాత్యాస్త్వమీదేశా అపరాన్తాన్ని బోధత"

అని కలదు. ఇక్లై వాయుపురాణము 45 అధ్యా యములో

"పౌనికామౌనికాశ్చైవ—అశ్మకాభోగవర్ధనాః
నైర్ణికాః కుంతలా ఆంధ్రాఉద్భిదానీలహావికాః
దాక్షిణాత్యాశ్చవై దేశా అపరాన్తాన్ని బోధత ॥"

అనిన్ని వర్ణింపంబడినవి. దీనిని ఆంధ్రమార్కండేయ పురాణము చతుర్థాశ్వాసము 181 వచనము (141 పేజీ) లో

"ఆమధ్య దేశంబునకు నుదీచ్యంబులై, భార్గవ పురంబును, బాహ్లిక, వాటధాన, ఆభీర, గాంధార, సింధు, సౌవీర, మద్ర, కేకయ, కాంభోజ, దరద, బర్బర, చీన, కాశ్మీర, హూణాదులును, ప్రాచ్య

బులై, యంతర్గిరి, మలప, మలవర్తిక, ప్రాగ్జ్యోతిష, విదేహా, తామ్రలిప్తక, మల్ల, మాగధులును, దాక్షిణాత్యంబులై, పాండ్య, కేరళ, చోళ, కుల్య, మహారాష్ట్ర, మహిష, కళింగ, విదర్భ, కుంతల, ఆంధ్రాదులును, ప్రతీచ్యంబులై, సూర్యారక, పుళింద, సారస్వత, సౌరాష్ట్ర, అవంత్యాది జనపదంబులును, అభిరమ్యంబులగు" నని కలదు. ఇందును ఆంధ్రదేశంబు పేర్కొనంబడినది. ఇట్లే, భాగవతము నవమ 23 అధ్యాయములో

"అంగ వంగ కళింగాద్యాః సుహ్మపుండ్రాంధ్ర సంజ్ఞికాః"

అని శ్రీశుకులు వారానతిచ్చిరి. బలికుమారులైన అంగవంగాదులచే పాలింపంబడిన దేశములు వారి నామములచే వ్యవహరింపంబడుచున్నటుల, ఆంధ్ర భాగవతము (2 సంపుటము) (150 పుట) నవమ స్కంధము 683 వచనములో

"అంగ, వంగ కళింగ సింహ పుండ్ర ఆంధ్రులను పేరులుంగల వారార్వురు కుమారులు పుట్టిరి. వారు తూర్పుదేశంబునకు, తమతమ నామధేయంబు నిడి యేలిరి"

అని వ్రాయంబడియున్నది. ఈ విషయమునే, మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు, 'ఆంధ్ర పురాణము' లో

"బలిసుతుండాంధ్రుడేలుట వలన దీని
కాంధ్రరాష్ట్రమనంగ విఖ్యాతి వెలసె
ననివచించు భాగవతాది సుకృతుల" ని అనువదించిరి. ఇంకను విష్ణు, మత్స్యపురాణములలో నీ యాంధ్రదేశప్రశంస కలదు.

వెండియు, వరాహమిహిరాచార్యుండు "బృహత్సంహిత" అను భూగోళశాస్త్రము నందు 14-వ అధ్యాయము 8 శ్లోకము, కూర్మ విభాగమున నాంధ్రదేశమును గురించి.

"ఆగ్నేయాందిశి దేశ్యాజనపదాంశ్చాహ—ఆగ్నేయాందిశి కోసల, కళింగ వంగోపవంగ జఠరాంగాః—శౌలిక విదర్భవత్స అంధ్రచేదికాశ్చోర్ధ్వకంఠాశ్చ" అని వాచస్పత్యమున ప్రశంసించెను. దీనికి "భట్టోత్పల" కృత వృత్తిలో,

"ఆగ్నేయ్యాం పూర్వదక్షిణస్యాం దిశి—దేశ ప్రవిభాగాః తద్యథా—కోసలాజనాః కళింగాః—వంగాః ఉపవంగాః —జఠరాంగాః —శౌలికాః —విదర్భా—వత్సాః—ఆంధ్రాః—చేదికాః —ఊర్ధ్వకంఠాశ్చ" అని వివరించిరి. కల్పసూత్రకారులును తమ గృహ్యాసూత్రములలో మహాసంకల్పమున నీ దేశనామములనుచ్చరించి యుండిరి—దేశచరిత్రలలో, ఆదిశంకరులకు పూర్వమే బౌద్ధజైనమతములను ఖండించి, కర్మమతస్థాపకులైన కుమారిల భట్టను, "భట్ట పాదాచార్యులవారు" జన్మించిన స్థలము, ఆంధ్ర ఉత్కళ దేశముల మధ్యకలదని,

"ఆంధ్రోత్కలానాం సంయోగె పవిత్రె జయ మంగలె"

అని "జినవిజయ"మను గ్రంథమునంగలదు. ఈ ఆంధ్రదేశమును బౌద్ధులు గోదావరీనదికి "మంజీర" అనుయుపనది కలియుటచే "మంజీరదేశము"అని కూడ వ్యవహరించుచూ వచ్చిరి. శ్రీమల్లంపల్లి సోమశేఖరశర్మగారు జులయి వాణిలో "మహాభారతము—చరిత్ర" అను వ్యాసములో నీ దేశవిన్యాసమును గూర్చి పూర్ణముగ పరామర్శించి ప్రకటించియుండిరి. ఇందువలన "ఆంధ్ర" శబ్దము తొలుత దేశపరముగనే పరివ్యవసితమైనదని స్పష్టమగుచున్నది. ఆంధ్రమొక ప్రసిద్ధదేశము. ఇందువసించు వారాంధ్రులు వారి భాష "ఆంధ్రము"—

"అంధ" శబ్దము దేశపరముగ నన్వయించునప్పుడు, "గుడ్డి" అను యర్థమిచ్చు సంస్కృతశబ్దము కాదనిన్నీ, "ఆంధ్ర" అను వికృతికి ప్రకృతరూపమనిన్నీ, యిందువలన "అంధ" మే, "ఆంధ్రమైనదనిన్నీ, యింక నిట్టి ప్రయోగములు, ప్రకృతి భాషయందు చాల కలవనిన్నీ, "అంభష్ఠ సూత్రము" అనుదానికి "అంబట్ఠసుత్తము" "శాలివాహనరాష్ట్రము" అను దానికి "సాతవనరట్టము" అను పాకృతప్రయోగముల నుదహరించుచు, నీ దేశము "అంధు" డను ప్రభువుచే పాలింపఁబడుటవలనఁ గాని, దశరథుని సమకాలికుఁడైన "అంధు" డను, వైశ్యబుషి యీ **దేశమున** సంచరించుటవలనఁ గాని, యీ దేశమునకు

"అంధ" దేశమని కూడ ప్రథమమున పేరుగలిగి యుండ వచ్చునని, శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు "పాకృతశాసనావళి" యను గ్రంథపీఠికలో వ్రాసి యుండిరి.

ఈ భూమండలమును ఆదిశేషువు తన సహస్రఫణ ములతో ధరించుచున్నటుల సర్వతంత్ర ప్రసిద్ధము. మంత్రద్రష్టలగు మహాఋషులు తమ గృహ్యాసూత్రము లందు, "మహానాళాయమాన ఫణిరాజస్య శేషస్య సహస్ర ఫణామండల మండితె" అని మహాసంకల్ప ములను పలికియుండిరి. మరియు, "లక్ష్మీవంతొౌన జానంతి ప్రాయశఃపర వేదనాం. శేషెహిభూభరక్రాంతె శేతెనారాయణస్సుఖమ్

అనుయార్షకవి లక్ష్మీధరపండిత ప్రయోగము కలదు. కనుక,

"ధరతీతిధరః—అనంతేన — ధరః=అనంతధరః" లేక, "అనంతేన—ధార్యత ఇతి = అనంతధరః" అనిన్నీ "అనంతేన—ధ్రియత, ఇతి = అనంతధ్రః" అనిన్నీ రూపములు కలిగినవి. అనగా అనంతుని (ఆది శేషుని) చేత యీభూమండలము ధరింపఁబడుచున్నది. కనుక, 'అనంతధర, అనంతధ్ర' దేశములని పేరులు కలిగిన వనియు ఆ అనంతుని సహస్రశిరములు భూమం డలమున కెంతవరకు, ఆనియున్నవో, నంతవరకు "అనంతధర" దేశమను సంజ్ఞచే నొప్పారి, దానికే 'ఆంధ్రదేశ' మను సంగ్రహరూప మేర్పడినదనియు, యీ రూపము పృషోదరాది గణములోచేరి సాధువైన దని బ్రహ్మశ్రీ వ్యాకరణాచార్య, వేమూరి నృసింహ శాస్త్రులవారు వ్రాసియుండిరి. అందువల్లనే తచ్చి హ్నము (Symbol)గా "ఆర్చి" (Arch) అనంత నామకపర్వతము (శేషశైలము)ను తిరుపతినుండి శ్రీశైలపర్యంతము (బ్యాలెన్సు) balance కొఱకు భగవానుఁడు సృష్టించియున్నాడు. అందువలన దానికి 'వెంకటాచలము, శేషశైలము' అనుపేర్లు కలిగి నట్లును, ఆ శైలమునకు తిరుపతిలోగల సప్తపర్వత ములు, సప్తశిరస్సులనియు, శ్రీశైలము పుచ్ఛమనియు పురాణ ప్రసిద్ధి ; ఇందువలన కూడ అనగా "అనంత" నామక పర్వతమును ధరించుచున్నందువల్ల, 'ధరతీతి-ధరః-అనంతం-ధరః=అనంతధరః" లేక, "అనంతం-ధ్రియతఇతి=అనంతధ్రః" అను రూపములే యేర్పడు చున్నవి. "మహీధరః - మహీధ్రః, కుధరః-కుధ్రః" శబ్దములవలె వ్యుత్పత్తి కుదురుచున్నది. వీటిసంగ్రహ రూపము "అంధ్రః" అగును. "పదపవపాదః" వలె "అంధ్రఏవ ఆంధ్రః" అయినది. బ్రహ్మాండపురాణ ములో నిట్లు

"అనంతంధారయత్యేష దేశశ్శైలాకృతింతతః ।
అనంతధ్రస్స ఏవాంధ్రః-పరోక్షేణేంద్రవత్స్మృతః"

అని కలదు. శైలరూపముననుండు అనంతుని నీదేశము ధరించియున్న కతమున దీనికి "అనంతధ్రదేశమ"ను పేరుకలిగెను. అదియే "ఆంధ్రదేశ" మని చెప్పఁబడు చున్నది. ఇంద్రుడు తొలుత, "ఇదంద్రుఁడ"ని పేరుఁ బొంది, పరోక్షప్రియులగు దేవతలవలన "ఇంద్రుఁడ"ని పేరొ్కనఁబడినట్లు.

"తస్మాదిదంద్రోవాయ ఇదంద్రోహవై నామ-
తమిదంద్రం సంతమింద్ర ఇత్యాచక్షతె
పరోక్షేణ పరోక్షప్రియా ఇవహిదేవాః"

అని ఐతరేయ బ్రాహ్మణం తృతీయ ఖండమునఁగలదు. ఇట్లై "అనంతధ్ర" పదము "ప్రాతిశాఖ్య" చేత కూడ సాధువైనదని, విద్యారణ్యపంచానన, విక్రాల రామచంద్రాచార్యులవారు "ఆమ్నాయ ప్రవచన మ"ను గ్రంధమున వ్రాసియుండిరి

శ్రీవైకుంఠనికేతనము (లీలావిభూతి)నుంచి, భక్త జన సౌలభ్యముకొరకు, అర్చారూపముగ నవతరించు శ్రీమన్నారాయణునకు, పర్యంకముగనుండు శేషుఁడు సేవనిమిత్తము, శ్రీస్వామి యధిష్ఠానముకొరకు శైల రూపమైనట్లును, నానివాసముకొరకు శైలరూపము నందుమని భగవానులానతిచ్చినట్లును "అస్మద్వాసాయ భోగేంద్ర శైలరూపోభవిష్యతి" అని బ్రహ్మపురాణ మునఁగలదు. కృష్ణాగోదావరీ మధ్యస్థమైన ద్వారకా పురి (ద్వారకా తిరుపతి)కి కూడ "అనంతపర్వతమ" నియే, పేరైనట్లు,

"తత్సమీపేమహాన్ శైలోఽనంతనామ్నాప్రకాశతె" అను బ్రహ్మపురాణ వచనమే ప్రమాణము. "వైకుంఠ వాసియగు శ్రీమహావిష్ణువు భూదేవి ననుగ్రహించుటకు కృతయుగమునందు శేషాచలము (తిరుపతి)యందును

త్రేతాయుగమునందు ద్వారకా తిరుపతియగు అనంతాచలమందును" అవతరించిరను విషయము. "ఆరాధన" సంపుటము ౧-సంచిక ౧౦-లో సంపాదకీయమైన "ద్వారకా తిరుపతి" అను వ్యాసమున జూడనగు. దీనికి మఱియొక చక్కని వ్యుత్పత్తిఁగలదు.

"అం-ధరః = అంధరః, లేక. అం-ధ్రియత ఇతి-అంధ్రః ॥ అని రూపనిష్పత్తి. అనగా "అక్షరాణామ కారోస్మి" అను గీతాసూక్తిననుసరించి, అకారవాచ్యుఁడైన విష్ణువును ధరించినది. కనుక "అంధ్రదేశ" మను పేరు అన్వర్థమైనది. ఈ విషయము బ్రహ్మాండ పురాణాంతర్గతమగు క్షేత్రమహాత్మ్యము నూట మూడవ అధ్యాయములో,

"అకారవాచ్యేనచయద్విష్ణునాధ్రి యతెసదా
అథాంధ్రోభూదయం దేశః-తదీశోప్యాంధ్రనాయకః"

అని ప్రతిపాదింపఁబడినది. అనగా అకారవాచ్యుఁడైన విష్ణువుచేత సదాధరియింపఁబడి యుండుటచే దీనికి "ఆంధ్ర" దేశమని పేరుకలిగినట్లు కలదు. మరియు నా ప్రకరణముననే,

"అమంగీకారమాచష్టె - ధృఞ్‌ధాతుర్ధారణార్థకః ।
అమిత్యధ్రియతాఽయం య-ద్విష్ణునాంధ్ర స్తదుచ్యతె"

అని కలదు. అనగా బ్రహ్మాదులందరు నిచటతపస్సుఁ జేయ, విష్ణువు ప్రత్యక్షముకాగా నిత్యము తాము సేవించుటకై శ్రీమన్నారాయణుని నిచటనేవేంచేసి యుండవలసినదిగా ప్రార్థింపనందుల కంగీకారసూచకమైన "ఆమ్" పలికిరట, మరియునిచటనే యవతరించుటవలనను, ధారణార్థకమైన "ధృ" ధాతువు వలనను "ఆంధ్రః" అనియు, "ఆం = అకారరూపం మాం-ధ్రియతఇతి = ఆంధ్రః", అనియు ప్రత్యక్షముగ రూపసిద్ధి కలుగుచున్నది.

అనగా "యతోవాచో నివర్తంతె, అప్రాప్యమనసాసహ" అను ఉపనిషద్వాక్యమువలన, అవాఙ్మానసగోచరుడైనను, భావమాత్రగోచరుఁడగు నారాయణుఁడు కనుక, భావనారాయణుఁడని నిర్వచనము. అట్టి భావనామాత్రుడైన, నారాయణుఁడు ఆకారము (రూపము)ను ధరించి, అర్చారూపుఁడైనట్లు "ఆకారరూపంమాంధ్రియతె" అని బ్రహ్మవైవర్త పురాణాంతర్గత గోష్ఠీపుర మాహాత్మ్యమున వర్ణింపఁబడినది. గోష్ఠీపురమనగా పొన్నూరు భావనారాయణ క్షేత్రము. ఇందువలన "ఆంధ్ర" శబ్దమునకు విష్ణుధరపరముగ విగ్రహ మేర్పడుచున్నది. మరియు నిందొక్క విశేషముఁగలదు. లాటమరాటాది దేశము లన్నియు నర్థములేని పేరులతో వ్యవహరింపఁబడుటచేత, నిరీశ్వరదేశములనియు, ఆంధ్రదేశమొక్కటే, భగవంతుని ధరించుటచేతను, నిరాకారుఁడై, భావనా రూపుఁడగు పరమాత్మసాకారుఁడై, "ఆంధ్ర విష్ణువ" నుపేర నర్చారూపుఁడై, శ్రీకాకుళమునందు (భూమండలములకు కేంద్ర బిందు) స్థానమందు, వెలయుటచే నీ యాంధ్రశబ్దము సార్థకమైనదని, "అనల్ప జల్పితాకల్పిత కల్పవల్లి"లో

"నిరీశ్వరాఅఖిలాదేశాః-ఆంధ్రస్త్వేకోస్తి సేశ్వరః
యత్రాస్తిభగవాన్ దేవః - ఆంధ్రవిష్ణుసమాఖ్యయా"

అని శ్రీదాను శ్రీరామపండితులువారు సిద్ధాంతీకరించిరి. ఇందుకు పాఠాంతరము "సర్వేనిరీశ్వరాదేశాః" అని తాము పూర్వాచార్యులవలన వినినట్లు మధ్వశ్రీ, కవిశేఖర, పళ్లెపూర్ణప్రజ్ఞాచార్యులవారు యీ శ్లోకమునే చదివిచెప్పిరి. ఈ పాఠమేసుష్ఠువైనను, పైపాఠము ఆర్షకవి ప్రయోగమగుటచే నంగీకరించ తగినది.

## ఆంధ్రదేశము - తెలుఁగుదేశము

వేదమునందును, ఆదికావ్యమగు శ్రీమద్రామాయణమునందు కూడ నీ "ఆంధ్రదేశము ప్రశంసింపఁబడుటచే నిది వేదయుగమునుండియు సుప్రసిద్ధమైన నాగరికతకాలవాలమైయున్నట్లు తెలియుచున్నది. దీని సరిహద్దులనుఁగూర్చి, శబ్దకల్పద్రుమమునంగన్పడు "శక్తిసంగమతంత్రము"న "జగన్నాథాదూర్ధ్వభాగ మర్వాక్ శ్రీభ్రమరాంబికాత్-తావదంధ్రాభిదోదేశః" అని నిర్ణయించిరి.

ఇందువలన నేటికళింగ (ఉత్కల) దేశములుఁగూడ నాఁడును ఆంధ్రదేశాంతర్గతములే, అని తెలియుచున్నది. అనగా ఆనాడు యాంధ్రదేశము, జగన్నాథమునుండి శ్రీశైలపర్యంతము వ్యాప్తమైయున్నదని యర్థము. "తతశ్చసదతీఁణాందిశ మాససాద

యత్ర మలయ మేకలకుంతల కేరళపాలమంజర మహారాష్ట్ర గంగకళింగాదయోజనపదాః" కావ్యమీమాంస-పేజీ 9. (గైక్వాడ్)

"Southern India comprised, the whole of the peninsula from Nasik on the east to Cape Kumari (comerin) on the south in including the Modern districts of Birar and Telingana Maharastra and Konkan with the separate states of Hyderabad, Mysore, and Travancore or very nearly, the whole of the peninsula to the south of the Norbada and Mahanadi rivers."

(Cunningham's "The Ancient geography of India P. P. 11-12)

ఇందువలన పూర్వమే దక్షిణాపథములోని దేశములైన కొంకణ, కన్నడ, తెలంగాణా దేశములుకూడ కలిపి నర్మదానది పర్యంతమునొక్క ఆంధ్రరాష్ట్రముగనే పరిగణింబడినది. కనుక ఒకప్రాచీన మహాకవి కళింగప్రభువునుఁగూర్చి,

"ఆయుర్దాన మహోత్సవస్స వినతక్షోణీభృతాం మూర్తిమాన్
విశ్వాసో, నయనోత్సవోమృగదృశాం, కీర్తేఃప్రకాశఃపరః
ఆనందఃకవితాకృతిస్సు మనసాంవీర శ్రియోజీవితం,
ధర్మస్యైవనికేతనం విజయతేవీరః కళింగేశ్వరః"

అని యుగ్గడించెను. మహాకవికాళిదాసు తనరఘువంశమున రఘుమహారాజుగారి దండయాత్ర వర్ణించు సందర్భమున తొలుత తూర్పుదిక్కునకు బయలుదేరెనని వర్ణించెను.

"సయయౌప్రథమం ప్రాచీంతుల్యః ప్రాచీనబర్హిషా
అహితానానిలోద్ధూతైస్తర్జయన్నివకేతుభిః"

(రఘువంశము 4వ సర్గ)

తూర్పుదేశమందలి దిగ్విజయమును సూక్ష్మముగ కాళిదాసు

"త్యాజితైఃఫలముత్ఖాతైః భగ్నైశ్చబహుధా నృపైః"

అని మాత్రమే వర్ణించెను. ఇందువలన ఆ రాజులను విడిచిపెట్టెననియు,

"వంగానుత్ఖాయతరసానేతా నౌసాధనోద్యతాన్
నిచఖానజయస్తంభాన్ గంగాస్రోతోన్తరేషుసః"

(రఘువంశము. 4వ సర్గ

వంగప్రభువులను శీఘ్రముగ జయించి గంగానదియొద్దున జయస్తంభముల నాటెననియు, మరియ నాసర్గలోనె,

"ఉత్కలాదర్శితపథః కలింగాభిముఖోయయౌ"

అనుటచే, నుత్కలరాజులోడిపోయి, కళింగరాజ్యమునకు మార్గదర్శకులైరని తేలుచున్నది. ఇంక కళింగరాజు (ఆంధ్రప్రభువు)ను జయించుటకు,

"సప్రతాపంమహేంద్రస్యమూర్ధ్ని తీక్ష్ణంన్యవేశయత్
అంకుశంద్విరదస్యేవ యన్తాగంభీరవేదినః" అనియు,
"ప్రతిజగ్రాహ కాలింగస్తమస్త్రైర్గజసాధనః
పక్షచ్ఛేదోద్యతంశక్రం శిలావర్షీవపర్వతః"

అను వర్ణనమునుఁబట్టి కళింగప్రభు ప్రతాపమును, రఘుమహారాజు పడినకష్టమును తెల్లమగుచున్నది. తరువాత రఘువుపాండ్యదేశమునకుఁ బోయెను. ఈ మధ్యదేశములు వర్ణింపఁబడలేదు. ఇందువలన ఆంధ్రప్రభువులు పౌరుషవంతులని తేలుచున్నది. ఈ విషయమునే, విద్యానాథుఁడు తనయలంకారశాస్త్రమున త్రిలింగదేశాధీశ్వరుఁడగు ప్రతాపరుద్రుని దండయాత్రలను వర్ణించుసందర్భమున,

"అనంతరంసేనాగ్రగైరేవపౌరస్త్యాన్ క్షుద్రక్షత్రియాన్
విజిత్యసార్వభౌమ సేనాటోపేనపటీయసి తస్మిన్‌మహతి బలేప్రచలతి"

ద్వితీయా

"యుద్ధాయసమసహ్యాన్త కలింగాఃస్ఫుటపౌరుషాః
మాద్యద్ద్విపఘటోద్దామ సంభ్రమాడంబ రోద్ధతాః
తైస్సార్ధమాంధ్ర చమూపతీనాంపరాక్రమధనే మహత్యాయోధనె"

అని వర్ణించెను. ఇంకను తనవిజయయాత్రయందు,

రేరేమూర్జర జర్జరోఽసి ? సమరేలంపాక కింకంపసె ?
వంగత్వంగసికిం ? ముధాబలరజః కాణోసికింకొంకణ ?
హూణప్రాణపరాయణోభవ ! మహారాష్ట్రాపరాష్ట్రా స్వమీ
యోద్ధారోవయమిత్యరీసఖిభవత్యంధ్రక్షమాభృద్భటాః ॥

అని సర్వదేశాధీశులను "రే, రే" అనియు, "అంగా

సంగర భీరవః" అని "కృతయశోభంగాః" అని హీనులుగ పరిగణించెను.

మరియు ప్రతాపరుద్రుని పట్టాభిషేక సమయమున, నాహ్వానింపఁబడిన రాజులనందరిని, వారికింతగు యాసనములంజూపించుచు అర్హస్థానములను నిర్ణయించునట్లు యీ క్రింది శ్లోకమువలన తెలియుచున్నది.

"కాళింగాఽత్రనిషీద, కొంకణపతేదూరేభవాంగేశ్వర,
ప్రాంతం సంశయ, మాలవేంద్రశనకైః స్వోపాయనం ప్రాపయ
పాండ్యాగ్రేభవ, సేవనక్షితిపతే పశ్చాద్భవాద్యైవవః
స్వామీ కాకతి వీరరుద్రనృపతిః సర్వాన్ క్రమాదీక్షతె."

అని ప్రతీహారి పలికెను—ఇందువలన విస్తీర్ణమునందీయాంధ్రదేశము గంజాము మండలముమొదలు చిత్తూరు మండలాంతమువరకును సముద్రతీరమందు నుత్తర దక్షిణములుగను, పశ్చిమమున నిజాం రాజ్యముతోకూడి మహారాష్ట్రదేశపర్యంతము వ్యాపించియున్నట్లు పై ప్రమాణములవలనను, అచ్చటి శిలా శాసనములు, నాణెములు, బౌద్ధస్తూపములు మున్నగు వాటినిఁబట్టియు తెలియుచున్నది. అప్పుడును తొలుదొలుత కృష్ణా, గోదావరీ తీరములంగల శ్రీకాకుళము, ధాన్యకటకము, అమరావతి, పెదవేగి, దెందులూరు ఓరుగల్లు మున్నగుపట్టణములను రాజధానులుగఁజేసుకొని తమ రాజ్యమును మగధవరకును, దక్షిణమున తంజావూరు, మధురవరకును విస్తరింపఁజేసినట్లు దేశచరిత్ర సాధనములవల్ల తెలియుచున్నది. దీనికి తెలుఁగుదేశమనియు నామాంతరము. ఇంక యీ తెనుఁగు శబ్దమునుగూర్చి విచారింతము. తెనుఁగు శబ్దమునుగురించి పలువురు పలువిధముల అభిప్రాయపడుచున్నారు. తెలుఁగుశబ్దము త్రిలింగభవమని కొందరు, త్రికళింగభవమని కొందరు, తిలగుమీద జన్యమని కొందరు, తిలసహితభూమియగుటచే "తిలగు" "దేశమైనదని మరికొందరు, అసలు "తెలుగు" శబ్దమే అనాది. దీనికి విద్యానాధుని కాలమున "త్రిలింగ" మని సంస్కృత రూపమును కల్పించెనని కొందరు నుడువుచున్నారు. ఆంధ్ర విష్ణువు

"శ్రీశైలభీమకాళేశ మహేంద్రగిరి సంయుతం
ప్రాకారం సుమహత్కృత్వాత్రీణిద్వారాణి చాకరోత్
త్రిలింగరూపేణాఽవసత్తద్ద్వారేషు గుహైర్వృతః
తత్కాలప్రభృతి క్షేత్రంత్రిలింగమితివిశ్రుతమ్."

అని బ్రహ్మాండపురాణ వచనానుసారముగా శ్రీశైల, ద్రాక్షారామ కాళేశ్వరములను మహేంద్రగిరితోకలిపి గొప్ప ప్రాకారములను నిర్మించి దానికి మూడు ద్వారములు కట్టించుటవలన దీనికి "త్రిలింగ" మను సంజ్ఞ యేర్పడినట్లు తెలియుచున్నది. మరియు సంగమతంత్రమున,

"శ్రీశైలంతు సమారభ్య చోళేశాన్మధ్యభాగత,
త్రైలింగదేశో దేవేశి-ధ్యానాధ్యయనతత్పరః"

అని త్రిలింగదేశము నిర్దేశింపఁబడియున్నది. విద్యానాథ మహోపాధ్యాయుఁడు రచించిన ప్రతాపరుద్ర కల్యాణ నాటకమున పంచమాంకమునందు, 44 శ్లోకములో యిట్లు కలదు.

"యైర్దేశస్త్రిభిరేషయాతిమహతీంఖ్యాతింత్రిలింగాఖ్యయా
యేషాంకాకతిరాజకీర్తివిభవైఃకైలాసశైలాఃకృతాః।
తెదేవాః ప్రసరత్ప్రసాదమధురా శ్రీశైలకాళేశ్వరః
ద్రాక్షారామనివాసినః ప్రతిదినం త్వచ్ఛ్రేయసేజాగ్రతు॥"

దీనికి మహామహోపాధ్యాయ మల్లినాధసూరి తనూజుండగు కుమారస్వామి సోమయాజి,

"త్రయోలింగరూపాః శ్రీశైలనాధాదయో దేవా యస్మిన్
దేశేసత్రిలింగోఽంధ్రదేశ ఇత్యర్థః"

అని వ్యాఖ్యానించెను. కనుక, ఆంధ్రదేశమునందు యీ మూడు లింగములు వెలసియుండుటవలన త్రిలింగమను సంకేతమేర్పడెను. కాని యీ త్రిలింగ క్షేత్ర మధ్యస్తమైన దేశము మాత్రమే ఆంధ్రదేశము కాదు. కాకునూరి అప్పకవి.

"శ్రీక్షితిధరకాళేశద్రాక్షారామంబులనఁగదనరారునీ
త్రిక్షేత్రంబుల లింగము లీక్షితినిఁద్రిలింగసంజ్ఞ నెన్నికకెక్కు-
తత్త్రిలింగనివాసమై తనరుకతనఁనాంధ్రదేశంబుఁద్రాత్రి
లింగాఖ్యమయ్యెఁదెలుఁగనుచుఁదద్భవము దానివలనఁ
గలిగె వెనుకఁగొందఱుదానినే తెనుఁగునంద్రు"

అని వ్రాసిరి. దీనివలన నీతఁడును త్రిలింగ సంజ్ఞావిష యమున విద్యానాథునే యనుకరించునట్లు కన్పించు చున్నది. కాని యుభయులును, ద్రాక్షారామమని వ్రాసిరి. దానిని "దాక్షారామ" మని సవరింతు మన్న నాతని శ్లోకమునకును, నీతని పద్యమునకుఁ గూడ ఛందోభంగము కలుగుచున్నది. ఈ ప్రాంతముల ద్రాక్షారామము లేనాడునులేవు. "దక్ష సంబంధత్వా ద్దాక్షారామ ఇతితన్నామ" అని పూర్వులు సరసముగా సమర్థించి సమన్వయించిరి. ఇంక త్రిలింగ శబ్దమునకు "తెలుఁగు" శబ్దము తద్భవమనిలాక్షణికులంగీక రింపరు. కనుక తెలుఁగు త్రిలింగ శబ్దభవమా? అను విషయము విచారణీయము. సంగమతంత్ర రచనా కాలమున "తైలంగ" శబ్ద వ్యవహారము ప్రసిద్ధిగ నుండెను. (సశేషము)

---

# సమీక్ష

## సంపాదకుడు

**1. శ్రీ సౌందర్యలహరి :—** శ్రీశంకరభగవత్పాదరచిత మైన గ్రంథమున కాంధ్రపద్యానువాదము. వివరణ విశేష సహితము. కర్త శ్రీయానందనాథులను దీక్షానామధేయముగల ఈశ్వర సత్యనారాయణశర్మగారు. శ్రీకాకుళము నివాసులు. డెమ్మిసైజు ఎనుబదినాల్గు పుటలు వెల అ. 12 లు. ప్రాప్తిస్థానము, గ్రంథకర్త, శ్రీకాకుళము.

ఈ యనువాదము కవితాపిపాసువులకు వివరణ విశేషణములు మంత్రతంత్ర విశేష జిజ్ఞాసువునకు కల్పవృక్ష ములు. గ్రంధకర్త పడిన శ్రమ అనల్పము. అన్వర్థనామధేయము సౌందర్యలహరి.

భక్తిమార్గమున స్తవనము మొదటిమెట్టు మననసాధనము. దానిచేనపరోక్షజ్ఞానము పరంపరాక్రమమున ప్రాప్తించును. అంతరోపాసనము ప్రాయికముగా లక్ష్యమూర్తిస్తవనముతోనే ప్రార్థించుటతోనే ఆరంభించి తర్వాత శ్రవణ మనన నిదిధ్యాసక్రమమున చరితార్థమగును.

శంకరులు సర్వజ్ఞులు, వారివాణి సర్వతోముఖము. అనువాదకులు తక్కుల్పులే. తెనుగున నీ శాస్త్రపరిచితి కలవారు బహుసంఖ్యాకులు లేరు. కారణములు ఇవి గుప్తవిద్యలగుటయు వీనిని సాధించుటకు పూర్వాంగముగా క్లేశసాధ్యములగు నియమబాహుళ్యమును. శాస్త్రమును సాధించకపోయినను శాస్త్రజ్ఞులు చెప్పినదానిని గ్రహించునంత శక్తి నాస్తికులు సంపాదింపకున్న గత్యంతరము లేదు. ప్రస్తుతకాలమున ప్రతిమాపూజన మొక్కటియే ఉపాసనా మార్గమున మనకున్నది. దాని నుపేక్షించుట క్షమింపరాని దోషము.

పద్యముల మాధుర్యమునఁ జొక్కుగోరువారు 'మెరసెడి తీగ' "బిరబిర మారుపేర నిను బిల్చిన" "అలరెతి ముచ్చ కస్తురిగ" మున్నగునవి చూడనగును అనుటయేగాని ప్రారంభించినవారు గ్రంథాంతముపరకును జదివిగాని గ్రంధమును వీడ రనుట మావిశ్వాసము. ఈగ్రంథమును జదువుట మహాఫలదము.

ఆనందలహరియం దవగాహనములు
సౌందర్యలహరిలో సంప్లావనములు
నిచ్చుసత్ఫలమున కెన యింత కాదు
దివిజగంగాస్రవంతీస్నానఫలము.

శ్రీయానందనాథులకు మానమోవాకములు.

**2. శ్రీభీమేశ్వరనుతి :—** శ్రీకాకుళపురమున నున్న శ్రీభీమేశ్వరుని నుతికర్త పైనఁ జెప్పిన శ్రీయానంద నాథులే క్రవున్ ⅛ సైజు వెల అ. 8 లు. ప్రాప్తిస్థానము గ్రంథకర్త యే పే. 25 లు.

ఈనుతి శివాష్టోత్తరశతనామ పరిపూర్ణబోధ మగుటయే యిందలి విశేషము. అర్థజ్ఞానము మున్న నామస్మరణ జపములు మహాసిద్ధిదాయకములు. పరమార్ధవివృతి లోకానుగ్రహమున కావింపఁబడినది. శివనామములను పౌరాణి కార్థములుగాక బ్రహ్మపరముగా సమన్వయించుట కెంతటి పాండితి అనుభవము చాతుర్యము వలయును. దేశికోత్తంసు లగు శ్రీయానందనాథులకు మాసాష్టాంగప్రణామములు. 'స్వయం తీర్ణః పరాం స్తారయతి'. ప్రతి వైష్ణవేతర దేవాలయ ములను నీరెండుగ్రంథము లుంచుకొనుట ముఖ్యము.

**3. సమ్మేళనసంచిక** :—గుంటూరు సంస్కృతభాషా ప్రచారిణి సభవారు విశ్వసంస్కృత పరిషత్తువారి తిరుపతి చతుర్థవార్షికోత్సవ సందర్భమున ప్రచురించిన యమూల్యవ్యాస పేటిక. సంస్కృతాంధ్ర శ్లోక వ్యాసపరంపరతో రాజిల్లుచు ప్రకాశకుల యొద్ద రు. 3 లకే లభ్యముగా నున్నది. రాజకీయ సంస్కృతరంగములందు పేరు మోసిన నాయకుల చిత్రములు దీనికి భూషణములుగా నున్నవి. రాయలుసైజున దాదాపు నూటపాతిక పేజీల దివ్యగ్రంథము.

ప్రకాశకులు చిత్తూరు సంస్కృత ప్రచారిణీసభకు శాఖ, ఈసభ చిన్నతనమునుండి బాలురకు సంస్కృతమునందు పరీక్షల నేర్పరచి సులభపాఠ్యావళి నేర్పించి బోధకవర్గమును నలుగడలకు పంపి ప్రచారమును చేయుచున్నారు. భారతీయుఁడు సంస్కృతమును నేర్వకుండుట సిగ్గుచేటు. సంస్కృతప్రచారిణీవర్గమునకు మాయభినందనముల దెల్పు చున్నాము. ఈసంచికలో కాశీకృష్ణాచార్య వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి జటావల్లభుల పురుషోత్తమాది మహా విద్వాంసులు చక్కనివ్యాసములు వ్రాసియున్నారు. గ్రంథమును జదువుటయే సంస్కృతసేవకు మనము చేయఁదగు ప్రథమ ప్రయత్నము.

కావుననే శ్రీఆంధ్రరాష్ట్ర మతధర్మాదాయపరిపాలనాశాఖ కమీషనరుగారగు శ్రీరెడ్డి వేంకటరెడ్డిగారు ఈగ్రంథమును దేవాలయకార్యనిర్వాహకాదివర్గము తప్పక కొనవలసిన గ్రంథముగా నానతిచ్చియున్నారు.

విషయసమగ్రముగ నింతగ్రంథము సంస్కృతభాషలోను తెలుగులోను వ్యాసరత్నముల గలిగియున్నది మనకు దొరకుట మహాభాగ్యము. ఎల్లరు నీయుద్యమమునకుఁ బ్రోత్సాహము నిత్తురుగాక.

**4. శ్రీయాజ్ఞవల్క్య చరిత్రము** :—కర్త ఘట్టు ప్రభువు. పద్యకావ్యము. సంపాదకులు శ్రీ లింగంగుంట వేంకటసుబ్బయ్యగారు, నాలుగవలైను, పదునేడవ క్రాసురోడ్, బ్రాడీపేట గుంటూరు-2. క్రవును $\frac{1}{8}$ సైజు, పేజీలు 126. వెల రు. 1.

తెనుగు బ్రాహ్మణసంఘములో శుక్లయజుర్వేదు లని ప్రథమశాఖవా రని యాజ్ఞవల్క్య లని ఒకశాఖ కలదు. దాని కాదిపురుషుడు యాజ్ఞవల్క్యమహర్షి. ఆయన తాను సూర్యునివలన నూత్నముగ పొందిన నీశుక్లయజుర్వేద మును పదునైదుశాఖలుగ విభజించి ప్రథమశాఖను కణ్వుని కుపదేశించుటచే నీశాఖను కాణ్వశాఖ యనియు నందురు. యాజ్ఞవల్క్యమహర్షి ఉపనిషత్తులకాలమునుండి సనాతన ధర్మవాఙ్మయమునం దెల్లెడలప్రకాశించు నవర్ఘ్యరత్నము. ఆతనిచరిత్రము పద్యాకృతిగా శ్రీశైల మల్లికార్జునభక్తుఁడు ఘట్టుప్రభుడు కుచేలోపాఖ్యానకర్త రచించెను. ఈయన నెల్లూరివాడని రెండువందలయేబదియేండ్లక్రిందవా డని తెలియుచున్నది.

ఈచరిత్రమునగల స్తుతులు అన్నిశాఖలవారికి పారాయణయోగ్యములుగా నున్నవి. ఈయుత్తమగ్రంథమును వెలుపరచుట శ్రీలింగంగుంట వేంకటసుబ్బయ్యగారు చేయుచున్న సారస్వతసేవలో ఏకదేశమాత్రము. నిడదవోలు వేంకటరావుగారి యమూల్యావతారిక చదువఁదగిన గ్రంథభూషణము.

కాణ్వశాఖోద్భవులైన పెద్దల సూచిక యిందుండుటచే దీనిని జదువుట పితృయజ్ఞతుల్యము కాగలదు.

గ్రంథవిషయమున బృహదారణ్యకోపనిషత్ప్రతిపాదితము నగుటచే దీనిని విద్యాశాఖాధికారులు తమ Dis No, 1814155 d 8-6-55 నందిది అన్ని స్కూళ్ల కాలేజీల, పబ్లిక్ లైబ్రరీలయం దుంచదగిన గ్రంథ మని ఉత్తరు విచ్చి యున్నారు. అట్లే అన్ని దేవాలయములయం దుంచదగినదని శ్రీ హిందూమత ధర్మాదాయపరిపాలనశాఖ కమీషనరు గారు తమ Memo No. 24562155-1 Gl. d 3-11-55 నందుల దెల్పియున్నా రని తెలియుచున్నది. అందరును ప్రకాశ కుల ప్రోత్సహింపవలయు నని మాయభిప్రాయము.

**5. వాణీశతకం :**—కర్త : అల్లంరాజు లక్ష్మీపతి. క్రవును ⅛ సైజు. పే 20 లు. ఖరీదు అ. 4 లు. ప్రాప్తిస్థానము అల్లంరాజు వేంకటరాయడు, రామారావుపేట, పెద్దాపురం.

లలితమైన పదబంధముతో నిష్టదేవత యైన వాణి పరమగు కవి రచించిన కంద పద్యముల సంపుటి. ధారాళమైన కవిత. తియ్యని తలపులు, మాటలు, ఈ కవి యితోధికముగా నీదృశమైన కావ్యముల నిర్మించుఁగాక యని మాయాశ.

**6. నిత్యపూజావిధానము :**—క్రవును ⅛ సైజున పే 42 ల గ్రంథము.

పబ్లిషర్సు :—వసంతా ఇన్‌స్టిట్యూటు, దివ్యజ్ఞానసమాజభవనము, గుడివాడ.

1925లో దివ్యజ్ఞానసమాజస్వర్ణోత్సవము సందర్భములో జిడ్డు కృష్ణమూర్తిగారికి హిందూమతమున సమష్టి పూజావిధానమును నెలకొల్పు తలంపు కల్గెను. స్వయము కృష్ణజీగారు కర్మకాండ కంత సుముఖులు గారు. సమష్టిపూజ యన ఒకేలక్ష్యము నుద్దేశించి పలువురు కలసిచేయు సాధన. వ్యష్టిపూజాసమయమునందుకన్న సమష్టి పూజాసమయమున అనేకరెట్లు అధికముగ దివ్యశక్తు లాకర్షింప బడి వారియెడ కేంద్రీకృతము లగును. సూక్ష్మతరలోకద్రవ్యములును కేంద్రీకృతములై ఘనభావమున నుపాసకులఁ జుట్టుముట్టి వారి యుపాధులను పావనములుగ జేసి ప్రాణాదిసూక్ష్మ దీపముల శుద్ధములుగ చేయునని ద్రష్టలైన మహర్షుల యభిప్రాయము.

హిందూసంఘమున నింతవరకు పూజ యన్నది పురోహితాధీనమై యుండగా కృష్ణజీగారి యాశయము ననుసరించి శ్రీ అల్లాడి మహాదేవశాస్త్రిగారు ఋగ్వేదాదులనుండి మంత్రముల గ్రహించి యీ 'నిత్యపూజావిధానము' ననుగ్రహించిరి.

ఈపూజావిధానమున వ్యక్త్యుపాధిని పావనము చేయుటకు అందరు మంత్రపూతముగ జలమును సేవింతురు. ఉపాసనాక్రమము నిది సంకల్పము, తీర్థగ్రహణము. దేవతాహ్వానము, భూతోచ్చాటనము. దిగ్బంధము ధూపనివేదనము. పవమాన ప్రజాపతి ఇంద్రదేవతాస్తుతి. అగ్నిదేవతాహ్వానము, అగ్నిప్రతిష్ఠాపనము. హోమము మిత్రదేవతాస్తుతి అద్దేవతాహ్వానము ప్రోక్షణము. తేజోదేవతాహ్వానము హారతి, ధ్యానము మంత్రపుష్పము నైవేద్యము దిగ్విమోకము ఆశీర్వాదము.

ప్రతిమంత్రమున కర్థమును తాత్పర్యము నిందు వ్రాసియున్నారు. కనుక నుపాసకులకు తాము చేయు కర్మ కర్థమును గ్రహించి చేయుట కానుకూల్యము నీగ్రంథము కల్పించుచున్నది.

ఈ పూజను కృష్ణజీ పురోహితులుగ నుండి అడయారునందు జరిపినపుడు భూరాదిలోకముల నేమి జరుగు చున్నది లెడ్బీటరుగారు పరిశోధించిరి. ఆయుదంతముల వర్ణనము లిందు పొందుపరచియున్నారు.

థియసాఫికలు సొసైటీవారు హిందూసంఘమునకుఁ జేసిన పూజలలో నీగ్రంథమును ప్రచురించుటయు నొక్కటి అని చెప్పదగియున్నది.

## వార్తలు

మచిలీపట్నం-దేవాదాయధర్మాదాయ పరిపాలనాశాఖ అసిస్టెంటు కమీషనరువారగు శ్రీ కె. కృష్ణారావు గారు తాత్కాలికముగ డిప్యూటీ కమీషనరు అడిషినల్ ఛార్జి పనిచేయుటకు నియమింపబడిరి.

# "A PAGEANT OF INDIAN PHILOSOPHY"

*By*

Sri N. Ramesan M.A., I.A.S.,

*Dy Secretary to Government, Home Department, KURNOOL.*

## Chapter VII

### The philosophy of the Upanishads

We have seen how the Upanishads are the very end or acme of the teachings of Vedas. Their general characteristics have already been examined in the previous chapter. We shall now proceed to study broadly the basic teachings of the Upanishads proper.

This presumes that, the Upanishads, which are not work of a single author, nor even the work of any particular period of time, all teach the same lessons. Indian opinion has always held that the trend of the teachings of the several Upanishads is the same. Apart from this general agreement on the unity of the teachings of the Upanishads, there has, however, been no unity among Indian thinkers as to the precise nature of the teachings of the Upanishads. Each thinker develops his own ideas and more or less foists them on the Upanishads by writing commentaries on them. The same Upanishads have been relied upon by philosophers of divergent views to support their contentions. They are enabled to do this, because the style of the Upanishads is so symbolic and elliptic that it allows itself to be interpreted in a variety of ways. Thus, the modern student, with a rational outlook, who goes to the Upanishads will find not one or two but several divergent systems of thinking. Not only is this to be found in the various Upanishads, but within the same book itself, one can discern several seemingly divergent systems of thought. There have been several attempts at codifying these different lines of thought and trying to bring them into one organised system. The most notable among these attempts is the VEDANTA-SUTRAS by sage Badarayana about which we can see later when we consider the six systems of Indian Philosophy. These VEDANTASUTRAS themselves are so enigmatic that several commentators like Shankara, Ramanuja etc. have interpreted these sutras to suit their theories. The whole picture, therefore, presents an appearance of diversity with an attempt at unification which sometimes succeeds and sometimes seems not to succeed. This is the broad impression a modern student will get on a perusal of the originals of the Upanishads, if he studies them without binding himself to any of the established creeds or dogmas which come up later on with the famous BHASYAKARAS.

This does not mean that the Upanishads are a confusing medley of thoughts. There is behind it all a certain substratum of original thinking or a certain basic assumption about the verities of life which is accepted by all the seers These bed-rock assumptions or theories of the Upanishads, or as they are called by Aldous Huxley "Perennial philosophy", constitute the very basis of Indian metaphysics and ethics. It is to these basic truths of life that we must turn our attention in a proper study of the Upanishads. As is well known, every great classic contains the most sublime and the most puerile of thoughts. A great epic like the Mahabharata contains passages that thrill and move one and also passages that bore and stultify one. This is a feature to be found

in all the classics of the world and in such an abstruse region as metaphysics which necessarily has to employ the symbolism of language to convey truths which are living experiences, this danger is all the greater. At such an early period of human thought, that such a subject should have been pondered over deeply and that the truths realised therefrom should be attempted to be expressed in the form of language is to the eternal creed of the seers of the Upanishads. We must, therefore, approach the Upanishads in a spirit of humility and devotion and at the same time not allow ourselves to be stampeded into any unbelieving adoration. If we, therefore, approach the Upanishads in the daring spirit in which the Upanishadic seers themselves approached the problems of life, we may be sure to find in it nuggets of eternal wisdom and truth.

The two basic assumptions of the Upanishads are the concepts of the "Brahman" and the "Atman". These two ideas form, as it were, "the two pillars on which rests the whole edifice of Indian philosophy. The origin of the two words is somewhat obscure. "Brahman" seems to be derived from the root "Brah" which means "to grow" and in its original meaning the word "Brahman" seems to have connotated the concept of 'prayer'. Similarly, the word "Atman" originally meant PRANA or "breath" and came to represent in course of time whatever constitutes the essential part of anything. It is necessary to understand not merely the meaning, but also the ideal underlying these two words "Brahman" and "Atman", if we are to follow intelligently the teachings of the Upanishads.

"Brahman" represents the ultimate essence out of which the objective or outside world of matter is created. "Atman" represents the ultimate principle of the individual self of a human being. There have been, from times immemorial, two streams or lines of thinking in India. The one was directed to an examination and investigation of matter or the objective or outside world. The other line of thought was directed to find out the basis of the inner or the subjective source of a man's personality or being. These two investigations, viz., the objective and the subjective led to the concept of the "Brahman" and the "Atman". From an examination of the objective world or what may be called "not-self", the thinking minds evolved a basic principle called the "Brahman" out of which the entire objective world of matter was evolved. The process of evolution of the world out of this fundamental principle "Brahman" is the theory of creation for which there are various explanations. But the point to be remembered here is that whatever may be the method or mode of creation of the world, still the substratum or the original principle out of which creation came forth is denoted by the word "Brahman". Similarly, some other thinkers were pursuing the line of subjective thought, i.e., trying to probe behind what lies at the bottom of every human personality. Man is aware that he is a thinking, living, active and intelligent being. What constitutes the source of this subjective being or the principle of subjective existence was pursued by one line of thinkers. They arrived at a result which they called the "Atman" and which they declared was the source out of which man's self emanated. Thus, the concept of "Brahman" connotating the fundamental substratum of the objective world and the concept of "Atman" connotating the fundamental substratum of the subjective world, went on evolving simultaneously, though by different sets of

thinkers, working on different lines. Independent of these two lines of thought, there was also another habit of seeking for a correspondence between the individual and the world and trying to correlate the features of the individual with the features of the world. This is well brought out in the PURUSHASUKTA, for e.g., where the cosmos is conceived of as a giant individual and corresponding to the eyes, the ears etc. of a human individual, world forces were equated to the 'senses' of this giant individual. In other words, this line of thought which is different from the lines of thought which led to the concept of "Brahman" and the "Atman", was trying to find, as it were, a parallelism between the human individual and the world outside. This naturally took the form of symbolising the external universe as the giant individual whose eyes, for example, were thought of the Sun and the Moon, whose breath was the wind etc. etc. This notion of parallelism between the individual and the world runs throughout the literature of the later vedic period and is also found in some of the Upanishads. This line of thought, when it came to be combined with the other line of thought and which led to the discovery of the "Atman" as the substratum of the subjective self, produced a result whereby this "Atman" which is the basic factor in the soul of a man was universalized to correspond to the soul of a universal purusha. In other words, just as a parallelism was established between the senses of a human being and the universe as conceived as a giant human being, the "Atman" which is the basis of the soul of a human being also had to find a parallelism to correspond to the universal man. Thus, this correspondence resulted in the postulate of a 'Universal Atman' of which the several individual atmans were only parts. This led to a concept of the unity of all individual souls which were declared to be merely parts of a universal soul. Now occurred another integration in the three different lines in which thinkers were proceeding. At some unknown stage, the basic factor of the objective world, viz., "Brahman" and the basic factor of the subjective world, viz., the "Atman" were equated. In other words, it was discovered that "Brahman" is in essence the same as the "Atman". This equation of the two fundamental principles was a step of momentous significance. Hitherto, the two ideas of the self and the 'not-self' were being treated as different and distinct from each other. By this unity of "Brahman" and the "Atman" the fundamental unity of spirit and matter was established. The parallelism between the individual and the universal purushas led, as we saw above, to the unity of all the individual souls in a universal soul, of which they were parts. This equation of "Brahman" and the "Atman" led to the identity of this universal soul with the universe itself. In other words, at the height of thinking, the seers arrived at a concept of a basic unity of all Being, where both the self and the 'not-self' the universe, the individual, the spirit, the matter and all were found to be derived from one basic universal factor. It is this basic universal factor or which may be expressed by the mathematical equation "Brahman" is equal to the "Atman", that is the greatest contribution of the Upanishads to world thought. At a very early period of thinking, the seers of India arrived at this grand conception of a certain basic unity of Being, which may be called as the "Absolute" of the Upanishads. This fundamental monism is the basic teaching of all the Upanishads and is accepted by all

thinkers. There have been differences of opinion regarding the nature and qualities of this Absolute, whether it has any qualities at all etc. But none has doubted the existence of this. It is to the eternal credit of the Upanishadic seers, that they were the first to postulate the existence of this fundamental concept of the unity, of not merely humanity or the universe, but of all the products of creation including man and matter.

The concept of the Absolute thus being neither the "Brahman" nor the "Atman" taken by itself, but a third postulate which combines within itself the identity of "Brahman" and "Atman" has the advantage of combining within itself the various separate qualities of both "Brahman" and "Atman" which supplement each other. "Atman", for example, is immediate to every man being the very source of his self and self-existence which cannot be denied by any one. The one knowledge of which man is absolutely sure is the knowledge of his immediate self-existence. Hence "Atman" is axiomatic and is self-proved. But it has a disadvantage. It cannot be conceived of as infinite in its qualities because man from the standpoint of man, conceives of his soul as a limited and personal entity. On the other hand, the concept of "Brahman" takes us easily to the conception of infiniteness because the universe is certainly infinite, but it does not give us that finality and certitude of its existence as the "Atman" gives to us, because the principle of "Brahman" concerns itself with the objective or the outside world which is at best an object of knowledge for us and cannot be ourselves. Thus, "Atman" has the advantage of immediate proof for every human being about its existence, whereas the "Brahman" has the advantage of being infinite in its scope, though the proof of its existence is not self-evident. But once we equate the "Brahman" and the "Atman" and posit an Absolute which is both, this Absolute then has the certitude of the "Atman" and the infiniteness of the "Brahman". Hence, by intuiting this Absolute of the Upanishads, we arrive at a direct self-realisation of an immanent and transcedental principle. This is the main advantage of this conception of the Absolute which is a unity in a seeming diversity.

The problems which are discussed in the Upanishads are the problems of Philosophy. Some tentative solutions are offered to these problems. Different lines of thought may, perhaps, be gleaned in the nature of the solution, as for example, the precise nature of creation or the reasons for the existence of evil, etc. etc. But the fundamental basis, viz., the existence of an Absolute which is all-embracing is never denied and is never lost sight of. The problems of the Upanishads are the problems that rack any intelligent human being, viz., the purpose of the universe, the destiny of the human soul, the problem of death, the problem of ethics, etc. etc. In the SWETHASWATHARA UPANISHAD the problems that are sought to be answered are set out as follows:

किं कारणम् ? ब्रह्म ? कुतस्म जाता: ?
जीवाम केन ? क्व च संप्रतिष्ठा ?
अधिष्ठिता: केन ? सुखेतरेषु
वर्तामहे ब्रह्मविदो व्यवस्थाम्

(Swethaswathara—I-1):

"The students of Brahman tell like this. "What is the cause of this all? Is it Brahman? Why are we born in this world? By whom or due to which do we live in this world? Where is our final rest? By whom are we subject to happiness and misery?"

In the KENA UPANISHAD also similar problems are raised, as follows:

केनेषितं पतति प्रेषितं मनः ? केन प्राणः
प्रथमः प्रैति युक्तः ?
केनेषितां वाचमिमां वदन्ति ? चक्षुः श्रोत्रं
क उ देवो युनक्ति ?

(Kena—I-1)

"By whose orders does the mind of man flow towards his object and things? At whose bidding does life or breath proceed to do its duty? By whose wish, is it that men utter the speech that they wish to? Who is it that is behind it all and directs our eyes and ears to do their duty?"

In the PRASHNOPANISHAD the problem is stated as follows:

अथ कबन्धी कात्यायन उपेत्य पप्रच्छ, "भगवन् कुतो ह वा इमाः प्रजाः प्रजायन्त इति"

(Prasna—I-3).

"Then Katyayana Kabandhi approched the Guru Pippalada and asked him: 'Revered Sir, by whom are creatures born in the Universe?"

Similarly in the third PRASNA of the same Upanishad, Aswalayana Kausalya asks as follows:

अथहैनं कौसल्यश्चाश्वलायनः पप्रच्छ। भगवन् कुत एष प्राणो जायते ? कथमायात्यस्मिन् शरीर आत्मानं वा प्रविभज्य कथं प्रातिष्ठते ? केनोत्क्रमते ? कथं बाह्यमभिधत्ते ? कथमध्यात्ममिति।

(Prasna—III-1).

"Sir, whence is this life born? How does it come into the body of man? And how does it exist for dividing himself into five parts? By what means does he go out?"

The problem of sleep is also attacked by Gargya Sauryayana as follows:

"अथ हैनं सौर्यायिणी गार्ग्यः पप्रच्छ। भगवन् एतस्मिन्पुरुषे कानि स्वपन्ति ? कानि अस्मिन् जाग्रति ? कतर एष देवः स्वप्नान् पश्यति ? कस्यैतत् सुखं भवति ? कस्मिन्नु सर्वे संप्रतिष्ठिता भवन्तीति"

(Prasna—III-1)

"Revered Sir, in man what is it that undergoes the process of sleep? What is it that awake in him? Among these, which DEVA sees dreams? Who exactly is he in man that enjoys happiness? What is the basic support of the substratum of which all these are established?"

The problem of death is brought out very vividly in the KATHA UPANISHAD where Nachikethus, son of Vajasravasa, goes to the abode of Yama, the God of Death, to whom he is given as an offering of sacrifice by his father and there confronts Yama with the question:

"ये यंप्रेते विचिकित्सा मनुष्ये 'अस्ति इति एके' "नायं अस्ति इति चैके"। एतत् विद्यां अनुशिष्टस्त्वयाऽहं वराणामेष वरः तृतीयः"

(Katha—I-20)

"When man dies and becomes a corpse, this doubt remains in men's minds, viz., whether the personality survives or not. Some persons say that "He exists" and some others say "he does not exist". This I should like to say from you being taught by thee".

Thus, we see that almost all the problems that are dealt with in the Upanishads are problems that rack an intelligent human being about the existence of the world, the mysteries of self in waking, dreaming and sleeping and the problem of death and dissolution of personality. It is as an answer to these questions that the main tenets of Upanishadic Philosophy are developed. Let us first take the problem of the self of man or the problem of human personality.

Of all the riddles of the world, the riddle of "I" is the greatest. Every man is aware of himself and is immediately

aware that he, as an entity, exists. This is a matter for self verification and cannot admit of any doubt, whatever. However, the moment man introverts himself and tries to find out what exactly is the nature of "I" or his personality, he comes against a blank wall. He who knows the limits of the universe and beyond, does not know this elementary things, viz., who exactly is himself? This problem of personality which has been racking the minds of thinkers eversince man learnt to think, is sought to be solved in the CHHANDOGYA UPANISHAD in a characteristic manner by means of a little story.

The Devas and Asuras both heard of the existence of a supreme self which is free from oldage and death, grief and thirst and whose desires come true. Both of them, therefore, desired to possess of the self obtaining which they can have fulfilment of all their desires. INDRA from the DEVAS and VIROCHANA from the ASURAS approached PRAJAPATHY, a famous teacher of the self and when Prajapathy questioned them as to the object of their visit, they replied that they wanted to realise the self obtaining which one can attain all the worlds and all their desires. Prajapathy taught them that he who is seen in the eye, is the self and asked them to look at their reflections in water. Indra and Virochana looked over their reflections in water, They came back and told him "Sir. we know the self. We have seen it in the water even to the hairs and the nails." This is the first step in the knowledge of the self when man first mistakes his 'I' with the body. Prajapathy ordered them to put on fine clothes and look again at their selves in the water. They did and once more questioned by Prajapathy, they replied they have seen the selves very well adorned and in fine clothes. Prajapathy then told them that what they had seen in the water was the real self. It must be remembered here that the teacher is leading the pupil step by step. The first step is to break the illusion that the self of the man is the body. Hence, Prajapathy here gives an idea to the students that the self is the body to see if they could by their own reflection get over this illusion.

Both Indra and Virochana went back satisfied that they have really learnt the knowledge of the self. But Prajapathy lamented thus: "Both of them have gone without ascertaining the true self and without proper reflection or discrimination. He who follows this false doctrine of the self must perish". Satisfied with his knowledge, Virochana went to the Asuras and told them that he had fully learnt the knowledge of the self and that the ego is the self and there should serve the body to get all desires, both in this and the next world and this became the philosophy of the Asuras. Indra who also went away, seemingly satisfied along with Virochana, however, was pondering over the problem and just as he was approaching the assembly of the Devas to deliver his newly acquired knowledge, he reflected as follows: "This self that I have seen in the water is well adorned when the body is well adorned, it is well-dressed when the body is well-dressed. On the same analogy, this self which I saw in the water should be blind if the body is blind, should be lame and deformed if the body is lame and deformed. What is more, this self will also die similarly if the body should die. What is the good of knowing this self which is the accident of the body". Thus reflecting and not being satisfied at this first principle that the self is the body, he returned back to

